ఓమ్.

శ్రీ విద్యాశంకర గ్రంథరత్నావళ్యాం ప్రథమం రత్నమ్.

# శ్రీమద్భగవద్గీతా.

శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకరపదమూలవేశ ప్రకాశిత

జగద్గురు

## శ్రీకల్యాణానంద భారతీమహాంతాచార్యస్వామిభిః

ప్రణీతయా

## గీతామృతతరంగిణ్యా సంవలితా

శ్రీ విద్యాశంకర భగవత్పాదాచార్యవర్యైః

కృతేన సంక్షేపవివరణేన చోపేతా.

గోదావరీమండలస్థిత రామచంద్రపుర నివాసినా

కాశ్యప గోత్రోద్భవేన

శ్రీ జోస్యులోపనామక రామచంద్రశాస్త్రిణా

ప్రకాశితా.

1. మూల్యమస్యాః రూప్యపంచకమ్.

సర్వస్వామ్యసంకలితా.



అగ్న్యబ్ధివేదాఽక్షిమితే (౨౪౪౩) శాంకరశకే

భావనామ్ని వత్సరే వైశాఖశుక్లపంచమ్యాం

భృగువాసరే ప్రకాశితా సతీ

విజయతేతరామ్.

౧౮-౫-౧౯౩౪.



విజయవాటికాయాం బ్రహ్మశ్రీ కోదండరామశర్మణా ఆంధ్రగ్రంథాలయ

ముద్రాక్షరశాలాయాం ముద్రాపితా.

ఓం

శ్రీ విద్యాశంకర గ్రంథరత్నావళి.

# ప్రకాశకుని విజ్ఞప్తి.

చతురంభోధిపరీతమగు నీ భూవలయమున శంకరులనియు, శంకరాచార్యులనియు, సామాన్యవ్యవహారముచే సన్నుతిని బడయుచుండు శ్రీ విద్యాశంకర భగవత్పాదులవారియొక్క యఖండవిద్యావైభవమును గూర్చి యొకింతయైనను విననట్టి ప్రాజ్ఞు లెందును నుండ రని ప్రత్యేకముగాఁ జెప్పనవసరము లేదు.

ఆ మహామహుని యవతారకాలము మొదలు నేటివఱకు నా మహామహుఁడీ భూమండలమున నెల్లప్రదేశములయందు నప్రతిహతముగ ప్రత్యక్షముగ జరించుచున్నాఁడా? అను నాశ్చర్యమును గల్గించునంత ప్రచార మాతనినామమునకుఁ గల్గియున్నది. ఇట్టి ప్రచార మాతని నామమునకుఁ గలుగుటయందుఁ గల కారణ మాతనివిద్యావైభవమే యని యెల్లరచే నిశ్శంకముగ నంగీకరింపఁబడినది. దీర్ఘకాలము క్రిందటఁ బ్రవర్తించిన యనతారపురుషునియొక్క విద్యావైభవము నేఁటికిఁగూడ నపూర్వమగు పదార్థమట్లు సర్వజనులకు నొకే విధమగు ప్రేమాతిశయములను లజ్జాభయములను గలిగించుచు సర్వజనామోదమునకుఁ బాత్రమగుచున్నది. ఎంతకాలమునుండి యిట్టి మహావైభవముతో నీ పవిత్రపురుషునియొక్క నామము విద్యావైభవము నీ భూమండలమున విరాజిల్లుచున్నది యనగా నా మహాపురుషునియొక్క యవతారకాలమునుండియే యని నిశ్శంకముగఁ జెప్పనగు అట్టి మహాపురుషుని యవతారకాల మెద్దియనగా - వర్తమానకలియుగమున రెండువేల యయిదువందల తొంబదిమూడవ (2593) వత్సరమగు నందననామ·సంవత్సరమున వైశాఖ శుక్ల పంచమీభానువారమున ధనుర్లగ్నమునం దని

> "తిష్యే ప్రయాత్యనలశేవధిబాణనేత్రే
> యో నందనే దినమణా వుదగధ్వభాజి।
> రాధే ఽదితే రుడుని నిర్గత మంగలగ్నే ఽ
> ప్యాహూతవాన్ శివగురుః స చ శంకరేతి."*

అను నానందగిరియొక్క ప్రాచీనశంకరవిజయమువలన దెలియవచ్చుచున్నది. విమర్శకాగ్రేసరులు పలువురుగూడ నీశ్లోకముచేఁ దెలియవచ్చెడికాలము యథార్థమగుకాలమే యని యెక్కుడు శోధజేసికూడ నిశ్చయము చేసియున్నారు.

ప్రకృతపు భావసంవత్సరము వర్తమానకలియుగమున నైదువేల ముప్పదియారవ సంవత్సరముగా లెక్కింపఁబడుచున్నది. అందుచే నీ మహాపురుషుని యవతార కాలము గడచి రెండువేల నాల్గువందల నలుబదిరెండు సంవత్సరములు గడచినట్లు సుస్పష్టమేగదా ! ఇంతకాలమున నాతనిచే రచింపఁబడిన గ్రంథములు నేఁడు రచింపఁబడిన యపూర్వ గ్రంథములకంటె వేయితెఱఁగుల బుష్కల ప్రచారము గల్గియుండుటయే యమ్మహామహుని విద్యావైభవమునకు సాక్షి. ఆ మహానుభావునియొక్క యవతారకాలమగు ముప్పదిరెండువత్సరములలో నిట్టి గ్రంథరత్నము లాతనిచే రచింపఁబడుటవలన నాతని యవతారాతిశయమును బ్రకటించుచున్నవి. ఈ గ్రంథరత్నములు ప్రపంచమం దెల్లెడలను సహస్రప్రభాభాసమానుఁడగు నాదిత్యునివలెఁ బ్రకాశించుచున్నను, గొంతకాలముక్రిందటివఱకు నీ గ్రంథరత్నావళి యంతయు నొకచో లభ్యమగుట దుస్తరముగానుండెడిది. అట్లొక వేళ జూచుటకు లభించిన, నపేక్షించువారల కెల్లరకును లభించుట కష్టతరముగా నుండెడిది. అట్టి స్థితిలో సుమా. రిరువదియైదు వత్సరములక్రిందట శ్రీరంగంక్షేత్రమున వాణీవిలాసమను ముద్రణాలయమువారు నాగరాక్షరములతో శ్రీవిద్యాశంకర భగవత్పాదులవారి యమూల్యగ్రంథము లన్నిఁటి నిరువదిసంపుటములుగా ముద్రించి యుండిరి. ఆ సంపుటములను సుమారొక వత్సరముక్రిందట నేను జూచుట తటస్థించినది. నాగరాక్షరముల ప్రచార మాంధ్రదేశమందు విపులముగ లేకపోవుటచేత నాంధ్రలిపియందు నీ పవిత్రగ్రంథములన్నియు నిదివరకు ముద్రింపఁబడియుండక పోవుటచేతను నీ పవిత్రగ్రంథముల నాంధ్రలిపియందు ముద్రించి ప్రకటించుటయే యాంధ్రలోకమునకు నేఁజేయు సేవయనియు నిందుచే నాచార్యానుగ్రహమునకుఁ బాత్రుఁడనై యైహికాముష్మికనిశ్శ్రేయసములఁ బడయఁగలుగుదుననియు నిశ్చయముతో నీ పవిత్రగ్రంథముల నాంధ్రలిపియందు ముద్రింప నెంచి యందులకుఁ దగు కార్యసన్నాహమును యోజించుచుండ నీ గ్రంథములు కేవలగ్రంథములుగనే ముద్రించుటచే నాంధ్రలోకమునకు నెక్కుడు ప్రయోజనము సమకూరదనియు నందువలన నే దలఁచిన సేవ సార్థకము గానేరదనియు నెంచి శ్రీవిద్యాశంకరభగవత్పాదుల మహాశయ మాంధ్రలోకమున కొకింత వెల్లడియగున ట్లా పవిత్రగ్రంథముల తాత్పర్యముగూడ నాంధ్రమున వెల్లడింపఁ జేసినచో నెక్కుడుప్రయోజనము గల్గు నని తలంచి యట్టి తాత్పర్యలేఖనముఁ జేయఁగలుగు పండిత ప్రవరులెవ్వరైనఁ గలరా యని యోజించుచుండ నా సద్గురుకటాక్షమువలన జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్య స్వాములవారు మనమునఁ బొడఁగట్టిరి. శ్రీవారన్ననో శ్రీవిద్యాశంకర భగవత్పాద దిగ్విజయకాలమునుండి, అనఁగా వర్తమాన కలియుగమున 2618 వ సంవత్సరమని చెప్పఁబడు పింగళనామ సంవత్సర పుష్య శుద్ధ పూర్ణిమ మొదలు 4438 వ సంవత్సరమగు యువసంవత్సర మార్గశీర్ష

పూర్ణిమవఱకు, శృంగేరీపీఠమను నామముతోడను బిమ్మట శృంగేరి శ్రీ విరూపాక్ష
మను నామముతోడను సామాన్య వ్యవహారమును బొందుచున్న శ్రీవిద్యాశంకర
పదమును జగద్గురుస్థానమునగు వ్యాఖ్యానసింహాసనము నధిష్ఠించియున్నవారు.

ఇంతియ కాదు. శ్రీవిద్యాశంకర భగవత్పాదాచార్య సాంప్రదాయమగు
భారతీసాంప్రదాయమున నవిచ్ఛిన్నపారంపర్య క్రమమున లభించిన సాంప్రదాయ
శుద్ధిని సర్వవిధములఁ బడసియున్న మహనీయులు ప్రకృతమున భారతవర్షమున
వీర లొక్కరే యని యప్రతిహతముగాఁ జెప్పుట కించుకేనియు సందియములేదు.
శ్రీవారియొక్క విద్యావైభవము ప్రకృతమున భారతవర్షమందలి విద్వాంసుల
కెల్లరకు నెంతమాత్రము క్రొత్త కాకపోవుటఁ జేసి యిందుఁ బ్రత్యేకముగా వివ
రింప నవసరములేదు. వేయేల! శ్రీవారియొక్క సర్వతంత్ర స్వాతంత్ర్యము సర్వతో
ముఖ పాండిత్యము గీర్వాణాంధ్రాంగ్లభాషాపాండితీ మహిమయు శ్రీవారి
గ్రంథములవలన నైననేమి, సభాస్థలములందలి యుపన్యాస విశేషములవలన నేమి,
జిజ్ఞాసువులకుఁ జేయఁబడిన ప్రవచనవిశేషములవలన నేమి సర్వవిధముల నెల్లరకు
సువిదితమయియే యున్నది. ఈ లోకపూజ్యులగు నీమహనీయులు నాకుఁ బ్రకృతమున
సర్వవిధముల గురువులగుటయేగాక బాల్యమునుండియుఁ గూడ స్నేహితులే యను
గర్వమును దెలుపుకొను మహాభాగ్యమును గలిగియుంటిని. ఇట్టి మహనీయులను
బ్రార్థించి తాత్పర్యలేఖనమును బడసినచో నా చేయఁదలఁచిన సేవ యనంతఫల
ప్రదమగు నని యెంచి శ్రీవారిని గుంటూరుపురమున శ్రీసదనమునందు దర్శించి
నా యభీష్టమును విన్నవింప శ్రీవారు నాయందలి వాత్సల్యముతో నా మనోరథము
నీడేర్ప ననుగ్రహించిరి. కాని కార్యగౌరవము నాలోచించియు, శ్రీవారియొక్క
కార్యాంతరముల నాలోచించియు, శ్రీవారు యథాశక్తిగ గార్యమును సాను
కూలముఁ జేయ ననుజ్ఞయిచ్చి పండితప్రవరులు లభించినచోఁ దన్మూలకముగ గూడఁ
గార్యమును నెరవేర్పవచ్చునని యనుజ్ఞనిచ్చిరి. ఏది యెట్లులైనను ప్రస్థానత్రయము
నకుఁ దాత్పర్యలేఖనము ననుగ్రహింప బాధ్యతను వహింపవలయునని ప్రార్థింపఁ
బరమేశ్వరానుగ్రహము గల్గినచోఁ జేయ యత్నించెదమని యనుగ్రహించిరి. తరు
వాత ప్రథమమున శ్రీకృష్ణార్జునసంవాదరూపమగు గీతాశాస్త్రమును లోకమున
కనుగ్రహింపవలెనని ప్రార్థింప వార లద్దానిని వెనువెంటనే యుపక్రమించి యద్దా
నిని నా తలఁబెట్టిన యైదుమాసములలో లోకమునకు సర్వవిధముల వెల్లడిచేయు
నంతటి మహాభాగ్యమును లభింపఁజేయుటయే కాక యచిరకాలములోఁ బవిత్రతమ
మగు ఛాందోగ్యోపనిషద్భాష్యమును గూడ విపులమగు తాత్పర్యముతోఁ బ్రక
టింప భాగ్యమును గలుగఁజేయ సంసిద్ధులై యున్నారు. ఇట్లొక సంపుటము వెనుక
వేఱొకసంపుటము,చొప్పున శ్రీవిద్యాశంకరగ్రంథము లన్నియుఁ బదిసంపుటము
లలోఁ బ్రకటింపఁబడును. ఈ సంపుటములు సర్వజనులకును సులభసాధ్య మగు

నటుల సుచితమగు మూల్యమున కీయఁబడును. కావున శ్రీవిద్యాశంకర భగవత్పాదులవారియొక్క విద్యావైభవము సంగ్రహించుటయే మహాభాగ్యమని తలఁచు నాంధ్రలోకమంతయు మా యుద్యమమునకుఁ దోడ్పడుటచే శ్రీవిద్యాశంకర భగవత్పాదులవారి యనుగ్రహమునకు మావలె బాత్రులై యైహికాముష్మిక నిశ్శ్రేయసములఁ బొందుదురుగాక యని విన్నవించుచుంటిని.

రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా.
శ్రీ భావసంవత్సర నిజవైశాఖ శుద్ధపంచమీ
భృగువారము. శ్రీవిద్యాశంకర భగవత్పాదజయంతి.
18--5—1934.

ఇట్లు,
శ్రీవిద్యాశంకర పాదపద్మారాధకులు
జ్యోస్యుల రామచంద్రరావు,
శ్రీవిద్యాశంకర గ్రంథరత్నావళీ ప్రకాశకులు.



శ్రీవిద్యాశంకరపదమా వేశప్రకాశిత
జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వామి.

ఓమ్

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## ప్రస్తావనా.

పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అమ్బ! త్వా మనుసందధామి భగవద్గీతే! భవద్వేషిణీమ్.

ఆసేతుశీతనగ మధ్యవర్తి యగు భారతవర్షంబున గల్యాదినుండి నేఁటివఱకును భారతసాంప్రదాయమందుఁ బ్రస్థానత్రయమను పేరఁ బరగు గ్రంథత్రియము పరమ ప్రమాణముగా నతిశయమును గనుచున్నదను విషయ మేరికిని నొక వింత గాదు. అట్టి గ్రంథత్రయ మేమన.

"ఈశకేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః
ఐతరేయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ."

అను నభియుక్తోక్తివలనఁ దెలియవచ్చెడి యుపనిషద్దశకంబు మొదటి ప్రస్థానము. వేదవ్యాస శ్రీకృష్ణద్వైపాయన మహర్షియొక్క వేదాంతమీమాంస యనునది రెండవ ప్రస్థానము.

శ్రీకృష్ణార్జున సంవాదమనియుఁ యోగశాస్త్రమనియుఁ బ్రసిద్ధి గాంచుచున్న భగవద్గీత లనునది మూఁడవ ప్రస్థానము.

అందు నుపనిషద్దశకము వేదభాగ మగుటఁజేసి యపౌరుషేయము నిత్యము స్వతఃప్రమాణ మని ప్రమాణవిదులగు మీమాంసాకోవిదులచే నప్రమాణముగా నెన్నఁబడుచున్నది. వేదాంత మీమాంస యన్ననో ప్రకృతపు కలిద్వాపరసంధి యందు భారతీసాంప్రదాయ సార్వభౌముఁ డనిప్రసిద్ధిఁ గాంచిన వేదవ్యాస శ్రీకృష్ణ ద్వైపాయన మహర్షియొక్క స్మృతిరూపము. భగవద్గీత లన్ననో యీకలిద్వాపరసంధియందే వెలువడిన శ్రీమన్నారాయణునియొక్క యవతారరూపమగు శ్రీకృష్ణభగవానులయొక్క స్మృతిరూపములు.

ఈ గ్రంథత్రయము భారతీసాంప్రదాయమునందుఁ బరమప్రమాణముగా శిరసావహింపఁబడి యవిచ్ఛిన్న పారంపర్యక్రమమున నేటివఱకుఁ బ్రవర్తింపఁ జేయఁబడుచుండుటవలన భారతవర్షమునందలి శ్రుతిస్మృతి సదాచార ప్రమాణబద్ధులగు చాతుర్వర్ణ్యమువారును బరమప్రమాణముగా నెన్నుచుండిరి. దానంజేసి భూమండలమందలి సకలజనులుగూడ నీ గ్రంథరాజముల నుత్తమగ్రంథములుగాఁ దలంచుచుండిరి. వేయేల! ఇంచుక బుద్ధిశాలియగు ప్రతిమానవుఁడు నీ గ్రంథత్రయ నామమును వినకుండ నుండఁడని నిస్సందేహముగాఁ జెప్పనొప్పు.

అందు మూఁడవదియగు భగవద్గీతయను గ్రంథము పై రెండు గ్రంథములకంటెఁ గూడ నెక్కుడు ప్రచారమును గల్గియున్నటుల నెల్లరకును సువిదితమే యగును. ఈభగవద్గీతలు నేటికాలమున నక్కరములఁ జదువనేర్చిన ప్రతివ్యక్తికిని దెలియఁబడకుండనుండదని చెప్పవచ్చును. వైదికధర్మానుయాయులే గాదు, వేదబాహ్యమతానువర్తులుగూడ నీగ్రంథము నతిశయముగఁ జేకొని తన్మూలముగ నెద్దియో యొక తీరున నొకింత జ్ఞానలేశము నెట్టులో గ్రహించి యద్దానిని గౌరవాతిశయములచేఁ గొనియాడుచుండుటయు సర్వసామాన్యమై యున్నది. దానంజేసి ప్రకృతపు దేశకాల పరిస్థితుల ననుసరించి జనులు తఱచుగ నీగ్రంథమును సాంప్రదాయశూన్యముగను స్వేచ్ఛానుసారముగను స్వసామర్థ్యానుగుణముగను జదువుటంజేసి పాఠకులయొక్క బుద్ధివైచిత్ర్యభేదము ననుసరించి యీగ్రంథము గ్రంథస్థవిషయములును బరివరివిధముల నపార్థములకుఁ బాల్పడి జిజ్ఞాసువులకుఁ జీకాకుఁ గల్గించుచున్నది. పవిత్రితమంబగు నీగ్రంథమును గ్రంథస్థవిషయములను విపరీతాభిప్రాయములనుండి తొలగించి సదభిప్రాయముల నొకింతవఱకు నీప్రస్తావనయందుఁ జేయుచుంటిమి. బుద్ధిమంతు లీ గుణములను గ్రహింతురుగాక!

## —* గ్రంథ ప్రామాణ్యము. *—

భగవద్గీతలను గ్రంథము స్మృతి యని యిదివఱలోఁ జెప్పఁబడియె. స్మృతి యన పురుష ప్రణీతగ్రంథము. భారతవర్షమునందు వైదిక ధర్మానుయాయులచేఁ బురుష ప్రణీతగ్రంథములు రెండుతెఱంగుల బరిగణింపఁబడుచున్నవి.

1 అపౌరుషేయమును నిత్యమును స్వతః ప్రమాణమునగు శ్రుత్యనుసారులగు గ్రంథములు.

2 శ్రుతివిరుద్ధములగు గ్రంథములు.

ప్రణేత వ్యవహారదృష్టిచే నెంత గొప్పవాఁడుగాఁ దలంపఁబడుచున్నను నాతనిగ్రంథము శ్రుతివిరుద్ధమైనచో వాంతాశన మూత్రపురీషములకంటె నెక్కుడుహేయముగా వైదిక ధర్మానుయాయులచేఁ దలంపఁబడుచున్నది. ఇంతియే

కాదు. శ్రుత్యనుసారి స్మృతియందుఁగూడ నెవ్వియేని వక్తృదోషముచేఁ బ్రమాదము లుండినచో న య్యవి యప్రమాణములుగా నెన్నఁబడి యించుకేనియు సరకుఁగొనఁబడవు. కావున స్మృతు లనుగ్రహించునపు డవ్వాని ప్రామాణ్యము ముందు నిర్ణయింపవలయును. మీ మాంసాస్థానమున ప్రామాణ్యము నొందని స్మృతి బుధున కెంతమాత్రము గ్రాహ్యము కానేరదు. ఇట్టి న్యాయము ననుసరించి స్మృతియగు నీభగవద్గీతలు వక్తృదోషశూన్యములై ప్రమాణపథము నలంకరించుటకు యోగ్యతను గల్గియున్నవా లేవా యను విషయము మున్ముందు గమనింపవలయును.

ఈ గీతలను స్మృతియొక్క వక్త వసుదేవసుతుఁ డగు శ్రీకృష్ణభగవానుఁడు; శ్రోత పృథాతనయుఁడగు నర్జునుఁ డని సువిదితమగు విషయము. వక్తయగు శ్రీకృష్ణునియందు నెద్దియేని యనృతదోషము గన్పట్టినచో నయ్యది వక్తృస్మృతికి నప్రామాణ్యము ఘటింపఁజేయును. స్మృతిని బరిశీలించిన నొక యద్భుతమగు విశేషకథనము ప్రాకృతప్రజనులకు నొక మహాదోషముగాఁ దోఁచి శ్రీకృష్ణుఁడు మృషావాదియా యను సందియమును గలుగఁజేయును. అట్టి సందియము ముందు సర్వవిధముల వారించి శ్రీకృష్ణుఁడు యథార్థవక్తయని నిరూపింతుము. అట్టి నిరూపణము యథార్థమని విశ్వాసము గలుగువఱకు నేరికి నీస్మృతియందుఁ బ్రామాణ్యము గల్గుటకు నవకాశ ముండదు. కావున నట్టి విశేషకథనము ప్రథమమున విమర్శింపఁబడుచున్నది.

విశేషకథనము:— శ్రీకృష్ణుఁడు "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" (గీ.2-11) అను గీతముతోఁ దనయుపదేశమును బ్రారంభించి "ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా" (గీ.3-43) యను గీతముతో ముగించి తా నుపదేశించిన యుపదేశవిశేషముయొక్క మాహాత్మ్యము నర్జునునికిఁ దన్మూలముగా లోకమునకును బ్రకటించుటకై నాలవయధ్యాయప్రారంభమున నిట్లు నిర్వచించియున్నాఁడు.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.
ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప!
సఏ వాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్."

(4-1; 2-3.)

తా:– "ఈ యోగమును నేను సూర్యునికొఱకు జెప్పితిని. సూర్యుఁడు వైవస్వతమనువునకుఁ జెప్పెను. వైవస్వతమను విక్ష్వాకువునకుఁ జెప్పెను. ఇట్లు పరంపరా క్రమమున నీయోగమును రాజర్షులు గుర్తెఱింగియున్నారు. ఆయోగ మిప్పుడు లుప్తప్రాయ మయ్యెను. పూర్వము వివస్వతునకుఁ జెప్పఁబడినట్టి యోగమే యిప్పుడు నీకుఁ జెప్పఁబడినది" అని పైగీతముల తాత్పర్యము దీనివలన శ్రీకృష్ణుఁడు పూర్వము వివస్వతునికి నీయోగమునే యుపదేశించెననియు నిప్పు డాయోగమునే యుపదేశించుచుంటి ననియుఁ జెప్పుచున్నాఁడు. ప్రకృతమున విమర్శనీయవిషయ మెద్ది యన "పూర్వము, ఇప్పుడు" అను రెండు కాలములయొక్కయు వ్యవస్థ. ఇచ్చట సూచింపఁబడిన వివస్వతుని కాలము "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ" (గీ.౩-౩) యను గీతమునందలి 'పురా' యనుశబ్దముచేతను ప్రకృతమునఁ జెప్పఁబడిన "యోగః ప్రోక్తః పురాతనః" అను వాక్యమునందలి 'పురాతన' శబ్దముచేత నూహింపవలసియున్నది. ఈ రెండుశబ్దములయొక్క యర్థనిరూపణమునకు "సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" (గీ. 3-10) అను గీతమందలి "సృష్ట్వా పురోవాచ" అనునది "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" (గీ.4-13) అనుగీతమందలి 'సృష్టం' అనునదియు, "మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తథా మద్భావా మానసా జాతాః" (గీ. 10-6) అనుచో "పూర్వే మనవః" అనునదియు సహకారులుగా నుండుటచే వివస్వతున కుపదేశించిన కాలము సృష్ట్యాది యని తేటతెల్లమయ్యెడి. సృష్ట్యాది యన నేటికి 1955885035 సంవత్సరములకుఁ బూర్వ మని జ్యోతిశ్శాస్త్రవిదు లందరును జెప్పుచున్నారు. ఇప్పు డనుకాలము కురుక్షేత్రమున మహాభారతయుద్ధము ప్రారంభించినదివస మని యాశయము.

అయ్యది "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః" (గీ. 1-1) అను ధృతరాష్ట్రవచన మగు ప్రారంభగీతమువలన సువ్యక్త మగుచున్నది. భారతయుద్ధమన్ననో ప్రకృతపుకలియుగప్రారంభమునకుఁ బూర్వము ముప్పదియెనిమిదవ సంవత్సరమున గార్తికబహుళామావాస్యా జయవారమున బ్రారంభమైనట్లు భారతవర్షీయ పౌరాణికుల కెల్లరకును దెలిసిన విషయమే. అనఁగాఁ బ్రకృతపు క్రైస్తవశకమునకుఁ బూర్వము మూఁడువేల నూటనలుబదవ సంవత్సర మని గుర్తెఱుంగునది. దానంజేసి సృష్ట్యాదికిని భారతయుద్ధప్రారంభమునకును మధ్యకాలము 1955879962 సంవత్సరములకాల మని సువ్యక్తమగును. ఈ కాలమే "కాలేన మహతా" అని శ్రీకృష్ణునిచేఁ బేర్కొనఁబడినది. ఇందలి విశేషము:— ప్రకృతమున నర్జునుని దృష్టియందును లౌకికదృష్టియందును శ్రీకృష్ణునకు భారతయుద్ధప్రారంభమునాఁటికి నెనుబదియేడు వత్సరములు వయస్సుండినట్లు తెలియవచ్చుచున్నది. భారతయుద్ధముప్రారంభమునాటికి నుమా రెనుబదియేడువత్సరముల వయస్సు గలిగిన శ్రీకృష్ణుఁ డక్కాలమునకు 1955879962 సంవత్సరములు పూర్వము వరగిన

సృష్ట్యాదియందు వివస్వతునకు నీయోగమునే చెప్పితి ననెడివాక్యమును విశ్వసించు టకు బాహ్యకృతమానవుఁ డెందు నెక్కాలమున నైన నుండు నని సామాన్యదృష్టిచే యోజించుట కవకాశము లేదు. ఈ వాక్యమే యథార్థమై విశ్వాసార్హమైనచో శ్రీకృష్ణుఁడు యథార్థవక్తయై యాతనిస్మృతియగు నీగీతలు సర్వకాల సర్వావస్థలయందును సకలమానవకోటికిని బరమప్రమాణముగ నెన్నఁబడును; లేనిచో శ్రీకృష్ణుఁడు మృషావాదియై జైన బౌద్ధాదు లట్లు సర్వలోకనింద్యుఁడై యాతనిస్మృతియగు నీగీతలు జైనబౌద్ధాదిస్మృతులట్లు నింద్యములును హేయములును గావలయును. ఏతద్విషయమును విడచి శేషించినవిషయము లేతీరునను బాహ్యజ్ఞులకు సంశయాస్పదముల నెంతమాత్రమును గానేరవు. కావున నేతద్విషయమును గీతలు చేఁబూను వారెల్లరును బ్రప్రథమమున నవశ్యము విచారింపవలయును. ఈ వాక్యములను బ్రథమమున వినినవాఁ డర్జునుఁడును సంజయుఁడును. అనంతరమున వినినవాఁడు ధృతరాష్ట్రుఁడు. గ్రంథస్థములుగాఁ జేసినవాఁడు వేదవ్యాస శ్రీకృష్ణ ద్వైపాయన భగవానుఁడు. సాంప్రదాయమునఁ బ్రవర్తింపఁజేసిన మహానుభావులలో నగ్రగణ్యులు శ్రీశుకులు, గౌడపాదులు, గోవిందయోగీంద్రులు. వ్యాఖ్యాతలలో నగ్రగణ్యులు శ్రీవిద్యాశంకర భగవత్పాదులు. ఇతరవ్యాఖ్యాతలలోఁ బేర్కొనఁదగినవారు నీలకంఠ రామానుజ మధ్వరాయ వల్లభాచార్యాదులు. వేయేల! ఈ గ్రంథమునకు నెద్దియో యొకతీరున వ్యాఖ్యానమును వ్రాయుటయే పరమపవిత్రమగు కార్యముగాఁ దలచు మానవు లిక్కాలమున నించుకేనియు గొఱఁతలేకుండ సర్వవిధము దెలియవచ్చుచునే యున్నారు. దానంజేసియే ప్రకృతవు గీతామృతతరంగిణియందుఁ బ్రవృత్తియును. ఇయ్యది వైదికధర్మానుయాయుల విషయము. ఇఁక వైదికధర్మ విదూరులును వైదికధర్మ వినిందకులునగు మతాంతరులుగూడ నీ గ్రంథమునకుఁ బలువిధములగు వ్యాఖ్యానములను రచించుటయు, బ్రకటించుటయు నీకాలమున లేకపోలేదు, వీరలందఱు నేతద్విషయమును జూడలేదా? చూచిన గమనింపలేదా? గమనించిన నెట్టితలంపున నీగ్రంథము నగ్రస్థానమున నెలకొల్ప యత్నించుచున్నారు? వీరలందఱియొక్క ప్రవృత్తియే శ్రీకృష్ణునియొక్క యథార్థవక్తృత్వమునకు నాతని స్మృతియగు నీగీతలయొక్క పరమప్రామాణ్యమునకును బ్రబలమగు నాధారమని ముందుగఁ దెలియదగినది. ఇఁక నీవిషయమునందేహాస్పదమైనచో ప్రథమశ్రోతయగు నర్జునునికే సందియము పొడగట్టవలయును. పొడకట్టినచో యాతఁ డాసందేహనివృత్తికై ప్రశ్నము వైచి సమాధానము నొంది నిశ్చయమనస్కుఁడు కావలసియుండవలయును. లేనిచో నాతని ముఖమున నీగ్రంథము లోకమునందు వచ్చుటకు నించుకేనియుఁ గారణము కల్గియుండదు. గ్రంథమందు నర్జునునియొక్క ప్రవృత్తి యెట్లున్నదను విషయము నొకింత ప్రకృతమున విచారింతము.

ప్రకృతపు మూఁడు గీతములను వినిన యర్జునుఁ డిట్లు ప్రశ్నించుచున్నాడు.

"అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి." (గీ.4-4)

తా:–నీయొక్కజన్మ మిప్పుడు. వివస్వతునియొక్క జన్మపరమందును. అనఁగా లెక్కించుటకు వీలులేనంత దూరమున నని యాశయము. అట్టి విషయమున నీవు సృష్ట్యాదియందుఁ జెప్పితి వను మాట నే నెట్లు విశ్వసింపఁగలను? ఇట్టి యర్జునిచేఁ జేయఁబడిన ప్రశ్నమునకు సమాధానముగ శ్రీకృష్ణుఁడే దిగువ వాక్యములను బల్కి యున్నాఁడు.

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప!
అజోఽపిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా."

(గీ.4-5-6).

ఈ గీతముల యభిప్రాయము పూర్వ మొకప్పుడు మార్కండేయుని గూర్చి శ్రీమన్నారాయణుండు పల్కిన వాక్యమున కనుగుణముగ నున్నది. అదెద్దియన-

ఉ॥ ఎప్పుడు ధర్మహానియగు, నెప్పు డధర్మము మీరుఁ గ్రూరులై
యెప్పుడు దైత్యు లుబ్బుదురు, హీనతఁ బొందుదు రెప్డు వేల్పు లే
నప్పుడు సత్కులీనులు గృహంబున నుద్భవమొంది లీనమై,
యెప్పటియట్ల నిల్పుదు సు,రేంద్రుల నంచితధర్మపద్ధతిన్.

పై శ్రీమన్నారాయణ శ్రీకృష్ణవాక్యములను రెంటిని యోజించి చూచిన నర్జునున కుపదేశించిన శ్రీకృష్ణుఁడు సృష్ట్యాదియందు వివస్వతున కుపదేశించిన శ్రీమన్నారాయణుఁడేగాని వేఱొకఁడు కాదని సుస్పష్టమగుచున్నది. శ్రీమన్నారాయణుఁడన్ననో భారతవర్షమును బవిత్రము చేయుచున్న భారతీ సాంప్రదాయమునకు మూలపూరుషుఁడు. ఈ పరిదృశ్యమానమగు జగత్తుయొక్క సృష్టిస్థితిలయ కారణభూతమగు పరబ్రహ్మయొక్క కర చరణాద్యవయవ విశిష్టమగు మొదటి మూర్తి, దానంజేసియే యాగీతాధ్యాన శ్లోకమునందు "పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం" అని పరగుచున్నది. శ్రీమన్నారాయణుఁడన్ననో యీ జగత్తుయొక్క సృష్టికాలమందును స్థితికాలమందును లయకాలమందును గూడ నప్రతిహతమగు దివ్యజ్యోతిస్సుతో నిలచియుండు నిత్య సిద్ధేశ్వరుఁడు. ఆతఁడే ప్రజాపతియనియు హిరణ్యగర్భుఁడనియు, సదాశివుఁడనియు, మహేశ్వరుఁడనియు మహావిష్ణువనియు నిట్లు పలువిధముల భక్తులచే వ్యవహరింపఁబడుచున్నాఁడు. అట్టి నారాయణునియొక్క యవతార విశేషమే శ్రీకృష్ణుఁడు. దానంజేసియే శ్రీకృష్ణ

భగవానులు యథార్థవక్త, దానంజేసియే యాతని స్మృతియగు నీగీతలు పరమ ప్రమాణములు. శ్రీకృష్ణభగవానులు శ్రీమన్నారాయణుని యవతార విశేషమని గ్రహింపలేక వసుదేవసుతుఁడగు నొక రాజన్యునిగను, మఱియొక విధమునను, దలంచుచు నాతనియొక్క పరాత్పరత్వమును సహింపలేక యసూయఁజెంది యాతని యందు దోషముల నధ్యారోపముచేయు పేచకాది సదృశులగు దుష్టమానవులకు నీగీతము లెంతమాత్రము ప్రమాణము గానేఱవు. అట్టి వార లొకవ్వు డీగీతములను బ్రమాణములవలె స్వీకరింప నెంచుట లోకవంచనము గాక వేఱొండు గానేఱదు. అట్టివారి వాక్యములు శ్వదృతిధృత గోక్షీరన్యాయమున ధర్మప్రమాణ బద్ధులగు వైదిక ధర్మాచార పరాయణులకు సర్వదా హేయములే యగును. ఈగీతలను బరమ ప్రమాణముగాఁ దలఁచువార లీనాలవ యధ్యాయమున సంగ్రహముగా నుదాహరింపఁబడిన విశేషవిషయములన్నియు నప్రతిహతముగా యథార్థములేయని త్రికరణ శుద్ధిగ విశ్వసించువారలై యుండవలయును.

## విశేష విషయములు.

### 1 గ్రంథనామము.

ఇచట శ్రీకృష్ణభగవానులు "ఇమం యోగం ప్రోక్తవాన్" "స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః" "యోగో నష్టః పరంతప!" అని పూర్వోక్తమగు "అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే" అనుగీతము మొదలు "ఏవం బుద్ధేః పరంబుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా" అను గీతమువఱకును గల రెండధ్యాయముల గ్రంథమును యోగమనుశబ్దముచేఁ బరామర్శముచేసియున్నారు కావున శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడిన గ్రంథవిశేషమునకు యోగమని నామమైనట్లు సుస్పష్టమగుచున్నది. ఇఁక నీయోగమను నామముచేఁ జెప్పఁబడిన విషయము నిష్ఠయను పేరఁబఱగుచు జ్ఞానయోగము కర్మయోగమను ద్వైవిధ్యమును బొందినటుల "లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తామయాఽనఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేణ యోగినామ్" (గీ.3-3) అనుగీతమువలనఁ దెలియ వచ్చుచున్నది. ఈ నిష్ఠాద్వైవిధ్యము రెండవ యధ్యాయమున "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు" (గీ. 2-39) గీతమువలనఁగూడ నువ్యక్తమగు చున్నది. ఈ గీతమునందలి "సాంఖ్యేబుద్ధిః" యను పదముచే జ్ఞానయోగమును, "యోగేత్విమాం" అను దానిచేఁ గర్మయోగము నభిప్రేతములగు చున్నవి. కావున జ్ఞానయోగము కర్మయోగమను ద్వైవిధ్యముచే నొప్పునిష్ఠ శ్రీకృష్ణభగవానులచే స్మరింపఁబడిన యోగశబ్దమున కర్థమగుచున్నది. దానంజేసి "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అను పతంజలి సూత్రముచే స్మరింపఁబడిన యోగమున కిచట నెంత మాత్రము ప్రసక్తి లేదని ప్రాజ్ఞులు గ్రహింతురు. ఆ తీరుననే యిచట సాంఖ్యశబ్ద

మునకుఁగూడ గాపిల సాంఖ్యముతో నెంతమాత్రము సంబంధములేదు. ఈగీతలు నిష్ఠారూపమగు యోగమును శాసించుచున్నవి గావున యోగశాస్త్రమని సుప్రసిద్ధ వ్యవహారమును గనుచున్నవి.

ఇది యటుండ బదునెనిమిదవ యధ్యాయమున "అధ్యేష్యతేచ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః" (గీ. 18-70) అని శ్రీకృష్ణభగవాను లీశాస్త్రమును "ఆవయోస్సంవాదం" అని స్మరించియున్నారు. తదనంతరము సంజయుఁడు, "ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః సంవాదమిమం" (గీ. 18-74) అనియు "రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం కేశవార్జునయోః" (గీ. 18-76) అనియు ధృతరాష్ట్రునితోఁ బల్కియున్నాఁడు. దానంజేసి యీ యోగశాస్త్రమునకుఁ గృష్ణార్జున సంవాదమను వ్యవహారము గలిగెను. ఇంతియేకాదు; సంజయుఁడు గూడ "వ్యాసప్రసాదాత్ శ్రుత వానిమంగుహ్యతమంపరం। యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత స్స్వయమ్" (గీ. 18-75) అని శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడిన గ్రంథమును యోగశబ్దముచేఁ బరామర్శించియున్నాఁడు. దానంజేసి యీ గీతలకు యోగశాస్త్రమనియుఁ గృష్ణార్జున సంవాదమనియు రెండునామములు సుప్రసిద్ధములగుచున్నవి.

దేశకాలనిర్ణయము:— సంజయుఁడు "యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత స్స్వయమ్" (గీ. 18-75). శ్రీకృష్ణభగవానులు యోగమును బ్రత్యక్షముగాఁ జెప్పుచుండఁ దా వినినట్లు ధృతరాష్ట్రునితోఁ బల్కియున్నాఁడు. అట్లు వినుటకుఁ దనకుఁ యోగ్యత వ్యాసప్రసాదమువలనఁ గల్గినట్లు "వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నిమం" అని చెప్పియున్నాఁడు. సంజయుఁడు యథార్థవక్త యనియు నాతఁ డతిశయోక్తులును న్యూనోక్తులును లేక తాఁ జూచినది చూచినటులను వినినది వినినట్లును బల్కువాఁడను విశ్వాసము ధృతరాష్ట్రునకు సర్వవిధముల గలిగియున్నది. ఏలనన భారతయుద్ధారంభమున యుద్ధమునందలి పరిస్థితులను యథోచితముగ దనకు నివేదింపఁగలిగిన యథార్థవక్త ననుగ్రహింపుఁడని ధృతరాష్ట్రుఁడు వేదవ్యాస భగవానులఁ బ్రార్థింప నా మహానుభావుఁ డీ సంజయునకు యుద్ధకాలమున సకలవిషయములు సర్వకాల సర్వావస్థలయందును బొడఁగట్టునట్లు నాకలిదప్పికలు శస్త్రాస్త్రములు మొదలగునవి బాధింపకుండునటుల దివ్యశక్తి నొకదాని ననుగ్రహించి ధృతరాష్ట్రునకు సకలవిషయములను నివేదింప నియమించినట్లును ఆశాసనము ననుసరించి భారతయుద్ధమున భీష్మపతనానంతరము ధృతరాష్ట్రునికడఁజేరి తత్పూర్వము పది దినములలోఁ గురుక్షేత్రమున జరిగిన యావద్విషయములను నివేదించుటయందు మొట్టమొదటవిషయముగా నీ కృష్ణార్జున సంవాదమును దెలియఁజెప్పెను. దానంజేసి యీ గీతాశాస్త్రము కృష్ణార్జునసంవాద

దమను నామాంతరమునొందుటకు సంజయుఁడే పూజ్యుఁడగు సాక్షి. ఇఁక సంజయుడే స్థలమున నెప్పుడు ప్రత్యక్షముగ వినియున్నాడో యా స్థలము నా కాలమునే శ్రీకృష్ణార్జునసంవాదమునకు దేశకాలములని వేఱె జెప్పనక్కరలేదు. దేశమును గూర్చి సంజయుఁ డిట్లు పల్కుచున్నాఁడు.

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్.
భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ! పశ్యైతా న్సమవేతాన్ కురూ నితి. (గీ 1-24,25)

దీనినిబట్టి కురుక్షేత్రమున భారతయుద్ధమును బ్రారంభించుటకు నాసన్నమైన సమయమున నుభయసైన్యములమధ్య రథమునం దుపదేశించినట్లు ప్రకరణము వలన సుస్పష్ట మగుచున్నది. ఈ దేశ మిప్పటికిని గురుక్షేత్రమునందు "జ్యోతీశ్వర" మను పవిత్రనామముచే వన్నెకెక్కుచున్నది. అచట జ్యోతీశ్వరుఁడను పేర నొక యీశ్వరబాణము ప్రతిష్ఠింపఁబడి యా స్థలమునకు లింగముగా నలరారుచున్నది.

ఇఁక గాల మన్ననో ప్రకృతపు కలియుగప్రారంభమునకుఁ బూర్వము ముప్పది యెనిమిదవ వత్సరమున గార్తికబహుళామావాస్యా జయవారమని చెప్పుటలో నెంతమాత్రము సందియము లేదు. ఆ దివసమున నే ముహూర్తమునం దీ సంవాదము బఱిగెనను విషయ మొకింత యోజనీయము. శ్రుతిస్మృతి సదాచార నియమములను గుర్తెఱింగిన వారలకు నుభయసైన్యములును గురుక్షేత్రమున నా దివసమున నుదయము సుమారు పదునొకొండుగడియల కాలమునకు సర్వవిధముల సమావేశమై యున్నటుల దెలిసికొననగును. పిమ్మట నొకింత కార్యక్రమము జఱిగి యర్జునునకు విషాద మొదవినప్పటికి సూర్యుఁ డాకసమున నించుమించుగా మధ్యభాగమును జేరియుండు ననుటకు సందియము లేదు. తత్కాలమున నీ సంవాదము బరగెను గావున నా దివసమున మకరలగ్నమున నభిజిన్ముహూర్తమున నీ సంవాదము జరిగెనని నిశ్చయము.

ఇయ్యది ప్రకృతపు కల్పిత క్రైస్తవశక దృష్టిచే క్రి. పూ. 3140 సంవత్సరమున గార్తికబహుళామావాస్యా జయవాసరమున బండ్రెండు గంటలకు సంవాదము ప్రారంభమైనదని యెల్లవారును సామాన్యముగాఁ దెలిసికొనఁదగిన విషయమే.

గ్రంథస్థ విషయము:—నాలవ యధ్యాయమునందలి విశేషవిషయముల కథనమున గ్రంథస్థ విషయమేదియో యనునది సామాన్య ప్రశంసగా యోజనీయము గావున నయ్యది యొకింత సంక్షేపముగా వివరింపఁబడును.

రెండవ యధ్యాయమున "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు, బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి" (గీ.2-39) అనియు, మూఁడవయధ్యాయమున "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం (గీ.3-3) అనియు గీతములు బరగుచున్నవి. అయిదవ యధ్యాయమున "సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః, ఏక మప్యాస్థిత స్సమ్యగుభయో ర్విందతే ఫలమ్" "య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే, ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి" (గీ.5-4,5) గీతములు బరగుచున్నవి. ఈ గీతములయొక్క యర్థమును గమనించినచో సాంఖ్యమను పేరఁబరగు జ్ఞానయోగమును యోగమను పేరఁబరగు కర్మయోగమును శ్రీకృష్ణభగవాను లుపదేశించినట్లును, యీ రెండు యోగములు నొకేనిష్ఠయొక్క ద్వైవిధ్యమనియుఁ దెలియవచ్చెడిని. ఈనిష్ఠయే యోగశాస్త్ర మనియు శ్రీకృష్ణార్జున సంవాదమనియు లోకమునఁ బేర్కొనఁబడుటచే జ్ఞానయోగ కర్మయోగ ద్వైవిధ్యముతో నొప్పు నిష్ఠయే యీ గ్రంథస్థవిషయమని సువ్యక్తమగుచున్నది. ఇచ్చట సాంఖ్యయోగ శబ్దములు కాపిలసాంఖ్య పాతంజల యోగేతర విషయములను విషయము పూర్వము నిరూపింపఁబడినది.

ఉత్తమ రహస్యము:— ఇచట నుపదేశింపఁబడిన యోగ విశేషములను శ్రీకృష్ణభగవానులు "రహస్యం హ్యేత దుత్తమమ్" (గీ.4-3) అని నిర్వచించి యున్నారు. రహస్యమనఁగా సర్వసామాన్యముగా నెల్లరకును దెలిసికొనుటకుఁగాని తెలియఁబడుటకుఁగాని యవకాశము లేనట్టియుఁ బ్రయోజనము నపేక్షించి యేతికిఁ జెప్పవలయునో యట్టివారికే చెప్పువిషయము. అట్టిరహస్యములలో నుత్తమరహస్యమైనచో నెక్కుడు జాగ్రత్తతో నుంపఁబడు విషయమనియు నట్టి జాగ్రత్తతో నుంచుటకుఁ దగిన వారలకే జెప్పవలయు నని యభిప్రాయము. ఇచటఁ జెప్పఁబడిన యోగముగాని యద్దానితో సంబంధించిన విశేషములుగాని యుత్తమోత్తములగు పురుషులకే యుపదేశింప వలయుననియు నప్పుడే యుచితమగు ప్రయోజనముల నయ్యవి గనుననియు, లేనిచో బ్రయోజనమును గలుగఁజేయుటకు మారుగ ననర్థ హేతువులుగాఁ బరిణమించుననియు నభిప్రాయ ముత్తమ రహస్యమనుటలోఁ దెలియవచ్చెడిని. దానంజేసియే యీ జ్ఞానము నేరికి నుపదేశింప వలయునను విషయమును గూర్చి పదునెనిమిదవ యధ్యాయమున.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

(గీ.18-67)

అని సామాన్యముగా నిర్వచింపఁబడియున్నది. విశేషస్వరూపముపదేశింపఁబడిన భక్తుల యతిశయ విశేషమునుండి దెలిసికొననగును.

ఉత్తమాధికారులు:— ఈ యోగము సృష్ట్యాదియందు వివస్వంతున కుపదేశింపఁబడెననియు నా వివస్వంతుఁడు వైవస్వత మనువున కుపదేశించెననియు నా వైవస్వతమనువు తనకుమారుఁడును బృథివికి దొలిప్రభువగు నిక్ష్వాకుమహారాజునకు నుపదేశించినట్లును, ఆతీరుననే పారంపర్యముగా రాజర్షులు తెలిసికొనిరనియు దీర్ఘకాలముచే నీయోగము లుప్తప్రాయమగుటంజేసి తానిప్పుడు మఱల నర్జునున కుపదేశించుచున్నట్లును జెప్పఁబడెను. దీనినిబట్టి వివస్వంతుఁడు, మనువు, ఇక్ష్వాకువు, తదనంతరము భూమి నలంకరించిన రాజర్షులు నీజ్ఞానమునకు నధికారులుగాఁ దెలియవచ్చుచున్నారు. ప్రకృతమున నర్జునుఁడుకూడ నొక యధికారి. వీరలతో సమానమగు నధికారముకలవారలుగాని వీరలకంటె నుత్తమాధికారులుగాని యీ యోగశాస్త్రమునకు నధికారులని నిస్సందేహముగాఁ జెప్పనోపు. ఇచ్చటఁ జేర్కొన బడిన మన్వాది పారంపర్యము రాజర్షి సాంప్రదాయమని చెప్పఁబడుచున్నది. రాజర్షులనఁగా జ్ఞానులును భూపతులు నగు క్షత్రియులు. ఇట్టివారు ధర్మరక్షణ భారమును వహించిన భూపతులు కావున లోకసంగ్రహమునకై ధర్మసంస్థాపనము ప్రధానముగాఁ గల్గిన ధర్మసంగ్రహవిధానమగు నీయోగ మవశ్యము తెలియవలయును. కావున నట్టివార లీజ్ఞానమున కుత్తమాధికారులు. ఏతద్విషయమును శ్రీకృష్ణ భగవానులు

"లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి" (గీ. 4-20)

అను గీతముచే సూచించియున్నారు.

ఇఁక రాజర్షులకంటె నుత్తము లెవ్వరనిన రాజర్షులకు సర్వవిధముల జ్ఞానము నుపదేశించు నధికారముగల్గిన బ్రహ్మర్షులు. ఈజ్ఞానము బ్రహ్మర్షి సాంప్రదాయమునందుఁగూడ నవిచ్ఛిన్నపారంపర్యక్రమమునఁ బ్రవర్తింపఁజేయఁబడుచునే యున్నది. బ్రహ్మర్షిసాంప్రదాయమనిన భారతవర్షమును సర్వవిధములఁ బవిత్రము చేయుచున్న భారతీ సాంప్రదాయము. భారతీసాంప్రదాయపుటతిశయము విష్ణుపురాణమున భారతవర్షస్వరూప కథనమునం దిట్లు నిర్వచింపబడినది.

"ఉత్తరం య త్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణం,
వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సంతతిః."

భారతీ సంతతియనఁగా భారతవర్షమున శ్రీమన్నారాయణునితోఁ బ్రారంభమయి .వేదవ్యాస శ్రీకృష్ణ ద్వైపాయనులచే వృద్ధినొందింపబడినట్టియు, శ్రీవిద్యాశంకర భగవత్పాదులచే లెస్సగా స్థాపింపఁబడినట్టియు, శ్రీవిద్యాశంకర విద్యారణ్యులవారిచే మఱల నుద్దీపిత మైనట్టియు, ప్రకృతమున శ్రీజగద్గురు శ్రీకల్యాణా

నంద భారతీమాంతాచార్యుల స్వాములవారియందు సర్వవిధముల నిలిచియున్నట్టి యు బరమహంస పరివ్రాజకాచార్యవర్యసాంప్రదాయము. భారతవర్షమున నీరెండు సాంప్రదాయములు, అనఁగా బ్రహ్మర్షి రాజర్షి సాంప్రదాయములచే నీయోగ శాస్త్రము కల్యాదివఱకుఁ బ్రవర్తింపఁజేయఁబడుచు వచ్చినప్పటికిని, కల్యాదినుండి క్రమక్రమముగాఁ గలిప్రాబల్యవశమున నీరాజర్షు లంతరింప రాజర్షిసాంప్రదాయము నేఁటికి లుప్తమయ్యెను. బ్రహ్మర్షి సాంప్రదాయ మన్ననో యిప్పటికిని భారత దేశమున నభివృద్ధి నొందియున్నది. లోకసంగ్రహమునకై బ్రహ్మర్షి సాంప్రదాయ మిచట దిఙ్మాత్రము ప్రదర్శింపఁబడుచున్నది.

భారతీసాంప్రదాయమునకు మూలపూరుషుఁడు.

శ్రీమదాది నారాయణుండు

|

బ్రహ్మ

|

వశిష్ఠుఁడు

|

శక్తి

|

పరాశరుఁడు

|

వేదవ్యాస శ్రీకృష్ణ ద్వైపాయనభారతి (భారతీవంశవివర్ధనులు)

|

శ్రీశుకులు

|

గౌడపాదాచార్యులు

|

శ్రీ గోవింద భగవత్పాదాచార్యులు

|

కలి: 2593. శ్రీ విద్యాశంకర భగవత్పాదభారతి. క్రీ. పూ. 509.

| పద్మపాదాచార్యులు | తోటకాచార్యులు | శ్రీసురేశ్వరాచార్యులు | హస్తామలకాచార్యులు |
|---|---|---|---|
| (జగన్నాథమఠము) | (జ్యోతిర్మఠము) | శృంగేరీమఠము | (ద్వారకామఠము) |
| క్రీ. పూ. 484 | క్రీ. పూ. 485 | క్రీ. పూ. 488 | క్రీ. పూ. 480 |
| (ఇయ్యది, క్రమముగ నుత్పన్న మాయెను.) | (ఇయ్యది యుత్పన్న మాయెను.) | \| | (ఇయ్యది యుత్పన్న మాయెను.) |

1 శ్రీ విద్యాశంకర విద్యారణ్యభారతి
శృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరులు.

2 శ్రీ నృసింహ భారతి (విరూపాక్షము)

3 శ్రీ సురేంద్ర భారతి

4 శంకర భారతి

5 నృసింహభారతి

6 సచ్చిదానందభారతి

7 శంకరభారతి

8 విద్యారణ్యభారతి

9 నృసింహభారతి

10 శంకరభారతి

11 సచ్చిదానందభారతి

12 విద్యారణ్యభారతి

13 శంకరభారతి

14 సచ్చిదానందభారతి

15 సదానందభారతి

చంద్రశేఖర భారతి (శృంగేరి)

పురుషోత్తమ భారతి (శృంగేరి)

1912 లో పరంపర విచ్ఛిత్తి నొందఁగా గురూపదేశరహితు డగు చంద్రశేఖర భారతి ప్రవేశపెట్టఁబడినాఁడు.

16 విద్యాశంకరభారతి

17 శ్రీనృసింహభారతి
క్రీ. శ. 1566-

శ్రీవిద్యానృసింహభారతి
(పుష్పగిరిమఠము) క్రీ. శ. 1566
ఈపరంపర క్రీ. శ. 1922 లో
నుత్సన్నమాయెను.

18 విద్యారణ్యభారతి

19 విద్యానృసింహభారతి

20 సదానందభారతి

21 శంకరభారతి

22 విద్యాభినవ శంకరభారతి

23 ఉద్దండ నృసింహభారతి

24 విద్యాశంకరభారతి

25 నృసింహభారతి

26 విద్యారణ్యభారతి

27 ఉద్దండ శంకరభారతి

28 నృసింహభారతి

29 అభినవ శంకరభారతి

30 ఉద్దండ నృసింహభారతి

31 విద్యారణ్యభారతి

32 ఉద్దండభారతి. క్రీ. వె. 1794

33 ఉద్దండ నృసింహభారతి

34 అభినవోద్దండభారతి(క్రీ. వె. 1824లో విజయనగరమున సిద్ధిఁబొందిరి.)

35 అభినవోద్దండ బోధానంద విద్యాశంకరభారతి (క్రీ. వె. 1825 లో విజయనగరమున పట్టాభిషిక్తులాయెను)

36 నృసింహభారతి

37 అభినవ శంకర భారతి.

38 సచ్చిదానందభారతి (జ్యేష్ఠుఁడు.) | నృసింహ శంకరభారతి (కనిష్ఠుఁడు)

39 బోధానందభారతి | విద్యాశంకర నృసింహభారతి ఉరఫ్ (ఉద్దండభారతి) 1878

40 సచ్చిదానందభారతి

41 జగద్గురు శ్రీబోధానందభారతి (1906) | విద్యానృసింహ శంకరభారతి 1896 (1906 సం॥లో మండపేటలో సిద్ధినొందిన స్వాములవారు.)

42 జగద్గురు శ్రీ కల్యాణానందభారతి:—

1925 డిసెంబరు 23 వ తేదీని గుంటూరుపురమున నభిషిక్తులయిరి. వీరలు శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠమును 1932 సం॥లో మే 12 వ తేదీకి సరియైన ఆంగీరసనామసం॥ర వైశాఖ శుక్ల సప్తమీ గురువారమున మిథునలగ్న పుష్కరాంశ యందు గుంటూరుపురమున శ్రీసదనమునందు శాశ్వతముగ నలరారునట్లు స్థిరప్రతిష్ఠను గాంచిరి.

ఈ కృష్ణార్జున సంవాదమను యోగశాస్త్రమును బ్రిమాణభావముతోఁ బూజ్యముగా నెంచువార లవశ్యము యథార్థమని విశ్వసింపవలయు విషయములు.

1 సృష్ట్యాదియందు నీయోగమును వివస్వంతున కుపదేశించిన శ్రీమన్నారాయణుఁడే శ్రీకృష్ణరూపమున భారతయుద్ధ ప్రారంభమున గురుక్షేత్రమున నుభయ సైన్యముల మధ్యయందు నర్జునున కుపదేశించిన యవతారమూర్తి.

2 శ్రీమన్నారాయణుఁడు జగద్విలక్షణుఁడై జగత్తుయొక్క సృష్టి స్థితిలయములకుఁ గారణభూతుఁడును సాక్షియును.

3 అవసరమైనచో శ్రీమన్నారాయణుఁ డర్జునునకు యోగము నుపదేశించిన తీరున ధర్మప్రవర్తకాచార్యులకును ధర్మరక్షణ శీలురకు నాయాయి తరుణముల యందు జ్ఞానము నుపదేశించుచుండును.

4 దేహముకంటె విలక్షణమగు దేహి నిత్యమై కర్మవిశేషముచే దేహము నుండి దేహాంతరమును బొందుచుండునుగాని యొక దేహపతనమాత్రమున నశించుటకుగాని సర్వవ్యవహారము లుడిగి దీర్ఘనిద్రను బొందుటగాని యెంతమాత్ర ముండ నేరదు.

5 శ్రీకృష్ణభగవానుఁడు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుఁడును సర్వభూత నియామకుఁడు నజుఁడు నవ్యయుఁడునగు నీశ్వరుఁడు.

6 అర్జునుఁడును తత్సజాతీయులగు మనుజులును నిత్యులైనను గించిద్జ్ఞులు కర్మవశులునై కర్మానుగుణంబులగు దేహంబులందుఁ జొచ్చుచు వెడలుచు జ్ఞానము కలుగువఱకును జరించు స్వభావముగలవారు.

7 రాగ భయక్రోధముల విడనాడి యీశ్వరాయత్తచిత్తులై యీశ్వరు నుపాసించు విద్వాంసులు దేహమరణ ప్రవాహరూపమగు సంసారమునందు జిక్కక యీశ్వరభావరూపమగు ముక్తిని బొంది నిరతిశయసుఖమున నోలలాడుదురు.

8 బ్రహ్మక్షత్త్రియ వైశ్య శూద్రులను జాతుర్వర్ణ్యము సృష్ట్యాదియందు నాయాయివ్యక్తులయొక్క కర్మానుగుణంబుగ సృజింపఁబడి వారల పురోవృద్ధికై యీ యోగము వారలకు భగవంతునిచే నుపదేశింపఁబడెను.

9 ఇందుపదేశింపఁబడిన యోగము కృత్రిమములు కానట్టియు స్వభావ సిద్ధములగునట్టియు వర్ణధర్మముల ననుసరించి వ్యవస్థచేయఁబడుటచే నీయోగము వర్ణాశ్రమధర్మమనియుఁ గూడఁ జెప్పఁబడుచున్నది.

10 మనుజులు సాధువులనియు దుష్టులనియు రెండువిధములు. అందు సాధువులు దైవసంపద్విశిష్టులు, దుష్కృతు లాసురసంపద్విశిష్టులు.

**11** సాధుపరిత్రాణము దుష్టనిగ్రహము వర్ణాశ్రమ ధర్మసంస్థాపనము భగవదవతారమునకు లింగములు.

**12** ఈయోగము త్రికాలాబాధ్యము కావునఁ బురుషమతివైచిత్ర్యము ననుసరించి దేశకాల పరివర్తనములందు మార్పు నొందించుటకు నెంతమాత్రి మవకాశము లేదు.

ఈ పండ్రెండు విషయములందును విశ్వాసములేని వారెట్టి బుద్ధిశాలురైనను నీయోగశాస్త్రమును వినుటకుఁగాని స్పృశించుటకుఁగాని చూచుటకుఁగాని యిసుమంతయైన నధికారమునుగాని యవకాశమునుగాని యెంతమాత్రము కల్గియుండ లేదు. కావున గీతాశాస్త్రము పరమప్రమాణమని చేఁబూని వ్యవహరింపఁదలఁచు వార లవశ్య మీ పండ్రెండువిషయములను విశ్వసించుచు తజ్జ్ఞానము నుచితక్రమమున గ్రహింప యత్నింపవలయును.

—* ఈయోగశాస్త్రము స్వతఃప్రమాణమా ? పరతఃప్రమాణమా ? *—

ఈ యోగశాస్త్రము శ్రీమన్నారాయణుని యవతారమగు శ్రీకృష్ణభగవానులయొక్క స్మృతియని సర్వవిధముల నెల్లరకుఁ దెలిసిన విషయమే. స్మృతి యనునది శ్రుత్యనుగుణ మైనచో బ్రమాణభావము నొందునను నియమము శ్రుతి ప్రమాణవిదు లందఱకు నప్రతిహతముగ సమ్మతమగువిషయమే, శ్రీకృష్ణభగవానులు గూడ శ్రుతియొక్క స్వతఃప్రామాణ్యమును బదునారవ యధ్యాయమున "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" (గీ.16.24) అను గీతముచే నిర్వచించియున్నారు. తా నుపదేశించిన యీ జ్ఞానము శ్రుతిస్మృతి సదాచారప్రమాణసిద్ధమైనదని పదియవ యధ్యాయమున—

"ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః." (గీ.13-4.)

అనుగీతముచే నిర్వచించి యున్నారు. ఇంతియ కాక రెండవ యధ్యాయమున—

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. (గీ. 2-16)

అను గీతముచేఁ దాఁ దత్త్వదర్శుల కభిమత మగుసిద్ధాన్తమును వ్యక్తీకరించుచున్నానని పలికెను. తత్త్వదర్శులనిర్ణయ మన వారి స్మృతివిశేషమే. కావున శ్రీకృష్ణభగవానులు దా నుపదేశించిన యోగము శ్రుతిస్మృతిప్రమాణపురస్సరమని స్వయముగ నిర్వచించుటచే సర్వవిధముల శ్రుతిస్మృతి సదాచారప్రమాణబద్ధులే. దానంజేసి శ్రీకృష్ణభగవానులును వారియొక్క స్మృతియగు నీ యోగ

శాస్త్రమును బ్రిమాణభావముతోఁ దలఁచువారలు శ్రుతిస్మృతి సదాచారములు పరమప్రమాణము లని శ్రుతిస్మృతిసదాచారబద్ధులై యుండవలయును.

ఇఁక నీ గీతాశాస్త్రము స్మృతి యని యీ దిగువఁ జెప్పఁబడిన యభి యుక్తోక్తివలనఁ గూడ సుస్పష్ట మగుచున్నది.

"సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్."

ఈ యోగశాస్త్రము సకలోపనిషత్సారభూత మనియుః దదర్థమునే సంక్షేపముగను సుస్పష్టముగను వ్యక్తీకరించుచున్నదని శ్రుతిస్మృతి సదాచార కోవిదుల కెల్లరకును దెలిసినవిషయమే.

## —* యోగశాస్త్రమునకు మూలభూతములగు సిద్ధాంతములు *—

శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడిన యీ యోగశాస్త్ర మంతయు నల్ప సంఖ్యాకములగు కొన్ని రహస్యముల నాలవాలముగాఁ జేసికొని ప్రవర్తించు చున్నది. అట్టి రహస్యములఁ బ్రతిపాదించు గీతము లన్నియు నిచట జిజ్ఞాసూప యోగమునకుఁ బ్రదర్శింపఁ బడుచున్నవి.

1 "దేహినోఽస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తిః" (గీ. 2-13.)

2 "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" (గీ. 2-16)

3 "అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్" (గీ. 2-17)

4 "వేదాఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్." (గీ. 2-21.)

5 "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనాన్యేవ" (గీ. 2-28)

6 "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు." (గీ. 2-39)

7 "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్." (గీ. 2-45)

8 "విహాయ కామా న్యః సర్వా న్పుమాం శ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి." (గీ. 2-71)

9 "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేణ యోగినామ్." (గీ. 3-3.)

10 "సహాయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ_స్త్విష్టకామధుక్." (గీ.3-10)

11 న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం,
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్." (గీ.3-26)

12 "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః." (గీ.3-35)

13 "స ఏవాఽయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః." (గీ.4-3)

14 "అజోఽపిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా." (గీ.4-6)

15 "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్." (గీ.4-13)

16 "కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్." (గీ.4-18)

17 "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" (గీ.4-34)

18 నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే,
త త్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి." (గీ.4-38)

19 "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః." (గీ.5-15)

20 "జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్." (గీ.5-16)

21 "యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా." (గీ.6-17)

22 "భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా." (గీ.7-4)

23 "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్." (గీ.7-5)

24 "ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా." (గీ.7-6)

25 "మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః." (గీ.9-4)

26 "నచ మత్ స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్,
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః." (గీ.9-5)

27 "అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్,
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్." (గీ.9-11)

28 "అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్." (గీ.9-22)

29 "విష్టభ్యాఽహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్." (గీ.10-42)

30 "మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ!" (గీ. 11-55)

31 "ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః." (గీ. 13-1)

32 "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ." (గీ. 13-2)

33 "అనాదిమ త్పరం బ్రహ్మ న స త్తన్నాన దుచ్యతే" (గీ. 13-12)

34 "సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్,
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి." (గీ. 13-13)

35 "యావ త్సంజాయతే కించి త్సత్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్ విద్ధి భరతర్షభ." (గీ. 13-26)

36 "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి." (గీ. 13-27)

37 "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్." (గీ. 15-14)

38 "ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ." (గీ. 16-6)

39 "త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్." (గీ. 16-21)

40 "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ." (గీ.16-24)

41 "అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాత్ర పంచమమ్." (గీ. 18-14)

42 "శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః." (గీ. 18-15)

43 "జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః." (గీ. 18-18)

44 "బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాంచ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః." (గీ.18-41)

45 "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."(గీ.18-61)

46 "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." (గీ. 18-65)

47 "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః." (గీ. 18-66)

ఈగీతములయొక్క యర్థవిచారమంతయు నుపనిషదర్థవిచారముగాఁ దెలియ వచ్చుచున్నది. దానంజేసి యీయోగశాస్త్ర ముపనిషదర్థప్రకాశకమగు దర్శన మని నిస్సందేహముగాఁ జెప్పనగును. ఇయ్యది సాక్షాత్తుగా భగవానులచే నుపదేశింపఁబడిన దర్శన మగుటచే దర్శనరాజముగా నెన్నఁబడుచున్నది. ఈగ్రంథముయొక్క దర్శనత్వమును సూచించుటకు నొక విశేషలింగము గలదు. శ్రీకృష్ణభగవానులు హస్తమునం దొక చక్రమును ధరించియున్నారనియును నద్దాని పేరు సుదర్శనమనియు సువిదితమే! సుదర్శన మన శ్రేష్ఠమగు దర్శనమని యర్థము. చక్రమన భావవ్యంజక మగు రేఖారూపమని కోవిదులు చెప్పుచున్నారు. ఈ చక్ర మెట్టిభావమును బోధించుచున్నదనిన నీయోగశాస్త్రభావమునే ప్రదర్శించుచున్న దని చక్రనామమువలన గ్రహింపవలయును. ఈ యోగశాస్త్రము శబ్దరూపమగు దర్శనము, చక్రమన్ననో రేఖారూపమగు దర్శనము. కావున శ్రీకృష్ణభగవానుల వాగ్రూపమగు నీదర్శనముయొక్క తత్త్వము చేఁబూనిన చక్రముచేఁ బ్రదర్శింపఁ బడుచున్న దనువిషయము సాంప్రదాయరహస్యము.

## —* యోగశాస్త్రతత్త్వము *—

ఈ యోగశాస్త్ర ముపనిషదర్థమును బ్రదర్శించు సుదర్శనమని చెప్పఁబడియె. దానంజేసి యిందుఁ బ్రదర్శింపఁబడిన తత్త్వమే యుపనిషత్తత్త్వమను నాశయము మీర నీ గ్రంథరాజమునందలి తత్త్వ మొకింత ప్రదర్శింపఁబడుచున్నది. సకలప్రాణులును సంసారమహోదధియందు మునింగియుండి యోలలాడుటకుఁ గారణము స్వస్వరూపజ్ఞాన మజ్ఞానముచే నావరింపఁబడుటయే యనియు నట్టి

యజ్ఞానము జ్ఞానముచే నాశము నొంద నిరతిశయమగు ముక్తిని బడయుచున్నారని యీాదిగువగీతములచే జెప్పఁబడుచున్నది.

"అజ్ఞానేఽనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః,
జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః.
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్,
తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః.
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. (గీ. 5 : 15-16-17)

అజ్ఞానమును నివర్తింపఁజేయు జ్ఞానము తత్త్వదర్శుల యధీన మగుటంజేసి వారివలన వినయపూర్వకముగా గ్రహింపఁబడవలయునని యీాదిగువ గీతముచే దెలియఁబడుచున్నది.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః." (గీ. 4-34)

తత్త్వదర్శులయొక్క యుపదేశమన్ననో,

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్వదర్శిభిః." (గీ. 2-16)

అను గీతముచే నిర్వచింపఁబడుచున్నది. ఈగీతము శ్రీకృష్ణ భగవానులచే యోగమని కంఠోక్తిగ నిర్వచింపబడిన రెండవయధ్యాయము పదునొకండవ గీతము మొదలు మూడవ యధ్యాయాంతము గల నూటయయిదు గీతములలోను మేరువుగ నలరారుచున్నది. గీతము లను పేరఁ బరఁగు నీ పదునెనిమిది యధ్యాయము లందును మొదటి యధ్యాయమునందలి నలుబదియేడు గీతములును రెండవయధ్యాయమునందలి మొదటి పది గీతములును మొత్తమేబదియేడు గీతములును ప్రస్తావనాగ్రంథముగా నొప్పుచున్నవి. నాలుగవ యధ్యాయము మొదలు పదునెనిమిదవ యధ్యాయాంతము గల గీతము లన్నియు విశేషప్రతిపత్తిహేతుభూత మగు వ్యాఖ్యానముగా నలరారుచున్నవి. మధ్యభాగమగు నూటమూడు గీతములును మూలభూతమగు నుపదేశగ్రంథముగా నొప్పుచున్నవి. అందుఁ బైనుదాహరింపఁబడిన గీతము మేరువుగా నగుటంజేసి తద్వివరణరూపమే మిగిలిన నూటరెండు గీతములని తెలియవచ్చెడిని. కావున ప్రకరణసందర్భమును బట్టి యీా గీతార్థమును గ్రహించినచో దత్త్వము కరతలామలక మగును. ఈ గీతమునందలి రెండవ చరణముచే :

"ఉభయోరపి దృష్టోంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః."

తత్త్వదర్శులచే నీ రెండిటియొక్క నిర్ణయము చూడఁబడినదని చెప్పఁబడుచున్నది. అట్టి నిర్ణయము-

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" అను మొదటి చరణ ముచే వ్యక్తీకరింపబడుచున్నది. ఇందుఁ దెలియవచ్చెడి తత్త్వ మేమన-

1 నాసతో విద్యతే భావః—అసత్తున కునికి తెలియఁబడదు.

2 నాభావో విద్యతే సతః—సత్తునకు లేమి తెలియఁబడదు.

ప్రకృతమున సదసచ్ఛబ్దములచే నే రెండుద్దేశింపఁబడి యవ్వాని తత్త్వ మీగీతముచే వ్యక్తీకరింపఁబడుచున్నదో కొంత విచారింతము. ఈ గీతమునకుఁ బూర్వమునందు.

"దేహినోస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తిః." (గీ. 2-13)

అనుగీతము పరగుచున్నది. పరమందు-

"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య" (గీ.2-18)

అను గీతము పరగుచున్నది. పూర్వాపరగీతములయొక్క సందర్భమును బట్టి దేహియు దేహము ననువిషయములు రెండు ప్రకృతము లగుచున్నవి. అందు దేహియొక్క నిత్యత్వము దేహముయొక్క నశ్వరత్వము వివరింపఁబడు చున్నది. దానంజేసి ప్రకృతమున సచ్ఛబ్దముచే దేహియు, నసచ్ఛబ్దముచే దేహ ములు నుద్దేశింపఁబడుచున్నవనుట యొక వింతగాదు. దానంజేసి ప్రకరణసందర్భ ముచే దేహములకు భావము తెలియఁబడదు, అనఁగా నునికి తెలియఁబడదు. దేహికి నభావము తెలియఁబడదు, అనఁగా లేమి తెలియఁబడ దనియు నువ్యక్త మగుచున్నది. దేహికి లేమి తెలియఁబడ దన నిత్యమని యర్థము. అట్టి యభి ప్రాయమును

న జాయతే మ్రియతే వా కదాచి,
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. (గీ.2-20)

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః. (గీ.2-23)
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. (గీ.2-24)

అను గీతములు సుస్పష్టముగా వ్యక్తీకరించుచున్నవి. ఇచట దేహి నిత్యము సర్వగతము నని తెలియవచ్చుటచే దేహి యణుపరిమాణవిశిష్టుఁ డను నాంతరాళుల

వాదము, మధ్యమపరిమాణవిశిష్టుఁ డను జైనవాదము, త్రోసివేయఁబడుచున్నప్పటికిని సర్వవ్యాపకములగు నాత్మలు ప్రతిశరీరమునం దొక్కొక్కటి చొప్పున ననేకాత్మలున్న వనుసాంఖ్యకాణాదాదివాదముల కవకాశము గల్గునను నాశయము మీఁద

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్. (గీ. 2-19)

అను గీతమును శ్రీకృష్ణభగవానులు స్మరించుచున్నారు. ఇచట 'యేన' అను నేకవచనప్రయోగముచేతను, 'తు' అను నితరవ్యావర్తకార్థబోధకమగు నవ్యయముచేతను నిత్యమగుపదార్థము సర్వవ్యాపకమై యొక్కటియే యుండవలయును గాని యనేకము లుండగూడదను నభిప్రాయము సూచింపఁబడుచున్నది. నానావిధములగు దేహములతో సంబంధించిన దేహి యొక్కఁడను నభిప్రాయమును,

"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య" (గీ. 2-18)

అను గీతముచేఁ జెప్పఁబడుచున్నది. ఈ గీతమునందు దేహిబోధకమగు శరీరిపదము తద్విశేషణపదములు నేకవచనముతో నొప్పుచు దేహశబ్దముమాత్రము బహువచనముతోఁ బ్రయోగింపఁబడినది. ఇచట దేహస్వభావమును బోధించు "అంతవంతః" అనుపదము,

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ" (గీ.2-28)

అను గీతముచే వివరింపఁబడుచున్నది. దీనినిబట్టి దేహము లదృష్ట దృష్టప్రణష్ట స్వరూపము లగుచు మిథ్యాభూతంబులు ననిర్వచనీయంబు లని తెలియుచున్నది. ఇంతవఱకుఁ దేలిన తత్త్వ మేమన, 'సత్' అను దేహి నిత్యుఁడు, సర్వవ్యాపకుఁడు, అద్వితీయుఁడు; 'అసత్' అనఁబడు దేహములు మిథ్యాభూతంబులు. ఇట్టి జ్ఞానమువలన గలుగుఫలము "వేదావినాశినం నిత్యం యఏన మజ మవ్యయమ్, కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్" (గీ. 2-21) అను గీతముచే నిర్వచింపఁబడుచున్నది. దేహియగు నాత్మకంటె విలక్షణమగు నహంకారమనోబుద్ధులు దేహేంద్రియములును మిథ్యాభూతము లను నిశ్చయము గలుగ నట్టి విద్వాంసునకుఁ దాన కర్త యగునాత్మ యనియుఁ దనయందుఁ జూడఁబడుప్రమాతృత్వకర్తృత్వభోక్తృత్వరూపసంసారము మిథ్యయనియుఁ దోపఁ గర్తృత్వకారయితృత్వము లుపశమించి సర్వకర్తవ్యతాహానిరూపమగు ముక్తి లభించుచున్నది. ఏతదాశయమే

"కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్." (గీ4-18)

అను గీతముచేఁ గూడ వ్యక్తీకరింపఁబడుచున్నది. ఇచ్చట దేహిని సచ్ఛబ్దవాచ్యునిగాఁ జేర్కొనుటచే ఛాందోగ్యోపనిషత్తునందలి సద్విద్యాప్రపాఠకమగు శ్వేత

కేతుసంవాదమున జగత్కారణభూతముగా వర్ణింపఁబడిన సత్పదార్థమే యీదేహి గాని వేఱొండు గాదని శ్రీకృష్ణభగవానులు స్మరించినట్లు స్పష్టమగుచున్నది. శ్వేతకేతూద్దాలకసంవాదమందలి సచ్ఛబ్దవాచ్యము తైత్తిరీయోపనిషత్తునందు జగత్సృష్టిస్థితిలయ కారణముగా వర్ణింపఁబడిన బ్రహ్మమే యని శ్రీకృష్ణద్వైపాయన భగవానులు తమ వేదాంతమీమాంసయం దీక్షత్యధికరణమున నిరూపించియు న్నారు. దానంజేసి యిచ్చట నుపదేశింపఁబడిన దేహి బ్రహ్మమేకాని వేఱొండు గాదని సుస్పష్టమగుచున్నది. ఆకారణముచే నీ ప్రకరణమున జీవేశ్వరాభేదమునే శ్రీకృష్ణభగవాను లుపదేశించినట్లు సుకరముగాఁ దెలిసికొననగును. వేయేల! శ్రీ కృష్ణభగవానులు నాలవయధ్యాయము మొదలు పండ్రెండవయధ్యాయాంతము వఱకుగల గ్రంథముచేఁ దానే సర్వవిధముల నీశ్వరుఁడ నని ప్రబోధించి పదమూఁడవ యధ్యాయప్రారంభమున నిట్లు నిర్వచించుచున్నారు.

"ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమి త్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. (గీ. 13-1)

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తద్ జ్ఞానం మతం మమ. (గీ. 13-2)

అని ఈ పరిదృశ్యమానమగు దేహమే క్షేత్రమని చెప్పఁబడుచున్నది. ఈ క్షేత్రమను దేహమును దెలిసికొను దేహి క్షేత్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాఁడని శిష్ట సమ్మతిని బ్రదర్శించి యట్టి క్షేత్రజ్ఞుఁడను దేహి సర్వక్షేత్రములయందును అనఁగా సకలదేహములయందును నొక్కఁడే యనియు నాదేహియుఁ దానే యనియుఁ జెప్పి యిట్టిజ్ఞానమే తన కభిమత మని కంఠోక్తిగ వచించియున్నారు. ఇంతియగాదు. ఈ జ్ఞానమే సకలప్రమాణములచేఁగూడ నిర్వచింపఁబడుచున్నదని

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. (గీ. 13-4)

దానంజేసి జీవేశ్వరాభేదము, తజ్జ్ఞానప్రయుక్తమును సర్వక్రియానివృత్తి రూపము నగు సర్వకర్మసంన్యాసమును సకలశాస్త్రముల యొక్క పరమతాత్పర్య ముగా శ్రీకృష్ణభగవానులచే నీ యోగశాస్త్రమున నుపదేశింపఁ బడినట్లు దెలియు చున్నది. ఇట్టి పరమతాత్పర్యమునే సాంఖ్యమందలి బుద్ధియని యనఁగా సిద్ధాంత మని "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః" (గీ.2-39) అనుగీతముచే నిర్వచించి యున్నారు. ఈ యాశయమునే శ్రోతృబుద్ధిదార్ఢ్యముకొఱకుఁ బదునేనవ. యధ్యా యమున-

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞానమపోహనంచ
వేదైశ్చ సర్వైరహ మేవవేద్యో
వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్. (గీ. 15-14,15)

అను గీతములచే ననువదింపఁబడినది. ఇయ్యదియే శ్రీకృష్ణసాంఖ్యము, శ్రీ విద్యాశంకర భగవత్పాదాద్వైతమును. సకలోపనిషత్సారభూతమగు గీతామృతమును.

ఇంతవఱకుఁ జేయఁబడిన విచారణవలనఁ దేలిన సారాంశ మేమనిన యేడునూరుల గీతములతో నొప్పుచుండెడి పదునెనిమిది యధ్యాయముల గ్రంథము నీదిగువ నుదాహరింపబడిన సూక్తులయొక్క విపుల వ్యాఖ్యానము. ఆ సూక్తు లెవ్వియన—

1 దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనంజరా, తథా దేహాంతరప్రాప్తిః...

2 నానతో విద్యతే భావో నాభావో విద్యతే సతః.

3 అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్.

4 వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్.

5 అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,। అవ్యక్తనిధనాన్యేవ.

6 ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః.

7 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత !

8 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.

9 సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్.

అని ఈ సూక్తినవకమునే శ్రీకృష్ణభగవత్కరకమలగత గీతామృత నవనీతముగా జిజ్ఞాసువులు గ్రహించి మనియెదురుగాక!

## —* యోగము *—

ఇట్లు శ్రీకృష్ణభగవానులు సాంఖ్యమందలి సిద్ధాన్తము నుపదేశించి యోగ మందలి సిద్ధాన్తమును జెప్పుచుంటిరని,

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి
నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్
వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.
(గీ.2-39,40,41)

అను గీతములచే నిర్వచించియున్నారు. ఈ యోగముయొక్క ఫలము కర్మ బంధప్రహాణమని నిర్వచింపఁబడి యున్నది. ఇచట యోగమనునది కర్మయని చెప్పఁ బడుచున్నది. కనుక యోగమందలి బుద్ధి యనఁగాఁ గర్మయందలి నిర్ణయమని యాశయము. కర్మయందలి యధికారులు పరిపాకమును జెందిన యంతఃకరణముగల వారలు, పరిపాకముఁ జెందని యంతఃకరణము కలవారలని ద్వివిధములుగా నున్నారు. ప్రకృతమున యోగమునకు ఫలముగాఁ జెప్పఁబడిన కర్మబంధప్రహాణము పరిపాక ముఁ జెందిన యంతఃకరణము గలిగినవారల విషయమని.

"వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!" (గీ.2-41)

అను వాక్యమువలనఁ దెలియవచ్చుచున్నది. తద్భిన్నులయొక్క విశేషము

"బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్" (గీ.2-41)

అను వచనముచే సూచింపఁబడు చున్నది. ఇచట గర్మయనఁగా శ్రుతి స్మృతులచే నాయాపురుషుల యధికార విశేషములఁబట్టి విధింపఁబడిన వర్ణాశ్రమోచిత ధర్మవిశేషము. ఇట్టి ధర్మము ఫలాభిసంధి రహితముగా నాచరింపఁబడినపుడు కర్మబంధమును దొలగించి చిత్తశుద్ధిని గలుగఁజేయు నను నభిప్రాయము.

"యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే"
(గీ.5-11)

అను గీతమువలన సుస్పష్టముగాఁ దెలియవచ్చెడిని. ఫలాభిసంధిపూర్వక ముగాఁ గర్మల నాచరించువారలకు ఫలహేతువగుచు జననమరణ ప్రవాహరూప సంసారబంధమును బౌనఃపున్యముగ ఘటింపఁజేయును. ప్రకృతమున శ్రీకృష్ణభగ వానులు యోగమందలి నిర్ణయమును దానిచే ఫలాభిసంధి రహితముగ నాచరింప

బడు కర్మానుష్ఠానమని తలంచుచున్నారు. దీనినే యోగమని గాని కర్మయోగ మని గాని గీతార్థకోవిదులు చెప్పుచున్నారు. పైనఁజెప్పఁబడిన సాంఖ్యమును యోగమునకు నధికారము చాలనట్టియుఁ గర్మలయందు ఫలాభిసంధి తొలఁగినట్టిఁ పురుషులకు సాంఖ్యమందు నధికారమును గలుగఁజేయుటకై యీ కర్మయోగ ముద్దేశింపఁబడు చున్నది. ప్రకృతమున శిష్యుఁడగు నర్జునుఁడు సాంఖ్యయోగమునకు నధికారి కాఁడనియుఁ బ్రకృతమున నాతఁడు పల్కిన ప్రజ్ఞావాదములఁబట్టి కర్మలయందలి ఫలాభిసంధిని విడచినట్టి పురుషుడుగా శ్రీకృష్ణభగవానులచేఁ దలఁపబడుటచే నర్జునునిగూర్చి కర్మయోగ మిట్లుపదేశింపఁ బడుచున్నది.

"కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ!
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్.
(గీ. 2-47,48,49,50)

అని. దానంజేసి కర్మ యోగజ్ఞానయోగములయొక్క యన్యోన్యసంబంధ మిట్లు గ్రహించునది. ఫలాభిసంధివర్జితునిచే నాచరింపఁబడు శ్రుతిస్మృతి చోదితమగు స్వధర్మము చిత్తశుద్ధిని గలుగఁజేయును. చిత్తశుద్ధిచే శమము గలుగును. శమముచే సర్వకర్మసంన్యాసము గలుగును. సర్వకర్మసంన్యాసము సాంఖ్యయోగమనెడి జ్ఞాననిష్ఠకు ద్వారము. జ్ఞాననిష్ఠయొక్క పరిపాకముచే బ్రహ్మభావాపత్తియనఁబడు పరమపురుషార్థ మలవడును. దీనినే మోక్షమందురు.

భక్తి:— శ్రీకృష్ణభగవానులచే మూలగ్రంథమున—

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు"
(గీ. 2-39) అనియు,

వ్యాఖ్యానగ్రంథమున—

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. (గీ. 3-3)
సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. (గీ. 5-4)

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యంచ యోగం చ యః పశ్యతి స పశ్యతి. (గీ. 5-5)

అను గీతములచే 'జ్ఞానయోగము, కర్మయోగము,' అను నామాంతరములు గలిగిన సాంఖ్యయోగములను రెండుపదేశింపఁబడినట్లు సుస్పష్టముగాఁ దెలియవచ్చుచుండఁ బండ్రెండవ యధ్యాయమునకు శీర్షికగాఁ దెలియవచ్చెడి భక్తియోగమను నామము నొకదానిని జేకొని శ్రీకృష్ణభగవానులు కర్మజ్ఞానభక్తులను మూఁడు యోగములనుఁ బ్రత్యేకముగా నుపదేశించినట్లు కొందఱు దలంచుచున్నారు. ఏతద్విషయ మొకింత విచారణీయము. వ్యాఖ్యానగ్రంథమునఁ దెలియవచ్చెడి యధ్యాయములలో నొక యధ్యాయపు శీర్షికచే మూలగ్రంథమునఁ దెలియవచ్చెడి కర్మయోగజ్ఞానముల రెంటికంటె మూఁడవసాధనము నొకదానిని భక్తియోగమని విశేషించి కల్పించువారలకు మిగిలిన పదునైదధ్యాయముల శీర్షికలుకూడ భక్తియోగమట్లు సాధనములుగాఁ బరగుచు శ్రీకృష్ణభగవానులచేఁ బదునెనిమిది సాధనములుగాఁ బదునెనిమిది యోగములు ముచ్చటింపఁబడినవని చెప్పుటకు మారుగ భక్తియోగాభినివేశమున మూఁడుసాధనములనే గల్పించు ప్రజ్ఞావిశేష మెందుఁ గలదో యుక్తాయుక్త వివేకజ్ఞులగు ప్రాజ్ఞులు చింతింతురుగాక! ఇట భక్తియోగము పృథక్సాధనమా, కర్మజ్ఞానములలో నెంద్తైన నంతర్భూతమా, కర్మజ్ఞానముల రెంటికిని సహకారికారణమా యనునది యొకింత విచారింతము. ఇట్లు చేసిన భక్తియోగతత్త్వము తెలియవచ్చునను నాశయముచే నీ విషయము లొకింత విచారింపఁబడుచున్నవి.

భక్తియోగము పృథక్సాధనమా? జ్ఞానకర్మయోగములలో నంతర్భూతమా?

భక్తియోగమును బృథక్సాధనముగా లెక్కించి కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగములను మూఁడు మార్గములను శ్రీకృష్ణభగవాను లుపదేశించిరనినచో గల్గుదోష మొకింత ప్రదర్శింపఁబడియె. ప్రకృతమున భక్తియోగమను పండ్రెండవ యధ్యాయమునఁ దెలియవచ్చెడి విషయము నొకింత దిలకించిన నేతద్విషయము సుస్పష్టమగును. కావున నద్దాని నొకింత ముందు విచారింతము.

పండ్రెండవ యధ్యాయము.

"ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః." (గీ. 12-1)

అను నర్జునియొక్క ప్రశ్నతోఁ బ్రారంభమగుచున్నది. ఈ ప్రశ్నము నందలి విషయమేమన భక్తులు రెండు విధములుగాఁ దెలియవచ్చుచున్నారు. అవ్యక్తమగు నక్షరము నుపాసించువారలు. విశ్వరూపము నుపాసించువారనియు, అం

దెవ్వరు శ్రేష్ఠులని యర్జునుఁడు ప్రశ్నించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. అర్జునుని దృష్టియం దుభయవిధములగు నుపాసకులును భక్తులే. కాని యం దెవ్వ రధికులనునది యర్జునుని సందేహము. ఈ సందియమునకుఁ బ్రతివచనముగా భగవానులు,

> మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
> శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. (గీ.12-2)

అను గీతముచే విశ్వరూపోపాసకులను భక్తులు యుక్తతము లనిచెప్పి

> "యేతు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః
> అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే" (గీ. 12-6)
>
> తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరత్
> భవామి న చిరా త్పార్థ! మయ్యావేశితచేతసామ్. (గీ. 12-7)

అను గీతములచే నట్టి విశ్వరూపోపాసకులగు భక్తులను దాను సంసారము నుండి యుద్ధరింతునని విశ్వరూపోపాసనయొక్క ఫలమునుజెప్పి యట్టి విశ్వరూపోపాసనము నవశ్య మాచరింపవలయునని—

> "మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
> నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః" (గీ. 12-8)

అను గీతముచే నర్జునునకు విధించుచున్నారు. దీనినిబట్టి విశ్వరూపోపాసనము భక్తియోగమున నొక విధానమని తెలియవచ్చుచున్నది. పిమ్మట,

> "అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
> అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ!" (గీ. 12-9)

అనుగీతముచేవిశ్వరూపోపాసనమును జేయుటకు సామర్థ్యము లేనిచో నభ్యాసయోగము నాచరింపవలయునని యుపదేశించుచున్నారు. దానంజేసి యభ్యాసయోగమనునది భక్తియోగమున మఱియొక విధానముగాఁ జెప్పఁబడుచున్నట్లు తెలియవచ్చుచున్నది. పిమ్మట,

> అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
> మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. (గీ.12-10)

అనుగీతముచే నభ్యాసయోగమునందు సామర్థ్యము లేనిచో నీశ్వరార్పణబుద్ధితోఁ గర్మల నాచరింపవలయునని చెప్పబడుచున్నది. దానంజేసి యీశ్వరార్పణబుద్ధితోఁ గర్మల నాచరించుటయు భక్తియోగమున నొక మార్గమని విధింపఁబడినట్లు తెలియఁబడుచున్నది. పిమ్మట,

"అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్". (గీ.12-11)

అనుగీతముచే నిష్కామకర్మము నాచరించుటకు సామర్థ్యము లేనిచోఁ గర్మల నాచరించి పిమ్మట సర్వకర్మఫలత్యాగమును జేయవలయునని యుపదేశించు చున్నారు. దానంజేసి సర్వకర్మఫలత్యాగమనునది మఱియొక భక్తిమార్గముగాఁ దెలియవచ్చుచున్నది. ఇట్లర్జునునకు శక్తికొలఁది యోజించుకొని యనుసరించుటకుఁగాను నాలుగుమార్గము లుపదేశింపఁబడుటచే, నధమ మంద మధ్యమ భేదములచే నాల్గు మార్గంబులు భక్తియోగంబనఁ జెప్పఁబడు చున్నవి. ఈనాల్గు నటుండ,

"యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్
సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. (గీ.12-3,4)

అను గీతములచే సర్వైషణా వినిర్ముక్తులును సర్వకర్మసంన్యాసులు నగు పరమహంస పరివ్రాజకు లాచరించునట్టి యవ్యక్తాక్షరోపాసనముగూడ భక్తియోగమున నుత్తమోత్తమమగు మార్గముగ నుపదేశించి యట్టి సర్వకర్మసంన్యాసులే భక్తులనియుఁ దనకుఁ బ్రియతము లనియును,

"అద్వేష్టా సర్వభూతానాం (గీ.12-13) "యే తు ధర్మ్యామృత మిదం" (గీ.12-20) అను గీతముల మధ్యగతమగు గీతములచే వర్ణించుటవలన భక్తియోగమున నవ్యక్తాక్షరోపాసన ముత్తమోత్తమమగు సాధనమని తెలియవచ్చెడిని. దానంజేసి భక్తియోగమున నైదుసోపానము లుపదేశింపఁబడుచున్నట్లు నుస్పష్టము. అందుత్తమోత్తమ సోపానమగు నవ్యక్తాక్షరోపాసనము సాంఖ్యమను జ్ఞానయోగమునందలి యనుష్ఠానవిశేషము. శేషించిన నాల్గును గృహస్థుఁడగు నర్జునునకు విధింపఁబడు చుండుటంజేసి కర్మయోగమునందలి సోపానములు. దానంజేసి భక్తియోగమనునది కర్మయోగము, జ్ఞానయోగమను ద్వైవిధ్యముతో నొప్పు నిష్ఠారూపమేయని,

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" (గీ. 3-3)

అను గీతమునందు నిర్వచింపఁబడిన నిష్ఠయేగాని వేఱొండుగాదని తెలియవచ్చెడిని. అంతియకాని జ్ఞానయోగ కర్మయోగములకంటె భిన్నమును గాదు. జ్ఞానకర్మలలో నెద్దియేని యొకదానియం దంతర్భూతమును గాదు. ఇఁక భక్తియన ప్రేమ, విశ్వాసము, శ్రద్ధ, యను పదములచే దెలియవచ్చెడి యంతఃకరణవృత్తివిశేషము.

భగవంతుని యందుఁ బ్రేమ విశ్వాసము శ్రద్ధలేనిచో భగవదుపదిష్టములును భగవదుపాసనావిశేషములు నగు కర్మయోగ జ్ఞానయోగములందు శ్రద్ధఁగలిగి వర్తించుట దుర్ఘటము. కావున సర్వయోగములకు మూలము భక్తియనియు నట్టి భక్తితో యోగము నాచరింపవలయుననియు నించుమించుగాఁ బ్రతియధ్యాయమునందుఁ జెప్పఁబడుచునే యున్నది. అది యెట్లనిన— పదునొకండవ యధ్యాయమున విశ్వరూప సందర్శనమున కనన్య భక్తికారణమనియు నట్టి యనన్యభక్తియన నీశ్వరార్పణ బుద్ధితోఁ గర్మల నాచరించుట యనియు,

> భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!,
> జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!.
> మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
> నిర్వైరః సర్వభూతేషు యస్స మామేతి పాండవ!. (గీ.11-54,55)

అను గీతములచేఁ జెప్పఁబడినది. పదవ యధ్యాయమున

> తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
> దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. (గీ.10-10)

అనియు, తొమ్మిదవ యధ్యాయమున

> మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
> మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. (గీ.9-34)

అనియు, నెనిమిదవ యధ్యాయమున

> పురుష స్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా,
> యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. (గీ.8-22)

> ప్రయాణకాలే మనసాఽచలేన
> భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
> భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
> స తం పరం పురుష ముపైతి దివ్యమ్. (గీ.8-10)

అనియు, బదునెనిమిదవ యధ్యాయమున

> మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
> మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.
> సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
> అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. (గీ.18-65,66)

అనియును, ద్వితీయధ్యాయమందును జెప్పఁబడిన కర్మయోగ జ్ఞానయోగ ములవిశేషములతో భక్తియనునది సంబంధింపఁజేసియే ముచ్చటింపఁబడుచుండ భక్తియోగమనునది ప్రత్యేకసాధన మెట్లగునో యూహించుట కెంతమాత్రి మవ కాశము చాలకున్నది. ఇఁక నేడవయధ్యాయమున—

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. (గీ 7-16, 17)

అను గీతములచే భక్తులార్తుఁడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని యని నాల్గు విధములుగ నున్నారనియు, నందు జ్ఞాని యుత్తముఁడనియుఁ జెప్పబడుచున్నది. ఇచట జ్ఞానియను భక్తుఁడు సాంఖ్యుఁడను పేరఁబరగు పరమహంస పరివ్రాజకుఁడు. జిజ్ఞాసువుగూడ వివిదిషువగు సంన్యాసియే. ఆర్తుఁడు నర్థార్థియును సకాములును దాత్కాలికములు నగు నైహికఫలముల నపేక్షించువారు. వీరు తమ యభీష్టసిద్ధికై యీశ్వరుఁడగు శ్రీకృష్ణభగవానులను భజించిన భజింపవచ్చు, వేరొకరిని భజించిన భజింపవచ్చు. వేఱొకరిని భజించువారలకంటె శ్రీకృష్ణుని భజించువారలు శ్రేష్ఠులుగా శ్రీకృష్ణభగవానులచేఁ దలంపఁబడు చున్నారు. ఆర్తుఁడు నర్థార్థియుఁ దమ యభీష్టసిద్ధికై భక్తిమీర శాస్త్రచోదిత కర్మల నాచరించిన కామ్యకర్మానుష్ఠాతలుగాఁ జెప్పఁబడుచున్నారు. ఇట్టివారిని దీనులుగ "కృపణాః ఫలహేతవః" (గీ. 2-49) అని శ్రీకృష్ణభగవానులు నిర్వచించి యున్నారు. ఇట్లీ గీతాశాస్త్రమునంతయుఁ దిలకించినచో భక్తియోగమనఁ బరమేశ్వ రునియందు భక్తిమీరఁ బ్రీతిపురుషుఁడును దమయోగ్యతకతన తమవర్ణమునకును దమ యాశ్రమమునకును దన శక్తికిని యుక్తమగు సాధనమును శాస్త్రాచార్యోపదేశ మూలకముగాఁ దెలిసికొని యాచరించుటయే యని సుస్పష్ట మగుచున్నది. దానంజేసి భక్తియనునది కర్మయోగ జ్ఞానయోగముల కంటె బృథక్సాధనమును గాదు కర్మయోగ జ్ఞానయోగములయం దెద్దానియందు నంతర్భూతమునుఁ గాదు. పరిశేషన్యాయముచే గర్మయోగమునకును జ్ఞానయోగమునకు నందలి యవాంతర భేదమునకును గూడ సహకారి కారణమనియు సిద్ధమాయెను.

## —* మానవకోటియొక్క వైచిత్ర్యము *—

శ్రీకృష్ణభగవానులచేఁ గర్మయోగము సాంఖ్యయోగమను ద్వైవిధ్య ముతోఁ గూడిన నిష్ఠ యుపదేశింపఁ బడెననియు నయ్యది వర్ణాశ్రమధర్మ మను సామాన్య నామముతో వ్యవహరింపఁ బడుచున్నను విశేషదృష్టిచేఁ గడు వైచి త్ర్యముతోఁ నొప్పుచు నూహించుటకు నలవికానంత వైషమ్యములతోఁ గూడి

యుండుటకుఁ గారణ మెందుఁ గలదను సందియము సర్వసామాన్యముగా నెల్లర కును గల్గుచుండును. కావున నద్దాని యుపపత్తి యొకింత ప్రదర్శింపఁ బడు చున్నది.

కొందఱు మానవజాతి యంతయు నొక్కటియే యై యుండగా వర్ణభేదము జాతిభేద మను విశేషకథనము ధూర్తకల్పితమని యపహసించుటయుఁ గలదు. అట్టి యపహాసమును గూడఁ దొలఁగించుట యీ గీతాశాస్త్ర గౌరవప్రతిపాదక మగుటఁజేసి యీ గీతాశాస్త్రప్రమాణవిదుల కట్టి యపహాసపరిహారణము ప్రథమ కర్తవ్యము. వర్ణాశ్రమ ధర్మమను యోగము మానవకోటి ప్రాకృతమగు దేహ తత్త్వమందును మానసిక తత్త్వమందును బలువిధములగు వైచిత్ర్యములను గల్గి స్వాభావికమగు భేదముతోఁ గూడియుండుటచే నట్టి స్వభావసిద్ధమగు తత్త్వము నుండి యెల్లరను బరమావధిస్థితి నొందించుటకుఁ దగు విధమున వ్యవస్థ చేయఁబడి నట్టి మహాతంత్రముగాని, యజ్ఞులు తలఁచినట్లు పంచకపురుషకల్పిత మెంత మాత్రము గాదను గొప్ప యాశయముతో గీతాశాస్త్రము ప్రవర్తించుచున్నది. మానవకోటియందలి యెట్టి వైచిత్ర్యము నాలవాలముగాఁ జేసి యీ గీతా శాస్త్రము ప్రవర్తించుచున్నదో యట్టి విశేషము గీతాశాస్త్రమునం దచ్చ టచ్చటఁ బ్రదర్శింపఁబడియే యున్నది. అది యెట్లనిన, లోకములో మానవకోటి యందుఁ బురుషులు ప్రవృత్తిస్వభావులు నివృత్తిస్వభావు లని రెండు విధములుగా నున్నారు. నివృత్తి స్వభావులయొక్క బుద్ధి నిశ్చయాత్మికమై యేకాగ్రతను జెంది యుండునని—

"వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!" (గీ. 2-41)

అను గీతముచేఁ జెప్పఁబడు చున్నది. ప్రవృత్తి స్వభావులయొక్క బుద్ధి నానాముఖముల బరుగిడుచుండునని—

"బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్" (గీ. 2-41)

అనుగీతముచేఁ జెప్పఁబడుచున్నది. ప్రవృత్తిస్వభావులయొక్క బుద్ధులు నానాముఖములైనను నయ్యవి శాస్త్రాధికార పరితుష్టికొఱకు దైవమనియు నాసుర మనియు ద్వివిధములుగా-

"ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ" (గీ. 16-6)

అను గీతముచే నిరూపింపఁబడుచున్నది. ఆ ద్వివిధమగు ప్రవృత్తియు మఱల సాత్త్వికమనియు రాజసమనియుఁ దామసమనియు మిశ్ర మనియు నాల్గు విధము లుగా భేదము నందు చున్నదని-

"సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్" (గీ. 14-5)

అను గీతముచేఁ దెలియఁబడుచున్నది. ఆసురసంపద్విశిష్టులు ఆస్తికులనియు, నాస్తికులనియు రెండువిధములు. నాస్తికుఁ డన్ననో దేహమాత్రమునే యాత్మగాఁ దలఁచుచుఁ బ్రత్యక్షము నొక్కదానినే ప్రమాణముగాఁ దలచుచు విషయసుఖైక నిరతుఁడుగా నుండునని -

> ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః,
> న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.
> అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
> అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. (గీ.16-7,8)

అను గీతములచేఁ దెలియుచున్నది. ఇయ్యది మానవకోటియొక్క మానసిక వైచిత్ర్యము ననుసరించి చేయఁబడిన విభాగము. ఇఁకఁ బరిదృశ్యమాన మగు స్థూలదేహవైచిత్ర్యముచేఁ దెలియవచ్చెడి విభాగ మన్ననో 1 ద్విజులు, 2 ద్విజసములు, 3 శూద్రులు, 4 శూద్రసములు, 5 అస్పృశ్యులు, 6 దస్యులు అను నాఱు విధములుగాఁ బరగుచున్నది. ఈ యుభయవిధమగు విభాగమును,

> "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" (గీ.4-13)

అను గీతముచే సూచింపఁబడుచున్నది. ఇట్టి విభాగము సృష్టితత్త్వమునకు సర్వవిధముల ననుకూలముగనే యున్నట్లు సృష్టితత్త్వపరిశీలనము వలనఁ దేటతెల్లమగును.

## —* సృష్టితత్త్వము *—

చతుస్సాగర పరివేష్టితంబగు నీ భూమండలంబును లెస్సగాఁ బరిశీలించినచో నందుండుజీవకోటిజరాయుజాండజ స్వేదజోద్భిజ్జములను నాల్గు మహాజాతులుగా విభాగమును బడయుచున్నటుల దెలియవచ్చుచున్నది. ఇట్టి విభాగమున కాయాయి వస్తువులకు సహజసిద్ధమగు జన్మవైచిత్ర్యముతక్క వేఱొండు కారణము గానరాదు. ఇట్టి వైచిత్ర్యము స్వగత సజాతీయ విజాతీయంబు లని మూఁడు విధంబులు. ఒక చెట్టునకు మఱియొక చెట్టువలన సజాతీయ వైచిత్ర్యమును, రాయి మొదలగువాని వలన విజాతీయ వైచిత్ర్యమును, ఆకు పువ్వు పండు మొదలగువానివలన స్వగతవైచిత్ర్యమును దెలియును. ఇట్టి త్రివిధ వైచిత్ర్యమును లోకమునఁ గన్పట్టెడి సకలవస్తువులయందు సకలంకముగ దెలియవచ్చు చుండును. వైచిత్ర్యమునందలి సామాన్యధర్మ మేకత్వజ్ఞాపకము, అనగా జాతి బోధకము. జాతి యనఁ బుట్టుకతోడఁ గల్గుభావ మని శబ్దముల ప్రకృతిప్రత్యయముల యొక్క యర్థమువలనఁ దెలియవచ్చుచున్నది. దానంజేసి పుట్టుకచే సిద్ధమైన ధర్మము జాతిధర్మముగాని కృత్రిమ మెంతమాత్రము గానేరదను నభిప్రాయము సుస్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. వస్తుత్వము సకలవస్తు సామాన్య ధర్మమయ్యు బుట్టుకయందలి

వైచిత్ర్యముచే జరాయుజాండస్వేదజోద్భిజ్జములను విభాగమును వస్తువులు వడయుచున్నవి. జరాయుజము లనిన మావివలన బుట్టినవి. అండజములన గుడ్డు వలనఁ బుట్టినవి. స్వేదజములనఁ జెమటవలనఁ బుట్టినవి. ఉద్భిజ్జము లన భూమిని బ్రద్దలుచేసి పుట్టినవి. ఇట్టి నాల్గువిధములగు విభాగమునందును మఱల నవాంతరవిభాగములు పెక్కులు గల వని యెల్లరు నెఱింగిన విషయమే. అదెట్టు లనిన - జరాయుజము లన్నియును స్త్రీపుంభేదముచే ద్వివిధములు. ఆతీరుననే యండజములును, స్వేదజములును, ఉద్భిజ్జములును. ఇట్టి స్త్రీపుంభేదముగూడ జన్మచే సహజసిద్ధమైనదియ కాని కృత్రిమ మెంతమాత్రమును గానేరదు. జరాయుజములు మఱల పశుమృగవ్యాళమనుష్యాది భేదములను గనుచున్నది. అండజములు పక్షి నక్ర సర్పమత్స్యకచ్ఛపాది భేదములను గనుచున్నవి. స్వేదజములు దంశ మశక యూక మక్షికామత్కుణాదిభేదములఁ గనుచున్నవి. ఉద్భిజ్జములు తరు గుల్మలతాదిభేదమును గనుచున్నవి. ఇఁక పశువులన గోవు, మహిషము, మేక, గొఱ్ఱె మొదలుగాఁగల జంతువులు. మృగము లన లేడి, దుప్పి మున్నగుజాతులు. వ్యాళము లన సింహము, పులి మున్నగుజాతులు. మనుష్యు లన్ననో బ్రాహ్మణక్షత్త్రియ వైశ్యశూద్రాదిజాతులు. ఈ తీరుననే యండజాదులయందును బెక్కు లవాంతర జాతులు సుప్రసిద్ధముగాఁ దెలియవచ్చుచున్నవి. ఇట్టి జాతివిభాగము జన్మతోడనే సిద్ధమైనటులు పండితపామరసామాన్యముగాఁ దెలిసినవిషయమే, ఇంతియకాదు; పరికించి చూచిన సకలజాతులకును జన్మతోడనే సిద్ధమైన యింకొక భేదముగూడ గలదు. పశుపక్ష్యాదులకు రూపభేదము జన్మతో నెటులు సిద్ధ మగుచున్నదో యాతీరుననే క్రియాభేదముకూడ జన్మతోడనే సిద్ధ మగుచున్నటుల బుద్ధిమంతులకు దెలిసికొననగును. ఇట్టి క్రియ మానసికము, వాచికము, కాయిక మని మూఁడు విధములు. మానసికక్రియ మతి యనంబడును, వాచికక్రియ గీతి యనంబడును, కాయిక క్రియ నీతి యనంబడును, మతి యనఁగాఁ దనశక్తికిఁ దగు నిష్టానిష్టపరిజ్ఞానము. గీతి యనునట్టి జ్ఞానమును వెలిబుచ్చు శబ్దజాలము. నీతియన నాహారవిహారాదికము. మానసికక్రియయగు మతి యప్రత్యక్ష మగుటచే బాహ్యములును బ్రత్యక్షములు నగు గీతినీతులచే నూహింపఁబడవలసినదే. మానసిక వ్యాపారమునకు ననుగుణంబుగ గీతినీతు లుండునని శ్రుతివాక్కుచే నైననేమి లోకానుభవంబుచే నైననేమి సుస్పష్టముగాఁ దెలియనగును. శ్రుతి "యన్మనసా మనుతే తద్వాచావదతి తత్కర్మణా కరోతి" యని యనుభవానువాదకం బగు శ్రుతి యఖండ తేజంబునఁ బరగుచున్నది. ఇట్టి మతిగీతినీతులు సర్వప్రాణులకును జాతితోడ నవినాభావసంబంధమును గల్గియుండును. ప్రతిజాతికిని నియతమగు నాకృతి యెట్టులు సృష్టియందుఁ దెలియవచ్చుచున్నదో యాతీరున నీ మతిగీతినీతులు గూడ నియతములుగ దెలియవచ్చుచుండును. ఆకృతియన రూపము. ఇట్టి యాకృతిమతిగీతినీతులు నాల్గును జాతి

విభజనోపాధులుగ బుధులచే నెన్నఁబడుచున్నవి. పశుపక్ష్యాదులందు నీనాలుగుపాధులచే జాతు లెట్లు జన్మయం దతిశయమును గనుచుండునో యాతీరుననే మానవులందుఁగూడ నీ నాలుగు పాధులచే జన్మతోడ జాతు లతిశయమును గనుచున్న వనునది సుకరముగాఁ దెలియవచ్చుచున్నది. ఇట్లు తెలియవచ్చు న్యాయమునే బుధులిట్లు నిర్వచించియున్నారు.

సర్వేషాం జన్మనా జాతి ర్నాన్యథా కర్మకోటిభిః
పశ్వాదీనాం యథా జాతి ర్జన్మనైవ న చాన్యథా.

కావున మానవజాతియంతయు నొక్కటియే కాని యం దవాంతరజాతిభేదములు లేవని చెప్పుట కడు సాహసము, లోకానుభవవిరుద్ధము, హాస్యాస్పదమును. మానవజాతి యంతయు నొక్కటియే; అం దవాంతరజాతుల కవకాశము లేదని చెప్పినచో, జరాయుజము లన్నియు నొక్కటియే యం దవాంతరజాతిభేదము లేదని చెప్పి తీరవలయును. ఆతీరుననేయండజములం దవాంతరజాతిభేదము లేదని చెప్పితీరవలయును. ఒకవేళ జెప్పినఁ జెప్పవచ్చును గాని యయ్యది మూర్ఖప్రలాపముగాఁ బరగును గాని ప్రాజ్ఞ జనానుమోదక మెంతమాత్రమును గానేరదు. పశువు లన్నియు ముఖాద్యవయవములచే నొక్కపోలికగా నున్న నందలి యవాంతరభేదము లత్యంతసుగమంబులుగదా! ఆతీరుననే యవాంతర జాతిభేదము మానవజాతికిఁగూడ జన్మతోడ సహజసిద్ధం బని తెలిసికొనుట యుక్తియుక్తంబుగాకపోవుట లేకుండుట యటులుండ నయ్యది యుక్తిసహంబును లోకానుభవసిద్ధంబును గూడ నగుచున్నది. దానంజేసియే పశ్వాదులకును మానవులకును సృష్టియందలి న్యాయములు సమానములే యని కోవిదు లెల్లరును "ఆహారనిద్రాభయమైథునం చ సామాన్య మేత త్పశుభి ర్నరాణామ్" అని సామాన్యముగా వచించుచున్నారు.

శ్రీశంకర భగవత్పాదాచార్యులన్ననో తమ శారీరకభాష్యమున "పశ్వాదిభి శ్చావిశేషాత్" అని నిర్వచించియున్నారు. కావున మానవకోటియందుఁగూడ పశ్వాది జాతులందువలెనే యనేకజాతులున్నవని రూఢిగాఁ దెలియనగును. అంతియగాదు. అయ్యవి పుట్టుకతోడనే సిద్ధమగుచున్నవి. చావుతోడ నశించుచున్నవి. మధ్యకాలంబున నభివృద్ధిఁజెందుచున్నవి. కాని మధ్యకాలంబున నెట్టి యతిశయంబు చేతను జాతిమారుననుట సృష్టితత్త్వ విరుద్ధము. అయినను మానవజాతికిని మిగిలిన పశ్వాదిజాతులకు నొక మహత్తరమగు భేదము గానఁబడుచున్నది. అదెద్ది యనఁ బశ్వాదిజాతులవ్యవహారమంతయు స్వభావముచేతనే నియమింపఁబడుచున్నటులఁ దెలియవచ్చెడిని. మానవజాతియం దన్ననో యట్టి నియతస్థితియం దుండక వ్యవహారమంతయు నత్యద్భుతములగు న్యూనాతిరేకములతో నొప్పు.

నటుల దెలియవచ్చుచున్నది. ఇట్టి న్యూనాతిరేకమునకు గల కారణము జ్ఞానశక్తి యనఁబడుచున్నది. ఇట్టి జ్ఞానశక్తి పశ్వాదులయందు నియతముగ నుండుటంజేసి పశ్వాదులందు లేదనునంతటి వ్యవహారమును గనుచున్నది. దానంజేసియే బుధులు మానవులయొక్క యాధిక్యమును "జ్ఞానం హి తేషా మధికో విశేషః" అని నిర్వచించియున్నారు. ఇట్టి జ్ఞానము మానవకోటియందుఁ గ్రమక్రమముగాఁ బ్రయత్నముచే నభివృద్ధిఁ జెందు స్వభావమును గల్గియుండుటవలన నద్దానిని సంపాదించుకొననిచో బశువునకును మనుజునకును భేద మించుకంతయు లేదని బుధులు "జ్ఞానేన హీనః పశుభిః సమానః" అని వక్కాణించి యున్నారు. ఇచ్చట జ్ఞాన మన శాస్త్రాచార్యోపదేశమువలన గ్రహింపఁదగు నాత్మానాత్మవివేకపురస్సరం బగు విధి ప్రతిషేధ శాస్త్రజ్ఞానమను ప్రయత్న పూర్వకముగాఁ బొందగల్గు శక్తియని యాశయము. దీనినే కర్తృత్వ మని కోవిదులు సర్వసాధారణముగాఁ జెప్పుదురు.

ఇఁక మానవజాతులయందలి తరతమ భావముల నొకింతఁ దెలిసికొనుట యావశ్యకము. పశ్వాదులు క్రియాభేదంబుచే సాత్త్వికంబులు, రాజసంబులు, తామసంబులు, మిశ్రస్వభావము లనియుఁ దెలియఁబడుచున్నవి. సుస్పష్టమగు క్రియాభేదము కాయికంబగు నీతియందే. నీతియన నాహారవిహారాదిక మని లెస్సగఁ దెలియునది. అట్టి నీతిభేదముచేఁ సాత్త్వికాదిభేద మత్యంతము సుస్పష్టముగఁ దెలిసికొనఁబడుచున్నది. ఆహార నిద్రాభయ మైథునంబులు సకలప్రాణులకును సహజధర్మంబు లైనను నయ్యవి సాత్త్వికాదిభేదంబులచే మహత్తరంబులగు భేదంబులతో నొప్పుచున్నవి. ఒక్కొక్క యవాంతరజాతికి నొక్కొక్కవిధ మగు నాహారము నట్టి యాహారభేదముచే నట్టి యాహారమును సంపాదించుకొను వ్యాపారభేదమును దెలియవచ్చుచున్నది. ఇట్టి విషయము నొకింత స్థూలదృష్టాంతముతో నుదాహరించుచున్నాము. పశుపక్షులలోఁ గొన్ని మాంసమును దినునవి. కొన్ని ధాన్యాదులను దినునవి. కొన్ని ఫలాదులను దినునవి. కొన్ని పక్షిజాతులు కొన్నిపక్షిజాతుల కాహారము లగుచున్నవి. కొన్ని జంతువులు కొన్ని జంతువుల కాహారము. గోవులు బఱ్ఱెలు మేకలు గొఱ్ఱెలును కేవలము గడ్డి యాకులు లోనుగాఁ గల పదార్థములఁ దినును. సింహము పులి లోనుగాఁ గల మృగములు మాంసమును దినును. గుఱ్ఱములు, ఏనుగులు లోనుగాఁ గలవి ధాన్యములను గడ్డిని యాకులను దినును. కోఁతులు కాయగూరలను దినును. ఈ తీరుననే పక్షులందును భేదమును గనవచ్చును. ఇట్టిభేదములతోఁ దెలియవచ్చెడి పశుపక్ష్యాదులయందలి యవాంతరజాతులయందుఁ గన్పట్టెడి ధర్మసూక్ష్మములు పెక్కులు గలవు. అందు గొన్నిఁటి సామాన్యమగువాని నుదాహరించుచున్నాము. గోవులకు సహవాస సంసర్గములు సహజసిద్ధములు. సంసర్గ మన స్త్రీపురుషసంబంధము. గోవులకును మహిషములకును సహవాసమాత్రమే సంసర్గ మసమంజసము. ఆతీరుననే మేకల

కును గొఱ్ఱెలకును సహవాసము సమంజసము. గోవులకును గుఱ్ఱములకును సహవాసము బాధకము గానేరదు. వ్యాఘ్రమునకును గవాదులకును సహవాస మసమంజసమును బాధకమును. అవాంతరజాతులలోఁ గొన్నిఁటికి సహవాసము సమంజసమైనను సంసర్గ మెంతమాత్రమును న్యాయసహము కానేరదు. ఒకానొకచో నీవైద్వైవమ్యముచేఁ నశ్వగర్దభంబులకుంబోలె సంసర్గము గల్గిన నయ్యది సంకరజాతులకుఁ గారణమై జాతిపారిశుద్ధ్యమును జెఱచుటకుఁ గారణమగును. జాతిపారిశుద్ధ్యము చెడుట యన నాజాతి యంతరించుట యని యభిప్రాయము.

అస్పృశ్యత:— ఇట్టి యద్భుతధర్మంబులతో నొప్పుచుండు నవాంతరజాతుల పారిశుద్ధ్యమును గాపాడి సకలప్రాణులను బోషించి సృష్టివైచిత్ర్యంబును జక్కఁజేసి పరమప్రయోజనంబును సకలప్రాణులకు సమకూర్ప నొక మహాశక్తి నప్పరమేశ్వరుండు సృష్టితోడనే ప్రసరింపఁజేసియున్నాఁడు. అట్టి మహాశక్తియే యస్పృశ్యత యను నామముతోఁ గొనియాడబడుచున్నది. ఇట్టి యస్పృశ్యతగూడ వాచిక కాయిక మానసిక భేదములచే మూఁడువిధములు. ఇట్టిత్రివిధరూపమగు నస్పృశ్యత లోకంబున నియతమగు దేశకాలపాత్రంబులుగాఁ బరిణామముఁ జెంది సకలము లగు నవాంతరజాతుల శ్రేయోభివృద్ధికిఁదోడుపడుచున్నది. జగదన్తఃపాతులగు జ్యోతిర్మండలముల నన్నిఁటిని నియతవ్యాపారమున నుంచు జగదాకర్షణశక్తిని బరమేశ్వరుఁ డెట్లు ప్రసరింపఁ జేసియుండెనో యాతీరున నీ యస్పృశ్యతను బ్రాణిలోకంబునందలి యవాంతరజాతులను నియతవ్యాపారములందు నుంచుటకుఁ బ్రసరింపఁజేసినట్లు ధీమంతులు గ్రహించుదురుగాక!

ఇట్టి యస్పృశ్యతామతల్లియొక్క మూర్తిభావములో యన జగంబున నలరారుచుండు నరణ్యములు పర్వతములు నదులు గుహలు తరుగుల్మలతాదులు, ఇండ్లు గ్రామములు, పట్టనములు మొదలగు నిర్మాణములు విజృంభించియున్నవి. అస్పృశ్యతాశక్తియే లేనిచో నిట్టి యద్భుతము లగు నిర్మాణములు సృష్ట్యాదినుండియు నేటివఱకు నభివృద్ధి నొందుచు నిలిచియుండుట కిసుమంతయు నవకాశము లేకుండెడిది. ఇట్టి వ్యవస్థలచేఁ బ్రపంచమంతయు నప్రతిహతముగా వ్యాపించియుండుట వలన నస్పృశ్యతాశక్తి సృష్టియందు సర్వవిధముల మూర్తీభవించి నృత్యము నలుపుచు సకలప్రాణులయొక్కయు శ్రేయోఽభివృద్ధికిఁ దోడ్పడుచున్నదనియే తెలిసికొనితీరవలయును. ఇట్టి యస్పృశ్యత నుల్లంఘించుటవలన మహత్తరమగు ననర్థము వాటిల్లు నని భగవదాశయము.

మానవజాతివైచిత్ర్యము:—మానవజాతియందుఁగూడఁ బశ్వాదులయందు వలె నవాంతరజాతిభేదము లుండినచో నట్టి యవాంతరజాతులను గుర్తెఱుంగు సాధన మెద్ది యని యెల్లరకు సందియము గల్గుగావున నద్దాని నొకింత నిరూపించుచుంటిమి.

పశుపక్ష్యాదులయందలి జాతిభేదము లెట్లు రూపక్రియల ననుసరించి యున్నవో యాతీరుననే మానవజాతియందలి యవాంతరభేదములుగూడ రూపక్రియల ననుసరించియే యున్నవి. రూపక్రియలు రెండును పశ్వాదులకుఁ బ్రతిప్రాణికిని మాతృగర్భమునుండి యెటుల సహజముగ నలవడుచున్నవో యాతీరుననే మానవ జాతియందలియవాంతరభేదములు గూడ రూపక్రియల ననుసరించియే యున్నవి. అయ్యవి ప్రథమమున బీజరూపమున నవ్యక్తముగా నుండి సకాలమున ననువగు దోహదముచే వ్యక్తీభావముఁ జెందును. అదెట్లనఁ బురుషునకును స్త్రీకిని బాల్యమున గడ్డము, మీసము, స్తనములు మొదలగు నవయవములు లేకపోయినను సకాలమున నియతముగా నాయా జాతికి ననువగునటుల నుద్భవించుచున్నవి. శిశువునకు జననకాలంబున నట్టి మీసంబులు స్తనములు లోనగువానియొక్క బీజములే లేకపోయినచో నయ్యవి యెల్లరకు ననియతముగా జనింపవలయును. అట్లు కనఁబడుట లేదుగావున, గాలక్రమమున దేజరిల్లు జాతిధర్మములు గూడ బీజరూపంబున జన్మతోడనే సిద్ధమగుచున్నవి. దానంజేసి జాతికి యుక్తమగురూపక్రియలు జన్మచే సిద్ధమగునవియేగాని మరియొకవిధమున ఘటించునవి కావు. ఇదివఱకు, క్రియ కాయికము వాచికము మానసిక మనియు, నీ మూఁడు నవాంతరజాతిభేదముచే భేదము గనుననియుఁ బశుపక్ష్యాదుల స్వభావమును విమర్శించునపుడు వక్కాణింపఁబడియె. క్రియ యెట్టులు మూఁడువిధములో యా తీరుననే రూపమను నామముచేఁ బరగు శరీరముగూడ స్థూలము సూక్ష్మము గారణమనియు మూఁడువిధములు. బాహ్యమునకుఁ దెలియవచ్చెడి కరచరణాద్యవయవవిశిష్టమగు రూపము స్థూలశరీరము. దీనిని సర్వవిధముల నడిపించునది సూక్ష్మదేహము. ఇయ్యది స్వప్నకాలంబునఁ బృథగ్వ్యవహారమును గనుచు దెలియుచున్నది. ఈ రెంటికిని గారణభూతము కారణశరీరము. ఇయ్యది సూక్ష్మశరీరమునకు బీజము. కారణమందలి వైచిత్ర్యము ననుసరించి సూక్ష్మమునందలి వైచిత్ర్యము సూక్ష్మమునందలి వైచిత్ర్యము ననుసరించి స్థూలభేదమును గల్గుచున్నదని శాస్త్రయుక్త్యనుభవములచేఁ దెలియవచ్చెడిని. ఒక యవాంతరజాతి జంతువుయొక్క దేహమా జన్మయం దెట్లు మఱియొక యవాంతరజాతిదేహముగా మారుటకు నవకాశము లేదో యాతీరుననే మానవజాతి యందుఁగూడ నొక యవాంతరజాతిదేహము మఱియొక యవాంతరజాతి దేహముగా నాజన్మయందు మారుటకు నెంతమాత్రమును వీలులేదు. అదెట్టు లనిన నెంత ప్రయత్నము చేసినైనను బెద్దనక్కను బెబ్బులిగాఁగాని చిరుతపులిగాఁగాని, బెబ్బులిని గంగగోవుగాఁగాని, కాకిని జిలుకగాఁగాని చిలుకను గొంగగాఁగాని మార్చుట యెటుల దుర్ఘటమో యటులనే శూద్రుల నొకజన్మంబుననే బ్రాహ్మణునిగాఁగాని బ్రాహ్మణుని శూద్రునిగాఁగాని యింక నేవిధముగాఁగాని యిచ్చవచ్చినటుల నే దయామయుఁడును జేయునవకాశము సృష్టియందుఁ గాన్పింపదు.

కారణశరీరంబు సాత్త్విక రాజస తామస మిశ్రాది భేదములతో నొప్పు చుండు. దానంజేసి రూపక్రియలు భేదము నొందుచుండు. క్రియాభేదము సుస్పష్ట మగు భేదహేతువు. ఇట్టిక్రియ జన్మసిద్ధమే. మానవకోటియందలి మానసికక్రియ మతరూపముగను, వాచికక్రియ మతమును వ్యక్తీకరించు శబ్దరూపముగను, కాయికక్రియ సహజసిద్ధ మగు నాహారవిహారవ్యవహారరూపముగను బరిణమించు చున్నది. జాతిభేదమునకు మూలము మతభేదము, పిమ్మట శబ్దభేదము. పిమ్మట గ్రియాభేదము. మతము క్రియయు నొక్కతీరుననే యొప్పుచుండు. శబ్దభేద మత్యంత భేదహేతువు గానేఱదు. గోవునకును మహిషమునకును శబ్దభేద ముండిన నయ్యది విపులవైషమ్యహేతువుగాదు. ఆతీరుననే మేకకును గొఱ్ఱెకును. ధర్మసా మ్యముచే నైకమత్యమును ధర్మవైషమ్యముచే విరోధమును గల్గుచుండును. పరిశీ లించి చూడ నవాంతరజాతులయందుఁ గల సాదృశ్యాతిశయము మైత్రికిని, వైష మ్యాతిశయము విరోధమునకును, సాదృశ్యవైషమ్యతరతమభావం బుభయ ధర్మ ములయందలి న్యూనాతిరేకంబులకును గారణ మగుచున్నది.

ఇట్లు సకలపురుషులయొక్క ప్రవృత్తియు నాయాయి పురుషులకు స్వభా వసిద్ధమగు కామనాపూర్వక మని—

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి." (గీ. 3-33)

అను గీతముచే నిర్వచింపఁబడియున్నది. ఆయాయి పురుషులయొక్క కామ నాభేదముచేఁ బ్రవృత్తిభేదము, ప్రవృత్తిభేదముచే నుపాయభేదము వ్యాపారభేదము నను లోకవ్యవహారము స్వభావసిద్ధముగా ననాదినుండియుఁ బ్రవర్తించుచున్నటుల సార్వజనీనమగు ననుభవము మానవకోటియందు నేయే పురుషులయొక్క ప్రవృ త్తి యే యే తీరున బరగుచున్నను సకల ప్రవృత్తులును దైవప్రకృతి యాసుర ప్రవృత్తి యను ద్వివిధప్రవృత్తులలో నెద్దానియందైన నంతర్భవించుచుండును. దైవప్రవృత్తి పురుషునకును లోకమునకు నుత్తమగతిసాధన మనియు నసుర ప్రవృత్తి పురుషునకును లోకమునకును బాధకమనియును—

"దైవీ సంప ద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా" (గీ.16-5)

అను గీతముచే నిర్వచింపఁబడుచున్నది. దైవసంపద్విశిష్టుల యందలి గుణ కర్మ వైచిత్ర్యము ననుసరించియే వర్ణాశ్రమధర్మము శ్రుతిస్మృతులచే నుపదే శింపఁబడుచున్నది. ఇయ్యదియే వర్ణాశ్రమధర్మవైచిత్ర్యమునకుఁగల యుపపత్తి.

## —* మ ర ణా నం త ర ము *—

లోకములోఁ బ్రతిమానవునకును సకలవ్యక్తులందును మరణమను విషయ మొకటి పరిదృశ్యమాన మగుచున్నది. అట్టి మరణమును దప్పించుకొనవలయునను ప్రయత్నము చేయుటకూడ సకలప్రాణులకును సహజసిద్ధముగాఁ గాన్పించు

చున్నది. ఇట్టి విషయమున మరణానంతరమునఁ బ్రాణుల కెట్టి పరిస్థితులు లభించు చుండునను విషయము బుద్ధిశాలియగువానికిఁ దట్టుటయు నద్దానిఁగూర్చి యెద్దియేని సమాధానమును బడయవలయుననునిచ్ఛయు గల్గుచుండును. కావున నద్దాని నీగీతా శాస్త్రముఖమున గమనించుటప్రయోజనకరము. దేహపాతానంతరవిషయమును గూర్చి శ్రీకృష్ణభగవానుఁ లుపదేశప్రారంభమునుండియు నంతమువఱకు నచ్చటచ్చట పలువిధములుగ ముచ్చటించుచునే యున్నారు.

1 "దేహినోఽస్మి న్యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తిః" (గీ. 2-13)

2 "న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః" (గీ. 2-20)

3 "హతో వా ప్రాప్స్యసి స్వర్గం" (గీ. 2-35)

4 "ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి." (గీ. 2-72)

5 "బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!" (గీ. 4-5)

6 "త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున" (గీ. 7-9)

7 "గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః" (గీ. 5-17)

8 "స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి" (గీ. 5-24)

9 "ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే"
"అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్". (గీ.6-41,42)

10 "బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే." (గీ. 7-19)

11 "దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి" (గీ. 7-23)

12 "అంతకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః"

13 యం యం వాఽపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరమ్,
తం త మేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః." (గీ. 8-5,6)

14 "ఓమ్" ఇత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్." (గీ.8-13)

15 మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః." (గీ. 8-15)

16 "అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః."

17 ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్.
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే." (గీ. 8-24,25)

18 "తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్"
"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" (గీ. 9-20,21)

19 "యాంతి దేవవ్రతా దేవాన్ పితౄ న్యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్" (గీ. 9-25)

20 "యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే."

21 "రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే." (గీ. 14-14-15)

22 "గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే" (గీ. 14-20)

23 "ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ" (గీ. 16-16)

24 "తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు."

25 "ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యా న్త్యధమాం గతిమ్"
(గీ. 16-19,20)

26 "అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్. (గీ. 18-12)

27 "సోఽపి ముక్త శ్శుభాం ల్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్."
(గీ. 18-71)

ఇచట నుదాహరింపఁబడిన గీతముల నామూలాగ్రముగ విచారించినచో దెలియవచ్చెడి విశేష మేమన: ప్రాణు లన్నిటికిని మరణానంతర మెద్దియో యొక తీరు పరిస్థితులు మాత్రమే ఘటింపక పలువిధములగు పరిస్థితు లధికారితారతమ్యముచేఁ గలుగునట్లు పుష్కలముగాఁ దెలియుచున్నది. అ వెవ్వియన (1) బ్రహ్మభావము. (2) బ్రహ్మలోకప్రాప్తి. (3) స్వర్గలోకప్రాప్తి. (4) నరకము.

(౫) పునర్జన్మ (౬) అవాంతర లోకప్రాప్తియు నని సర్వసామాన్యముగా విభజింప నగును. ఇందు దైవసంపద్విశిష్టులకుఁ దరతమభావముచే బ్రహ్మభావము, బ్రహ్మలోకప్రాప్తి, స్వర్గలోకప్రాప్తి యను మూఁడింటిలో నెద్దియేని యొకటి లభించును. అందు బ్రహ్మభావమనఁ బరమపురుషార్థరూప మగు ముక్తియే. ఇట్టిభావము నొందినవారలు సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమును నిరతిశయము నగు పరమానందరూపులై యెన్నటికిని జననమరణ ప్రవాహరూపమగు సంసారముతో నెవ్విధమైన సంబంధములు లేకుండ మనియుదురు. బ్రహ్మలోకమును బొందినవార లన్ననో కల్పాంతమువఱకు నిరంతరము బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై వర్తించుచుఁ గల్పాంతమున నిరతిశయ బ్రహ్మభావము నందుదురు. వారలకును జననమరణరూపసంసారముతో నెట్టిసంబంధమును గలుగదు. ఇఁక స్వర్గలోకమును బొందినవార లన్ననో తాము సంపాదించిన పుణ్యము నశించువఱకును స్వర్గలోకమునందు నా పుణ్యఫలము ననుభవించి పిమ్మట స్వర్గానుభవమునకు యోగ్యత చాలని శేషకర్మముతో నీ భూలోకమున నా శేషించిన కర్మకనువుగ గర్మాధికారయోను లగు ద్విజయోనులందు జనింతురు.

ఆసురసంపద్విశిష్టులు తమ యాసురకృత్యముల కనువగు నారకలోకములను బొంది యచ్చట దుఃఖముల ననుభవించి పిమ్మట యథోచితముగ నీ భూమియందు నారకయోనులందును దిర్యక్ స్థావరాదియోనులందును జన్మింతురు. ఆసురసంపద్విశిష్టుల యందలి యాస్తికులు వారి వారి కభిమతములగు గణదేవతాలోకములను బొంది యటనుండి తదనుగుణంబగు నాసురయోనులందు జన్మల నందుచుందురు. బ్రహ్మభావమును జెందినవారలును బ్రహ్మలోకముఁ బొందినవారును దక్క తదితరు లందరు నెద్దియో యొక తీరున బ్రహ్మభావమునుగాని బ్రహ్మలోకమును గాని పొందుటకుఁ దగు నధికారమును సంపాదించుకొనువఱకు నెద్దియో యొకతీరున జననమరణము లనెడి రాకపోకలతోఁ గూడిన సంసారమునందుఁ దమతమ కర్మానుగుణముగఁ జిక్కి చరింపవలసినదే. ఇట్లు సంసారమునఁ జిక్కువడి క్లేశముఁ జెందువారల నట్టి క్లేశమునుండి తప్పించి క్రమముగా బ్రహ్మలోకమును గాని బ్రహ్మభావమునుగాని పొందించుటయే పరమ తాత్పర్యముగాఁ గల్గి వర్ణాశ్రమ ధర్మమందలి సోపానములు శ్రుతిస్మృతులచే నెలకొల్పఁ బడుచున్నవి. ఇట్టి వర్ణాశ్రమ ధర్మమునే వైదికధర్మ మనియు ధర్మమనియు గోవిదులు చెప్పుచున్నారు. ఇట్టిధర్మముయొక్క యుపపత్తిని సంక్షేపముగాఁ బ్రదర్శించుటయే యీ యోగశాస్త్రమను పేరఁ బరగు సుదర్శనమునకుఁ బరమ తాత్పర్యము.

# అధ్యాయతాత్పర్యసంగ్రహము.

శ్రీకృష్ణభగవానులచే శ్రుతిస్మృతి చోదితమగు వర్ణాశ్రమ ధర్మము యొక్క యుపపత్తి శాస్త్రయుక్త్యనుభవములచేఁ బ్రదర్శింపఁబడి యర్జునునకుఁ గర్తవ్యాంశమును బోధించుటకై యీ గీతాశాస్త్ర ముపక్రమింపఁబడుచున్నది. కావున నీ వర్ణాశ్రమ ధర్మముతో సంబంధించిన విషయము లన్నియు నిందు సంక్షేపముగ నుచ్చటింపఁబడి యున్నవి. అట్టి విషయముల సర్వసామాన్యముగా దెలిసికొనవలయు ననినచో నీ శాస్త్రమునందు వివరింపఁబడిన యధ్యాయము లందలి విషయముల నొకింత గమనించినచో దెలియవచ్చెడి. కావున జిజ్ఞాసువుల యుపయోగమునకై యాయాయి యధ్యాయముల యొక్క తాత్పర్యము సంగ్రహముగా నిరూపింపఁ బడుచున్నది.

(1) అర్జున విషాదయోగము:—

ఈ యధ్యాయ మీ యోగశాస్త్రమున కుపోద్ఘాతముగా నొప్పుచున్నది. ఈ యోగశాస్త్ర మేకాలమున నేస్థలమున నేతరుణమున నెందులకు శ్రీకృష్ణ భగవానులచే నర్జునున కుపదేశింపబడెనో యద్దానిని బ్రదర్శించుట యటుండ నీ గీతాశాస్త్రమునకుఁ దగు నధికారిని ముఖ్యముగాఁ బ్రదర్శించుటయే పరమ తాత్పర్యముగాఁ గల్గియున్నది. ప్రకృతమున నర్జునున కీగ్రంథ ముపదేశింపఁ బడుటచే నర్జునునితోఁ దుల్యమగు స్వభావము కలవార లందరు నీ యోగశాస్త్ర మున కధికారు లని నిస్సందేహముగాఁ దెలిసికొనఁదగిన విషయమే. అర్జునుని స్వభావ మెట్టిదన—

"మా శుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!" (గీ.16-5)

అను గీతముచే నర్జునుఁడు దైవసంపద్విశిష్టుఁడని శ్రీకృష్ణభగవానులచే నభి నందింపఁబడుచున్నాఁడు.

"ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే" (గీ.2-31)

"సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్" (గీ. 2-32)

"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి" (గీ.3-20)

ఈ గీతములచే నర్జునుఁడు క్షత్రియ వీరుఁడుగ బ్రశంస జేయఁబడు చున్నాఁడు. దీనినిబట్టి యర్జునుఁడు దైవసంపద్విశిష్టుఁడగు క్షత్రియయోధాగ్రే సరుడుగ నున్నాఁడు. ఇంతియేగాక యాతఁడు ధర్మరాజునొద్ద పీఠమర్దుఁడుగ గూడ

నున్నాఁడు. భారతయుద్ధము నారంభింప రణరంగమున సర్వవిధముల సంసిద్ధమైన వాఁడు, శ్రుతిస్మృతులయందుఁ బ్రమాణభావము గలిగినవాఁడు, పూజ్యులగు పెద్దలయందు శ్రద్ధాభక్తులు గలిగినవాఁడు, శాస్త్రాచార్యోపదేశమునందు దృఢమగు విశ్వాసము గలిగినవాఁడు. ఇట్టివాఁడయ్యును సకలప్రాణిసహజసిద్ధం బగు మరణభీతిచేఁ గ్రుంగినవాఁడై తాఁ జేయవలసిన ధర్మ్యయుద్ధమును విడనాడి మరలి పోవ సమకట్టి యందుల కొకింత శాస్త్రయుక్తులను బొందికచేసి గంభీరోపన్యాసమును గావించియున్నట్లీ యధ్యాయముచేఁ దెలియవచ్చుచున్నది. భయముచే వ్యామోహముఁ జెందినవాఁ డెంతటి బుద్ధిమంతుఁడయ్యు ప్రమాదముఁ జెందుట యొక వింతగాదు. ప్రమాదముఁ జెందినవాఁ డట్టి ప్రమాదమును దెలిసికొనఁగలిగె నేని యథోచితస్థితిని బడయుటయును సుకరమే. అట్టి ప్రమాదమునుండి యర్జునుని దొలగించి యథోచితస్థితియం దాతని బ్రవర్తింపఁ జేయుటకై యీగీతాశాస్త్రము ప్రవర్తించినది. కావున నీగీతాశాస్త్రము దైవసంపద్విశిష్టులును శ్రుతిస్మృతిసదాచారబద్ధులునగు ద్విజులు ప్రమాదముఁ జెందకుండ సత్పథము నాశ్రయించునట్లు చేయుటకుఁ దగు నుపదేశముతో నొప్పుచుండుటంజేసి యట్టివార లందఱు నీ గీతాశాస్త్రమున కుచితమగు నధికారు లని మొదటి యధ్యాయపు తాత్పర్యము.

ఇం దర్జునుఁడు యుద్ధమునుండి విరమించుటకుఁ బ్రదర్శించిన హేతువులందుఁ బ్రాజ్ఞులు గమనింపఁదగు ధర్మసూక్ష్మ మొకండు గలదు. అదెద్ది యన—

> స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః
> సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
> పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః
> దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
> ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః
> ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
> నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. (గీ. 41-44)

వర్ణసంకరము సర్వానర్థములకును నిదాన మనియు నయ్యది స్త్రీలు దుష్టత్వముఁ జెందినచోఁ గల్గుననియు, వర్ణసంకరము గలుగకుండ లోకసంగ్రహమును గావించువాఁడు స్త్రీలు కుమార్గములఁ జొరకుండఁ గాపాడవలయు ననియుఁ దెలియవచ్చెడిని. ఇందు వర్ణసంకరము కాకుండ లోకమును గాపాడుట కర్తవ్యాంశముగాఁ దెలియవచ్చుచున్నది. వర్ణసంకరమునకు స్త్రీలు చెడుట యొక కారణము. కావున స్త్రీలు సత్ప్రవర్తనమునం దుండునట్లును, వర్ణములు సాంకర్యముఁ జెందకుండగను లోకసంగ్రహకాములు వర్తింపవలయునను నీతి యర్జునునివలన లోకము గ్రహించునది.

(2) రెండవయధ్యాయము:—

రెండవ యధ్యాయమునకు సాంఖ్యయోగమని పేరు. సాంఖ్య మనఁగా జ్ఞానము. ఎట్టి జ్ఞానమును శ్రుతిస్మృతులు లోకసంగ్రహమునకై యుపదేశించుచున్నవో యట్టిజ్ఞానవిశేష మీయధ్యాయమునందు శ్రీకృష్ణభగవానుల యుపదేశముగా నొప్పుచున్నది. ఇం దుపదేశింపఁబడిన జ్ఞానము సాంఖ్యము యోగమను పవిత్రములగు రెండు నామములచేఁ బేర్కొనఁబడినట్లు—

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు"

(గీ.2-30).

అను గీతముచేఁ దెలియవచ్చుచున్నది.

సాంఖ్య మనుపేర నుపదేశింపఁబడిన సిద్ధాన్తము లెవ్వియన—

1 ఆత్మస్వరూపము:—

ఈ ప్రకరణమునందు నాత్మ 'దేహి' యను శబ్దముచే నిరూపింపఁబడి దేహములకంటె విలక్షణమనియు నిత్యము సర్వగతము నిర్వికారము సనాతనము షడ్భావవికారరహితము కూటస్థమునగు సచ్చిదానందరూపమనియు నయ్యది సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై యఖండముగా నొక్కటియే యై యున్నదనియును జెప్పఁబడుచున్నది. పరిదృశ్యమానము లగు నీ దేహము లన్నియు నశించినను నాత్మ స్థిరత గనుచున్న దని—

"అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య" (గీ. 2-18)

అని యుపదేశింపఁబడుచున్నది.

2. దేహములతత్త్వము:—

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ" (గీ. 2-28)

అను గీతముచే నీ పరిదృశ్యమానములగు దేహము లన్నియు నదృష్ట దృష్ట ప్రణష్ట స్వరూపము లగుటంజేసి మిథ్యాభూతము లని యుపదేశింపఁ బడుచున్నది. దేహియగు నాత్మ సత్యము, పరిదృశ్యమానములగు దేహములు మిథ్య యను సిద్ధాన్తము తత్త్వదర్శులయొక్క నిర్ణయమని కూడ—

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
"ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః" (గీ.2-16)

అను గీతముచే నిర్వచింపబడుచున్నది.

**3. ఆత్మజ్ఞానఫలము:—**

"వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః, పార్థ! కం ఘాతయతి హంతి కమ్." (గీ. 2-21)

అను గీతముచే సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత మగు నాత్మయే స్వస్వరూపముగాఁ దెలిసికొనినవాఁడు కర్తృత్వ కారయితృత్వములు దొలఁగ సర్వక్రియా నివృత్తిరూపమగు నైష్కర్మ్యభావమును బొంది నిరతిశయమగు శాంతిని బొందునను మహాఫల మాత్మజ్ఞానమునకుఁ జెప్పబడుచున్నది.

**4. శాంతిసాధనము:—**

"విహాయ కామా న్య స్సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి." (గీ. 2-71)

అను గీతముచే సమస్తకామములను విడచి యనఁగా సర్వకర్మసంన్యాసమును గావించి విషయములందించుకంతయైనను స్పృహ లేకుండ నహంకారమమకార రహితముగా వర్తించువాఁడు శాంతిని బొందు ననుటచే నహంకారమమకార రాహిత్యపురస్సరం బగు సర్వకర్మసంన్యాసము శాంతికి నంతరంగసాధనముగా విధింపఁబడుచున్నది.

**5. శాంతియే ముక్తి:—**

"ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" (గీ. 2-72)

అను గీతముచే నిరతిశయమగు శాంతియే బ్రాహ్మీస్థితి యనియు నద్దాని నెప్పుడు పొందిన నప్పుడే బ్రహ్మభావాపత్తిరూపమగు బ్రహ్మనిర్వాణమును బొందునను ఫలశ్రుతిచే నైన నుపదేశింపఁబడిన సాంఖ్య మనుజ్ఞానమునకు బ్రహ్మనిర్వాణము ఫల మని తెలియ వచ్చెడిని.

**6. కర్మయోగమందలి సిద్ధాన్తము :—**

అహంకార మమకార రాహిత్య పురస్సరంబగు సర్వకర్మ సంన్యాసమును జేయుటకు శక్తి చాలనివాఁడు తనయంతఃకరణమునందలి కాలుష్యము తొలఁగు వఱకు గర్మయోగము నాచరించి తీరవలయు నను విధిని యర్జునుని ముఖమున—

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి" (గీ. 2-53)

అనుగీతముచే, గర్మయోగానుష్ఠానమునకు నవధి చెప్పబడి,

"యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే" (గీ.2-48)

అను గీతముచే నిష్కామకర్మానుష్ఠానము కర్మయోగముగా నుపదేశింపఁబడుచున్నది.

యోగానుష్ఠాతకుఁ బ్రతిబంధము—

"యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా." (గీ.2-60,61)

యోగానుష్ఠాతకు విషయములందుఁ బ్రసరించు నింద్రియములు ప్రబల శత్రువులుగాఁ బరిణమించి ప్రతిబంధమును గలుగఁజేయును గావున యవ్వానిని యోగానుష్ఠాత ప్రథమమున నిగ్రహించి తీరవలయు ననునది జిజ్ఞాసువునకు హితశాసనము—

7. నిష్ఠాస్వరూపము.

సాంఖ్యము యోగమను ద్వైవిధ్యముతో నొప్పు పలువిధములగు నభిప్రాయములఁ బలువురు స్వస్వమనీషానుగుణముగ వర్ణింతురు. శ్రీకృష్ణభగవానుల యాశయమందలి నిష్ఠాస్వరూపము సయుక్తికముగా దిఙ్మాత్రము ప్రదర్శింపఁబడుచున్నది.

ఇయ్యది పరమేశ్వరముఖమునుండి యప్రయత్నముగాఁ బురుషనిశ్వాసమువలె వెలువడిన ఋగ్యజుస్సామాథర్వణరూపం బగు వేదరాశి నాలవాలముగా గల్గియుండుటచే దీనికి వైదికనిష్ఠ యను పేరుగల్గినది. వైదికజాతి కంతకు నీవేదము పరమప్రమాణముగా సృష్ట్యాదినుండియు నేఁటివఱకు నలరారుచున్నది. వేద మపౌరుషేయము నిత్యము స్వతః ప్రమాణము నని వేదవేత్త లందఱు వేదయుక్త్యనుభవంబులచే బోధించుచున్నారు. దానంజేసి వైదికమత మొక పురుషునిచే గల్పింపఁబడిన దెంతమాత్రమును గాదు. వేదముయొక్క యతిశయము బుధులచే నిత్తెఱంగున నిరూపింపఁబడుచున్నది.

"ప్రత్యక్షేణాఽనుమిత్యా వా య స్తూపాయో న లభ్యతే
ఏతం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా"

అని, జ్ఞానేంద్రియములచేతను యుక్తులచేతను దెలియుట కవకాశములేని విషయములను, అనఁగాఁ బురుషబుద్ధికి గోచరింపని యిహపరములతో సంబంధించిన యిష్టానిష్టములను బోధించునది వేదమని యాశయము. వైదికమతమునకు ధర్మమని సాధారణనామము పరగుచున్నది. వైదికధర్మముచే సుఖస్వరూప మిత్తెఱంగున

వివరింపఁబడుచున్నది. సుఖము సాతిశయమనియు నిరతిశయమనియు రెండు తెఱంగులు. అందు సాతిశయసుఖమును వ్యావహారికసుఖమనియు విషయసుఖమనియు వేదవేత్తలు తలఁచుచున్నారు. సాతిశయసుఖము మఱల నైహికమనియు నాముష్మికమనియు రెండువిధములు. ఐహికము స్రక్చందనవనితాదివిషయజన్యంబు, ఆముష్మికం బన్ననో శ్రౌతస్మార్త కర్మజన్యంబును స్వర్గాదిలోకంబులందలి విషయజన్యంబును. నిరతిశయసుఖంబన్ననో బ్రహ్మజ్ఞానముచే నభివ్యక్తికి వచ్చునదియును, శాశ్వతంబును సర్వకాలసర్వావస్థలయందును బడయదగినదియును. నిరతిశయంబునకు నివృత్తిమార్గంబును సాతిశయంబునకుఁ బ్రవృత్తిమార్గమును సాధనములు. నివృత్తిమార్గమునే బ్రహ్మనిష్ఠ యనియు జ్ఞానయోగమనియు బుధులు వర్ణించుచున్నారు. ప్రవృత్తిమార్గము రెండువిధములు - లౌకికము వైదికమని. లౌకికము స్వేచ్ఛాజన్యము, వైదికము శ్రుతిస్మృతి జ్ఞానజన్యము. అందు మఱల వైదికము కామ్యము నిష్కామ్యమని రెండువిధములు. ఇట్లు ప్రవృత్తినివృత్తి మార్గముల విభాగమును శ్రీకృష్ణభగవాను లిట్లు నిర్వచించియున్నారు.

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేణ యోగినామ్." (గీ.3-3)

ప్రవృత్తి యనఁగాఁ గోరికలఁ గోరుట. కోరికలఁ గోరకుండుట శ్రేష్ఠము. కోరికలఁ గోరుట లోకమున శ్రేష్ఠము కాకపోయినను కోరికలఁ గోరకుండ నుండుట కష్టతరము. కావున కోరికలఁ గోరువాఁడు వేదములవలనఁ దన కామ్యమునకు దగు సాధనములను దెలిసికొని తత్సాధనములతో వేదోక్తరీతిగా దన కార్యము నిర్వర్తించుకొనుట కర్మయోగమని మనువుయొక్క యాశయమైన యీ శ్లోకమువలనఁ దెలియుచున్నది.

"కామాత్మతా న ప్రశస్తా న చైవేహాఽస్త్యకామతా
కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః."

విషయసుఖ మనిన శబ్దస్పర్శరూపరసగంధము లనెడి పంచవిషయంబులకు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులతోడి సంసర్గమువలన జనించుసుఖము. ఇయ్యది జనించునది గావున "జాతస్య హి ధ్రువో మృత్యుః" అను న్యాయముచే నీ సుఖము విషయేంద్రియవియోగమున నశించును. అంతియ కాదు. దుఃఖవిమిశ్రితంబును. నిరతిశయసుఖ మనఁగా విషయసంపర్కము లేని స్వస్వరూపానందము. విషయసంపర్కము లేనిచో సుఖము లేదను భ్రమ లోకమునందు సహజసిద్ధము. దానంజేసి విషయసుఖమునే పరమావధిగాఁ బెట్టుకొని చరించినవార లిదివఱకు చార్వాకు లనెడి నామముతో వ్యవహరింపఁబడుచున్నారు. వీరియొక్క యభిప్రాయమున వీరికి విషయరహిత మగు సుఖమున్నటులనే తోఁచదు. అందుచే వైదికమతము

వీరలచే నపహసింపఁబడుచున్న దనిన నొక వింత కాదు. కావున నిరతిశయ
సుఖస్వరూపమును బోధించుటకు నొక చిన్న దృష్టాంతమును బ్రదర్శించు
చున్నాము. సాధారణముగా నెద్దియేని కార్యగౌరవమున మునిఁగియున్న వా
డట్టి కార్యనిర్వాహకాలమునఁ జీకాకుఁజెందుచు నట్టి కార్యమునుండి విశ్రాంతిఁ
జెంద సుఖమున నుంటి నని యానందించుట సకలప్రాణులకును సహజసిద్ధము.
సకలప్రాణులు నాహారవిహారాదివ్యవహారములచేఁ గష్టపడి యట్టి కష్టము
నుండి మరలి నిద్రాసుఖము నపేక్షించుట సహజముగదా! నిద్రాసుఖము మనో
హరంబులగు స్రక్చందన వనితాది సుఖంబులకంటె నెక్కువ యతిశయంబుగను
బవిత్రంబుగను సకలప్రాణులచే ననుభవింపఁబడుచున్నదిగదా!

లోకములో నెట్టి విషయసుఖమునందైన నసూయఁ జెందుట కానవచ్చు
చున్నది. కాని నిద్రాసుఖము నపేక్షింపనట్టియుఁ బ్రీతిఁ జెందనట్టియుఁ బ్రాణి
యెందు నుండ దని చెప్పితీరవలయును. నిద్ర యన సకలవిషయవ్యాప్తుల యుపర
మము. అట్టి నిద్రయే పరమసుఖము. విషయవ్యాప్తుల యుపరమమే నివృత్తి యని
వర్ణింపఁబడుచున్నది. నివృత్తివలనఁ గల్గు సుఖము నిరతిశయసుఖంబును సకలప్రాణు
లకు నాశ్రయణీయంబును సహజసిద్ధము నని నిద్రాసుఖంబుచే నొకింత సూచన
చేయఁదగి యున్నది. అట్టి యఖండనిరతిశయసుఖమును వైదికధర్మము సకల
ప్రాణులకును బ్రసాదింప సమకట్టుచున్నది. ఇట్టి నిరతిశయసుఖమే బ్రహ్మానంద
మని వేదోక్తిఁ బొగడఁబడుచున్నది. ఇట్టి బ్రహ్మానందమునకు నాత్మానంద మనియు
గూడ వ్యవహారము గలదు. నిద్రాసుఖ మఖండ సుఖముగాదు. ఏల యన నద్దానికిఁ
బ్రచ్యుతి కనఁబడుచున్నది. జాగ్రత్స్వప్నములు నిద్రాసుఖమునకుఁ బ్రతిబంధక
ములు. కావున నయ్యది క్షణికమును సాతిశయంబును. బ్రహ్మానంద మన్ననో సర్వ
కాల సర్వావస్థలయందు నొక్క భంగి సహస్రసూర్యప్రభాభాసమానంబుగా
బ్రకాశించుచుండును.

ఇట్టి బ్రహ్మానందముకంటె భిన్నము లగు నానందము లన్నియును సాతి
శయంబులును నశ్వరంబులును. ఇంతియ కాదు. లోకమునఁ బ్రాణులచే ననుభ
వింపఁబడు నానంద మంతయు నీ బ్రహ్మానందముయొక్క లేశమాత్రమే. ఇట్టి బ్రహ్మా
నందముయొక్క పరిమితిని సూచనజేయ వేదము బ్రహ్మానందము యొక్క
మీమాంసను బోధించుచున్నది.

ఆనంద మీమాంస—ఎద్దియేని యొక వస్తువుయొక్క పరిమితిని బోధింపఁ
బ్రయత్నించునపు డట్టి పరిమితికిఁ దగునాధారము నొకదానిని జేకొని వ్యవహ
రించుట లోకానుభవసిద్ధము. బ్రహ్మానందమును బోధించుటకు మానుషానందము
మానయష్టిగ స్వీకరింపఁబడుచున్నది. మానుషానంద మన యౌవనమం దున్న
ట్టియు సద్గుణప్రధానుఁడై నట్టియు వేదవేదాంగపారంగతుఁ డై నట్టియుఁ బుష్కల

ముగాఁ బ్రజలను శాసింపఁగల్గినట్టియు దృఢగాత్రుఁ డైనట్టియు బలవంతుఁడై నట్టియు సర్వకాలములయందు సకలవిధము లగు విత్తములతోడ నిండియుండు పృథివి నఖండముగా నేలు భూమండలాధిపతి యనుభవించు సుఖ మొక్క మానుషానంద మని నిరూపింపఁబడి తన్మూలకముగా బ్రహ్మానందమీమాంస దిగువ వివరింపఁ బడుచున్నది.

| 100 మానుషానందములు | 1 మనుష్య గంధర్వానందము |
|---|---|
| 100 మనుష్య గంధర్వానందములు | 1 దేవ గంధర్వానందము |
| 100 దేవగంధర్వానందములు | 1 పితృ దేవతానందము |
| 100 పితృ దేవతానందములు | 1 ఆజాన దేవతానందము |
| 100 ఆజాన దేవతానందములు | 1 కర్మదేవతానందము |
| 100 కర్మదేవతానందములు | 1 దేవతానందము |
| 100 దేవతానందములు | 1 ఇంద్రానందము |
| 100 ఇంద్రానందములు | 1 బృహస్పతి యానందము |
| 100 బృహస్పతి యానందములు | 1 ప్రజాపతి యానందము |
| 100 ప్రజాపతి యానందములు | 1 హిరణ్య గర్భానందము |

పై మీమాంసను దిలకించిన హిరణ్యగర్భానందము పై నుదహరింపఁబడిన, 100,00,00,00,00,00,00,00,00,00, మానుషానందములతో సమాన మని తెలియవచ్చుచున్నది. ఇట్టి మానుషాది హిరణ్యగర్భ పర్యన్తము వ్యక్తీకరింపఁబడిన సకలప్రాణులయొక్క యానందము లఖండ నిరతిశయ బ్రహ్మానందము యొక్క లేశమాత్రమే యని శ్రుతి ప్రతిపాదించుచు నట్టి బ్రహ్మానందమును దన పుత్త్రులకుఁ బ్రసాదింప సమకట్టుచున్నది. ఇట్టి బ్రహ్మానందమును బొందించుటకుఁ దగు సాధనముగ నివృత్తిరూప మగు బ్రహ్మనిష్ఠ యుపదేశింపబడుచున్నది.

బ్రహ్మనిష్ఠ:—పై యానందములయందలి తారతమ్యమునకు నకామహత్త్వము కారణ మని తేటతెల్లముగ దెలియవచ్చుచున్నది. ఇట్టి యకామహత్త్వము బ్రహ్మజ్ఞానముచేఁ దక్క నితరములగు నుపాయములచే నలవడ దని "బ్రహ్మవిదాప్నోతి పరమ్" "జ్ఞానా దేవతు కైవల్యమ్" అను మొదలుగాఁ గల శ్రుతి సహస్రంబులచేఁ దెలియుచున్నది. ఇట్టి బ్రహ్మజ్ఞానమునకు సాధనము బ్రహ్మనిష్ఠ. దీనినే జ్ఞాననిష్ఠ యని కూడఁ గోవిదులు వక్కాణించుచున్నారు. దీనియందుఁ జేయవలసిన కార్యంబులు శ్రవణమననిదిధ్యాసములు. ఇట్టి జ్ఞాననిష్ఠను జేకొనుటకుఁ దగు నధికారము నిత్యానిత్యవస్తువివేకము. ఇహాముత్రార్థఫలభోగవిరాగములు, శమాదిసాధనసంపత్తు, ముముక్షుత్వము అను నాల్గు మహాగుణములు. ఇట్టి గుణసముదాయమునకు సాధనచతుష్టయసంపద యని వ్యవహారము - సాధనచతుష్టయసంపదఁ జెందిన ద్విజులు వేదాంతవాక్యానుసారముగ శ్రవణాదులఁ జేయవలయును.

శూద్రాదులన్ననో పురాణేతిహాసములమూలకముగ శ్రవణాదులఁ జేయవలయును. ఇయ్యది ద్విజులకును శూద్రులకును విధింపఁబడిన శ్రుతిచోదితభేదము. ఇట్టి జ్ఞాన నిష్ఠయే నివృత్తిమార్గ మని చెప్పబడుచున్నది.

కర్మనిష్ఠ:— బ్రహ్మనిష్ఠకు దగు నధికారమగు సాధనచతుష్టయసంపదకుఁ దగు సాధనము కర్మనిష్ఠ యనఁబడును. దీనినే నిష్కామకర్మయనియుఁ గర్మ యోగమనియును బుధులు చెప్పుదురు. ఈ నిష్ఠయందు ఫలాభిసంధిరహితమగు వైదికకర్మ యాచరణీయము. ఇయ్యది యధికారభేదము ననుసరించి వర్ణాశ్రమో చిత ధర్మముగ బరిణమించుచున్నది. విషయసుఖంబుల నపేక్షించువారలకు వేద చోదితంబగు కామ్యకర్మానుష్ఠానము కర్తవ్యము. ఇయ్యదియు వర్ణాశ్రమో చితముగనే పరగుచుండును. ఇట్టి ద్వివిధమగు నిష్ఠను జెప్పి వేదోక్తమగు జాతు ర్వర్ణ్యమును నిరూపించుచుంటిమి.

8. వర్ణ వ్యవస్థ:—వర్ణవ్యవస్థ జన్మతోడ సంసిద్ధమగు విషయముగాన్ని వేఱొండు విధమున లభించునది కాదని "రమణీయచరణా రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనింవా, క్షత్రియయోనింవా, వైశ్యయోనింవా; కపూయచరణాః కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చాండాల యోనింవా" అను శ్రుతివలన సుస్పష్టముగాఁ దెలియుచున్నది. ఇట్టి పరమ తాత్పర్యమునే సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసము లుద్ఘోషించుచున్నవి. ఇట్టి సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసములచే నుద్ఘోషింపబడుచున్న పరమతాత్పర్యమును శ్రీకృష్ణభగవానులు

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" (గీ. 4.13)

అని యర్ధగీతముతో లోకమం దంతటను బ్రకటించుచున్నారు. ఈ గీతము నందు గుణశబ్దముచే గుణత్రయమున కాధారభూతమగు జీవుఁడు, (అనగా లింగ శరీరము) అని గ్రహింపవలయును.

ఇట్టి లింగశరీరమునందు గుణత్రయభేదము ననుసరించి వ్యక్తులకు భేదము దెలియవచ్చు ననియు నందువలన వర్ణములందు నియతమగు గుణభేదములు తెలియ వచ్చుచున్నవనియు గుణత్రయవిభాగయోగమువలన సుకరముగ దెలియనగును. వేయేల! ఈ గీతమునందలి "గుణవిభాగశః" అనుపదముల యర్థవ్యక్తీకరణమే గుణత్రయవిభాగయోగము. ఇఁక నీ గీతమునందు స్మరింపఁబడిన "కర్మవిభాగశః" అను పదమునందలి కర్మశబ్దము "భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః" అను గీతముచే నెనిమిదవయధ్యాయమున వ్యాఖ్యానము చేయబడుచున్నది. ఇది సమస్త భూతభావములయొక్క పుట్టుకకుఁ గారణభూతమగు విసర్గ మని చెప్పఁబడుచున్నది. ఇట్టి విసర్గము మాతాపితరులయొక్క రక్తశుక్లముల బరిణామంబు లగు రక్తశుక్లతర

తమభావము కర్మవిభాగ మనియు నట్టి మాతాపితృజన్యమగు రక్తశుక్లబిందు విసర్గ భేదములచే వర్ణభేదము కలుగుచున్న దనియు నర్థము. స్త్రీయొక్క ఋతుకాలము నందు సమావేశమై నిలిచియున్న రక్తశుక్ల బిందువిసర్గమున గుణ మను జీవుఁడు సంక్రమించినచో గర్భమున శిశువుప్రారంభమై యభివృద్ధిఁ జెందును. గుణము సంక్రమింపకపోయిన రక్తశుక్లములు వ్యర్థము లై పోవును. రక్తశుక్లము లెంత పరిశుభ్రముగా నున్నను గుణము సంక్రమింపకపోయినచో గర్భోత్పత్తి కలుగదు. స్త్రీ యోనియందు రక్తశుక్ల బిందువిసర్గమున గుణ మను జీవుడు చొచ్చుట యీశ్వరాయత్తము గావున "మయా సృష్టం" అని యీశ్వరాభిమానముచే శ్రీకృష్ణ భగవానులు నిర్వచించుచున్నారు. దానంజేసి యేయే జీవులకు నేయే వర్ణము గుణ విభాగముచే ఘటించుచున్నదో యాయాయిజీవు లాయాయి వర్ణములకుఁ జెందిన స్త్రీయోనులందు ఋతుకాలమునందలిసమావేశముచే జనించువిసర్గములయందుఁ బ్రవేశపెట్టబడుచున్నారు. రక్తశుక్లబిందువిసర్గములందుఁగూడ నాయాయి వర్ణములకుఁ దగు తారతమ్యమును స్పష్టముగ గననగు. దానంజేసి వర్ణమునందలి విభాగమునకు హేతుభూతములలో రక్తశుక్లము లగ్రగణ్యములు. ఆరెండు నొక దేహమునకు జన్మప్రభృతి మరణపర్యంతము నియతముగ బరిణామముఁ జెందుచుండుటచే నొక జీవితమున నొకవర్ణ మొకజాతినుండి మఱియొకజాతి కెంతమాత్రమును మార్పు చేయఁబడుటకు నవకాశము లేకున్నది. ఇచ్చట వర్ణశబ్దమునకు నియతధర్మ మని యర్థము గాని 'రంగు' అని యెంతమాత్రము గాదు. సకలపదార్థములకు రంగెంత విభాజకధర్మమో యాతీరుననే జాతులకుఁ దెలియవచ్చెడి పరస్పరవిభాగమునకు గుణకర్మవిభాగము కారణ మగుటంజేసి యియ్యదిగూడ వర్ణశబ్ద వాచ్య మగుచున్నది. కావున నీ గుణకర్మవిభాగము ననుసరించియే స్త్రీయోనులందుఁ బరమేశ్వరునిచే జీవుఁడు ప్రవేశపెట్టబడుచున్నాఁడు.

ఈ చాతుర్వర్ణ్యవ్యవస్థ యపూర్వమైనట్టియు నదృష్టమైనట్టియు శాస్త్ర యుక్త్యనుభవములచేఁ దెలిసికొనఁదగినట్టియు వ్యవస్థగాని వేఱొండు పౌరుషేయ వ్యవస్థ యెంతమాత్రము కాదు. కావున వర్ణవ్యవస్థకు వ్యక్తులయొక్క జన్మాంతర కర్మయు దాని ననుసరించి భగవన్నియమిత మగు యోనియుఁ గారణములు గాని వేఱొక పురుషు లెంతమాత్రమును కారణములు గారు. కావున వర్ణవ్యవస్థనుగూర్చి పామరులు చేయు బ్రాహ్మణనింద, పామరులు తలఁపెట్టు బ్రాహ్మద్వేషము ను వారి వారి యవివేకకృతములు గాని వేఱొండు కావని తెలియునది. ఇయ్యదియే వర్ణవ్యవస్థయొక్క సంక్షేపకథనము.

9. ఆశ్రమధర్మములు:—

ప్రతి మనుష్యవ్యక్తికిని పంచేంద్రియములు వికాసమును జెంది వాగింద్రియము పుష్కలవర్ణోచ్చారణమును చేయుటకుఁ దగిన శక్తిని బడసినది మొదలు

మరణపర్యంతమును గల జీవితకాలమున నే యే యవస్థలయం దే యే కాలమున శ్రుతిస్మృతిసదాచారసిద్ధం బగు వర్ణాశ్రమధర్మము నాచరించిన నుత్తమమగు బ్రహ్మవిద్య యలవడునో యట్టి సామాన్యకర్తవ్యవిభాగ మాశ్రమవిభాగ మన బడుచున్నది. ఇట్టి యాశ్రమములు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సంన్యాసము లను పవిత్రనామములతో నాల్గు విధములుగా నొప్పుచున్నవి. అందు బ్రహ్మ చర్యము పురుషులకు నుపనయనసంస్కారముతోడను స్త్రీలకు వివాహసంస్కా రముతోడను బ్రారంభ మగుచున్నది. పురుషునకు గార్హస్థ్యము వివాహ సం స్కారముతో ప్రారంభమగు చున్నది. స్త్రీయొక్క బ్రహ్మచర్యము, పురుషుని నైష్ఠిక బ్రహ్మచర్యమట్లు యావజ్జీవము గురుస్థానీయుఁడగు భర్తకడనే నడుపఁ బడవలయును. స్త్రీ పురుషు లిరువురకు ననఁగా భార్యాభర్తల కిరువురకును వాన ప్రస్థాన మొక్క పర్యాయమే ప్రారంభమగుచుఁ బుత్రుల బాధ్యతతో బ్రారంభ మగుచున్నది. పురుషునికి సంన్యాసాశ్రమము సర్వకర్మసంన్యాసమను పరమ పవిత్రకర్మముతోఁ బ్రారంభ మగును. స్త్రీకి సంన్యాస మనునది భర్తయొక్క సంన్యాసముతోఁ గాని వియోగముతోఁగాని నియతముగ బ్రారంభమగును. అంతవఱకు స్త్రీ గృహిణిగ సర్వవిధంబుల జరింపవలయును. ఇట్టి యాశ్రమధర్మ ములు పరమపురుషార్థమగు ముక్తిని సర్వవిధముల గమ్యస్థానముగాఁ గల్గియున్నవి. ఇయ్యది యాశ్రమ ధర్మసంక్షేపకథనము.

10. నిష్ఠ:—నిష్ఠ నిత్యమనియు నైమిత్తికమనియు ద్వివిధము. నిత్య మనఁగాఁ ప్రతిదినము ననుసరింపవలసినది. నైమిత్తిక మనఁగా విశేషదివసములందు నను ష్ఠింపవలసినది. నైమిత్తిక ముపాసనావైచిత్ర్యముచే భేదించుచుండును. సకలో పాసకులకు నవశ్యకర్తవ్యం బగు నిత్యమును సంక్షేపముగాఁ బ్రదర్శించు చుంటిమి.

ప్రత్యుపాసకుఁడును నిత్యము బ్రాహ్మముహూర్తమున నిదురనుండి లేవవలయును. బ్రాహ్మముహూర్త మన సూర్యోదయమునకు నైదు ఘడి యలు పూర్వకాల మని యర్థము. దీనికే యుషఃకాలమని కూడ వ్యవహారము గలదు. ఈ ముహూర్తము సకలజగన్నియంత యగు బ్రహ్మదేవుఁడు నిత్యకృత్య ములకుఁ గడంగుకాల మగుటచే దీనికి బ్రాహ్మముహూర్త మని పేరు కలిగెను. ఈ ముహూర్తము సకలప్రాణిజాతంబునకును సహజసిద్ధంబగు వేకువకాలము. బ్రాహ్మముహూర్తమున నిద్రలేచి యాచార్యోక్తవిధి ననుసరించి యిష్టదేవతా స్మరణంబు గావించి నిద్రాస్థలమునుండి యామ్యదిక్కునకో లేక నైరృతిదిక్కునకో పోయి మలచ్యుతిఁ గావించి యథోచితంబుగాఁ బాదప్రక్షాళనగండూషాదికముల నిర్వర్తించి దంతధావనంబు చేసి పిమ్మట యథాధికారము స్నానమును జేయ వల యును. స్నానము వైదికము, తాంత్రిక మని ద్వివిధము. వేదాధికారవంతునకు

వైదికస్నానమనియుఁ దద్రహితునకుఁ దాంత్రికమనియు వ్యవస్థ. స్నానమునకుఁ ప్రవాహోదక ముత్తమము. తటాకోదకము మధ్యమము. కూపోదక మధమము. ఉష్ణోదక మారోగ్యకరము. కూపోదకమైనను దాత్కాలికమగు నుదకము గావల యునుగాని పర్యుషితోదక మెంతమాత్రమును ప్రయోజనముఁ గననేఱదు. స్నానము చేయకుండిన నెట్టికర్మకు నర్హత కలుగదు గావున సర్వకర్మలకు ముందు స్నానము విధింపఁబడుచున్నది.

"స్నానపూర్వాః క్రియాః శుద్ధాః సర్వాః సిద్ధిం ప్రయాంతి చ
తస్మా త్స్నానం పురా కుర్యా దేష్వేకం దేహశక్తితః."

స్నానములు శక్త్యనుసారము బహుభంగుల నిరూపింపఁబడుచున్నవి. వాని యొక్క స్వరూపస్వభావములు సంప్రదాయైకవేద్యంబులు. స్నానముయొక్క ప్రయోజనము ప్రత్యక్షము అప్రత్యక్షమునియు ద్వివిధము. ప్రత్యక్షము దేహశుద్ధి. తద్ద్వారా యంతఃకరణశుద్ధి యప్రత్యక్షము. ఇట్టి యంతఃకరణశుద్ధికి హేతుభూత మగు స్నానము మంత్రపురస్సరము. మంత్రపురస్సరంబుగాఁ జేయఁబడిన స్నానాది నిత్యక్రియలు పురుషసంస్కారహేతువు లని మీమాంసా నిర్ణయము. స్నానానంతరము తిలకమును ధరింపవలయును. ఈతిలకము జాతిభేదముచేతను దేవతాభేదము చేతను బలుతెఱంగుల భేదమును గనుచున్నది. కాని సర్వతిలకాధారభూతమును మహాఫలప్రదమును విభూతితిలక మగుచున్నది. విభూతిధారణము విభూతిహేతువగు విషయము. "భూతిదాతు ర్విభూతిః స్యా ద్విధినా విధృతా యది" అను స్మృతిచే నిరూపింపఁబడుచున్నది. తిలకధారణవిధియుఁగూడ సంప్రదాయైకవేద్యమే. తిలకమును ధరించినపిదప ప్రాతఃకాలపు సంధ్యావందనము నాచరింపవలయును. సంధ్యావందనముగూడ స్నానమట్లు వైదిక మనియుఁ దాంత్రిక మనియు ద్వివిధము. వేదాధికారవంతులకు వైదికసంధ్యావందనము, తద్రహితులకుఁ దాంత్రిక సంధ్యావందన మను వ్యవస్థ స్నానమట్లు తెలియునది. వైదిక తాంత్రిక సంధ్యావందనములు ద్విజులచే నాచరింపఁబడవలయు ననుట శాస్త్రయుక్తి సదాచారములచేతను గ్రహింపఁబడు విషయము గాదు. ఏల యన సంధ్యావందనమునకు నియతకాలము గలదు. వైదికముగాని తాంత్రికముగాని యట్టి నియత కాలమునందే యాచరింపఁబడవలయును. నియతకాలమున వైదికము నాచరించినఁ దాంత్రికమునకుఁ గాలాతిరిక్తదోషము కలుగును. లేదా తాంత్రికాభిమానముచేఁ దాంత్రికమును నియతకాలమున నాచరించినచో వైదికము భ్రంశమును జెందును. వైదికము భ్రంశము జెందగోరువా రెవ్వరు నుండరు గదా! దానంజేసి నియతకాలమున వైదికసంధ్యావందనమును జేయువారికి నవ్యవహితంబుగాఁ బరంబున నౌపాసనమునకుఁగాని యగ్నిహోత్రమునకుఁ గాని కాలము సిద్ధమగును. ఔపాసనమును గాని యగ్నిహోత్రమును గాని యొనరించినపిదప

దాంత్రికసంధ్యకుఁ గడంగెనేని యయ్యది సంధ్యావందనము సార్థకతను సర్వవిధములఁ గోలుపోవుచున్నది. లేదా వైదికసంధ్యావందనము నాచరించిన పిమ్మటఁ దాంత్రికసంధ్యావందన మాచరించి యౌపాసనాగ్నిహోత్రములకుఁ గడంగినచో నౌపాసనాగ్నిహోత్రములు కాలాతిక్రమణదోషగ్రస్తంబు లగుచున్నవి. ఇట్లు వైదికతాంత్రికసంధ్యావందనాదులు రెండు నేకకర్తృకక్రియము లని తలంచు వారలకు వైదికప్రచ్యుతిదోషము ముందు బరుగులిడుచుండును. కావున వేదాధికారులు వైదికసంధ్యావందనమును, దదితరులు తాంత్రికసంధ్యావందనమును జేయవలయునను గొప్ప యాశయమును బ్రాజ్ఞులు గ్రహింతురుగాక!

సంధ్యావందనము సర్వధర్మములకును సర్వకర్మలకును సర్వాధికారములకును సర్వమనోరథములకును ఫలసిద్ధిని గలుగఁజేయునట్టి నిత్యకర్మ యని శ్రుతిస్మృతి పురాణేతిహాస సదాచారములచే సర్వవిధముల శాసింపఁబడుచున్నది. సంధ్యావందన మాచరించిన పిదప యథాధికార మగ్నిని నుపాసింపవలయును. అగ్న్యుపాసన మధికారిభేదముచేఁ బలుతెఱంగుల భేదమును గనుచున్నది. ఎట్లన బ్రహ్మచారి సమిదాధాన మనుపేరఁ బరగు నగ్నికార్యము జేయవలయును. సామాన్యగృహస్థుఁడు గృహ్యాగ్నియం దౌపాసన మనుపేరఁ బరగు తండులహోమమును గావింపవలయును. ఆహితాగ్ని యన్నచో యగ్నిహోత్రమును జేయవలయును. వేదాధికారము లేనివారు తాంత్రికాగ్నియం దౌపాసనమును గావింపవలయును. ఇయ్యది బ్రాహ్మముహూర్తమునందు మేల్కాంచినది మొదలింతవఱకును బ్రతిపురుషునిచే నవశ్యము యథాధికారముగా నాచరింపబడవలసిన నిత్యకృత్యము. ఇఁక మధ్యాహ్నకాలమందన్నచో, సంధ్యావందనము, బ్రహ్మయజ్ఞము, పితృతర్పణము (యథాధికారము) వైశ్వదేవమను కర్మ లాచరింపఁబడవలయును. ఈ నాల్గును బ్రతి గృహస్థునిచే నవశ్య మాచరింపఁబడవలయును. బ్రహ్మచారికి సంధ్యావందనము తక్క మిగిలిన మూఁడు కర్మలతో బనిలేదు. ఇఁక సాయంకాల మందన్నచో సంధ్యావందనము నగ్న్యుపాసనమును దప్పక చేయవలయును.

ఇంతవఱకుఁద్రికాలములందుఁ జేయవలయు నని చెప్పిన విషయములు వైదికధర్మానుయాయు లందఱచే నవశ్యకర్తవ్యంబులు. ఈ నిత్యకర్మల నాచరించుటకు నలసత లేక నింక నెక్కుడు కాల ముపాసనయందు వినియోగింపఁ దలఁచువారు విశేషంబులఁ జేయుటకు యోగ్యత గలిగియుందురు. లేనిచోఁ బ్రయోజనమును బడయనేరరు. ఇయ్యది సామాన్యనిష్ఠ. విశేషనిష్ఠ వైదికము లౌకిక మని ద్వివిధము. వైదికము సాంప్రదాయైకవేద్యము, గురుముఖైకవేద్యమును. లౌకిక మన్నచో వర్ణభేదముచేతను నాశ్రమభేదముచేతను భేదమును గనుచున్నది. పైన నుదాహరింపఁబడిన సామాన్యనిష్ఠ ద్విజు లందఱకు నించుమించుగా సమానమే. లౌకికవిశేషమందు బ్రాహ్మణగృహస్థుఁడు స్వాధ్యాయప్రవచనములఁ

జేయవలయును. క్షత్రియగృహస్థుఁడు ప్రజాపరిపాలనములఁ గావింపవలయును. వైశ్యగృహస్థుఁడు కృషివాణిజ్యాదికముల నొనర్పవలయును. స్వాధ్యాయ ప్రవచనములు ప్రజాపరిపాలనాదికము నొకానొకప్పుడు జీవికగాఁగూడ బరగుచుండును. జీవిక నపేక్షింపక కేవలవిహితకృత్యముగ స్వాధ్యాయ ప్రవచనములను గావించు బ్రాహ్మణులు, ప్రజాపరిపాలనాదికములఁ గావించు క్షత్రియులు నీశ్వరసదృశులగుచున్నారు. ఇఁక బ్రాహ్మణబ్రహ్మచారు లన్ననో సాంగముగను సరహస్యముగను బుక్కలమగు వేదాధ్యయనమును గావింపవలయును. క్షత్రియబ్రహ్మచారులును వైశ్యబ్రహ్మచారులును స్వోచితకర్మానుష్ఠానోపయుక్త మగు వేదభాగమును సరహస్యముగా నధ్యయనము చేయవలయును. దానితో క్షత్రియబ్రహ్మచారులు ప్రజాపరిపాలనాది సామర్థ్యమునకు వలయు విద్యల నభ్యసింపవలయును. ఆ తీరుననే వైశ్యబ్రహ్మచారులు కూడ గృషివాణిజ్యాదుల యందలి నైపుణ్యమునకు విద్యల నభ్యసింపవలయును. శూద్రు లన్ననో పరిచర్య కనుకూలమగు కళల నభ్యసింపవలయును. పరిచర్య యన నేదియో యొకింత వివరింపబడుచున్నది.

పరిచర్యా శబ్దమునకు పుష్కలమగు వ్యాపార మని యర్థము. శ్రుతిస్మృతులచే బ్రాహ్మణులకు నధ్యయనాధ్యాపనములు యజనయాజనములు దానప్రతిగ్రహణములు, క్షత్రియులకును వైశ్యులకు నధ్యయనయజనదానములును, ప్రత్యేకముగా క్షత్రియులకుఁ బ్రజాపరిపాలనాదికమును, వైశ్యులకు గృషివాణిజ్యాదికమును, శూద్రులకుఁ బరిచర్యయు విధింపఁబడుచున్నట్లు స్పష్టమే. బ్రాహ్మణులచేఁ జేయఁబడు నధ్యయనాదికముతోడను క్షత్రియ వైశ్యులచేఁ జేయఁబడు ప్రజాపరిపాలనకృష్యాదికములతోడను ప్రజాక్షేమమునకు వలయు కార్యనిర్వహణము నంతయుఁ బూర్తియగునట్లు తలంచుట కించుకేనియు నవకాశము లేదు. లోకసంగ్రహమునకును బ్రజాక్షేమమునకును వలయు గృహనిర్మాణాదికము పరికర నిర్వహణము లోనుగాఁగల కార్యము లనేకములు. అనఁగా బట్టలు నేయుట, కుండలుచేయుట మొదలగు కార్యములు. ముఖ్యములగు పనులన్నియు నీ పరిచర్య యను పేర నుద్దేశింపబడినట్లు తెలియవచ్చెడిని. అందులకుఁ దగు కౌశలమును దమతమ బుద్ధివిశేషమున కనువుగా నభ్యసింపవలయు నని శూద్రధర్మము. ఇట్లు సకలమానవులును దమతమ స్వభావములఁబట్టి యాచరింపఁగల్గు ధర్మములను శాస్త్రము బోధించుచున్నది. దానినే వర్ణాశ్రమధర్మ మనియు, నిష్ఠయనియు, స్వధర్మమనియు బలువిధములఁ బల్కుచున్నారు. ఇట్టి స్వవర్ణాశ్రమవిహితధర్మమును నిష్కామముగా నాచరించినచో నయ్యది కర్మయోగ మగును. సకామముగా నాచరించినచో జీవిక యగును. కేవలజీవికకొఱకు స్వాయత్తముగాఁ బురుషులచే నాశ్రయింపఁబడు సేవాధర్మములు శ్వవృత్తితుల్యములనియు నవి శాస్త్రీయములగు కర్మలుగాని కర్మయోగముతో సంబంధింపఁజేయు కార్యములుగాని యెంతమాత్రము కానేరవు. సంక్షేపముగాఁ

జెప్పినచో శ్రౌతములగు మహాయాగముల నీశ్వరార్పణబుద్ధితో నాచరించుటయు, స్మార్తములగు వాపీకూపతటాకనిధినిక్షేప దేవాలయాదివిశేషములను నీశ్వరార్పణ బుద్ధితో నిర్మించుటయుఁ గర్మయోగమునందుఁ బ్రధానకార్యములుగా నిర్దేశింపఁ బడుచున్నవి.

## —* మూఁడవయధ్యాయము *—

శ్రీకృష్ణభగవానులు శ్రుతిస్మృత్యుదితధర్మసంగ్రహమును జక్కఁగా బోధించి యర్జునునకుఁ గర్తవ్యాంశమును విధింప నర్జునుండు తనయధికారమును గుర్తెఱుంగఁ జాలక శ్రీకృష్ణోపదేశమున విప్రతిపత్తిఁ జెంది-

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! (గీ. 3-1.)

అని ప్రశ్నింప సాంఖ్యకర్మయోగములకు నుచితమగు నధికారవిశేషమును, నందర్జునునకుఁ గర్మయోగమును విధించుటకుఁ గల సరసతను, గర్మయోగానుష్ఠాన మందలి విశేషములను, నిష్కామకర్మకుఁ గల ప్రతిబంధమును నీ యధ్యాయమున శ్రీకృష్ణభగవాను లుపదేశించుటచే నీయధ్యాయమునకుఁ గర్మయోగ మను పేరు కలిగెను.

### 1 అధికారిభేదము:—

"జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్." (గీ. 3-3.)

అను గీతముచే సాంఖ్యులకు జ్ఞానయోగ మనియు, యోగులకుఁ గర్మయోగ మనియు వ్యవస్థ చేయబడి శ్రీకృష్ణభగవానులచే నిరూపింపఁబడుచున్నది. సాంఖ్యులన నీ జన్మమునఁగాని జన్మాంతరమునఁగాని కర్మయోగము నాచరించుటచేఁ జిత్తశుద్ధి నొంది సర్వకర్మసన్న్యాసమును గావించిన పరమహంసపరివ్రాజకులు. చిత్తశుద్ధియన నిత్యానిత్యవస్తువివేకము. ఇహాముత్రార్థభోగవిరాగము, శమాదిసంపత్తియును, ముముక్షుత్వము నను సాధనసంపత్తు. యోగులన యథోచితవిధిని బ్రహ్మచర్యము నందు గురుశుశ్రూషాపూర్వముగా విద్యల నభ్యసించి రాగముమీఱ గార్హస్థ్యమును జేకొనిన ద్విజశ్రేష్ఠులు.

### 2. కర్మయోగమందలి త్రైవిధ్యము.

కామ్యకర్మానుష్ఠానము, నిష్కామకర్మానుష్ఠానము, లోకసంగ్రహకర్మానుష్ఠానమని కర్మయోగము మూఁడువిధములు. ఐహికాముష్మిక ఫలాభిలాషచే శాస్త్రచోదితకర్మల నాచరించుట కామ్యకర్మానుష్ఠాన మనఁబడును. ఐహికాముష్మికార్థములందు విరతి గలుగఁ జిత్తశుద్ధికొఱకు నీశ్వరార్పణబుద్ధితో నిత్యనైమిత్తికాదికమును నాచరించుట నిష్కామకర్మానుష్ఠాన మనఁబడును. సంపూర్ణ జ్ఞానమును బొందిన విద్వాంసుఁ డజ్ఞులకు మార్గమును బ్రదర్శింప యథోచితముగా

శాస్త్రీయకర్మల నాచరించుట లోకసంగ్రహకర్మానుష్ఠాన మని చెప్పఁబడుచున్నది. లోకసంగ్రహమునకై కర్మానుష్ఠానమును జేసినవారలలో నగ్రగణ్యుడు శ్రీకృష్ణ భగవానులే యని

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన (గీ. 3-22)

అనుగీతమువలనఁ దెలియ వచ్చుచున్నది.

3. పురుషస్వభావము:—

సామాన్యముగా మనుజు లందరును స్వభావముచే నెద్దియేని కర్మల నాచరించుటయందే ప్రవృత్తిని గల్గియుందు రని,—

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః॥ (గీ. 3-5)
సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. (గీ. 3-33)

అనుగీతములచేఁ జెప్పబడుచున్నది. ఇట్టి స్వభావసిద్ధమగు పురుషప్రవృత్తి ననుసరించి కర్మయోగము శాస్త్రముచే విధింపఁబడుచున్నది.

4. కర్మయోగమునందు శ్రీకృష్ణాభిప్రాయము.

"మయి సర్వాణి కర్మాణి"
"యే మే మత మిదం"
"యే త్వేత దభ్యసూయంతః" (గీ. 3-30, 31, 32)

అను గీతములచే నుపదేశింపఁబడుచున్నది.

5. కర్మయోగానుష్ఠానమునకుఁ బ్రతిబంధము:—

రజోగుణసముద్భవము లగు కామక్రోధములు కర్మయోగానుష్ఠానమునకు బ్రబలశత్రువు లని

"కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్." (గీ. 3-37)

అను గీతముచే నిరూపింపఁబడు చున్నది.

6. ఆత్మజ్ఞానికిఁ గర్తవ్యాంశము లేదు:—

"య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే.
నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. (గీ. 3-17, 18)

అను గీతములచే నాత్మజ్ఞానమును బడసిన జ్ఞానికశేషకర్తవ్యతాశూన్యమను నైష్కర్మ్యభావము ఫలముగాఁ జెప్పబడుచున్నది.

—* నాలుగవయధ్యాయము *—

దీనియందు భగవత్స్వరూపవిశేషము, జ్ఞానిస్వరూపము, జ్ఞానముయొక్క యాధిక్యము, జ్ఞానసాధనమును ముఖ్యములుగా నిరూపింపఁబడుటచే నీయధ్యాయమునకు జ్ఞానయోగ మని పేరు.

1. జ్ఞానసాంప్రదాయము:—

జ్ఞానముయొక్క యతిశయమును బ్రదర్శించుటకు జ్ఞానసాంప్రదాయము మొట్టమొదట వర్ణింపఁబడినది. ఇందు వర్ణింపఁబడిన సాంప్రదాయము రాజర్షి సాంప్రదాయమని బుధులచేఁ బరిగణింపఁబడినది.

2. పునర్జన్మ:—

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!" (గీ. 4-5)

అను గీతముచే జీవులకు నొక దేహము నశించిన పిదప మఱియొక దేహము సామాన్యముగ సంభవించుటఁ జేసి, జ్ఞానము కలుగువఱకు జీవులు జనన మరణ ప్రవాహరూపసంసారమున నొక జన్మనుండి మరియొక జన్మ బడయుచుందు రను శ్రుతిస్మృతిన్యాయపూర్వకమగు వ్యావహారికసిద్ధాన్తము ప్రదర్శింపఁబడుచున్నది.

3. జీవేశ్వరభేదనిరూపణము:—

"అజోఽపిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్" (గీ. 4-6)

అను గీతముచే సకలభూతనియామకుఁడగు నీశ్వరుఁ డున్నాఁడనియు నట్టి యీశ్వరుఁడే ప్రకృతమున శ్రీకృష్ణరూపమున లోకసంగ్రహమునకై యవతరించె ననియు మరియొక వ్యావహారికసిద్ధాన్తము తెలియవచ్చెడిని.

4. అవతారకృత్యము:—

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ" (గీ. 4-8)

అను గీతమువలన సాధుపరిత్రాణము, దుష్టవినాశనము, శ్రుతిస్మృత్యుదిత వర్ణాశ్రమధర్మసంస్థాపనము మొదలుగాఁగల కృత్యములు భగవదవతారకృత్యములని తెలియవచ్చుచున్నది.

5. ఈశ్వరుఁడు నిష్పక్షపాతి:—

మనుజులను న్యూనాధికభావములతో నొప్పు వైచిత్ర్యముచే సృజించుటం జేసి యీశ్వరుడు వైషమ్యనైర్ఘృణ్య దోషములకుఁ బాల్పడుచున్నాఁడను యాక్షేపణము

"కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా.
చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. (గీ. 4-12, 13)

అనుగీతములచే వారింపఁబడుచున్నది. కర్మఫలము నపేక్షించి కర్మల నాచరించిన జీవులకు నాయాయికర్మఫలముల కనుగుణముగ నాయాయిజీవు లాయాయి యోనులందు సృష్ట్యాదియందుఁ బ్రవేశపెట్టఁబడుచున్నా రనియు నా తీరుననే స్థితికాలమునఁ బ్రవేశపెట్టఁబడుచున్నారనియు, దానంజేసి ప్రాణులయొక్క న్యూనాధిక్యములకు బ్రాణులే బాధ్యులు గాని యీశ్వరుఁ డెంతమాత్రమును దోషి కాఁడనియుఁ దాత్పర్యము.

6. జ్ఞానసాధనము:—

పురుషార్థసాధనములలో జ్ఞానమొక్కటియే యుత్తమసాధన మనియు నయ్యది తత్త్వదర్శులవలనఁ బ్రణిపాతపరిప్రశ్న శుశ్రూషాదిరూపమగు నుపసదనముచే సంపాదింపఁబడవలయుననియు,

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" (గీ. 4-34.)

అనుగీతము మొద లధ్యాయపరిసమాప్తివఱకును వివరింపఁబడుచున్నది.

## —* అయిదవయధ్యాయము *—

కర్మయోగజ్ఞానయోగములయొక్క విశేషవిషయముల నర్జునుఁడు వినినప్పటికిని సందేహనివృత్తి కాకపోవుటచే నాయధ్యాయములయొక్క సారాంశము ననుసరించి,

"సంన్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్. (గీ. 5-1.)

అని ప్రశ్నించుచున్నాఁడు. దీనినిఁబట్టి మూఁడునాలుగధ్యాయములయందు గర్మసన్న్యాస కర్మయోగముల రెండిఁటియొక్క యతిశయము వర్ణింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. రెండవయధ్యాయాంతమునఁ గర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమని గ్రహించినట్లు

"జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన!" (గీ. 3-1.)

అను గీతమువలనఁ దెలియవచ్చుచున్నది. కర్మసన్న్యాస కర్మయోగముల యతిశయ మిప్పుడు వర్ణించుటచేతఁ గర్మకంటె జ్ఞానము శ్రేష్ఠ మని యిదివఱలోఁ జెప్పఁబడియుండుటచేతను సర్వకర్మసంన్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠ పరమపురుషార్థ సాధనముగాఁ దెలియవచ్చుచుండఁ గర్మనిష్ఠయందుఁ దన్ను నియమించుటకుఁ గల

కారణమును గ్రహింపఁజాలక యీ ప్రశ్నమును వైచినట్లు తెలియవచ్చెడిని. ఇట్టి ప్రశ్నమునకు సమాధానముగా, బ్రకృతమున నర్జునునకుఁ గర్మసంన్యాసమునకుఁ దగు యోగ్యత లేమింజేసి తదధికారమును బొందువఱకుఁ గర్మయోగము నాచరింప వలయునను నాశయముఁ గలుగఁజేయ ననధికారికృత కర్మసంన్యాసము, అధికారికృత కర్మసంన్యాస మను రెండువిషయములలో ననధికారికృత కర్మసంన్యాసముకంటెఁ గర్మయోగమే శ్రేయోదాయక మగునని సూచించుచు సంన్యాసమునకుఁ దగు యోగ్యతను, సంన్యాసి కుండవలసిన లక్షణముల నీ యధ్యాయమున భగవాను లుపదేశించుటచే నియ్యది కర్మసంన్యాసయోగ మను పేరఁ బరగుచున్నది. అనధికారికృతకర్మసంన్యాసముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠ మను విషయము,

"తయో స్తు కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే" (గీ. 5-2)
"సంన్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరేణాఽధిగచ్ఛతి" (గీ. 5-6)

అను గీతములవలనఁ దెలియవచ్చుచున్నది.

1. సంసారకారణము:—

"అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః" (గీ. 5-15)

అను గీతముచే స్వస్వరూపజ్ఞాన మజ్ఞానముచేత నావరింపఁబడుటచే రాగద్వేషములచే వ్యామోహమును జెంది ప్రాణులు సంసారమున నోలలాడుచున్నారని యీ యజ్ఞానము సంసారకారణముగా నుపదేశింపఁబడినది.

2. శ్రీకృష్ణభగవత్ప్రతిజ్ఞ:—

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్"
తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. (గీ. 5-16,17.)

శాస్త్రాచార్యోపదేశజ్ఞానముచే నజ్ఞానము నశింప స్వస్వరూపజ్ఞానము ప్రకాశించుటవలన నెల్లరును నిరతిశయసుఖస్వరూప మగు బ్రహ్మభావమును జెందుటచే మఱల జననమరణప్రవాహరూప మగు సంసారమును బొందరని శ్రీకృష్ణభగవానులయొక్క యనుశాసనము.

—✻ ఆఱవయధ్యాయము ✻—

సర్వకర్మసంన్యాసముఁ గావించినవాఁ డనుసరింపవలసిన జ్ఞాననిష్ఠయందలి యేకదేశమగు ధ్యానయోగ మీ యధ్యాయమునందు వర్ణింపఁబడుచున్నది.

దానంజేసి యీ యధ్యాయమునకు ధ్యానయోగ మని పేరు గలిగెను. సర్వకర్మ సంన్యాసమును గావించిన పిదప నాచరింపవలసిన ధ్యానయోగముయొక్క స్వరూప మొకింత ప్రదర్శింపఁబడుటచే నద్దానియందలి కష్టమును గుర్తెఱిఁగి యందులకుఁ యోగ్యత లేమింజేసి తనకుఁ గర్మయోగ ముపదేశింపఁబడుచున్న దనియు, గావునఁ దా నద్దాని నవశ్య మాచరించితీరవలయు నని యర్జునునకు నిశ్చయజ్ఞానము కలుగ నుపదేశింపబడెను.

1. ఆరురుక్షువు :—

ధ్యానయోగమును బొందఁదలఁచినవాఁడు తదధికారమునకు సాధనమగు చిత్తశుద్ధిని బడయుటకై కర్మయోగము నాచరింపవలయునని

"ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే. (గీ. 6-3)

అను గీతమువలనఁ జెప్పబడుచున్నది.

2. యోగారూఢుఁడు :—

చిత్తశుద్ధిని బడసినవాఁడు యోగారూఢుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అట్టి వాఁడు ధ్యానయోగము నాశ్రయించుటకు సర్వకర్మసంన్యాసమును గావింప వలయు నని సర్వకర్మసంన్యాసము ధ్యానయోగమునకు ద్వారమని

"యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" (గీ. 6-3)

అను గీతముచేఁ జెప్పఁబడుచున్నది.

3. నిష్ఠ:—

ఆరురుక్షువు, ఆరూఢుఁ డను నధికారవాచకపదములచే బోధింపఁబడిన విషయము:—

లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేణ యోగినామ్. (గీ.3-3)

అను నిష్ఠాస్వరూపమే భంగ్యంతరమున వివరింపఁబడుచున్నది. దీనిని బట్టి పరమపురుషార్థసాధనముగా నిష్ఠయందలి సోపానములు కర్మ, చిత్తశుద్ధి, సర్వ కర్మసంన్యాసము, ధ్యానయోగ మనునవి క్రమముగా నిర్దేశింపఁబడుచున్నవి.

4. ధ్యానయోగఫలము:—

"యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి." (గీ. 6-15)

అను గీతముచే ధ్యానయోగమువలన బ్రహ్మభావాప్తిరూపమగు నుత్తమ శాంతి గలుగుచున్న దని ధ్యానయోగఫలము నిరూపింపఁబడుచున్నది.

5. మనోనిగ్రహము:—

ధ్యానయోగమునకు శమము అనఁగా మనోనిగ్రహము ముఖ్యమనియు నయ్యది తనకుఁ బ్రకృతమున కష్టతర మనియు గుర్తెఱిఁగిన యర్జునుడు మన స్తత్త్వ మును బట్టి మనోనిగ్రహము దుర్ఘటమనియు నయ్యది యెట్లు లభించుననియు నభి ప్రాయముగాఁ గల ప్రశ్నమును.

"చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్,
తస్యాఽహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్." (గీ. 6-34)

అని ప్రశ్నింప శ్రీకృష్ణభగవానులు

"అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే" (గీ. 6-35)

అని యభ్యాసవైరాగ్యములను మనోనిగ్రహసాధనములుగా నుపదేశించు చున్నాఁడు.

—* ఏడవ యధ్యాయము *—

ధ్యానయోగ ప్రకరణమున:—

"ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః." (గీ.6-14)

అను గీతముచే మనస్సును నిగ్రహించి నా యందుఁ జిత్తము కలవాఁడవై నేనే యుత్కృష్టమగువాఁడ ననుభావముకల్గి పరమేశ్వరుఁడనగు నన్ను ధ్యానింప వలయు నని శ్రీకృష్ణభగవానులు తన్ను ధ్యేయవస్తువుగా నుపదేశించియున్నారు. ధ్యేయవస్తురూపమగు తన స్వరూపము నెట్లు గుర్తెఱుంగవలయునను విషయమును బోధింప విజ్ఞానముతోఁగూడిన జ్ఞానమును బుష్కలముగా నుపదేశించెదనని యర్జును నిచేఁ గోఱఁబడకపోయినను శ్రీకృష్ణభగవాను లీ యధ్యాయము నుపక్రమించి యున్నారు.

ఈ యధ్యాయమున విజ్ఞానముతోఁగూడిన ధ్యాన ముపదేశింపబడుచున్న దని చెప్పబడుటచే దీనికి జ్ఞానవిజ్ఞానయోగమని పేరు.

1. భగవత్తత్త్వము:—

ఇందు భగవత్తత్త్వము దిగువ నుదాహరింపఁబడిన నాల్గుగీతములచేతను సంక్షేపముగా నుపదేశింపఁబడుచున్నది.

"భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా
అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్

జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ -
ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా
మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" (గీ. 7-4-7)

భగవంతునియొక్క పరమార్థస్వరూపమును గుర్తెఱుంగవలయు నన్నచో వ్యవహారమున భాసించు నీ పరిదృశ్యమానమగు జగత్తునుండియు నీ జగత్తునకుఁ గారణభూతమగు ప్రకృతినుండియు భగవత్స్వరూపమును వేఱుచేసి గ్రహింపవలయును. దానంజేసి ప్రకృతిస్వరూపము తొలుత వివరింపబడుచున్నది. ప్రకృతి పరప్రకృతి యనియు నపరప్రకృతి యనియు నా రెండువిధములగు ప్రకృతులకంటె విలక్షణమును నిర్దోషమును సమమునగు పరబ్రహ్మస్వరూపము పారమార్థిక బ్రహ్మస్వరూప మని యీ గీతములవలనఁ దెలియవచ్చుచున్నది. అపరప్రకృతి యనఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశములను బంచభూతములును మనోబుద్ధ్యహంకారములను మూఁడును. పరప్రకృతి యన నే జీవభావముచే నీ పరిదృశ్యమానములగు భూతము లన్నియును వ్యవహారక్షమములగుచు నే జీవభావము తొలఁగిన నీభూతము లన్నియు లుప్తవ్యవహారము కలవి యగుచున్నవో యట్టి చేతనాశక్తిరూపము. అపరప్రకృతిని జడశక్తి యనియు శివ శక్తి యనియుఁగూడ గోవిదులు పేర్కొనుచున్నారు. ఆ తీరుననే పరప్రకృతినిగూడ చిచ్ఛక్తి యనియు శివశక్తి యనియుఁ బేర్కొనుచున్నారు. ఈ రెండు శక్తులు నొకదానితో మఱియొకటి సంబంధించుట సృష్టి యనియు, నట్టి సంబంధముతో నిలిచియుండుట స్థితియనియు, నట్టి సంబంధము తొలగుట లయమనియుఁ జెప్పఁబడుచున్నది. లయకాలమున నీరెండుశక్తులు నవ్యక్తములై బీజరూపమున పరబ్రహ్మమందు లీనమై యుండును. పరబ్రహ్మ మన్ననో, కార్యరూపము లగు పరాపరశక్తులకంటెను దత్కారణ మగు నజ్ఞానము కంటెను విలక్షణమగు కూటస్థనిర్వికార చిన్మాత్రస్వరూపము. అజ్ఞానమన్ననో, అవ్యక్తమనియు మాయయనియు నవిద్య యనియుఁ బలువిధములుగాఁ గోవిదులచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్టి మాయచే నావరింపఁబడియుండుటవలన యథార్థమగు భగవద్రూపము నజ్ఞులు తెలిసికొనఁజాలకున్నా రని

"నాఽహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్" (గీ. 7-25)

అను గీతముచే భగవానులు చెప్పుచున్నారు.

ఇచట బృథివ్యప్తేజోవాయ్వాకాశము లను పంచభూతములు సామాన్యముగాఁ బేర్కొనఁబడుచున్నవి. ఈ భూతములు పంచీకృతములనియు నపంచీకృతములనియు రెండువిధములు. పంచీకృతభూతములు కార్యరూపములు. అపంచీకృత

భూతములు కారణరూపములు. కార్యరూపము లగు భూతములు వ్యవహారక్షమము లగుచు భౌతికము లగు సకలకార్యములను బుట్టించుచుండును. అపంచీకృత భూతములు కార్యానుమేయములు. ఇచట మనశ్శబ్దముచే మనస్సునకుఁ గారణ మగు నహంకారమును, బుద్ధిశబ్దముచే నహంకారకారణ మగు మహత్తత్త్వమును, అహంకారశబ్దముచే మహత్తత్త్వకారణ మగు నవ్యక్తమును గ్రహింపవలయునని శ్రీవిద్యాశంకరభగవత్పాదులు వివరించియున్నారు. దానింబట్టి బ్రహ్మమగు పరమాత్మయందు రజ్జుసర్పమటుల నవ్యక్తమగు నజ్ఞానమును, దానివలన మహత్తత్త్వమును, దానివలన నహంకారమును, దానివలన నాకాశమును, దానివలన వాయువును, దానివలన నగ్నియు, దానివలన జలము, దాని వలనఁ బృథివియుఁ బుట్టినట్లు సుస్పష్ట మగుచున్నది. ఇట్లు పుట్టిన యాకాశాది పంచభూతములును నపంచీకృతభూతములే. ఈ యపంచీకృతభూతములు పంచీకరణ మను విభాగముచే నన్యోన్యసంలగ్నములగుచు పంచీకృతభూతములను బుట్టించును. పంచీకృతభూతంబు లన్ననో భౌతికములగు జరాయుజాండజ స్వేదజోద్భిజ్జములకును నీ చతుర్విధ దేహములకంటె విలక్షణములుగ దెలియవచ్చెడియు లోకాంతరము లందు స్థితులను గలిగినట్టియు దేహములకును, నాయాయి దేహముల కుచితము లగు లోకములకును గారణభూతము లగుచున్నవి. అపంచీకృతభూతము లన్ననో పంచీకృతభావములను జెందకపూర్వమే జ్ఞానేంద్రియపంచకమును, గర్మేంద్రియపంచకమును, బ్రాణపంచకమును, మనోబుద్ధులను బుట్టించి పుట్టి పదునే డవయవములతోఁ గూడిన స్థూలసూక్ష్మదేహములను బుట్టించును. ఈస్థూలసూక్ష్మశరీరములు రెండును బరప్రకృతిచే ధరింపఁబడి లోకవ్యవహారక్షమము లగు నానావిధజీవభావములను గల్గించుచుండును. ఇయ్యదియే సంక్షేపముగా జగత్సృష్టిప్రక్రియ. సృష్టిప్రక్రియపలువిధములుగాబలుతావుల ముచ్చటింపబడియుండుటయు,దీర్ఘకరులచేతను వ్యాఖ్యాతలచేతను బలువిధములుగ వివరింపఁబడుటచే నొకసరణి ననుసరించియున్నట్లు తెలియరాదు. శాస్త్రమునకు సృష్టిప్రక్రియను బోధించుటయందుఁ దాత్పర్యము లేకపోవుట చేతను, బారమార్థికబ్రహ్మస్వరూపమును బోధించుటయే ప్రయోజనముగాఁగల శాస్త్రముచేఁ బ్రకరణసందర్భమున నెద్దియో యొకతీరున సృష్టిప్రక్రియ వివరింపఁబడుటచేతను. సృష్టిప్రక్రియలయందు వైషమ్యము లుండుట యొకవింత గాదు. సకల ప్రక్రియలకును బరమతాత్పర్యము సజాతీయ విజాతీయస్వగతభేదరహిత మగు బ్రహ్మమును బోధించుటయే యగుచు నట్టిబ్రహ్మస్వరూపకథనమందు నెట్టి విగానము లేకుండుటఁజేసి జిజ్ఞాసువులు శాస్త్రాచార్యోపదేశముచేఁ గృతార్థత నొందుదురను గొప్పయాశయము మీర నీ గీతాశాస్త్రమందుఁగూడ సృష్టిప్రక్రియ యచ్చటచ్చట నొకింత ప్రకరణానుకూలముగా భగవానులచే ముచ్చటింపఁబడుచున్నది. ఎచ్చట నీ ప్రక్రియ యేతీరున నుపదేశింపఁబడెనో యందు జిజ్ఞాసువులు తెలిసికొను పారమా

ర్థికవిషయ మొకటి కలదు. అదెద్ది యన, దేహియగు నాత్మ సజాతీయవిజాతీయ స్వగతభేదరహితమును నిరవయవము నిర్గుణము నిష్క్రియము నగు సచ్చిదానంద రూపము. అద్దానియందు ననిర్వచనీయమగు నజ్ఞానము సోకుటచే నీశ్వరభావము, జీవభావము, జగద్భావముగల్గుచున్నది. ఇట్టి జీవేశ్వరజగద్భావములలోఁ గూడికొని నదియే సంసార మనెడి మహాసాగరము. ఇట్టి మహాసాగరమునకుఁ గారణభూత మగు నజ్ఞానము శాస్త్రాచార్యోపదిష్టమగు జ్ఞానముచే నశింప స్వస్వరూపసాక్షాత్కారము ను బొందిన మహానుభావులు జీవభావజగద్భావేశ్వరభావములను మూఁడు భావము లును నశింపఁ బరబ్రహ్మభావము నొంది నిరతిశయ సుఖమును బడయుదురనియు నట్టి భావము లభించువఱకును భావత్రయము వ్యావహారికసత్యతను గల్గియుండు టచే శాస్త్రాచార్యసాధకవ్యవహారము నాలవాలముగాఁ జేసికొని ప్రవర్తించిన శ్రుతిస్మృతిచోదితధర్మానుష్ఠానము స్వవర్ణాశ్రమోచితముగా నాచరణీయము నను గొప్ప యాశయముమీర భావత్రయ విశిష్టమగు వ్యావహారిక ప్రామాణ్యము నాలవాలముగాఁ జేసికొని శ్రీకృష్ణభగవాను లీ యేడవయధ్యాయము మొదలుకొని గ్రంథపరిసమాప్తివఱకుఁ గల గ్రంథముచే విశేషముల నన్నిఁటిని వ్యావహారిక మందుఁ దెలియవచ్చెడి యధికారభేదముల ననుసరించి యుపదేశించు చున్నారను నది యీ గీతాశాస్త్రముయొక్క పరమరహస్యము.

ఈశ్వరుఁడనఁ బరాపరప్రకృతుల రెండిఁటికిని గారణభూతమగు మాయతోఁ గూడిన పరమాత్మస్వరూపము. జీవులన్ననో మాయాకార్యములగు దేహేంద్రియ మనోబుద్ధ్యహంకారసంఘాతము లుపాధులుగాఁ గలిగినట్టియు దేవతిర్యఙ్మను ష్యాదిప్రవిభాగముతోఁ నొప్పుచున్నట్టియుఁ బరమాత్మయం దధ్యస్తము చేయఁ బడిన వ్యక్తివిశేషములు. జగద్భావ మనఁ బ్రకృతివికార మగు భూతభౌతికకార్య సముదాయము.

**2. పుణ్యపురుషుల చాతుర్విధ్యము:—**

మానవకోటియందు స్వభావప్రాప్తములగు రాగద్వేషములచేఁ బ్రవర్తించు వారలలోఁ దమ యభీష్టసిద్ధికై భగవంతుని నాశ్రయించువారలు కొందఱును, భగవంతుని ధిక్కరించి స్వతంత్రముగా వ్యవహరించునట్టి వారు కొందఱు నని తెలియవచ్చుచున్నారు. అందు భగవంతుని నాశ్రయించువారు సుకృతు లని సామాన్యనామముచేఁ బేర్కొనఁబడుచున్నారు. వారలయొక్క చిత్రమగు మనః ప్రవృత్తి ననుసరించి, ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులను నాల్గు విధము లుగా నొప్పుచుందురు. అందు జ్ఞాని యుత్తమోత్తముఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

## —* ఎ ని మి ద వ య ధ్యా య ము *—

ఏడవ యధ్యాయమందలి విషయములను వినుటచే నర్జునున కొకింత విశేష జిజ్ఞాస గలుగ నట్టి జిజ్ఞాసచే నొక ప్రశ్నసప్తకంబును వెలిబుచ్చెను. అట్టి ప్రశ్న

సప్తకమునకు సమాధానముగా నెనిమిదవ యధ్యాయము ప్రవర్తించుచున్నది. అందక్షరపరబ్రహ్మముయొక్క స్వరూపము సంగ్రహముగా బ్రదర్శింపఁబడుటచే నీ యధ్యాయమునకు బ్రహ్మాక్షరనిర్దేశయోగ మని పేరు గలిగెను.

1 అక్షరమగు బ్రహ్మము:—

"య దక్షరం వేదవిదో వదన్తి
విశంతి య ద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. (గీ.8-11)

అను గీతముచే నక్షరపరబ్రహ్మమును సంక్షేపముగాఁ జెప్పెదనని ప్రతిజ్ఞ చేసి యట్టి యక్షరపరబ్రహ్మమునకుఁ బ్రతీకమును వాచకమునగు నోంకారమునే బ్రహ్మముగా నుపదేశించి యట్టి యోంకారమును నిరంతరాభ్యాసపాటవముచే జనించిన సంస్కారమువలన దేహపాతకాలమునందు స్మరించుచు దేహమును విడిచినవాఁ డుత్కృష్టగతిని బొందునని-

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్. (గీ. 8-13.)

అను గీతముచే నిరూపించియున్నారు.

2. జీవులయొక్క గతివిశేషము:—

బ్రహ్మభావమును స్మరించుచు దేహమును విడచినవారు బ్రహ్మభావమును బొందుదురనియు నట్టిన్యాయముచేతనే యేయేభావములను స్మరించుచు దేహమును ద్యజించినవా రాయాయి భావములను బొందుదు రను సామాన్యన్యాయమును,

యం యం వాఽపి స్మర న్భావం త్యజ త్యన్తే కలేవరమ్,
తం త మేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః. (గీ. 8-6.)

అను గీతముచేఁ బ్రదర్శించి సుకృతులు బొందునట్టి మార్గములు శుక్ల మనియు, కృష్ణమనియు రెండు గలవనియు, వారి వారి సుకృతవిశేషముచే దేహపాతానంతర మెద్దియో యొకమార్గమునఁ బోవుదు రనియు, నందు కృష్ణమార్గమునఁ బోవువారు చంద్రలోకమునకుఁబోయి తమ సుకృతఫలము ననుభవించి యయ్యది క్షీణింపఁగా మఱల మర్త్యలోకమున నుచిత మగు యోనులయందుఁ బుట్టుదు రనియు, శుక్లమార్గమునఁ బోవువారలు బ్రహ్మలోకమును బొంది క్రమముగా ననావృత్తిరూపమగు బ్రహ్మభావము నొందుటంజేసి మఱల నీ జననమరణరూపప్రవాహమునఁ బడరనియు జెప్పఁబడుచున్నది. ఇచ్చట దుష్కృతుల గతులఁగూర్చి ప్రదర్శింపఁబడకపోయి నను "యం యం వాఽపి స్మర న్భావమ్" అను న్యాయము ననుసరించి యూహింపుట కవకాశము గల్గుచున్నది. అట్టి యవకాశము-

తా నహం ద్విషతః క్రూరా న్సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు.
ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాం గతిమ్.
(గీ. 19-20)

అను గీతముచేఁ గంఠోక్తిగాఁ బదునాఱవ యధ్యాయమున నిర్వచించి యున్నారు.

—* తొమ్మిదవ యధ్యాయము *—

సప్తమాధ్యాయాంతమున నర్జునుండు ప్రశ్నించిన ప్రశ్నసప్తకమువలన నర్జునుం డేడవయధ్యాయమున భగవానునిచే నుపదేశింపఁబడిన

"అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్ (గీ. 7-24)
నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః" (గీ. 7-25)

అను గీతములచే నుపదేశింపఁబడిన రహస్యముఁ దెలిసికొనలేదని యద్దానిని వివరింప శ్రీ భగవానులే

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానంవిజ్ఞానసహితం యజ్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. (గీ. 9-1)

అని తొమ్మిదవ యధ్యాయమును బ్రారంభించుచున్నారు. ఈ తొమ్మిదవ యధ్యాయ మేడవయధ్యాయముయొక్క విశేషకథనమునకుఁ బ్రవర్తించినట్లు

"జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యజ్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే. (గీ. 7-2)

అను గీతమునకును దొమ్మిదవ యధ్యాయమునందలి తొలిగీతమునకును గల సంబంధమునుబట్టి తెలిసికొన నగును. ఇఁక నిచట "గుహ్యతమం" అను విశేషణ ముండుటచే నియ్యది యేడవ యధ్యాయమందలి విశేషరహస్యమనియు నట్టి విశేషమును,

"రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్" (గీ. 9-2)

అను గీతముచే విశేషముగా వర్ణించుటవలన నీ యధ్యాయమునకు "రాజవిద్యారాజగుహ్యయోగ"మని వ్యవహారము గల్గెను.

1. పరమాత్మస్వరూపము:—

"మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్ స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః.

నచ మత్ స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః, (గీ. 9-4, 5)

అను రెండుగీతములచే నవాఙ్మానసగోచరమును సకలభూతకల్పనాధిష్ఠానమును సర్వవ్యాపకమును అహంశబ్దోపలక్షిత మగు చిన్మాత్రస్వరూపము పరమాత్మస్వరూప మని తెలియవచ్చుచున్నది.

2. జగత్సృష్టి:—

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. (గీ. 9-8)
మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్.
హేతునాఽనేన కౌంతేయ! జగ ద్విపరివర్తతే. (గీ. 9-10)

అను గీతములచే నీశ్వరాధిష్ఠితమగు ప్రకృతివలన జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు గలుగుచున్నవని యుపదేశింపఁబడుచున్నది. దానంజేసి కేవలప్రకృతియే జగత్కారణమను కాపిల సాంఖ్య వాదము నిరసింపఁబడుచున్నది.

3. పరమాత్మస్వరూపము నిర్గుణము:—

"అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్." (గీ. 9-11)

ఇచట మానుషీం, తనుమ్, అన ప్రకృతితో సంబంధించిన గుణరూపమని యాశయము. మూఢు లుత్కృష్టమగు నిర్వికారచిన్మాత్రస్వరూపమును గుర్తెఱుఁగఁజాలక సగుణరూపముతోఁ గూడినవానిగాఁ దన్ను బరిహసించుచున్నారనుటచేఁ బరమాత్మస్వరూపము సగుణ మెంతమాత్రమును గాక నిర్గుణమును నిరవయవము నని తెలియుచున్నది.

4. పరమేశ్వరుని బాధ్యత :—

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్. (గీ. 9-22)

అను గీతముచే సర్వకాలసర్వావస్థలయందుఁ దన్ను సేవించువారియొక్క యోగక్షేమములను దానే సర్వవిధముల వహించుచుంటి నని తనయొక్క బాధ్యతను సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణభగవానులు ప్రతిజ్ఞచేయుచు నట్టి ప్రతిజ్ఞను ముల్లోకములకుఁ దెలియున ట్లర్జునుని గూడఁ బ్రతిజ్ఞచేయుమని,

"కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" (గీ. 9-31)

అనుగీతముచే శాసించియున్నారు. భారతయుద్ధము ముగియునప్పటికి శ్రీకృష్ణభక్తులగు పాండవులే నిలచియుండి భారతవర్షాఖండసామ్రాజ్యమునఁ బట్టభద్రు లగుట పైప్రతిజ్ఞకు దృష్టాంతము. మహాభారతమంతయు,

"కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" (గీ. 9-31)

అను మహాభారతనాయకుఁడగు, శ్రీకృష్ణ భగవానుని యప్రతిహత ప్రతిజ్ఞను మానవకోటికంతకును బ్రదర్శింప వెలువడిన మహాగ్రంథముగా నలరారుచున్నదని ప్రాజ్ఞులు తెలిసికొందురుగాక ।

5. పవిత్రతమమగు శాసనము:—

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః" (గీ. 9-34)

అను గీతముచే రాజవిద్యారాజగుహ్యములను భగవానులు బోధించుచున్నారు.

—✱ పదవయధ్యాయము ✱—

ఏడవయధ్యాయమందును దొమ్మిదవ యధ్యాయమందును బరమాత్మయొక్క స్వరూప మవాఙ్మానసగోచర మనియు నట్టి యుత్తమస్వరూపము పరమాత్మ యందు రజ్జుసర్పమట్లు బయలువెడలిన భూతభావములద్వారా తెలిసికొనఁబడవలయుననియుఁ జెప్పెను. అనంతరము—

"బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్" (గీ. 7-10.)

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవ ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. (గీ. 9-18.)

అనుగీతములచే సకలభావములును బరమేశ్వరునియొక్క వికృతులే యని సూచింపఁబడినను నర్జునుఁడు తన పరిచ్ఛిన్నబుద్ధిచే సకలభావములను భగవద్భావములుగా గ్రహింపఁజాలక వ్యవహారమునఁ దెలియవచ్చెడి యుత్తమ మధ్యమాధమాధమాధమభావంబుల దృష్టిచే వ్యామోహమును జెందియు, సర్వాత్మత్వభావముచే భగవంతుని నుపాసించుటకు శక్తిలేమి బరిదృశ్యమానము లగు నీభావములలో గొన్నిభావములు పవిత్రతమములై యుపాస్యములగు భగవద్భావములగునని యెంచి—

"కథం విద్యా మహం యోగిం స్త్వా సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవ న్మయా. (గీ. 10-17.)

అని శ్రీకృష్ణభగవానులఁ బ్రార్థింప మందబుద్ధియగు నర్జునుని, నర్జునిని కంటెఁదక్కువవారలను ననుగ్రహింప సమకట్టి కొన్ని భగవద్విభూతుల నుపాస్య విశేషములుగా నీ యధ్యాయమం దుపదేశించుటచే నీ యధ్యాయమునకు విభూతి యోగమని పేరు గలిగినది.

విభూతివిశేషములు:—

ఈ యధ్యాయమున నిరువదవగీతము మొదలు ముప్పదితొమ్మిదవగీతము వఱకును గల పందొమ్మిదిగీతములచే నీ దిగువ నుదాహరింపఁబడిన విభూతివిశేషము లుపదేశింపఁబడినవి.

1 సర్వభూతములయొక్క హృదయాంతర్వర్తియు నహంశబ్దవాచ్యుఁడు నగు ప్రత్యగాత్మ
2 భూతసృష్టికర్త
3 భూతస్థితికర్త
4 భూతలయకర్త
5 విష్ణువు
6 రవి
7 మరీచి
8 చంద్రుఁడు
9 సామవేదము
10 వాసవుఁడు
11 మనస్సు
12 చేతనము
13 శంకరుఁడు
14 కుబేరుఁడు
15 పావకుఁడు
16 మేరువు
17 బృహస్పతి
18 కుమారస్వామి
19 సాగరము
20 భృగువు
21 ఓంకారము
22 జపయజ్ఞము
23 హిమాలయము
24 అశ్వత్థవృక్షము
25 నారదుఁడు
26 చిత్రరథుఁడు
27 కపిలమహర్షి
28 ఉచ్చైశ్శ్రవము
29 ఐరావతము
30 నరపాలుఁడు
31 వజ్రాయుధము
32 కామధేనువు
33 మన్మథుఁడు
34 వాసుకి
35 అనంతుఁడు
36 వరుణుఁడు
37 అర్యమ
38 యముఁడు
39 ప్రహ్లాదుఁడు
40 యముఁడు
41 మృగేంద్రుఁడు
42 గరుత్మంతుఁడు
43 పవనుఁడు
44 శ్రీరాముఁడు
45 మొసలి
46 గంగానది
47 జగత్సృష్టికర్త
48 జగత్స్థితికర్త
49 జగల్లయకర్త
50 అధ్యాత్మవిద్య
51 వాదకథ
52 అకారము
53 ద్వంద్వసమాసము
54 కాలము
55 ధాత
56 సర్వహరుఁడగు మృత్యువు

57 అభ్యుదయము
58 కీర్తి
59 శ్రీ
60 వాక్కు
61 స్మృతి
62 మేధ
63 ధృతి
64 క్షమ
65 బృహత్సామ
66 గాయత్రి
67 మార్గశీర్షము
68 వసంతఋతువు
69 ద్యూతము
70 తేజస్సు
71 జయము
72 వ్యవసాయము
73 సత్త్వము
74 వాసుదేవుఁడు
75 ధనంజయుఁడు
76 వ్యాసుఁడు
77 శుక్రుఁడు
78 దండము
79 నీతి
80 మౌనము
81 జ్ఞానము
82 భూతబీజము
= అని

## —* పదునొకండవ యధ్యాయము *—

నాలుగవ యధ్యాయము మొదలు పదియవ యధ్యాయాంతము వఱకుఁగల గ్రంథమును వినుటచే శ్రీకృష్ణుడు ప్రాకృత పురుషుఁడుగాక సకలజగన్నియంత యగు పరమేశ్వరుఁడని యర్జునుఁడు దెలిసికొని యద్దానిని విశ్వసించుటకును విశ్వసింపకపోవుటకును దగు నవకాశము చాలకపోవుటచే శ్రీకృష్ణభగవానులయొక్క పరాత్పరత్వము నెట్లు వాస్తవముగా గ్రహింపనగునని యోజించి పదవయధ్యాయాంతమున

"విష్టభ్యాఽహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" (గీ.)

అను నుపదేశవిశేషము నాధారముగాఁజేసికొని యీ యుపదేశించిన విధమున నీయొక్కరూపమును జూడ నిచ్ఛ కలుగుచున్నది. కాన నట్టి యవకాశ ముండెనేని యట్టిరూపమును ప్రదర్శింపుమని

"ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర!
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ!"
మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో!
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ (గీ.11-3,4)

అను గీతములచేఁ బ్రార్థింప నర్జునునియొక్క హృదయవిశేషమును గమనించిన భగవానులు తమ విశ్వరూపమును బ్రదర్శించి పదియవ యధ్యాయాంతమున నుపదేశించిన విధమున,

"ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ! యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి" (గీ. 11-7)

అను గీతముచేఁ దన విశ్వరూపముఁ జూడుమని యానతిచ్చి, తన విశ్వరూపమును బ్రదర్శించిన విధము నిందుఁ జెప్పుటచే నీయధ్యాయమునకు విశ్వరూపదర్శన యోగమనుపేరు కలిగినది.

1 అనన్యభక్తి:—

ప్రకృతమున నర్జునుఁడు శ్రీకృష్ణభగవానులయొక్క విశ్వరూపమును సందర్శించెను. అట్లితరులుకూడ సందర్శింపవలయుననినచో నెట్టియోగ్యతను బడయవలయునను విషయమునుగూర్చి యనన్యభక్తి తగు సాధనమని.

"భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!" (గీ. 11-54.)

అను గీతముచే నట్టి యనన్యభక్తిస్వరూపము నుపదేశించుచున్నారు.

భక్తలక్షణము:—

2. భక్తుఁడు:—

"మత్కర్మకృ న్మత్పరమో మద్భక్తః సంగవర్జితః
నిర్వైరః సర్వభూతేషు య స్స మా మేతి పాండవ!" (గీ 11-55)

అను గీతముచే సంక్షేపముగాఁ జెప్పబడిఁ పండ్రెండవ యధ్యాయమందలి "అద్వేష్టా సర్వభూతానాం" (గీ 12-13) అను గీతముమొదలధ్యాయపరిసమాప్తి వఱకుఁగల యెనిమిదిగీతములచే విశేషముగ వర్ణింపఁబడినది.

—* పండ్రెండవయధ్యాయము *—

భక్తియనునది కర్మయోగము, జ్ఞానయోగమను ద్వైవిధ్యముతో నొప్పు నిష్ఠయే యనియు నందధికారిభేదముచే ననుష్ఠానభేదము దెలియఁబడుచున్నదనియు సూచించుచు నట్టి యనుష్ఠానభేదము లీ యధ్యాయమున వివరింపఁబడుటచే నీ యధ్యాయమునకు భక్తియోగమను పేరు కలిగినది.

ఈ యధ్యాయముఁగూర్చి విశేషవిచారణ మిదివఱలోఁ బుష్కలముగాఁ బ్రదర్శింపఁబడియుండుటచే నిచట విరమింపఁబడినది.

—* పదమూఁడవయధ్యాయము *—

ఈ యధ్యాయము క్షేత్రమనుపేరఁ బఱగు విషయమును క్షేత్రజ్ఞుఁడను విషయిని సుస్పష్టముగ వ్యక్తీకరించుటచే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమని దీనికి వ్యవహారము కలిగినది.

1. క్షేత్రము. ఈ పరిదృశ్యమానమగు శరీరము క్షేత్రమని చెప్పఁబడుచున్నది. ఇచట శరీరమనఁగా సప్తధాతుమయమగు పిండముమాత్రమే కాక స్థూలసూక్ష్మకారణములను మూడుదేహములయొక్కసమాహారమని తెలియుచున్నది. సూక్ష్మశరీర మింద్రియములకుఁ దెలియఁబడక కార్యానుమేయ మగుచున్నది. ఈ సూక్ష్మశరీరము జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, ప్రాణము, అంతఃకరణము, అను పండ్రెండవయవములతోఁగూడి యున్నది. కొందఱు ప్రాణము వృత్తిభేదముచే నైదువిధములుగాఁ బరగుచుండుటఁజేసి యొకప్రాణమునకు మారుగా నైదుప్రాణములును నంతఃకరణముయొక్క వృత్తిభేదము స్వస్వశేముష్యనుసారముగా రెండువిధములుగను నాల్గువిధములుగను లెక్కించుటచే నీ సూక్ష్మశరీరము పదునే డవయవములతోడను బందొమ్మిది యవయవములతోడను గూడుకొనియున్నట్లు లెక్కించుచున్నారు. వాస్తవముచే భిన్నవ్యాపారములతోఁ గూడిన పండ్రెండవయవములతో నొప్పుచున్నట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. ఇఁకఁ గారణశరీరమన్న నో ప్రకృతియనియు, నజ్ఞానమనియు, నవిద్యయనియు, స్వభావమనియుఁ బలువిధములఁ జెప్పఁబడుచుఁ జిదచిత్తులను రెండంశములచేఁ గూడినట్లు కోవిదులు గ్రహించుచున్నారు. అందు నచిద్భాగము సత్త్వరజస్తమస్సులను గుణములతో నొప్పుచు నాయాయిగుణములయొక్క తరతమభావముల ననుసరించి యాయాయివ్యక్తులయొక్క తరతమభావమునకు హేతు వగుచున్నది. ఈ యచిద్భాగ మొకవిమర్శదర్పణతుల్యమై సచ్చిదానందరూపమగు పరమాత్మయొక్క ప్రతిబింబమును గ్రహించుచుండును. ఈ ప్రతిబింబమే చిదాభాసుఁడనుపేరఁ బఱగు చిద్భావము. ఆప్రతిబింబమునకే జీవుఁడని వ్యవహారము. ఈ త్రివిధమగు స్థూలసూక్ష్మకారణమగు శరీరము,

> మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవచ
> ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః
> ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
> ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. (గీ. 13-5,6)

అను గీతములచే సుస్పష్టముగ వివరింపఁబడుచున్నది.

2. క్షేత్రజ్ఞుఁడు:—

స్థూలసూక్ష్మకారణ శరీరములు మూఁడిటికిని సాక్షియగు పరమాత్మయే క్షేత్రజ్ఞుఁడనియు నట్టి క్షేత్రజ్ఞుఁడు సకల శరీరములకు నొక్కఁడేయనియు నాతఁడే పరబ్రహ్మమనియు,

> “క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత!” (గీ. 13-2)

అను గీతమువలన స్పష్టముగా నుపదేశింపఁబడుచున్నది.

3. జ్ఞానము:—
క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క విభాగమును దెలిసికొనుటయే యుత్తమ జ్ఞానమని చెప్పఁబడుచున్నది.

4. జ్ఞానమునకుఁ బ్రమాణములు
"ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః." (గీ. 13-4)
అను గీతముచే శ్రుతిస్మృతిమీమాంసాశాస్త్రములు జ్ఞానమునకుఁ బరమ ప్రమాణములుగా నుపదేశింపఁబడుచున్నది.

5. బ్రహ్మస్వరూపము:—
పండ్రెండవగీతము మొదలు పదునేడవగీతమువఱకుఁగల యాఱుగీతముల చేతను బ్రహ్మస్వరూపము సుస్పష్టముగా నుపదేశింపఁబడుచున్నది. ఈ గీతములును ప్రసిద్ధమగు పురుషసూక్తముయొక్క యర్థమును సంక్షేపముగా బోధించుచున్నవి.

6. ప్రాణులయొక్క స్వరూపద్వైవిధ్యము:—
మూడులోకములయందుఁ దెలియవచ్చెడి స్థావర జంగమరూపాత్మకములగు సకల ప్రాణులును క్షేత్రక్షేత్రజ్ఞసంయోగమువలనఁ గలుగుటంజేసి ప్రతివ్యక్తి యందును క్షేత్రక్షేత్రజ్ఞభావములు తెలియవచ్చుచున్నవని,
"యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ!" (గీ. 13-24)
అను గీతముచేఁ దెలియవచ్చుచున్నది.

## —* పదునాల్గవ యధ్యాయము *—

ఈ యధ్యాయమునందు సకల ప్రాణులును బ్రకృతిగుణములగు సత్త్వ రజస్తమస్సులయొక్క వికారములతో నొప్పుచున్నవనియు దానంజేసి సకల ప్రాణులును సాత్త్విక రాజస తామసభావములచే భేదము నొందుచున్నవనియు నిరూపింపఁ బడుటవలన నీయధ్యాయమునకు గుణత్రయ విభాగయోగమని పేరు గలిగెను.

1. బంధహేతువు:—
ప్రకృతిగుణములగు సత్త్వరజస్తమస్సులు దేహిని దేహమందు బంధించుటచే దేహికి సంసారము గలుగుచున్నదని,
సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్. (గీ. 14-5)
అను గీతముచేఁ జెప్పఁబడుచున్నది.

2. గుణాతీతుఁడు:—

దేహోత్పత్తికిఁ గారణభూతములగు సాత్త్వికరాజస తామసగుణముల నతిక్రమించిన గుణాతీతుఁడు జననమరణ ప్రవాహరూపమగు సంసారమునుండి విముక్తుఁడై బ్రహ్మభావము నొందునని,

"గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే." (గీ.14-20)

అను గీతముచే నుపదేశింపఁ బడుచున్నది. ఇట్టి గుణాతీతుఁడే ప్రకరణాంతరములయందు స్థితప్రజ్ఞుఁడనియు జ్ఞానియనియు భక్తుఁడనియు సంన్యాసియనియు యోగియనియు వేఱువేఱు నామములచేఁ బేర్కొనఁ బడుచున్నాఁడు.

3. గుణముల నతిక్రమించుటకుఁ దగు సాధనము:—

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. (గీ. 14-26)

అను గీతముచే భక్తియోగము గుణముల నతిక్రమించుట కుత్తమసాధనమని యుపదేశింపఁ బడుచున్నది.

—* పదునైదవయధ్యాయము *—

ఈ యధ్యాయము పురుషోత్తముఁడను పేరఁ బరమాత్మను నిర్దేశించి యట్టి పరమాత్మస్వరూపమును సంపూర్ణముగా నిరూపించుటచే నీ యధ్యాయమునకు బురుషోత్తమయోగమని పేరు కలిగినది.

1. సర్వకర్మసంన్యాసము:—

"అసంగశస్త్రేణ దృఢేన చ్ఛిత్త్వా
తతః పదం తత్పరిమార్గితవ్యమ్. (గీ. 15-34).
నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్. (గీ. 15-5.)

అను గీతములచే సర్వకర్మసంన్యాసము పరమాత్మాన్వేషణమునఁ బ్రధాన ద్వారముగా నుపదేశింపఁబడుచున్నది.

2. పురుషత్రయము:—

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ
క్షరస్సర్వాణి భూతాని కూటస్థో౽క్షర ఉచ్యతే." (గీ. 15-16.)

అను గీతముచే క్షరుఁడనియు నక్షరుఁడనియు నిద్దరు పురుషు లున్నా రనియు నట్టి క్షరాక్షరులకంటెఁ బరమాత్మయగు తాను బురుషోత్తముఁడని సకల ప్రమాణములును బ్రతిపాదించుచున్నవనియు.

"యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః." (గీ. 15-18.)

అను గీతముచే శ్రీకృష్ణభగవాను లుపదేశించుచున్నారు.

## —* పదునాఱవ యధ్యాయము *—

మానవకోటియందుఁ దెలియవచ్చెడి వ్యక్తులన్నియు దైవాసుర సంపత్తులను ద్వివిధ భావములతో నొప్పుచున్నారని,

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ. (గీ. 16-6.)

అను గీతముచేఁ బ్రతిపాదించి యట్టివ్యక్తివిశేషముల తత్త్వము దెలిసికొను టకుఁ దగు లింగముల నీ యధ్యాయమునం దుపదేశించుటచే నీ యధ్యాయమునకు దైవాసుర సంపద్విభాగయోగ మను పేరుగలిగెను.

## —* పదునేడవ యధ్యాయము *—

మానవకోటియందు వ్యక్తివిశేషము లనుసరించు కార్యవిశేషము లాయాయి పురుషులయొక్క శ్రద్ధావిశేషము ననుసరించి యుండుననియు నట్టి శ్రద్ధ సాత్త్వికము, రాజసము, తామసమను త్రైవిధ్యమును బొందుచున్నదనియు నీ యధ్యాయమునఁ జెప్పఁబడుటచే నీ యధ్యాయమునకు శ్రద్ధాత్రయ విభాగ యోగమను పేరు గలిగెను.

1. కర్తృస్వభావము:—

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః సఏవ సః.
(గీ. 16-3.)

అను గీతముచే సకలప్రాణులకును శ్రద్ధయనునది యాయాయిప్రాణుల యొక్క యంతఃకరణమునందలి ప్రాక్తనజన్మసంస్కారానుగుణముగా నొప్పు చుండుననియు నే వ్యక్తి యెట్టి శ్రద్ధతోఁ గూడియుండునో యట్టి భావముతోడనే లోకమునఁ దెలియవచ్చుచుండుననియు, నట్టిభావము ననుసరించియే యాయాయి వ్యక్తులయొక్క మానసిక వాచిక కాయిక వ్యాపారములు బరగుచుండుటఁ జేసి పురుష ప్రవృత్తులయందు వైచిత్ర్యము గన్పట్టుచున్నదనియు వ్యావహారికప్రపంచము యొక్క వైచిత్ర్యమునకు హేతువు ప్రదర్శింపఁబడుచున్నది.

2. బ్రహ్మయొక్క త్రివిధనిర్దేశము.

"ఓమ్ తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః" (గీ. 17-23.)

అను గీతముచే బ్రహ్మకు 'ఓమ్' 'తత్' 'సత్' అను పేర్లు ఋషులచే స్మరింపఁబడుచున్నవని చెప్పఁబడుచున్నది.

—* పదునెనిమిదవ యధ్యాయము *—

ఈ యధ్యాయము పూర్వమందుఁ జెప్పబడిన పదునా అధ్యాయముల యొక్క సారమును బోధించుచు నుత్కృష్టపురుషార్థరూపమగు మోక్షమునకు సర్వకర్మసంన్యాస మసాధారణకారణమని నిర్వచించునట్టి

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" (గీ.18-66.)

అను చరమగీతముచే నొప్పుచున్నందున నీ యధ్యాయమునకు మోక్షసంన్యాసయోగ మనుపేరు కలిగెను.

1. గీతాసాంప్రదాయము.

ఈ యధ్యాయమున విశేషముగాఁ జెప్పబడినట్టిదియు గమనింపఁదగినట్టిదియు గీతాసాంప్రదాయవిశేష మై యున్నది. గీతాసాంప్రదాయమునుగూర్చి సాంప్రదాయప్రవర్తకులకు

ఇదం తే నాఽతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

(గీ.18-67.)

అను గీతముచే శ్రీకృష్ణభగవాను లాక విషయమును శాసించియున్నారు. దీనినిబట్టి యీ జ్ఞానము నభిలషించువారు శ్రీకృష్ణభగవానులయందలి యనన్యభక్తితో శుశ్రూషాపూర్వకముగా నవిచ్ఛిన్నపారంపర్యక్రమమున నొప్పుచుండెడి సాంప్రదాయ ప్రవర్తకులవలన నీ శాస్త్ర ముపదేశ మందవలయునని తెలియవచ్చుచున్నది.

"పుస్తకేషు చ నాఽధీతం నాఽధీతం గురుసన్నిధౌ
విద్యాహీనా న శోభన్తే జారగర్భా ఇవ స్త్రియః.

అను నార్యోక్తివలన గురూపదేశ శూన్యముగను స్వస్వమనీషాఽనుగుణముగను నభ్యసింపఁబడిన విద్య ప్రయోజనముఁ గననేరదని తెలియవచ్చుచున్నది. సామాన్య విద్యలకే యిట్టి నియమము వర్తించుచుండ సద్గురుపరంపరాఽఽగతమగు బ్రహ్మవిద్యను గూర్చి సాంప్రదాయములయొక్క యనుసరణము ముఖ్యమని ప్రత్యేకముగ వివరింప నవసరములేదు. అయినను దేశకాలపాత్రానుసారముగా జిజ్ఞాసువుల నుద్దేశించి యొకింత ప్రదర్శింపఁ బడుచున్నది.

గీతాసాంప్రదాయము బ్రహ్మర్షి సాంప్రదాయము, రాజర్షి సాంప్రదాయమను రెండు సాంప్రదాయములద్వారా ప్రవర్తింప జేయఁబడి యున్నది. అందు రాజర్షి సాంప్రదాయ మత్యంతము ప్రకృతమున లోపించినది. బ్రహ్మర్షి సాంప్రదాయము సర్వవిధముల వన్నెకెక్కి మూర్తీభవించియే యున్నది. బ్రహ్మర్షి సాంప్రదాయమన్న నీ గీతాశాస్త్రమును సద్గురుపారంపర్యముగా యథోచితవిధి నధ్యయనముఁ గావించిన బ్రాహ్మణశ్రేష్ఠుల సాంప్రదాయము. అనఁగాఁ బ్రస్థానత్రయకోవిదులని యాశయము. ప్రస్థానత్రయకోవిదులగు బ్రాహ్మణపుంగవులకు దక్క వేఱొకరికీ గీతాశాస్త్రము నుపదేశింప నించుకేనియు నవకాశములేదని ప్రాజ్ఞులు సులభముగ గ్రహింపఁగలరు. ప్రస్థానత్రయమనఁగా, (1) శ్రుతి ప్రస్థానము, (2) స్మృతిప్రస్థానము, (3) మీమాంసాప్రస్థానము. ఈ మూఁడుప్రస్థానములతో నీ గీతాశాస్త్రమునకుఁ బుష్కలమగు సంబంధ మున్నటుల—

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః. (గీ.13-4)

అను గీతముచే శ్రీకృష్ణభగవానులు నిర్వచించియున్నారు. దానంజేసి ప్రస్థానత్రయ కోవిదులగు బ్రాహ్మణుల వలననే యీ గీతాశాస్త్ర మిక్కాలమున నభ్యసింపఁబడవలయును. ప్రస్థానత్రయకోవిదు లగు బ్రాహ్మణుల కంటె భిన్నులగువారీ గీతాశాస్త్ర ముపదేశింతు మనినను నట్టి వారివలన గ్రహింతు మని తలంచిన నయ్యది యంతేయు నాడంబరమాత్రమే యై దుష్కృతమునకు మూలమగును గాని వేఱొండు గానేఱదు. ఇందలి స్వారస్య మొకింత లౌకిక న్యాయముచేఁ బ్రదర్శింతము. ఈ గీతాశాస్త్రము గీర్వాణభాషతో నొప్పుచున్నది. గీర్వాణభాష యనఁగా సంస్కృతమను వ్యవహారముచేఁ బరగు భాష యని యెల్లరు నెఱింగిన విషయమే. సంస్కృతభాషాజ్ఞానము లేనివారీ గ్రంథమును సద్గురుముఖమున నభ్యసించిన నభ్యసింపవచ్చును. దానఁ బ్రత్యవాయము మాత్రము లేదు. కాని భాషాజ్ఞానమును గల్గినంతమాత్రమున నీ గ్రంథమును స్వతంత్రించి చదువుటకుఁ గాని యొకరికి బోధించుటకు గాని తగిన యధికార మెంతమాత్రమును గల్గి యుండ నేరరు. సామాన్యశాస్త్రజ్ఞానము గూడ నీ గ్రంథపఠనపాఠములకుఁ జాలదు ఉత్తమశాస్త్రజ్ఞానసంపన్నుఁడైన నీ గ్రంథమును స్వతంత్రించి చదువుటకుఁ దగు యోగ్యతను బడయఁడు. సద్గురుముఖమునఁ బ్రస్థానత్రయమును శ్రాంతి జేసిన యుత్తమజ్ఞానసంపన్నుఁడీ గీతాశాస్త్రమును విచారించుటకును వేఱొకరికి నుపదేశించుటకును సమర్థుఁడగుచున్నాఁడు. గీతాశాస్త్రమును బోధించువారల కిట్టి యధికార ముండవలెనను విషయము స్పష్టముగ నుండ, సంస్కృతభాష యన నెద్దియో యించుకేనియు గుర్తెఱుంగని భాషాకోవిదులును, పంచాశద్వర్ణములనైన స్పష్టముగ నుచ్చరింపఁ జాలనిజాత్యంతరులును, వైదిక సాంప్రదాయ

విదూరులగు దస్యులును నీ పుస్తకమును జేఁబూని వీథులయందుఁ బ్రిగల్భములఁ గొట్టువా రెట్టివారుగా శ్రుతిస్మృతిసదాచారములచేఁ బరిగణింపఁబడవలయునో యా శ్రీకృష్ణభగవానులకే యెఱుక. ప్రస్థానత్రయకోవిదులగు బ్రాహ్మణశ్రేష్ఠుల కంటె భిన్నులగువా రీ గీతాశాస్త్రమును బ్రబోధింతుమను సాహసమునకుఁ గడం గుట దాంభిక వేషములచే లోకవంచన మొనర్చుటగాని వేఱొండుగా నేఱదు. కావున బుద్ధిమంతులగు జిజ్ఞాసువు లీ లోకవంచకుల బారిపడకుండ సద్గురువుల వలన నీ గీతాశాస్త్రము నభ్యసించి యైహికాముష్మికనిశ్శ్రేయసములఁ బడయు దురుగాఁత!

**2. అవశ్యాచరణీయము:—**

"యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. (గీ. 18-5.)

అను గీతముచే యజ్ఞదానతపస్సు లను మూఁడువిధములగు కర్మలు తప్పక చేయఁబడవలయునని భగవచ్ఛాసనము.

**3. మానుషస్వభావము:—**

"న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః" (గీ. 18-11)

అను గీతముచేఁ గర్మాచరణమునందలి ప్రీతి మనుష్యుల కెక్కువగా నుండుటయే కాక పుష్కలముగాఁ గర్మల విడనాడుట యశక్యమని మానుషస్వభావమందలి లోపము ప్రదర్శింపఁబడుచున్నది.

**4. కర్మఫలత్రైవిధ్యము:—**

"అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్."
(గీ. 18-12.)

అను గీతముచే సర్వకర్మసంన్యాసమును గావించి సమ్యగ్దర్శనముచే బ్రహ్మ భావమునొందిన మహానుభావులకుఁ దక్క తదితరుల కెల్లరకు నిష్టము, నసిష్టము, మిశ్రమను మూఁడువిధములగు ఫలములలో నెద్దియో యొకటి వారివారి యధికారానుగుణముగ మరణానంతరమునఁ గల్గుచున్నదని యుపదేశింపఁబడుచున్నది.

**5. కర్మసిద్ధిహేతువులు:—**

"అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాఽత్ర పంచమమ్
శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. (గీ. 18-14, 15.)

అను గీతములచేఁ గర్మసామాన్యమున కంతకు నధిష్ఠానము, కర్త, కరణము చేష్ట, దైవమను నైదు కారణములు గల్గినఁగాని సిద్ధి కలుగనేరదని తెలియవచ్చు చున్నది.

6. కర్మప్రవృత్తిహేతువులు:—

"జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా." (గీ.18-18.)

అను గీతముచే జ్ఞానజ్ఞేయపరిజ్ఞాతలయొక్క సంబంధముచేతనే సర్వకర్మల యందుఁ బ్రవృత్తి కలుగుచున్నదని తెలియుచున్నది.

7. కర్మసంగ్రహము:—

"కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః." (గీ. 18-18.)

అను గీతముచేఁ గరణము, కర్మ, కర్తయను మూఁడిఁటియందును సర్వకర్మలు నిమిడి యున్నవని తెలియుచున్నది.

8. ఈశ్వరస్థానము.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి" (గీ. 18-61.)

అను గీతముచే సకలభూతములయొక్క యంతఃకరణమునం దీశ్వరుఁ డంత ర్యామిరూపముగా నిలచియున్నాఁడని బోధింపఁబడుచున్నది.

9. కర్తృత్వము:—

"విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు" (గీ. 18-63.)

శ్రీకృష్ణభగవానులు శాస్త్రమునంతయు నుపదేశించి యీ నాచేఁ జెప్పఁబడిన దానినంతను బుద్ధ్యకలముగా విమర్శించి నీ యిచ్చవచ్చినట్లు చేయుమని యీ గీతముచేఁ జేయఁదలచిన కార్యములయందు స్వాతంత్ర్యము నర్జునునకు విడచి యున్నారు. ఇట్టి యాశయమునే -

"జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి" (గీ.16-24.)

అను గీతముచేఁగూడ నిర్వచించియున్నారు. దీనిఁబట్టి పురుషునకు యుక్తా యుక్తముల విచారించుకొని స్వతంత్రముగాఁ గార్యములయందు బ్రవర్తింపఁగల శక్తి సంపూర్ణముగా నున్నదని సుస్పష్టమగుచున్నది.

10. సకలశాస్త్రతాత్పర్యసంగ్రహము:—

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే." (గీ. 18-65)

అను గీతముచేఁ గర్మయోగమును,

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ. (గీ. 18-66.)

అను గీతముచే జ్ఞానయోగమును సంక్షేపముగను సమగ్రముగను జెప్పఁబడుటవలన నీరెండుగీతములు నీగీతాశాస్త్రసారభూతములగుచు సకలశాస్త్రతాత్పర్యముగా నలరారుచున్నవి. శ్రీకృష్ణశాసనము.

## —* శ్రీకృష్ణశాసనము - నారాయణస్మృతి. *—

సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణరూపమున వివస్వంతునకును, మనకు సన్నిహితమగు ద్వాపరాంతమున శ్రీకృష్ణరూపమున నర్జునునకును నీశ్వరునిచే నుపదేశింపఁబడిన యీ గీతాశాస్త్రమువలన లోకమున కీశ్వరునిచే నెట్టి యాచరణ ముపదేశింపఁబడుచున్న దనునది సంగ్రహముగ జిజ్ఞాసువులకు గోచరముగాఁగ శ్రీకృష్ణోపదేశమగు పదునేడధ్యాయములందును దెలియవచ్చెడి విధ్యనువాదములు సక్రమముగాఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

| | | |
|---|---|---|
| 1 | తాం స్తితిక్షస్వ భారత! | (గీ. 2-14) |
| 2 | తస్మా ద్యుధ్యస్వ భారత! | (గీ. 2-18) |
| 3 | నాఽనుశోచితు మర్హసి | (గీ. 2-25) |
| 4 | తస్మా దుత్తిష్ఠ కౌంతేయ! | (గీ. 2-37) |
| 5 | నిస్త్రైగుణ్యో భవార్జున! | (గీ. 2-45) |
| 6 | మా కర్మఫలహేతు ర్భూః | (గీ. 2-47) |
| 7 | మా తే సంగోఽ స్త్వకర్మణి | (గీ. 2-47) |
| 8 | యోగస్థః కురు కర్మాణి | (గీ. 2-48) |
| 9 | బుద్ధౌ శరణ మన్విచ్ఛ | (గీ. 2-49) |
| 10 | తస్మా ద్యోగాయ యుజ్యస్వ | (గీ. 2-50) |
| 11 | యుక్త ఆసీత మత్పరః | (గీ. 2-61) |
| 12 | నియతం కురు కర్మ త్వం | (గీ. 3-8) |
| 13 | తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర | (గీ. 3-9) |
| 14 | కర్మ బ్రహ్మోద్భవం విద్ధి | (గీ. 3-15) |
| 15 | కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహం | (గీ. 3-25) |
| 16 | న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ | (గీ 3-26) |
| 17 | జోషయే త్సర్వకర్మాణి, విద్వాన్ | (గీ. 3-26) |
| 18 | తయో ర్న వశ మాగచ్ఛేత్ | (గీ. 3-34) |
| 19 | పాప్మానం ప్రజహీ హ్యేనం | (గీ. 3-41) |
| 20 | కర్మణో హ్యపి బోద్ధవ్యమ్ | (గీ. 4-17) |
| 21 | బోద్ధవ్యం చ వికర్మణః | ( ,, ) |
| 22 | అకర్మణశ్చ బోద్ధవ్యమ్ | ( ,, ) |

23 కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్ (గీ. 4-32)
24 తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా (గీ. 4-34)
25 యోగ మాతిష్ఠ (గీ. 4-42)
26 న తేషు రమతే బుధః (గీ. 5-22)
27 ఉద్ధరే దాత్మనాఽఽత్మానం (గీ. 6-5)
28 నాత్మాన మవసాదయేత్ (గీ. 6-5)
29 యోగీ యుంజీత (గీ. 6-10)
30 స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా (గీ. 6-23)
31 న కించి దపి చింతయేత్ (గీ. 6-25)
32 ఏత దాత్మన్యేవ వశం నయేత్ (గీ. 6-26)
33 తస్మా ద్యోగీ భవార్జున! (గీ. 6-46)
34 తచ్ఛృణు (గీ. 7-1)
35 ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ (గీ. 7-6)
36 బీజం మాం విద్ధి పార్థ! సనాతనమ్ (గీ. 7-10)
37 మత్త ఏవేతి తా న్విద్ధి (గీ. 7-12)
38 మా మనుస్మర (గీ. 8-7)
39 యోగయుక్తో భవార్జున! (గీ.8-27)
40 పశ్య మే యోగ మైశ్వరం (గీ. 9-5)
41 త త్కురుష్వ మదర్పణమ్ (గీ.9-27)
42 కౌంతేయ ప్రతిజానీహి! (గీ. 9-31)
43 భజస్వ మామ్ (గీ. 9-33)
44 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు (గీ. 9-34)
45 త త్తదే వాఽవగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవం (గీ. 10-41)
46 తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ (గీ. 11-33)
47 త్వం జహి, మా వ్యథిష్ఠా, యుధ్యస్వ (గీ. 11-34)
48 మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ (గీ. 12-7)
49 అభ్యాసయోగయుక్తేన మా మిచ్ఛాప్తుం ధనంజయ! (గీ. 12-9)
50 మత్కర్మపరమో భవ (గీ. 12-10)
51 సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ (గీ. 12-11)
52 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి (గీ. 13-2)
53 తతః పదం త త్పరిమార్గితవ్యం (గీ. 15-4)
54 తత్తేజో విద్ధి మామకమ్ (గీ. 15-12)
56 మా శుచః (గీ. 16-5)

57 యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ (గీ. 18-5)
58 మచ్చిత్త స్సతతం భవ (గీ. 18-57)
59 తమేవ శరణం గచ్ఛ (గీ. 18-62)
60 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు (గీ. 18-65)
61 సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ (గీ. 18-66)

శ్రీకృష్ణభగవానులు:—

ఇంతవఱకు శ్రీకృష్ణభగవానుల యుపదేశమును గూర్చియే విపులముగ జర్చించితిమి. కాని యుపదేశకుఁడగు శ్రీ భగవానుల స్వరూపస్వభావముల నించుకేనియుఁ జర్చింపలేదు. ఉపదేశగౌరవము ఉపదేశకుని గౌరవము ననుసరించియుండు గావున శ్రీకృష్ణునియొక్క స్వరూపస్వభావము లింతవఱకుఁ గడచిన గ్రంథము వలనఁ దెలియవచ్చు క్రమమున నిరూపింపబడుచున్నవి ఇట్టి శ్రీకృష్ణభగవానుని స్వరూప స్వభావ గుణవర్ణనకంటె వేఱొండు పవిత్రతమమగు విషయములేదు. కావున నిద్దానిని నిరూపించుటచేఁ బ్రస్తావనోపసంహారము చేయఁబడుచున్నది.

శ్రీకృష్ణభగవాను లీ గ్రంథమునందుఁ దొలుత -

"తతః శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః." (గీ. 1-14)

అను గీతమునందుఁ బేర్కొనఁబడియున్నారు. ఇట్టి తరుణమున శ్రీకృష్ణభగవాను లర్జునుని దృష్టియం దెట్లు భాసించుచున్నారనిన రథసారథివలె నని వేఱఁ జెప్పనక్కరలేదు. యుద్ధమునందలి రథచోదకుఁడు యోధవీరునితో సమానమగు ప్రజ్ఞావిశేషముతో నొప్పుచుండు గావున నర్జునుఁడు శ్రీకృష్ణభగవానుల నొక యాప్తునిగను బంధువునిగను, తనతోఁ దుల్యునిఁగను గమనించియున్నట్లు సామాన్యముగా గ్రహింపనగును. దానంజేసియే యర్జునుఁడు,

"సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!" (గీ.1-21)

అని యుద్ధారంభమున విల్లెక్కువెట్టి యాజ్ఞాపించుచున్నాఁడు. పిమ్మట నుభయసైన్యంబులను లెస్సగాఁ దిలకించి యెదుట భీష్మద్రోణాదులఁ గని యిఁక యుద్ధమునుండి విరమించుటయే దిక్కని తలఁచి రథమును వెనుకకు మఱలింపవలయునను నాశయముతో శ్రీ కృష్ణభగవానులఁగూర్చి,

"యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్."
(గీ. 1-46.)

అని పలికినాఁడు. ఇట్టి యర్జునుని భావములను శ్రీకృష్ణభగవానులు గ్రహించి యట్టి యుద్ధోపక్రమమున కియ్యకొనక యుపహాసము సేయ నర్జునుఁ డొకింత తెలివిఁ

దెచ్చుకొని తన యజ్ఞతను దెలిసికొనుచు శ్రీకృష్ణభగవానులయందు గురుభావ ముంచి—

"శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం" (గీ.2-7)

అని తనకు శ్రేయము నుపదేశింపు మనుచుఁ గోరెను. అట్టి త్రికరణశుద్ధితో నొప్పుచుండెడి శిష్యునిఁ గృతార్థత నొందింప శ్రీకృష్ణభగవాను లర్జునునకు సాంఖ్యయోగముల తత్త్వము నొకింత బోధించెను. అందుపై నొకింత సందియ మర్జునునకుఁ గలుగ నద్దానిని మూఁడవయధ్యాయగ్రంథముచే శ్రీభగవానులు తొలగింప నర్జునుఁడు సందియమును వీడి కృతకృత్యుఁడై నిలిచియున్నట్లు తెలియవచ్చుచున్నది. కావున శ్రీభగవాను లర్జునునకు శ్రేయస్సాధనము నుపదేశించిన గురువని సుస్పష్టము.

ఇఁక బ్రకృతమున గమనింపవలయు విషయము. శ్రీకృష్ణభగవానులొక యర్జునునికే గురువా? లేక నింక నెవరికైన గురువా? అర్జునగురుఁ డగు శ్రీకృష్ణభగవానుల స్వరూపస్వభావము లెట్టివి? అని యేతద్విషయము సంక్షేపముగా ముచ్చటింపఁబడును. శ్రీకృష్ణోపదిష్ట మగు గీతాశాస్త్రమును జగద్గురువులగు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసులు ప్రస్థానత్రయమున నొక గ్రంథరాజముగా గ్రహించి పారంపర్యక్రమమునఁ బ్రవర్తింపఁజేయుటవలన శ్రీకృష్ణభగవానులు వేదవ్యాసులచేఁ గూడఁ బూజింపఁబడినటుల స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఇంతియే కాదు. వేదవ్యాసశాసన ముత్తమశాసన మని శిరసా వహించు శ్రీశంకర భగవత్పాద రామానుజానందతీర్థ వల్లభ చైతన్యాది మతప్రవర్తకు లందఱు నేకగ్రీవముగా నీగీతాశాస్త్రముఁ బరమప్రమాణముగ శిరసా వహించి రచించిన విపులములగు వ్యాఖ్యలు నేఁటివఱకును పరమప్రమాణములుగాఁ బ్రవర్తించుచుండుట సువిదితమే యైయున్నది. దానంజేసి భారతభూమియందే యే మతము లెట్లెట్లు ప్రవర్తించిన నాయాయి మతస్థు లీగీతాశాస్త్రమును బరమప్రమాణముగ నంగీకరించుట సుప్రసిద్ధమగు నిర్వివాదాంశము. వేయేల! ఈ కాలమున మతాంతరులు సైత మీ గీతాశాస్త్రము నుత్తమగ్రంథముగాఁ దలఁచి యందలి జ్ఞానమును సంపాదింపఁదలఁచుచున్నారు. దానంజేసి యీ గీతాశాస్త్రమును గురుక్షేత్రమున శ్రీకృష్ణభగవాను లర్జునున కుపదేశించినది మొదలు నేఁటివఱకు నీ గ్రంథము నశేషవిద్వజ్జనులచేఁ బరమప్రమాణముగాఁ దలంపఁబడుటచే శ్రీకృష్ణభగవానులు నేఁటివఱకు నఖిలజగత్తునకు గురువుగాఁ దలంపఁబడుచున్నా రనుట నిర్వివాదము. అందుచే—

"వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్."

అను స్తవము సర్వలోకసామాన్యముగాఁ బరగుచున్నది. కనుక శ్రీకృష్ణ భగవానులు సకలలోకపూజ్యులగు జగద్గురువులని తెలియునది.

శ్రీకృష్ణభగవానులయొక్క జగద్గురు ప్రస్తావన గురించి ప్రకృతగ్రంథ సందర్భవశమున గ్రంథస్వవిషయములనుండి తెలియవచ్చెడి విషయమును గూడ నొకింత చర్చింతము.

శ్రీకృష్ణభగవాను లర్జునునకు సారథ్య మొనర్చుచున్నారు. యోధవీరుఁడును సారథియు సమానస్కంధులుగ నుండుట సామాన్యమని చెప్పఁబడినది. శ్రీకృష్ణభగవానులు వ్యావహారిక దృష్టిచే నర్జునునకు మేనమామ కుమారుఁడుగ దెలియవచ్చుచున్నారు. నాలుగవ యధ్యాయప్రారంభమున—

"ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః." (గీ. 4-2)

అను గీతముచే నీయోగశాస్త్రము రాజర్షుల పరంపరలోఁ బ్రవృత్తిని జెంది యున్నదని చెప్పఁబడెను.

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః." (గీ. 3-20)

అను గీతముచే జనకుఁ డశ్వపతి మొదలగు రాజర్షులను జెప్పిన ప్రకరణమున,

"లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి." (గీ. 3 20)

అని యర్జునునకు లోకసంగ్రహము నాలోచించియైన కర్మఁ జేయవలయు నను ప్రస్తావనమందు,

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి." (గీ. 3-22)

అని లోకసంగ్రహకాములగు జనకాదులతోఁ బాటు తన్ను సంకీర్తించు కొనుటచే శ్రీకృష్ణభగవాను లుత్తమోత్తముఁ డగు రాజర్షివలెఁ దెలియవచ్చుచున్నారు. ఈ గీతాశాస్త్రమున కంశియగు శ్రీమహాభారతము, తత్కథానాయకుం డగు శ్రీకృష్ణభగవానులయొక్క రాజర్షి భావమును వ్యక్తీకరించుచు శ్రీకృష్ణభగవానుల యొక్క పరమాశయమగు—

యది హ్యహం న వర్తేయ జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మాఽనువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః
ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మచే దహమ్
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. (గీ. 3-23, 24)
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే. (గీ. 4-8.)

ఈ గీతములచేఁ దెలియవచ్చెడి ధర్మసంస్థాపన మెట్లు నిర్వహింపఁబడెను? అద్దానిని బువ్కలముగ నిరూపించుటచే మహాభారతమందుఁగూడ శ్రీకృష్ణభగవానులయొక్క రాజర్షి భావమే సువ్యక్తమగుచున్నది. రాజర్షిగా వ్యవహరించిన శ్రీకృష్ణభగవానులయొక్క కార్యములన్నియు ధృతరాష్ట్రునిచే నిట్లు సంక్షేపముగా ముచ్చటింపఁబడినవి.

లోకానాం గురు రత్యర్థం లోకనాథః సనాతనః,
నారాయణో రణే నాథో దివ్యో దివ్యాత్మకః ప్రభుః.
(మ. భా. ద్రో). అధ్యా 11. శ్లో 76)

యస్య దివ్యాని కర్మాణి ప్రవదంతి మనీషిణః,
తా న్యహం కీర్తయిష్యామి భక్త్యా స్థైర్యార్థ మాత్మనః. 77.

సంవర్ధతా గోపకులే బాలేనైవ మహాత్మనా,
విఖ్యాపితం బలం బాహ్వో స్త్రిషు లోకేషు సంజయ!
(మ. భా. ద్రో). అ 12. శ్లో 2)

పూతనాం శకటం హత్వా కేశినం చైవ వాజినమ్,
ఋషభం ధేనుకం చైవ అరిష్టం చ మహాబలమ్. ,, 3

దావా న్ముక్త్వా మహాబాహు ర్ధృత్వా గోవర్ధనం గిరిమ్,
చాణూరం ముష్టికం చైవ రంగమధ్యే నిహత్యచ. ,, 4

ప్రలంబం నరకం జంభం పీఠం చాపి మహాసురమ్,
మురం చాఽంతకసంకాశ మవధీ త్పుష్కరేక్షణః. ,, 5

తథా కంసో మహాతేజా జరాసంధేన పాలితః,
విక్రమేణైవ కృష్ణేన సగణః పాతితో రణే. ,, 6

సునామా రణవిక్రాంతస్సమగ్రాక్షౌహిణీపతిః,
భోజరాజస్య మధ్యస్థో భ్రాతా కంసస్య వీర్యవాన్. ,, 7

బలదేవద్వితీయేన కృష్ణేనాఽమితఘాతినా,
తరస్వీ సమరే దగ్ధః ససైన్య శ్శూరసేనరాట్. ,, 8

దుర్వాసా నామ విప్రర్షి స్తథా పరమకోపనః.
ఆరాధిత స్సదారేణ స చాస్మై ప్రదదౌ వరాన్. ,, 9

తథా గాంధారరాజస్య సుతాం వీరః స్వయంవరే,
నిర్జిత్య పృథివీపాలా నావహ త్పుష్కరేక్షణః. ,, 10

అమృష్యమాణా రాజానో యస్య జాత్యా హయా ఇవ.
రథే వైవాహికే యుక్తాః ప్రతోదేన కృతవ్రణాః. ,, 11

జరాసంధం మహాబాహు ముపాయేన జనార్దనః,
పరేణ ఘాతయామాస సమగ్రాక్షౌహిణీపతిమ్. ,, 12
చేదిరాజం చ విక్రాంతం రాజసేనాపతిం బలీ,
అర్ఘే వివదమానం చ జఘాన పశువ త్తదా. ,, 13
సౌభం దైత్యపురం స్వస్థం శాల్వగుప్తం దురాసదమ్,
సముద్రకుక్షౌ విక్రమ్య పాతయామాస మాధవః. ,, 14
అంగా న్వంగాన్ కళింగాంశ్చ మాగధాన్ కాశికోసలాన్,
వాత్స్యగార్గ్యకరూషాంశ్చ పౌండ్రాం శ్చాప్యజయ ద్రణే. ,, 15
ఆవంత్యాన్ దాక్షిణాత్యాశ్చ పార్వతీయాన్ దశేరకాన్
కాశ్మీరకా నౌరసికాన్ పిశాచాంశ్చ సముద్గలాన్. ,, 16
కాంభోజా న్వాటధానాంశ్చ చోళా న్పాండ్యాశ్చ సంజయ!
త్రిగర్తా న్మాలవాంశ్చైవ దరదాంశ్చ సుదుర్జయాన్. ,, 17
నానాదిగ్భ్యశ్చ సంప్రాప్తాన్ ఖశాంశ్చైవ శకాం స్తథా,
జితవాన్ పుండరీకాక్షో యవనం చ సహానుగమ్. ,, 18
ప్రవిశ్య మకరావాసం యాదోగణనిషేవితమ్,
జిగాయ వరుణం సంఖ్యే సలిలాంతస్గతం పురా. ,, 19
యుధి పంచజనం హత్వా దైత్యం పాతాళవాసినమ్,
పాంచజన్యం హృషీకేశో దివ్యం శంఖ మవాప్తవాన్. ,, 20
ఖాండవే పార్థసహిత స్తోషయిత్వా హుతాశనమ్,
ఆగ్నేయ మస్త్రం దుర్ధర్షం చక్రం లేభే మహాబలః. ,, 21
వైనతేయం సమారుహ్య త్రాసయిత్వాఽమరావతీమ్,
మహేంద్రభవనా ద్వీరః పారిజాత ముపానయత్. ,, 22
తచ్చ మర్షితవా ఞ్ఛక్రో జానం స్తస్య పరాక్రమమ్,
రాజ్ఞాం చాప్యజితం కంచిత్ కృష్ణేనేహ న శుశ్రుమ. ,, 23
నాఽలంతో విక్రమయుక్తస్య బుద్ధ్యా యుక్తస్య వా పునః ,, 26
న యదా తాత! సన్నహ్యే త్పాండవార్థాయ సంజయ!
న తదా ప్రతిసంయోద్ధా భవితా తత్ర కశ్చన. ,, 33
యది స్మ కురవః సర్వే జయేయు ర్నామ పాండవాన్,
వార్ష్ణేయోఽర్థాయ తేషాం వై గృహ్ణీయా చ్ఛస్త్రముత్తమమ్. ,, 34
తత స్సర్వా న్నరవ్యాఘ్రో హత్వా నరపతీ న్రణే,
కౌరవాంశ్చ మహాబాహుః కుంత్యై దద్యా త్సమేదినీమ్. ,, 35

యస్య యంతా హృషీకేశో యస్య యోద్ధా ధనంజయః,
రథస్య తస్య క స్సంఖ్యే ప్రత్యనీకో భవే ద్రథః. ,, 36

ద్వాపరాంతమున భారతవర్షమంతయు సార్వభౌమునియొక్క వశము దప్పి, స్వతంత్రులును రాక్షసాంశసంభూతులునగు రాష్ట్రీయప్రభువుల వశమగుటం జేసి ధర్మము నశించి యధర్మ మభివృద్ధిఁ జెంద నట్టి యధర్మమును దొలగించి ధర్మ సంస్థాపనమును గావించి భారతవర్షము నంతయు ధర్మబద్ధుఁ డగు సార్వభౌముని యొక్క పరిపాలనమున నెలకొల్పినఁగాని ధర్మసంగ్రహము కాదను నాశయమున నక్కాలమున ధర్మమూర్తియో యని ఖ్యాతి వహించిన ధర్మరాజును సర్వవిధముల సార్వభౌమునిగాఁ బట్టాభిషిక్తునిఁ జేయ దీక్ష వహించిన రాజర్షి యన్నట్లు శ్రీకృష్ణ భగవానులు మహాభారతమువలనఁ దెలియుచున్నారు. భారతవర్ష సామ్రాజ్యము నప్రతిహతముగ ధర్మరాజునకు నొసంగఁదలఁచి తాను భారతవర్ష బహిఃప్రదేశ మగు ద్వారకయందుఁ దన స్థానమును నెలకొల్పుకొని యున్నట్లు మన మూహించు కొనవచ్చును. వాస్తవముచే భారతభూమినంతయు శ్రీకృష్ణభగవానులే దిగ్విజయము చేసి తన నిరంకుశ ప్రభుత్వమునకుఁ దెచ్చుకొనినటుల బై నుదాహరింపఁబడిన ధృత రాష్ట్రవాక్యములచేఁ దెలియవచ్చుచున్నది. అట్టి యప్రతిహత తేజముతోఁ గూడుకొనిన శ్రీకృష్ణభగవానులు కురుపాండవదాయభాగవిభాగ మను మిషచే జరిగిన మహాసంగ్రామమున రాష్ట్రీయప్రభువులందరు పుష్కలముగ నశింప, ధర్మరాజునకుఁ బట్టాభిషేక మొనర్చి భారతవర్షబహిఃప్రదేశమునం దుండిన ద్వార కకుఁ దాను వెడలినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. ఇంతకంటె—

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి." (గీ. 3-22)

అను గీతాభిప్రాయమునకు వేఱగు వివరణ మవసరము లేదు. భారతమహా సంగ్రామమందన్నో రాజులందరు నెద్దియో యొకలీలున యుద్ధమునందుఁ బాల్గొని యుండఁ దాను గర్తృత్వమును వహించిన యర్జునుని యిచ్ఛ ననుసరించి సారథ్య మును మాత్రమే చేయు తాటస్థ్యమును వహించెను. ఇయ్యది శ్రీభగవానులయొక్క యకర్తాత్మజ్ఞానమునకు సాక్షియగుచున్నది. వేయేల! గీతాశాస్త్రము నందలి సూక్తు లన్నిఁటికి నుచితములగు లక్ష్యములను శ్రీకృష్ణభగవానులయొక్క వ్యవ హారమువలన మహాభారతమూలమునఁ దెలిసికొన నగును. ఇయ్యదియే యుత్త మోత్తమరాజర్షిలక్షణము. ఇయ్యది శ్రీకృష్ణభగవానుల యవతారమందలి కార్యవిశేషైకదేశము.

ఇఁక శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమున సంజయునిచే యోగేశ్వ రుఁడని—

"యోగం యోగేశ్వరాత్ కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయమ్."

(గీ. 18-75)

"యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః" (గీ. 18-78)

అను గీతములచే వర్ణింపఁబడిరి. యోగాభ్యాసమునకు సర్వకర్మ సంన్యాసము సాధనముగాఁ జెప్పఁబడుచున్నది. దానంజేసి యోగసిద్ధుఁడు సర్వ కర్మసంన్యాసమును గావించిన పరమహంసపరివ్రాజకుఁడై యుండి తీరవలయును. యోగేశ్వరుఁడన్ననో పరమహంస పరివ్రాజకాచార్యవర్యుఁడై యుండవలయును. ఇచట యోగేశ్వరశబ్దముచే సంజయుఁడు శ్రీకృష్ణునిఁ బేర్కొనుటలో యథార్థ వక్తయగు సంజయుఁ డనృతమును వచింపఁగూడదు. దానంజేసి శ్రీకృష్ణభగ వానులు పరమహంస పరివ్రాజకాచార్యవర్యుఁడై యుండవలయును. అంతియ గాదు. సర్వకర్మసంన్యాసముఁ జేయఁదలఁచిన యర్జునుఁడు శ్రీకృష్ణుని గురువుగా నాశ్రయించినట్లు గీతాశాస్త్రమువలన స్పష్ట మగుచున్నది. సంన్యాసముఁ గావింపఁ దలఁచినవాఁడు తన యభీష్టమును దీర్చికొన నొక సంన్యాసికడకుఁ బోయి తన యభీష్టముఁ దీర్పఁ నాతని గురువుగఁ జేకొని వ్యవహరించుట శ్రుతిస్మృతివ్యవహార సిద్ధమగు ధర్మమే. దానిఁబట్టి శ్రీకృష్ణుఁడు సంన్యాసియని తలంచుటకు నవకాశము గలదు. శ్రీకృష్ణుఁడు—

"వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్."

అను నార్యోక్తిచే జగద్గురు వని స్తుతింపఁబడుచున్నాఁడు.

జగద్గురు స్వరూపము:—

పూజ్యులగు నారాయణాదిజగద్గురువులు వ్యవహారదశయందుఁ బరమ హంస పరివ్రాజకాచార్యవర్యులుగాఁ దెలియఁబడుట సృష్ట్యాదినుండియు నేఁటి వఱకు భారతభూమియం దొక వింతగాదు. శ్రీకృష్ణభగవానులు పరమహంస పరి వ్రాజకాచార్యులగు వ్యాసాదిమునీంద్రులకు గురువగుటచేతను, శిష్యులు గురు వేషము ననుకరించుట శిష్టాచారమగుటచేతను, శ్రుతులయందుఁ బరమహంస పరి వ్రాజకాచార్యుఁడు జగద్గురుశబ్దముచేఁ బరామర్శింపఁబడుటచేతను గీతాచార్యు లగు శ్రీకృష్ణులు కూడ పరమహంస పరివ్రాజకాచార్యుఁడే యని చెప్పనగును. ఇంతియ కాక శిష్టాచారమునఁ దెలియవచ్చెడి గురుపూజావిధానమున ననఁగా వ్యాసపూజావిధానమున నావాహనము చేయఁబడు బ్రహ్మవేత్తలైన పరమహంస పరివ్రాజకాచార్యు లందఱిలో నగ్రగణ్యులుగ శ్రీకృష్ణభగవానులు పూజింపఁ బడుట పరమహంస పరివ్రాజకుల కెల్లరకుఁ దెలిసిన విషయమే. అట్టి పూజా విధానమును దిలకించువారలకు శ్రీ భగవానుల పరమహంస పరివ్రాజకత్వాశ్రి

శయము స్పష్టపడఁగలదు. ఇంతియేకాదు; మూఁడవ యధ్యాయమున శ్రీకృష్ణ
భగవానులు ఇరువదిరెండవ గీతముచే—

"న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం."

అని తన యశేషకర్తవ్యతాశూన్యతను వక్కాణించుచున్నారు. అశేష
కర్తవ్యతాశూన్యుఁడు విద్వత్పరమహంస యని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి.
ప్రకృతమున శ్రీ భగవాను లశేషకర్తవ్యతాశూన్యులగ దెలియవచ్చుటచేఁ
బరమహంస పరివ్రాజకాచార్యుఁడనుట కెంతమాత్రమును సందియము లేదు.

గీతాచార్యులగు శ్రీకృష్ణభగవానులు పరమహంస పరివ్రాజకాచార్యులే
యైనచో శ్రీమద్భాగవతమునఁ దెలియవచ్చెడి శ్రీకృష్ణభగవాను లీ గీతా
చార్యులా? లేక, ఈ గీతాచార్యులకు భిన్నులా? అనినచో భాగవతమునఁ దెలియ
వచ్చెడి శ్రీకృష్ణభగవానులు గీతాచార్యులగు పరమహంసపరివ్రాజకాచార్యులే
యని నిస్సందేహముగాఁ జెప్పితీరవలయును. అందులకుఁ బ్రమాణముగా భాగవత
కథాగాంభీర్యము నొకింత దెలిసికొనవలయును.

భాగవతకథాగాంభీర్యము:— వాస్తవముచేఁ బరికించి చూడ శ్రీకృష్ణ
చారిత్రము రహస్యమగు గంభీరార్థముతో నొప్పుచున్నది. అయ్యది కేవల మనుభ
వైకవేద్యము. శ్రీకృష్ణతత్త్వమును దెలియుటకుగాను ముందు గొన్ని శాస్త్రీయ
విషయంబుల గుర్తెఱుఁగవలయును. అందుఁ బ్రథమమున నీ కథాసందర్భము
నొకింత విచారింపవలయును. శ్రీకృష్ణచారిత్రము శుకబ్రహ్మర్షిచేఁ బరీక్షిన్మహా
రాజున కుపదేశింపఁబడినటులు లోకవిదితము. ఉపదేశలగు శ్రీ శుకు లన్ననో
యా జన్మబ్రహ్మచారియగు పరమహంస పరివ్రాజకాచార్య శిరోమణి. పరీక్షిత్త
న్ననో యాసన్నమరణమును గుర్తెఱిఁగి యైహికాముష్మిక వ్రాతబంధములనుండి
యెటులు తరింతునా యను తీవ్రమగు ఖేదంబుమీర శ్రద్ధాభక్తియుక్తురాలును
గుణవతియునగు సతీమణిని గుమారరత్నమును వసుధాన్యభోగ విభవంబులతో
నక్షయ్యంబగు నఖండమండలాధిపత్యంబును దృణప్రాయముగా విడనాడి యుప
సదనపూర్వకముగా నుత్తమ జిజ్ఞాసచే బ్రహ్మజ్ఞానముఁ బడసి కృతార్థత నొందఁ
దలఁచి, సుప్రసిద్ధ యశస్కుఁడును బరమహంస పరివ్రాజకాచార్యుఁడును బ్రహ్మ
నిష్ఠుండునగు శ్రీశుకుల పాదసరోజముల కడ జేరి మూర్తీభవించిన వైరాగ్యము.
ఇట్టి పరీక్షిత్తునకుఁ బరమహంసత్వమును బోధింప నాదర్శముగా నుపదేశింపఁబడి
నది శ్రీకృష్ణచారిత్రము. పరమహంస పరివ్రాజకుండగు పరీక్షిత్తున కుపదేశింపఁ
బడిన శ్రీకృష్ణచారిత్రంబునఁ గాముకులును విషయలోలురును, అసూయాగ్రస్త
లును దలఁచునటుల జారచోరప్రసంగంబులుగాని శృంగారప్రసంగములుగాని
యుండునని తలఁచుట యవివేకవిలసితముగాని వేఱొండుగాదు.

శ్రీకృష్ణచారిత్రమున శృంగార ప్రశంసయే లేదనుట సాహసమాత్రము. శ్లోకములన్నియుఁ జారిత్రమంతయు శృంగారరసభరితంబై యలరారుచున్నవే యన భాషాతత్త్వ విశారదుల కిట్టి యవివేకపుఁ దలంపు లెంతమాత్రమునుఁ గలుగవని బుధు లెఱుంగునది. శ్రీకృష్ణచారిత్రమునందలి విపరీతజ్ఞానమునుఁ దొలగించు భాషాతత్త్వ మొకింత వివరింపఁబడుచున్నది.

భాష:— భాష యన మానవకోటియం దన్యోన్య మంతఃకరణంబులందలి యభిప్రాయ విశేషంబుల వ్యక్తీకరించుకొను వాగ్రూపమైన శబ్దజాలముగద! ఇట్టి శబ్దజాల మాంతరంగికపు టభిప్రాయముల వ్యక్తీకరించుటలో నెంతప్రయాసముతోఁ బ్రయోగింపఁబడినను బుష్కలప్రయోజనకారియగుట దుర్ఘటంబు. బాహ్యములు స్థూలములునగు పదార్థముల సూచించుటయందే భాష కుంఠితమగుచుండఁ గేవలమాంతరంగికములును [మనోగతములును], ననుభవైకవేద్యములు నగు నభిప్రాయముల వ్యక్తీకరించుట దుర్ఘటతమంబని వేఱవచింప నక్కఱలేదు. మహనీయులగుఁ బురాణ పురుషులు బహుభంగుల లోకోపకారమునకై భాషనుఁ జక్కఁ జేసి యెట్టి దుర్ఘటవిషయంబుల నైనను నెట్టి భావంబుల నైనను నే రీతి బోధించిన మానవకోటికి నియతమగు నభిప్రాయంబులు స్ఫురింపఁగలవో యా తీరునఁ దమ తమ యభిప్రాయంబుల వ్యక్తీకరింపుచు వచ్చిరి. ఇట్టి మహనీయుల నైపుణ్యంబులె రసవంతములగు భాషావిశేషంబులుగ నొప్పుచు నలంకారములనియు వ్యంగ్యలనియు, నన్యాపదేశములనియు, గూఢాభిసంధులనియు లాక్షణికములనియుఁ బలు తెఱంగుల నొప్పుచున్నయవి. ఆలంకారికంబులుగను, అన్యాపదేశములుగను, లాక్షణికంబులుగను, గూఢాభిసంధిపురస్సరంబులుగనుఁ బ్రయోగింపఁబడిన శబ్దజాలము వ్యావహారికపు టర్థముతో నొప్పుచుండమిఁ జేసి సామాన్యజనుల యుల్లంబుల రంజింపఁ జేయకపోవుటయే కాక నపార్థకల్పనంబునకుఁ గూడ నొకానొకప్పు డాస్పదం బగుచు విపరీతజ్ఞానంబునకు హేతువగును. అట్టి హేతువు నాలోచించి మహనీయులగు పుణ్యపురుషు లుత్తమగ్రంథంబుల శిష్టాచారానుసారి సాంప్రదాయముగ సద్గురువుల ముఖమునుండి శ్రవణము జేసి యభ్యసింపవలయుఁ గాని యిచ్చవచ్చినటుల నక్కరముల నేర్చినంతనే యహంకారముతోఁ బుణ్యపురుషుల దృణీకరింపుచు నిచ్ఛఁ జదువరాదనియు నట్టి చదు వుత్తమగతిసాధనంబు గాకపోవుట యటుండ ననర్థముల కొఱకగునని వేయివిధంబుల వక్కాణింపుచున్నవారలు, శిష్టాచారమును విడనాడి స్వేచ్ఛఁ జదివినచో నపార్థంబుల కవకాశమిచ్చు భాషావైచిత్ర్యములతో నొప్పు నర్థగాంభీర్యమును గలిగియుండు వర్ణనాంశములలో నుత్తమ దృష్టాంతముగ నీ శ్రీకృష్ణచారిత్ర మలరారుచున్నయది. ఈకథాతత్త్వమును లెస్సగ గుర్తెఱుంగ దలచినచో భాషయందలి యుత్తమ వైచిత్ర్యంబుల తత్త్వమును బుష్కలముగ గుర్తెఱింగి యుండవలయును. అందు ముఖ్యంబులగు విశేషంబుల గొన్నిటిమాత్ర

మిచ్చుట సూచింపుచున్నారము:—ప్రకృతపు కథాతత్త్వమునుఁ దేటపరచు భాషా వైచిత్ర్యము లెవ్వియనః—౧. అఖండార్థబోధ, ౨. అన్యాపదేశము. 3. లక్షణ నిర్ణయము, 4. భావవ్యక్తీకరణమును. అఖండార్థబోధ యన నొక గ్రంథము నందుగాని లేదా ప్రకరణమునందుగాని తెలియవచ్చు శబ్దజాలమువలనను, వాక్య జాలమువలనను భిన్నార్థముల దీయుట కెంత యవకాశ మున్నను, ఉపక్రమాది షడ్విధలింగములచేఁ బ్రకరణాదులకు మహత్తమంబగు పరమతాత్పర్యమును గ్రహించుట. ఇయ్యది వేదవేత్తలును మీమాంసానిపుణులును నగు నుత్తమవిద్వాంసులచేఁ బరమపవిత్రముగ నెన్నబడు భాషానియమము. అన్యాపదేశ మన హృదయస్థమగు నభిప్రాయ మొకటియైయుండ నద్దాని స్ఫురింపఁజేయు మరియొక యభిప్రాయ విశేషమును వర్ణించుట. లక్షణ నిర్ణయ మన నేశబ్దమున కెంత యర్థ మితర శబ్దార్థవ్యావర్తకం బగుచు లభ్యం బగునో యద్దానిని దెలిసి పదప్రయోగము సేయుట. భావవ్యక్తీకరణం బన నేభావము నేతీరున వర్ణించిన నట్టిభావము పుష్కలముగ వ్యక్తీకరింపఁబడునో యట్టితీరున నాభావమును వర్ణించుట. ఇట్టి మహత్తమంబులగు భాషాస్వారస్యంబుల నూతగొనుచు శ్రీకృష్ణభగవానుల పారమహంస్యాతిశయము పురాణఋషులచే వర్ణింపఁబడియున్నది. ఇట్టి పారమహంస్యాతిశయము స్థాలీపులాకన్యాయముచే గోపికాఘట్టవిమర్శనపురస్సరంబుగ నిట బ్రకృతోపయోగముగఁ బ్రదర్శింపఁబడుచున్నది. ప్రకృతమున నుద్దేశింపఁబడిన గోపికాఘట్టముచే బురాణఋషులు వ్యక్తీకరింపఁ దలచిన తత్త్వ మెద్దియనః—పరమహంస పరివ్రాజకాచార్యవర్యుఁడగు శ్రీకృష్ణభగవానులకడ ననన్యభక్తి మీర నుపసదనము సేసి కృతకృత్యులైన పరమహంస పరివ్రాజకాచార్య సమూహ మీగోపికా చారిత్రమువలన బోధింపఁబడుచున్న దను విషయ మీ గోపికాఘట్టమున కఖండార్థబోధ. గోపికాచారిత్రాదులవలన భక్తులయొక్క యనన్యభక్తి యన్యాపదేశముగ వర్ణింపఁబడినదను విషయము శ్రీధరాచార్యాది వ్యాఖ్యాతలు వ్యక్తీకరించియున్నారలు. గోపికాచారిత్రమువలనఁ బరమహంస పరివ్రాజకుల యనన్యభక్తి విశేష మెట్లు వర్ణింపఁబడియున్నదో యద్దాని వివరించుటకు ముందు భక్తిస్వరూప మొకింత గమనింపఁబడవలయును.

భక్తి:—భక్తి యనఁ బ్రాణులకు నన్యోన్య మిత్రత్వహేతుభూతంబును ననిర్వచనీయంబును నగు నంతఃకరణవృత్తివిశేషంబు. అద్దానియొక్క స్వరూపంబు కేవల మంతఃకరణవృత్తి రూపం బగుటం జేసి యింద్రియాతీతంబై యిదమిత్థంబని నిరూపింపఁబడుటకు శక్యము గాకపోయిననుఁ గార్యానుమేయంబై సర్వప్రాణులకు ననుభవసిద్ధ మగుచున్నయది. భక్త్యనుమాపకలింగంబులగు కార్యంబులు గూడ నొక్కతెఱంగునఁ బ్రకాశింపక యుపాధిసంబంధములచేనైనఁ దారతమ్యంబులచే బహుభంగుల నొప్పుచుండు. ఏది యెట్టు లుండినను భక్తిమాత్ర మనుభవ

సిద్ధంబు. భక్తియొక్క మూర్తిభావంబులో యన నొప్పు కార్యంబు లుపాధి తారతమ్యంబుచేఁ దండ్రియం దొక భంగినిఁ దల్లియం దొక సరణిని బుత్రునియం దొక క్రమంబునను సోదరునియం దొక వడుసను పతియందొక తీరునను భార్యయం దొక రీతిని యజమానునియం దొక మార్గమునను భృత్యునియం దొక కైవడినిఁ బరిపాలకునియం దొక విధంబుగను భగవంతునియం దొక పోలిక నిట్లుఁ బలు తెఱంగుల భాసించుచుండినను భక్తియొక్కయాకారమొక్కరూపమున నే యనుమే యింపఁబడుచుండును. ఐనను లోకదృష్టిచేనైననేమి, వ్యవహారదృష్టిచేనైననేమి భక్తియందును భక్తులయొక్కచేష్టలయందును దారతమ్యంబులు సహజసిద్ధంబులై యున్నయవి—

భగవద్భక్తి:— భగవద్భక్తి నిరుపమానఫలప్రదం బనియును, ముక్తిసాధనం బనియును శ్రుతిస్మృతులచే వక్కాణింపఁ బడియున్నయది. ఏతద్విషయంబును శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునఁ బుష్కలంబుగ నిరూపించియున్నారలు. "భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప" విష్ణ్వంశసంభూతుం డగు కపిలాచార్యులు తల్లియగు దేవహూతికి భక్తినిఁగూర్చి యిట్లు దెల్పియున్నారలు:— "హేయగుణరహితుఁడనఁగల, నాయందున భక్తిలక్షణము దెలిపితి నఁట, బాయక నిర్హేతుకమై, చేయు మదీయ ప్రతైకచిరతరభక్తిన్." భక్తాగ్రేసరుం డగు ప్రహ్లాదుండు "చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ। జిక్కఁడు దానముల శౌచశీలతపములం, జిక్కఁడు యుక్తిని భక్తినిఁ, జిక్కనక్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ.

ఇట్లు మహాఫలప్రదం బని వక్కాణింపఁబడిన భక్తిస్వరూపం బవస్థాభేదంబులచేతను, అధికారిభేదంబుచేతను, గుణభేదంబుచేతను భిన్నరూపంబులఁ బొందుచుండు. అట్టి భేదవిశేషంబుల ననుసరించి భక్తులందెడు ఫలంబులందుఁగూడఁ దారతమ్యంబులు గననగు. భక్తివిశేషంబుల సూచించు భక్తజనవిభాగంబును "చతుర్విధా భజంతేమాం జనా స్సుకృతినోఽర్జున, ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" అని శ్రీకృష్ణభగవాను లుపదేశింపుచు నందు "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే" అని జ్ఞానియొక్క భక్తి యనన్యం బగుటచే నయ్యదియే యుత్తమం బని వేయివిధంబులఁ గొనియాడిరి.

ఉత్తమభక్తిస్వరూపము, "సర్వధర్మా న్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః." "ధార్మికులకంటె నుత్తమోత్తముడు వినుము, మత్సమర్పిత సకల ధర్మస్వభావ, మహిమములు గల్గి యితరధర్మములు విడిచి, సమత వర్తించు నప్పుణ్యతముఁడు ఘనుఁడు." అని నిరూపింపఁబడుచున్నది.

గురుభక్తి:—"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః, గురుస్సా
క్షాత్పరంబ్రహ్మా తస్మైశ్రీగురవే నమః॥ అని గురువు సకలదేవతాస్వరూపుఁడగు
ప్రత్యక్షదైవ మని కొనియాడఁబడుటచే గురువుకంటె వేరొండు భగవానుఁడు
పృథివియందు లభింపఁ డనుట నిస్సందేహము గావున భగవద్భక్తి యనునది గురు
భక్తియే యని చెప్పితీరవలయును.

గురుస్వరూపము:—గురుస్వరూపములు బహుభంగుల నారదీయమందు
వక్కాణింపఁబడియున్నవి "మంత్రోపదేష్టా వేదానాం తథా ధర్మవిబోధకః,
సన్మార్గదాయీ బుద్ధిమా నాచార్యో వ్రతబంధనే, పురాణసంహితావక్తా నీతిశాస్త్రో
పదేశకృత్, నిషేకాదిశ్మశానాంతం కృత్వాచార్యో నియోజితః, వేదాంతోపని
షద్వాక్యస్యోపదేష్టా గురుర్మహాన్." అని అందు వేదాంతోపనిషద్వాక్యోపదేష్ట
మహాగురు వనియు, "వేదాంతోపదేశకృత్పరమోగురుః" పరమగురువనియును
గొనియాడఁబడుచున్నాఁడు.

గోపికాఘట్టము.

సామాన్యపు భక్తిని తత్ఫలంబును బోధించు నాఖ్యాయికలు వేనవేలు
భాగవతాద్యష్టాదశపురాణములయందు సర్వసాధారణంబుగఁ గననగును. అత్యు
త్తమంబగు, జ్ఞానులయొక్క యనన్యభక్తినిఁ దత్ఫలంబును సుస్పష్టముగఁ బ్రదర్శింపు
నాఖ్యాయిక యై శ్రీకృష్ణచారిత్రమునందలి గోపికాఘట్ట మతిశయిల్లుచున్నది.
పరమహంస పరివ్రాజకాచార్యవర్యుఁ డగు శ్రీకృష్ణభగవానులు జారుఁడుగను, సర్వ
కర్మ సంన్యాసమును గావించిన పరమహంసపరివ్రాజకులును, ఏకాంత భక్తులు నగు
భక్తాగ్రేసరులు గోపికలుగను నన్యాపదేశముగ వర్ణింపఁబడిరి. ఇట్లన్యాపదేశంబుగ
వర్ణించుటకు గల సరసత నీక్రింది విషయంబులచే నూహించి గుర్తెఱుంగునది.

శ్రీకృష్ణభగవానులయొక్క పారమహంస్యాతిశయ మాతని చెంతఁ
జేరిన గోపికాతత్త్వ నిర్ణయముచే సువ్యక్త మయ్యెడిని.

అనన్యభక్తి:—అంతఃకరణవృత్తిరూపంబును నన్యోన్యస్నేహానుబంధహేతు
భూతంబును, ఉపాధితారతమ్యానుగుణంబు నగు భక్తివిశేషంబున స్త్రీకిఁ బురు
షునియందు, అనగా భార్యాభర్తలయందు, గల యనురాగ మధికతరమును నగాధ
మును. అద్దానికంటె జారిణికి జారునియందునఁ బ్రియునియందుఁ గల ప్రేమ నిరతి
శయమును దురూహ్యంబును. ఇయ్యది వ్యావహారికమును, లోకదృష్టమును. పార
మార్థికమం దన్ననో తీవ్రవిరాగమును బొందిన పరమహంసకు గురువునందుగల
ప్రేమ నిరతిశయమును దురూహమును. అట్టి నిరతిశయప్రేమను లోకసిద్ధమగు
దృష్టాంతపురస్సరంబుగ వర్ణింపఁదలఁచినచో సద్గురువర్యుండు జారుఁడుగను,
భక్తాగ్రేసరులగు జిజ్ఞాసువులు జారలగ్నహృదయులగు జారిణులుగను వర్ణింపఁ

బడుటకంటె సత్యుత్తమంబగు నాలంకారికసరసత వేరొండు గానరాదు. దాసం జేసి యిట్టి రూపకము, అన్యాపదేశము వర్ణనాతిశయవిశేషమై విద్వజ్జన మనో రంజకమగుగాని, నైచ్య మెంతమాత్రమును గానేఱదు. ఇట్టి వర్ణనావిశేషముచేఁ దక్క వేరొండు విధమున ననన్యభక్తియొక్క భావవ్యక్తీకరణము స్థూలదృష్టి యందుఁ బుష్కలత్వము నొందనేరదు.

తాపత్రయము:—ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికతాపత్రయ మిచట విరహాగ్నిగ వర్ణింపఁబడియున్నది. ఏలయన నీ తాపత్రయంబును సకలప్రాణియనుభవ సిద్ధంబగునట్టి పుష్కలతాపంబుతో సరిపోల్చి చూపఁదలంచిన జారిణియొక్క విరహతాపంబుకంటె వేరొండు తాపంబును బీడాహేతువుగ వర్ణించుటకు నెందును గానరాదు. కావున సాంసారికతాపత్రయం బన్యాపదేశముగ గోపికల యొక్క విరహాగ్నిగ వర్ణింపఁబడుటయు నాలంకారికవైభవంబె కాని మఱియొండు గానేరదు.

లాక్షణిక సరసత:—భక్తులగు జిజ్ఞాసువులను గోపికలుగ, నన స్త్రీవిశేషంబులుగ, వర్ణించుట లక్షణనియమంబునకు వన్నెను గల్గించుచున్నయది. అదెట్టులన, లోకములో స్త్రీపురుష శబ్దములు భిన్నార్థబోధకంబులుగ నెల్లరచే గ్రహింపఁబడుచున్నవి. పురుషశబ్దమునకు నతివ్యాప్త్యవ్యాప్త్యసంభవదోష గ్రస్తము గాకుండ లక్షణము నిర్ణయింపఁ బడినచో నట్టి లక్షణమువలన వేఱు చేయఁబడిన జీవులు సామాన్యముగ స్త్రీశబ్దవాచ్యులుగ నుదాహరింపఁబడుట లక్షణ సాంప్రదాయవిదుల కొక వింత మెంతమాత్రమును గానేరదు. శిష్టసమ్మతంబగు పురుషలక్షణ మా పరాత్పరభావమును బొందిన పరమహంస పరివ్రాజకాచార్య వర్యుఁడగు శ్రీకృష్ణభగవానులయందు సమన్వయమైనచోఁ దదనుచరు లగు జిజ్ఞాసువులు స్త్రీశబ్దవాచ్యులగు గోపికలుగ వర్ణింపఁబడుట శాస్త్రసరసతయే కాని వేరొండు గాదు. అట్టి హేతువుచేఁ గూడ జిజ్ఞాసువులు గోపికలుగను, అట్టి జిజ్ఞాసువులచే ననన్యముగఁ గోరబడు నాచార్యవర్యుండు పురుషుఁడుగను వర్ణింపఁబడుటయు నొక మహత్తమంబగు భాషాసరణియే.

జిజ్ఞాసువులను స్త్రీలనుగ వర్ణించుటయు వేదాంతశాస్త్రసమ్మతంబగు నలంకార వైభవ మని నిస్సందేహంబుగ వక్కాణింప నగును.

ఇందులకుఁ దార్కాణంబుగఁ గఠశ్రుతి పురుషశబ్దార్థము నిట్లు బోధించుచున్నది:—

శ్రు—ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః.
మహతః పరమవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః ।
పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః.

గీతాశాస్త్రమన్ననో "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" అని పరమాత్మను పురుషోత్తమునిగా వర్ణించుచున్నయది.

స్థూలసూక్ష్మ కారణంబులకు నతీతంబును దత్సాక్షిభూతంబును సచ్చిదానందంబును, ఉత్కృష్ట గతియు నగు పరమాత్మభావమును బొందిన పరమహంసపరిష్ఠునిఁ బురుషశబ్దవాచ్యునిగా నిర్ణయించినచో నట్టి దృష్టిచేఁ దద్విలక్షణులగు జిజ్ఞాసువులే కాక యితర మనుజు లందరుగూడ స్త్రీశబ్దవాచ్యులే యగుచున్నారలు. ఇది విద్వాంసుల కొక యచ్చెరు వెంతమాత్రమును గాదు. అంతియ కాదు, యుక్తియుక్తమును శాస్త్రసమ్మతము నగు రచనావిశేషంబుగ బుధులచే నెన్నఁబడుచుండు. ఇట్టి మహత్తమంబగు నాశయమువలన నా జిజ్ఞాసువులు గోపికలుగను జారిణులుగను వర్ణింపఁబడిరి.

సర్వకర్మసంన్యాసము:—"పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన" "సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అను శ్రుతిస్మృతులచే జిజ్ఞాసువుల కవశ్యకర్తవ్యముగా విధింపఁబడిన సర్వకర్మసంన్యాసము పాతివ్రత్యముకంటె ప్రత్యవాయభీతి గల్గిన ధర్మవిశేషము శ్రుతి స్మృతులం దెక్కడను గానరాదు. అట్టి పాతివ్రత్యత్యాగముకంటె వేరొక విధమున సర్వధర్మపరిత్యాగము లోకదృష్టిని నిరూపించుట దుర్ఘటము; గావున జిజ్ఞాసువులకు కర్తవ్యమగు సర్వధర్మత్యాగ మిచట గోపికలపాతివ్రత్య త్యాగముగ వర్ణింపఁబడియె.

శబ్దవ్యుత్పత్తి:—లోకములో శబ్దములకు వ్యుత్పత్త్యర్థము, రూఢ్యర్థము అని రెండువిధములగు నర్థము తెలియవచ్చెడిని. వ్యుత్పత్త్యర్థ సందర్భముఁ బ్రకృతమున వినియోగించుటలో ప్రకరణవిరుద్ధముగాక యుక్తమగు నర్థము లభించును. అందులకు దార్కాణము జారశబ్దమే. "జారశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము." "జారయతి శిథిలయతీతి జారః" అని. ఇచట లౌకికదృష్టిచే నుపయోగింపఁబడు కర్మవిశేషముకంటె పారమార్థికపు టభిప్రాయమును బోధించు "తాపత్రయ" శబ్దమును గర్మగ నుపయోగించిన నర్థము మనోహర మగుచున్నది. జారయతి శిథిలయత్యాధ్యాత్మికాదితాపత్రయ మితి జారః, జగద్గురుః, శ్రీకృష్ణః జ్ఞానోపదేశేన" అను నర్థము నిచట జారశబ్దమునకు గ్రహింపవలయును.

ఇట్టియాలంకారికసరసత ననుసరించియే శ్రీకృష్ణచారిత్ర మంతయు నన్యాపదేశముగ వర్ణింపఁబడినను ఉపక్రమోపసంహారాది షడ్విధ లింగములచే యోజించిన తత్త్వము గరతలామలకముగ సువ్యక్తమగుచునే యున్నది. ప్రకృతమున నిచట స్థాలీపులాకన్యాయముచేఁ బ్రదర్శింపఁబడిన భాషావిశేషములఁ జేకొని గోపికాచారిత్రము యొక్క యఖండార్థము నుపక్రమాదిలింగములచే మనమున జేసి

నచో నుత్కృష్టతత్త్వ మెల్లరకును సుగమంబుగను విస్పష్టముగను హృద్గోచరంబై నిరతిశయానందమునకు మూలకారణంబగు శ్రీకృష్ణభక్తికిఁ బుష్కలకారణం బగును. అట్టి యుపక్రమాదిలింగములను గూడఁ గొంతవఱకు స్థాలీపులాక న్యాయంబున జిజ్ఞాసువుల యుపయోగముకొఱకుఁ బ్రదర్శింపుచున్నారము. ఇందు సర్వజనోపయోగమును గనుటకై పోతనామాత్యునిచే నాంధ్రీకరింపఁబడిన భాగ వతమునందలి పద్యవిశేషము లుదాహరింపఁబడును. ఇయ్యవి సంస్కృతభాగవ తాభిప్రాయమును జక్కగ వ్యక్తీకరింపుచున్నవి గాన; శ్లోకాంధ్రీకరణప్రయాస మును బొందకుండుటకై యాంధ్రపద్యములే యుదాహరింపఁబడును.

## అఖండార్థబోధ.

శ్రీకృష్ణభగవాను లొకకార్తిక పూర్ణిమయందు రాత్రి చందురుండు షోడశకళాపరిపూర్ణుఁడై యుదయించిన పిమ్మట యమునాతటంబునఁ గూర్చుండి:-

"ప్రకృత కామకర్మ పరవశమై యుచ్చ। నీచగతులఁ బొంది నెఱయ బ్రమసి తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ। గతివిశేష మీ జగంబునందు." 962

అని చింతించి—

"...దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యోతియై
యనిరూప్యంబును సత్యమై మెరుకయై యానందబ్రహ్మంబునై
యనఘాత్మల్ గుణనాశమందు గను నిత్యాత్మీయ లోకంబు గ్ర
క్కున జూపెం గరుణార్ద్రచిత్తుఁడగుచున్ గోపాలకశ్రేణికిన్." 963

ప్రకృతమున శ్రీకృష్ణభగవానులు సూపిన శ్రీకృష్ణు నెట్టి రూపముతోఁ జూచి రన—

"ఇట్లు హరి మున్నకౄరుండు వొందిన లోక మంతయుం జూపినం జూచి నందాదులు పరమానందంబు బొంది వెఱగుపడి హంసస్వరూపకుండైన కృష్ణునిం బొడగని పూజించి రంత." 964

ఇట "హంసస్వరూపకుండైన" అనుచోఁ బరమహంసరూపమును ధరించినట్టి యని యభిప్రాయము. పరమహంసరూప మన నుత్తమమగు పరివ్రాజకరూపము; సన్యాసిరూపమనఁ గాషాయాంబరాది లింగములచే లోకమునఁ దెలియవచ్చెడి రూప మని యభిప్రాయము. ఇట్టి వస్త్రాలంకృతుఁ డగు శ్రీకృష్ణభగవానులు "పీతకౌశేయ వాసుఁడనియును బీతాంబరధరుఁడనియు సర్వసామాన్యముగ స్తవము చేయబడుచుం డుట యొక వింతగాదు. పీతత్వము కాషాయవస్త్రవిశేషమునకు ముఖ్యధర్మమని సాంప్రదాయవిదులు సుకరముగఁ గ్రహింపఁగలరు.

పరమహంసస్వరూపకుండైన శ్రీకృష్ణభగవానులు శరద్రాత్రియందుఁ జేసిన కార్యవిశేషము:—"ఇట్లు వొడిచి నవకుంకుమాంకిత రమాముఖ మండలంబునుం బోలె నఖండంబైన చంద్రమండలంబుఁ బొడఁగని పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగా నొక్క గీతంబుఁ బాడిన."

ఇచట "యమునాతటంబున" యమునానదీ తీరమునందలి 'వన'మన నరణ్యప్రదేశము. నదీతీరంబులు, వనప్రదేశంబులు గిరికందరములు లోనుగాగలవి పరమహంసలకు సామాన్యనిలయములుగాఁ బరిగణింపఁబడుట శ్రుతిస్మృతిసదాచారసమ్మతము. 'గీతం బన' బ్రహ్మానందాభివ్యక్తిసూచకంబును శ్రుతిప్రతిపాదితంబు నగు "ఏత త్సామ గాయ న్నాస్తే హావుహావు" ఇత్యాది సామవిశేష మని కాని, లేక భగవద్గీతయందలి యేకదేశంబగు గీతావిశేషం బనికాని యర్థమును గ్రహింపవలయును.

గీతగానానంతరవిశేషము:—"విని పరాయత్తచిత్తలై తత్తరంబున వేఁత లేపనులకుం జేతులాడకయు గోవులకుం గ్రేపులు విడువకయు విడిచివిడిచియు నీడకయు నీడియాడియు నీడినపాలు గాఁపకయుఁ గాఁచికాఁచియుఁ గాగినపాలు డింపకయు డించిడించియు డించినపాలు బాలురకుం బోయకయుఁ బోసిపోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ జేసిచేసియు నశనంబులు గుడువకయుఁ గుడిచికుడిచియుఁ గుసుమంబులు ముడువకయు ముడిచి ముడిచియుఁ దొడవులు దొడుగకయుఁ దొడిగి తొడిగియు గోష్ఠంబుపట్టుల నుండకయుఁ బాయసంబు నెఱియ వండకయు నయ్యెడల నిలువంబడకయు గాటుకలు సూటి నిడకయుఁ గురులు నక్కనొత్తకయు గుచంబుల గంధంబులు గలయ మెత్తకయుఁ బయ్యెదలు విప్పి కప్పకయు సఖులకుఁ జెప్పకయు సహోదరులు మగలు మామలు మఱందులు బిడ్డలు నడ్డంబు సని నివారింపం దలారింపకయు సంచలించి పంచభల్లుని భల్లంబుల మొల్లంపుజల్లుల పెల్లునం దల్లడిల్లి డిల్లపడి మొగిళ్ళగమి వెలువడి యుల్లసించు తటిల్లతలపోందున మందగమనలమందగమనంబుల మంద వెలువడి గోవిందసందర్శనంబునకు జనిరప్పుడు"- 969.

దావాగ్నిచేఁ బరివృతంబై పరితాప మొందు జను లితరుల నించుకేనియు నరకుగానకుండఁ దద్దావాగ్నినుండి యున్నపాటునఁ బయల్పడి స్వతాపోపశమనంబు జేసికొనఁ జూచుభంగి సంసారదావానలమున దందహ్యమానులగు జిజ్ఞాసువులు తమ తాపము నుపశమింపఁజేసికొన వైరాగ్యము దీవ్రముగాగ నున్నయటు సర్వకర్మసంన్యాసమును గావించి సద్గురువును జేరు క్రమము ప్రకృతమున గోపికల పరిస్థితుల మూలముగ వర్ణింపఁబడుచున్నయది. ఇయ్యది పలువురు జిజ్ఞాసువులు పరిపరి విధముల సంసారమగ్నులై యుండి యొక్కమారు సర్వకర్మ సంన్యాసమును గావించి మహనీయుఁ డగు నాచార్యవర్యుని జేరిన వర్ణనావిశేషముగాని వేరొండు కాదు.

గోవిందసందర్శనమునకుఁ జనిన గోపిక లేమి ప్రయోజనముఁ బడసిరో యద్దా నిని శ్రీశుకు లిట్లు నిరూపించుచున్నారలు:—

"తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁడనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిం గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై."

ఇందు "జారుఁ డనుచున్" అను పదము శ్లేషానుప్రాణితము. పద్యము యొక్క యథార్థమును వర్ణింప నీపదమున కిచట లోకసిద్ధం బగు నశ్లీలార్థము నిరర్థకము నసమంజస మని కంఠోక్తిగ వచింపనగుఁ; గావున లోకమునందు వ్యవహారమును గనుచుండిన యాధ్యర్థమును నీ జారశబ్దమునకుఁ ద్రోసివేసి, వ్యుత్పత్త్యర్థముచేఁ బ్రాప్తంబగు నుత్తమవిశేషమును స్వీకరింపవలయును. అదెట్టు లనిన "జారయతి శిథిలయత్యాధ్యాత్మికాదితాపత్రయ మితి జారః, గురువర్యః, బ్రహ్మవిద్వరిష్ఠః, శ్రీకృష్ణభగవా నితి."

గోపికాచారిత్రము బాహ్యమునకు వినవచ్చెడున ట్లశ్లీలంబగు శృంగారగాథయే యైనచో "పొందిరి ముక్తిన్ గుణదేహము న్విడిచి ప్రీతి న్బంధనిర్ముక్తలై" యను నుపసంహారవాక్య మపార్థములకాస్పదంబగు; గావున నట్టి యశ్లీలార్థమును మనంబున నైనఁ బ్రమాదముచేనైనఁ దలపెట్టగూడదు. "బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే" యను గీతావాక్యము ననుసరించి ప్రకృతమున "తరుణుల్" అను పదమున కుత్తమజిజ్ఞాసువు లని యర్థమును బ్రతిపాదింపవలయును. లేనిచోఁ జతుర్థపాదము సమంజసము గానేరదు. ఏలయన "బంధనిర్ముక్తలై" ఇక్కడ భవబంధ మని యర్థము సుస్పష్టము. బంధశబ్దపు టభిప్రాయము "గుణదేహమున్" అను శబ్దముచేఁ బరామర్శచేయఁబడుచున్నది. గుణదేహ మన త్రిగుణాత్మకమగు ప్రకృతి. అజ్ఞానము, మాయ, అవిద్య అను పదములచేఁ దెలియవచ్చెడి సంసారబంధకారణ మగు నవిద్య యని యర్థము.

ఇందు "పొందిరి ముక్తిన్"అనునది కేవల ముత్తమమైనట్టియు సకలవేదప్రతిపాద్యమైనట్టియు బ్రహ్మజ్ఞానైకలభ్యమైనట్టియు నిరతిశయసదానుభవరూపం బని వేఱ వచింప నక్కఱలేదు. ఇట్టి ముక్తి పరమహంసల కొక్కరికే తక్క వేఱొకరికి లభింపదని "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః, సంన్యాస యోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః, తే బ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతా త్పరిముచ్యంతి సర్వే" "నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పద మవ్యయం తత్" అను శ్రుతిస్మృతులవలనఁ దెలియవచ్చుచున్నది. కావున నిచట ముక్తిపొంది రని శ్రీశుకులచేఁ జెప్పఁబడిన తరుణులు పరమహంస లని వేఱ చెప్పనక్కఱలేదు.

ప్రకృతమున నిచట నుదాహరింపఁబడిన పద్యము శ్రీమద్భాగవతమునందలి "తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః । జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణకల్మషాః" అను శ్లోకవివరణ మని కోవిదులు సుకరముగ గ్రహింపగలరు.

ఇఁక 977వ పద్యమున "ఘనమధురగీతనినదము వినివచ్చిన గోపికలను" అను స్థలమున "భగవద్గీతాగాన' మని కాని, 'బ్రహ్మానందసూచకం బగు సామగానవిశేష మను విశేషము గానిస్ఫూర్తికిఁ దోఁపట్టుటనిస్సందేహము. 976-1004 పద్యములలో. శ్రీకృష్ణభగవానులు 'యోగీశ్వరేశ్వరుం డను' శబ్దముచేఁ బరామర్శ చేయఁబడుచున్నాఁడు. ఆ తీరుననే గీతలలో, యత్ర యోగేశ్వరః కృష్ణః - అని వర్ణింపఁబడియున్నది. 'యోగీశ్వరేశ్వరశబ్ద ముత్తమంబగు పరమహంసపరివ్రాజకాచార్యవర్యునికిఁ దక్క వేరొకనికి వర్తింపదు,' అని యోగకుండలి యోగశిఖ మొదలుగా గల యుపనిషత్తులవలనఁ దెలియనగును.

గోపికా చారిత్రమున నుపసంహారపద్యముల క్రమము పైయభిప్రాయమునే యనువదింపుచున్నది:—"ఘనులై యెవ్వని పాదపంకజ పరాగధ్యానసంప్రాప్తయో । గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం । ధ నిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు రా దివ్య శో । భను, డెట్లుండిన నుండెగాక కలవే బంధంబు లుర్వీశ్వరా!" 1110. ఆ. వె. గోపజనములందు గోపికలందును । సకలజంతులందు సంచరించు । నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు । సర్వమయుఁడు లీల సలిపెఁగాక. 1111."

"అకటా! నమ్మితి మేము" అను 981వ పద్యము మొదలు 'కట్టాతలము నుకలునై" 1003వ పద్యమువఱకును గల గ్రంథమంతయును "సర్వధర్మాన్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అనుశాసనము వన్నెమీఱ సర్వకర్మసంన్యాసము గావించి నిరతిశయము ననన్యము నగు భక్తితో శ్రీకృష్ణభగవానులకడఁ జేరిన ముముక్షువు లీ గోపికాశబ్దవాచ్యులు గాని వేరొండు గారని నిర్ణయింపనగును.

దుఃఖవ్రాత నివృత్తి హేతుభూతంబును అనంత సుఖదంబును నగు హస్తమస్తకపు సంయోగపు ప్రార్థన. 1002, 1043 పద్యములయందుఁ దెలియవచ్చుచున్నయది.

కం. "అమరులఁ గాచిన హరికిరి యుఁ । గమలేక్షణ నీవు నేఁడు కరుణ నభయహ, స్తము మాయురముల శిరములఁ । బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్.

"చరణ సేవకులకు సంసారభయమును । బాపి శ్రీకరంబు పట్టు గలిగి, కామదాయివైన కరసరోజంబు మా । మస్తకముల నునిచి మనుపుమీశ!"

ఇచట "కామదాయి" యనఁ గోర్కులన నభీష్టము లని యభిప్రాయము.

శ్రీకృష్ణభగవానులయొక్క తత్త్వమును బుష్కలముగ వెల్లడింపు పద్యములు:—

నీవు యశోదబిడ్డడవె నీరజనేత్ర సమస్తజంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోకర
క్షావిధ మాచరింపు మని సన్నుతిసేయఁగ సత్కులంబునన్
భూవలయంబు గావ నిటుపుట్టితిగాదె మనోహరాకృతిన్'' 1042

"భక్తకామదంబు బ్రహ్మసేవిత మిలా! మండనంబు దుఃఖమర్దనంబు
భద్రకరము, నైనభవదంఘ్రియుగము మా! యురములందు రమణ! యునుప దగదె.
1053.

ఈ పద్యములు గోపికావచనములు. పై పద్యములవలన శ్రీకృష్ణుని గోపికలు కేవలము పరాత్పరుఁడనియే గుర్తెఱింగి యున్నటులఁ దెలియవచ్చెడిని. ఇట్టి జ్ఞానము త్తమయోగులకుఁ దక్క నితరుల కెంతమాత్ర ముండుటకు నవకాశము జిక్కదు. కావున గోపిక లజ్ఞులు దలంచునటుల గొల్లపల్లెయందలి జారిణు లెంతమాత్రమును గారు. భక్తుల గోపికాస్త్రీలుగా వర్ణించుటయం దొకసరసత గలదు. మానవ కోటియం దమాయకత్వమునకు గోపజాతి ప్రసిద్ధము. గోపిక లనుటలో నమాయికలును శుద్ధసత్త్వస్వభావలు నను విశేషముగూడ గననగును.

రాసక్రీడాభివర్ణనము:—రాసక్రీడాభివర్ణనము శ్రీకృష్ణభగవాను లుత్తమోత్తమంబులగు దీక్షావిధానంబుల జిజ్ఞాసువులకు నుపదేశముఁ జేయురహస్యవిశేష వర్ణనము. ఉపక్రమోపసంహారంబు లిట్టి రహస్యజ్ఞాపకములు.

"ఉ. ఆసమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్ బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము రాసముం గృతవియచ్చరనేత్రమనోవికాసమున్ ." 1084.

ఇందు "వియచ్చరనేత్ర మనోవికాసమున్." అను శబ్దము గూఢమగు రహస్యజ్ఞాపకము. వియచ్చరశబ్దము దేవతాపర్యాయపదము. దేవతానేత్రమనోవికాస మన దివ్యదృష్టియుక్తమగు మానసికవ్యాపారవిశేషము. ఇయ్యది యుపదేశ దీక్షారహస్యము. దీనితోసంబంధించి యితరపదములకు నర్థము పొందికఁ జేయవలయును. అటీరుననే 'చిత్రమూర్తి' 'విభుఁడు' "అనంతుఁడు" అను పదములు. ఈ పదములమధ్య నుండుపదములు శృంగారచేష్ట యని యించుకేనియు శంకింప నవకాశము లేదు. ఇఁక 'ఇట్లు భగవంతుండైన శ్రీకృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెందఱందఱకు నందఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలు పోలిక రాసకేళి సలిపిన"—ఇందొక విశేషము "ఎందఱందఱకు నందఱై"

అనుచో నొక సరసత గలదు. అనన్యదృష్టితో శ్రవణము సేయు జిజ్ఞాసువు తన లక్ష్యమునంతయు నితరదృష్టి యొద్దియును లేక గురువాగమృతమును గ్రోలుట యందు లగ్నముసేయును. దానంజేసి జిజ్ఞాసువు గురుండు తన కొక్కనికే యుపదేశము చేయుచున్నటులఁ దలంచును. అట్లు దలంచు శిష్యు లెంద రచట నుండిన నందరకు నన్నిరూపములతో సద్గురుండు భాసింపుచున్నాఁడనిన వింత యొంతమాత్రమును లేదు. ఇట్టి విశేష మొకప్పుడు నైమిశారణ్యమున జరిగి నటుల పురాణప్రసిద్ధము. దక్షిణామూర్తి యవతారంబున వేలకొలఁది జిజ్ఞాసువు లొక్కతెఱంగున నొకేకాలమున ముక్తినిఁ బొందిరి. ఆ తీరుననే ప్రకృతపు కృష్ణావతారకాలమునందు ననియు గుర్తెరుంగునది.—ఇచట నొక యుపమాన మత్యద్భుతముగ దెలియవచ్చెడిని—"నిజప్రతిబింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక"—ఇచట గోపికలు శ్రీకృష్ణప్రతిబింబములుగా వర్ణింపఁబడియున్నారలు. బ్రహ్మభావమును బొందియున్న బ్రహ్మవిద్వరిష్ఠుని దృష్టియం దితరజీవభావము లన్నియు స్వీయప్రతిబింబములు దక్క వేరొండు గాదను వేదాంత రహస్య మిచట చక్కగ వ్యక్తీకరింపఁబడుచున్నయది. దానంజేసి యీ రాసక్రీడావర్ణన మొక యుపదేశ విశేషముతో సంబంధించిన మహాసమయ కృత్యవర్ణనంబు గాని వేరొండు శృంగార ప్రసంగ మెంతమాత్రమును గాదు. దీనియందలి విశేషము "ఇట్లు శరత్కాలంబున వెన్నుఁ డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించెను" అని యద్భుతముగ వర్ణింపఁబడెను. ఇంద్రియస్ఖలనం బన నింద్రియములు విషయంబులయందుఁ జరించుట; బ్రహ్మైక్యానుసంధానమానమానసునియొక్క యింద్రియము లుపరమమును బొంది విషయములనుండి మరలి యాత్మయందు లయమై యుండును. తద్భిన్న భావ మింద్రియస్ఖలన మని తెలియనగును. ఇట్లే జలక్రీడాది విశేషములు గూడ ధర్మసూక్ష్మవిశేషములయొక్క వర్ణనావిశేషంబులుగాని శృంగారచేష్టలు గావు.

ఇట్టి శ్రీకృష్ణభగవానులయొక్క యతిశయమును అతనిచెంత ననన్యభక్తితో జేరి కడతేరిన పరమహంసపరివ్రాజక సమూహముయొక్క చారిత్ర మన్యాపదేశముగ వర్ణింపఁ బడినదను నాశయము మీర పరమహంసపరివ్రాజకాచార్యులు పరమహంసపరివ్రాజకులు నీ కృష్ణకథామృతమును గ్రోలుచు నిరతిశయానంద రూపమగు ముక్తినిఁ బడయుచున్నారలు.—

ఇవి యన్నియు నటుండ శ్రీకృష్ణభగవానుల యొక్క పారమహంస్యాతిశయము లోకములో సుప్రసిద్ధముగఁ దెలియవచ్చెడి శ్రీకృష్ణ విగ్రహమువలనను గూడ పుష్కలముగ గ్రహింపవచ్చును. శ్రీకృష్ణభగవానులయొక్క విగ్రహ విశేష మచ్చటచ్చట మహనీయులచే స్తవము చేయఁబడుట యొక వింతగాదు. అట్టి స్తవంబులఁ దిలకించిన శ్రీకృష్ణపారమహంస్యము సుస్పష్టముగాఁ దెలియవచ్చెడిని.

ఇంద్రస్తుతి:—పరమ! నీ భామభాసురతత్త్వంబు శాంతంబు హతరజస్తమస్కము నిత్య। మధికతపోమయ మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు। గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర। వైన దుర్జన నిగ్రహము శిష్టరక్షయు దగిలి సేయఁగ దండధారి వగుచు। జగము భర్తవు గురుడవె జనకుఁడవుగ జగదధీశుల మను మూఢజనులు దలఁక। నిచ్చపుట్టిన రూపంబు లీవు దాల్చి హితము సేయుదుగాదె లోకేశ్వరేశ!" 900.

శ్రీకృష్ణవాక్యము:—"ప్రమదశ్రీకులు దండధారి నగు నన్భావింపరు." 947

శ్రీశుకవచనము:—హంసస్వరూపకుండైన కృష్ణునిం గని. 964.

గోపికావచనము:—వంశంబ! కాననే వంశధరుని, 1011.

> నల్లనివాడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
> జల్లెడువాడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వురాఁ
> జిల్లెడు మోమువాఁడు, 1103

శ్రీశుకవచనము:—ఘనపీతాంబరధారియై పొడమె. 1061

పైవచనములలోఁ దెలియవచ్చెడి "దండధారి వగుచు జగముగురుఁడవు" "దండధారినగు నన్" "వంశధరుని" యను పదములు పరమహంసాశ్రమజ్ఞాపకములు. దండశబ్ద మిచట సంన్యాసపరము. "దండగ్రహణమాత్రేణ నరో నారాయణో భవేత్" అను స్మృతివచనమున దండగ్రహణ ముపలక్షణముగా గల్గిన సంన్యాసము నర్థముగా భావింపవలయును. లేనిచో నపార్థము పుట్టిల్లును. "పీతాంబరధారి" యనుట సంన్యాసాశ్రమమునకు లింగమగు కాషాయాంబరధారి యని యర్థము. కాషాయవస్త్రధారణము సంన్యాసాశ్రమలక్షణముగాని వేరొండాశ్రమధర్మముగాదు.

"నల్లనివాఁడు" అన నీలమేఘచ్ఛాయ యని లోకప్రసిద్ధము. మేఘచ్ఛాయ యన నాకాశచ్ఛాయ; 'నల్లని మేను' "ఆకాశశరీరద్యోతకము". 'ఆకాశశరీరం బ్రహ్మ' యను శ్రుతివలన నల్లని మేను బ్రహ్మభావమున కుపలక్షణము. ఇట్లు భాగవతమునందీ లక్షణములు విపులముగ గననగును. కొన్నిస్థలములయందు పీతాంబరధారణ మొక్కటియే సంన్యాసలింగముగా వర్ణించిన తావులుగూడ గలవు. ఇవి యన్నియు నటుండ లోకమునఁ జిత్రకారులచేఁ సర్వసామాన్యముగ రచింపఁబడి వ్యవహారమును గనుచున్న శ్రీకృష్ణభగవానుల చిత్తరువుగూడ శ్రీకృష్ణభగవానులయొక్క పారమహంస్యోత్కృష్టతనే సూచింపుచున్నట్లు సర్వవిధములఁ దెలిసికొనవచ్చును. శ్రీకృష్ణవిగ్రహము సర్వసామాన్యముగ జేతియందు వెన్నముద్దగలిగినట్టియు, యజ్ఞోపవీత రహితమైనట్టియు దిగంబరిగా నున్నట్టియు బాలునిగ రచించుట సువిదితము. ఒక వేళ వస్త్రమలంకరింపబడియున్నచో పీతాంబరాలంకృతులుగను వేణువు చేతియందుగల్గిన వారుగను దెలియవచ్చుచున్నది; పారమహంస్యమగు దిగంబర

భావ మన నవధూతభావము. అట్టి యవధూత యొకప్పుడు సాంబరుఁడుగఁగూడ గననగు. అప్పుడు పీతాంబరము సంన్యాససూచకమగు కాషాయము. వేణువు దండ మన సంన్యాసమున కుపలక్షణము. బాలభావ మవధూతభావంబులగు బాలోన్మత్త పిశాచభావములలో నగ్రగణ్యము. అట్టి యవధూత భావముయొక్క మూర్తీ భావము బాలభావము. యజ్ఞోపవీతరాహిత్యము సంన్యాససూచకము. నవనీతము గీతామృతము అన ఉపనిషత్సారమని "సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః, పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్." అను శ్లోకమువలన దెలియ వచ్చుచున్నది. అట్టి గీతామృతపానముచే బ్రహ్మానందమున నోలలాడుచు నొడ లెఱుంగకుండుటకు, లేక యొడలినిసరకుగొనకుండుటకు దిగంబరభావ ముపలక్షణము. వస్త్రాభావము దేహమిథ్యాత్వనిశ్చయ జ్ఞాపకము. నరునికి వస్త్ర మెట్టిదో జ్ఞానికి దేహ మట్టి దని "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి, తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ" యను గీతావాక్య ములవలనఁ దెలియవచ్చెడిని. వస్త్రత్యాగ మన దేహాభిమానత్యాగమని యభిప్రా యము. గోపికావస్త్రాపహరణ మన గోపికలగు పరమహంసపరివ్రాజకులకు దత్త్వో పదేశముచే దేహాభిమానమును దొలగించుట యని యభిప్రాయము. వేణువు దండ మున కుపలక్షణము. దండ మన సంన్యాసము. గాన మన గీతాగానము లేక సామ గానము. ఇయ్యది బ్రహ్మజ్ఞాన బోధకము. నీలమేఘచ్ఛాయ, 'ఆకాశశరీరం బ్రహ్మ' యను శ్రుతిచే దెలియవచ్చెడి బ్రహ్మభావము. ఇట్లు లోకసిద్ధమగు జిత్తరువును తెన్నుగాఁ దిలకించినచో శ్రీకృష్ణభగవానులయొక్క పారమహంస్యము శాస్త్ర కోవిదులకు సువిదితమగును.

వేయేల! శ్రీమద్భాగవతమునఁ బలుతావులయందు జగద్గురు శబ్దముతో స్వచ్ఛముగఁ బరామర్శ చేయబడుటయు నొకవింత గాదు. అదెట్టు లనిన—

"ఉర్వీశ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వార్థారంభము సేయఁబోల దనుచుర్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్
గుర్వంగీకరణంబు సేయుజని రా గోవిందుఁడున్ రాముఁడున్॥ 1411

"గురువులకు నెల్లగురునై, గురులఘుభావములు లేక కొమరొందు జగ
ద్గురులు త్రిలోకహితార్థము గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్.

జగద్గురుశబ్దముయొక్క నిర్వచనమును బరమహంస పరివ్రాజకోపనిష త్తిట్లు వర్ణింపుచున్నది.—

"స సర్వకర్మకృ త్స బ్రాహ్మణ స్స బ్రహ్మనిష్ఠాపర స్స దేవ స్స ఋషి స్స తపస్వీ స్స శ్రేష్ఠ స్స ఏవ సర్వజ్యేష్ఠ స్స ఏవ జగద్గురు స్స ఏవాహం విద్ధి।

లోకే పరమహంసపరివ్రాజకో దుర్లభతరో, యద్యేకోఽస్తి స ఏవ నిత్యపూత స్సఏవ వేదపురుషో మహాపురుషో యస్తచ్చిత్తం మయ్యే వావతిష్ఠతే అహంచ తస్మిన్నేవావస్థితః" ఇతి.

శ్రుతిసమ్మతంబుగ జగద్గురుపుశబ్దము పరమహంసపరివ్రాజకాచార్య వర్యునియందు దక్క వేఱొకరియందు వర్తింపదు. దానంజేసి గోపికాచారిత్రంబు వలన భక్తాగ్రేసరులగు పరమహంస పరివ్రాజకులతోఁ బరివృతుండైనట్టియు నుప నిషత్సారంబగు గీతాశాస్త్రము నుపదేశించినట్టియు యోగిరాట్టును శ్రోత్రియుం డును బ్రహ్మనిష్ఠుండును బరమహంసపరివ్రాజకాచార్యవర్యుం డగు శ్రీకృష్ణపర బ్రహ్మంబు భక్తజనుల యుల్లంబుల నలంకరింపుచున్నాఁడు.

భారతగ్రంథమును బరిశీలించినచో శ్రీకృష్ణుఁ డుత్తమోత్తముఁ డగు రాజర్షియగునని సూచింపఁబడియె. రాజర్షి భావము సర్వసామాన్యముగ మూర్ధాభి షిక్తుఁడును, గృహస్థుడు నగు రాజన్యునియందు వర్తించుచుండును. దానంజేసి 'శ్రీకృష్ణుఁడు గృహస్థుఁడా? లేక సంన్యాసియా' యను సందియము కల్గుచున్నది. దీనినిబట్టి కొందఱు భారతకృష్ణుఁడు వేఱనియు, భాగవతకృష్ణుఁడు వేఱనియు నభిప్రాయమును వెలిబుచ్చుచున్నారు. ఇయ్యది యసమంజసము. గీతాశాస్త్రము నందలి నాలుగవ యధ్యాయమున నవతారరహస్య కథనమునందు శ్రీకృష్ణ భగవానులు చెప్పిన "అజోఽపిసన్నవ్యయాత్మా......ప్రకృతిం స్వా మధిష్ఠాయ, ఆత్మమాయయా." "యే యథా మాం............" అను రెండుగీతముల యొక్క తత్త్వము నొకింత జాగరూకతతో దిలకించిన యథార్థము తేటపడఁగలదు. ఎట్లన:— ఎవ్వరెవ్వరే యే భావములతోఁ దన్ను బొందుదురో వారి వారి నా యా భావములతోఁ బొందుచుండుననుటచే, రాజర్షి భావముచే నాతనిఁ దెలిసికొనినవారలకు రాజర్షిగను, బరమహంసభావముచేఁ దలంచు వారలకుఁ బరమహంసగను, సామాన్య మనుష్యభావముతోఁ జూచువారలకు సామాన్య మనుష్యుడుగను, నిట్లు సర్వభావముల కాస్పదమై యలరారు మహాశక్తితోఁ గూడిన పరమాత్మ యగుటంజేసి భారత భాగవత గాథలకు నొకింతయు వైష మ్యము లేక, రెండు గ్రంథములచే నొక్కకృష్ణభగవానునియొక్క మాహాత్మ్యము వ్యక్తీకరింపఁబడుచున్నదని ప్రాజ్ఞులు సుకరముగా గ్రహింపఁగలరు.

వేయేల! కురుక్షేత్రమున నర్జుననకును, రాయబారకాలమున ధృతరాష్ట్ర సభయందును, యమునానదియం దక్రూరునకును, మృద్భక్షణవ్యాజమున యశో దకును, నవలీల విశ్వరూపమును జూపిన మహానుభావునకు రాజర్షి భావమును బ్రదర్శించుట పెద్దవిశేష మెంతమాత్రమును గాదు. ఇయ్యది సామాన్యవిషయము.

అఖిలభారతీయులు జగద్గురుత్వభావముతో నొప్పు పరమహంసపరివ్రాజకా చార్యవర్య స్వరూపము ముఖ్యరూపమనియు, రాజర్షి భావముతో నొప్పు రాజన్య భావము గౌణరూపమనియు, భారతీయసాంప్రదాయవిదులు లెస్సగా గుర్తెఱింగి యున్నారు. ఇందొక పరమార్థవిశేషముకూడఁ గలదు. "పరోక్షప్రియా హి దేవాః." అను శ్రుతిచే దేవతలు పరోక్షరూపములతో వ్యవహరించుటయందు ప్రీతి కలిగియున్నా రని తెలియవచ్చుచున్నది. అనఁగాఁ దమ నిజరూపములను మఱుగుపఱచి రూపాంతరములచే వ్యవహరింతు రని పై శ్రుతికిఁ దాత్పర్యము. ఇట్టి న్యాయము ననుసరించి శ్రీకృష్ణభగవానులు తమయొక్క పరమహంసరూప మును మఱుగుపఱచి రాజర్షి రూపముతో వ్యవహరించె ననియు, నట్టి యాథార్థ్యమును గ్రహింపలేక యాతని నొక రాజన్యునివలెఁ బ్రాకృతపురుషులు తలంచుటయు, జ్ఞానులగు వేదవ్యాసులు, భీష్ముఁడు, నారదుఁడు, దేవలుఁడు, అసితుఁడు మొదలగు మహనీయులు గ్రహించుచుండి రనియు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఇట్టి ప్రాకృత పురుషదృష్టినిగూర్చి శ్రీకృష్ణభగవానులే "న మాం దుష్కృతినో మూఢాః, నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః" (౭-౨౫) "అవజానంతి మాం మూఢాః......" (౯-౧౧) అను గీతలచే వ్యక్తీకరించు చున్నారు.

ఇట్లు శ్రీకృష్ణచారిత్రమంతయు మహనీయగుణగరిష్ఠుండగు బ్రహ్మనిష్ఠుని లోకవ్యవహారంబును బుష్కలముగ వేనవేల విధంబుల సకలలోక దృష్టాంత భూతంబుగ వ్యక్తీకరింపుచున్నయది. జిజ్ఞాసువులు గీతాతత్త్వసాహాయ్యంబునఁ బురా ణేతిహాసంబుల మననముఁ గావించి భక్తిపారవశ్యముఁ జెంది నిరతిశయసుఖంబున మనియుదురుగాక !

ఇట్లుగ సుత్కృష్టతమంబగు నాలంకారిక వైభవంబులచే సకలయోగిజన హృదయరంజకం బగుచు జగద్గురువునందలి భక్తియొక్క మూర్తీభావమో యని వేదవేత్తలగు మీమాంసకు లత్యాదరముతోఁ గొనియాడ శ్రీకృష్ణభగవచ్చారిత్ర మొప్పుచుండ నజ్ఞు లన్యంబుగఁ దలంచుచు నపహసించుట ప్రహ్లాదచోదితంబుగ హాస్యాస్పదంబు గాదె.

శా॥ అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థసంసారముల్.

ఇతి నారాయణస్మృతిః.

జగద్గురు శ్రీ కల్యాణానందభారతీమహాంతాచార్యస్వామి.

# విషయసూచిక.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# श्रीमद्भगवद्गीता.

# శ్రీమద్భగవద్గీతా.

ధృతరాష్ట్ర ఉవాచ:—

> ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
> మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. 1

---

ఓమ్.

## గీతామృతతరంగిణీ.

> వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
> దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

శ్రీమన్నారాయణుం డీజగంబును సృజించి యద్దాని పరిపాలనంబు సేయ నిశ్చయించి తొలుత మరీచ్యాదిప్రజాపతుల సృజించి వేదవిహితంబగు ప్రవృత్తి ధర్మము నుపదేశించెను. పిమ్మట సనకసనందనాదుల బుట్టించి జ్ఞానవైరాగ్యరూపం బగు నివృత్తిధర్మము నుపదేశించెను. నాటినుండియు జగత్తుయొక్క స్థితికారణంబగు

---

ఓమ్.

జగద్గురు శ్రీమద్విద్యాశంకరభగవత్పాద విరచితమ్

## శ్రీమద్భగవద్గీతావివరణమ్.

> నారాయణః పరోఽవ్యక్తా దండ మవ్యక్తసంభవమ్,
> అండస్యాంత స్త్విమే లోకా స్సప్తద్వీపా చ మేదినీ.

స భగవాన్ సృష్ట్వేదం జగ త్తస్యచ స్థితిం చికీర్షు ర్మరీచ్యాదీ నగ్రే సృష్ట్వా ప్రజాపతీ న్ప్రవృత్తిలక్షణం ధర్మం గ్రాహయామాస వేదోక్తమ్. తతోఽన్యాంశ్చ

వేదోక్తధర్మంబు ప్రవృత్తిరూప మనియు, నివృత్తిరూప మనియు, రెండు తెఱంగుల నలరారుచు వచ్చినది. ప్రాణులకు నభ్యుదయనిశ్శ్రేయసహేతు వగునీధర్మము శ్రేయోభిలాషు లగు బ్రాహ్మణాదివర్ణములవారిచేతను ఆశ్రమస్థులచేతను ననుష్ఠింపఁబడుచుఁ గ్రమక్రమముగా దీర్ఘకాలవశమున ననుష్ఠాతలకుఁ గామ ముద్భవించుటచే విజ్ఞానవివేకములు నశింప నధర్మముచే ధర్మ మావరింపఁబడి యధర్మ మభివృద్ధి నొంద జగత్తుయొక్కస్థితినిఁ బరిపాలింపనిశ్చయించిన నాయాదికర్త యగు నారాయణుండు బ్రాహ్మణత్వరక్షణపురస్సరంబుగ వర్ణాశ్రమభేదంబులతో నొప్పువైదికధర్మమును రక్షింప దేవకియందు వసుదేవునివలన భూమబ్రహ్మయంశముచే శ్రీకృష్ణరూపమున నుద్భవించి భూతములయందలిదయచే శోకమోహమహోదధియందు మునిఁగి యున్నయర్జునునికొఱకు వేదవిహిత మగుధర్మద్వయమును గుణాధికులచే గ్రహింపఁబడి యాచరింపఁబడినచో ధర్మ మభివృద్ధి నొందునను నాశయము మీఱ నుపదేశించెను. శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడినధర్మము నాతీరుననే సర్వజ్ఞు లగు వేదవ్యాసభగవానులు గీత లనుపేరఁ బఱగు నేడునూరులశ్లోకములచే గ్రంథముగా రచించెను. సమస్తవేదార్థసారసంగ్రహంబగు నీగీతాశాస్త్రపు టర్థము దుర్విజ్ఞేయము. అద్దానియర్థవ్యక్తీకరణమునకుఁ బలువిధములగువ్యాఖ్యానములు రచింపఁబడియున్నను నయ్యవి యనేకము లగువిరుద్ధార్థములతో నుండుటం జూచి సదర్థమును లోకమున కనుగ్రహింపసమకట్టి శ్రీవిద్యాశంకరభగవత్పాదులు సంక్షేప మగువివరణమును రచించిరి. అయినను గలికాలవశమున నీగ్రంథమునకు మఱల ననేకులు పండితంమన్యులు పలువిధములగు నపార్థములఁ గల్పించుచు ననేకవిధములగు వ్యాఖ్యానాభాసములను టీకాతాత్పర్యాదులను రచించి వెల్లడించుటచే గీతాతత్త్వము సర్వవిధముల మఱుగుపడి ప్రజలయుల్లంబులు కలవరము నొందుచున్నవి. దానంజేసి ధర్మవిప్లవము గలుగుచున్నది. ఇట్టి ధర్మవిప్లవమును వారింప శ్రీవిద్యాశంకరులవ్యాఖ్యానముయొక్క యతిశయము సువ్యక్త మగునటుల నొక

---

సనకసనందనాదీ నుత్పాద్య నివృత్తిలక్షణమ్ ధర్మం జ్ఞానవైరాగ్యలక్షణం గ్రాహయామాస. ద్వివిధోహి వేదోక్తో ధర్మః, ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణః జగతః స్థితికారణమ్ ప్రాణినాం సాక్షాదభ్యుదయనిశ్శ్రేయసహేతు ర్య స్స ధర్మో బ్రాహ్మణాద్యై ర్వర్ణిభి రాశ్రమిభిశ్చ శ్రేయోఽర్థిభి రనుష్ఠీయమానః. దీర్ఘేణ కాలేనానుష్ఠాతౄణాం కామోద్భవా ద్ధీయమానవివేకవిజ్ఞానహేతుకేనాధర్మేణాభిభూయమానే ధర్మే ప్రవర్ధమానే చాధర్మే జగతఃస్థితిం పరిపిపాలయిషుః స ఆదికర్తా నారాయణాఖ్యో

టీకాతాత్పర్యముతో నొప్పు చిన్నిపొత్తమును రచించుటయే యుక్తమగుమార్గ మని యెంచి యీ 'గీతామృతతరంగిణి'ని ప్రదర్శింపుచున్నాము.

ఈగీతాశాస్త్రమునకుఁ బ్రయోజన మెద్ది యన నుత్కృష్టపురుషార్థ మగు నిశ్శ్రేయసము. ఇట్టి నిశ్శ్రేయసమువలన మూలకారణ మగు నవిద్యతోఁగూడ సంసారము పుష్కలముగ నుపరమముఁ జెందును. అట్టి యుపరమము సర్వకర్మ సన్న్యాసపూర్వక మగునాత్మజ్ఞాననిష్ఠవలనఁ గలుగుచున్న దని యీగీతాశాస్త్ర మునందు సువ్యక్త మగుచున్నది. ఏతద్విషయమునుగూర్చి శ్రీకృష్ణభగవానులే యర్జునునకుఁ జరమశ్లోక మని ప్రసిద్ధిగాంచుచున్న

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"

అనుగీతచే నుపదేశించియున్నారు. ఇఁక వర్ణాశ్రమముల నుద్దేశించి విధింపఁబడిన ప్రవృత్తిరూప మగుధర్మ మభ్యుదయహేతు వగుచు దేవాదిస్థానములను బొందించుసాధన మగుచున్నను, ఈశ్వరార్పణబుద్ధిచే ఫలాభిసంధిరహితముగ నాచరింపఁబడిన సత్త్వశుద్ధిని గల్గించును. శుద్ధసత్త్వమును బొందినవానికి జ్ఞాననిష్ఠయం దధికారము గల్గుచున్నది. దానంజేసి ధర్మము జ్ఞానోత్పత్తికి హేతువగుట వలన నిశ్శ్రేయసమునకుఁగూడఁ గారణ మగుచున్నది. ఏతద్విషయము నుద్దేశించి,

"బ్రహ్మణ్యాధాయ కర్మాణి," "యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే"

అని శ్రీభగవానులే వచించియున్నారు.

ఇట్లు నిశ్శ్రేయసహేతు వగు ద్వివిధరూప మగు ధర్మమును, పరమార్థతత్త్వ మగు వాసుదేవనామముతోఁ బేర్కొనఁబడిన పరబ్రహ్మయు నీశాస్త్రమున విశేషించి ప్రదర్శింపఁబడుటచే నీగీతాశాస్త్రము విశిష్టమగు ప్రయోజనసంబంధాభి

విష్ణు ర్భౌమస్య బ్రహ్మణో బ్రాహ్మణత్వస్య రక్షణార్థం దేవక్యాం వసుదేవాదంశేన కృష్ణః కిల సంబభూవ; బ్రాహ్మణత్వస్యహి రక్షణేన రక్షితః స్యా ద్వైదికో ధర్మ స్తదధీనత్వా ద్వర్ణాశ్రమభేదానామ్.

సచ భగవాన్ జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజోభి స్సదాసంపన్న స్త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం ప్రకృతిం వశీకృత్యాజోఽవ్యయో భూతానామీశ్వరో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావోఽపి సన్ స్వమాయయా దేహవానివ జాత

ధేయములతో నొప్పుచున్నయది. కావున నీశాస్త్రార్థము లెస్సగాఁ దెలిసికొనఁబడి నచో సకలపురుషార్థములు సమకూరును.

ఇట్టి గీతాశాస్త్రము "ధృతరాష్ట్ర ఉవాచ" యను వైశంపాయనవాక్య ముతోఁ బ్రారంభ మయి,

" యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ."

అను సంజయునివాక్యముతో ముగియుచున్నది. వైశంపాయనుఁడు వేదవ్యాస శిష్యులలో యజుశ్శాఖాప్రవర్తకుండు. వేదవ్యాసాజ్ఞను శిరసావహించి జనమే జయునకు మహాభారతమును నుపదేశించినమహామహుండు. ధృతరాష్ట్రుఁడు దుర్యోధనాదులకుఁ దండ్రి, ధర్మరాజాదులకుఁ బెదతండ్రి. ఈతఁడు పుట్టుగ్రు డ్డివాఁ డగుటంజేసి బాహ్యవిషయములఁ బ్రత్యక్షముగ గ్రహింప నశక్తుఁడై తనకు హితమును జెప్పునట్టియు యుద్ధభూమినుండి భీష్మపతనానంతరము తనకడకు వచ్చి తత్పతనమును దనకుఁ దెలుపునట్టిసంజయునిఁగూర్చి పలుకుచున్నాఁ డని యర్థము. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" యనుశ్లోకము ధృతరాష్ట్రవాక్య మని "ధృతరాష్ట్ర ఉవాచ" యనువాక్యపు టర్థము.

టీక :- ధర్మక్షేత్రే - ధర్మమునకును ధర్మబుద్ధికిని నభివృద్ధిహేతు వగు, కురుక్షేత్రే - కురుక్షేత్ర మను సుప్రసిద్ధప్రదేశమందు, యుయుత్సవః - యుద్ధము నేయ నిచ్ఛయించినవారలయి, సమవేతాః - కూడినటువంటి, మామకాః - నావార లగు దుర్యోధనాదులును, పాండవాశ్చైవ - యుధిష్ఠిరుఁడు మొదలుగాఁగల పాండ వాదులును, కిమ్ - ఏమి, (అసంగతమును), అకుర్వత - చేసిరి ? హేసంజయ - ఓయి సంజయుఁడా, సవిస్తరముగాఁజెప్పు మని "బ్రూహి" శబ్దాధ్యాహారము చేయునది.

తాత్పర్యము : ధృతరాష్ట్రుఁడు :— ఈ యధ్యాయ మధికారినిరూపణమునకై ప్రవర్తించుటంజేసి యర్జునునిగుణకథనమును బుష్కలముగఁ జేయుచున్నటుల

ఇవచలోకానుగ్రహంకుర్వన్ లక్ష్యతే స్వప్రయోజనాభావేఽపిభూతానుజిఘృక్షయా వైదికం ధర్మద్వయ మర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నా యోపదిదేశ; గుణాధికైర్హి గృహీతోఽనుష్ఠీయమానశ్చ ధర్మః ప్రచయం గమిష్యతీతి తం ధర్మం భగవతా యథోపదిష్టం వేదవ్యాస స్సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యై స్సప్తభిః శ్లోకశతై రుపనిబబంధ.

సుస్పష్టము. అర్జునునిగుణములయొక్క యతిశయమును వర్ణింపఁ దదితరుల గుణవర్ణనంబుగూడ నొకింత తెలియవచ్చెడిని. అట్లు తెలియవచ్చుటలోఁ గొంతవఱకు ధృతరాష్ట్రస్వభావముగూడఁ దెలియవచ్చెడిని. ఒకానొకపురుషునియొక్క యంతఃకరణస్వభావమును దెలిసికొనుటకు వానియొక్క బాహ్యములగు వాక్చేష్టలుతక్క వేఱొండుసాధనము లేదని గుణవిమర్శనకుశలులు గుర్తెఱింగినవిషయమే. ప్రకృతము ధృతరాష్ట్రుని స్వభావాన్వేషణమున కీ 'ధర్మక్షేత్రే' అనుశ్లోక మొక్కటియ యిందు గతి. కావున నీశ్లోకార్థము నొకింత విచారింతము. భీష్మపతనమును సంజయునివలన వినినధృతరాష్ట్రుఁడు భీష్మాచార్యులు ధర్మయుద్ధమునఁ బడుట యసమంజస మనితలఁచి ధర్మరాజాదు లధర్మయుద్ధముచే భీష్మునిఁ బడఁగొట్టియుండవలయు నని నిశ్చయించి, 'కురుక్షేత్రము సామాన్యస్థలము గాదు, ధర్మక్షేత్రమే! ధర్మక్షేత్రమునకుఁ బోయినవారలకు ధర్మబుద్ధియే కలుగవలయునుగాని యధర్మబుద్ధి గలుగుట యుక్తము కాదు. ఒకానొకవేళ దుర్యోధనాదులు సహజముగ దుష్టస్వభావు లగుటచే వారలకు సదుద్దేశము జనింపకపోయినఁ బోవచ్చునుగాని సహజధర్మస్వభావు లగు ధర్మరాజాదులకు దుర్బుద్ధులు పుట్టుటయు నధర్మయుద్ధము సేయుటయుఁ గలుగకూడదే! అట్టివిషయమున భీష్మాచార్యులు పడుట దుర్ఘటమే యగు నను వ్యాకులచిత్తముతోఁ గురుక్షేత్రమున జరిగినవిషయ మంతయు లెస్సగా వినిన నిజము తెలియు నను నాశయము మీఱ "కి మకుర్వత?" అని ప్రశ్నించెను. ఇచ్చట "కిమ్" అనునది విస్మయార్థకము, నాక్షేపార్థకమును. ధర్మరాజాదు లయోగ్యకృత్యమును జేసియున్నా రనునభిప్రాయము. కురుక్షేత్రము ధర్మక్షేత్ర మగుటంజేసి హింసాప్రధాన మగుయుద్ధ మచట నుచితమే కాదు. దుర్యోధనాదులు సహజదుష్టస్వభావు లగుటచే యుద్ధము పొసఁగినను, ధర్మరాజాదు లధర్మమునకుఁ గడంగిరా యనువిస్మయమును. భీష్ముఁడు పడకపోయినఁ బాండవులు గెలుచుటకల్ల. దానంజేసి దుర్యోధనాదులు రాజ్యమును బడయఁగలుగుదురు. అన్యాయముచే దుర్యోధనాదులు రాజ్యమును బడయుటయు ధర్మరాజాదులు భ్రంశముఁ జెందు

---

తదిదం గీతాశాస్త్రం సమస్తవేదార్థసారసంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థమ్ తదర్థావిష్కరణా యానేకై ర్వివృతపదపదార్థవాక్యార్థన్యాయమ ప్యత్యంతవిరుద్ధానేకార్థత్వేన లౌకికై ర్గృహ్యమాణ ముపలభ్యాఽహం వివేకతోఽర్థనిర్ధారణార్థం సంక్షేపతో వివరణం కరిష్యామి.

తస్యాస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం సహే

సంజయ ఉవాచ:—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2

---

టయు ధృతరాష్ట్రునకుఁ బ్రీతికరములా యనినచోఁ, బ్రీతికరములే యని చెప్పుటకు నిచట "మామకాః పాండవాః" అను లింగము గలదు. దుర్యోధనాదులును ధర్మ రాజాదులును దనవారలే యైయుండ దుర్యోధనాదులనుమాత్రము "మామకాః" అని ప్రశంసింపుచు "పాండవాః" అని పాండవుల నన్యభావముతో నిరసించుటయే ధృతరాష్ట్రునియొక్క మమకారసూచకము. అహంకారము మమకారపురస్సరము. దానంజేసి ధృతరాష్ట్రుఁ డహంకారమమకారవిశిష్టుం డని యిందువలనఁ దెలియ వచ్చెడిని. అహంకారమమకారవిశిష్టునికిఁ జర్మచక్షుస్సులు స్ఫుటముగ నున్నను, జ్ఞానచక్షుస్సు తిరోహిత మగుటంజేసి యజ్ఞానతిమిరాంధుఁ డగుచున్నాఁడు గావున ధృతరాష్ట్రుని బుట్టుగ్రుడ్డివానిగ వర్ణించుటచే నజ్ఞానతిమిరాంధుఁ డగునజ్ఞాని సూచింపఁబడుచున్నాఁ డని యలంకారకోవిదులు తలఁచుచున్నారు.

సంజయుఁడు:—రాగద్వేషాదిదోషములను లెస్సగా జయించినవాఁ డగుటచే సకలవిషయములను నిర్వ్యాజముగాఁ జెప్పు సత్యసంధుఁ డనునభిప్రాయమును సూచించుసార్థకనామ మీసంజయపదము. అందుచే నాతనిపలుకులు ముల్లోకముల కును విశ్వాసహేతువులు. 1

టీక:—రాజా దుర్యోధనః తు - రాజగుదుర్యోధనుఁడు, తదా-ఆసమయమున, వ్యూఢం - వ్యూహాకారముగా నున్నయట్టి, పాండవానీకమ్ - పాండవసైన్యమును, దృష్ట్వా - చూచి, ఆచార్యమ్ - ద్రోణాచార్యుని, ఉపసంగమ్య - వినయముతో సమీపించి, వచనమ్ - చెప్పఁబోవువాక్యమును, అబ్రవీత్ - పలికెను. 2

తా:—ధృతరాష్ట్రునిప్రశ్నము ననుసరించి కౌరవులును బాండవులును గురు క్షేత్రమున యుద్ధముఁ జేయ సమావేశమైన క్షణము మొదలు భీష్మపతనము వఱకును గల పదిదినములవృత్తాంతమును సక్రమంబుగాఁ జెప్ప "దృష్ట్వాతు పాండవా నీకమ్" అనుశ్లోకముతో సంజయుఁడు ప్రారంభముఁ జేసినాఁ డని వైశంపాయన వాక్యము "సంజయ ఉవాచ" యనునది.

---

తుకస్య సంసార స్యాత్యంతోపరమలక్షణమ్. తచ్చ సర్వకర్మసన్న్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠారూపా ద్ధర్మా ద్భవతి. తథేమమేవ గీతార్థం ధర్మ ముద్దిశ్య భగ వతైవోక్తమ్, "సహి ధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః పద వేదనే" ఇత్యనుగీతాసు

పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా. 3

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః. 4

---

దుర్యోధనుఁ డాచార్యుని వినయముతో సమీపించె నని చెప్పుటచే నాతఁడు భయముఁ జెందె ననియు, నట్టిభయనివృత్తికై యాచార్యునికడ కేఁగెననియుఁ దెలియునది. ఆచార్యుని బొందినంతలో భయమును జెందె నని యెట్లు చెప్పవచ్చు నననీయర్థము వేదాంతశాస్త్రమునుండి సిద్ధించుచున్నది. అది యెట్లన ? సంసారసాగరమున డస్సి, తరించునుపాయముఁ గానక భయముఁ జెంది యట్టిమహాసాగరమునుండి తరింపఁజేయుఁ డని ప్రార్థింపుచు నాచార్యునికడఁ జేరుట లోకాచారమైన విషయంబే. ఆచార్యునికడఁ జేరె ననునంతనే యట్లు చేరుటకు భయము కారణమని వేఱ వచింప నక్కరలేదు. ఏల యన "వచన మబ్రవీత్" - 'వాక్యమును బలికెను' అని సంజయుఁడు చెప్పుచున్నాఁడు. "అబ్రవీత్" అనునంతనే 'మాటలాడుచున్నాఁ' డనునర్థము లభించుచుండ మఱల వచనపదప్రయోగముచే నేదియో యొక గొప్ప యర్థ ముండితీరవలయును. అందుచే నచటివచనపదము విశేషార్థబోధకపర మని తెలియనగును. విశేషార్థము దుర్యోధనవాక్యములవలన సువ్యక్తమగుచున్నది. దుర్యోధనుఁడు భయముచే నాచార్యుని సమీపించినను ధీరోదాత్తుఁడు గావున భయమును వెల్లడిచేయక తన గౌరవము నిలుపుకొనుచుఁ గార్యమును సాధించుయత్నముఁ జేయుచు జాగరూకుఁడై మాట్లాడెను. 2

టీ: -ఆచార్య ! - గురువర్యా !, ధీమతా - బుద్ధిశాలియు, తవశిష్యేణ - నీయొక్క-శిష్యుఁడును; ద్రుపదపుత్రేణ - ద్రుపదరాజుకుమారుఁడును అగు ధృష్టద్యుమ్ననిచే, వ్యూఢామ్ - వ్యూహాకారముగా నిర్మింపఁబడిన, ఏతామ్ - ఈపురోవర్తినియగు, పాండుపుత్రాణామ్ - పాండవులయొక్క, మహతీమ్ - గొప్పదగు, చమూమ్-సైన్యమును, పశ్య - తేరిచూడుమా ! 3

టీ:-అత్ర – పాండవసైన్యమునందు, యుధి - యుద్ధమున, భీమార్జునసమాః-భీమార్జునులతోఁ దుల్యులగు, మహేష్వాసాః - గొప్ప ధనుస్సులు గలిగిన, శూరాః-అనేకశూరులు, (సంతి - కలరు) అని 'సంతి' అను క్రియాపదాధ్యాహారముచే

---

(మ. భా. అశ్వ : 16.12.) తత్రైవచోక్తమ్ "నైవధర్మీ నచాధర్మీ నచైవహి శుభాశుభీ" (మ. భా. అశ్వ : 19.7.) "యః స్యాదేకాసనే లీన స్తూష్ణీం కించి దచింతయన్" (మ. భా. అశ్వ : 19.1.) "జ్ఞానం సన్న్యాసలక్షణమ్" (మ. భా. అశ్వ. : 43.25.) ఇతిచ.

ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. 6

అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. 7

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః. 8

---

వాక్యమును యోజించునది. అట్టి వీరు లెవ్వ రన, యుయుధానః - సాత్యకి, విరాటశ్చ - విరటదేశాధిపతియు, మహారథః ద్రుపదశ్చ - మహారథుఁ డగు ద్రుపదుఁడు, ధృష్టకేతువు, చేకితానుఁడు, పరాక్రమశాలి యగు కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, రాజశ్రేష్ఠుఁ డగు శైబ్యుఁడు, పరాక్రమశాలి యగు యుధామన్యుఁడు, వీర్యవంతుఁ డగు నుత్తమౌజుఁడు, సౌభద్రః - అభిమన్యుఁడు, ద్రౌపదేయాశ్చ - ఉపపాండవులును, సర్వే - అందఱును, మహారథా ఏవ - మహారథులే. 6

టీ:- ద్విజోత్తమ! - బ్రాహ్మణపుంగవుఁడా! అస్మాకంతు (సేనాయాం) - మన సైన్యమం దన్ననో, యే విశిష్టాః - ఎవ్వరు శ్రేష్ఠులో, తాన్ - వారలను, నిబోధ - గుర్తెఱుంగుమా, మమ - నాసంబంధమగు, సైన్యస్య - సేనయొక్క, నాయకాః - ముఖ్యమగువారలు, (యే - ఎవరో) తాన్ - వారలను, సంజ్ఞార్థమ్ - తెలిసికొను నిమిత్తము, తే - నీకొఱకు, బ్రవీమి - చెప్పుచుంటిని. 7

టీ:- భవాన్ - నీవు, భీష్మశ్చ - భీష్మాచార్యుఁడును, కర్ణశ్చ - కర్ణుఁడును, సమితింజయః - యుద్ధమును జయింపఁగలిగిన, కృపశ్చ - కృపాచార్యులును, అశ్వత్థామయు, వికర్ణుఁడును, సౌమదత్తిః - సోమదత్తపుత్త్రుఁడగు, జయద్రథః - జయద్రథుఁ డను నామాంతరము గల భూరిశ్రవసుఁడును. 8

---

ఇహాపిచాంతే ఉక్త మర్జునాయ "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" (గీ.18-66.)ఇతి. అభ్యుదయార్థోఽపి యః ప్రవృత్తిలక్షణో ధర్మో వర్ణానాశ్రమాం శ్చోద్దిశ్య విహిత స్స దేవాదిస్థానప్రాప్తిహేతు రపిసన్ ఈశ్వరార్పణబుద్ధ్యాఽనుష్ఠీయమాన స్సత్త్వశుద్ధయే భవతి ఫలాభిసంధివర్జితః. శుద్ధసత్త్వస్య చ జ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తిద్వారేణ జ్ఞానోత్పత్తిహేతుత్వేనచ నిశ్శ్రేయసహేతుత్వమపి ప్రతిపద్యతే. తథా చేమ మేవార్థ మభిసంధాయ వక్ష్యతి "బ్రహ్మ ణ్యాధాయ

అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః. 9

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. 10

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమే వాభిరక్షంతు భవంతః సర్వ ఏవహి. 11

---

టీ:—మదర్థే - నాకొఱకు, త్యక్తజీవితాః - ప్రాణములను విడువ నిశ్చయించినట్టియు, నానాశస్త్రప్రహరణాః - అనేకవిధములగు శస్త్రములు ప్రహరణములు గలిగియున్న, బహవః - అనేకులగు, అన్యే శూరాః - ఇతరశూరులు, (సంతి - కలరు) సర్వే - అందఱును, యుద్ధవిశారదాః - యుద్ధమునం దారితేఱినవారే. 9

టీ:—తత్ అస్మాకం బలమ్ - ఆ మన సైన్యము, భీష్మాభిరక్షితమ్ - భీష్మునిచే రక్షింపఁబడినదైనను, అపర్యాప్తమ్ - చాలియుండలేదు, ఏతేషాం - ఈపాండవుల యొక్క, ఇదం బలంతు - ఈసైన్య మన్ననో, భీమాభిరక్షితం సత్ - భీమునిచే రక్షింపఁబడుచున్న దైనను, పర్యాప్తమ్ - చాలియున్నది. 10

టీ:—భవంతః సర్వే ఏవ - మీ రందఱును, సర్వేషు - సమస్తములగు, అయనేషుచ - వ్యూహస్థానములందును తదితరము లగుప్రదేశములందును, యథాభాగమ్ - నియమిత స్థలములందు, అవస్థితాః - ఉన్నవార లయి, భీష్మమేవ - భీష్మాచార్యులనే, అభిరక్షంతు హి - తప్పక రక్షింతురుగాక. 11

తా:—దుర్యోధనుఁడు:—"దృష్ట్వాతు పాండవానీకమ్" అనుశ్లోకము మొదలు "అయనేషుచ సర్వేషు" అను పదునొకండవశ్లోకమువఱకు నుండు పదిశ్లోకముల వలన దుర్యోధనునియొక్క హృదయధర్మము తెలియవచ్చెడిని. దుర్యోధనుఁడు కపటోపాయములచేఁ గార్యమును సాధించుకొనఁదలఁచు దుష్టబుద్ధి. ఈతఁడు యుద్ధమునందుఁ గార్యసాధనమునకై ద్రోణాచార్యులకుఁ బాండవులయెడ ద్వేషమును బుష్కలముగాఁ గలుగఁజేసినఁగాని ప్రయోజన ముండ దని యెంచి ద్రోణాచార్యునిఁ దనవశవర్తిగాఁ జేసికొనుటకుఁ దగునుపాయము నెంచుచుండఁ గాకతాళీయన్యాయముగాఁ బాండవసైన్యమునకు ధృష్టద్యుమ్నుఁడు సేనానాయకత్వము వహించుట గానవచ్చె. సేనానాయకత్వమును వహించిన ధృష్టద్యుమ్నుఁడు పాండవ

---

కర్మాణి" (గీ. 5.10) "యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మశుద్ధయే." (గీ. 5-11) ఇతి.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12

---

సైన్యమును వ్యూహాకారముగాఁ బన్నుటను జూచినతోడనే దుర్యోధనుఁ డాచార్యుఁ డగు ద్రోణుని వినయపూర్వకముగా సమీపించి "పశ్యైతా" మిత్యాదిశ్లోకములఁ బలికెను. అందు 'పశ్యైతాం పాండుపుత్త్రాణామ్' అనుశ్లోక మంతయు సాభిప్రాయ వాక్యము. దీనిచే దుర్యోధనుఁడు ద్రోణాచార్యునకుఁ బాండవులపై ద్వేషమును జనింపఁజేయ నిశ్చయించెను. అందు 'పశ్య' అనగా 'లెస్సగాఁ బరికించిచూఁడుము' అని యభిప్రాయము.

"ద్రుపదపుత్త్రేణ" అనుటచే ద్రుపదరాజునకును ద్రోణాచార్యునికిని గల పూర్వవైరము నంతయు జ్ఞప్తికిఁ దెచ్చుట యటుండ, ద్రోణాచార్యునియొక్క చావున కుద్దేశింపఁబడిన ధృష్టద్యుమ్నునికి సేనానాయకత్వ మిచ్చుటలోఁ బాండవులు ద్రోణాచార్యునియొక్క వధోపాయమునే మొట్టమొదటి కార్యముగాఁ దలఁచినట్లును, అట్టి గురుద్రోహులపైఁ బక్షపాతము గల్గియుండుట యవివేకవిలసితమనియు ద్రోణున కుద్రేకముఁ గల్గించి క్రోధమును గలుగఁజేయ నిందలిప్రతిపదము ప్రయోగింపఁబడినది. వాస్తవముచే ద్రోణుఁ డర్జునపక్షపాతి యనియు నద్దానిచే నాతఁడు విజృంభించి యుద్ధమును జేయఁ డనియుఁ దానఁ దనకుఁ గీడు వాటిల్లుననియు నట్టికీడు వాటిల్లకుండఁ బాండవులపై ద్వేషభావము పుట్టించుట కీయవకాశమును దిలకించి యత్నించుటలో దుర్యోధనునిస్వభావ మంతయు సుకరముగాఁ దెల్లమయ్యెడి. "ద్రుపదశ్చ మహారథః" అని ఆచార్యునికి విరోధియగు ద్రుపదునికి మహారథత్వవిశేషణమువలన దుర్యోధనునికిఁ బాండవసైన్యవిద్వేషజనకత్వము సువ్యక్తముగాఁ గానవచ్చుచున్నది. ఇఁక దుర్యోధనుఁ డాచార్యుఁ డెంతవఱకు నేమి చూడవలయునో యద్దాని నంతయు "అపర్యాప్తం తదస్మాకం బలం" అను శ్లోకముతో ముగించి యాచార్యునివలన నెద్దియుఁ బ్రత్యుత్తరముఁ బడయక భీష్మాచార్యునికి నుత్సాహముఁ గలుగఁజేయుతలంపున బిగ్గరగా సైనికుల నందఱను,

"అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవహి."

అని శాసించుచున్నాఁడు. 11

టీ:—ప్రతాపవాన్ - పరాక్రమశాలియు, కురువృద్ధః - కౌరవశ్రేష్ఠుఁడును, పితామహః - తాతయునగు భీష్మాచార్యుఁడు, తస్య - దుర్యోధనునికి, హర్షం - సంతస

---

ఇమం ద్విప్రకారం ధర్మం నిశ్శ్రేయసప్రయోజనం పరమార్థతత్త్వం చ వాసుదేవాఖ్యం పరం బ్రహ్మాభిధేయభూతం విశేషతో ఽభివ్యంజయ ద్విశిష్టప్రయో

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసై వాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్. 13

తతః శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. 14

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. 16

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. 17

---

మును, జనయన్ - పుట్టించుచు, ఉచ్చైః - బిగ్గరగా, సింహనాదం - సింహనాదమును, వినద్య - చేసి, శంఖమ్ - శంఖమును, దధ్మౌ - పూరించెను. 12

తా:- దుర్యోధనునిశాసనమును వినినభీష్ముఁడు దుర్యోధనునికి హర్షమును గల్గింపఁ దాను సన్నద్ధుఁడై యున్నట్లు సింహనాదమును జేసి యితరు లందఱును సన్నద్ధులై యున్నారా యనిప్రశ్నించుటకై శంఖమును బూరించెను. 12

టీ:- తతః - పిమ్మట, శ్వేతైః - తెల్లని, హయైః - గుఱ్ఱములతో, యుక్తే - కూడిన, మహతి - గొప్పదియైన, స్యందనే - రథమునందు, స్థితౌ - ఉన్నట్టి మాధవః - శ్రీకృష్ణుఁడును, పాండవశ్చైవ - అర్జునుఁడును, దివ్యౌ - దేవతాసంబంధములగు, శంఖౌ - శంఖములను, ప్రదధ్మతుః - పూరించిరి. 14

టీ:- తతః - పిమ్మట, శంఖాశ్చ - శంఖములును, భేర్యశ్చ - భేరులును, పణవానకగోముఖాః - పణవములు, ఆనకములు, గోముఖము లనువాద్యవిశేషములు, సహసైవ - ఒక్కపర్యాయము, అభ్యహన్యంత - వాయింపఁబడినవి. స శబ్దః - ఆ వాద్యవిశేషములధ్వని, తుములః - అంతటను నిండినదై, అభవత్ - ఆయెను. 13

టీ:- శ్రీకృష్ణుఁడు పాంచజన్య మనుశంఖమును, అర్జునుఁడు దేవదత్త మను దానిని, భీముఁడు పౌండ్ర మనుదానిని, రాజగు యుధిష్ఠిరుఁడు అనంతవిజయ మును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములను బూరించిరి. పిమ్మట కాశి

---

జనసంబంధాభిధేయవత్ గీతాశాస్త్రమ్; యత స్తదర్థే విజ్ఞాతే సమస్తపురుషార్థసిద్ధి రత స్తద్వివరణే యత్నః క్రియతే మయా.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్. 18

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. 19

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. 20

హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే,
'సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. 21

---

రాజు, శిఖండి, ధృష్టద్యుమ్నుఁడు, విరాటుఁడు, సాత్యకి, ద్రుపదుఁడు, ద్రౌపదేయులగు నుపపాండవులు, అభిమన్యుఁడును బ్రత్యేకప్రత్యేకముగాఁ దమతమశంఖములను బూరించిరి. 15-18

టీ:—సః ఘోషః - ఆశంఖములధ్వని, ధార్తరాష్ట్రాణామ్ - దుర్యోధనాదులయొక్క, హృదయాని - అంతఃకరణములను, వ్యదారయత్ - భేదించెను. నభశ్చ - ఆకాశమును, పృథివీంచైవ - భూమిని, తుములః - అంతటను, వ్యనునాదయన్ - ఎక్కువధ్వని జేయుచు, వ్యదారయత్ అనిపూర్వమున కన్వయము. 19

టీ:—మహీపతే - ధృతరాష్ట్రుఁడా!, అథ - వీరులచే శంఖారవము చేయఁబడిన పిమ్మట, కపిధ్వజః - హనుమంతుఁడు ధ్వజముగాఁగల, పాండవః - అర్జునుఁడు, శస్త్రసంపాతే - బాణపరంపర, ప్రవృత్తేసతి - బయలువెడలగా, వ్యవస్థితాన్- ఆయాయిస్థానములయందు నియోగింపఁబడిన, ధార్తరాష్ట్రాన్ - దుర్యోధనాదులను, దృష్ట్వా - చూచి, ధనుః - విల్లును, ఉద్యమ్య - ఎక్కుపెట్టి, తదా - అప్పుడు, ఇదమ్ - చెప్పఁబోవు, వాక్యమ్ - వాక్యమును, హృషీకేశం - శ్రీకృష్ణునిఁ గూర్చి, ఆహ - పలుకుచున్నాఁడు.

దుర్బుద్ధేః - దుష్టమగు బుద్ధిగల, ధార్తరాష్ట్రస్య - దుర్యోధనునకు, యుద్ధే యుద్ధమందు, ప్రియచికీర్షవః - ఇష్టమును జేయనిశ్చయించినవారై, అత్ర - ఇచ్చటకు సమాగతాః - వచ్చినటువంటి, యే ఏతే - ఏవీరలు, (సంతి - ఉండిరో, తాన్-ఆ,) యోత్స్యమానాన్ - యుద్ధము చేయఁబోవువారలను, అహం - నేను, అవేక్షే-చూచెదను, చూచుటయందుఁ గల యుద్దేశము: అస్మిన్ రణసముద్యమే - ఈయుద్ధ

యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. 22

ప్రారంభమున, కైస్సహ - ఎవ్వరితో, మయా - నాచే, యోద్ధవ్యమ్ - యుద్ధము చేయఁబడవలయునో, ఏతాన్ - ఈ, యోద్ధుకామాన్ - యుద్ధకాములై, అవస్థితాన్ - ఉన్నవారలను, యావత్ - ఎక్కడనుండి, అహం - నేను, నిరీక్షే - లెస్సగాఁ జూడఁగలనో, (తావత్ - అచ్చట,) ఉభయోః - రెండగు, సేనయోః - సైన్యముల యొక్క, మధ్యే - మధ్యభాగమున, అచ్యుత! - ఓయికృష్ణా!, మే - నాయొక్క, రథం - అరదమును, స్థాపయ - ఉంచుమా!

తా:- భీష్మాచార్యులు సాభిప్రాయముగా శంఖమును బూరించినపిమ్మట కౌరవసైనికు లందఱును సిద్ధముగా నున్నామని తెలుపుడుచేయు వాద్యఘోషమును గావించిరి. పిమ్మట పాండవప్రముఖులుగూడ నాతీరుననే యుద్ధసన్నద్ధులై నటుల శంఖారవమును గావించిరి. అట్టితరుణమునఁ గౌరవసైన్యమునుండి శస్త్రపరంపరలు వెలువడగా నుద్రేకమున నర్జునుఁడు విల్లెక్కుపెట్టి యా యాయిస్థానములయందు నున్న ధార్తరాష్ట్రవీరులఁ జూచి యెక్కుపెట్టినవిల్లు నెవరిపై వినియోగింపవలయు ననునిశ్చయమును బొందనేఱక పిమ్మట తనరథము నుభయసేనామధ్యమందు నిలుపు మని పలికెను. అట్లుపలుకుటయందుఁ దాత్పర్యము తన కనువగు యోధవీరుల నెన్నుకొనుట యనియు వ్యక్తీకరించియున్నాఁడు. ఇం దొకవిశేషము గలదు.

కౌరవసైన్యమునందుఁ గలప్రముఖుల నర్జును డిదివఱకు గుర్తెఱింగియుండలేదా? అప్పుడే గమనింపవలయునా? కౌరవసైన్యమందలి ప్రముఖులుగ భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణుల నిదివఱలోనే గుర్తెఱింగియున్నాఁడు. అందు భీష్ముని సేనానాయకునిఁగా నెల్లరు నెఱింగినవిషయమే. సేనానాయకునితోఁడియుద్ధము యుద్ధవీరునకు యుక్తముగదా! అట్టి తరుణమునఁ బ్రకృతమున నుద్దేశింపఁబడిన నూతనాన్వేషణమునకుఁ గలకారణ మేమి? ఇది యొకింత యోజింపనగును. అర్జునుఁడు దుర్యోధనాదులచేఁ బట్టుకొమ్మగా నెన్నఁబడుచున్నకర్ణునియందుఁ బుష్కలద్వేషము మీర నాతనియందుఁ దన లక్ష్య ముంచి విల్లెక్కుపెట్టె నని యూహించునది. భీష్మద్రోణకృపాశ్వత్థామ లతనిబుద్ధి కెంచుకేనియుఁ దట్టియుండలేదు. విల్లెక్కు వెట్టి చూడఁగా కర్ణుఁడు కౌరవసైన్యమందుఁ గానరామికి దిగులుఁ జెంది ముందుఁ జేయఁబోవునది తోఁపక యీనూతనాన్వేషణమునకుఁ గడంగినట్లు నిశ్చయింపవలసి

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః.' 23

సంజయ ఉవాచ :—

ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 24

భీష్మద్రోణప్రముఖతః సర్వేషాంచ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతాన్ కురూనితి. 25

---

యున్నది., కర్ణుఁడు యుద్ధభూమియం దగపడమికిఁ గర్ణశపథమే. భీష్మాచార్యుఁడు నిలిచియున్నంతకాలము తాను యుద్ధభూమియందుఁ జొర నని ప్రతినఁజేసి వెనుక నే నిలిచియుండెను. 23

టీ:—అర్జునిచే నియమింపఁబడిన శ్రీకృష్ణుఁడు చేసినకార్యమును సంజయుఁడు వివరించుచున్నాఁ డనునర్థము కల దీ"సంజయ ఉవాచ" యను వైశంపాయనుని వాక్యము, భారత - ధృతరాష్ట్రుఁడా!, గుడాకేశేన - అర్జుననిచే, ఏవం - ఈరీతిగా, ఉక్తః - పలుకఁబడిన, హృషీకేశః - శ్రీకృష్ణుఁడు, రథోత్తమమ్ - శ్రేష్ఠమగు నరదమును, ఉభయోః - రెండగు, సేనయోః - సైన్యములయొక్క, మధ్యే - మధ్యభాగమున, భీష్మద్రోణప్రముఖతః - భీష్మద్రోణులముందటను, సర్వేషాం - సమస్తమగు, మహీక్షితాంచ - రాజులయొక్కయు, ప్రముఖతః - ముందటను, స్థాపయిత్వా - నిలిపి, పార్థ - ఓయి యర్జునా!, ఏతాన్ - ఈ, సమవేతాన్ - కూడుకొనియున్న, కురూన్ - ధార్తరాష్ట్రులను, పశ్య - పరికించిచూడుమా, ఇతి - ఈరీతిగా, ఉవాచ - పలికెను. 25

తా:—ఉభయసైన్యములును యుద్ధమునకు సర్వవిధములఁ సిద్ధముగా నుండుటఁ జూచి యర్జునుఁడు తనసారథియగు శ్రీకృష్ణభగవానుల నుద్దేశించి "సేనయో రుభయోర్మధ్యే" యని పలుక శ్రీకృష్ణభగవాను లుభయసైన్యములయొక్క మధ్యను భీష్మద్రోణులయెదుట రథము నునిచి "పార్థ పశ్యైతాన్ కురూన్ సమవేతాన్" అని పలికెను. ఇచట గమనింపవలసిన శ్రీకృష్ణచాతుర్యమొండు గలదు. అర్జునుఁడు రెండుసైన్యములమధ్యఁ దనరథము నుంచవలయు నని పలుకుటకుఁ గలయభిప్రాయము 'యావదేతాన్' అను శ్లోకముచేఁ దెలియవచ్చుచున్నది. కాని శ్రీకృష్ణభగవానులచే భీష్మ

తత్రా౽పశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్,
ఆచార్యా న్మాతులాన్ భ్రాతౄ న్పుత్రా న్పౌత్రాన్ సఖీం స్తథా. 26
శ్వశురా న్సుహృదశ్చైవ సేనయో రుభయోరపి,
తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వా న్బంధూ నవస్థితాన్. 27
కృపయా పరయా౽౽విష్టో విషీద న్నిద మబ్రవీత్,
"దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్. 28

---

ద్రోణులముందట రథ ముంచఁబడుటకుఁ గలకారణ మించుకేనియు వ్యక్తీకరింపఁబడక, సమావేశ మైయున్నయీకౌరవులను లెస్సగాఁ బరికింపుమా యనువాక్యపురస్సరంబగు హస్తప్రసారణ మొకటిమాత్రము తెలియవచ్చుచున్నది. ఇట్టి శ్రీకృష్ణ భగవానునియొక్క వాక్చేష్టలకుఁ గల నిగూఢాభిప్రాయ మొకింత తెలియఁదగిన విషయము. అదెద్ది యన - నర్జునుఁడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని మొదలు గాఁగల ధార్తరాష్ట్రులయందలి తీవ్రక్రోధమున వారలచేఁ బట్టుకొమ్మగాఁ దలంపఁబడు కర్ణునిఁ జంపవలయు నను వేగముచేఁ దనమనోరథపూర్తికిఁ బ్రబలప్రతిబంధక మగు భీష్మద్రోణులను మఱచి వ్యవహరించుచున్నాఁడు. వాస్తవముచే భీష్మద్రోణులు చంపఁబడనిదే యర్జునుఁ డెట్టివారలను జంపుటకు వీలులేనిపరిస్థితులు కౌరవపక్షమున నొప్పుచుండె ననువిషయమును మఱచి యర్జునునిదృష్టి వేఱొకప్రక్కఁ జరించుచున్నది. దానంజేసి యర్జునునకు మున్ముందు వాటిల్లుముప్పుఁ దప్పించుటయే గురువగు శ్రీకృష్ణున కవశ్యకర్తవ్యము గావున భీష్మద్రోణుల నర్జునుని బుద్ధియందుఁ బ్రసరింపఁజేసి పరిస్థితులఁ జక్కఁజేయుతలంపున శ్రీకృష్ణభగవానులు రథమును భీష్మద్రోణులముందట నిలువఁబెట్టి లెస్సగాఁ బరికింపు మనెను. అందుచే భీష్మద్రోణులతోఁ దా నెట్లు వ్యవహరింపవలయునో యద్దాని లెస్సగా నర్జునుఁడు యోజింపవలయు నని శ్రీకృష్ణభగవదాశయము. 25

టీ :— తత్ర - ఆ యుద్ధభూమియందు, ఉభయోః - రెండగు, సేనయోరపి - సైన్యములయందుఁగూడ, స్థితాన్ - ఉన్నటువంటి, పితౄన్ - తండ్రులను, అథ పితామహాన్ - తాతలను, ఆచార్యాన్ - గురువులను, మాతులాన్ - మేనమామలను, భ్రాతౄన్ - అన్నదమ్ములను, పుత్రాన్ - కుమారులను, పౌత్రాన్ - మనుమలను, సఖీన్ - స్నేహితులను, తథా - ఆతీరుననే, శ్వశురాన్ - మామలను, సుహృదశ్చైవ - మిత్రులనే, పార్థః - అర్జునుఁడు, అపశ్యత్ - చూచెను.

---

సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి,
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే. 29

గాండీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే,
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః. 30

---

అవస్థితాన్ - ఉన్నటువంటి, తాన్ సర్వా న్బంధూన్ - ఆసకలబంధువులను, సమీక్ష్య - లెస్సగాఁ జూచి, సః కౌంతేయః - ఆయర్జునుఁడు, పరయా - ఉత్కృష్టమగు, కృపయా - దయతో, ఆవిష్టః - కూడుకొనినవాఁడై, విషీదన్ - విలపించుచు, ఇదమ్ - ముందుచెప్పఁబోవు వాక్యమును, అబ్రవీత్ - పలికెను.

తా:—శ్రీకృష్ణభగవానునిచేఁ బ్రేరేపింపఁబడినయర్జునుఁ డుభయసైన్యములయందలి బంధుబృందముల నందఱను లెస్సగఁ జూచి యుత్కృష్ట మగుకృపతో నావరింపఁబడినవాఁడై విషాదము నొందియున్నట్లు సంజయుఁడు గ్రహించె నని తెలియుచున్నది.

టీ:—కృష్ణ! - ఓయి కృష్ణుఁడా! యుయుత్సుం - యుద్ధముచేయ నిచ్ఛగించి, సముపస్థితం - లెస్సగా సమీపమున నిలిచియున్నట్టి, ఇమం - ఈపురోవర్తియగు, స్వజనం - మనవారలను, దృష్ట్వా - చూచుటచే, మమ - నాయొక్క, గాత్రాణి - అవయవములు, సీదంతి - శిథిలము లగుచున్నవి, ముఖంచ - నోరుగూడ, పరిశుష్యతి - పూర్తిగా నెండుచున్నది, మే - నాయొక్క, శరీరే - తనువునందు, వేపథుశ్చ - వణకును, రోమహర్షః చ - పులకాంకురములును, జాయతే - పుట్టుచున్నది. హస్తాత్ - చేతినుండి, గాండీవం - గాండీవ మనెడుధనువు, స్రంసతే - జారుచున్నది. త్వక్చైవ - దేహముగూడ, పరిదహ్యతే -. అంతటను మండుచున్నది. అవస్థాతుం - నిలుచుండుటకు, నచ శక్నోమి - సమర్థుఁడను గాను. మే-నాయొక్క, మనః-మనస్సు, భ్రమతి ఇవచ - చలించుచున్న దానివలె నున్నది. కేశవ! - కృష్ణా!, విపరీతాని - అనర్థసూచకము లగు, నిమిత్తాని చ - శకునములను, పశ్యామి - చూచుచున్నాను.

తా:—ఉభయసైన్యములయందలి బంధువులను జూచుటచేఁ దనకుఁ గల్గిన దుస్థితిని అర్జునుఁడు వెల్లడించియున్నాఁడు. ఇట్టిదుస్థితికి ముఖ్యకారణము భీష్మ ద్రోణులఁ జూచుటయు, వారలతోడనే మున్ముందు యుద్ధముఁ జేయవలయు నని తెలిసికొనుటయును. ఈవిషయ మర్జునుఁ డింతవఱకు గమనించియున్న ట్లూహించు

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ,
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే.    31

టకు వీలులేదు. ప్రకృతమున శ్రీకృష్ణహస్తప్రసాదముచేఁ దెలిసికొనియున్నాఁడు. భీష్మద్రోణులతో యుద్ధము చేయుటగాని వారలఁ జంపుటగాని తనకు మితిమీఱిన కార్య మని తెలిసికొనఁజాల నంతటియవివేకి యర్జునుఁ డెంతమాత్రమును గాఁడు. వారలను డీకొనఁజాల ననుటయుఁ జంపఁజాల ననుటయు నభిమానగ్రస్తుఁ డగు నర్జునునిచే వెల్లడింపఁబడుట యసమంజసము. యుద్ధమును సలిపిన భీష్మద్రోణుల వలనఁ దాఁ జచ్చెద ననెడిభయమును గప్పిపుచ్చి యుద్ధమునుండి మఱలుట యుచిత మని తలఁచినటువంటి యర్జునుఁడు ప్రకారాంతరమున నీయుద్ధ మనర్థహేతు వను వాదమును బ్రదర్శింపునుద్దేశముతో మున్ముందు తనదుర్బలస్థితిని వ్యక్తీకరించి యున్నాఁడు. యుద్ధమునుండి విరమించుటకుఁ గల హేతువులను బహుభంగుల రాఁబోవువాక్యములచే వ్యక్తీకరించుచున్నాఁడు.    30

టీ:—కృష్ణ! - కృష్ణుఁడా!, ఆహవే - యుద్ధమందు, స్వజనం - బంధువర్గమును, హత్వా - చంపి, అను - పిమ్మట, శ్రేయః - శ్రేయస్సును, చ - ఇహపరములను, న పశ్యామి - చూడకున్నాను, విజయమ్ - జయమును, న కాంక్షే - అభిలషింపను, రాజ్యం చ - సామ్రాజ్యమును, సుఖాని చ - సుఖములనుగూడ, న కాంక్షే - అభిలషింపను.

తా:—అర్జునుఁ డింతవఱకు నీమహాసంగ్రామమును జేయసిద్ధమై యిప్పటి కిప్పుడు క్షణకాలము లెస్సగ భీష్మద్రోణాదులఁ బరికించిచూచినంతనే యుద్ధము నుండి విరమించుటకుఁ గల యుపపత్తి సమంజసముగ నెందేనిఁ గలదా యన నద్దానిని సూత్రభూతముగ "నచ శ్రేయోఽనుపశ్యామి" అని నిర్వచింపుచున్నాఁడు. ఈ వాక్యముయొక్కయర్థము గంభీరము. ఈ యుద్ధమునందు బంధుజనులను జంపిన తరువాత నీ భూలోకసౌఖ్యమునుగాని పరలోకసౌఖ్యమునుగాని నిశ్శ్రేయసమును గాని పొందున ట్లెంచుకేనియుఁ దెలియరా దనియు నీమూఁడువిధము లగు సుఖములలో నెద్దియు నలవడకపోవుట యటుండ గొప్పపాపము సంభవించుటచే నరకమందు నియతదుఃఖము గల్గుఁగావున నీయుద్ధమును జేయఁజాల ననియు నర్జునుని యొక్క యభిప్రాయము. ఇట్టి యభిప్రాయమునే విస్తరించి "న కాంక్షే విజయం కృష్ణ" అనుశ్లోకము మొదలు, "ఉత్పన్నకులధర్మాణా" మనుశ్లోకాంతము గలవాక్యములచే నర్జునుఁడు వల్కుచున్నాఁడు.    31

న కాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ,
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా. 32

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ,
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. 33

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలా స్సంబంధిన స్తథా. 34

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కింను మహీకృతే. 35

---

టీ:—గోవింద! - కృష్ణుఁడా! నః - మనకు, రాజ్యేన - రాజ్యముచే, కిమ్ - ఏమి ప్రయోజనము? భోగైః - భోగములచే, జీవితేన వా - బ్రతికియుండుటచేఁగాని, కిమ్ - ఏమిప్రయోజనము. 32

తా:— అర్జునుఁడు రాజ్యభోగజీవితములవలన నెట్టిప్రయోజనమును సమకూర దని తలఁచుచు నట్టిరాజ్యభోగసుఖాదులను వానికి మూల మగుజయమును నభిల షింప నని చెప్పుచున్నాఁడు. అ ట్లభిలషింపకపోవుటకుఁ గలకారణము పై రెండు శ్లోకములచే వివరించుచున్నాఁడు.

టీ:—నః - మనకు, రాజ్యం, భోగాః, సుఖానిచ - రాజ్యభోగసుఖాదులు, యేషామ్ అర్థే - ఎవరికొఱకు, కాంక్షితం - కోరఁబడెనో, తే ఇమే - అట్టిఈవీరలు, ప్రాణాన్ - ప్రాణములను, ధనాని చ - ధనమున్నగువానిని, త్యక్త్వా - విడిచి, యుద్ధే - సమరమునందు, అవస్థితాః - ఉన్నారు. వా రెవ్వ రన, ఆచార్యులు, తండ్రులు, పుత్త్రులు, తాతలు, మేనమామలు, మామలు, పౌత్త్రులు, బావమఱదులు, బంధువర్గమును. 34

టీ:—మధుసూదన! - శ్రీకృష్ణా!, ఘ్నతః అపి - చంపఁబడినవాఁడ నైనప్పటికి, ఏతాన్ - ఈమనవారలను, హంతుం - చంపుటకు, న ఇచ్ఛామి - ఇష్టపడను, త్రైలోక్యరాజ్యస్య - త్రిలోకాధిపత్యముయొక్క, హేతోః అపి - కారణమువలనఁ గూడ, మూఁడులోకములయొక్కయాధిపత్యము చేకూరనున్నను వీరలను జంప నిచ్ఛయింప ననుట; మహీకృతే కింను - ఈభూమికొఱకు కననేమి? 35

---

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన,
పాపమే వాశ్రియే దస్మాన్ హత్వైతా నాతతాయినః. 36

తస్మా న్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్,
స్వజనంహి కథం హత్వా సుఖినః స్యామ మాధవ. 37

---

టీ:- జనార్దన! - శ్రీకృష్ణా! ధార్తరాష్ట్రాన్ - దుర్యోధనాదులను, నిహత్య - చంపుటచే, నః - మనకు, కా ప్రీతిః - ఏయిష్టము, స్యాత్ - అయ్యెని? అనఁగా నెట్టి మంచియు సమకూరదు. ఏతాన్ - ఈ, ఆతతాయినః - ఆతతాయులను, హత్వా - చంపుటచే, అస్మాన్ - మనలను, పాప మేవ - దుష్కృతమే, ఆశ్రియేత్ - ఆశ్రయిం చేని, తస్మాత్ - ఆకారణమువలన, స్వబాంధవాన్ - మనబంధుగులగు, ధార్తరాష్ట్రాన్ - దుర్యోధనాదులను, హంతుం - చంపుటకు, వయన్ - మనము, న అర్హాః - తగము.

తా:- సర్వవిధముల యుద్ధమునలుప నిశ్చయించి రణరంగమున కుత్సాహముతో నడచినయర్జునుఁ డీయుద్ధ మిహపరనిశ్శ్రేయసబాధక మనియు నరకహేతువనియు విరమింప సమకట్టియున్నాఁడు. ఇట్టిపరిస్థితుల యుక్తాయుక్తముల గమనించుటకుముం దీయుద్ధమును గూర్చి యొకింత తెలిసికొనవలయును. యుద్ధమన్నను క్షత్త్రియులకు స్మృతిచే విధింపఁబడిన నైమిత్తికకర్మ. నైమిత్తికకర్మ యనఁగాఁ గారణము కల్గినపుడు తప్పక చేయవలసినకర్మ. ఎట్టి కారణము కల్గిన యుద్ధము చేయ వలయు ననిన, బలవంతు లగుధర్మవిప్లవకారులు చెలరేఁగినచో నట్టివారలనుండి ధర్మమును గాపాడుటకై వారలను శిక్షించుటకుగాను చేయవలసిన స్మృతిసిద్ధ మగుకర్మ. ధర్మవిప్లవకారకులు లేనిసమయమున యుద్ధమున కించుకేనియు నవసరము గన్పట్టదు. ఇయ్యది యుద్ధముయొక్క నిమిత్తరూపము. యుద్ధము శాస్త్రముచే నైమిత్తికముగ విధింపఁబడినను రాగవశమున నాచరింపఁబడినచో నయ్యది కామ్యకర్మగఁగూడ పరిణమించుచున్నది. రాగవశమున నాచరింపఁబడు యుద్ధము కర్తయొక్క జయాపజయములకు హేతువై సుఖదుఃఖములఁ బుట్టించును. రాగవశమున యుద్ధము నాచరించుట యన రాజ్యమును గోరియో లేక యశస్సును గోరియో స్వస్థచిత్తతతో యుద్ధయాత్రను గావించుట. ప్రకృతమున ధర్మరాజాదులు దుర్యోధనాదులవలనఁ దమరాజ్యమును సామదానభేదోపాయములచేఁ బడయుటకు నవకాశము చిక్కకపోవుటచే ధర్మవిదూరులును, ధర్మవిప్లవకారులు నగు ధార్త

---

అత్రచ "దృష్ట్వాతు పాండవానీక" మిత్యారభ్య "న యోత్స్యే ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ" (గీ. 2-9-) ఇత్యేతదంతః ప్రాణినాం శ్లోక

యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. 38

---

రాష్ట్రిల యుద్ధమున శిక్షించి తమ రాజ్యమును గైకొన నిలచుటచే నీయుద్ధము నైమిత్తికకర్మగాఁ బరగుచున్నది. దుర్యోధనాదులు ధర్మవిప్లవకారు లనువిషయము, "ఆతతాయినః" అనుపదముచే సుకరముగఁ దెలిసికొననగును. ఆతతాయులన "అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహః, క్షేత్రదారాపహర్తాచ షడేతే హ్యాతతాయినః" అని స్మృతి పలుకుచున్నది. ఆరువిధము లగు దుర్మార్గములలో నెద్దాని నాచరించినను నాతతాయియే. దుర్యోధనాదు లన్ననో యారుదుర్మార్గములకును ముఖ్యముగా నాశ్రయులే. వీరు సామాన్యజను లగుచో శిక్షాస్మృతిచే శాసింపఁబడుటకు సావకాశ ముండును. శిక్షాస్మృతి నతిక్రమించిన పరాక్రమశాలు రైనప్రభువు లగుటంజేసి యర్థశాస్త్రచోదితవిధి ననుసరించి యుద్ధముచే శిక్షింపఁబడవలసినవారలు. అందుచే యుద్ధేతరప్రయత్నము లన్నియు విఫలములు గాఁగఁ జిట్టచివరకుఁ గురుక్షేత్రమున యుద్ధము సిద్ధమయ్యెను. ఇట్టి యుద్ధమునం దర్జునుఁడు పలువిధము లగువిప్రతిపత్తులఁ జెందును. అందులో ముఖ్యము లగునవి కొంతవఱకు నిరూపింపఁబడును.

దుర్యోధనాదు లాతతాయు లగుటఁజేసి "ఆతతాయిన మాయాంతం హన్యాదేవావిచారయన్." అను నర్థశాస్త్రోక్తి ననుసరించి యించుకేనియు యోజన లేక వారలను జంపితిమేని యర్థశాస్త్ర ముల్లంఘించి వారలను జంపకుండినచోఁ గల్గు పాపముకంటె నెక్కుడుపాపము వాటిల్లెడిని. ఏలయన దుర్యోధనాదులు సోదరులు, గురువులు, తండ్రులు, తాతలు, మేనమామలు, లోనుగాఁగలవారు. ఇట్టి బంధువులను జంపుట మహాపాతక మని మన్వాదిస్మృతులు వక్కాణించుచున్నవి. అర్థశాస్త్రముకంటె స్మృతి బలవత్తరము గావున స్మృతి ననుసరించి యర్థశాస్త్రమును ద్రోసివేయుట యుచితము. కేవల మర్థశాస్త్రము ననుసరించి యుద్ధము నేయుటచే నత్యంతము పాపము ఘటిల్లు నని "పాపమే వాశ్రయే దస్మాన్" అనియు నించుకేనియు ప్రీతి కలుగదనియు నర్జునుఁడు ముక్తకంఠుఁడై నిర్వచించి యున్నాఁడు.

టీ:-యద్యపి - విచారింపఁగా, ఏతే - ఈదుర్యోధనాదులు, లోభోపహతచేతసః - లోభముతోఁ గూడినస్వభావము గలవార లగుటచే, కులక్షయకృతమ్ - కుల

---

మోహాదిసంసారదుఃఖబీజభూతదోషోద్భవకారణహేతుప్రదర్శనార్థత్వేన వ్యాఖ్యేయో గ్రంథః; తథాహి - అర్జునేన రాజ్యగురుపుత్రమిత్రసుహృత్స్వజనసంబంధిబాం

కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. 39

---

నాశనమువలనఁ గలుగునట్టి, దోషమ్ - అనర్థమును, మిత్రద్రోహే - మిత్రద్రోహమందుఁ గలుగు, పాతకంచ - పాపము తత్ఫలమును, న పశ్యన్తి - తెలిసికొనఁజాలకున్నారు. 38

టీ:—జనార్దన! - కృష్ణా!, కులక్షయకృతమ్ - కులనాశనమువలనఁ గలుగు, దోషం - అనర్థమును, ప్రపశ్యద్భిః - లెస్సగాఁ దెలిసికొనుచున్నటువంటి, అస్మాభిః - మనచేత, అస్మాత్ పాపాత్ - ఈకులనాశమువలనఁ గలుగుపాపమునుండి, కథమ్ - ఎట్లు, నివర్తితుం - తప్పించుకొనుటకు, అట్టిప్రాయశ్చిత్తాదికము ననుట, న జ్ఞేయమ్ - తెలియరాకున్నది. 39

తా:—ధర్మసంగ్రహమునకై యొకసాధనముగ యుద్ధ మర్థశాస్త్రముచే విధింపఁబడుచున్నది. అట్టివిధియు నైమిత్తికవిధి, నిత్యము గాదు. ధర్మసంగ్రహ మన వర్ణాశ్రమధర్మములు సాంకర్యముఁ జెందకుండ రక్షించుట. ధర్మసంగ్రహణమునకై దుర్మార్గులును ధర్మవిప్లవకారులు నగు ధార్తరాష్ట్రుల శిక్షించుటకై యుద్ధము సల్పుదమా, యీయుద్ధమువలన సకలక్షత్రకులక్షయమగును. ఏలయన నీయుద్ధమందు భారతభూమియందుఁ గల సకలదేశాధీశ్వరులు నెద్దియో యొకవిధమున రెండు సైన్యములందును నిలిచియున్నారు. వారలు నిహతులుకానిదే యుద్ధము పరిసమాప్తిఁ జెందదు. యుద్ధము పరిసమాప్తిఁ జెందినచో నేపక్షమువారు జయమందినను గుల క్షయముమాత్రము నిశ్చయము. పోనీ, యొకవేళ యుద్ధము నాచరించుటలోఁ గల్గుదోషములఁ బోఁగొట్టుకొనుట కెద్దియేనిప్రాయశ్చిత్తవిశేషము గల్గినచో నద్దాని ధైర్యముచే నీపాపముఁ జేయుటకు సాహసింతమా యనిన, నేపాపమునకైన నెద్దియేని యొక ప్రాయశ్చిత్తము తెలియవచ్చుచున్నది, కాని కులక్షయకృతదోషము నకుఁ బ్రాయశ్చిత్త మెందును గానరాకుండుటంజేసి యీయుద్ధము ప్రాయశ్చిత్తము లేనంతటి మహాపాతకముగాఁ దెలియవచ్చెడిని. కులక్షయమువలనఁ గలుగు ననర్థ పరంపర పై యయిదుశ్లోకములచే వివరింపఁబడుచున్నది. 39

---

ధ వేష్వ"హ మేషాం" "మమైతే"ఇత్యేవంప్రత్యయనిమిత్తస్నేహవిచ్ఛేదాది నిమిత్తావాత్మనః శోకమోహౌ ప్రదర్శితౌ "కథం భీష్మ మహం సంఖ్యే" (గీ.2-4-) ఇత్యాదినా. శోకమోహాభ్యాం హ్యభిభూతవివేకవిజ్ఞానః స్వతఏవ క్షత్రధర్మే యుద్ధే ప్రవృత్తోఽపి తస్మా ద్యుద్ధా దుపరరామ, పరధర్మంచ భిక్షాజీవనాదికం కర్తుం ప్రవవృతే. తథాచ సర్వప్రాణినాం శోకమోహాదిదోషావిష్టచేతసాం స్వభావతఏవ

కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత. 40

అధర్మాభిభవా త్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 41

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 42

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 43

---

టీ: —కులక్షయే - కులముయొక్కనాశనము కాఁగా, సనాతనాః - చిరంతనము లగు, కులధర్మాః - కులధర్మములు, ప్రణశ్యన్తి - నశించుచున్నవి. ధర్మే-ధర్మము, నష్టే సతి - వినాశనమును జెందగా, కృత్స్నం - సమస్తమగు, కులమ్ - కులమును, అధర్మః - అధర్మము, అభిభవతి ఉత - నిశ్చయముగ కప్పివేయునుగదా! అనఁగాఁ గులము లన్నియు నధర్మభూయిష్ఠము లగు నని తాత్పర్యము. 40

టీ:—కృష్ణ! అధర్మాభిభవాత్ - అధర్మతిరస్కారమువలన, కులస్త్రియః- కులస్త్రీలు, ప్రదుష్యన్తి - భ్రంశముఁ జెందుదురు. వార్ష్ణేయ!- శ్రీకృష్ణా! స్త్రీషు- స్త్రీలు, దుష్టాసు - భ్రంశముఁ జెందినవారు కాఁగా, వర్ణసంకరః - బ్రాహ్మణాది వర్ణములయొక్కసాంకర్యము, జాయతే - కలుగును. 41

టీ:—సంకరః - వర్ణసాంకర్యము, కులఘ్నానామ్ - కులమును బాడుచేసిన వారలకును, కులస్యచ - కులమునకును, నరకాయైవ - నరకముకొఱకు, అగుచున్నది. ఇంతియేగాక; ఏషామ్ - ఈకులఘ్నులయొక్కయు కులములయొక్కయు, పితరః - పితృదేవతలు, లుప్తపిండోదకక్రియాః - లోపించిన పిండోదకక్రియలు కలవారై, పతంతి- పితృలోకమునుండి చ్యుతిని జెందుదురు. 42

టీ:—కులఘ్నానామ్ - కులమును జెరపినవారలయొక్క, వర్ణసంకరకారకైః- వర్ణసాంకర్యమునకు హేతు వగు, ఏతైః దోషైః - ఈదోషములచే, శాశ్వతాః - అనాదిసిద్ధములగు, జాతిధర్మాః - వర్ణధర్మములును, కులధర్మాః - వంశానుగత ధర్మములును, ఉత్సాద్యన్తే - చెఱుపఁబడుచున్నవి. 43

---

స్వధర్మపరిత్యాగః ప్రతిసిద్ధ ఏవాచ స్యాత్; స్వధర్మేప్రవృత్తానామపి తేషాం వాఙ్మనఃకాయాదీనాం ప్రవృత్తిః ఫలాభిసంధిపూర్వికైవ సాహంకారా చ భవతి.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. 44

అహో! బత! మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. 45

---

టీ:—జనార్దన! - శ్రీకృష్ణా! ఉత్సన్నకులధర్మాణామ్ - కులధర్మములను జెరచిన, మనుష్యాణామ్ - మనుజులకు, నరకే - నరకమందు, నియతమ్ - ఎడతెగని, వాసః - నివాసము, భవతి ఇతి - కలుగు నని, అనుశుశ్రుమ - శ్రుతిస్మృతిసదాచారములవలన వినుచున్నాము. 44

తా:—ఇట్టి కులక్షయమువలన నప్రతిహతముగ వర్ణసంకరము వాటిల్లును. వర్ణసంకరము వాటిల్లిన ధర్మహాని గల్గు నని వేఱ చెప్పనక్కరలేదు. ధర్మసంగ్రహసాధనముగా విధింపఁబడిన యుద్ధమువలన ధర్మగ్లాని కల్గినచో నాయుద్ధము ధర్మయుద్ధము గాకపోవుట యటుండ నిఖిలలోకానర్థదాయక మగును. ఇహమునఁ గులక్షయము, వర్ణసంకరము, ధర్మగ్లాని మున్నగు ననర్థములకును, బరమునందు నరకమునకును బుష్కలహేతు వగును. ఇట్టి వర్ణసంకరహేతు వగుయుద్ధము నాచరించెడు దుర్మార్గులకు నరకమందు నియత మగువాసము గల్గు నని శ్రుతిస్మృతిసదాచారప్రమాణములవలనఁ దెలియవచ్చుచున్నది. అంతటితో నాఁగక వీరలపితరులుగూడ లోపించిన పిండోదకక్రియలు గలవారై ప్రచ్యుతిఁ జెందెదరు. "తాఁ జెడ్డకోఁతి వనమెల్లఁ జెరచిన" ట్లీయుద్ధముఁ జేయుటచే భూమియందు వర్ణసాంకర్యము కలుగుట యటుండఁ దన్మూలకముగా నిదివఱకు నుత్తమలోకములను బొందినపితరులు గూడ భ్రంశమును జెందుదురు.

టీ:—యద్రాజ్యసుఖలోభేన - ఏరాజ్యసుఖముల యందలి లోభముచే, స్వజనం - బంధుజనమును, హంతుం - చంపుటకు, ఉద్యతాః - సన్నద్ధుల మయితిమో, ఆకారణముచే, వయం - మనము, మహత్ - గొప్పదగు, పాపం - దుష్కృతమును, కర్తుం - చేయుటకు, వ్యవసితాః - నిశ్చయించితిమి. అహో! బత! - ఎంతకష్టము! 45

---

తత్రైవం సతి ధర్మాధర్మోపచయా దిష్టానిష్టజన్మసుఖదుఃఖప్రాప్తిలక్షణః సంసారోఽనుపరతః భవతీత్యతః సంసారబీజభూతౌ శోకమోహౌ; "తయోశ్చ సర్వకర్మసన్న్యాసపూర్వకా దాత్మజ్ఞానా న్నాన్యతో నివృత్తి రితి తదుపదిదిక్షుః సర్వలోకానుగ్రహార్థ మర్జునం నిమిత్తీకృత్య ఆహ భగవా న్వాసుదేవః "అశోచ్యా" నిత్యాది.

అత్ర కేచి దాహుః - సర్వకర్మసన్న్యాసపూర్వకా దాత్మజ్ఞాననిష్ఠామాత్రా దేవ కేవలా త్కైవల్యం న ప్రాప్యతఏవ, కింతర్హ్యగ్నిహోత్రాదిశ్రౌతస్మార్తకర్మసహితాత్ జ్ఞానా త్కైవల్యప్రాప్తి రితి సర్వాసు గీతాసు నిశ్చితోఽర్థ ఇతి.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 46

సంజయ ఉవాచ:—

ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. 47

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
శ్రీభీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదేఽ
ర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

---

టీ:—అశస్త్రమ్ - శస్త్రము నుపసంహరించినట్టియు, అప్రతీకారమ్ - ప్రతీకారముఁ జేయనిచ్ఛయించనట్టియు, మామ్ - నన్ను, శస్త్రపాణయః - ఆయుధహస్తులగు, ధార్తరాష్ట్రాః - దుర్యోధనాదులు, రణే - యుద్ధమందు, హన్యుః యది - చంపినను, తత్ - ఆమరణము, మే - నాకు, క్షేమతరం - మహోపకారమే, భవేత్ - అయ్యేని. 46

తా:—"రాజ్యలోభముచేతను సుఖలోభముచేతను యుక్తాయుక్తములను మఱచి స్వజనంబుల నిస్సందేహముగఁ జంపుటకు సంసిద్ధులమైతిమి. మహాపాపముఁ జేయఁగడంగితిమే! ఎంతటి కష్టము ఘటించినది." అను పరితాప మర్జునునియుల్లంబునఁ గలవరముపెట్టుటచే నాతఁడు, దుర్యోధనాదు లాయుధపాణులై వచ్చి తన్నుఁ జంపినను, దాను వారలఁ జంపుట కించుకేనియు యత్నింప ననియుఁ దన్నుఁ గాపాడుకొనుటకుఁగూడఁ బ్రియత్నింప ననియు, నయ్యదియే తనకు క్షేమతర మనియు నిశ్చయించి యర్జునుఁడు శస్త్రము నుపసంహరించెను.

టీ:— శోకసంవిగ్నమానసః - దుఃఖమును బొందినయంతఃకరణము గల, అర్జునః - అర్జునుఁడు, ఏవం - ఈరీతిగా, ఉక్త్వా - పలికి, సశరం - బాణముతోఁ గూడిన, చాపమ్ - విల్లును, విసృజ్య - విడచిపెట్టి, సంఖ్యే - యుద్ధభూమియందు, రథోపస్థే - రథమందు, ఉపావిశత్ - చదికిలఁబడెను. 47

తా:—అర్జునుఁడు ధైర్యస్థైర్యముల నుడిగి కాలుసేతులాడక, రథమున జదికిలఁబడి విల్లును విడిచి చిత్తవిక్షేపముతో నుండినట్లు సంజయుఁడువ్యక్తీకరించుచున్నాఁడు.

ఇట్లు శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్యస్వాములవారిచే రచింపఁబడిన
గీతామృతతరంగిణియందు ప్రథమతరంగము.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## ద్వితీయోధ్యాయః

సంజయ ఉవాచ:—

తం తథా కృపయాఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. 1

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున! 2

క్లైబ్యం మాస్మగమః పార్థ! నైత త్త్వ య్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3

---

టీ:—తథా - పైనిఁ జెప్పినరీతిగా, కృపయా - దయచే, ఆవిష్టం - కూడుకొని యున్నటువంటిన్ని, అశ్రుపూర్ణాకులేక్షణమ్ - నిండుకన్నీటిచే చాంచల్యము గలచూపులు గలిగినట్టియు, విషీదంతం - విలపించుచున్నట్టి, తం - ఆ యర్జుననిఁగూర్చి, మధుసూదనః - శ్రీకృష్ణభగవానుఁడు, ఇదం వాక్యమ్ - ఈదిగువఁ జెప్పఁబోవు వాక్యమును, ఉవాచ - పలికెను. 1

తా:- ఈశ్లోకమువలన నర్జునునితత్త్వము సంజయుఁడు, తా నూహించినదానిని జూచినదానిని నొకింత వ్యక్తీకరింపుచున్నాఁడు. అయ్యది, 'కృపయాఽఽవిష్టమ్' అనుపదముచే సువ్యక్త మగుచున్నది. ఇట్టితత్త్వమును సూచించు లింగములు "అశ్రుపూర్ణాకులేక్షణమ్" "విషీదంతం" అనుపదములు. 1

టీ:—అర్జున! - అర్జునుఁడా!, విషమే - సంకటస్థితియందు, సముపస్థితం - లెస్సగా నున్నటువంటి, త్వా - నిన్ను, అనార్యజుష్టం - ఆర్యులచేఁ బొందబడనట్టియు, అస్వర్గ్యం - స్వర్గమునకు విరోధి యగునట్టియు, అకీర్తికరం - యశోహేతువు గానట్టియు, ఇదం - ఇట్టి హేయమగు, కశ్మలమ్ - మాలిన్యము, కుతః - ఏకారణమువలన, సముపస్థితమ్ - సంప్రాప్తమాయెను. ఇచట సముపస్థితశబ్దము తంత్రముచే నుభయత్ర యన్వయించును.

టీ:—పార్థ! - ఓయీ యర్జునా!, క్లైబ్యం - నపుంసకభావ మగుభయమును, మాస్మగమః - పొందకుమా. ఏతత్ - ఇట్టిభయము, త్వయి - నీయందు, నోపపద్యతే - యుక్తము కానేరదు. పరంతప - శత్రువులను దపింపఁజేయువాఁడా!

---

జ్ఞాపకం చాపాఠ రస్యార్థస్య "అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి" (గీ. 2-33) "కర్మ ణ్యేవాధికార స్తే" (గీ. 2-47) "కురు కర్మైవ తస్మా

క్షుద్రం - తుచ్ఛమగు, హృదయదౌర్బల్యం - మనశ్చాంచల్యమును, త్యక్త్వా - విడచి, ఉత్తిష్ఠ - యుద్ధమునకొఱకు సన్నద్ధుఁడవు కమ్ము. 3

తా:—శ్రీకృష్ణభగవానుఁ డిచట నుడివినవాక్యములు రెండుశ్లోకములుగా చెప్పఁబడినవి. ఈవాక్యములు బాహ్యమునకు బరిహాసాస్పదముగాఁ గన్పట్టుచున్నను, నర్థగాంభీర్యమును గల్గి యర్జునునిచే మఱుగుపరుపఁబడిన యాంతర్యధర్మము నాతఁ డొక్క-పెట్టున వెలిబుచ్చునట్లు చేయుచున్నవి. అర్జునునకు భీష్మద్రోణదర్శనముచే గలిగినభయమును శ్రీకృష్ణభగవానుఁడు లెస్సగా గమనించి యద్దానినిఁ గశ్మల మనియు క్లైబ్య మనియు క్షుద్ర మగు హృదయదౌర్బల్య మనియు నపహసించు చున్నాఁడు. ఇట్టి కశ్మలముచే నర్జునుఁడు యుద్ధమును మానినచో నపహాసమునకుఁ బాల్పడుటయేగాక యిహపరములకు దూర మగుచున్నాఁ డని "అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర" మను పదత్రియముచే వ్యక్త మగుచున్నది. "అనార్యజుష్టమ్" 'ఆర్యులచేఁ బొందఁబడనిది.' అనగా యుద్ధమును జేయుట కార్యులు (అనగా వైదికధర్మానుయాయు లగుక్షత్రియులు) ఎవ్వరు నిట్లు విలపించుట యెఱుఁగ రని యభిప్రాయము. పోనిమ్ము, ఇతరు లిట్టి విషాదమును జెందక పోయినను బోవచ్చుఁగాక యనినచో, నట్టి విషాదముచే విహితకర్మ మగుయుద్ధమును మానుటచే స్వర్గమునకు దూర మగుదు వనుతలంపున "అస్వర్గ్యమ్" అని చెప్పఁబడినది. పోనిమ్ము, స్వర్గము రాకపోయినను భూమియం దైనను సంతసింపుదురుగదా యనినచో నయ్యదియుఁ గల్ల యనుటకై "అకీర్తికరమ్" అనిచెప్పఁబడినది. ఇట్లిహపరములకు హానికరం బగునీవిషాదమును బడయుటకంటె వేఱొండు వ్యర్థజన్మ ముండదను తలంపున శ్రీకృష్ణభగవానుఁను "క్లైబ్య"మ్మని ప్రయోగించెను. ఇంతియ కాదు. అర్జునుం డతిశయముగఁ దలంచినయుక్తిప్రయుక్తిపురస్సరం బగు నుపరమము నంతయు శ్రీకృష్ణభగవానుఁడు "క్షుద్రం హృదయదౌర్బల్యమ్" అని నైరస్యభావముతో నపహసించుచున్నాఁడు. ఇయ్యది సర్వజ్ఞుం డగుశ్రీకృష్ణభగవానుని యభిప్రాయంబున నొకతుచ్ఛవిషయము. దానంజేసి యద్దాని నత్యంతము త్యజించి యుద్ధమునకొఱకు సిద్ధముకావలయు నని యర్జునుని బ్రేరేపించుచున్నాఁడు. "ఉత్తిష్ఠ" యను లోడంతక్రియ యనువాదమాత్రము గాని విధి గాదు. ఏలయన నర్జునుండు యుద్ధమునకు స్వతస్సిద్ధముగాఁ జనుదెంచి యుద్ధప్రారంభముఁ జేసి, యిఁక నేరిపై బాణప్రసారము గావింపవలయు నను విషయమునఁ జీకాకుజెంది విరమింపవలసిన కార్యమునే చేయవలసినదిగా శ్రీకృష్ణభగవానుఁడు ప్రేరణ చేయుచున్నాఁడుగాని, యర్జునుం డెన్నడును గుర్తెఱుంగనట్టియుగాని తలపెట్టనట్టియుగాని యుద్ధమును జేయవలసినదిగా శ్రీకృష్ణభగవానుఁడు ప్రేరగణ నెంతమాత్ర

త్వమ్ (గీ. 4-15) ఇత్యాది. హింసాదియుక్తత్వా ద్వైదికం కర్మాధర్మాయేతీయమ

అర్జున ఉవాచ:—

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 4

గురూ నహత్వాహి మహానుభావాన్,
శ్రేయో భోక్తుం భైక్షు మపీహ లోకే,
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్. 5

---

ము జేయలేదు. అట్లు చేసినచో "ఉత్తిష్ఠ" యను లోడంతక్రియ విధి యగును, అట్లు కాదని సకలజనవిదితము. కావున నీ"ఉత్తిష్ఠ" యను లోడంతక్రియ యనువాదమే గాని విధయెంతమాత్రము కాఁజాలఁ దని బుధులు సుకరముగ గ్రహింపఁగలరు. 2-3

టీ:—అరిసూదన! - మధుసూదన! శ్రీకృష్ణా!, సంఖ్యే - యుద్ధమున, అహం- నేను, పూజార్హౌ - పూజించుటకు యోగ్యులగు, భీష్మం ద్రోణం చ - భీష్మద్రోణులను, ఇషుభిః - బాణములచే, కథమ్ - ఎట్లు, ప్రతియోత్స్యామి - ఎదుర్కొని యుద్ధము సలుపఁగలను? చేయఁజాల ననియాశయము. 4

టీ:—మహానుభావాన్ - గొప్పవారలగు, గురూన్ - గురువు లగుభీష్మద్రోణ కృపాదులను, అహత్వా - చంపక, ఇహ లోకే - ఈలోకమునందు, భైక్షు మపి - బిచ్చపుగూటినైనను, భోక్తుం - తినుట, శ్రేయోహి - మంచిదికదా! అనగా గురువులఁ జంపుటకంటె బిచ్చ మెత్తుకొనుటయైనను మంచి దని యభిప్రాయము. అర్థకామాన్ - ద్రవ్యాభిలాషు లగు, గురూన్ - గురువులను, హత్వాతు - చంపి నచో, ఇహైవ - ఈభూమియందే, రుధిరప్రదిగ్ధాన్ - రక్తముచేఁ దడుపఁబడిన, భోగాన్ - భోగములను, భుంజీయ - అనుభవించేని. 5

---

ప్యాశంకా న కార్యా. కథం క్షాత్త్రకర్మ యుద్ధలక్షణం గురుభ్రాతృపుత్త్రాదిహింసా లక్షణ మత్యంతకౄరమపి స్వధర్మ ఇతికృత్వా నాధర్మాయ; తదకరణేచ "తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి" (గీ. 2-33) ఇతిబ్రువతా యావ జ్జీవాదిశ్రుతిచోదితానాం పశ్వాదిహింసాలక్షణానాం కర్మణాం ప్రాగేవ నాధర్మత్వ మితి సునిశ్చిత ముక్తం భవతి ఇతి. తదసత్ - జ్ఞానకర్మనిష్ఠయో ర్విభాగవచనా ద్బుద్ధిద్వయాశ్రయో, 'రశోచ్యాన్' (గీ. 2-11). ఇత్యాదినా భగవతా యావత్ "స్వధర్మ మపి చావేక్ష్య" (గీ. 2-31) ఇత్యేతదంతేన గ్రంథేన యత్పరమార్థాత్మ తత్త్వనిరూపణం కృతం తత్సాంఖ్యమ్. తద్విషయా బుద్ధి రాత్మనో జన్మాదిషడ్వి క్రియాభావా దకర్తాఽఽత్మేతిప్రకరణార్థనిరూపణా ద్యా జాయతే సా సాంఖ్యబుద్ధిః.

నచైత ద్విద్మః కతర న్నో గరీయో,
యద్వా జయేమ యదివా నో జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. 7

---

టీ:—నః - మనకు, కతరత్ - రెంటిలో నేది ? (అనగా యుద్ధము మాని బిచ్చ మెత్తుకొనుటయా లేక యుద్ధమునందు గెల్చి రుధిరసిక్త మగుయన్నమును దినుటయా యను రెంటిలో నేది) గరీయః - శ్రేష్ఠమో, ఏతత్ - ఆనిశ్చయము, న విద్మః- గుర్తెఱుంగఁజాలము, రక్తపుగూడు తినుటకు సంసిద్ధుల మైనను, యత్ వా వయం - మనము, జయేమ - వారలను జయించెదమో, యదివా - లేక, నః - మనలను, తే -వారు జయేయుః - జయించెదరో, ఏతత్ - ఈవిషయము, న విద్మః - తెలిసికొనఁజాలకున్నారము. ఒక వేళ జయించెద మనినను, యాన్ - ఎవ్వారలను, హత్వా - చంపి, న జిజీవిషామః - జీవించుటకు నిచ్ఛయింపమో, తే ఏవ ధార్తరాష్ట్రాః - ఆదుర్యోధనాదులే. ప్రముఖే - ఎదుట, అవస్థితాః - నిలిచియున్నారు. అనగా భిక్ష మెత్తుకొనుటయే శ్రేయ మనిభావము. 6

టీ:—కార్పణ్యదోషోపహతస్వభావః - దైన్య మనెడి దోషముచే దూషిత మగు నంతఃకరణ గలవాఁడను; ధర్మసమ్మూఢచేతాః - ధర్మాధర్మవివేకవిహీన మగు నంతఃకరణ గలవాఁడను. యత్ - ఏది, మే - నాకొఱకు, శ్రేయః - మంచి, స్యాత్ - అగునో, తత్ - దానిని, త్వాం - నిన్ను; పృచ్ఛామి - అడుగుచున్నాను. తత్ - ఆకారణముచే, నిశ్చితమ్ - నిశ్చయమును, బ్రూహి - చెప్పుమా!, అహం - నేను, తే - నీయొక్క, శిష్యః - శిష్యుఁడను, త్వాం - నిన్ను, ప్రపన్నం - పొందిన, మాం - నన్ను, శాధి - శిక్షింపుమా! 7

---

సా యేషాం జ్ఞానినా ముచితా భవతి తే సాంఖ్యాః. ఏతస్యా బుద్ధే ర్జన్మనః ప్రాగాత్మనో దేహాదివ్యతిరిక్తస్య కర్తృత్వభోక్తృత్వాద్యపేక్షో ధర్మాధర్మవివేకపూర్వకో మోక్షసాధనానుష్ఠానలక్షణో యోగః, తద్విషయా బుద్ధి ర్యోగబుద్ధిః. సా యేషాం కర్మిణా ముచితా భవతి తే యోగినః. తథాచ భగవతా విభక్తే ద్వే బుద్ధీ నిర్దిష్టే "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు"

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్,
అవాప్య భూమా వసపత్న మృద్ధం,
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్. 8

సంజయ ఉవాచ:—

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతిగోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. 9

---

టీ:—మమ - నాయొక్క, ఇంద్రియాణాం, ఇంద్రియములకు, ఉచ్ఛోషణం- సంతాపమును గలుగఁజేసిన, శోకం - దుఃఖమును, యత్ - ఏది, అపనుద్యాత్ - పోఁగొట్టునో, తత్ - దానిని, భూమౌ - భూమియందు, అసపత్నం - శత్రుహీన మగునట్టియు, ఋద్ధం - సమృద్ధ మగునట్టి, రాజ్యం - రాజ్యమును, అపి - ఇంక, సురాణాం - దేవతలయొక్క, ఆధిపత్యంచ - ప్రభుత్వమును, అవాప్యాపి - పొందినప్పటికి, నహి ప్రపశ్యామి - తెలిసికొనఁజాలకున్నాను. అనగాఁ బుష్కలమగు నీభూరాజ్యమును, త్రిలోకాధిపత్యమగు నింద్రత్వమును బొందినప్పటికిని తనదుఃఖము నశించ దనిభావము. 8

టీ:—పరంతపః - శత్రువులను దపింపఁజేయు, గుడాకేశః - అర్జునుఁడు, హృషీకేశం గోవిందం - శ్రీకృష్ణునిగూర్చి, ఏవం - పైనఁ జెప్పినరీతిగా ఉక్త్వా - పలికినపిమ్మట, న యోత్స్య ఇతి - నేను యుద్ధమును జేయను అని, ఉక్త్వా - పలికి, తూష్ణీం - ఊరకనే, బభూవహ - ఉండెను. 9

తా:— ఇట్లు శ్రీకృష్ణభగవాను లర్జునవాక్యములను దృణప్రాయముగఁ దూలనాడి యపహాసముఁ జేయగ నర్జునుండు తనహృదయమునకుఁ బరితాపము నొందించిన భీష్మద్రోణులఁగూర్చి మఱుగుపరుపఁజాలక "కథం భీష్మ మహం సంఖ్యే" యనుశ్లోకము మొదలు "నహి ప్రపశ్యామి" యనుశ్లోకాంతమునందుఁ గలవాక్యములఁ బలికెను. ఇం దర్జునుండు తనకు భీష్మద్రోణులందుఁ గల తాత్పర్యాతిశయమును వెల్లడించుటయే కాక, తన యజ్ఞతను గూడఁ గొంత వఱకు తెలిసికొని యట్టియజ్ఞతచేఁ దాఁ జెందఁదలఁచిన యుపరమము యుక్తమా కాదా యనుసందియమునుగూడఁ బడసి తత్సందేహనివృత్తిఁ జేసి

---

(గీ. 2-39) ఇతి. తయోశ్చ సాంఖ్యబుద్ధ్యాశ్రయాం జ్ఞానయోగేన నిష్ఠాం సాంఖ్యానాం విభక్తాం వక్ష్యతి "లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ, జ్ఞానయోగేన సాంఖ్యానామ్" (గీ. 3-3) ఇతి. తథాచ యోగబుద్ధ్యాశ్రయాం కర్మయోగేణ నిష్ఠాం విభక్తాం వక్ష్యతి "కర్మయోగేణ యోగినామ్" (గీ. 3. 3.)ఇతి. ఏవం

కృతార్థత నొందింపవలయు ననియు శ్రీకృష్ణభగవానులను గురుభావముతోఁ బ్రార్థించుచున్నాఁడు. ఇందుఁ దెలియవచ్చెడి యర్జునగుణవిశేష మెద్ది యన నిరతిశయ మగుగురుభక్తియు శాస్త్రవిశేషమందలి విశ్వాసమును. ఇంతియ కాదు. శ్రీకృష్ణభగవానులే తనకు సర్వవిధములఁ దరణోపాయము నుపదేశించుగురువర్యుఁడను దృఢవిశ్వాసమునుగూడ నర్జునుండు గల్గియున్నటుల "కార్పణ్యదోషోపహత స్వభావః" యనుగీతమువలనఁ దెలియవచ్చుచున్నది. ఇట్టి దృఢవిశ్వాసము వ్యక్తీకరించుపదములు "శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అనునవి. అర్జునుఁ డిదివఱకు నొకింత ప్రసంగాడంబరమును గావించి యుపరమమును జెంద నమకట్టినను దన్ను, "కార్పణ్యదోషోపహతస్వభావః" "ధర్మసమ్మూఢచేతాః" అని తెలియఁజెప్పుకొనుటచేఁ దనయొక్క యజ్ఞతను సుస్పష్టముగఁ దెలిసికొనినమహనీయుఁడని సర్వవిధముల స్తవమునకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు. ఇట్లర్జునుఁడు తాను జెప్పవలసిన దంతయు ముగించి "శాధి మాం త్వాం ప్రపన్నమ్" అని శ్రీకృష్ణోపదేశము నభిలషించి మఱల గొంతతడవునకు "న యోత్స్యే" అను నిశ్చయమును బొందినట్లు పలికి విరమించె నని సంజయుఁడు చెప్పుచున్నాఁడు. అర్జునునియొక్క నిశ్చయమంతయు "నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే" "న యోత్స్యే"యను రెండు వాక్యములలోఁ బుష్కలముగ నిమిడియున్నది. ఈరెండు వాక్యములనడుమఁ దెలియవచ్చెడివాక్యము లన్నియు నీరెండువాక్యములయొక్క వ్యాఖ్యానమే యని యెఱుఁగవలయును.

## అర్జునునిపరిస్థితులు.

ధార్తరాష్ట్రులు యుద్ధసన్నద్ధులైయుండుసమయమున నర్జునుండు మహోత్సాహముతోడను ధైర్యముతోడను విల్లెక్కుపెట్టి తా నెవరితోడ యుద్ధమును సలుపవలయునో యనువిషయమును గమనించి యుద్ధమును బ్రారంభము చేయ దలఁచినకృతనిశ్చయుఁ డని "అథ వ్యవస్థితాన్ దృష్ట్వా" యను నిరువదవగీతము మొదలు "యోత్స్యమానా నవేక్షేఽహమ్" అనునిరువదిమూఁడవ గీతాంతము వఱకుఁ గలగ్రంథమువలనఁ దెలియుచున్నది.

సాంఖ్యబుద్ధిం యోగబుద్ధిం చాశ్రిత్య ద్వే నిష్ఠే విభక్తే భగవతైవోక్తే జ్ఞానకర్మణోః కర్తృత్వా కర్తృత్వైకత్వానేకత్వబుద్ధ్యాశ్రయయోః యుగపదేకపురుషాశ్రయత్వాసంభవం పశ్యతా యథైతద్విభాగవచనం తథైవ దర్శితం శాతపథీయే బ్రాహ్మణే

శ్రీకృష్ణభగవానులచే రథ ముభయసైన్యములకును మధ్యను భీష్మద్రోణుల యెదుట నిలువఁబెట్టఁబడి "పశ్యైతాన్ సమవేతాన్ కురూన్" అనిపలుకఁబడిన పిమ్మట నచట నిలిచియుండిన రెండుసైన్యములను దిలకించిన యర్జునుఁడు విషాదమును బొందినట్లును, ఆవిషాదముచేఁ దాను యుద్ధముఁ జేయ నని నిశ్చయముఁ బడసినట్లును "తత్రాఽపశ్యత్" యను నిరువదిమూఁడవ గీతము మొదలు రెండవయధ్యాయ మందలి "న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ" యను తొమ్మిదవగీతమువఱకును గల గ్రంథమువలన నుస్పష్ట మగుచున్నది.

ఇట్టి విషాదమునకుఁ గారణములు పరియోగులలో నొక్కొక్క రొక్కొక్క తీరునఁ బ్రతిపాదించినట్లు తెలియవచ్చెడిని. అదెట్టు లనిన:—

1 సంజయుఁడు — "కృపయా పరయాఽఽవిష్టః విషీదన్" 1-28.
"తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం" 2-1.

అను సంజయవాక్యములచే నర్జునుఁ డుత్కృష్టమగు దయతోడను గనికరము తోడను గూడియున్నాఁ డని సంజయుఁడు తలంచినట్లు సువ్యక్త మగుచున్నది. అందుచే సంజయునిదృష్టియం దర్జునుఁడు దయార్ద్రస్వభావుఁడు.

2 శ్రీకృష్ణభగవానులు — "కుత స్త్వా కశ్మల మిదం" 2-2.
"క్లైబ్యం మాస్మ గమః" 2-3.

అనుగీతముచేఁ దెలియవచ్చెడి భగవద్వాక్యములవలన నర్జునుఁడు భీష్మద్రోణ కృపాశ్వత్థామలతో యుద్ధమును జేయఁజాల ననుపిఱికిదనముతో విషాదమును బొంది యున్నటులఁ దెలియవచ్చుచున్నది. దానంజేసి శ్రీకృష్ణభగవానులదృష్టిచే స్త్రీభావ ముకంటె గూడ నికృష్టమగు క్లైబ్యముతోఁగూడిన పిఱికిపంద యే.

3 స్వీయదృష్టి — శ్రీకృష్ణభగవానులచే నవహసింపఁబడిన నర్జునుఁ డొకింత స్వీయహృదయమును బరిశీలించుకొని శ్రీకృష్ణభగవానులతోఁ దనకు శ్రేయస్సు నుపదేశింపవలయు ననుచు 'కార్పణ్య దోషోపహతస్వభావః' అనుగీతమునందు దన్ను "కార్పణ్యదోషోపహతస్వభావః" "ధర్మసమ్మూఢచేతాః" అనువిశేషణములతోఁ జెప్పుకొనుచున్నాఁడు. దానంజేసి యర్జునుం డజ్ఞానదోషముతో నావరింపఁబడి

"ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తో బ్రాహ్మణాః ప్రవ్రజన్తి" ఇతి; సర్వకర్మసంన్యాసం విధాయ తచ్ఛేషేణ 'కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయోర్మధ్యే విషీదన్త మిదం వచః. 10

యున్నటులను దానిచే ధర్మమునందుఁ బుష్కలమగు మూఢభావమును బొంది యున్నటులను వ్యక్తీకరించుచున్నాఁడు. ఆ కారణమున స్వీయదృష్టిచే నర్జునుండాత్మానాత్మవివేకశూన్యుఁడును గార్యాకార్యవివేకశూన్యుఁడును.

4 శ్రీశంకరభగవత్పాదదృష్టి — గీతాభాష్యమున శ్రీశంకరభగవత్పాదులు "అర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నాయోపదిదేశ" అని వ్రాసియున్నారు. దానంజేసి శ్రీశంకరభగవత్పాదదృష్టిచే నర్జునుండు శోకమోహపరవశుండు.

ఇట్లు ప్రతియోగిదృష్టిచే నర్జునుండు నాలుగు విధములఁ దెలియవచ్చుచున్నాఁడు. ఎట్టి భావముతో నొప్పుచుండినను శ్రీకృష్ణగురువులవలనఁ గార్యాకార్యవివేకమును గుర్తెఱుంగఁదలఁచి యాతని బ్రార్థించినను మఱల నొకింతతడవునకు నిశ్చయజ్ఞానమును బడసినట్లు "నయోత్స్యే" అను ప్రతిజ్ఞను జేసి నిశ్చేష్టుఁడై యూరకుండెను. ఇట్టి స్థితియందు శ్రీకృష్ణభగవదుపదేశమువలనఁ బడయఁదలచిన ప్రయోజన మెద్దియో యూహించుట సుకరము కాదు; కాని చిత్తచాంచల్యముచే ముందువెనుకల గుర్తెఱుంగలేనటుల నిశ్చయింపనగు. అట్టి చిత్తచాంచల్యమునకు భీష్మద్రోణాదులవలనఁ దనకు విపత్తు గలుగు నను మహాభయము తక్క వేఱొండు కారణ మూహించుటకు వీలులేదు. అట్టి మహాభీతిని దెలిసికొనియే శ్రీకృష్ణభగవాను లపహసింపుచు నుపదేశమును బ్రారంభించినట్లు తెలియవచ్చుచున్నది.

టీ:— భారత!- ధృతరాష్ట్రుఁడా!, ఉభయోః- రెండగు, సేనయోః-సైన్యముల యొక్క, మధ్యే- మధ్యప్రదేశమునందు, విషీదంతం- భయకంపాదులచేఁ బొక్కుచున్న, తమ్- ఆయర్జునునిగూర్చి, హృషీకేశః - శ్రీకృష్ణభగవానులు, ఇదం వచః- ఈ చెప్పఁబోవు వాక్యమును, ప్రహసన్ ఇవ- మందహాసము చేయుచున్న వానివలె ఉవాచ – పలికెను. 10

ఇచట "ప్రహస న్నువాచ" "మందహాసమును జేయుచు బలికెను" అనినంతనే యర్థస్ఫూర్తి గలుగుచుండ "ఇవ" శబ్దప్రయోగ మెందులకు చేయఁ

లోకః '(బృ. 4-4-22) ఇతి. తత్రైవచ ప్రాగ్దారపరిగ్రహా త్పురుష ఆత్మా ప్రకృతో ధర్మజిజ్ఞాసోత్తరకాలం లోకత్రయసాధనం పుత్త్రం ద్వప్రకారంచ విత్తం మానుషం దైవంచ, తత్ర మానుషం విత్తం కర్మరూపం, పితృలోకప్రాప్తిసాధనం విద్యాంచ దైవం విత్తం దేవలోకప్రాప్తిసాధనం "సోఽకామయత" ఇ

బడిన దను విషయ మొకింత గమనించవలసియున్నది. ఇచ్చట 'ప్రహసన్' అను శబ్దముతోఁగూడిన 'ఇవ' శబ్దమును శ్రీవిద్యాశంకరభగవత్పాదగురువులు తమ భాష్యోపోద్ఘాతమున, "నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావోఽపిసన్ స్వమాయయా దేహవా నివ జాత ఇవచ లోకానుగ్రహం కుర్వన్ లక్ష్యతే" అను గూఢాభిసంధిచే వ్యక్తీకరించియున్నారు. అనగా దేహేంద్రియమనోబుద్ధ్యహంకారాతీత మగు సచ్చిదానందరూపముతో నఖండముగ వెలుఁగు పరమాత్మ దేహముతో నున్నటులును, దేహమందుఁ దెలియఁబడు మందహాసాదులతో నొప్పుచున్నట్లును బాహ్యదృష్టికి గోచరింపుచున్నటులఁ దెలియవచ్చుటచే నట్లు బాహ్యదృష్టికి దోఁచువిషయము పరమార్థ మెంతమాత్రము గాదను నభిప్రాయమును 'ఇవ' శబ్దముచే వ్యక్తీకరించుచున్నారు.

## ఉ ప దే శ ము.

శ్రీకృష్ణభగవానుల యుపదేశవిశేషమును ముచ్చటించుటకు మున్ముం దుపదేశ మన నేమియో దానియొక్కస్వరూపస్వభావము లెట్టివో యద్దానిప్రయోజన మెద్దియో యొకింత వివరింపఁబడును.

రోగములు రెండువిధములు: (1) దేహగతములు (2) మనోగతములు, అని. దేహగతరోగములను జికిత్స చేసి శరీరమును స్వస్థతకుఁ దెచ్చువాఁడు వైద్యుఁడు. అందులకుఁ దగుసాధన మౌషధము. ఔషధమందును వైద్యునియందును విశ్వాసము తరణోపాయము. ఇఁక మనోగతరోగములను జికిత్స చేసి మనమును స్వస్థతకుఁ

---

త్వవిద్యాకామవతఏవ సర్వాణి కర్మాణి శ్రౌతాదీని దర్శితాని; "తేభ్యోవ్యుత్థాయ ప్రవ్రజన్తి' ఇతివ్యుత్థాన మాత్మానమేవ లోక మిచ్ఛతోఽకామస్య విహితమ్; తదేత ద్విభాగవచన మనుపపన్నం స్యా ద్యది శ్రౌతకర్మజ్ఞానయోః సముచ్చయోఽభిప్రేత స్స్యా ద్భగవతః.

న చార్జునస్య ప్రశ్న ఉపపన్నో భవతి "జ్యాయసీచేత్కర్మణ స్తే" (గీ.3.1) ఇత్యాదిః, ఏకపురుషానుష్ఠేయత్వాసంభవం బుద్ధికర్మణో ర్భగవతా పూర్వ మనుక్తం; కథ మర్జునోఽశ్రుతం బుద్ధేశ్చ కర్మణో జ్యాయ స్త్వం భగవత్యధ్యారోపయే న్మృషైవ "జ్యాయసీచే త్కర్మణ స్తే మతా బుద్ధిః" (గీ. 3.1) ఇతి.

కించ యది బుద్ధికర్మణో స్సర్వేషాం సముచ్చయ ఉక్త స్స్యా దర్జునస్యాపి స ఉక్త ఏవేతి "యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్" (గీ.5.1)

దెచ్చువాఁడు గురువు. గురు వుపదేశించు సాధనవిశేష ముపదేశ మనఁబడును. ఉపదేశము మనోగతరోగములకు మందు. ప్రకృతమున నర్జునునియొక్క మనోగత రుగ్మత యెట్టిది. ఇట్టి రుగ్మత కెట్టియుపదేశ మవసర మనునది యొకింత విశేషదృష్టిచే విచారింపఁబడవలయును. పిమ్మట శ్రీకృష్ణోపదేశవిశేషాతిశయము తేటతెల్లమగును. జ్వరతత్త్వమును రోగితత్త్వమును విచారించి యుక్తమగు నౌషధప్రయోగమును వెజ్జు సేయునట్లు సద్గురుఁ డధికారిసామర్థ్యమును, అధికారితత్త్వమును బరిశీలించి యుక్తమగుమార్గము నుపదేశించును గాని "పిడుగునకును బియ్యమునకును నొక్కటే మంత్ర"మన్నట్లు పండితునకు బామరునకుఁ నొకేవిధముగ నుపదేశముఁ జేయఁ బూనునా? అట్లునేసిన నయ్యది నిష్ఫలం బగు నని గుర్తెఱుంగఁడా? శ్రీకృష్ణభగవానులు సర్వజ్ఞులు గావున నర్జునునియొక్క తత్త్వసామర్థ్యంబులఁ గనిపెట్టి యుక్తమును నుత్కృష్టతమంబునగు నుపదేశముఁ జేసినట్లు ముల్లోకవిదితము. ప్రకృతమున నిచ్చటఁ దెలియవచ్చెడి నర్జునుని స్వభావము.

1. ఆత్మయందుఁ గరచరణాద్యవయవవిశిష్టంబును, సప్తధాతుమయపిండంబునగు నీపరిదృశ్యమానదేహంబు నధ్యారోపంబు నేసి యట్టి పిండమే యాత్మ యను తలంపున భ్రమఁ జెందుట.

2. అట్టి భ్రమచేఁ దనకు విహితంబైన ధర్మ్యంబగు యుద్ధమును విడనాడి తన కనుచితంబగు యుద్ధమునుండి పలాయనముఁ జేయబూనుట. ఇట్టిపరిస్థితులఁ దిలకించిన శ్రీకృష్ణభగవానులు శ్రుతిస్మృతిసదాచారసిద్ధ మగు తత్త్వము నుపదేశిం

ఇత్యన్యతరవిషయ ఏవ ప్రశ్నః స్యాత్. నహి పిత్తప్రశమనార్థినో వైద్యేన మధురం శీతంచ భోక్తవ్య మిత్యుపదిష్టే, తయో రన్యతర త్పిత్తప్రశమనకారణం బ్రూహీతిప్రశ్న స్సంభవతి.

అథార్జునస్య భగవదుక్తవచనార్థవివేకానవధారణనిమిత్తః ప్రశ్నః కల్ప్యేత, తథాపి భగవతా ప్రశ్నానురూపం ప్రతివచనం దేయం; మయా బుద్ధికర్మణో స్సముచ్చయ ఉక్తః, కిమర్థ మిత్థం త్వం భ్రాన్తోఽసీతి? నతు పునఃప్రతివచన మననురూపం పృష్టా దన్యదేవ ద్వే నిష్ఠే మయా పురా ప్రోక్తే ఇతివక్తుం యుక్తమ్.

నాపి స్మార్తేనైవ కర్మణా బుద్ధే స్సముచ్చయేఽభిప్రేతే విభాగవచనాది సర్వ ముపపన్నమ్. కించ క్షత్రియస్య యుద్ధం స్మార్తం కర్మ స్వధర్మ ఇతి జానతః "తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి" (గీ. 3.1) ఇత్యుపాలంభోఽనుపపన్నః.

చిననగాని యర్జునునియొక్క హృదయకశ్మలము నశింప దనియెంచి యట్టి రహస్యమును సంక్షేపంబున నర్జునునియధికారమున కనువుగ నుపదేశించినట్లు తేటతెల్లమగుచున్నది.

శ్రీకృష్ణభగవానుల యొక్క యుపదేశ మంతయు రెండు ప్రకరణములుగ నలరారుచున్నటుల "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" అను రెండవయధ్యాయమందలి ముప్పదితొమ్మిదవ గీతమునందు ప్రథమపాదము వలనఁ దెలియుచున్నది. "ఇంతవఱకు నీకు సాంఖ్యమందలి సిద్ధాన్తము చెప్పఁబడెను. ఇఁక యోగమందలి యీసిద్ధాన్తమును వినుము". అని పై చరణమున కర్థము. ఈ చరణమునందలి "బుద్ధిః" అను శబ్దమునకు నిశ్చయము, నిర్ణయము, సిద్ధాన్తము అని యభిప్రాయము. "తు" అను నవ్యయము సాంఖ్యయోగప్రకరణభేదములను సాంఖ్యమునకును యోగమునకును గల వైలక్షణ్యమును సూచించుచున్నది. దీనింబట్టి శ్రీకృష్ణభగవానులచే నీయధ్యాయమందు సాంఖ్యయోగము లను రెండు ప్రకరణము లుపదేశింపఁబడినట్లు సుస్పష్ట మగుచున్నది. దీనినిబట్టి రెండవ యధ్యాయమందలి పదునొకండవగీతము మొదలు ముప్పదితొమ్మిదవ గీతమువఱకును గల యిరువదిరెండుగీతములచే బోధింపఁబడిన గ్రంథమునకు సాంఖ్య మను

---

తస్మాద్గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేనవా కర్మణాఽఽత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచి ద్దర్శయితుం శక్యః; యస్య త్వజ్ఞానా ద్రాగాది దోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన దానేన తపసావా విశుద్ధసత్త్వస్య జ్ఞానముత్పన్నం పరమార్థతత్త్వవిషయ మేకమేవేదం బ్రహ్మ కర్తృచేతి, తస్య కర్మణి కర్మప్రయోజనేచ నివృత్తేఽపి లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథాప్రవృత్తిః, తథైవ కర్మణి ప్రవృత్తస్య యత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ యేన బుద్ధేస్సముచ్చయః స్యాత్, యథా భగవతో వాసుదేవస్య క్షత్రధర్మచేష్టితం నజ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే తద్వ త్ఫలాభిసంధ్యహంకారాభావస్య తుల్యత్వా ద్విదుషః; తత్త్వవిత్తు నాహం కరోమీతి మన్యతే, నచ తత్ఫల మభిసంధత్తే, యథాచ స్వర్గాదికామార్థినోఽగ్నిహోత్రాదికామ్యసాధనానుష్ఠానాయాహితాగ్నేః కామ్యఏవాగ్నిహోత్రాదౌ ప్రవృత్తస్య సామికృతే వినష్టేఽపి కామే తదేవాగ్నిహోత్రా ద్యనుతిష్ఠతోఽపి నతత్కామ్య మగ్నిహోత్రాది భవతి; తథా చ దర్శయతి భగవాన్ "కుర్వన్నపి న లిప్యతే" (గీ-5. 7.) "నకరోతి నలిప్యతే" (గీ-13.31) ఇతి తత్రతత్ర.

నామ ముద్దేశింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. సాంఖ్య మన జ్ఞాన మని యర్థము. దీనిచే శ్రీకృష్ణభగవాను లుపనిషత్తులయందుఁ దెలియవచ్చెడి జ్ఞానము నుపదేశించి నటుల స్పష్టముగఁ దెలియనగును. ఇచట సాంఖ్యశబ్ద మున్నంతనే యిందలిజ్ఞానము సాంఖ్యదర్శన మను పేరఁ దెలియవచ్చెడ కాపిలతంత్రప్రసిద్ధ మగు జ్ఞాన మను భ్రమఁ జెందఁగూడదు. కాపిలతంత్రమగు సాంఖ్యదర్శనము వేదవిరుద్ధదర్శనముగా బ్రహ్మవాదులచేఁ దలంపఁబడి యుపేక్ష సేయఁబడుచున్నది. శ్రీకృష్ణసాంఖ్య మన్ననో త్రైలోక్యపూజ్యత నందుచున్నది. ఇఁక నీ యిరువదియెనిమిది గీతములం దును మొదటి యిరువదిగీతములును దేహిదేహతత్త్వమును గడపటి యెనిమిది గీతములును స్వధర్మానుష్ఠానప్రాశస్త్యమును ముచ్చటింపుచున్నవి. అవ్వానిని సక్రమంబుగ విచారింపుచున్నాము.

ఇంతవఱకు నిరూపించినవిధమున నజ్ఞానవశమున ధర్మమునందు విప్రతి పత్తిఁ జెంది శోకసాగరమున మునిఁగియున్న యర్జునునిమనస్సు శోకమునుండి మఱలి యొకింత స్వస్థత నొందకపోవుటచే శ్రీకృష్ణభగదుపదేశంబు నంతఃకరణంబున నాఁటు కొనుట కవకాశ ముండదని యెంచి యట్టిశోకమును మున్ముందు తొలగింప నపహాస భావముతో శ్రీకృష్ణభగవాను లుపదేశము నుపక్రమించుచున్నారు. ఏలయన శోక మునకుఁ బ్రతికూలభావ మపహాసము. శోకతప్తుని, యుక్తమగు నపహాసము చేసిన నట్టియపహాసము శోకమును దొలగించి యంతఃకరణమును నిశ్చలముగాఁ జేయును. అట్టి తరుణమున నెద్దియేని నుపదేశించిన నద్దాని గ్రహించుటకుఁ గొంత యవకాశము కల్గును.

---

"యచ్ఛ పూర్వైః పూర్వతరం కృతమ్" (గీ. 4. 15.) "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయ" (గీ. 3. 20) ఇతి. తత్తు ప్రవిభజ్య విజ్ఞేయమ్. తత్కథమ్? యదితావత్పూర్వే జనకాదయ స్తత్త్వవిదోఽపి ప్రవృత్తకర్మాణః స్యుః తే లోకసం గ్రహార్థం "గుణాగుణేషు వర్తంతే" (గీ. 3. 28) ఇతిజ్ఞానేనైవ సంసిద్ధి మాస్థితాః, కర్మసంన్యాసే ప్రాప్తేఽపి కర్మణాసహైవ సంసిద్ధి మాస్థితాః, న కర్మసంన్యాసం కృతవంత ఇత్యర్థః, అథ న తే తత్త్వవిదః, ఈశ్వరసమర్పితేన కర్మణా సాధనభూతేన సంసిద్ధిం సత్త్వశుద్ధిం జ్ఞానోత్పత్తిలక్షణాం వా సంసిద్ధి మాస్థితా జనకాదయ ఇతి వ్యా ఖ్యేయమ్. ఏతమేవార్థం వక్ష్యతి భగవాన్ "సత్త్వశుద్ధయే కర్మ కుర్వంతి" (గీ. 5. 11) "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" (గీ. 18 46) ఇతి, ఇత్యుక్త్వా సిద్ధిం

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11

---

టీ:- త్వం - నీవు, అశోచ్యాన్ - దుఃఖింపఁదగని భీష్మద్రోణాదులఁగూర్చి, అన్వశోచః - దుఃఖించుచుంటివి. ప్రజ్ఞావాదాన్ - బుద్ధిమంతులయొక్క వాక్యములను, చ - యుక్తులను మున్నగువానిని, భాషసే - పలుకుచుంటివి. పండితాః - విద్వాంసులు, గతాసూన్ - ప్రాణములు పోయినవారలనుగూర్చియు, అగతాసూన్ చ - ప్రాణములు పోవనివారలఁగూర్చియుఁగూడ, న అనుశోచంతి - దుఃఖింపరు. 11

తా:- "ఓయి యర్జునా! ప్రకృతమున నీవు యుద్ధమునుండి విరమించి లేచి పోవు తలంపున నత్యద్భుతంబుగ శ్రుతిస్మృతిసదాచారప్రమాణవిదు లగు పండితులు పలుకునట్లు గంభీరవాక్యములఁ బలుకుచున్నావు. మఱియు నే భీష్మద్రోణాదులఁ గూర్చి యెంతమాత్రము విచారింపఁ బనిలేదో యట్టి భీష్మద్రోణాదులఁ గూర్చి పలువిధముల విలపించుచున్నావు. ఇట్టి విలాపము మౌఢ్యసూచకము." పై వాక్యములు పాండిత్యసూచకములు. పాండిత్యము మౌఢ్యము నొకే పురుషుని యందుఁ గన్పట్టినచో నట్టివాఁ డున్మత్తసదృశుఁడుగాఁ బ్రాజ్ఞులచేఁ దలంపఁబడును. ఇట్టియున్మత్తసదృశవ్యవహారము ప్రాజ్ఞుఁడ వని తలఁచునట్టియుఁ దలంపఁబడునట్టియు నీయందు యుక్తము కాదుగావున నట్టి యున్మత్తవ్యవహారమునుండి విరమించి స్థైర్యమును జెందుమని యభిప్రాయము. యుద్ధమును జేసిన భీష్మద్రోణాదులు చచ్చెదరని విలపించుట యజ్ఞతయా యనినచో నజ్ఞతయే యని వక్కాణింపుచుఁ బండితలక్షణమును భగవానులు రెండవచరణముచేఁ బ్రదర్శింపుచున్నారు. "ప్రాణములు

---

ప్రాప్తస్యచ పునర్జ్ఞాననిష్ఠాం వక్ష్యతి "సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ" (గీ. 18. 50) ఇత్యాదినా.

తస్మాద్గీతాశాస్త్రే కేవలాదేవ తత్త్వజ్ఞానాన్మోక్షప్రాప్తి ర్న కర్మసముచ్చితా దితి నిశ్చితోఽర్థః; యథా చాయమర్థ స్తథా ప్రకరణశో విభజ్య తత్ర తత్ర ప్రదర్శయిష్యామః.

తత్రైవం ధర్మసంమూఢచేతసో మిథ్యాజ్ఞానవతో మహతి శోకసాగరే నిమగ్నస్యార్జునస్యా న్యత్రాత్మజ్ఞానా దుద్ధరణ మపశ్యన్ భగవా న్వాసుదేవ స్తతః కృపయాఽర్జున ముద్దిధీర్షు రాత్మజ్ఞానాయావతారయ న్నాహ అశోచ్యానిత్యాది. నశోచ్యాః అశోచ్యాః భీష్మద్రోణాదయః, సద్వృత్తత్వా త్పరమార్థరూపేణచ నిత్య

పోయినవారలఁ గూర్చియుఁ బ్రాణములు పోవనివారలఁ గూర్చియుఁ గూడ బండి తులు దుఃఖింపరు.” అనుటలోఁ బ్రాణములు వచ్చుటయును బోవుటయును స్వభావ ముగాఁ గల్గియుండుటచే నట్టి ప్రాణముల కొకప్పుడు స్థితి మఱియొకప్పుడు గతియు గల్గుచుండుఁగాని యా ప్రాణములయొక్క స్థితిగతుల కాధారభూతము లగు నాత్మ నిత్య మగుటంజేసి యట్టి యాత్మస్వభావమును గుర్తెఱింగినవారలు గావున పండితు లట్టి ప్రాణములయొక్క స్థితిగతుల రెండింటిఁ గూర్చియు లెక్కింప రని యభిప్రాయము. పామరులు ప్రాణములతోఁ గూడినవారలఁ జూచి యా నందింపుచుండుటయు, ప్రాణములు పోయినచో నట్టివారలఁగూర్చి దుఃఖించుటయు లోకసిద్ధము. అంతియ కాదు, ప్రాణములతోఁ గూడినవారలఁ జూచి దుఃఖించుట, అట్టివారలు గతప్రాణు లైనచో సంతసించుటయుఁగూడ లోకసిద్ధము. ప్రకృతమున నొకింత తిలకించిన నయ్యది స్పష్ట మగును. అర్జునుఁడు కర్ణదుర్యోధనదుశ్శాసనశకుని ప్రభృతులు గతప్రాణులు కానిచో రాగద్వేషములఁ జెంది వారల గతప్రాణులఁ గావించి సంతస మందఁదలంచుచు యుద్ధసన్నద్ధుఁ డాయెను. అట్టివారలతోఁ బాటు భీష్మద్రోణకృపాశ్వత్థామలుగూడ గతప్రాణు లగుదు రనియు విలపించుచు నట్టివా రలు గతప్రాణులు కాకుండగా నుండవలయు నని తలఁచుచున్నాఁడు. దీనినిబట్టి యర్జు నునకుఁ గర్ణాదులగతప్రాణు లగుచో దుఃఖము, భీష్మాదులు గతప్రాణు లైనచో దుఃఖము గలుగుచున్నది. అర్జునుఁడు పరమార్థదృష్టిచే నిత్యులును నశోచ్యులు నగు భీష్మద్రోణాదులఁగూర్చి విలపించుచున్నాఁడు. కావున నిట్టివిలాప మున్మత్త ప్రలాపసదృశం బనియుఁ బండితలక్షణము గాదనియు నర్జుననికిఁ దోఁప శ్రీకృష్ణభగ వానులు సకలశాస్త్రసారభూతం బగు పరమరహస్యము గర్భమందుఁ గల్గిన యాగీ తము నపహాసవ్యాజమునఁ బలికిరి. ఈగీతార్థమును వెల్లడించుటకే యుత్తరగ్రంథ

---

త్వాత్, తా నశోచ్యా నన్వశోచోఽనుశోచితవా నసి తే మ్రియన్తే మన్నిమిత్తం, తైర్వినాభూతః కిం కరిష్యామి రాజ్యసుఖాదినేతి. త్వం ప్రజ్ఞావాదాన్ ప్రజ్ఞావతాం బుద్ధిమతాం వాదాంశ్చ వచనానిచ భాషసే. తదేత న్మౌఢ్యం పాండిత్యంచ విరుద్ధ మాత్మని దర్శయ స్యున్మత్త ఇవేత్యభిప్రాయః, యస్మా ద్గతాసూ న్గతప్రాణా న్మృతా౯, అగతాసూ నగతప్రాణా౯ జీవతశ్చ నానుశోచంతి పండితాః ఆత్మజ్ఞాః; పండా ఆత్మవిషయా బుద్ధి ర్యేషాం తేహి పండితాః పాండిత్యం నిర్విద్య (బృ. 3. 5. 1) ఇతి శ్రుతేః; పరమార్థతస్తు నిత్యా నశోచ్యా ననుశోచసి; అతో మూఢోఽ సీత్యభిప్రాయః.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
నచైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్. 12

మంతయు బ్రిన ర్తించుటచే బుధు లీగీతమును గీతాశాస్త్రమునకు బీజ మని వక్కా ణించుచున్నారు. బీజమన నిగూఢము ననభివ్యక్తము నగు మహాశక్తివిశేష మని యభిప్రాయము. అదెట్టు లనిన వటబీజము నిగూఢమగు మహావృక్షశక్తివిశేష మగున ట్లీగీత మితఃపరము వెలువడిన మహాశాస్త్రకల్పతరువునకు బీజమువంటిది. గీతాశాస్త్ర మంతయు నిగూఢముగ నీగీతమున నిమిడియున్నది. బుద్ధిప్రతిభా విశిష్టు లగు మహాపురుషు లీయొక్క గీతమును మననము చేసినచో నీగీతాశాస్త్ర మంతయు వారలదొుక్క యంతఃకరణమున విజృంభించు ననుటకు సందియము లేదు. శోధితక్షేత్రమున నాటిన బీజము సరియగు దోహదముచే గ్రమక్రమముగ మహా వృక్షరాజముగ నతిశయిల్లుభంగి నీగీతము శోధితాంతఃకరణమున సద్గురువుచే నాటc బడి యుక్త మగువిధమున దోహదము చేయబడినచో నీగీత మాశోధితాంతఃకరణ మునందు వేదకల్పతరువుగ నతిశయమొంది యట్టివాని బ్రహ్మవిదు నొనరించి వేదఫలము నొందించుననుటకు సందియ మించుకంతయు లేదు. 11

టీ:—అహం - నేను, జాతు - ఒకానొకప్పుడైన, న ఆసమ్ - లేననునది, నతు ఏవ - ఎంతమాత్రము లేదు. త్వం - నీవు, (నఆసీః - లేవనునది.) న - లేదు. ఇమే - ఈ యగపడు, జనాధిపాః - నరపాలురు, (నఆసన్ - లేరనునది.) న - లేదు.

అతః - ఈదేహవినాశముకంటె, పరమ్- ఉత్తరకాలమందును, సర్వే వయమ్- మన మందఱమును, న భవిష్యామః - ఉండcగలవారము కాకపోవుట, నచ ఏవ - ఎంతమాత్రమును లేదు. 12

తా:—ఇcక నర్జునుండు గతాగతప్రాణులc గూర్చి పడుచున్న శోక మోహము లీపరిదృశ్యమానములగు కరచరణాద్యవయవవిశిష్టంబు లగు సప్తధాతుమయపిండ ముల నాత్మలుగాc దలcచుటచేc గల్గెcగావున నీ సప్తధాతుమయపిండము లగు దేహ ము లెంతమాత్రము నాత్మ కావనియు, నీ పరిదృశ్యమానము లగు దేహముల కా ధారమగు నాత్మ నిత్య మనియు, నర్జునునిహృదయమునకు యుక్త్యనుభవములతో సోపానప్రాయముగ బోధింప నెంచి యి ట్లుపక్రమించుచున్నారు. భీష్మద్రోణా

కుత స్తేఽశోచ్యాః, యతో నిత్యాః. కథమ్? నత్వేతి; న త్వేవ జాతు కదా చిత్ అహం నాసం, కిం త్వాసమేవ; అతీతేషు దేహోత్పత్తివినాశేషు ఘటాదిషు వియ దివ నిత్యఏవాహమాస మిత్యభిప్రాయః, తథా న త్వం నాసీః, కింత్వాసీ రేవ. తథా నేమే జనాధిపా నాసన్, కింత్వాసన్నేవ; తథా న చైవ న భవిష్యామః;

దేహినోఽస్మిన్యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. 13

---

దులు నిత్యులు గావున వారలఁగూర్చి విచారింపఁ బనిలేదు. ప్రకృతమునఁ దెలియ వచ్చెడి నేను, నీవు, ఈ జనాధిపులు నిదివఱకు లేమనునది లేదని చెప్పుటచే ఁ దేహములను ధరించుటకుఁ బూర్వమునఁగూడ నుంటిమని చెప్పఁబడినది. ఇఁక నీదేహపాతానంతరము మన మందఱము లేకుండువారము గామని చెప్పుటచే నిఁకముందుఁగూడ నుండఁగలవారమని చెప్పఁబడినది. దీనినిబట్టి మన మందర మును భూతకాలమున నున్నవారమే. ఇఁక వర్తమానకాలమున నున్నారము గదా! భవిష్యత్కాలమునఁ గూడ నుండఁగలవారమే. కావున మన మందఱము త్రికాలాబాధ్యులము, అందుచే నిత్యులము. నిత్య లగువారికి చావు సంభ వింపనేరదు కదా! కానఁ జచ్చెద రని శోకించుట యవివేకలక్షణము కాని ప్రాజ్ఞలక్షణము కాదు. ఇచ్చట "అహం" "త్వం" "ఇమే జనాధిపాః" "సర్వే వయమ్" అనుపదములు దేహనానాత్వముచేఁ బ్రయోగింపఁబడినవి కాని యాత్మనానాత్వముచేఁ గాదు. కావున నిచట నర్జునునియొక్క బుద్ధియందు నాత్మయొక్కనిత్యత్వమే బోధింపఁబడెను. ఆత్మనానాత్వ మిచటఁ దలపఁబడినచో నుత్తరగ్రంథసమన్వయము సమంజసముగాఁ గానేరదు. 12

టీ:—దేహినః - దేహికి, అస్మిన్ - ఈప్రత్యక్షముగాఁ దెలియవచ్చెడి, దేహే - దేహమున, యథా - ఏరీతిగా, కౌమారం - బాల్యావస్థ, యౌవనం - మధ్యమావస్థ, జరా - ముదుసలితనము, అను, పరస్పరవిలక్షణము లగుమూఁ డవస్థలును గల్గుచున్నవో, తథా - ఆతీరుననే, దేహాంతరప్రాప్తిః - మఱియొక దేహమునుగూడఁ గలుగును. తత్ర - ఇట్లు దేహాంతరములు లభించునపుడు, ధీరః - బుద్ధిమంతుఁడు, న ముహ్యతి - వ్యామోహమును జెందఁడు. 13

తా:—ప్రకృతమునఁ దెలియవచ్చెడి నేను, నీవు, ఈ జనాధిపులును నొకింత కాలముక్రిందటఁ బుట్టి వ్యవహరించుచున్నటులఁ దెలియవచ్చుటచేతను, అంతకుఁ బూర్వము తెలియఁబడకుండుటచేతను, ఇఁకఁ గొంతకాలమునకు మరణమును బొంది

---

కింతు భవిష్యామ ఏవ సర్వే వయ మతోఽస్మా ద్దేహవినాశా త్పర ముత్తర కాలేఽపి త్రిష్వపి కాలేషు నిత్యా ఆత్మస్వరూపేణేత్యర్థః; దేహభేదానువృత్త్యా బహువచనం నాత్మభేదాభిప్రాయేణ. 12

తత్ర కథమివ నిత్య ఆత్మేత్యత్ర దృష్టాన్త మాహ దేహినఇతి. దేహోఽ స్యాస్తీతి దేహీ తస్య దేహినో దేహవత ఆత్మనోఽస్మిన్ వర్తమానే దేహే

తెలియఁబడఁగలవారలు గాకుండుటచేతను, బ్రకృతమునఁ దెలియవచ్చుచున్నను ఇదివఱకున్నారనుటయు నికముం దుండఁగల రనియు విశ్వసించు పెట్లను సందియ మును వారించుటకై యీ గీత ముపదేశింపఁబడుచున్నది. ఈ గీతముచే శ్రీకృష్ణ భగవానులు దేహి యనియు, దేహ మనియు, రెండిఁటి నుదాహరింపుచు నందు దేహి నిత్యుఁ డనియు నిర్వికారుఁ డనియు దేహమునకును దేహమునందలియవస్థావిశేషము లకును సాక్షి యనియు వక్కాణించుచున్నారు. "దేహి"యను శబ్దమునకు"దేహోఽ స్యాస్తి"అను వ్యుత్పత్తిచే నీతనికి దేహము గలదు కావున"దేహి"యనఁబడుచున్నాఁ డని తెలియవచ్చుచున్నది. ఈ దేహము గలవానిని "ఆత్మ" యనుశబ్దముచే జిజ్ఞా సువు లందరును వాడుచున్నారు. ప్రకృతమున నాత్మను దేహి యనుటచే నాత్మకిచటఁ దటస్థలక్షణము మాత్రము వ్యక్తీకరింపఁబడుచున్నది. ప్రకరణముచే నిత్యము నిష్క్రియము జ్ఞాన మను స్వభావ మాత్మకుఁ బ్రతిపాదింపఁబడుచున్నది. ఎట్లు లన దేహి దేహమునందలియవస్థావిశేషములను గనిపెట్టువాఁడు గావున దేహి జ్ఞానస్వరూ పము. దేహమునందలి కౌమారయౌవనవార్ధక్యము లన్ననో యన్యోన్యవిలక్షణ స్వభావములు గల యవస్థావిశేషంబులు. కౌమార మన బాల్యావస్థ, యౌవన మన మధ్యమావస్థ, జర యన వయోహాని, జీర్ణావస్థ. అందు మొదటియవస్థ నశించుట యందు నాత్మకు నాశనముగాని రెండవ యవస్థ జనించుటయందు నాత్మకు నుపజననముగాని చూడఁబడదు. అటులనే రెండవయవస్థానాశనమందు నాత్మకు నాశనముగాని మూఁడవయవస్థాజననమం దుపజననముగాని చూడఁబడదు. మరణ జననము లనునవికూడ దేహమునందలి యవస్థావిశేషంబులే. కావున జననమరణాది యవస్థలయందుఁగూడ నాత్మకు నుత్పత్తినాశనములు గలుగనేరవు. బాల్యప్రభృతి వార్ధక్యమువఱకును గల దేహగతవికారములకు సాక్షి యగు నాత్మ తనయొక్క

యథా యేన ప్రకారేణ కౌమారం కుమారభావో బాల్యావస్థా, యౌవనం యూనో భావో మధ్యమావస్థా, జరా వయోహాని ర్జీర్ణావస్థేత్యేతా స్తిస్రోఽవస్థాః అన్యోన్యవిలక్షణాః, తాసాం ప్రథమావస్థానాశేన నాశో ద్వితీయావస్థోపజననే నోపజనన మాత్మనః కింతర్హ్యవిక్రియస్యైవ ఏకస్య ద్వితీయ తృతీయావస్థాప్రాప్తి రాత్మనో దృష్టా. తథా తద్వదేవ దేహాదన్యో దేహో దేహాంతరం, తస్య ప్రాప్తి ర్దేహాంతరప్రాప్తి రవిక్రియస్యైవాత్మన ఇత్యర్థః. ధీరో ధీమాం స్తత్రైవం సతి నముహ్యతి నమోహ మాపద్యతే.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖ దాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. 14

---

యేకత్వమును నిర్వికారచిద్రూపమును లెస్సగాఁ దెలిసికొనుచున్నాఁడు. దానంజేసి యట్టి యనిత్యము లగు దేహవికారములఁగూర్చి ప్రాజ్ఞుఁ డించుకేనియు వ్యామోహ మును జెందఁడు గావున నట్టివ్యామోహము ప్రాజ్ఞలక్షణము కాదనియు ప్రజ్ఞావాద ములఁ బలుకు నర్జునుఁ డిట్టివ్యామోహమును జెందుటచేఁ బ్రాజ్ఞకోటినుండి విడఁబడు చున్నాఁ డనియు నపహాసము. 13

టీ:—కౌంతేయ! - అర్జునా!, మాత్రాస్పర్శాః తు - శ్రోత్రాదీంద్రియములు, తద్విషయములగు శబ్దాదులును, శీతోష్ణసుఖదుఃఖదాః - శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము నిచ్చునవి, ఆగమాపాయినః - సంయోగవియోగములఁ గలిగినవి, అని త్యాః - నిత్యములు కావు. కావున, తాన్ - ఆశీతోష్ణాదులను, భారత - ఓయీ అర్జునా!, తితిక్షస్వ - సహింపుమా! 14

నిత్యమాత్మ యని తెలిసికొనుటచే నాత్మవినాశనిమిత్త మగు వ్యామోహము గలుగదు గాని సుఖవియోగనిమిత్త మగు మోహము దుఃఖసంయోగనిమిత్త మగు శోకమును లోకసిద్ధమై చూడఁబడుచున్నవి. కావున శీతోష్ణసుఖదుఃఖనిమిత్త మగు మోహ మాత్మకుఁ గలుగవచ్చు నను నాశంకను వారింప శ్రీకృష్ణభగవాను లీగీతమును బల్కుచున్నారలు. ఇచట "మాత్రాస్పర్శాః" అనునది సమస్తపద మగుటచే "మాత్రాణాంస్పర్శాః" అను విగ్రహముతో నొప్పు షష్ఠీతత్పురుషసమా సముగాఁ గాని "మాత్రాశ్చ స్పర్శాశ్చ" యను ద్వంద్వసమాసముగాఁ గాని గ్రహింపఁబడవచ్చును.

"మాత్రాః" అన నింద్రియములు, "స్పర్శాః" అన శబ్దాదివిషయ సంయోగములు. షష్ఠీతత్పురుష మైనచో నింద్రియములయొక్క స్పర్శ లనఁబడును. స్పర్శ లన శబ్దాదివిషయము లను నర్థమును గ్రహించినచో ద్వంద్వసమాసమున నింద్రియములు శబ్దాదివిషయము లను నర్థము లభించును. అర్థద్వయమునందును దోషములు లేకపోవుటఁ జేసి యేతీరున నర్థమును గ్రహించినను గ్రహింపవచ్చును.

ఇచట "తితిక్షస్వ" యనునది విధి యని గుర్తెఱుంగునది. ఇంద్రియములు, శబ్దాదివిషయములుగూడ రాకపోకలు గలవనియు ననిత్యము లనియుఁ జెప్పఁబడుటచే

---

యద్య ప్యాత్మవినాశనిమిత్తో మోహో నసంభవతి నిత్యఆత్మేతి విజానత స్తథాపి శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్తో మోహో లౌకికో దృశ్యతే; సుఖవియోగ

నింద్రియముల కాధారమగు సూక్ష్మదేహముకూడ బాల్యయౌవనవార్ధక్యములతో నొప్పు స్థూలదేహ మట్లు వికారములతో నొప్పుచున్నదనియు నట్టి సూక్ష్మదేహమునకును తద్గతవికారములకు నీదేహి సాక్షి యగుచు నిర్వికారుఁడుగా నిలిచి యున్నాఁ డనియు సుస్పష్టముగఁ దెలియవచ్చెడిని.

ఇఁక గమనింపవలసిన విశేషవిషయ మొండు గలదు. ఇచట "దేహి" యనుటలో "దేహము గలవాఁడు" అని వ్యుత్పత్త్యర్థము తెలియవచ్చెడిని. ఇచటఁ దెలియవచ్చెడి దేహశబ్దముచే గ్రహింపఁబడవలసిన విషయ మెద్ది యనిన దేహశబ్దము విశేషణములచే సంకోచమును బొందకయుండుటచే దేహశబ్దసామాన్యముచే వ్యవహరింపఁబడు స్థూల సూక్ష్మ కారణదేహసంఘాత మంతయు నిచట గ్రహింపనగును. ఇట్టియభిప్రాయ మీగీతాశాస్త్రమునందలి పదమూఁడవ యధ్యాయమున సుస్పష్టముగ నున్నది. పదమూఁడవ యధ్యాయమున నీదేహి క్షేత్రజ్ఞశబ్దముచేతను, దేహము క్షేత్రశబ్దముచేతను గ్రహింపఁబడెను. "ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే, ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః." (గీ 13. 1.) క్షేత్రస్వరూప మి ట్లుదాహరింపఁబడుచున్నది.

"మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ,
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః.
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్". (గీ. 13-5,6.)

ఆత్మయొక్క నిర్వికార చిన్మాత్రస్వభావము నర్జునునకు బోధించుటకుఁ దగుయుక్తి నొక "దేహినోఽస్మిన్" అనుగీతముతోఁ బ్రదర్శించియున్నారు. ఇయ్యది యర్జునునియొక్క యధికారము ననుసరించి ప్రదర్శింపఁబడినయుక్తివిశేషము. ఇయ్యది సూక్ష్మతరము. అర్జునునికంటె మందబుద్ధుల నుద్దేశించి శ్రీవిద్యారణ్యజగద్గురువులు తమపరిత్యక్తత్వవివేకమున నాత్మస్వరూపమును యుక్తిప్రధాన మగు నీదిగువశ్లోకములతో బోధించియున్నారు.

"శబ్దస్పర్శాదయో వేద్యాః వైచిత్ర్యా జ్జాగరే పృథక్,
తతో విభక్తా తత్సంవిదైకరూప్యా న్న భిద్యతే.

---

నిమిత్తో మోహః దుఃఖసంయోగనిమిత్తశ్చ శోకః, ఇత్యేత దర్జునస్య వచన మాశంక్య భగవా నాహ - మాత్రాస్పర్శా ఇతి. మాత్రా అభి ర్మీయంతే

తథా స్వప్నేఽత్ర వేద్యంతు న స్థిరం జాగరే స్థిరమ్,
తద్భేదోఽత స్తయో స్సంవి దేకరూపా న భిద్యతే.
సుప్తోత్థితస్య సౌషు ప్తతమో బోధో భవే త్స్మృతిః,
సా చావబుద్ధవిషయాఽవబుద్ధం తత్తదా తమః.
న బోధో విషయా ద్భిన్నో న బోధా త్స్వప్నబోధవత్,
ఏవం స్థానత్రయేఽ ప్యేకా సంవి త్తద్వ ద్దినాంతరే.
మాసాబ్దయుగకల్పేషు గతా గమ్యేష్వనేకథా,
నోదేతి నా స్తమే త్యేకా సంవి దేషా స్వయంప్రభా.

శ్రీవిద్యారణ్యగురువులయుపదేశము తేటతెల్ల మగునటుల నొకింత నిరూపింపఁబడును. ప్రతిపురుషుఁడును ప్రతిదినమును జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూఁడవస్థల ననుభవించుట సార్వజనీన మగువిషయంబుగదా. ఇట్టి మూఁడవస్థలపరామర్శచే నాత్మస్వరూపమును సాధింతము. అందుఁ బ్రథమంబున జాగ్రత్స్వప్నంబుల నొకింత విచారింతము. జాగ్రదవస్థ యన నింద్రియములచే విషయములను గ్రహించునవస్థ. పురుషుఁడు సామాన్యముగా 'నేను కండ్లతో జూచుచున్నాను, చెవులతో వినుచున్నాను, ముక్కుతో వాసన చూచుచున్నాను, నాలుకతో రుచిచూచుచున్నాను, దేహముతో స్పృశించుచున్నా' నని పంచేంద్రియములతో వ్యవహరించునట్టియవస్థకు జాగ్రదవస్థ యని పేరు. ఇంద్రియము లుపసంహారమును జెంద జాగ్రదవస్థయొక్క సంస్కారమువలనఁ బుట్టిన విషయానుభవ మెద్దియో యయ్యది స్వప్నమనఁబడును. వాస్తవముచే ననుభవకాలమున జాగ్రత్స్వప్నము లొకతీరుననే ప్రకాశించుచుండును. కాని జాగ్రదవస్థయందలి విషయములవలె స్వప్నావస్థయందు గ్రహింపఁబడువిషయములు స్థిరములు గాకపోవుటచే జాగ్రదవస్థనుండి స్వప్నావస్థ వేఱుచేయఁబడుచున్నది. ప్రతిపురుషుఁడును 'నేను మేలుకొని యున్నాను, నేను కలఁగంటిని, నేను నిదురఁబోతిని' యని మూఁడవస్థలనుగూర్చి పలుకుచుండును. ఈ నేను అనువానినే "అహం" శబ్దవాచ్యుఁ డని శాస్త్రములు పలుకుచున్నవి. ఈ 'నేను' సర్వపదార్థములను గనిపెట్టుజ్ఞానమై యున్నాఁడు. ఈ "నేను" పంచేంద్రియవ్యాపారములను గ్రహించు జ్ఞానమై యున్నట్లును

శబ్దాదయ ఇతి శ్రోత్రాదీ నీంద్రియాణి మాత్రాణాం స్పర్శాః శబ్దాదిభి స్సంయోగా స్తే శీతోష్ణసుఖదుఃఖదాః శీత ముష్ణం సుఖం దుఃఖంచ ప్రయచ్ఛన్తీతి. అథవా

ఇంద్రియములకంటె వేరైనట్లును, ఒక్కటేయైనట్లును, 'నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను, నేను స్పృశించుచున్నాను' అను నీమొదలగు ననుభవములవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ 'నే' ననుజ్ఞానముః జాగ్రిదవస్థయందు నస్థిచర్మస్నాయు మజ్జ మాంస శుక్ల శోణిత శ్లేష్మాశ్రు దూషితమై నట్టియు విణ్మూత్రవాతపిత్తకఫ సంఘాతముచే దుర్గంధ మైనట్టియు నిస్సారమగు నీ స్థూలదేహముతోఁ దాదాత్మ్యముఁ జెంది, తదభిమానాయత్తచిత్తమై సర్వకార్యంబులందును వ్యవహరించుట సార్వజనీనంబగు విషయంబే. స్వప్నావస్థయం దన్ననో 'నేను చూచుచున్నాను, వినుచున్నాను' లోనుగాగల యనుభవము లన్నియు జాగ్రిదవస్థయందువలెనే యుండును. స్వప్నావస్థయందుఁ గార్యాకార్యవివేకము కర్మేంద్రియ జ్ఞానేంద్రియ వ్యాపారము దేహసంరక్షణాది తాపత్రియమును జాగ్రిదవస్థయందు వలెనే యుండును. స్వప్నస్థుఁడైనవాఁడు తాను స్వప్నము ననుభవించుచున్నా నని యెన్నడు ననుకొనఁడుగదా! జాగ్రిదవస్థఁ జొచ్చినపిదపఁ గదా యట్టియవస్థ స్వప్నమనియుఁ గల్లయనియుఁ దలంచునుగాని స్వప్నమం దున్నచోఁ దలంపఁడు గదా! సుఖదుఃఖ సాక్షాత్కారమునందు జాగ్రత్స్వప్నంబులు రెండును సమానములే. అయి నను జాగ్రదవస్థయం దీ 'నే' ననుజ్ఞానము సుఖదుఃఖానుభవమునకై సాధనంబుగాఁ గైకొనిన కరచరణాద్యవయవవిశిష్ట మగు స్థూలదేహము నించుకేనియు సరకు గొనక ప్రవర్తించుచున్నట్లుః సర్వలోకానుభవంబు. స్వప్నములో ఖడ్గహస్తుఁడై తనపైఁబడు శత్రువుతోఁ బోరాడి ప్రాణరక్షణముఁ జేసికొనఁ దాపత్రయమును జెందు నే ననుజ్ఞానము బాహ్యమున శత్రువుచేఁ గంఠమునఁ దవిలింపఁబడుపాశమును గుర్తెఱుంగఁడుకదా! ఇట్లు గుర్తెఱుంగకపోవుటకుఁ గల కారణ మెద్ది? జాగ్రదవస్థయందు వ్యవహరించు నే ననుజ్ఞానముకంటె స్వప్నమందు వ్యవహరించు నేననుజ్ఞానము వేఱా? ఎంతమాత్రమును వేఱుగాదు. అట్లు వేఱైనచో జాగ్రదవస్థయందు స్వప్నానుభవ జన్యంబగు స్మృతి యసంభవము. అట్లు గుర్తెఱుంగకపోవుటకుఁ గారణంబు దేహాభావంబు. ఏమి వింత! దేహాభావము కారణ మనినచో బాహ్యమున నున్న మనము స్వప్నస్థుఁడైనవాని దేహమును జూడలేదా? దేహము ప్రత్యక్షముగ నగపడుచుండ దేహము లేదనుచున్నారు. సరియే, మనము చూచినఁ జూడవచ్చును. అట్టి

స్పృశ్యన్త ఇతి స్పర్శావిషయా శ్శబ్దాదయః, మాత్రాశ్చ స్పర్శాశ్చ శీతోష్ణసుఖదుఃఖదాః; శీతం కదాచి త్సుఖం కదాచి ద్దుఃఖమ్. తథోష్ణమ ప్యనియతస్వరూపమ్.

చూపునకు మనజాగ్రద్భ్రాంతి కారణము గావచ్చును. స్వప్నదృష్టిచే నీదేహ మెంతమాత్రమును భావమును బొందియుండదు. అట్టి భావమును బొందియుండి నచో స్వప్నస్థుఁడు తప్పక యీదేహమును గాపాడుకొనుటకుఁ బ్రయత్నించితీరును. కావున స్వప్నస్థుని దృష్టిచే స్థూలదేహము భావములేనిదై యున్నది. ఒక్కస్థూల దేహమే కాదు. జాగ్రత్ప్రపంచమంతయు భావము లేనిదై యున్నది. ఆతీరుననే జాగ్రదవస్థయందున్నపుడు స్వప్నప్రపంచము మిథ్య యగుచున్నది. స్వప్నప్రపంచము మిథ్య యని చెప్పుట కొక హితవాది యెంతమాత్రము నక్కరలేదు. ఏలనన నయ్యది సర్వజనానుభవవిషయము. ఎల్లవారును జాగ్రదవస్థయం దుండినపుడు స్వప్నావస్థ మిథ్యయని చెప్పుట సహజమేకదా! మఱియు స్వప్నావస్థయం దుండినప్పుడు జాగ్రత్ప్రపంచ మించుకేనియు గుఱ్ఱుఁగకుండుటయు సరకుగొనకుండుటయు ననుభవ నీయమేకదా! ఆహేతువుచే జాగ్రత్ప్రపంచముకూడ మిథ్య యని యేల చెప్పఁగూడదు? ఇట్లు జాగ్రత్స్వప్నంబులు రెండును సజాతీయంబు లగుటంజేసి యితరేతరమిథ్యాత్వసంపాదకము లగుచున్నవి. దానంజేసి జాగ్రత్స్వప్నంబులు రెండును మిథ్య యని రూఢి యగుచున్నది. కాని జాగ్రత్స్వప్నంబుల ననుభవించు నే ననుజ్ఞానము మాత్రము స్థిరతనుబొందుచున్నది. ప్రతిమనుజుఁడును స్వప్నము ననుభవించిన నేను జాగ్రత్తు ననుభవించుచున్నా నను ననుభవమును బ్రకటన చేయునుగాని తద్విలక్షణ మును బ్రకటనచేయుట యెందును గానరాదు. దానఁజేసి నే ననుజ్ఞానము జాగ్రత్స్వప్నంబులకు సాక్షి యని చెప్పఁబడును.

ఇఁక సుషుప్తినిగూర్చి యొకింత విచారింతము. సుషుప్తియం దన్ననో జాగ్రత్స్వప్నప్రపంచములు రెండును నించుకేనియు వేద్యంబులు కావుగదా. సుషుప్తి యందు నింద్రియవ్యాపారములు తాపత్రియములు నించుకేనియుఁ దోఁచవు. నే నను జ్ఞాన మప్పు డానందమును బొందియుండును. సుషుప్తియందు నే నానందమును బొందు చున్నా నను సుఖానుభవజ్ఞాన మెంతమాత్రము తెలియఁబడదు. నే నుంటి నను ననుభ వంబుగూడ నెంతమాత్ర ముండదుకదా! అట్టి స్థితియందు నే ననుజ్ఞాన మానం దము ననుభవించు నని చెప్పుట కెట్లు వీ లగును? సుషుప్తియందలి సుఖానుభవమును జ్ఞానస్థితిని నిరూపించుటకు సుషుప్త్యనంతరకాలిక మగు స్మృతి సాధన మైయున్నది.

సుఖదుఃఖేపునర్నియతరూపే యతో నవ్యభిచరతోఽత స్తాభ్యాం పృథక్ శీతోష్ణయో గ్రహణమ్. యస్మా త్తే మాత్రాస్పర్శాదయ ఆగమాపాయిన ఆగమాపాయశీలా

స్మృతి యనగా ననుభవసంస్కారమువలనఁ గలుగుజ్ఞానము. ఎద్దియేని స్మృతి కలిగి నచోఁ దత్పూర్వంబగు ననుభవ ముండితీరవలయును. అనుభవరహితమగు స్మృతి యప్రసిద్ధము. నిదురనుండి లేచినవాఁడు "నేను సుఖముగా నిదురఁబోతిని" అను తన స్మృతిని వెల్లడి చేయుచున్నాఁడు. సుషుప్తియందు నే ననుజ్ఞానమునకు సుఖాను భవము లేకుండినచో "నేను సుఖముగా నిదురపోతిని" అను స్మృతికి నెంతమాత్ర మవకాశ ముండదు. కావున నిట్టి స్మృతిచే సుషుప్తియందు నే ననుజ్ఞానము సుఖము ననుభవించినటుల నూహింపనోపు. అయిన నట్టిసుఖానుభవకాలంబున నెద్దియైన జాగ్రత్స్వప్న ప్రపంచజ్ఞానముగాని, లేదా వేఱొక విషయజ్ఞానముగాని, కల్గియుండెనా యనినచో, నట్టి వెవ్వియును గానరాలే దనువిషయము "నా కెద్దియుఁ దెలియఁబడ లేదు" ను స్మృతిచే నూహింపవచ్చును. సుషుప్తియం దున్న పురుషునికి జాగ్రత్స్వ ప్నప్రపంచములు మిథ్య. జాగ్రత్స్వప్నంబులయం దున్న నేననుజ్ఞానముకంటె సుషుప్తి యందలి నే ననుజ్ఞానము ప్రత్యేక మనికాని లేక సుషుప్తియందు నే ననుజ్ఞానము లేదనికాని చెప్పఁగూడదా? యనినచో నట్లు చెప్పఁగూడదు. ఏలనన సుషుప్తినుండి లేచి జాగ్రదవస్థను బొందినవాఁడు స్వప్నమును గనినటువంటియు నిదురవోయి నట్టియు నేను జాగ్రత్తయం దున్నా నను ననుభవము వెల్లడిచేయుచున్నాఁడు. అందుచే జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయంబు నందును నే ననుజ్ఞాన మించుకేనియు మార్పు లేక యొకేతీరున నిలిచియున్నది. అవస్థ లన్నో వివిధము లగుమార్పుల నందియున్నవి. ఒక్కొకయవస్థ మఱియొక యవస్థను మిథ్య యని ప్రకటించుచున్నది. కాని నేననుజ్ఞానముమాత్ర మించుకేనియు జలనము లేక స్థిరముగ నున్నది. ఇంతవఱకు ప్రతిపురుషుఁడు నొకదినమందు గడుపు మూఁడవస్థలనుగూర్చి ముచ్చటించితిమి. రెండవదిన మం దన్నను మొదటిదినమం దెట్లు మూఁడవస్థల ననుభవించెనో యాతీరు ననే యనుభవించుచున్నాఁడు గదా! మొదటిరోజునం దుండు నే ననుజ్ఞానముకంటె రెండవరోజునందలి నేననుజ్ఞానము విలక్షణమని యెంతమాత్రము వచింప నవకాశము లేదుకదా! ఆతీరుననే యొకమాసమునకు బిదప నే నను నొక క్రొత్తజ్ఞాన మగపడదు. ఆతీరుననే యొక సంవత్సరాంతమునను, నాతీరుననే బాల్యము ననుభవించిన నేను యౌవనము ననుభవించుచున్నాను. యౌవనము ననుభవించిన నేను వార్ధక్యము ననుభ

---

స్తస్మా దనిత్యాః; అత స్తాన్ శీతోష్ణాదీం స్తితిక్షస్వ ప్రసహస్వ; తేషు హర్షం విషాదం వా మాకార్షీ రిత్యర్థః.

వించుచున్నాననుబాల్య యౌవన వార్ధక్యములయందలి జ్ఞానముయొక్క యేక త్వము వ్యక్తీకరింపఁబడుచున్నది. అవస్థయనగా దేహమును విడచి దేహాంతరమును బొందుట. జాగ్రదవస్థను విడచి స్వప్నావస్థను బొందిన నేననుజ్ఞానము జాగ్రదవస్థయం దలి దేహము నెంతమాత్రము సరకుగొనకుండుట లోకసిద్ధమనియు, అట్లు సరకుగొన కుండుటకు దేహాభావము కారణమనియు, నిదివఱలోఁ జెప్పఁబడియెగదా! ఇం కను స్వప్నవ్యవహారమునందు సూక్ష్మదేహము ప్రవర్తించుట సుప్రసిద్ధముగదా! ఒకఁడు స్వప్నస్థుఁ డాయె నన్నచో స్థూలదేహమును విడచి సూక్ష్మదేహము సాధనముగాఁ గైకొనియె నని వేఱ వచింపనక్కరలేదు. అతీరుననే సుషుప్తిఁ జెందినవాఁడు సూక్ష్మదేహమును విడచి కారణదేహమును మాత్రమే సాధన ముగా ధరించియుండును. ఇంతియకాదు. సూక్ష్మదేహప్రవిష్టునకు స్థూల దేహము మిథ్య. కారణదేహప్రవిష్టునకు సూక్ష్మదేహము మిథ్య. సుషుప్తి యందున్నవాఁడు జాగ్రదాద్యవస్థల నొందునప్పుడు పుఱల సూక్ష్మకారణంబులఁ గల్పించుకొనును. దానంజేసి జాగ్రదవస్థపోయి స్వప్నావస్థ వచ్చునప్పటికి యొకస్థూల దేహము నష్టమగు నని స్పష్టమగుచున్నదిగదా! అట్లు దేహములు పోయి క్రొత్త దేహములు వచ్చుచుండినను దేహములకు సాక్షియగు నే ననుజ్ఞాన మేకాకార ముగానే యుండును. ఇట్లు గడచినట్టియు వచ్చినట్టియు ననేకములగు దివసములు, వారములు, మాసములు, అబ్దములు, యుగములు, కల్పములు లోనగువాటియందు స్వయం ప్రకాశమాన మగు "నే"నను జ్ఞాన ముత్పత్తిలయంబులు లేనిదై యేకాకా రంబుగానే యుండును.

శ్రీవిద్యారణ్యగురువుల యుపదేశంబు నటుంచి ప్రకృతమును యుక్త్యంతర ముచేఁ జర్చింతము. దేహి యీదేహమందు బాల్యయౌవనవార్ధక్యములఁ బొందుచున్నాఁ డని చెప్పఁబడియె. ఒకపురుషునకుఁ గల పూర్ణాయుర్దాయమని చెప్పఁబడు నూరువత్సరములను మూఁడవస్థలుగా భాగించినచో బాల్యము ముప్పది వత్సరములు, యౌవనము ముప్పది వత్సరములు, వార్ధక్యము నలుబదివత్సరములు నాక్రమించును. ఈమూఁ డవస్థలును దేహము పొందు విజాతీయ మగుధర్మముల ననుసరించియున్నవి. బాల్యమునం దుండు దేహము యౌవనమందుగాని, యౌవన

మం దుండు దేహము వార్ధక్యమునందు గాని యుండు నని చెప్పుటకు నెంతమాత్రము జంతు దేహస్వభావ మవకాశము నీయదు. ఏలయన నీపరిదృశ్యమాన మగు దేహము చర్మ మాంస రుధిర మేదో మజ్జా స్నాయ్వస్థు లను సప్తధాతువులచే నిర్మింపఁబడిన దనియు నట్టి సప్తధాతువులును వత్సరసప్తకంబున కొకపరి పుష్కలంబుగ మార్పు నొందుచుండు ననియు వైద్యశాస్త్రకోవిదు లెఱింగనవిషయమే. వాస్తవముచే నీదేహ మొక నదీసామ్యమును బొందియున్నది. స్థూలదృష్టిచేఁ బ్రవాహము స్థిర రూపంబుగఁ గన్పట్టినను నీటియొక్క రకపోకలసముదాయమై ప్రతిక్షణము నందును మారుచుండును. ఆరీతిగా స్థూలదృష్టిచే దేహ మొక పదార్థముగాఁ దోఁచుచున్నను యథార్థంబున క్షణక్షణంబున మార్పుల నందుటం జేసి క్రొత్త దిగా నగుచుండును. ఇట్టి మార్పులందుఁ బ్రాఁతపదార్థ మొకించుకయైన లేకుండ వత్సరసప్తకంబున కొకసారి పూర్ణముగ మార్పుఁజెందుననునది వైద్యశాస్త్రరహ స్యము. ఇట్టి పూర్ణ మగుమార్పులు నాలు గైనచో మొదటిది యగు బాల్యావస్థ పోయి రెండవదియగు యౌవనావస్థ ప్రారంభమగును, ఆరీతుననే మఱినాలుగు పర్యాయ ములు దేహము పూర్ణముగా మాఱినచో వార్ధక్యంబు సంప్రాప్తమగును. ఇట్లు బాల్య యౌవనంబుల నీస్థూలదేహ మెనిమిదిపర్యాయములు నశించి వార్ధక్యము సంభ వించినవుడు దేహి యించుకేనియు మార్పును జెందకుండుట సర్వలోకానుభవం బగు విషయంబు. బాల్యావస్థ ముగిసినను దేహి నాశనమును జెందఁడు. ఆరీతుననే యౌవనవార్ధక్యములయందు దేహము మార్పునందుచున్నను దేహి నిర్వికారుఁడు గనే యున్నాఁడు. అట్టి విషయంబున దేహమందలిచేష్ట లుడిగినంతనే దేహికి నాశ నము సంప్రాప్త మగునని తలంచుట యవివేకవిషయంబుగాని వివేకవిషయంబు గాదు. చాలతడవులు దేహము నశించుచున్నను క్రొత్తదేహంబు లెట్లు సంప్రాప్త మగు చున్నవి? దేహి ప్రయత్నపూర్వకంబుగ సంపాదించుకొనుచున్నాఁడు. ఎట్లు సంపా దించుచున్నాఁడు? నియతమగు నాహారపానీయాదుల స్వీకరించుటచే ఆరీతిగా నత్యంత దేహపాతానంతరమునఁ బ్రయత్నపూర్వకముగా మఱియొక దేహమును సంపాదించుకొను నన్నచో దోష మెందును గన్పట్టు నని తోఁచదు. దానం జేసియే గీతమున "తథా దేహాంతరప్రాప్తిః" అని వినవచ్చుచున్నది. బాలుఁడుగా నుండి

యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. 15

---

నపుడు తనతండ్రిని దెలిసికొనిన దేహి వార్ధక్యమునఁ దన మనుమలఁ దెలిసికొనుచున్నాఁడు. దేహము పలువిధంబులగు మార్పులను జెందుచుండినను దేహి కించుకేనియు మార్పు గలుగదు. దేహికూడ దేహమువలె మార్పుఁ జెందు స్వభావము గల్గియుండినచో నిట్టి స్మృతి కెంతమాత్ర మవకాశ ముండదు. స్వప్నమందును యోగబలానుగుణ మగు నద్భుతపు మార్పులందును నీ దేహిదేహ విభాగము పుష్కలముగా ననుభవనీయమై యుండును. స్వప్నమునందు దేహి స్థిరత వహించియుండ ననేకవిధములగు దేహములను ధరించుటయు సృజించుటయు ననుభవవిషయములే. కాయవ్యూహ మను యోగశక్తిచే నొకేపురుషుఁ డొకేకాలమున ననేక దేహంబుల సృజించి యందు నివసించియుండును. పరకాయప్రవేశసామర్థ్య మీ దేహి దేహభేదమును లెస్సగా ఋజువుచేయుచున్నది. కావున నిట్టి క్షణికంబులగు దేహంబు లాత్మ కావని యుపదేశించుటచే దేహమే యాత్మ యని భ్రమించు లోకాయతికచార్వాకాదిమతము లత్యంతము నిరసింపఁబడుచున్నవి.

టీ:—పురుషర్షభ - పురుషశ్రేష్ఠుఁడగు నోయర్జునా! సమదుఃఖసుఖమ్ - సుఖదుఃఖములు సమములుగాఁ గలిగిన, సుఖము గలిగిన హర్షముఁ జెందనట్టియు, దుఃఖముగలిగిన విషాద మందనట్టియు, ధీరమ్ - బుద్ధిమంతుఁ డగు, యం పురుషం - ఏపురుషుని, ఏతే - పూర్వోక్తము లగుశీతోష్ణాదులు, న వ్యథయంతి - చలింపఁజేయ నేరవో, సః - ఆపురుషుఁడు, అమృతత్వాయ - మోక్షముకొఱకు, కల్పతే - సమర్థుఁ డగుచున్నాఁడు.

తా:—శీతోష్ణసుఖదుఃఖముల నిచ్చుమాత్రాస్పర్శ లనిత్యములు గావున వాని నోర్చుము. "తాం స్తితిక్షస్వ" అను విధి యొకటి శ్రీకృష్ణభగవానులచే నుపదేశింపఁబడుచున్నది. అట్టి విధి ప్రాశస్త్యమును బోధించుటకై తితిక్షాప్రయోజన మీయర్థవాదరూప మగు గీతముచే బోధింపఁబడుచున్నది.

---

శీతోష్ణాదీన్ సహతః కిం స్యా దితి శృణు యం హీతి. యంహి పురుషం సమదుఃఖసుఖం సమే దుఃఖసుఖే యస్య తం సమదుఃఖసుఖం సుఖదుఃఖప్రాప్తౌ హర్షవిషాదరహితం ధీరం ధీమంతం న వ్యథయంతి న చాలయంతి; నిత్యాత్మదర్శనా దేతే యథోక్తాః శీతోష్ణాదయః స నిత్యాత్మదర్శననిష్ఠో ద్వంద్వసహిష్ణు రమృతత్వాయామృతభావాయ మోక్షాయ, కల్పతే సమర్థో భవతి. 15

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః. 16

---

శీతోష్ణాది ద్వంద్వసహనరూప మగుతితిక్షచే మోక్షముఁ బొందుటకు సమర్థుఁ డగుచున్నాఁ డని తాత్పర్యము. తితిక్ష యనునది మోక్షమున కంతరంగసాధన మని శ్రీకృష్ణాభిప్రాయము. దానంజేసియే తితిక్ష విధింపఁబడుచున్నది. కావున నెల్లరచే నవశ్యము తితిక్ష సంపాదింపఁబడవలయును. 15

టీ:—అసతః - అసత్తునకు, భావః - ఉనికి, న విద్యతే - లేదు. సతః - సత్తునకు, అభావః - లేమి, న విద్యతే లేదు. అనయోః - ఈ, ఉభయోః - రెండిఁటి యొక్క, అంతః - నిర్ణయము, తత్త్వదర్శిభిః - బ్రహ్మజ్ఞానులచే, దృష్టః - చూడఁబడెను.

తా:—ఈ గీతమునందలి మొదటిచరణముచేఁ దత్త్వము ప్రకటింపఁబడుచున్నది. రెండవ చరణముచేఁ బ్రకటింపబడిన తత్త్వము యొక్క గౌరవాతిశయములు ప్రకటింపఁబడుచున్నవి. ఇందుఁ బ్రకటింపఁబడిన తత్త్వము తత్త్వదర్శులచే సాక్షాత్కారము నొందఁబడిన దగుటచేఁ బరమపావన మనియు నప్రతిహత మనియు శ్రీకృష్ణభగవానుల మహాశయము. ఇచ్చట నుపదేశింపఁబడిన రహస్యము సదసత్తులను రెండిటియొక్క తత్త్వమైనటుల సుస్పష్టము. ఇచ్చట సదసత్తులను రెండుపదములు ప్రకరణవశమును బట్టి దేహిదేహములను బ్రతిపాదించుచున్నటుల సుస్పష్టము. యుక్తిదృష్టిచేఁ దెలియవచ్చెడి దేహియొక్క నిత్యనిర్వి

---

ఇతశ్చ శోకమోహా వకృత్వా శీతోష్ణాదిసహనం యుక్తం యస్మాత్ నాసత ఇతి. నాసతోఽవిద్యమానస్య శీతోష్ణాదేః సకారణస్య న విద్యతే నాస్తి భావో భవన మస్తితా.

నహి శీతోష్ణాదిసకారణం ప్రమాణై ర్నిరూప్యమాణం వస్తు సంభవతి. వికారో హి సః వికారశ్చ వ్యభిచరతి, యథా ఘటాదిసంస్థానం చక్షుషా నిరూప్యమాణం మృద్వ్యతిరేకేణానుపలబ్ధే రస త్తథా సర్వో వికారః కారణవ్యతిరేకేణానుపలబ్ధే రసన్ జన్మప్రధ్వంసాభ్యాం ప్రాగూర్ధ్వం చానుపలబ్ధేః కార్యస్య ఘటాదేః మృదాదికారణస్య చ తత్కారణవ్యతిరేకేణానుపలబ్ధే రసత్త్వమ్, తదసత్త్వే సర్వాభావప్రసంగ ఇతి చేన్న, సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః సద్బుద్ధి రసద్బుద్ధిరితి; యద్విషయా బుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్, యద్విషయా వ్యభిచరతి త దస దితి. సదసద్విభాగే బుద్ధితంత్రే స్థితే సర్వత్ర ద్వే బుద్ధీ సర్వై రుపలభ్యేతే సమానాధికరణే న నీలోత్పలవత్సన్ ఘటః సన్ పటః సన్ హస్తీతి; ఏవం

కార చిన్మాత్రస్వభావమును బ్రత్యక్షముగ నశ్వర మని తెలియఁబడుచుండెడి దేహముయొక్క తత్త్వము నిందు వ్యక్తీకరింపఁబడుచున్న సచ్ఛబ్దవాచ్యుఁ డగు దేహి కీలేమి తెలియఁబడదు. అసచ్ఛబ్దవాచ్యమగు దేహమునకును శీతోష్ణసుఖదుఃఖములకు నునికి తెలియఁబడ దని తత్త్వదర్శుల నిర్ణయమని గీతయొక్క భావము. దేహికి లేమి తెలియఁబడదన దేహి త్రికాలాబాధ్యుఁ డనియభిప్రాయము. దేహాదుల కునికి తెలియఁబడ దనిన దేహాదు లత్యంతము లేవనియే తత్త్వదర్శుల యనుభవ మని తెలియవచ్చెడిని. లోకదృష్టిచే నశ్వరములుగఁ దోఁచు దేహాదులు వాస్తవముచే లేనివే యని తత్త్వదర్శుల మహాశయము. దేహాదులు వాస్తవముచే నునికి తెలియఁబడక లేనివే యైనచో నింత గంభీరముగ బరిదృశ్యమాన మగుచు వ్యవహారక్షమము లెట్లగుచున్నవను నాశ్చర్యమెల్లరకును జనించుననుట యొకవింతగాదు. లోకదృష్టిచే గంభీరముగాఁ దోఁచు దేహాదుల పరిస్థితులను దత్త్వదర్శులు రజ్జుసర్పాదిదృష్టాంతములచే బహుభంగుల నిరూపించియున్నారు. సంజచీకటియందు బరిదృశ్యమానములగు రజ్జుసర్పము, స్థాణుపురుషుఁడును గంభీరముగాఁ దోచుచు భయకంపాది వ్యవహారక్షమ మగునటుల నజ్ఞానవశంబున భాసించు దేహాదులు వ్యవహారక్షమములుగాఁ గన్పట్టుచున్నను జ్ఞానదృష్టిచే స్థితిగతులు లేనివే యను గొప్ప యాశయము మీర నసత్తునకు భావము తెలియఁబడ దని యనుభవపూర్వకంబుగఁ దత్త్వదర్శులు వక్కాణించుచున్నారు. ఉనికి తెలియఁబడక ప్రకాశించు

---

సర్వత్ర. తయో ర్బుద్ధ్యో ర్ఘటాదిబుద్ధి ర్వ్యభిచరతి, తథాచ దర్శితమ్; నతు సద్బుద్ధిః; తస్మాత్ ఘటాదిబుద్ధివిషయోఽసన్ వ్యభిచారాత్, నతు సద్బుద్ధివిషయోఽవ్యభిచారాత్; ఘటే వినష్టే ఘటబుద్ధౌ వ్యభిచరన్త్యాం సద్బుద్ధిరపి వ్యభిచర తీతిచే న్న, పటాదావివ సద్బుద్ధిదర్శనాత్; విశేషణవిషయైవ సా సద్బుద్ధిః. సద్బుద్ధివత్ ఘటబుద్ధి రపి ఘటాన్తరే దృశ్యత ఇతిచే న్న, పటాదా వదర్శనాత్. సద్బుద్ధిరపి నష్టే ఘటే న దృశ్యత ఇతిచే న్న, విశేష్యాభావాత్; సద్బుద్ధి ర్విశేషణవిషయాసతీ విశేష్యాభావే విశేషణానుపపత్తౌ కింవిషయా స్యాత్? నతు పునః సద్బుద్ధే ర్విషయాభావా దేకాధికరణత్వం ఘటాదివిశేష్యాభావేన యుక్త మితిచే న్న, ఇద ముదక మితిమరీచ్యాదా వన్యతరాభావేఽపి సామానాధికరణ్యదర్శనాత్.

తస్మా ద్దేహాదే ర్ద్వంద్వస్య చ సకారణ స్యాసతో న విద్యతే భావ ఇతి; తథా సత శ్చాత్మనోఽభావోఽవిద్యమానతా న విద్యతే, సర్వత్రావ్యభిచారా దిత్యవోచామ.

అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయ స్యాస్య నకశ్చి త్కర్తు మర్హతి. 17

---

చుండిన యసత్తను శాస్త్రకోవిదులు మిథ్య యని నచించియున్నారు. "యదసద్భానమానం తన్మిథ్యా, స్వప్నగజాదివత్" అను విద్వదుక్తి లోకసిద్ధముగదా! తత్త్వదర్శుల యనుభవపూర్వక రాద్ధాంతముచే దెలియవచ్చెడినిర్ణయ మెద్దియన "దేహి సత్యము, దేహాదులు మిథ్య" యని. 16

టీ:— యేన - దేనిచేతను, ఇదమ్ - ఈ పరిదృశ్యమానమగు, సర్వం - సమస్తము నగు జగత్తు, తతమ్ - వ్యాపించఁబడినదో, తత్ తు - అది యొక్కటియే, అవినాశి - నాశనము లేని దని, విద్ధి - తెలిసికొనుము; అవ్యయస్య - వికారములేని, అస్య - ఈసర్వవ్యాపక మగు దానికి, వినాశమ్ - నాశనమును, కర్తుం - చేయుటకు, కశ్చిత్ - ఒకానొకఁడును, న అర్హతి - సమర్థుఁడు గాఁడు. 17

తా:— ఇంతవఱకు దేహి నిత్యనిర్వికారచిన్మాత్రుఁ డనియు దేహము మిథ్య యనియును బోధింపఁబడియె. ఇఁక దేహియొక్క పరిమాణవిశేషమునుగూర్చి వివరింప నీగీతము చెప్పఁబడియె. ఈ పరిదృశ్యమానమగు జగంబంతయు నొక్కదానిచే వ్యాపింపఁబడియున్నదనియు నది యొక్కటియే నాశము లేనిదనియు, నట్టినాశనము లేనిది, లేమి తెలియఁబడనిది, నిత్య మని చెప్పఁబడినదియు దేహియే యనియు నట్టి నిర్వికార మగు దేహికి నాశమును జేయుటకు నెవ్వడును సమర్థుఁడు గాఁడనియు దాత్పర్యము. ఇందు గమనింపవలసినవిషయము విపులము. ఇందు దేహియొక్క పరిమాణవిశేషమును స్వరూపవిశేషము సంఖ్యావిశేషము నిత్యానిత్యవస్తువిభేద

---

ఏవ మాత్మానాత్మనోః సదసతో రుభయో రపి దృష్ట ఉపలబ్ధోఽంతో నిర్ణయఃసత్సదేవాసదసదేవేతి త్వనయో ర్యథోక్తయో స్తత్త్వదర్శిభిః- తదితి సర్వనామ, సర్వంచ బ్రహ్మ, తస్య నామ తదితి, తద్భావ స్తత్త్వం, బ్రహ్మణో యాథాత్మ్యం, తత్ ద్రష్టుం శీలం యేషాం తే తత్త్వదర్శిన స్తై స్తత్త్వదర్శిభిః; త్వమపి తత్త్వదర్శినాం దృష్టిమాశ్రిత్య శోకం మోహంచ హిత్వా శీతోష్ణాదీని నియతానియతరూపాణి ద్వంద్వాని వికారోఽయ మసన్నేవ మరీచిజలవన్మిథ్యావభాసత ఇతి మనసి వినిశ్చిత్య తితిక్షస్వేత్యభిప్రాయః. 16

కింపున స్తద్య త్సదేవ సర్వదాఽస్తీ త్యుచ్యతే— అవినాశీతి. అవినాశి న వినష్టుం శీలమస్యేతి. తు శబ్దోఽసతో విశేషణార్థః; తద్విద్ధి విజానీహి. కిమ్? యేన సర్వ

మను విషయ మత్యంతము గణనీయంబులు. ఈ గీతమునందలి "తు" అను నవ్యయముచేఁ దెలియఁదగిన విశేష మొండు గలదు. "యేన" "తత్" అను సర్వనామములతో నీయవ్యయమును బొందికచేసినచో నీపరిదృశ్యమానంబగు జగంబునంతయు వ్యాపించి యుండునది యొక్కటి దప్ప రెండవది లేదనియు, నది యొక్కటియే నాశరహితమనియు, దద్విలక్షణము లన్నియు నశ్వరంబులుగాఁ దెలియవచ్చుటచే మిథ్య యనియును, మహత్పరిమాణము కంటె భిన్నపరిమాణంబులగు నణుమధ్యమపరిమాణంబులతో నొప్పెడు వస్తువిశేషము లన్నియు నాశనమునొందునవే యనియు, ప్రకరణ సందర్భముచే సచ్ఛబ్దవాచ్య మగు దేహి నిత్య మని ప్రబోధింపఁబడుటచే నాదేహి యవశ్యము సర్వవ్యాపక మగుచు నద్వితీయుండనియు నీదేహి యవ్యయుం డని చెప్పఁబడుటచే మార్పుల కవకాశము నిచ్చు దేహధర్మములగు నవయవములు గాని గుణములుగాని క్రియలుగాని దేహికిఁ దెలియఁబడ వనియు దెలియవచ్చెడిని. ఇట్టి సదాఖ్యమగు దేహియే శ్రుతిస్మృతులయందు జెప్పఁబడిన బ్రహ్మశబ్దవాచ్యుఁ డనియు లభించుచున్నది. దేహియే బ్రహ్మశబ్దవాచ్యుఁ డని యుపదేశించుటకు శ్రీవిద్యాశంకరభగవత్పాదులు "సదాఖ్యేన బ్రహ్మణా" "సదాఖ్యం బ్రహ్మ" యని వ్యక్తీకరించియున్నారు. ఇట్టి శ్రీకృష్ణభగవదుపదిష్టమగు రహస్యముచే నణుపరిమాణవిశిష్ట మగు ద్రవ్యములు నిత్యములను నైయాయికవాదములు, సర్వవ్యాపకములగు నాత్మల నుపపాదించు సాంఖ్యాదివాదములు, మధ్యమపరిమాణము నాత్మకు నుపపాదించు జైనాదివాదములు, అణుపరిమాణము నాత్మకుఁ దలఁచు నాంతరాళాదివాదములు హేయములుగ నిరసింపఁబడుచున్నవి. 17

---

మిదం జగత్తతం వ్యాప్తం సదాఖ్యేన బ్రహ్మణా, సాకాశమ్ ఆకాశేనేవ ఘటాదయః వినాశ మదర్శన మభావ మవ్యయస్య న వ్యేతి; ఉపచయాపచయౌ న యాతీత్యవ్యయం, తస్యావ్యయస్య; నైత త్సదాఖ్యం బ్రహ్మ స్వేనరూపేణ వ్యేతి వ్యభిచరతి నిరవయవత్వా ద్దేహాదివత్. నాప్యాత్మీయేనాత్మీయాభావా ద్యథా దేవదత్తో ధనహాన్యా వ్యేతి. న త్వేవం బ్రహ్మ వ్యేతి. అతోఽవ్యయ స్యాస్య బ్రహ్మణో వినాశం న కశ్చి త్కర్తు మర్హతి నకశ్చిదాత్మానం వినాశయితుం శక్నోతీశ్వరోఽపి; ఆత్మాహి బ్రహ్మ స్వాత్మని చ క్రియావిరోధాత్. 17

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. 18

---

టీ:—నిత్యస్య - త్రికాలాబాధ్యమగునట్టియు, అనాశినః - కూటమువలె నిర్వికారమగునట్టియు, అప్రమేయస్య - ప్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియఁబడనట్టి, శరీరిణః - దేహియొక్క, ఇమే-ఈపరిదృశ్యమానములగు, దేహాః-దేహములు, అంతవంతః-వినాశమును బొందునవని, ఉక్తాః - చెప్పఁబడినవి. తస్మాత్ -ఆకారణమువలన భారత! - అర్జునా! యుధ్యస్వ - యుద్ధమునుండి యుపరమమును జెందకుమా! 18

తా:—తత్త్వదర్శుల నిర్ణయపురస్సరంబుగ శ్రీకృష్ణభగవానులు "నత్వేవాహం జాతు నాసం" అను గీతము మొదలు "అవినాశితు తద్విద్ధి" అను గీతమువఱకును గల యారుగీతములచే నుపదేశించిన రహస్యము నర్జునునియొక్క సుఖబోధకొఱకు సంక్షేపముగ నీగీతముచే నుపదేశింపుచున్నారు. ఇచట "నిత్యము" "అవినాశి" యను శబ్దము లేకార్థబోధకము లగుటచేఁ బునరుక్తి యని యెంచఁగూడదు. ఏలయన లోకములో నిత్యము రెండువిధములు; నాశము రెండువిధములు. ఎట్లన దేహము భస్మీభూతమై యగుపడనప్పుడు లేక వ్యాధ్యాదులచేఁ గృశించినపుడును గూడ నష్టమైనదని చెప్పఁబడుచున్నది. ఇట్టి రెండువిధములగు నాశమును దేహికి లేదని యభిప్రాయము. దానంజేసి దేహి కూటస్థనిర్వికారుఁడను నభిప్రాయము సువ్యక్తమగుచున్నది. అప్రమేయ మనఁ బ్రత్యక్షాదిప్రమాణములకుఁ దెలియఁబడనివాఁ డని యభిప్రాయము. ప్రత్యక్షాదులకుఁ దెలియఁబడనివాఁ డనఁ బ్రత్యక్షమునకుఁ దెలియవచ్చెడి శబ్దస్పర్శరూపరసగంధాదిగుణములు దేహియందు లేవని యభిప్రాయము. శబ్దస్పర్శాదులు గుణములు. గుణములు లేవనినచో నిర్గుణమని యభిప్రాయము. ఎయ్యది నిర్గుణమో యయ్యది నిరవయవముగూడ గావున నిచట దేహి నిత్యము నిరవయవము నిర్గుణము నిష్క్రియ మని చెప్పఁబడుచున్నది. అవినాశి సర్వవ్యాపకమై యుండవలయు నను నియమముచే దేహి యనంత మని సుస్పష్టమగుచున్నది. దేహాదులకు సాక్షి యగుటచేజ్ఞానస్వరూపమని తెలియఁబడుచున్నది.

---

కింపున స్తదసద్యత్వాత్మసత్తాం వ్యభిచరతీత్యుచ్యతే — అంతవంతఇతి. అన్తవంతోఽన్తో వినాశో విద్యతే యేషాం తేఽన్తవంతః, యథా మృగతృష్ణికాదౌ సద్బుద్ధి రనువృత్తా ప్రమాణనిరూపణాంతే విచ్ఛిద్యతే స తస్యా అన్త స్తథేమే దేహాః స్వప్నమాయాదేహాదివచ్చాన్తవంతో నిత్యస్య శరీరిణః; శరీరవతోఽనాశినోఽప్రమేయస్యాత్మనోఽన్తవంత ఇత్యుక్తా వివేకిభి రిత్యర్థః. నిత్యస్యానాశిన ఇతి న పునరుక్తం నిత్యత్వస్య ద్వివిధత్వా ల్లోకే నాశస్యచ, యథా దేహో భస్మీ

సంక్షేపముగ దేహిలక్షణ మిచట శ్రీకృష్ణభగవానులచే "సత్యజ్ఞానానంతనిరవయవ నిర్గుణ నిష్క్రియం" బని గూఢముగ నిర్వచింపఁబడుచున్నది.

"నత్వేవాహం" అను గీతమున "ఇమే జనాధిపాః" అను పదముల కనువగునటుల నిచట "ఇమే దేహాః" యని యుచ్చరింపఁబడుచున్నది. దానంజేసి "అహాం" "త్వం" "ఇమే" అను వ్యవహారము దేహికి దేహముల సంబంధముచేఁ గల్గినదిగాని వాస్తవముగాదని సూచింపఁబడుచున్నది. ఇఁక దేహము లంతవంతము లనుటలో రజ్జుసర్పాదు లెట్టి యంతమును బ్రమాణనిరూపణానంతరమునఁ బొందుచున్నవో యట్టినాశ మని "నాసతో విద్యతేభావః" అను తత్త్వదర్శుల నిర్ణయముచేఁ దెలియవచ్చుచున్నది. ఇఁక నిచట "శరీరిణః" అను నేకవచనప్రయోగముచేతను, "దేహాః" అను బహువచనప్రయోగముచేతను దేహియొక్క యేకత్వము దేహనానాత్వము, అట్టిదేహము లంతవంతము లనుటచే దేహములమిథ్యాత్వమును, సువ్యక్త మగుచున్నవి. ఇయ్యది పై గీతమందలి సారాంశ మనుటకు "ఉక్తాః" అనుపదము సాక్ష్యమిచ్చుచున్నది. శ్రీకృష్ణభగవాను లిచట నుపదేశింపఁదలచిన సాంఖ్య మనెడి దేహిదేహతత్త్వ మింతటితోఁ బుష్కలముగా నుపదేశింపఁబడినట్లు సర్వవిధముల నిర్ధారణ చేయవచ్చును. ఇచట నుపదేశింపఁబడిన సాంఖ్యమును సంక్షేపంబుగ నిర్వచించినచో నయ్యది "దేహి సత్యము, దేహములు మిథ్య" యని నిర్వచింపనగును.

ఇంతవఱకును శ్రీకృష్ణభగవాను లుపదేశించిన సాంఖ్యము నొకింత శ్రుతిస్మృతులలోఁ జేర్చి విచారించుట జిజ్ఞాసువులకుఁ బరమప్రయోజనమును గల్గించును గావున నట్టి శ్రుతిస్మృతివిచారము నొకింత నిరూపించెదము.

శ్రీకృష్ణభగవాను లుపదేశించిన దేహియొక్కలక్షణము "సత్యజ్ఞానానంతనిరవయవ నిర్గుణ నిష్క్రియ" మని. ఇందు నిరవయవ నిర్గుణ నిష్క్రియపదము లనంతశబ్దార్థవిశేషణములే యనియుఁగూడ నిరూపణ చేయఁబడనగునుగాని జిజ్ఞాసు

భూతోఽదర్శనం గతో నష్ట ఉచ్యతే, విద్యమానోఽప్యన్యథా పరిణతో వ్యాధ్యాదియుక్తో జాతో నష్ట ఉచ్యతే. తత్రానాశినో నిత్యస్యేతి ద్వివిధేనాపి నాశేనాసంబన్ధోఽస్యేత్యర్థః; అన్యథా పృథివ్యాదివదపి నిత్యత్వం స్యా దాత్మన స్తన్మాభూదితి నిత్యస్యానాశిన ఇత్యాహ. అప్రమేయస్య న ప్రమేయస్య ప్రత్యక్షాది ప్రమాణైః రపరిచ్ఛేద్య స్యేత్యర్థః.

వుల సుఖబోధకొఱకు నిరూపింపఁబడెను. ప్రకృతమున నీ సాంఖ్యయోగమునం దయు లెన్సగాఁ దిలకించిన నిందు దేహిస్వరూప మొక్కటియే నిరూపింపబడినటు లను, ఆదేహిని సచ్ఛబ్దవాచ్యునిగాఁ జెప్పినట్లును సుస్పష్ట మగుచున్నది. అంతకుదక్క వేఱొక విషయ మిందు శబ్దభేదముచేఁగాని యర్థభేదముచేఁగాని యుపదేశింపఁబడినట్లు తెలియరాదు. దేహినే యాత్మగాఁ దలంచుటచే "ఆత్మా వాఽరేద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" "య ఆత్మా అపహతపాప్మా సోఽన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః" అని జిజ్ఞాస్యముగా విధింపఁబడిన యాత్మస్వరూపము తత్త్వదర్శుల నిర్ణయపురస్సరముగ బోధింపఁబడినట్లు నిర్ణయము చేయ వచ్చును. ఇచట దేహి సచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁబడుచుండుటచే నాత్మకూడ సచ్ఛబ్దవాచ్యమే యగుచున్నది. ఇక సచ్ఛబ్దముచే శ్రుతియందు బోధింపఁ బడిన విషయము ఛాందోగ్యోపనిషత్ షష్ఠప్రపాఠకమువలన స్పష్ట మగుచున్నది. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్. ఏకమే వాద్వితీయమ్" అను స్థలమున సజాతీయవిజా తీయస్వగతభేదరహితమగు సత్పదార్థ మీ పరిదృశ్యమానమును, నామరూపవ్యా కృతమును, అనేక కర్తృభోక్తృసంయుక్తమును, ప్రతినియత దేశకాల నిమిత్తక్రియా ఫలాశ్రయము నగు జగంబునకుఁ గారణంబుగ వర్ణింపబడియున్నది. తైత్తిరీ యక శ్రుతియందు జగంబునకుఁ గారణంబు బ్రహ్మయని నిరూపింపఁబడియున్నది. దానంజేసి "బ్రహ్మ, సత్" శబ్దములు స్వరూపముచే భిన్నములుగాఁ గన్పట్టు చున్నను అర్థముచే జగత్కారణమును బోధించుటవలనఁ బర్యాయములుగాఁ బరిగణింపఁబడుచున్నవి. ఇఁక ప్రకృతమున నుపదేశింపఁబడిన దేహి సచ్ఛబ్దవాచ్య మయినచో జగత్కారణమగు బ్రహ్మమా లేక యర్థాంతరమా యను సందియము గలుగును. అట్టి సందేహనివృత్తి లక్షణవిచారముచేఁ దక్క వేఱొక విధమునఁ జేయఁబడదు. ఇఁక లక్షణనిర్ణయ మన్ననో బ్రహ్మలక్షణము "బ్రహ్మవిదాప్నోతి పరమ్" మ్మను సూత్రభూతమగు శ్రుతియొక్క వ్యాఖ్యానరూపం బగు ఋక్కున

---

న వ్యాగమేనాత్మా పరిచ్ఛిద్యతే ప్రత్యక్షాదినా చ పూర్వమ్ న, ఆత్మన స్స్వతస్సిద్ధత్వాత్; సిద్ధే హ్యాత్మని ప్రమాతరి ప్రమిత్సోః ప్రమాణాన్వేషణా భవతి; నహి పూర్వ మిత్థ మహ మిత్యాత్మానం ప్రమాయ పశ్చాత్ప్రమేయపరి చ్ఛేదాయ ప్రవర్తతే; నహ్యాత్మానామ కస్యచి దప్రసిద్ధో భవతి; శాస్త్రంత్వ న్త్యం ప్రమాణ మతద్ధర్మారోపణమాత్రనివర్తకత్వేన ప్రామాణ్య మాత్మనః ప్రతి

“సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ” యను వాక్యమును బ్రకృతమున శ్రీకృష్ణభగవాను
లచే నుపదేశింపఁబడిన దేహిలక్షణమును విమర్శించుటచే సుకరమగును. ప్రకృత
మున దేహికి లక్షణముగూడ “సత్యం జ్ఞాన మనంత”మ్మని ఫలించుటచే నీదేహి
శబ్దము బ్రహ్మపర్యాయపదముగా లక్షణవిదులచే దెలియనగును. ఇఁక భగవ
ద్బాదరాయణమహర్షి ప్రణీతం బగు వేదాంతమీమాంసయందు బ్రహ్మము జగ
త్కారణ మనియు నద్దాని గుర్తెఱింగినచో బరమప్రయోజనంబును బురుషుండు
బొందు ననియు గొప్పయాశయము సువ్యక్త మగుచున్నది. మహాఫలము నొసంగు
నని శ్రుతిస్మృతులు వక్కాణించు బ్రహ్మయొక్క లక్షణమునే దేహికి బోధించుట
చేతను, అట్టి దేహిని ఛాందోగ్యశ్రుతి ప్రతిపాద్యంబగు సచ్ఛబ్దముచేఁ బరా
మర్శ చేయుటచేతను దేహి యొక్కండు దక్క దదితర మంతయు నసచ్ఛ
బ్దముచేఁ బరామర్శ చేయఁబడి యయ్యది భావము తెలియఁబడని విషయ
మని తత్త్వదర్శుల సమ్మతిపురస్సరంబుగ నిరూపించుటచేతను రెండవయధ్యా
యాంత్యగీతమున ఫలమును బ్రదర్శించుటలో నీ దేహి స్వభావమును బ్రాహ్మీస్థితి
యని పరామర్శ చేసి యట్టి బ్రహ్మసంబంధమగు స్థితిని బొందువాఁడు బ్రహ్మనిర్వా
ణమును బొందు నని “బ్రహ్మవి దాప్నోతి పరమ్” అను శ్రుతిచే బోధింపఁబడు
మహాఫలమునే ఫలముగా వక్కాణించుటచేతను బ్రకృతమున శ్రీకృష్ణభగవాను
లచే నీరెండవయధ్యాయమున నుపదేశింపఁబడిన దేహియగు నాత్మ శ్రుతిస్మృతిపురా
ణేతిహాసబోధితమగు బ్రహ్మయే యని సర్వవిధముల సుస్పష్టమగుచున్నది. దేహ
ములు మిథ్యయనుటలో జగంబు మిథ్య యను నాశయము సువ్యక్త మగుచున్నది.
దానిచే “అశోచ్యా నన్వశోచ స్త్వమ్” అను గీత మొదలు ‘అంతవంత ఇమే దేహాః’
అను గీతతోఁ గలిసిన నెనిమిదిగీతలచేతను శ్రీకృష్ణభగవానులచే నర్జునున కుపదేశింప

---

పద్యతే; న త్వజ్ఞాతార్థజ్ఞాపకత్వేన; తథాచ శ్రుతిః “యత్సాక్షా దపరోక్షా
ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః” (బృ. 3-4-1) ఇతి.

యస్మాదేవం నిత్యోఽవిక్రియ శ్చాత్మా తస్మా ద్యుధ్యస్వ యుద్ధా దుప
రమం మాకార్షీ రిత్యర్థః. నహ్యత్ర యుద్ధకర్తవ్యతా విధీయతే; యుద్ధే ప్రవృత్త
ఏవ హ్యసౌ శోకమోహప్రతిబద్ధ స్తూష్ణీ మాస్తే; అత స్తస్య కర్తవ్యప్రతిబంధా
పనయనమాత్రం భగవతా క్రియతే; తస్మా ద్యుధ్యస్వే త్యనువాదమాత్రం న
విధిః.

> య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
> ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే. 19

---

బడిన తత్త్వము గ్రంథకోటులచే నుపదేశింపఁబడిన మహాతత్త్వముదక్క వేఱొండు గాదని

"శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః."
అను తత్త్వదర్శులగీతమునుండి గ్రహింపనగును.

ఇంతవఱకు దేలిన సారాంశ మేమన- "గీతాశాస్త్రమున నుపదేశింపఁబడిన దేహి శరీరి సచ్ఛబ్దములు పర్యాయపదములనియు లక్షణపరామర్శచే నియ్యవి బ్రహ్మశబ్దమునకుఁ బర్యాయపదములుగా వర్తిల్లుచుండుటచే నీనాలుగుశబ్దములచే నొకే పదార్థము తెలియవచ్చుననియు నట్టిపదార్థము సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమును సత్యజ్ఞానానంతమును, నిరవయ నిర్గుణ నిష్క్రియము ననియు దద్భిన్నమగు నామరూప ప్రపంచమంతయు మిథ్యయనియు నిట్టిజ్ఞానముచే బురుషుఁ డఖండబ్రహ్మభావము నంది నిరతిశయనిశ్శ్రేయసమును బడయుననియు."

ఈ గీతాంతమున గన్పట్టెడు "యుధ్యస్వ" యనునది యుద్ధముయొక్క కర్తవ్యతను బోధించువిధిగాక పైన వివరింపఁబడిన "ఉత్తిష్ఠ" యనుదానివలె బ్రకృతమున వర్తించియుండు యుద్ధమును జేయుటకు గల్గిన ప్రతిబంధమును దొలగించుటమాత్రమే ప్రయోజనముగాగల యనువాదమాత్రము. 18

టీ:—యః - ఎవఁడు, ఏనం - ఈ ప్రకృతపుదేహిని, హంతారం - హనన క్రియకుఁ గర్తగాను, యశ్చ - ఎవ్వఁడైతే, ఏనం - ఈదేహిని, హతమ్ - హనన క్రియకుఁ గర్మగాను, మన్యతే - తలఁచునో, తౌ - అట్లుతలఁచు, ఉభౌ - ఇద్దరును, న విజానీతః - ఆత్మను గుర్తెఱింగినవారలు కారు. ఏలనన, అయం - ఈ దేహి, న హంతి - హననక్రియకు గర్త కాడు, న హన్యతే - హననక్రియకుఁ గర్మ కాడు.

తా:—ప్రకృతమున వినఁబడు హననక్రియావిశేషమునుండి క్రియాసామాన్యమును గ్రహించినచో నీదేహి యెట్టిక్రియకును, గర్తగాని కర్మగాని కాఁడని

---

శోకమోహాదిసంసారకారణనివృత్త్యర్థం గీతాశాస్త్రం న ప్రవర్తక మిత్యేతస్యార్థస్య సాక్షిభూతే ఋచావానినాయ భగవాన్ యత్తు మన్యసే యుద్ధే భీష్మాదయో । మయా హన్యన్తేఽహమేవ । తేషాం హన్తేత్యేషా బుద్ధి ర్మృషైవ తే. కథమ్ ? య ఏన మితి. య ఏనం ప్రకృతం దేహినం వేత్తి జానాతి హంతారం హననక్రియాయాః కర్తారం యశ్చైన మన్యో మన్యతే, హతం దేహహననేన

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. 20

---

తెలియవచ్చుచున్నది. దీనినిబట్టి దేహికి కర్తృభావముగాని కర్మభావముగాని లేదని వినిపించుచున్నది. కర్తృకర్మభావములతో సంబంధింపని వికార మెద్దియును లోకమునఁ దెలియఁబడకపోవుటచేఁ గర్తృకర్మభావములే ముఖ్యవికారములు. అట్టి వికారములు దేహికిఁ దెలియఁబడవనిన దేహి నిర్వికారుఁడును నిష్క్రియుఁడునని తేటతెల్లమగుచున్నది. దీనినిబట్టి దేహి కర్తయు భోక్తయు గాఁడని సుస్పష్టము. దానంజేసి దేహి కర్తయు భోక్తయు ననునైయాయికవాదము కర్తగానట్టి కేవల భోక్త యను కాపిలసాంఖ్యవాదమును నిరసింపబడుచున్నవి. 19

టీ:—అయం - ఈయాత్మ, కదాచిత్ - ఒకానొకప్పుడును, నజాయతే-పుట్టదు; కదాచిత్ - ఒకానొకప్పుడైనను, నమ్రియతేవా - చావదు, వాశబ్దము సముచ్చయార్థబోధకము. అయం - ఈయాత్మ, భూత్వా - పుట్టి, భూయః - పిమ్మట, అభవితా - చచ్చునది, న - కాదు. అయమ్ - ఈయాత్మ, నభూత్వా - ఇదివఱకు లేకుండి, భూయః - తిరిగి, భవితా - పుట్టునది, న - కాదు. అయం - ఈయాత్మ, అజః - పుట్టుక లేనిది, నిత్యః - చావులేనిది. శాశ్వతః - అపక్షయములేనిది, పురాణః - వృద్ధిలేనిది, శరీరే - దేహము, హన్యమానేఽపి - వికారములను జెందుచున్నను, న హన్యతే - పరిణామముఁ జెందదు. ఇచ్చట హనధాతువు పరిణామార్థకము. 20

---

హతోఽహ మితి హననక్రియాయాః కర్మభూతం, తా వుభౌ న విజానీతో నజ్ఞాతవన్తా వవివేకే నాత్మానమ్. హంతాహం హతోస్మ్యహ మితి దేహహననే నాత్మాన మహంప్రత్యయవిషయం యో విజానీత స్తా వాత్మస్వరూపానభిజ్ఞా విత్యర్థః. యస్మా న్నాయ మాత్మా హంతి న హననక్రియాయాః కర్తా భవతి, నహన్యతే నచ కర్మ భవతీత్యర్థః, అవిక్రియత్వాత్. 19

కథ మవిక్రియ ఆత్మేతి ద్వితీయో మంత్రః— నజాయత ఇతి. నజాయతే నోత్పద్యతే, జనిలక్షణా వస్తువిక్రియా నాత్మనో విద్యత ఇత్యర్థః. న మ్రియతేవా, వాశబ్ద శ్చార్థే నమ్రియతేచే త్యన్త్యా వినాశలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే. కదాచిచ్ఛబ్దః సర్వవిక్రియాప్రతిషేధైః సంబధ్యతే నకదాచి జ్జాయతే నకదాచిన్మ్రియత ఇత్యేవమ్. యస్మా దయ మాత్మా భూత్వా భవనక్రియా మనుభూయ పశ్చా దభవితాఽభావం గంతా న భూయః పున స్తస్మాన్న మ్రియతే. యోహి

తా:—ఒకానొకప్పుడు లేక మఱియొకప్పుడు గల్గునది పుట్టెననియు, ఒకా నొకప్పు డుండి మఱి యొకప్పుడు లేకుండునది చచ్చెననియు, లోకమునఁ జెప్పఁ బడును. ఇట్టి స్వభావము దేహమునకు సుప్రసిద్ధముగాఁ దెలియవచ్చెడిని. ఒకా నొకప్పుడు తెలియఁబడని దేహము గల్గుటచేఁ బుట్టెననియు, నొకా నొకప్పుడు తెలియఁబడిన దేహము మఱి యొకప్పుడు తెలియఁబడకుండుటచే జచ్చెననియు లోకము గ్రహించుచున్నది. ఇట్టి దేహధర్మము దేహికిఁ దెలియబడకుండుటచే దేహికి పుట్టుక మొదలుగాగల్గి చావు అంతముగాఁ గల్గిన "జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి" యను నారు వికారములును లేవని తాత్ప ర్యము. దానంజేసి శరీరము కొట్టబడినను శరీరి కొట్టఁబడడు. శరీరములు వికార ములఁ జెందుచున్నను శరీరి నిర్వికారముగ నిలిచియుండునట్టివాఁడు, పుట్టుక లేని వాఁడు, త్రికాలాబాధ్యుఁడు, శాశ్వతుఁడు, పురాణుఁడును.

శ్రీకృష్ణభగవానులు తత్త్వదర్శుల సిద్ధాన్తపురస్సరంబుగ నుపదేశించిన తత్త్వము తన యొక్క గాని తత్త్వదర్శు లనువారలయొక్క గాని స్వకపోలకల్పి తముగాక నుపనిషత్సమ్మతమగు జ్ఞానమే యని తెలియఁజెప్పుటకై కఠోపనిషత్తు నందలి ఋక్కులను రెంటిని బై నుదహరించినారు.

శ్రీకృష్ణ భగవానులు తన యుపదేశమును శ్రుతిచేతను దత్త్వదర్శుల సిద్ధాన్తములచేతను బోషించుటచే శ్రుతిస్మృతులను బరమప్రమాణముగ నెంచు

---

భూత్వా న భవితా న మ్రియత ఇత్యుచ్యతే లోకే. వాశబ్దా న్నశబ్దా చ్చాయ మాత్మాఽభూత్వావా భవితా దేహవ న్నభూయః పున స్తస్మా న్న జాయతే. యో హ్యభూత్వా భవితా స జాయత ఇత్యుచ్యతే, నైవ మాత్మాఽతో న జాయతే. యస్మా దేవం తస్మా దజో, యస్మా న్నమ్రియతే తస్మా న్నిత్యశ్చ, యద్య ప్యాద్యం తయో ర్విక్రియయోః ప్రతిషేధే సర్వా విక్రియాః ప్రతిషిద్ధా భవన్తి, తథాపి మధ్యభావినీనాం విక్రియాణాం స్వశబ్దైరేవ తదర్థైః ప్రతిషేధః కర్తవ్య ఇత్యనుక్తా నామపి యౌవనాదిసమస్తవిక్రియాణాం ప్రతిషేధో యథాస్యా దిత్యాహ శాశ్వత ఇత్యాదినా. శాశ్వతఇ త్యపక్షయలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే శశ్వద్భవః శాశ్వతః. నాపక్షీయతే, స్వరూపేణ నిరవయవత్వాత్ నాపి గుణక్షయే ణాప క్షయః, నిర్గుణత్వాత్; అపక్షయవిపరీతాపి వృద్ధిలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్. 21

---

మహాపురుషుఁడని వేఱె వచింప నక్కరలేదు. శ్రీకృష్ణభగవానులు శ్రుతిస్మృతుల యం దెట్టి ప్రమాణమును గల్గియుండెనో యర్జునుండు కూడ నట్టిప్రమాణభావమును గల్గియున్నటుల "నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ" అనువాక్యమునందలి "అనుశుశ్రుమ" యనుపదముచే లెస్సగ దెలియవచ్చుచున్నది. శ్రుతి స్మృతులు భగవదాజ్ఞ యగుటచేఁ బరమప్రమాణము లని గీతాశాస్త్ర తాత్పర్యము. 20

టీ:—యః - ఏపురుషుఁడు, అవినాశినమ్ - అంత్యభావవికారమగు నాశనము లేనట్టియు, నిత్యం - కూటస్థమైనట్టియు, అజం - పుట్టుకలేనట్టియు, అవ్యయమ్ - అపక్షయము లేనట్టియు, ఏనం - ఈ దేహిని, వేద - తెలిసికొనుచున్నాఁడో, సః పురుషః - అట్టియాత్మజ్ఞాని యగు పురుషుఁడు, కం - ఎవనిని, కథమ్ - ఎట్లు, ఘాతయతి - చంపించును? అనఁ జంపుటకు బ్రేరేపణ చేయును? కమ్ - ఎవనిని, కథమ్ -

---

పురాణ ఇతి. యోహ్యవయవాగమే నోపచీయతే స వర్ధతేఽభినవ ఇతి-చోచ్యతే. అయం త్వాత్మా నిరవయవత్వా త్పురాపి నవ ఏవేతి, పురాణో న వర్ధత ఇత్యర్థః; తథా న హన్యతే న విపరిణమ్యతే, హన్యమానే విపరిణమ్యమానేఽపి శరీరే. హంతి రత్ర విపరిణామార్థో ద్రష్టవ్యోఽపునరుక్తతాయై న విపరిణమత ఇత్యర్థః. అస్మిన్మంత్రే షడ్భావవికారా లౌకికవస్తువిక్రియా ఆత్మని ప్రతిషిధ్యంతే. సర్వప్రకారవిక్రియారహిత ఆత్మా ఇతివాక్యార్థః. యస్మా దేవం తస్మాత్ "ఉభౌ తౌ న విజానీతః" (గీతా. 2-19) ఇతిపూర్వేణమంత్రేణాస్య సంబంధః. 20

"య ఏనం వేత్తి హంతార మి" త్యనేన మంత్రేణ హననక్రియాయాః కర్తా కర్మచ న భవతీతిప్రతిజ్ఞాయ "న జాయతే" (గీ. 2-20) ఇత్యనేనావిక్రియత్వే హేతు ముక్త్వా ప్రతిజ్ఞాతార్థ ముపసంహరతి వేదావినాశిన మితి. వేదవిజానా త్య వినాశిన మంత్యభావవికారరహితం నిత్యం విపరిణామరహితం యో వేదేతి సంబంధః; ఏనం పూర్వేణ మంత్రేణోక్తలక్షణ మజం జన్మరహిత మవ్యయ మపక్షయరహితం కథం కేన ప్రకారేణ స విద్వాన్ పురుషోఽధికృతో హంతి హననక్రియాం కరోతి! కథం వా ఘాతయతి హంతారం ప్రయోజయతి! నకథంచి త్కంచి ద్ధంతి న కథంచి త్కంచిత్ ఘాతయతీత్యుభయత్రాక్షేప ఏవార్థః, ప్రశ్నార్థాసంభవాత్. హేత్వర్థ స్యావిక్రియత్వస్య తుల్యత్వా ద్విదుషః సర్వకర్మప్రతిషేధ ఏవ ప్రకరణార్థోఽభిప్రేతో భగవతః.

ఎట్లు ? హంతి - చంపును, అనగా హననక్రియకు గర్తయగును? ఇచట కింశబ్ద మాక్షే పార్థకముగాని ప్రశ్నార్థక మెంతమాత్రముగాదు. 21

తా:–షడ్భావ వికారరహితమును సర్వవ్యాపకము నగు నాత్మను గుర్తెఱింగినవాఁడు తనకంటె రెండవవస్తువును దెలిసికొనుట కవకాశ మెంతమాత్రము లేక పోవుటచేఁ బ్రేరేపణ చేయుటకుగాని చంపుటకుగాని యెట్లు వర్తింపఁగలఁడను నాక్షేపార్థమువలన నొక కర్మను దాను స్వయముగా నాచరించుటగాని మఱియొకరిని ప్రేరేపణచేయుటగాని యసమంజసమని తాత్పర్యము. అనగా నిట్టి యాత్మను దెలిసికొనఁ వానికి కర్తృత్వకారయితృత్వములు స్వాభావికముగ నస్తమించునని యభిప్రాయము. ప్రకృతపు హననక్రియావిశేషమునుండి క్రియాసామాన్యమును

హంతేస్త్వాక్షేప ఉదాహరణార్థత్వేన కథితః. విదుషః కం కర్మాసంభవే హేతువిశేషం పశ్యన్ కర్మా ణ్యాక్షిపతి భగవాన్. కథం? స పురుష ఇతి. నను క్త ఏ వాత్మనోఽవిక్రియత్వంసర్వకర్మాసంభవకారణవిశేషః సత్య ముక్తో నతు సకారణవిశేషోఽన్య త్వా ద్విదుషోఽవిక్రియా దాత్మనః. న హ్యవిక్రియం స్థాణుం విదితవతః కర్మ న సంభవతీతిచే న్న, విదుష ఆత్మత్వా న్న దేహాదిసంఘస్య విద్వత్తా; అతః పారిశేష్యా దసంహత ఆత్మా విద్వా నవిక్రియ ఇతి; తస్య విదుషః కర్మాసంభవా దాక్షేపో యుక్తః కథం స పురుష ఇతి; యథా బుద్ధ్యాద్యాహృత శబ్దాద్యర్థస్యావిక్రియ ఏవసన్ బుద్ధివృత్త్యవివేకవిజ్ఞానే నావిద్యయోపలబ్ధాఽఽత్మా కల్ప్యతే. ఏవమే వాత్మానాత్మవివేకజ్ఞానేన బుద్ధివృత్త్యా విద్యయాఽసత్యరూపయైవ పరమార్థతో ఽవిక్రియఏ వాత్మా విద్వా నుచ్యతే; విదుషః కర్మాసంభవవచనా ద్యాని కర్మాణి శాస్త్రేణ విధీయంతే తా న్యవిదుషో విహితానీతి భగవతో నిశ్చయోఽవగమ్యతే.

నను విద్యా ప్యవిదుషఏవ విధీయతే, విదితవిద్యస్య పిష్టపేషణవ ద్విద్యావిధానానర్థక్యాత్ ; తత్రావిదుషః కర్మాణి విధీయన్తే న విదుష ఇతి విశేషో నోపపద్యత ఇతిచే న్న, అనుష్ఠేయస్య భావాభావవిశేషోపపత్తేః, అగ్నిహోత్రాది విధ్యర్థజ్ఞానోత్తరకాల మగ్నిహోత్రాదికర్మానేకసాధనోపసంహారపూర్వక మనుష్ఠేయం కర్తాఽహం 'మమ కర్తవ్య' మి త్యేవంప్రకారవిజ్ఞానవతోఽవిదుషో యథానుష్ఠేయం భవతి నతు తథా న జాయత ఇత్యాద్యాత్మస్వరూపవిధ్యర్థజ్ఞానోత్తరకాలభావి కించి దనుష్ఠేయం భవతి; కింతు నాహం కర్తా నాహం భోక్తే త్యాద్యా

గ్రహించినచో నిట్టి యాత్మజ్ఞాని కర్తృత్వకారయితృత్వము లనువికారములఁ
బొందక యుత్కృష్టతమంబగు నివృత్తిని బొందు నని సిద్ధాన్తము. కర్తృత్వకార
యితృత్వములలో సకలక్రియ లంతర్భావముఁ జెందును. దానంజేసి యాత్మజ్ఞానికి
సర్వక్రియానివృత్తి గలుగునని బుధులు స్వానుభవపూర్వకముగ బోధించిన తత్త్వ
మునే శ్రీకృష్ణభగవాను లిచట గ్రంథోక్తిగ నిర్వచింపుచున్నారు. దీనింబట్టి యాత్మ
జ్ఞానికి సర్వకర్మసంన్యాసము ఘటించుంగాని కర్మ యొంతమాత్రమును ఘటింపదని
సుస్పష్టముగ దెలియవచ్చుచున్నది. ఇట్టి యాత్మను దెలియనివానికి గర్తృత్వకార
యితృత్వములు నివృత్తిఁ జెందవు

---

త్త్మైకత్వాకర్తృత్వాదివిషయజ్ఞానా దన్య న్నోత్పద్యత ఇత్యేషవిశేష ఉపపద్యతే.
యః పునః కర్తాఽహ మితి వేత్త్యాత్మానం తస్య మమేదం కర్తవ్య మి త్యవశ్యంభావి
నీ బుద్ధిస్స్యా త్తదపేక్షయా సోఽధిక్రియత ఇతి తంప్రతి కర్మాణి సంభవంతి; సచావి
ద్వాన్ ఉభౌ తౌ నవిజానీత ఇతివచనాత్, విశేషితస్యచ విదుషః కర్మాక్షేపవచ
నాచ్చ కథం సపురుష ఇతి. తస్మా ద్విశేషితస్యావిక్రియాత్మదర్శినో విదుషో ముము
క్షోశ్చ సర్వకర్మసంన్యాసఏవాధికారః. అతఏవ భగవా న్నారాయణః సాంఖ్యాన్వి
దుషోఽవిదుషశ్చ కర్మిణః ప్రవిభజ్య ద్వే నిష్ఠే గ్రాహయతి "జ్ఞానయోగేన సాం
ఖ్యానాం కర్మయోగేన యోగినా" మితి (గీ. 3-3). తథాచ పుత్రాయాహ భగవా
న్వ్యాసః "ద్వా విమా వథ పంథానా" (మహాభా. శాం. 240-6) ఇత్యాది. తథాచ
క్రియాపథశ్చైవ పురస్తా త్పశ్చా త్సంన్యాసశ్చేతి. ఏతమేవ విభాగం పునఃపున
ర్దర్శయిష్యతి భగవాన్; అతత్త్వవిత్ "అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి
మన్యతే" (గీ-3-27); తత్త్వవిత్తు "నాహం కరోమీ"తి. తథాచ "సర్వకర్మాణి
మనసా సంన్యస్యాస్తే" (గీ-5-13) ఇత్యాది.

అత్ర కేచిత్పండితంమన్యా వదంతి — జన్మాదిషడ్భావవిక్రియారహితోఽవిక్రి
యోఽకర్తైకోఽహ మాత్మేతి, న కస్యచిత్ జ్ఞాన ముత్పద్యతే యస్మిన్ సతి సర్వ
కర్మసంన్యాస ఉపదిశ్యత ఇతి; తన్న, "న జాయతే" ఇత్యాదిశాస్త్రోపదేశా
నర్థక్యాత్; యథాచ శాస్త్రోపదేశసామర్థ్యా ద్ధర్మాస్తిత్వవిజ్ఞానం కర్తుశ్చ దేహాం
తరసంబంధివిజ్ఞానం చోత్పద్యతే, తథా శాస్త్రా త్తస్యైవాత్మనోఽవిక్రియత్వాకర్తృ
త్వైకత్వాదివిజ్ఞానం కస్మాన్నోత్పద్యత ఇతిప్రష్టవ్యా స్తే. కారణగోచరత్వా దితిచే
న్న, "మనసై వానుద్రష్టవ్య" మితిశ్రుతేః (బృ-4-4-19); శాస్త్రాచార్యోపదేశశమ

ఇఁక నీ గీతమునుండి యాత్మజ్ఞానిని గుర్తెఱుంగు విధముగూడ నొకింత గ్రహింపనగును. ఆత్మజ్ఞానికి కర్తృత్వకారయితృత్వములు నివృత్తిఁజెంద సర్వకర్మ సంన్యాసము ఘటించునని పైనఁ జెప్పఁబడియె. దానంజేసి యెవ్వనికి గర్తృత్వకార యితృత్వములు నివృత్తిఁజెంది సర్వకర్మసంన్యాసము ఘటింపదో యట్టివాని కాత్మజ్ఞాన మలవడలేదని నిర్ణయము. ఇట్టి యాశయమును శ్రీవిద్యాశంకరభగవత్పాదు లిట్లు నిర్వచించియున్నారు - "యస్యతు యథాపూర్వం సంసారిత్వం నాసావవగత బ్రహ్మాత్మభావ ఇత్యనవద్యమ్". సురేశ్వరాచార్యులవారుగూడ నిట్లు వివరించియున్నారు:—

"రాగో లింగ మబోధస్య చిత్తవ్యాయామభూమిషు,
కుతః స్యాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః."

దమాదిసంస్కృతం మన ఆత్మదర్శనే కరణమ్. తథాచ తదధిగమాయానుమానే ఆగమేచ సతి జ్ఞానం నోత్పద్యత ఇతిసాహస మేతత్; జ్ఞానం చోత్పద్యమానం తద్విపరీత మజ్ఞాన మవశ్యం బాధత ఇత్యభ్యుపగంతవ్యమ్; తచ్చాజ్ఞానం దర్శితం 'హంతాహం' 'హతోస్మీ'తి 'ఉభౌ తౌ న విజానీత' ఇతి. తత్ర చాత్మనో హననక్రియాయాః కర్తృత్వం కర్మత్వం హేతుకర్తృత్వం చాజ్ఞానకృతం దర్శితమ్. తచ్చ సర్వక్రియాస్వపి సమానం, కర్తృత్వాదే రవిద్యాకృతత్వ మవిక్రియత్వా దాత్మనః; విక్రియావాన్హి కర్తాఽఽత్మనః కర్మభూత మన్యం ప్రయోజయతి కుర్వితి. తదేత దవిశేషేణ విదుషః సర్వక్రియాసు కర్తృత్వం హేతుకర్తృత్వంచ ప్రతిషేధతి భగవాన్ వాసుదేవః. విదుషః కర్మాధికారాభావప్రదర్శనార్థం 'వేదావినాశినం... కథం స పురుష' ఇత్యాదినా క్వ పున ర్విదుషోఽధికార ఇత్యేతదుక్తం పూర్వమేవ "జ్ఞానయోగేన సాంఖ్యానా" మితి. తథాచ సర్వకర్మసంన్యాసం వక్ష్యతి "సర్వకర్మాణి మనసా" (గీ-5-13) ఇత్యాదినా.

నను మనసేతివచనా న్నవాచికానాం కాయికానాంచ సంన్యాస ఇతిచే న్న, సర్వకర్మాణీతివిశేషితత్వాత్, మానసానా మేవ సర్వకర్మణా మితిచే న్న, మనోవ్యాపారపూర్వకత్వా ద్వాక్కాయవ్యాపారాణామ్; మనోవ్యాపారాభావే తదనుపపత్తేః శాస్త్రీయాణాం వాక్కాయకర్మణాం కారణాని మానసాని కర్మాణి వర్జయిత్వాఽన్యాని సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్త ఇతిచే న్న, "నైవ కుర్వన్న కారయన్" (గీ-5-13) ఇతి విశేషణాత్; సర్వకర్మసంన్యాసోఽయం భగవతోక్తో మరిష్యతో నజీవత ఇతిచే న్న "నవద్వారే పురే దేహీ...ఆస్తే" (గీ-5-13) ఇతి విశేషణానుపపత్తేః. నహి సర్వకర్మసంన్యాసేన మృతస్య తద్దేహ ఆసనం సంభవతి, అకుర్వ

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. 22

---

టీ:—యథా - ఏరీతిగా, నరః - మనుజుఁడు, జీర్ణాని - చినిగిన, వాసాంసి - బట్టలను, విహాయ - విడచి, అపరాణి - వేరగు, నవాని - క్రొత్తవానిని, గృహ్ణాతి - స్వీకరించునో, తథా - ఆతీరుననే, దేహీ - ఆత్మ, జీర్ణాని - శిథిలములగు, శరీరాణి - దేహములను, విహాయ - విడచి, అన్యాని - ఇతరములగు, నవాని - క్రొత్తశరీరములను, సంయాతి - పొందుచున్నాఁడు. 22

తా:—ఆత్మవేత్తకు సర్వక్రియానివృత్తిరూపంబగు సర్వకర్మ సంన్యాసము ఘటించునని ప్రసంగవశమున బోధించి పైళ్లోకములవలనఁ దెలియవచ్చెడి యాత్మ యొక్క యవినాశిత్వాదికమును దృష్టాంతపురస్సరంబుగా నీగీతముచేఁ బ్రతిపాదించుచున్నారు. ఇచట 'నరదేహి' శబ్దము లొకింత యోజనీయములు. నరుఁ డనగా లోకములో వ్యవహరించుచుండు కరచరణాద్యవయవవిశిష్టమగు సప్తధాతుపిండమే తన స్వరూప మనుకొను నజ్ఞుండు. దేహి యన నీదేహమునుండి బుద్ధిచే వేఱుచేయఁబడినట్టి సత్యజ్ఞానానంతనిరవయవ నిర్గుణనిష్క్రియం బగునాత్మ. "జీర్ణములగు వస్త్రములను నరుఁ డెట్లు విడచి నూతనవస్త్రములను స్వీకరించునో యట్లే దేహి జీర్ణములగు దేహములను విడచి నూతనదేహములను బొందుచుండును" అనుటచే నరునికిని బట్టలకును గల సంబంధస్వభావములఁబట్టి దేహికిని దేహమునకును గల సంబంధస్వభావములు సుగమముగ గ్రాహ్యములు. బట్టలు ధరించునపుడును దీసివేయునపుడును నరుఁ డెట్లు నిర్వికారుఁడై నాశనము లేక నిలిచియుండునో యట్లే దేహముల విడచునప్పుడు దేహాంతరముల ధరించునపుడును దేహి నిర్వి

---

తోఽకారయతశ్చ దేహే సంన్యస్యేతి సంబంధో న దేహాఆస్తే ఇతిచేన్న, సర్వత్రాత్మనోఽవిక్రియత్వావధారణా దాసనక్రియాయా శ్చాధికరణాపేక్షత్వా త్తదనపేక్షత్వా చ్చ సంన్యాసస్య. సంపూర్వస్తు న్యాసశబ్ద స్త్యాగార్థో న నిక్షేపార్థః.

తస్మాద్గీతాశాస్త్రే ఆత్మజ్ఞానవత స్సంన్యాస ఏవాధికారో నకర్మణి ఇతి తత్ర తత్రోపరిష్టా దాత్మజ్ఞానప్రకరణే దర్శయిష్యామః. 21

ప్రకృతంతు వక్ష్యామః తత్రాత్మనోఽవినాశిత్వం ప్రతిజ్ఞాతం తత్కిమివేత్యుచ్యతే - వాసాంసీతి. వాసాంసి వస్త్రాణి జీర్ణాని దుర్బలతాం గతాని యథా లోకే విహాయ పరిత్యజ్య నవా న్యభినవాని గృహ్ణా త్యుపాదత్తే నరః పురుషోఽపరా

కారుఁడై నాశనములేక నిలిచియుండు నను నిర్వికారస్వభావము నాత్మకుఁ బ్రదర్శించుటకై యీగీతము వర్తించుచున్నది. కాని దేహము లవశ్యము సంపాదింపఁబడు విషయమును బోధించుటకు గాదు. ఏలనన నొకానొకనరుఁడు తన వస్త్రములు జీర్ణములు గాఁగఁ గ్రొత్తవాటిని గ్రహింపవచ్చును. వేఱొక నరుఁడు గ్రహింపక పోవచ్చును. ఏలనన దేహములను గ్రహించుననుట దేహాభిమానివిషయముగాని దేహాభిమానరహితుఁ డగు జ్ఞానివిషయము గాదు. ఒక గృహాభిమాని దా నుండు గృహము చెడినచో మఱియొక నూతనగృహమును స్వీకరించును. ధనాభిమాని తనకు గల ధనము పోయినచో మఱల ధనమును సంపాదించుకొనును. కలత్రాభిమాని కలత్రనష్టమగుచో గళత్రాంతరమును స్వీకరించును. ఆ తీరుననే తృణజలూకన్యాయముభంగి దేహాభిమాని దేహము వానయోగ్యము గానిచో మఱియొక దేహమును సంపాదించుకొనును. తత్తదభిమానరహితుఁడు తత్తద్వస్తువులను గ్రహింపనియట్లు దేహాభిమానరహితుఁడు దేహమును సంపాదింపఁడు. కావున ప్రతివాఁడును దేహములఁ బొందునని చెప్పుట యుక్తముగాదు. కావున నీగీతమున దేహసంపాదననియమము బోధింపఁబడె ననుట యుక్తముగాదు గావున నాత్మ యన దేహియొక్క నిర్వికారభావమును బోధింపఁబడినటుల గ్రహింపవలయును. ఇది యట్లుండ నిం దర్జునునియొక్క యవివేకము వేఱొక విధమున నిరసింపఁ బడుచున్నటులఁ గూడ గ్రహింపవచ్చును. ఎట్లన నర్జునుఁడు దాను వీరల నందఱను జంపెదననియు దానంజేసి వార లందరు జచ్చెద రనియు విలపించుచున్నాఁడు గదా! అర్జునుడు తన యస్త్రశస్త్రాదులతో వ్యాపార మొనర్చినంతనే వారలు చచ్చెదరా? అర్జునుఁడు బాణములఁ బ్రయోగింపగా వార లూరక నిలిచియుందురా? అర్జునుఁ డెట్టిధైర్యముతో వారలఁ జంపెద ననుకొనుచున్నాఁడో, యితరులుగూడ నట్టిధైర్యముతో నుండలేదా? ప్రతినరుఁడును దనశక్తికొలఁది దన దేహమును సర్వవిధములఁ గాపాడుకొనుచుండును. అయ్యది తనకు నిరుపయోగ మని తోఁచినచో నద్దానిని విడిచిపెట్టును. ఇచ్ఛ గల్గినచో గ్రొత్తదేహమును సంపాదించుకొనును, లేనిచో విరమించును. అంతియకాని యొకఁ డొకనిని జంపుటయు, నద్దానిచే వాఁడు చచ్చుననుటయును గల్లయనియునట్లు తలచువార లవివేకు లనియు నిదివఱకు "య ఏనం వేత్తి హంతారం" మ్మను శ్రుతిముఖమున నిదివఱకే యుపదేశింపఁబడియున్నది. కావున నీ గీత మాత్మకు నిర్వికారత్వమును బోధించుచున్నటుల గ్రహింపవలయును. 22

---

ణ్యన్యాని తథా తద్వదేవ శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని, సంయాతి సంగచ్ఛతి, నవాని దేహీ ఆత్మా పురుష వదవిక్రియఏ వేత్యర్థః. 22

నైనం ఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః. 23

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్యః సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. 24

---

టీ:—ఏనం - ఈయాత్మను, శస్త్రాణి - ఖడ్గాద్యాయుధములు, న ఛిందంతి - ఛేదింపనేఱవు, ఏనం - ఈయాత్మను, పావకః - అగ్నిహోత్రుఁడు, న దహతి - కాల్చ నేరఁడు, ఏనం - ఈయాత్మను, ఆపః - ఉదకములు, నచ క్లేదయంతి - తడుపనేరవు, మారుతః - వాయువు, న శోషయతి - ఎండింపజేయలేదు. 23

తా:—పృథివ్యప్తేజోవాయువులు వికారములఁ గల్గించుపదార్థములు. అయ్యవి దేహికి నెట్టివికారమును గలుఁగజేయఁజాల వని తాత్పర్యము. 23

టీ:—అయం - ఈ ఆత్మ, అచ్ఛేద్యః - ఛేదింపఁబడనేరదు, అయం - ఈయాత్మ, అదాహ్యః - దహింపఁబడదు, అక్లేద్యః - తడుపఁబడదు, అశోష్య ఏవచ - ఎండింపఁబడదుకూడను. అయం - ఈయాత్మ, నిత్యః - త్రికాలాబాధ్యుఁడును, సర్వగతః - సర్వవ్యాపియు, స్థాణుః - నిర్వికారము, అచలః - చలనరహిత మగు నదియు, సనాతనః - ఎల్లప్పుడు నుండునదియు. 24

తా:—ఏహేతువుచేఁ బృథివ్యాదిభూతము లీయాత్మకు నెట్టి వికారమును గలుగఁజేయలేవో యాకారణముచే నీయాత్మ యచ్ఛేద్యము, అదాహ్యము, అక్లే

---

కస్మా దవిక్రియ ఏవేత్యాహ - నైనం ఛిందంతీతి. ఏనం ప్రకృతం దేహినం, న ఛిందన్తి శస్త్రాణి నిరవయవత్వా న్నావయవవిభాగం కుర్వన్తి శస్త్రాణ్యస్యాదీని; తథా నైనం దహతి పావకోఽగ్నిరపి న భస్మీకరోతి; తథా నచైనం క్లేదయన్త్యాపః; అపాంహి సావయవస్య వస్తున ఆర్ద్రీభావకరణే నావయవవిశ్లేషాపాదనే సామర్థ్యం, తన్న నిరవయవ ఆత్మని సంభవతి; తథా స్నేహవ ద్ద్రవ్యం స్నేహశోషణేన నాశయతి; వాయు రేనం త్వాత్మానం న శోషయతి మారుతోఽపి. 23

యతఏవం తస్మాత్ - అచ్ఛేద్యోఽయమితి. యస్మా దన్యోఽన్య నాశహేతూని భూతా న్యేన మాత్మానం నాశయితుం నోత్సహంతే, తస్మా న్నిత్యః, నిత్యత్వా త్సర్వగతః, సర్వగతత్వాత్ స్థాణుః, స్థాణురివస్థిర ఇత్యేతత్, స్థిరత్వా దచలోఽయ మాత్మా, అత స్సనాతన శ్చిరంతనో నకారణా త్కుతశ్చి న్నిష్పన్నోఽభినవ ఇత్యర్థః.

నైతేషాం శ్లోకానాం పౌనరుక్త్యం చోదనీయం, యత ఏకేనైవ శ్లోకేనాత్మనో నిత్యత్వ మవిక్రియత్వం చోక్తం "నజాయతే మ్రియతేవా" (గీ. 2-20)

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25

ద్యము, అశోష్యమును. ఇఁక నీయాత్మ నిర్వికారము గనుక నిత్యము. నిత్యము గావున "అవినాశితు తద్విద్ధి" యను గీతోక్తరీతిచే సర్వగతము. సర్వగత మగుటచే స్థాణువువలె స్థిరము; స్థిర మగుటచే నచలమును. కారణాంతరముచే నియ్యది పుట్టినది కాదుగావున సనాతనమును. 24

టీ:-అయం - ఈయాత్మ, అవ్యక్తః - ఇంద్రియాగోచరము, అయం - ఈ యాత్మ, అచింత్యః - అమానసగోచరము, అయం - ఈయాత్మ, అవికార్యః - నిర్వికారము నని, ఉచ్యతే - చెప్పఁబడెను. తస్మాత్ - ఆకారణమువలన, ఏనం - ఈ యాత్మను, ఏవం - ఈరీతిగా, విదిత్వా - తెలిసికొని, అనుశోచితుమ్ - దుఃఖించు కొఱకు, న అర్హసి - తగవు. 25

తా:-సకలేంద్రియములకును విషయము గాకపోవుటచే నవ్యక్తము. అవ్యక్త మగుటచే నచింత్యము. ఏలనన నింద్రియగోచర మగువస్తువు చింతావిషయ మగును గాని, యింద్రియాతీతమగు నాత్మ చింతావిషయము కాకపోవుటచే నచింత్యము. అచింత్య మగుటచే నవికార్యము. నిరవయవ మగుటచేఁగూడ నవికార్యము. ఇట్టి యాత్మను దెలిసికొని విచారించుటకు నించుకేనియు నవకాశము లేదుగావున నర్జునునియొక్క విషాద మవివేకవిలసిత మనిభావము. 25

ఇత్యాదినా, తత్ర యదేవాత్మవిషయం కించి దుచ్యతే తదేతస్మా చ్ఛ్లోకార్థా న్నాతిరిచ్యతే కించి చ్ఛబ్దతః పునరుక్తం కించి దర్థతఇతి. దుర్బోధత్వా దాత్మవస్తునః పునః పునః ప్రసంగ మాపాద్య శబ్దాంతరేణ తదేవ వస్తు నిరూపయతి భగవా న్వాసు దేవః కథంను నామావ్యక్తం తత్త్వం సంసారిణాం బుద్ధిగోచరతా మాపన్నం సత్సం సారనివృత్తయే స్యా దితి. 24

కించ - అవ్యక్తోఽయమితి. అవ్యక్తః సర్వకారణావిషయత్వా న్నవ్యజ్యత ఇత్యవ్యక్తోఽయ మాత్మా. అతఏవాచింత్యోఽయమ్. యద్ధీంద్రియగోచరం వస్తు తచ్చింతావిషయత్వ మాపద్యతేఽయం త్వాత్మాఽనింద్రియగోచరత్వా దచింత్యః, అతఏవావికార్యోఽయమ్; యథాక్షీరం దధ్యాతించ నాది నావికారి న తథాఽయ మాత్మా నిరవయవత్వా చ్చావిక్రియః; నహి నిరవయవం కించి ద్విక్రియాత్మకం దృష్టమ్, అవిక్రియత్వా దవికార్యోయ మాత్మోచ్యతే; తస్మా దేవం యథోక్త ప్రకారేణైన మాత్మానం విదిత్వా త్వం నానుశోచితు మర్హసి; హంతాఽహ మేషాం, మయేమే హన్యన్త ఇతి. 25

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి. 26

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

---

టీ:—మహాబాహో - అర్జునా!, అథ చ - ఒకానొకవేళ, ఏనం - ఈ యాత్మను, నిత్యజాతం - ఎల్లప్పుడు పుట్టున దనిగాని, నిత్యం - ఎల్లప్పుడును, మృతం వా - చచ్చునదనిగాని, మన్యసే - తలచితివేని, తథాపి - అట్లైనప్పటికి, త్వం - నీవు, ఏవం - ఈరీతిగా, శోచితుం - దుఃఖించుటకు, నార్హసి - తగవు. 26

తా:—ఇచట 'అథ చ' యనునవ్యయములు వాదాంతరసూచకములు, "ప్రకారాంతరముచే యోజించినను" అను నభిప్రాయమును వ్యక్తీకరించుచున్నవి. ఒకవేళ నీదేహిని దేహముగాఁ దలఁచి యయ్యది నిత్యము పుట్టుననియు నిత్యము చచ్చుననియు దలఁచినను దుఃఖించుట కవకాశము లేదు. ఏలనన—

టీ:—హి - ఏకారణముచే, జాతస్య, పుట్టినదానికి, మృత్యుః - మరణము, ధ్రువః - నిశ్చయమో, మృతస్యచ - చచ్చినదానికి, జన్మ - పుట్టుక, ధ్రువం - నిశ్చయము. తస్మాత్ - ఆకారణమువలన, అపరిహార్యే - పరిహరించుట కవకాశములేని, అర్థే - విషయమున, త్వం - నీవు, శోచితుం - దుఃఖించుటకు, నార్హసి - తగవు. 27

తా:—పుట్టిన వస్తువునకు జావును, జచ్చిన వస్తువునకు బుట్టుకయును నిశ్చయము. దానంజేసి చావుపుట్టుకలు రెండు నొకదాని నొకటి విడిచిపెట్టకుండ దటస్థించుచుండును; అట్లు చచ్చుటయును బుట్టుటయును స్వభావముగాఁగల దేహములఁగూర్చి కాని వేఱొక వస్తువునుగూర్చి కాని శోకింప నవసరము లేదని సుస్పష్టము. 27

---

ఆత్మనోఽనిత్యత్వ మభ్యుపగమ్యేద ముచ్యతే అథ చైనమితి. అథచేత్య భ్యుపగమార్థః. ఏనం ప్రకృత మాత్మానం నిత్యజాతం లోకప్రసిద్ధ్యా ప్రత్యనేక శరీరోత్పత్తిం జాతో జాత ఇతి వా మన్యసే తథాప్రతి తత్తద్వినాశం నిత్యంవా మన్యసే మృతం మృతో మృతఇతి తథాపి తథాభావిన్య ప్యాత్మని త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి, జన్మవతో నాశో నాశవతో జన్మ చేత్యేతా వవశ్యం భావినావితి. 26

తథాచ సతి - జాతస్యేతి. జాతస్యహి లబ్ధజన్మనః, ధ్రువోఽవ్యభిచారీ మృత్యు ర్మరణం ధ్రువం జన్మ మృతస్యచ. తస్మా దపరిహార్యోఽయం జన్మమరణ లక్షణోఽర్థః, తస్మి న్నపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. 27

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత !,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. 28

టీ:-భూతాని - కార్యకరణసంఘాతరూపములగు పుత్త్రమిత్త్రాదుల శరీరములు, అవ్యక్తాదీని - తెలియఁబడని ప్రారంభము గలిగినవియు, వ్యక్తమధ్యాని- తెలియఁబడిన మధ్యము గలిగినవియు, అవ్యక్తనిధనానిఏవ - తెలియఁబడని చావు గలవియే, భారత! - అర్జునా! తత్ర - ఆవిషయమున, పరిదేవనా - విచారము, కా - ఎందులకు? 28

తా:-ఇచట "భూతాని" యనుశబ్దము, కార్యకరణ సంఘాతరూపంబులగు దేహాదులను దత్కారణంబులగు మహాభూతంబులను గూడ వ్యక్తీకరించుచున్నది. భూతముల స్వభావము "అవ్యక్తాదీని వ్యక్తమధ్యాని, అవ్యక్తనిధనాన్యేవ" యని నిరూపింపఁబడుచున్నది. "అవ్యక్తాదీని" యనగాఁ దెలియఁబడని మొదలు కలవి. మొదట లేనివి యని యభిప్రాయము. "అవ్యక్తనిధనాని" తెలియఁబడని యంతము గలవి. అనగా నంతమునందు దెలియఁబడ వని యభిప్రాయము. ఆద్యంతములయందు తెలియబడనిస్వరూపము గలవి యనగాఁ బుట్టుకకు బూర్వము లేనివనియు జావునకుఁ బరమందుండనివియు ననిభావము". 'వ్యక్తమధ్యాని' తెలియఁబడిన మధ్యగలవి యనగా నాద్యంతమధ్యమమునమాత్రము తెలియఁబడునని భావము. దానంజేసి భూతములదృష్టదృష్టప్రణష్టము లని తెలియబడుచున్నది. ఇట్టి యదృష్టదృష్టప్రణష్టభూతంబు లగు విశేషంబు లన్నియు, నవ్యక్తాదియు వ్యక్తమధ్యమమును; అవ్యక్తనిధనమును గల రజ్జుసర్పాదులట్లు మిథ్యాభూతంబు లనిప్రాజ్ఞులు సుకరంబుగ గ్రహింపఁగలరు. ప్రకృతపు గీతమునందలి భూతంబుల తత్త్వము రజ్జుసర్పతత్త్వంబును బోధించు "అవ్యక్తాది స్సర్పః వ్యక్తమధ్యోఽవ్యక్త నిధనః" అను వాక్యముతో సరిపోల్చి విచారించినచో భూతతత్త్వము సువ్యక్తమగును. "అవ్యక్తాదీని భూతాని" యనుగీతము "యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయ న్త్యభిసంవిశంతి" యను శ్రుతియొక్క-

కార్యకరణ సంఘాతాత్మకాన్యపి భూతా న్యుద్దిశ్య శోకో న యుక్తః కర్తుం, యతః అవ్యక్తాదీ నీతి. అవ్యక్తాదీ న్యవ్యక్త మదర్శన మనుపలబ్ధి రాది ర్యేషాం భూతానాం పుత్త్రమిత్త్రాదికార్యకరణసంఘాతాత్మకానాం తా న్యవ్యక్తాదీని భూతాని ప్రాగుత్పత్తేః ఉత్పన్నానిచ ప్రాజ్మరణా ద్వ్యక్తమధ్యాని అవ్యక్త నిధనా న్యేవ పున రవ్యక్త మదర్శనం నిధనం మరణం యేషాం తాన్యవ్యక్తనిధ నాని మరణాదూర్ధ్వ మప్యవ్యక్తతామేవ ప్రతిపాద్యంత ఇత్యర్థః;తథాచోక్తం "అద

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. 29

---

తాత్పర్యమును బోధించు గీత మని గుర్తైయుంగునది. శ్రుతిస్మృతులవలనఁ దెలియ వచ్చెడి దేహిస్వభావము నాలోచించి విచారమున కవకాశము లేదని బోధించి, పామరదృష్టిచేఁగాని లోకాయతదృష్టిచేఁగాని తెలియవచ్చెడు దేహాత్మదృష్టిచేఁ గూడ యోజించినను విషాదమున కవకాశము లేదని బోధింప దేహాస్వరూపస్వ భావంబులు మూఁడుగీతములచే వ్యక్తీకరింపఁబడినవి. 28

టీ:—కశ్చిత్ - ఒకానొకఁడు, ఏనం - ఈయాత్మను, ఆశ్చర్యవత్ - వింత తోఁగూడినదానివలె, పశ్యతి - చూచుచున్నాఁడు. తథైవ - ఆతీరుననే, అన్యః - మరి యొకఁడు, వదతిచ - పలుకుచున్నాఁడు, ఏనం - ఈయాత్మను, అన్యః - మఱి యొకఁడు, ఆశ్చర్యవత్ - ఆశ్చర్యముతోఁగూడినవానివలె, శృణోతిచ - వినుచున్నాఁ డు. ఏనం - ఈయాత్మను, శృత్వాపి - వినినప్పటికిని - కశ్చిచ్చ - ఒకానొకఁడును, న వేద ఏవ - తెలిసికొనఁజాలకున్నాఁడు. 29

ఇంతవఱకు బోధింపఁబడిన శ్రీకృష్ణవాక్యములవలన రెండువిధములగు నాత్మ స్వరూపము లుపపాదింపబడి యారెండువిధములగు దృష్టిచేఁగూడ శోకమున కవ కాశ మించుకేనియు లేదని జెప్పఁబడెను.

1 దేహి సకలదేహవిలక్షణమగు సత్యజ్ఞానానంత నిరవయవ నిర్గుణ నిష్క్రి యము.

2 దేహమే దేహి, యని.

ఇందు మొదటిది శ్రుతిస్మృతి యనుభవసిద్ధము. రెండవది సకలప్రాణుల కును బుట్టువుతోఁగూడ సహజసిద్ధము. ఇఁక నిచట దేహతత్త్వ మేదృష్టిచేఁ జూడ బడినను నదృష్టదృష్టపరిణష్టస్వరూపము గావున దేహములు మిథ్య యనునది

---

ర్శనాదాపతితః పునశ్చాదర్శనం గతః 'నాసౌ తవ న తస్య త్వం వృథా కా పరిదేవనా' (మ. భా. స్త్రీ. 2. 13.) ఇతి. తత్ర కా పరిదేవనా శోకో వా ప్రలాపోఽదృష్ట దృష్టప్ర ణష్టభ్రాంతిభూతేషు భూతేష్విత్యర్థః. 28

దుర్విజ్ఞేయోఽయం ప్రకృత ఆత్మా కిం త్వామేవైక ముపాలభే సాధారణే భ్రాంతినిమిత్తే. కథం దుర్విజ్ఞేయోఽయ మాత్మేత్యత ఆహ ఆశ్చర్య వదితి.

సకలజనానుభవసిద్ధము. ఇచట నుదాహరింపఁబడిన రెండువిధము లగు దేహిభావములలో మొదటిది యుత్తమోత్తమము, రెండవది యధమాధమము. ఈ రెండు భావములకు మధ్య నిముడగల భావములు పెక్కులు జిజ్ఞాసువుల బుద్ధివైశద్యము ననుసరించి ప్రవర్తించుచున్నవి. ఈరెండుభావములదృష్టిచే నా భావముల దృష్టి సంక్షేపముగ నిట్లు గ్రహింపనగు. ఆత్మస్వరూపము జిజ్ఞాసువుల దృష్టివిశేషమున నెట్లుః పరగుచున్నను ప్రకృతమున గమనింపవలసిన విషయము మాత్ర మొక్కటియే. ఆత్మ జననమరణాదులు లేక నిత్యమా? లేక జననమరణాదులతోఁ గూడి యనిత్యమా? నిత్యమగుచో మొదటిదాని కనువుగను అనిత్య మగుచో రెండవదాని కనువుగను యుక్తిప్రయుక్తుల నరిచూచినచో శోకకారణము గాదని యభిప్రాయము. ఇట్లీ యభిప్రాయభేదమును ప్రదర్శించుటలో శ్రీకృష్ణభగవదాశయ మేమైయుండును? శ్రీకృష్ణభగవానులు తమ యాశయమును ప్రకటించి యూరకొనఁగూడదా యనినచో నాత్మతత్త్వ మంత సుకరముగాఁ దెలియబడు విషయము గాదనియు నెద్దియో యొక యభిప్రాయమును వ్యక్తీకరించిన నయ్యది శ్రోతృబుద్ధికి రుచింపకపోయినచోఁ బ్రయోజనము గలుగనేఱదు. శ్రోతృబుద్ధికి భాసించువిధమున గూడ యుక్తిప్రయుక్తులఁ బ్రకరణోపయోగముగ బోధించుట సద్గురులక్షణము. ఆత్మనుగూర్చి జిజ్ఞాసువులు పరిపరివిధములఁ దలంచుచు నభినివేశంబులఁ జెందుచుండుట లోకానుభవసిద్ధము. అదెట్టు లనిన,

శాస్త్రజ్ఞానశూన్యులగు పామరజనులును లోకాయతికులును జార్వాకులును దేహమాత్రమునే యాత్మ యని తలంచుచున్నారు. ఇంద్రియములు చేతనములనియు నవియే యాత్మ యని కొందఱు, మనస్సని కొందఱు, క్షణిక మగు విజ్ఞానమాత్ర మని కొందఱు శూన్య మని కొందఱును భావించుచున్నారు. దేహాదివ్యతిరిక్తముగా సంసారి కర్త భోక్త యయినవాఁ డొకఁడు గలఁడని వైశేషికనైయాయికాదులు చెప్పుచున్నారు. దేహాదివ్యతిరిక్తుఁ డగు నాత్మ కేవల భోక్తగాని కర్త గాఁడని సాంఖ్యులు తలంచుచున్నారు. భోక్తకంటె వ్యతిరిక్తముగా సర్వజ్ఞుఁడును సర్వశక్తియు నగు నీశ్వరుఁడు గలఁడని యోగులు తలంచుచున్నారు. భోక్తయగు

---

ఆశ్చర్యవ దాశ్చర్య మదృష్టపూర్వ మద్భుత మకస్మా ద్దృశ్యమానం తేన తుల్య మాశ్చర్యవ దాశ్చర్య మివైన మాత్మానం పశ్యతి కశ్చిత్ ఆశ్చర్యవ దేనం వదతి తథైవచాన్యః ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి శ్రుత్వా దృష్ట్వోక్త్వా ప్యేన

దేహీ నిత్య మవ ధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30

---

జీవునియొక్క యాత్మయే (అనగా స్వరూపమే) పరమాత్మ యని వేదాంతులు చెప్పుచున్నారు.

ఇట్లు పలువిధములగు నభిప్రాయముల కాస్పద మగుటచే నాత్మ దురూహమును దుర్విజ్ఞేయమును గావున ముముక్షువు లందఱకును నిశ్శ్రేయసప్రాప్తికై బ్రహ్మజిజ్ఞాసాపూర్వక వేదాంతవిచారము కర్తవ్య మని భగవదాశయము.

టీ:—భారత! - అర్జునా! సర్వస్య - సమస్తమగు ప్రాణికోటియొక్క, దేహే - శరీరమునం దుండెడి, అయం - ఈ, దేహీ - ఆత్మ, నిత్యం - ఎల్లప్పుడును, అవధ్యః - నాశనము లేనిది. తస్మాత్ - ఆకారణముచే, త్వం - నీవు, సర్వాణి - సమస్తమగు, భూతాని - భూతములగుఱించి, శోచితుం - దుఃఖించుకొనుటకు, న అర్హసి - తగవు 30

తా:—దేహి నిరవయవము, నిత్యము, సర్వగత మగుటచే సకలావస్థలయందును గూడ జంపఁబడువాఁడు గాఁడు. కావున సకలభూతములఁ గూర్చి శోకమును జెందుట యుక్తము గాదని యభిప్రాయము. ఇచట "సర్వస్య దేహే" యనుటచే సకలభూత సంబంధమగు దేహమం దని తెలియవచ్చుటచే దేహి సకలదేహములకు నొక్కఁడే యనియును, అట్టి దేహి నాధారముగాఁ జేసికొని యదృష్టదృష్టప్రనష్ట రూపంబులగు నీ దేహంబులు బుద్బుదప్రాయంబులుగ భాసిల్లుటం జేసి మిథ్యాభూతంబు లనియును ప్రకరణ తాత్పర్యము. 30

---

మాత్మానం వేద నచైవ కశ్చిత్; అథవా యోయ మాత్మానం పశ్యతి స ఆశ్చర్యతుల్యో యో వదతి యశ్చ శృణోతి సోఽనేకసహస్రేషు కశ్చిదేవ భవతి; అతో దుర్బోధ ఆత్మేత్యభిప్రాయః. 29

అథేదానీం ప్రకరణార్థ ముపసంహరన్ బ్రూతే దేహీతి. దేహీ శరీరీ నిత్యం సర్వదా సర్వావస్థా స్వవధ్యో నిరవయవత్వా న్నిత్యత్వా చ్చ తత్రావధ్యోఽయం దేహే శరీరే సర్వస్య సర్వగతత్వాత్ స్థావరాదిషు స్థితోఽపి సర్వస్య ప్రాణిజాతస్య దేహే వధ్యమానేఽప్యయం దేహీ న వధ్యో యస్మా త్తస్మా ద్భీష్మాదీని సర్వాణి భూతా న్యుద్దిశ్య న త్వం శోచితు మర్హసి. 30

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్త్రియస్య న విద్యతే. 31
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్త్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్. 32

---

టీ:—అపిచ - ఇంకను, స్వధర్మం - క్షత్త్రియధర్మమగు నీయుద్ధమును, అవేక్ష్య - తెలిసికొని, వికంపితుం - చలించుటకు, న అర్హసి - తగవు, ఏకారణముచే, ధర్మ్యాత్ - స్వాభావికధర్మమగు, (అనగా క్షత్త్రియస్వభావమున కనువగు) యుద్ధాత్ - యుద్ధముకంటె, అన్యత్ - వేఱగు, శ్రేయః - పురుషార్థము, క్షత్త్రియస్య - క్షత్త్రియునికి, న విద్యతే - తెలియఁబడదు. 31

టీ:—పార్థ! - అర్జునా! ఈదృశం - ప్రకృతమందు సంసిద్ధమైన, యుద్ధం - యుద్ధమును, యదృచ్ఛయాచ - కోరకుండగనే, ఉపపన్నం - సంభవించినట్టియు, అపావృతం - తెరువఁబడినట్టియు, స్వర్గద్వారం - స్వర్గద్వారముగా, సుఖినః - సుఖవంతులగు, క్షత్త్రియాః - క్షత్త్రియులు, లభన్తే - పొందుచున్నారు. లేక,

యదృచ్ఛయా - కోరకుండగనే, ఉపపన్నం - సమీపమందుండెడియు, అపావృతం - తెరువఁబడినట్టియు, స్వర్గద్వారం - స్వర్గద్వారమగు ఈదృశం యుద్ధం - ఇట్టి యుద్ధమును (యే క్షత్త్రియాః - ఏక్షత్త్రియులు) లభన్తే - పొందుదురో, (తే - వారలు) సుఖినః - సుఖవంతులుగదా! అనియు నూహించునది. 32

---

ఇహ పరమార్థతత్త్వాపేక్షాయాం శోకో మోహో వా న సంభవతీత్యుక్తమ్, న కేవలం పరమార్థతత్త్వాపేక్షాయామేవ. కింతు స్వధర్మ మితి. స్వధర్మ మపి స్వో ధర్మః క్షత్త్రియస్య ధర్మః యుద్ధం, తమ ప్యవేక్ష్య త్వం నవికంపితుం ప్రచలితుం అర్హసి; ధర్మ్యాత్ క్షత్త్రియస్య స్వాభావికా ద్ధర్మా దాత్మస్వాభావ్యా దిత్యభిప్రాయః. తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థం చేతి ధర్మాదనపేతం పరం ధర్మ్యమ్. తస్మా ద్ధర్మ్యా ద్యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్త్రియస్య నవిద్యతే, హి, యస్మాత్. 31

కుతశ్చ తద్యుద్ధం కర్తవ్య మిత్యుచ్యతే యదృచ్ఛయేతి. యదృచ్ఛయా చాప్రార్థితయా, ఉపపన్న మాగతం స్వర్గద్వార మపావృత ముద్ఘాటితం. యే ఏతదీదృశం యుద్ధం లభన్తే క్షత్త్రియాః హేపార్థ! కిం ననుఖిన స్తే. 32

అథచే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి. 33

అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

భయా ద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః,
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

---

టీ:-అథ - ఒకానొకవేళ, త్వం - నీవు, ఇమం - ఈ, ధర్మ్యం - ధర్మము నుండి ప్రచ్యుతిని జెందని, సంగ్రామం - యుద్ధమును, న కరిష్యసిచేత్ - చేయకపోతి వేని, తతః - అందువలన, స్వధర్మం - నీయొక్క ధర్మమును, కీర్తించ - మహాదేవా దులతోఁ బోరాడి పడసిన యశస్సును, హిత్వా - కోలుపోయి, పాపం - పాపమును, అవాప్స్యసి - పొందఁగలవు.

టీ:-భూతాని - సకలభూతములును, తే - నీయొక్క, అవ్యయామ్ - నాశ రహితమగు, అకీర్తిం చాపి - అపయశస్సునుగూడ, కథయిష్యన్తి - చెప్పుకొనఁ గలవు.

సంభావితస్యచ-గౌరవమును జెందినవానికన్ననో, అకీర్తిః-అపయశస్సు, మర ణాత్ - మరణముకంటె; అతిరిచ్యతే - ఎక్కువగుచున్నది. అనగా నపకీర్తికంటె మరణమే శ్రేయమని యభిప్రాయము.

టీ:-మహారథాః - మహారథులు, త్వాం - నిన్ను, భయాత్ - భయము వలన, రణాత్ - యుద్ధమునుండి, ఉపరతం - వెనుకకు మఱలినవానిగా, మంస్య

---

ఏవం కర్తవ్యతా ప్రాప్తముపి - అథచేదితి. అథచేత్త్వ మిమం ధర్మ్యం ధర్మా దనపేతం విహితం సంగ్రామం యుద్ధం న కరిష్యసిచేత్ తత స్తదకరణాత్స్వధర్మం కీర్తించ మహాదేవాదిసమాగమాదినిమిత్తాం హిత్వా కేవలం పాప మవాప్స్యసి. 33

న కేవలం స్వధర్మకీర్తిపరిత్యాగః అకీర్తిమితి. అకీర్తిం చాపి యుద్ధే భూతాని కథయిష్యన్తి తే తవ, అవ్యయాం దీర్ఘకాలాం, ధర్మాత్మా శూర ఇత్యేవమాది గుణై స్సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. సంభావితస్య చాకీర్తే ర్మరణం వర మిత్యర్థః. 34

కించ భయాదితి. భయా త్కర్ణాదిభ్యో రణా ద్యుద్ధా దుపరతం నివృత్తం మంస్యన్తే చింతయిష్యన్తి సకృపయేతి. త్వాం మహారథా దుర్యోధనప్రభృతయః

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరంను కిమ్. 36

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37

---

న్తే- తలచగలరు, యేషాంచ - ఎవరలకు, త్వం - నీవు, బహుమతః - ఎక్కువవాఁడవు, భూత్వా - అయి, లాఘవం - లఘుభావమును, యాస్యసి - పొందుదువో, అట్టి మహారథులని పూర్వమున కన్వయము. 35

టీ:—తవ - నీయొక్క, అహితాః - శతు్రవులు, తవ - నీయొక్క, సామర్థ్యం శక్తిని, నిందన్తః - దూషించుచు, బహూన్ - అనేకములగు, అవాచ్యవాదాన్‌చ - వచింపరాని పలుకులను, వదిష్యంతి -పలుకఁగలరు. తతః - అంతకంటె, దుఃఖతరం ఎక్కుడుదుఃఖము కింను - ఏమిగలదు? అనగా నింతకంటె గొప్ప దుఃఖము లేదని యభిప్రాయము. 36

టీ. కౌన్తేయ! - అర్జునా! హతోవా - యుద్ధమునఁ జంపఁబడినచో, స్వర్గం - స్వర్గమును, ప్రాప్స్యసి - పొందఁగలవు, జిత్వావా - జయించినచో, మహీం - పృథివిని, భోక్ష్యసే - అనుభవింపగలవు. తస్మాత్ - ఆకారణమువలన, యుద్ధాయ - యుద్ధముకొఱకు, కృతనిశ్చయః - నిశ్చయమును బొందినవాడవై, ఉత్తిష్ఠ - లే లెమ్ము. 37

---

యేషాంచ త్వం దుర్యోధనాదీనాం బహుమతో బహుభి ర్గుణై ర్యుక్త ఇత్యేవం మతో బహుమతః భూత్వా పున ర్యాస్యసి లాఘవం లఘుభావమ్. 35

కించ - అవాచ్యవాదానితి. అవాచ్యవాదా నవక్తవ్యవాదాంశ్చ బహూ ననేక ప్రకారాన్ వదిష్యన్తి తవాహితా శ్శత్రవో నిందంతః కుత్సయంతః, తవ త్వదీయం సామర్థ్యం నివాతకవచాదియుద్ధనిమిత్తం. తతః తస్మాత్ నిందాప్రాప్తే ర్దుఃఖాత్ దుఃఖతరంను కిం? తతః కష్టతరం దుఃఖం నాస్తీత్యర్థః. 36

యుద్ధే పునః క్రియమాణే కర్ణాదిభిః హతోవేతి. హతోవా ప్రాప్స్యసి స్వర్గం హతః స్వర్గం ప్రాప్స్యసి జిత్వావా కర్ణాదీన్ శూరాన్, భోక్ష్యసే మహీమ్. ఉభయథాపి తవ లాభ ఏవేత్యభిప్రాయః. యత ఏవం తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయో జేష్యామి శతూ్రన్ మరిష్యామి వేతినిశ్చయం కృత్వేత్యర్థః. 37

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. 38

---

టీ:—సుఖదుఃఖే - సుఖదుఃఖములను, లాభాలాభౌ - లాభాలాభములను, జయాజయౌ - జయాపజయములను, సమే - సమముగా, కృత్వా - చేసి, అనఁగా రాగద్వేషములు లేకుండనని యభిప్రాయము. తతః - పిమ్మట, యుద్ధాయ - యుద్ధముకొఱకు, యుజ్యస్వ - సన్నద్ధుఁడవుకమ్మా! ఏవం - ఈరీతిగా యుద్ధ మాచరించిన, పాపం - పాపమును, న అవాప్స్యసి - పొందఁజాలవు. 38

తా:—ఇంతవఱకు బరమార్థతత్త్వదృష్టిచే నాలోచించిన శోకమోహములు గలుగనేరవని బోధించి స్వధర్మదృష్టిచే నాలోచించినను శోకమోహముల కవకాశము లేదని పై నెనిమిది గీతములచే బోధించుచున్నారు. స్వధర్మ మన శ్రుతిస్మృతులచేఁ దనవర్ణాశ్రమానుగుణంబుగ విధింపఁబడిన కర్మవిశేష మని యభిప్రాయము. ప్రకృతమున నర్జునుఁడు క్షత్త్రియ గృహస్థుఁడు గావున నాతనికి ధర్మ్యయుద్ధము శ్రేయస్సాధనమగు ధర్మవిశేషము. అట్టి శ్రేయస్సాధనముగ క్షత్త్రియుం డగు నర్జునుండు గుర్తెఱింగినను జలించుట కవకాశము లేదని తాత్పర్యము. యుద్ధ మెటుల శ్రేయస్సాధన మన నయ్యది పృథివీజయద్వారమున ధర్మము కొఱకును బ్రజారక్షణముకొఱకు నగుచు ధర్మముతో సంబంధించును. ఒకానొకవేళ యుద్ధమున జయమునకు మారుగ జావు తటస్థమైనను శ్రేయమే. ఏలనన ధర్మ్యయుద్ధమునఁ జచ్చినవారలు స్వర్గము నచిరకాలములోఁ బడయుదు రని శ్రుతిస్మృతిశాసనము.

ప్రతిపురుషుఁడును దన వర్ణాశ్రమంబుల కనువగు శ్రుతి స్మృత్యుదితధర్మము నాచరించితీరవలయు ననియు, నట్లాచరింపనిచో నైహికాముష్మికనిశ్శ్రేయసంబులకు దూర మగుననియు నర్జునునిద్వారా శ్రీకృష్ణభగవానులు లోకమునకుపదేశించుచున్నారలు.

సుఖదుఃఖములను లాభాలాభములను జయాపజయములను సమములుగాఁ జేసి రాగద్వేషములఁ జెందక యుద్ధ మాచరించినచోఁ బాపము నెంతమాత్రమును జెందవు గావున శోకింపఁ బనిలేదని ప్రసంగవశమునఁ జెప్పఁబడియె.

---

తత్ర యుద్ధం స్వధర్మ ఇత్యేవం యుధ్యమాన స్యోపదేశ మిమం శృణు సుఖదుఃఖే ఇతి. సుఖదుఃఖే సమే తుల్యే కృత్వా రాగద్వేషా వకృత్వే త్యేతత్; తథా లాభాలాభౌ జయాజయౌ చ సమౌ కృత్వా తతో యుద్ధాయ యుజ్యస్వ ఘటస్వ; నైవం యుద్ధం కుర్వన్ పాప మవాప్స్యసీ త్యేష ఉపదేశః ప్రాసంగికః. 38

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి.　　39

ఇచట "స్వధర్మ మపి చావేక్ష్య" యను గీతముచే శోకమోహములఁ బోఁగొట్టుటకు వ్యావహారికన్యాయము తెలుపఁబడెను. ఇయ్యది "అథచైనం నిత్యజాతం" అను గీతముచేఁ దెలుపఁబడిన సామాన్యన్యాయము వంటిదే కాని యందలి విశేషముతోఁ బ్రకృతపు సాంఖ్యమునకు సంబంధ మెంతమాత్రము లేదు.

టీ:—పార్థ! - అర్జునా! తే - నీకొఱకు, ఏషా - పూర్వోక్తమగు ఈ, సాంఖ్యే - సాంఖ్యమందలి అనగాఁ బరమార్థ వస్తువివేకవిషయమందలి, బుద్ధిః - నిర్ణయము, జ్ఞానము, అభిహితా - చెప్పఁబడినది. యోగేతు - సాంఖ్యభిన్నమగు యోగమందలి, అనగా సాంఖ్యమును బొందించునట్టి కర్మానుష్ఠానరూప మగు సమాధియోగమందలి, ఇమాం - ఈముందు చెప్పఁబోవు బుద్ధిని, శృణు - వినుము. యయా బుద్ధ్యా - ఎట్టి కర్మయోగమందలి బుద్ధిచే, యుక్తః - కూడుకొనిన వాఁడవై, కర్మబంధం - ధర్మాధర్మరూపమగు బంధమును, ప్రహాస్యసి - విడిచిపెట్టగలవు.

తా:—ప్రకరణ విభాగము:—ఇంతవఱకు సాంఖ్యమందలి సిద్ధాన్త ముపదేశింపఁబడెను. ఇఁక యోగమునందలి సిద్ధాన్త ముపదేశింపఁబడుచున్నదను విశేష భాగమును శ్రీకృష్ణభగవానులీగీతముచేఁ బ్రతిపాదించుచున్నారు. ఈ శ్లోకమునందలి రెండవచరణము యోగఫలమును బోధించుచున్నది. యోగబుద్ధితోఁగూడిన వాఁడు కర్మబంధము నీశ్వరానుగ్రహమువలనఁ దోసివేయును. ఇచట సాంఖ్య

శోకమోహాపనయనాయ లౌకికో న్యాయః "స్వధర్మ మపి చావేక్ష్య" (గీ.2.31) ఇత్యాద్యైః శ్లోకై రుక్తో నతు తాత్పర్యేణ. పరమార్థదర్శనం త్విహ ప్రకృతం తచ్చోక్త ముపసంహ్రియతే. ఏషా తేఽభిహితేతి శాస్త్రవిషయవిభాగ ప్రదర్శనాయ. ఇహహి ప్రదర్శితే పునః శాస్త్రవిషయవిభాగ ఉపరిష్టాత్ "జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" (గీ. 3-3) ఇతినిష్ఠాద్వయవిషయం శాస్త్రం సుఖం ప్రవర్తిష్యతే, శ్రోతారశ్చ విషయవిభాగేన సుఖం గ్రహీష్యన్తీత్యతఆహ ఏషా త ఇతి. ఏషా తే తుల్య మభిహితోక్తా సాంఖ్యే పరమార్థవస్తువివేకవిషయే బుద్ధి ర్జ్ఞానం సాక్షా చ్ఛోకమోహాదిసంసారహేతుదోషనివృత్తికారణమ్, యోగేతుతత్ప్రాప్త్యుపాయే నిస్సంగతయా ద్వంద్వప్రహాణపూర్వక మీశ్వరారాధనార్థే కర్మయోగే కర్మానుష్ఠానే సమాధియోగే చేమా మనంతరమే వోచ్యమానాం బుద్ధిం శృణు. తాం బుద్ధిం స్తౌతి ప్రరోచనార్థం బుద్ధ్యా యయా యోగవిష

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. 40

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. 41

---

మందలి బుద్ధి యనఁ బరమార్థవస్తువివేకవిషయ మగుజ్ఞాన మనియు యోగ మన గర్మానుష్ఠానరూప మగు సమాధియోగ మనియుఁ దాత్పర్యము. 39

టీ:– ఇహ - మోక్షమార్గమగు కర్మయోగమందు, అభిక్రమనాశః - కృష్యాదులకు వలెనే ప్రారంభనాశనము, న అస్తి - లేదు, ప్రత్యవాయః - చికిత్సాదులందు వలెఁ బ్రత్యవాయముగాని, నవిద్యతే - తెలియఁబడదు. అస్య - ఈ, ధర్మస్య - ధర్మముయొక్క, స్వల్పమపి - స్వల్పానుష్ఠానమైనను, మహతః - గొప్పదగు, భయాత్ - సంసారభయమువలన, త్రాయతే - రక్షించును. 40

తా:– ప్రకృతమున నుపదేశింపఁ దలఁచిన గర్మయోగాతిశయ మీ గీతముచే వర్ణింపఁబడుచున్నది. ఈ కర్మయోగమును స్వల్పమాత్ర మాచరించినను జన్మమరణాదిసంసారభయమునుండి రక్షింపఁబడును గావున నీ కర్మయోగము మహాఫలప్రద మని యభిప్రాయము. 40

టీ:– ఇహ - శ్రేయోమార్గమగు నీ కర్మమార్గమున, వ్యవసాయాత్మికా - నిశ్చయస్వరూపమగు, బుద్ధిః - జ్ఞానము, ఏకా - ఒక్కటియే అనగా నీబుద్ధిశాస్త్ర ప్రమాణమువలనఁ గల్గుటచే నానావిధములగు నితరబుద్ధులను బాధించి నిశ్చలముగ నొకే రూపమున నిలిచియుండును. కురునందన! - అర్జునా! అవ్యవసాయినామ్ -

---

యా యుక్తో హేపార్థ! కర్మబంధః కర్మైవ ధర్మాధర్మాఖ్యో బంధః కర్మబంధః, తం ప్రహాస్య సీశ్వరప్రసాదనిమిత్తజ్ఞానప్రాప్త్యా వేత్యభిప్రాయః. 39

కించాన్యత్ నేహేతి. నేహ మోక్షమార్గే కర్మయోగేఽభిక్రమనాశోఽభిక్రమణ మభిక్రమః ప్రారంభ స్తస్య నాశః నాస్తి యథాకృష్యాదేః యోగవిషయే ప్రారంభస్య నానైకాంతికఫలత్వ మిత్యర్థః, కించ నాపి చికిత్సావత్ప్రత్యవాయో విద్యతే కింతు స్వల్ప మప్యస్య ధర్మస్య యోగధర్మస్యానుష్ఠితం త్రాయతే రక్షతి మహతో భయాత్ సంసారభయా జ్జన్మమరణాదిలక్షణాత్. 40

యేయం సాంఖ్యే బుద్ధి రుక్తా యోగేచ వక్ష్యమాణలక్షణా సా-వ్యవసాయేతి. వ్యవసాయాత్మికా నిశ్చయస్వభావైకైవ బుద్ధి రితరవిపరీతబుద్ధిశాఖాభేదస్య బాధికా, సమ్యక్ప్రమాణజనితత్వా దిహ శ్రేయోమార్గే హే కురునందన యాః పునరితరా

యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ! నాన్య ద స్తీతివాదినః. 42

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహులాం భోగై శ్వర్యగతింప్రతి. 43

---

ప్రమాణమువలనఁ గలిగిన వివేకము లేనివారలయొక్క, బుద్ధయః - వృత్తులు, బహుశాఖాః - అనేకవిధములును, అనంతాశ్చ - హద్దు లేనివియు.

తా:—శ్రేయోమార్గమగు నీ కర్మయోగమునందు రాగద్వేషములనుండి మరలి పరిపక్వము జెందినబుద్ధి యొక్కటియే ప్రసరింపఁగలదుగాని విపరీతబుద్ధులీకర్మయోగమునఁ దుష్టిఁ జెంద నేరవు. దానంజేసి పరిపక్వము లేని యంతఃకరణము గలవారల కియ్యది రుచింపదు. 41

టీ:—పార్థ! - అర్జునా!, వేదవాదరతాః - వేదమందలి యర్థవాదవాక్యముల యందభినివేశము గలిగినట్టియు, కామాత్మానః- కోరికలయందాసక్తి గలిగినట్టియు, స్వర్గపరాః - స్వర్గమే పరమపురుషార్థముగాఁ దలఁచునట్టియు, అన్యత్ - కర్మకంటె మఱి యొకటి, న అస్తిఇతి - లేదని, వాదినః - వాదించు స్వభావము గలిగినట్టియు, అవిపశ్చితః - అల్పబుద్ధులగు నవివేకులు, భోగైశ్వర్యగతింప్రతి - భోగైశ్వర్యముల యొక్క ప్రాప్తిని గుఱించి సాధనభూతములగు, క్రియావిశేషబహులాం - బహువిధములగు క్రియావిశేషముల బోధించునట్టియు, జన్మకర్మ ఫలప్రదాం - జన్మయే కర్మ

---

బుద్ధయో యాసాం శాఖాభేదప్రచారవశా దనంతోఽపారోఽనుపరతః సంసారో నిత్యప్రతతో విస్తీర్ణో భవతి ప్రమాణజనితవివేకబుద్ధినిమిత్తవశా చ్చోపరతాస్వనంత భేదబుద్ధిషు సంసారోఽప్యుపరమతే. తా బుద్ధయో బహుశాఖా బహ్వ్యః శాఖా యాసాం తా బహుశాఖా బహుభేదా ఇత్యేతత్; ప్రతిశాఖాభేదేన హ్యనంతాశ్చ బుద్ధయః. కేషాం? అవ్యవసాయినాం ప్రమాణజనితవివేకబుద్ధిరహితానా మిత్యర్థః. 41

యేషాం వ్యవసాయాత్మికా బుద్ధి ర్నాస్తి తే - యామితి. యా మిమాం వక్ష్యమాణాం పుష్పితాం పుష్పితవృక్ష ఇవ శోభమానాం శ్రూయమాణరమణీయాం వాచం వాక్యలక్షణాం ప్రవదంతి. కే? అవిపశ్చితోఽల్పమేధసోఽవివేకిన ఇత్యర్థః. వేదవాదరతాః బహ్వర్థవాదఫలసాధనప్రకాశకేషు వేదవాక్యేషు రతాః హేపార్థ! నాన్యత్ స్వర్గపశుపుత్రాదిఫలసాధనేభ్యః కర్మభ్యోఽస్తీత్యేవం వాదినో వదనశీలాః. 42

తేచ - కామాత్మానఇతి. కామాత్మానః కామస్వభావాః కామపరా ఇత్యర్థః; స్వర్గపరాః స్వర్గః పరః పురుషార్థో యేషాం తే స్వర్గపరాః స్వర్గప్రధానాః.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే. 44

---

ఫలముగా బోధించునట్టియు, యాం ఇమాం - ఏయీ, పుష్పితాం - పుష్పించిన వృక్షమువలె శోభించునట్టియు వినుటకు రమణీయ మగునట్టియు, వాచం - ఫలస్తావక వాక్యములను, ప్రవదంతి - పలుకుచుందురు. 42-43

తా:-పరిపక్వాన్తఃకరణము లేనివారల స్వభావ మీ రెండుగీతలచే వర్ణింపఁబడుచున్నది. ఫలసాధనములగు క్రియావిశేషములతో నిండియున్నట్టియు, వినుటకు మనోహరము లగునట్టియు, స్తావక వాక్యములనే యెల్లప్పుడును బల్కుచుందురు గాని యుత్తమజ్ఞానము నుపదేశించు నుపనిషద్వాక్యములను సరకుగొన రని యభిప్రాయము. 42-43

టీ:-భోగైశ్వర్యప్రసక్తానాం - భోగములందును, ఐశ్వర్యములందును దీవ్రమగు నాసక్తిగలిగినట్టియు, తయా - క్రియావిశేషములతో నిండిన వాక్కుచేత, అపహృతచేతసాం - ఆకర్షింపఁబడిన యంతఃకరణ గలవారలకు, వ్యవసాయాత్మికా - సాంఖ్యమందుగాని యోగమందుగాని నిశ్చయభావముఁ జెందిన, బుద్ధిః - స్థైర్యము, సమాధౌ - అంతఃకరణమందు, న విధీయతే - కలుగనేరదు. 44

తా:-ఇచ్చట సమాధి యను పదమున కంతఃకరణ మని యర్థము. ఎల్లప్పుడును గోర్కెలను గోరుచు దత్ప్రాప్తికిఁ దగు నుపాయంబుల నెక్కుడుగ వర్ణించిన

---

జన్మకర్మఫలప్రదాం కర్మణః ఫలం కర్మఫలం జన్మైవ కర్మఫలం జన్మకర్మఫలం తత్ప్రదదాతీతి జన్మకర్మఫలప్రదా, తాం వాచం ప్రవదన్తీ త్యనుషజ్యతే. క్రియావిశేషబహులాం క్రియాణాం విశేషాః క్రియావిశేషా స్తే బహులా యస్యాం వాచి తాం స్వర్గపశుపుత్త్రాద్యర్థా యయా వాచా బాహుల్యేన ప్రకాశ్యన్తే. భోగైశ్వర్యగతిం ప్రతి, భోగశ్చైశ్వర్యంచ భోగైశ్వర్యే, తయోర్గతిః ప్రాప్తిః భోగైశ్వర్యగతిస్తాంప్రతి సాధనభూతా యే క్రియావిశేషా స్తద్బహులాం తాం వాచం ప్రవదంతో మూఢాః సంసారే పరివర్తన్త ఇత్యభిప్రాయః. 43

తేషాంచ—భోగేతి. భోగైశ్వర్యప్రసక్తానాం, భోగః కర్తవ్య మైశ్వర్యం చేతి భోగైశ్వర్యయో రేవ ప్రణయవతాం తదాత్మభూతానాం తయా క్రియావిశేషబహులయా వాచాఽపహృతచేతసా మాచ్ఛాదితవివేకప్రజ్ఞానాం వ్యవసాయాత్మికా సాంఖ్యే యోగేవా యా బుద్ధిస్సా సమాధౌ, సమాధీయతేఽస్మిన్ పురుషోప

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. 45

యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. 46

---

యర్థవాదములచేఁ దిరస్కరింపఁబడిన యంతఃకరణము గలవారలకు గర్మయోగమం దుగాని సాంఖ్యమందుగాని బుద్ధి యెంతమాత్రము ప్రసరింపదని తాత్పర్యము. 44

టీ:-వేదాః. వేదములు, త్రైగుణ్యవిషయాః - సంసారమును బ్రకాశింపఁ జేయునవి. అనగా సంసారహేతువులగు కర్మలను బోధించునవి. అర్జున! - నీవన్ననో, నిస్త్రైగుణ్యః - నిష్కాముఁడవు, భవ - అగుమా!, నిర్ద్వంద్వః - ద్వంద్వరహితుఁడవు, నిత్యసత్వస్థః - ఎల్లప్పుడును సత్త్వగుణమునే యాశ్రయించువాఁడవు, నిర్యోగక్షేమః - యోగక్షేమరహితుఁడవు, ఆత్మవాన్ - అప్రమత్తుఁడవును, భవ - అగుమా! 45

తా:-ఇచ్చట "వేదాః" అను పదమునకు బ్రాహ్మణపరివ్రాజక న్యాయముచేఁ గర్మప్రతిపాదక వేదభాగ మని యర్థము. అయ్యది యుపనిషద్భిన్నమగు మంత్రబ్రాహ్మణాత్మకము. "నిస్త్రైగుణ్యో భవ" యనునది "తితిక్షస్వ" యను దానివలె విధి యగుచున్నది. శేషించిన గీత మర్థవాదరూపము. 45

టీ:-ఉదపానే - కూపతటాకాద్యుదపానములయందు, యావాన్ - ఎంతపరిమాణముగల, అర్థః - స్నానపానాదిప్రయోజనము గలదో, తావాన్ - అంతపరి

---

భోగాయ సర్వమితి సమాధి రంతఃకరణం బుద్ధి స్తస్మిన్ సమాధౌ న విధీయతే న భవతీత్యర్థః. 44

య ఏవం వివేకబుద్ధిరహితా స్తేషాం కామాత్మనాం యత్ఫలం తదాహ - త్రైగుణ్యేతి. త్రైగుణ్యవిషయా స్త్రైగుణ్యం సంసారో విషయః ప్రకాశయితవ్యో యేషాం తే వేదా స్త్రైగుణ్యవిషయాః త్వంతు నిస్త్రైగుణ్యో భవార్జున నిష్కామో భవేత్యర్థః; నిర్ద్వంద్వః సుఖదుఃఖహేతూ సప్రతిపక్షౌ పదార్థౌ ద్వంద్వశబ్దవాచ్యౌ తతో నిర్గతో నిర్ద్వంద్వో భవ; త్వం నిత్యసత్త్వస్థః సదా సత్త్వగుణాశ్రితో భవ; తథా నిర్యోగక్షేమోఽనుపాత్త స్యోపాదానం యోగః ఉపాత్తస్య రక్షణం క్షేమః, యోగక్షేమప్రధానస్య శ్రేయసి ప్రవృత్తి ర్దుష్కరేత్యతో నిర్యోగక్షేమో భవ, ఆత్మవా నప్రమత్తశ్చ భవ; ఏష తవోపదేశః స్వధర్మ మనుతిష్ఠతః. 45

సర్వేషు వేదోక్తేషు కర్మసు యా న్యనంతాని ఫలాని తాని నాపేక్ష్యన్తే చేత్కిమర్థం తా నీశ్వరాయే త్యనుష్ఠీయన ఇతి ఉచ్యతే శృణు యావానితి. యథా

మాణము గలప్రయోజనము, సర్వత స్సంప్లుతోదకే - అంతట నిండియుండు మహా జలాశయమునందును, గలుగుచుండును - అనగాఁ గూపతటాకాది ప్రయోజనమంతయు మహాజలాశయమునందు నంతర్భవించుచున్నది. ఆ తీరుననే, విజానతః - పరమార్థతత్త్వమును గుర్తెఱింగియున్నట్టియు, నిస్త్రైగుణ్యభావమును జెందినట్టియు, బ్రాహ్మణస్య - సర్వకర్మసంన్యాసముచేసిన బ్రహ్మవిదునకు, సర్వేషు - సమస్తములగు, వేదేషు - వేదోక్తకర్మలయందు, తావాన్ ఏవ (అర్థః) - అంతమాత్రమే (ప్రయోజనము.) అనగా సంన్యాసియొక్క పారమార్థికజ్ఞానము, అంతట జలముతో నిండియున్న సముద్రమువంటిది. ఆ జ్ఞానిదృష్టిచే సకలకర్మంబులు నుదపానతుల్యంబులు. కావున నవ్వాని ఫలముకూడ జ్ఞానమునం దంతర్భావము చెందుచున్నది. దానంజేసి సంన్యాసికి కర్మాచరణ మక్కఱలేకయే కర్మఫలము కూడ లభించునని యభిప్రాయము. ఇచట బ్రాహ్మణశబ్దము యౌగికార్థముచే బ్రహ్మవేత్తయందన సంన్యాసియందు బర్యవసానమును జెందుచున్నది. సంన్యాసియను యౌగికార్థముతో నొప్పు బ్రాహ్మణశబ్దమును బ్రకృతపు జిజ్ఞాసువును క్షత్త్రియుండు నగు నర్జునున కుపదేశము చేయు ప్రకరణమునఁ బ్రయోగింపఁబడుటచే ద్విజులగు క్షత్త్రియ వైశ్యులకుఁ గూడ సంన్యాసమం దధికారము గలదని శ్రీకృష్ణభగవానుల యాశయమైనట్లు నిశ్చయింపనోపు. ఇట్లీగీతముచే నిస్త్రైగుణ్యభావాతిశయము స్తవము చేయఁబడుటచే నీగీతము 'నిస్త్రైగుణ్యో భవ' యను విధియొక్క యర్థవాదము. 46

లోకే కూపతటాకాద్యనేకస్మి న్నుదపానే పరిచ్ఛిన్నోదకే యావా న్యావత్పరిమాణః స్నానపానాది రర్థః ఫలం ప్రయోజనం స సర్వోఽర్థః సర్వతః సంప్లుతోదకేపి తావా నేవ సంపద్యతే తత్రాంతర్భవతీత్యర్థః. ఏవం తావాం స్తావత్పరిమాణ ఏవ సంపద్యతే, సర్వేషు వేదేషు వేదోక్తేషు కర్మసు యోఽర్థో యత్కర్మఫలం సోఽర్థో బ్రాహ్మణస్య సంన్యాసినః పరమార్థతత్త్వం విజానతో యోఽర్థో విజ్ఞానఫలం సర్వతః సంప్లుతోదకస్థానీయం తస్మిం స్తావానేవ సంపద్యతే తత్రైవాంతర్భవతీత్యర్థః "యథాకృతాయ విజితాయాధరేయాః సంయ న్త్యేవ మేనం సర్వం తదభిసమేతి యత్కించప్రజాః సాధుకుర్వంతి య స్తద్వేద య త్స వేద" (ఛాం. 4-1-4) ఇతి శ్రుతేః, "సర్వం కర్మాఖిలం" (గీ. 4-8-3) ఇతిచ వక్ష్యతి. తస్మాత్ ప్రాక్ జ్ఞాననిష్ఠాధికారప్రాప్తేః కర్మణ్యధికృతేన కూపతటాకాద్యర్థస్థానీయమపి కర్మ కర్తవ్యమ్. 46

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూ ర్మా తే సంగో౽స్త్వకర్మణి. **47**

---

టీ:- తే - నీకు, కర్మణ్యేవ - కర్మయందే, అధికారః - యోగ్యత కలదు, కాని జ్ఞాననిష్ఠయం దధికారము లేదని ఏవకారముచేఁ దెలియవచ్చెడిని. కదాచన - ఒకానొకప్పుడును, ఫలేషు - ఫలములయందు, అనగా గర్మఫలములఁ బుట్టించుటయందు, అధికారః - సామర్థ్యము, మా - లేదు, కర్మఫలహేతుః - కర్మఫలమునకు గారణము, మాభూః - కావలదు, అనగా గర్మఫలమునందు దృష్ణఁ జెందవలదని యభిప్రాయము. తే - నీకు, అకర్మణి - కర్మ మానుటయందు, సంగః - ప్రీతి, మాఅస్తు - లేకుండుగాక. **47**

తా:- ప్రతిపురుషునకు శాస్త్రము విధించుగర్మల నాచరించుటకు దగుయోగ్యత కలదు. అనగా గర్మల నాచరింపగల కర్తృత్వశక్తి గలదుగాని యాయాయి కర్మఫలమును బుట్టించుటకు స్వాతంత్ర్యము లేదు. ఇయ్యది సర్వజనానుభవమగు విషయమే. ఏహేతువుచేఁ గర్మఫలమును బుట్టించు సామర్థ్యము లేదో యట్టిఫలమునందు లిప్సఁ జెందుట యనుచితము. కావునఁ బ్రతిపురుషుఁడును గర్మఫలమునందు దృష్ణఁ జెందవల దని యభిప్రాయము. అట్లు దృష్ణఁ జెందినచో ఫలప్రాప్తివఱకు నిరీక్షింపఁ దదాయత్తమగు జననమరణాదుల నొందుచు గ్లేశము నొందవలసివచ్చును. ఫలలిప్స లేనిచో ఫలమునకై నిరీక్షింప నవసరము లేమి నుత్కృష్టతను బొంద నవకాశము జిక్కును. ఫలప్రాప్తి దుర్ఘటమగుటచే ఫలలిప్స విడువవలయుననినచో ఫలాపేక్ష లేమి గర్మయందు నైరస్యభావము కలిగి కర్మ నాచరింపనిచ్ఛ లేక కర్మనుండి విరమమును జెందు తలంపు గలుగవచ్చును. అట్టితలఁ పెన్నటికిని గలుగగూడదను నాశయముమీర గర్మను జేసితీరవలయునని యుపదేశింపఁబడుచున్నది. ఈగీతముచే గర్మయోగమున కధికారి సూచింపఁబడుచున్నాఁడు. కర్మఫలాభిలాష లేనట్టియు జ్ఞాననిష్ఠకు నధికారము లేనట్టియు పురుషుఁడు కర్మయోగమున కధికారి. కర్మఫలాభిలాష లేనంతనే కర్మాధికారమువదలి జ్ఞానాధికారము లభింపదు. ఫలాభిలాషికి గర్మను విధింపనవసరములేదు; ఫలలిప్సయే ప్రవర్తింపజేయును. ఫలలిప్స లేనివానికిఁ గర్మయం దభిరుచి కలుగదు. దానంజేసి కర్మయందలినైరస్యభావము కలుగ విరమిం

---

తత్ర చ కర్మణీతి. కర్మణ్యేవాధికారో న జ్ఞాననిష్ఠాయాం తే తవ తత్రచ కర్మ కుర్వతో మా ఫలేష్వధికారో౽స్తు కర్మఫలతృష్ణా మా భూత్కదాచన కస్యాంచిదప్యవస్థాయా మిత్యర్థః. యదా కర్మఫలే తృష్ణా తే స్యాత్తదా కర్మఫలప్రాప్తే ర్హేతుః స్యాః, ఏవం మా కర్మఫలహేతు ర్భూః యదాహి కర్మఫలతృష్ణాప్రయుక్తః కర్మణి ప్రవర్తతే తదా కర్మఫలస్యైవ జన్మనో హేతు ర్భవేత్, యది కర్మఫలం నేష్యతే

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. 48

---

వఁదలచువాఁడు జ్ఞానమును జేకొనలేక భ్రంశమును జెందవచ్చును. అట్టివాని నుద్ధరించుటకై కర్మయోగ ముపదేశింపఁబడుచున్నది. ప్రకరణసందర్భవశమున గర్మయోగము నిస్త్రైగుణ్యపథంబునకు సాధనమని సుస్పష్టమగుచున్నది. ఏలనన పైని "నిస్త్రైగుణ్యో భవ" యనివిధించినట్టి నిస్త్రైగుణ్యపథమును గర్మాధికారి యగు నర్జునుండు క్రమముగఁ బొంద నీకర్మయోగ ముపదేశింపఁబడుటజేసి నిస్త్రైగుణ్యపథంబగు సాంఖ్యమున కీకర్మయోగము సాధన మని వేఱ వచింపనక్కఱలేదు. ఈ గీతముచే నర్జునునియోగ్యత నర్జునునికిఁ దెలియఁజెప్పి ప్రకృతపు యుద్ధఫలము లగు విజయరాజ్యసుఖాదుల నాతఁ డపేక్షింపకపోయినను నాతఁడు కర్మయందే యధికారము గలవాఁ డగుటచే గర్మయోగము ననుసరింపవలయు నని తాత్పర్యము. 47

టీ:—ధనంజయ ! - అర్జునా! సంగం - ఫలతృష్ణను, త్యక్త్వా - విడిచి, యోగస్థః - యోగనిష్ఠుఁడవై, సిద్ధ్యసిద్ధ్యోః - ఫలాఫలములందు, సమః - తుల్యభావము గలవాఁడవుగా, భూత్వా - అయి, కర్మాణి - కర్మలను, కురు - చేయుమా! సమత్వం - సిద్ధ్యసిద్ధులయందలి సమత్వమే, యోగః - యోగమని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది.

తా:—కర్మయోగము ప్రకృతమున "నిస్త్రైగుణ్యో భవ" యని సంన్యాసమును విధించి యట్టి నిస్త్రైగుణ్యాతిశయమును "యావా నర్థ ఉదపానే" యను గీతముచే బోధింప నర్జునుండు తన మనోరథ మీడేరె నని తలఁచి యుద్ధమునుండి విరతి జెంద నుద్యమింపవచ్చును. కాని యట్టి యుద్యమంబున కర్జునున కధికారము లేదనియు గర్మయందే యధికారము గలదనియు దానంజేసి కామ్యకర్మలను విడనాడి కర్మయోగము నాచరింపవలయు ననియు నీ రెండు గీతములచే శ్రీకృష్ణభగవాను లుపదేశించియున్నారు. 48

---

కిం కర్మణా దుఃఖరూపేణేతి మా తే తవ సంగోఽస్త్వకర్మ ణ్యకరణే ప్రీతి ర్మాభూత్. 47

యది కర్మఫలప్రయుక్తేన న కర్తవ్యం కర్మ కథం తర్హి కర్తవ్య మిత్యుచ్యతే యోగస్థఇతి. యోగస్థః సన్ కురు కర్మాణి కేవల మీశ్వరార్థం తత్రాపీశ్వరో మే తుష్య త్వితి సంగం త్యక్త్వా ధనంజయ ఫలతృష్ణాశూన్యేన క్రియమాణే కర్మణి సత్త్వశుద్ధిజా జ్ఞానప్రాప్తిలక్షణా సిద్ధి స్తద్విపర్యయజాఽసిద్ధి స్తయోః సిద్ధ్యసిద్ధ్యో రపి సమ స్తుల్యో భూత్వా కురు కర్మాణి కోఽసౌ యోగో యత్రస్థః కుర్వి త్యుక్తమ్. ఇదమేవ తత్సిద్ధ్యసిద్ధ్యోః సమత్వం యోగ ఉచ్యతే. 48

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. 49

---

టీ:-ధనంజయ ! - అర్జునా! బుద్ధియోగాత్ - సమత్వబుద్ధితోఁ గూడిన కర్మకంటె కర్మఫలాభిలాషతోఁ జేయఁబడినకర్మ, దూరేణ - అతివిప్రకర్షముచే, అవరంహి - నికృష్టముగదా ! కావున, బుద్ధౌ - కర్మయోగమందుగాని సాంఖ్యమందుగాని, శరణం - ఆశ్రయమును; అన్విచ్ఛ - కోరుమా ! ఫలహేతవః - ఫల తృష్ణతోఁగూడినవారలు, కృపణాః - నికృష్టకర్మ నాచరించుటచే దీనులుగదా! 49

తా:-ప్రకృతమున నుపదేశింపఁబడిన కర్మయోగపు టతిశయ మీగీతముచే నిర్వచింపఁబడుచున్నది. ఇచట బుద్ధియోగ మనఁ గర్మయోగము. కర్మయోగ మన ఫలాభిసంధిరహితముగ నాచరింపఁబడు స్వవర్ణాశ్రమోచితమగు నిత్యనైమిత్తిక కర్మలు. కర్మ యనగా ఫలాభిసంధిరహితముగ నాచరింపఁబడు స్వవర్ణాశ్రమోచిత మగు బుద్ధితో నొనరించు కర్మవిశేషములు. దీనిని గామ్యకర్మ యని బుధులు చెప్పుదురు. కర్మయోగము నిష్కామకర్మయని కూడ జెప్పఁబడును. బుద్ధియోగము కంటె కామ్యకర్మ చాల నికృష్టమైనది. కావున నట్టి కామ్యకర్మనుండి మరలి బుద్ధి యందన సాంఖ్యవిషయికబుద్ధియందు గాని యోగవిషయికబుద్ధియందుగాని శరణము చొచ్చు మనిన నద్దానియందే బుద్ధిని సర్వవిధముల నిలిపి వర్తింపుమని హిత శాసనము. ఏలనన గర్మఫలమునకు గారణమగువార లన గర్మఫలము నభిలషించు వారలు కృపణులు. అన ఆత్మజ్ఞానశూన్యు లగు దీనులు. ఆత్మజ్ఞానము లేమి విషయ సుఖములనే పరమపురుషార్థంబుగ దలంచి యట్టి విషయసుఖంబులు ఫలముగాఁ గలిగిన కర్మల నాచరించుచు జననమరణపరివాహరూపసంసారమునఁ బుట్టుచు జచ్చుచు నివృత్తిఁజెందక బాధపడుచుందు రని యభిప్రాయము. దానంజేసి కామ్య కర్మలలోఁ దగులువడవల దనియు నిష్కామకర్మయగు నిత్యనైమిత్తికంబులఁ జక్కగ నాచరించి కృతకృత్యత నొందవలయుననియు బరమతాత్పర్యము.

---

యత్పున స్సమత్వబుద్ధియుక్త మీశ్వరారాధనార్థం కర్మోక్త మేతస్మాత్కర్మణః దూరేణేతి. దూరే ణాతివిప్రకర్షేణ హ్యవరం నికృష్టం కర్మఫలార్థినా క్రియమాణం బుద్ధియోగాత్ సమత్వబుద్ధియుక్తాత్ కర్మణః జన్మమరణాది హేతుత్వాత్ ధనంజయ. యత ఏవం తతో యోగవిషయాయాం బుద్ధౌ తత్పరిపాకజాయాం వా సాంఖ్యబుద్ధౌ శరణ మాశ్రయ మభయప్రాప్తికారణ మన్విచ్ఛ ప్రార్థయస్వ పరమార్థజ్ఞానశరణో భవేత్యర్థః యతోఽవరం కర్మ కుర్వాణాః కృపణా దీనాః ఫలహేతవః ఫలతృష్ణాప్రయుక్తా స్సంతః "యోవా ఏత దక్షరం గార్గ్యవిది త్వాఽస్మాల్లోకా త్ప్రైతి స కృపణః" (బృ. 3.8.10) ఇతిశ్రుతేః. 49

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. 50

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్. 51

---

టీ:-బుద్ధియుక్తః - సమత్వబుద్ధితోఁగూడినవాఁడు, ఇహ - ఈలోకమునందే, ఉభే - రెండగు, సుకృత దుష్కృతే - పుణ్యపాపములను. జహాతి - విడచిపెట్టుచున్నాఁడు. తస్మాత్ - ఆకారణముచే, యోగాయ - బుద్ధియోగముకొఱకు, యుజ్యస్వ - ప్రయత్నించుమా! యోగః - యోగమన, కర్మసు - కర్మలయందలి, కౌశలమ్ - నేర్పు. అనగా సమభావము. 50

టీ:- మనీషిణః - విద్వాంసులు, బుద్ధియుక్తాః - సమత్వబుద్ధితోఁ గూడినవారలై, కర్మజం - కర్మవలన పుట్టెడు, ఫలం - ప్రయోజనమును, త్యక్త్వా - విడిచిపెట్టి, జన్మబంధ వినిర్ముక్తాః - జన్మమనెడి బంధమునుండి విడినటువంటివారై, అనామయం - ఉపద్రవరహితమగు, పదం - మోక్షస్థానమును, గచ్ఛన్తి - పొందుచున్నారు. 51

తా:-సమత్వబుద్ధితోఁగూడి స్వధర్మము ననుష్ఠించువానికిఁ గలుగు మహాఫల మీ రెండుగీతములచే వివరింపఁబడుచున్నది. బుద్ధియుక్తుఁ డీలోకముననే యనఁ నీ శరీరమం దుండగనే యనారబ్ధములగు పుణ్యపాపముల రెండిటిని విడిచిపెట్టును.

---

సమత్వబుద్ధియుక్తస్సన్ స్వధర్మ మనుతిష్ఠన్ యత్ ఫలం ప్రాప్నోతి తచ్ఛృణు బుద్ధీతి. బుద్ధియుక్తః సమత్వవిషయయా బుద్ధ్యా యుక్తో బుద్ధియుక్తో జహాతి పరిత్యజతీహాస్మిన్ లోక ఉభే సుకృతదుష్కృతే పుణ్యపాపే సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తి ద్వారేణ యత స్తస్మాత్సమత్వబుద్ధియోగాయ యుజ్యస్వ ఘటస్వ, యోగోహి కర్మసు కౌశలం స్వధర్మాఖ్యేషు కర్మసు వర్తమానస్య యా సిద్ధ్యసిద్ధ్యో స్సమత్వ బుద్ధిరీశ్వరార్పితచేత స్తయా తత్కౌశలం కుశలభావః తద్ధి కౌశలం యద్బంధనస్వభావాన్యపి కర్మాణి సమత్వబుద్ధ్యా స్వభావా న్నివర్తన్తే; తస్మాత్సమత్వబుద్ధియుక్తో భవ త్వమ్. 50

యస్మాత్ కర్మజమితి. కర్మజం ఫలం త్యక్త్వేతి వ్యవహితేన సంబంధః; ఇష్టానిష్టదేహప్రాప్తిః కర్మజం ఫలం కర్మభ్యో జాతమ్, బుద్ధియుక్తాః సమత్వబుద్ధియుక్తాః హి యస్మాత్ఫలం త్యక్త్వా పరిత్యజ్య మనీషిణో జ్ఞానినో భూత్వా జన్మబంధ వినిర్ముక్తాః సంతః పదం పరమం విష్ణోర్మోక్షాఖ్యం గచ్ఛన్త్యనామయం సర్వోపద్రవ

యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ. 52
శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. 53

---

అనగాఁ గర్మయోగమునకు గాని సాంఖ్యయోగమునకుఁగాని తగు యోగ్యత గల్గినం తనే ప్రాక్తనజన్మార్జితంబులగు పుణ్యపాపములు రెండు నట్టి సామాన్యపుజ్ఞానముచేతనే నమసిపోయి బంధహేతువులు కానేరవు. ఇయ్యది యీలోకముననే లభించును. ఇంతియకాదు. దేహపాతానంతరము బ్రహ్మలోకమును బొందును. ఏలనన గర్మ వలనఁ గల్గెడుఫలము నీబుద్ధియుక్తుఁడు త్యజించుటచే గర్మఫల మగునట్టియు నిహ పరముల కతీతమగునట్టియు నిరామయపదమగు బ్రహ్మలోకమును బొందునని తాత్పర్యము. బ్రహ్మలోకమును బొందినవారలకుఁ బునరావృత్తి లేదనియు గ్రమ ముక్తి గలుగుననియు శ్రుతిస్మృతిమర్యాద. 50-51

టీ:— తే - నీయొక్క, బుద్ధిః - అంతఃకరణము, మోహకలిలం - అవివేకరూప మగు కాలుష్యమును, యదా - ఎప్పుడు, వ్యతితరిష్యతి - దాఁటుచున్నదో, తదా - అప్పుడు, శ్రోతవ్యస్య - వినఁదగినదానియొక్కయు, శ్రుతస్యచ - వినినదాని యొక్కయు, నిర్వేదం - వైరాగ్యమును, గంతాసి - పొందఁగలవు. 52

టీ:— శ్రుతివిప్రతిపన్నా - నానావిధములగు కర్మలను ఫలములను వినుటచే విప్రతిపత్తిఁజెందిన, తే-నీయొక్క, బుద్ధిః-అంతఃకరణము, యదా - ఎప్పుడు, నిశ్చలా-

---

రహిత మిత్యర్థః. అథవా "బుద్ధియోగా ద్ధనంజయ" (గీ.2.49) ఇత్యారభ్య పర మార్థదర్శనలక్షణైవ సర్వతః సంప్లుతోదకస్థానీయా కర్మయోగజసత్త్వశుద్ధి జనితా బుద్ధి ర్దర్శితా సాక్షా త్సుకృతదుష్కృతప్రహాణాదిహేతుత్వశ్రవణాత్. 51

యోగానుష్ఠాన జనిత సత్త్వ శుద్ధిజా బుద్ధిః కదా ప్రాప్స్యత ఇత్యుచ్యతే యదేతి. యదా యస్మిన్ కాలే తే తవ మోహకలిలం మోహాత్మక మవివేక రూపం కాలుష్యం యేనాత్మానాత్మవివేకబోధం కలుషీకృత్య,విషయంప్ర త్యంతః కరణం ప్రవర్తతే తత్తవ బుద్ధి ర్వ్యతితరిష్యతి వ్యతిక్రమిష్యతి. శుద్ధభావ మాప త్స్యత ఇత్యర్థః. తదా తస్మిన్ కాలే గంతాసి ప్రాప్స్యసి నిర్వేదం వైరాగ్యం శ్రోతవ్యస్య శ్రుతస్యచ తథా శ్రోతవ్యం శ్రుతం చ తే నిష్ఫలం ప్రతిపద్యత ఇత్యభిప్రాయః 52

మోహకలిలాత్యయద్వారేణ లబ్ధాత్మవివేకజప్రజ్ఞః కదా కర్మయోగజం ఫలం పరమార్థయోగ మవాప్స్యసీతిచే చ్ఛృణు శ్రుతివిప్రతిపన్నేతి. శ్రుతివిప్రతి

అర్జున ఉవాచ—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్. 54

---

విక్షేపరహితమ్మై, సమాధౌ - ఆత్మయందు, అచలా-వికల్పవర్జితమై స్థిరతఁ గనునో, తదా - అప్పుడు, యోగం - వివేకప్రజ్ఞారూపమగు సమాధిని, ప్రాప్స్యసి - పొందఁగలవు. 53

తా:-సాంఖ్యయోగమును జేకొనుటకుఁ గర్మయోగ మెంతకాల మాచరింపవలయును? సాంఖ్యయోగమునకు తగునధికార మెట్టిది యను విశేష మీగీతముల రెండిటిచే నిరూపింపఁబడుచున్నది. అంతఃకరణమునుండి మోహకశ్మలము తొలఁగి బహ్వర్థములను వినుటచేఁ బరిపరివిధముల విప్రతిపత్తిఁ జెందినట్టి యంతఃకరణము విషయములనుండి మరలి స్వస్వరూపమునందే చలింపక యెప్పుడు నిలుచునో యప్పుడు యోగము పూర్తినొందినట్లు తెలియనగు నని యభిప్రాయము. రెండవగీతమునందలి "నిశ్చలా" యనువిశేషణముచేఁ బ్రత్యాహారమును "అచలా" యను విశేషణముచే ధారణమును సూచనచేయఁబడుచున్నవి. అంతఃకరణము విషయముల ననుసరించి పరువిడకుండ మరలుటకు నిశ్చలభావమనియును, లక్ష్యమునందు స్థిరీభావము నొందిన నచలభావ మనియును గ్రహించునది. ఇచ్చట "సమాధి" శబ్దమునకు ఆత్మ యని యర్థము. లక్ష్యమగు నాత్మయం దన్తఃకరణము విక్షేపరహితమై నిలిచి యుండినచో నప్పుడు యోగఫలము లభించెననియు నప్పుడు పురుషుఁడు సర్వకర్మసంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠ యగు సాంఖ్యమున కధికారి యగుచున్నాఁడనియు నంతవఱకును గర్మయోగము నాచరించి తీరవలయుననియు గర్మయోగ ప్రకరణపు తాత్పర్యము. 52-53

టీ:—కేశవ! - శ్రీకృష్ణా! సమాధిస్థస్య - సమాధినిష్ఠుఁడైన, స్థితప్రజ్ఞస్య - నేనే పరబ్రహ్మనను దృఢనిశ్చయము గలిగినటువంటివాని సంబంధమగు, భాషా-వచ

---

పన్నా౭నేక సాధ్యసాధనసంబంధప్రకాశనశ్రుతిభిః శ్రవణై ర్విప్రతిపన్నా నానాప్రతిపన్నా విక్షిప్తా సతీ తే తవ బుద్ధి ర్యదా యస్మిన్ కాలే స్థాస్యతి స్థిరీభూతా భవిష్యతి నిశ్చలా విక్షేపచలనవర్జితా సతీ సమాధౌ, సమాధీయతే చిత్త మస్మిన్నితి సమాధి రాత్మా, తస్మిన్నాత్మ నీత్యేతత్, అచలా తత్రాపి వికల్పవర్జితేత్యేతత్, బుద్ధి రన్తఃకరణమ్, తదా తస్మిన్ కాలే యోగ మవాప్స్యసి వివేకప్రజ్ఞాం సమాధిం ప్రాప్స్యసి.

ప్రశ్నబీజం ప్రతిలభ్య లబ్ధసమాధిప్రజ్ఞస్య లక్షణబుభుత్సయా అర్జున ఉవాచ స్థితప్రజ్ఞస్యేతి. స్థితా ప్రతిష్ఠితా 'అహ మస్మి పరం బ్రహ్మే'తి ప్రజ్ఞా యస్య స స్థిత

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః,
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి. 16

---

వర్షమువలన, అన్నసంభవః - అన్నముయొక్క పుట్టుక యగుచున్నది, యజ్ఞాత్ - యజ్ఞమువలన, పర్జన్యః - వర్షము, భవతి - పుట్టుచున్నది, యజ్ఞః - యజ్ఞము, కర్మసముద్భవః - కర్మవలనఁ బుట్టినదై యగుచున్నది. 14

టీ:—కర్మ - కర్మను, బ్రహ్మోద్భవం - వేదమువలనఁ బుట్టినదిగా, విద్ధి - తెలిసికొనుమా! బ్రహ్మ - వేదము, అక్షరసముద్భవమ్ - అక్షర మనెడి పరమాత్మ వలనఁ బుట్టుచున్నది, తస్మాత్ - ఆకారణముచే నన సర్వకారణ మగుటచే, బ్రహ్మ - పరమాత్మ, సర్వగతం - సర్వవ్యాపకమై, నిత్యం - ఎల్లప్పుడును, యజ్ఞే - యజ్ఞమందు, ప్రతిష్ఠితమ్ - స్థిరత వహించుచున్నది. 15

టీ:—ఏవం - ఈప్రకారము, ప్రవర్తితం - ఈశ్వరునిచేఁ బ్రవర్తింపజేయఁబడిన, చక్రం - వేదయజ్ఞపూర్వకమగు జగచ్చక్రమును, ఇహ - ఈలోకమునందు, యః - ఏకర్మాధికారి యగుద్విజుఁడు, న అనువర్తయతి - అనుసరింపఁడో, సః -

---

భవంతి జాయంతే భూతాని, పర్జన్యా ద్వృష్టే రన్నస్య సంభవోఽన్నసంభవః, యజ్ఞా ద్భవతి పర్జన్యః "అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్య గాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః" (మను. 3-76) ఇతిస్మృతేః యజ్ఞోఽపూర్వం, సచ యజ్ఞః కర్మసముద్భవః ఋత్విగ్యజమానయోశ్చ వ్యాపారః కర్మ, తత స్సముద్భవో యస్య యజ్ఞస్యాపూర్వస్య స యజ్ఞః కర్మసముద్భవః. 14

తచ్చ కర్మేతి. కర్మ బ్రహ్మోద్భవం బ్రహ్మ వేదః స ఉద్భవః కారణం ప్రకాశకో యస్య తత్కర్మ బ్రహ్మోద్భవం విద్ధి జానీహి, బ్రహ్మ పునర్వేదాఖ్య మక్షరసముద్భవమ్, అక్షరం బ్రహ్మ పరమాత్మా సముద్భవో యస్య తదక్షర సముద్భవం బ్రహ్మ వేద ఇత్యర్థః. యస్మా త్సాక్షా త్పరమాత్మాఖ్యా దక్షరా త్పురుషనిశ్వాసవ త్సముద్భూతం బ్రహ్మ తస్మా త్సర్వార్థప్రకాశ కత్వా త్సర్వగతమ్ సర్వగతమపిస న్నిత్యం సదా యజ్ఞవిధిప్రధానత్వా ద్యజ్ఞే ప్రతిష్ఠితమ్. 15

ఏవమితి. ఏవ మిత్థ మీశ్వరేణ వేదయజ్ఞపూర్వకం జగచ్చక్రం ప్రవర్తితం నానువర్తయ తీహలోకే యః కర్మ ణ్యధికృతస్సన్ అఘాయు రఘం పాప మాయు

అట్టి, ఇంద్రియారామః - విషయలోలుఁడు, అఘాయుః - పాపజీవనము గలవాఁడై, మోఘం - వ్యర్థముగా, పార్థ! - అర్జునా! జీవతి - జీవించుచున్నాఁడు. 16

తా:- కర్మవలన బంధము గలుగు గావునఁ గర్మ నాచరింపఁగూడ దని యెంతమాత్రము తలఁపఁగూడదు. ఏలనన బంధహేతు వగు కర్మ వేఱు, బంధమును దొలగించు కర్మ వేఱును. కర్మయొక్క విభాగము తదతిశయము తదాచరణావశ్యకత తదకరణమందలి ప్రత్యవాయము లోనుగాఁగల విషయము లీయెనిమిది గీతములచే బోధింపఁబడుచున్నవి. యజ్ఞముకొఱ కైన కర్మకంటె నితరకర్మలచే నీలోకము బంధమును గనుచున్నది; అనగా యజ్ఞార్థమగుకర్మ బంధహేతువు గాదు. ఇచట యజ్ఞ మన "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతివలన నీశ్వరుఁడు. ఈశ్వరప్రీతికై యొనర్చెడు కర్మ బంధహేతువు గానేఱదు. ఈశ్వరప్రీతిని గల్గించు కర్మ యన ఫలాభిసంధిరహితముగాఁ జేయఁబడు కర్మ. అయ్యది నిత్యనైమిత్తిక రూపముల శ్రుతిస్మృతులయందు విధింపఁబడుచున్నది. అట్టి యీశ్వరప్రీతికి హేతుభూతమగునిత్యనైమిత్తికకర్మంబులను ఫలాభిసంధిరహితముగా లెస్సగా నాచరింపవలయును. ఏలనన సృష్ట్యాదియందుఁ బ్రజాపతి యజ్ఞములతోఁగూడిన ప్రజలను సృజించి యా ప్రజలనుగూర్చి "ఈయజ్ఞముచే మీర లభివృద్ధి నొందుఁడు. ఈయజ్ఞము మీ మనోరథముల నీడేర్చు కామధేనువు". అని పలికెను. ఇచటఁ బ్రజాపతి యన నీ చరాచర రూపమగు ప్రాణికోటిని సృజించిన పరమేశ్వరుఁ డని గ్రహించునది. ప్రజలకుఁ బతి యనగాఁ బ్రభువు గావున నీతఁడు ప్రజాపతి యనఁబడుచున్నాఁడు. సృష్టికర్త శ్రుతియం దీపదముచే విపులముగా నుదాహరింపఁబడుచున్నాఁడు. ఇఁక "ప్రజాః" అను శబ్దముచే "చాతుర్వర్ణ్యం మయా సృష్ట" మ్మను నాలవయధ్యాయవాక్యము ననుసరించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రు లను నాలుగు వర్ణముల మనుష్యులును గ్రహింపఁబడుచున్నారు. ప్రకృతపు యజ్ఞాధికారము గమనించుటలో నీ "ప్రజాః" అను శబ్దముచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను త్రైవర్ణికు లగుద్విజులుమాత్రమే యుద్దేశింపఁబడుచున్నారు. ఏలనన బరమేశ్వరముఖమున నప్రయత్నముగాఁ బురుషనిశ్వాసమట్లు వెలువడిన వేదరాశియందు వినవచ్చెడు కర్మజాలమంతయు ద్విజులనుమాత్రమే యుద్దేశించి విధింపఁబడినట్లు సుస్పష్టము. శూద్రుల కన్ననో యమం

ర్జీవనం యస్య సోఽఘాయుః పాపజీవన ఇతియావత్ ఇంద్రియారామ ఇంద్రియైరారామ ఆరమణ మాక్రీడావిషయేషు యస్య స ఇంద్రియారామో మోఘం వృథా హేపార్థ! స జీవతి. 16

త్రకమగు వైదికకర్మ. అద్దానిని పౌరాణికవిధాన మని కోవిదులు వక్కాణించుచు న్నారు. పరికించి చూచిన ద్విజులకు సమంత్రికములుగ విధింపఁబడినకర్మలు శూద్రులకు నమంత్రకములుగ విధింపఁబడినటుల శ్రుతిస్మృతిసదాచారప్రమాణసిద్ధము. సమంత్రకంబుగఁ గర్మల నాచరించుట వైదికమనియు నమంత్రికంబుగా నాచరించుట పౌరాణికమనియు లోకవ్యవహారము. ఇట్లు యజ్ఞములు ద్వివిధములుగ నాలుగువర్ణములవారికిని విధింపఁబడియున్నట్లు పైగీతములవలన గ్రహింపనగును. దేవతల యజ్ఞములచేఁ దృప్తి నొందించినచో నాదేవతలు తమ్ముఁ దృప్తి నొందించినవారలను బ్రేమింతురు. దేవతలను మనుజులు, మనుజులను దేవతలు నన్యోన్యము ప్రేమించుటచే మనుజులుత్కృష్టమగు శ్రేయస్సును బొందుదురు. యజ్ఞముచే భావనచేయఁబడు దేవతలు మనుజుల కభీష్టములగు భోగముల నిత్తురు. కావున నీయజ్ఞ మభీష్టభోగప్రాప్తిహేతువగుచున్న దని యభిప్రాయము. 'దేవతలవలన నభీష్టభోగములఁ బొందుచు వారలకు నించుకేనియు నర్పింపక నెవ్వఁ డేని భుజించినచో నట్టివాఁడు దొంగ యగుచున్నాఁడు.' అనుటలోఁ బ్రతిగృహస్థుఁడును బ్రతిదివసమును నవశ్య మాచరింపవలసిన పంచమహాయజ్ఞములయుత్కృష్టత బోధింపబడుచున్నది. దేవతల కర్పింపక భుజించుట యనఁ బంచమహాయజ్ఞముల నాచరింపక భుజించుట యని యభిప్రాయము. పంచమహాయజ్ఞములఁ జేసి భుజించినచో నట్టి యన్నము యజ్ఞశిష్టమై యమృతతుల్య మగును. అద్దానిని భుజించినచో నట్టివాఁడు సర్వపాపములనుండి విముక్తుఁడగును. అట్లు పంచమహాయజ్ఞములఁ జేయక భుజించువారలు కేవల స్వోదరపూరణమునకై పచనము చేసికొనినవారలై పాపమునే భుజించుచు పాపు లగుదురు. పంచమహాయజ్ఞములఁ జేయకపోయినఁ బాపహేతువుగాను జేసినఁ బుణ్యహేతువుగా నన్న మెట్లగు ననిన నన్నము సిద్ధమగుటకు నైదుసూనాస్థానముల సంసర్గ మత్యవసరము. సూనాస్థాన మన జంతువధస్థానము. ఈసూనాస్థానముల సంపర్కముచే నన్నమునకు కుట్టని, పేషిణి, చుల్లిని, మార్జని, ఉదకుంభిని యను నైదుమహాదోషములు వాటిల్లును. పంచమహాయజ్ఞములఁ జేసినచో నన్నము దోషరహితమై పవిత్రతఁ జెంది చిత్తశుద్ధిని గలుగజేసి దైవీసంపత్తును గలుగఁజేయును. లేనిచోఁ బాపరహితము గాకపోవుటచేఁ బాపరూపమే యగుచు నద్దాని భుజించువారలకు

---

తస్మా దజ్ఞేనాధికృతేన కర్తవ్య మేవ కర్మేతి ప్రకరణార్థః ప్రాగాత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తే స్తాదర్థ్యేన కర్మయోగానుష్ఠాన మధికృతేనానాత్మజ్ఞేన కర్తవ్య మేవే త్యేతత్ "న కర్మణా మనారంభాత్" (గీ. 3-4) ఇత్యత ఆరభ్య

నాసురసంపత్తిని గలుగఁజేయును గావున బ్రతిగృహస్థుఁడును నిత్యము పంచమహా యజ్ఞములఁ జేసితీరవలయు నని యభిప్రాయము.

ప్రకృతపు గీతములను గమనించుటలో వైదికకర్మ త్రైవర్ణికుల కేనా? తదితరులకు విధింపఁబడలేదా? ఇతరులనుగూర్చి వేదము ప్రవర్తించుటలేదా? అట్లు ప్రవర్తింపకపోయినచో నందులకు గారణం బెద్ది యని యర్థాత్తు లభ్యమగును. అద్దాని నొకింత వివరించుట యనవసరము గానేఱదు.

వైదికకర్మ త్రైవర్ణికుల నుద్దేశించి ప్రవర్తిల్లినదనియు పౌరాణికకర్మ యన నమంత్రపుగర్మ శూద్రుల నుద్దేశించి ప్రవర్తిల్లినదనియు నిదివఱలో నిర్వచింపఁబడెను. ఇయ్యది కేవలము బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రు లను శుద్ధవర్ణముల బుద్ధియం దుంచుకొని చెప్పినవిషయము. కాలక్రమమున ననులోమ విలోమజాతులు బయలువెడల మహర్షు లొకవ్యవస్థను ధర్మసంగ్రహమునకై గ్రహించినారు. అనులోమవిలోమసంకీర్ణప్రకీర్ణాదిజాతులతోఁగూడిన నాలుగువర్ణముల మనుజుల నైదుతరగతులుగ విభాగము చేసిరి. అవెవ్వియన 1 ద్విజులు 2 ద్విజసములు, 3 శూద్రులు, 4 శూద్రసములు, 5 అస్పృశ్యులు అని, ద్విజులకు ద్విజసములకును వైదిక కర్మ, శూద్రులకును శూద్రసములకును పౌరాణికకర్మయని వ్యవస్థఁ జేసిరి. అస్పృశ్యు లన పై రెండువిధములగు కర్మలచే స్పృశింపబడనివా రని యర్థము. ఎవ్విధమగు కర్మతోఁ స్పృశింపఁబడనివారలకుఁ గర్మాధికారులతో నెవ్విధమైన స్పర్శకు నవకాశము లేమి గర్మాస్పృశ్యత వ్యావహారికాస్పృశ్యతకుఁ గారణ మైనది. ఇట్టి యస్పృశ్యుల యొక్క జన్మ శాస్త్రదృష్టిచే శిష్టాప్రయుక్తజన్మ కావున శిష్టాప్రయుక్తజన్మలతో నొప్పు పశుపక్ష్యాదులకువలె నస్పృశ్యులు శాస్త్రీయకర్మబాహ్యు లగుచున్నారు. శాస్త్రీయధర్మము పశుపక్ష్యాదులఁగూర్చి వర్తింపలేదను విషయము సర్వజనానుభవగోచరమే కదా! ఏకారణముచేఁ బశుపక్ష్యాదులకు శాస్త్రీయకర్మ లేదో యాకారణముచేతనే కొందఱు మనుష్యులకుగూడ శాస్త్రీయకర్మయం దధికారము లేదు. శాస్త్రదృష్టిచే వారలు పశుపక్ష్యాదులకంటెఁగూడ నికృష్టులుగాఁ దలంపఁబడుచున్నారు. ఇందులకు "రమణీయాచరణాః రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనింవా క్షత్రియయోనింవా కపూయచరణాః కపూయాం యోని

"శరీరయాత్రాపిచ తేన ప్రసిద్ధ్యే దకర్మణః" (గీ. 3-8) ఇత్యేవమంతేన ప్రతిపాద్య "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర" (గీ. 3-9) ఇత్యాదినా "మోఘం పార్థ స జీవతి"

మాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా" యని శ్రుతి ప్రమాణము కావున నిందువలన గ్రహించునదేమన - ఏరికి శ్రుతిస్మృతులచే నెవ్విధమగు ధర్మము విధింపఁబడి యుండదో యట్టి వారల జన్మలు శ్రుతి స్మృతిదృష్టిచే శిష్టాప్రయుక్తజన్మ లనియు నట్టి శిశునుండి విముక్తిఁజెందుపఱకు నెట్టి యధికారమును శాస్త్రదృష్టిచే సంక్రమింపదనియు దానంజేసి శిష్టాప్రయుక్త జన్మానుగుణంబులగు కార్యంబులు దక్క వేఱొండు కార్యంబుల నాచరింపఁజూచినను నాచరించినను నయ్యవి తుషావహనంబులే కాని వేఱొండు కానేరవనియు, దానంజేసి శ్రుతిస్మృతిసదాచారప్రమాణబద్ధులు శ్రుతిస్మృతిధర్మాధికారవిదూరులఁ గూర్చి వగవఁ బనిలేదనియు ప్రాజ్ఞులు గ్రహించుదురుగాక!

కర్మయందధికారము గలవానిచే నవశ్యము కర్మ యాచరించి తీరఁబడవలయు ననుటకు హేత్వంతర మిట్లుపపాదింపఁబడుచున్నది. భుజింపఁబడినట్టియు రసలోహిత రేతో రూపముగఁ బరిణమించినట్టియు నన్నమువలన భూతములు పుట్టుచున్నవి. వృష్టిరూపమగు పర్జన్యునివలన నన్నము పుట్టుచున్నది. "అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః" అను న్యాయము ననుసరించి పర్జన్యుఁడు యజ్ఞమువలనఁ గలుగుచున్నాఁడు. యజ్ఞమన్ననో ఋత్విగ్యజమాన వ్యాపార రూపమగు శ్రుతిస్మృతివిహిత కర్మవలనఁ గలుగుచున్నది. కర్మయన్ననో బ్రహ్మవలనఁ గలుగుచున్నది. ఇచట బ్రహ్మయన్న వేదమని యర్థము. వేదమన్ననో యక్షరుఁడగు పరమాత్మవలనఁ గలుగుచున్నది. ఈ యక్షరుఁడగు పరమాత్మయే శ్రుతిస్మృత్యుదితమగు పరబ్రహ్మము కావున సర్వవ్యాపక మైనట్టి బ్రహ్మ మెల్లప్పుడును యజ్ఞమునందు స్థితిని గనుచున్నాఁడు. బ్రహ్మము సర్వకారణమై సర్వవిషయములను బ్రకాశింపఁజేయుటచే సర్వగత మని తెలియునది. సర్వగత మగుటచే సర్వభావములఁ బొందుచున్నటుల స్పష్టము. దానంజేసి పరబ్రహ్మ యజ్ఞభావమును బొందుచున్నాఁడనుట యుక్తము. దానంజేసి యజ్ఞముల నాచరించినచో పరబ్రహ్మను బొందినట్లే. దానంజేసి యజ్ఞముల నవశ్య మాచరించితీరవలయు నని తాత్పర్యము. ఇట్లు ప్రవర్తించుచున్న జగచ్చక్రము నెవ్వఁ డనుసరింపఁడో యన నిత్యములగు పంచమహాయజ్ఞములను నిత్య

(గీ. 3-16) ఇత్యేవమంతేనాపి గ్రంథేన ప్రాసంగిక మధికృత స్యాత్మవిదః కర్మానుష్ఠానే బహుకారణ ముక్తం. తదకరణేచ దోషసంకీర్తనం కృతమ్.

యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే. 17

మెవ్వఁ డాచరింపఁడో యట్టివాఁ డిందిద్రియవిషయములయందు జరించుచు బాపజీవనుఁడై వ్యర్థముగా జీవించువాఁడు. అనగా నట్టివాని జీవితమువలన లోకమున కెద్దియు బ్రయోజనము లేకపోవుట యటుండ వాఁ డిహపరనిశ్శ్రేయసములకు దూరమగుచున్నాఁ డని తాత్పర్యము. కావున శ్రుతిస్మృత్యాదితకర్మాధికారము గలవాఁ డవశ్యము తనకు విహితమగుకర్మ నాచరించితీరవలయు నని ప్రకరణార్థము. 9-16

టీ:—యః తు - ఏసాంఖ్యుఁడను నాత్మజ్ఞాన నిష్ఠుఁ డగు, మానవః - మనుష్యుఁడు, ఆత్మరతిః ఏవ - ఆత్మయందే ప్రీతిగలవాఁడును, ఆత్మతృప్తః చ - ఆత్మయందే తృప్తిగలవాఁడును, ఆత్మని ఏవచ - ఆత్మయందే, సంతుష్టః — సంతోషము గలవాఁడును అగుచున్నాఁడో, తస్య - వానికి, కార్యం-చేయఁదగినపని, న విద్యతే-తెలియఁబడదు. 17

తా:—జగచ్చక్రము ననువర్తించుటకై కర్మ నాచరించితీరవలయు నను విషయము సర్వజనవిషయికమా, లేక కర్మయం దధికారముగల కర్మయోగికా, లేక నాత్మజ్ఞానియగు సాంఖ్యుఁడుగూడ కర్మల నాచరింపవలయునా యను విశేషము తేటపడుటకై యీగీతము ప్రవర్తించుచున్నది. ఇచట 'తు'అను నవ్యయముచేఁ బూర్వ ముద్దేశింపఁబడిన కర్మాధికారికంటె విలక్షణుఁడు ముచ్చటింపబడుచున్నాఁ డని గ్రహించునది. 'ఆత్మరతిః' అన విషయములయందుఁ బ్రీతి లేక నాత్మయందే ప్రీతిగలవాఁ డనియు, 'ఆత్మతృప్తః' అన నాత్మేతరములగు నన్నరసాదులతృప్తి నపేక్షింపనివాఁ డనియు, బాహ్యార్థలాభమునందు సంతసము లేక యాత్మ

ఏవంస్థితే కిమేవం ప్రవర్తితం చక్రం సర్వేణానువర్తనీయ మాహోస్విత్పూర్వోక్తకర్మయోగానుష్ఠానోపాయ ప్రాప్యామనాత్మవిదః జ్ఞానయోగేనైవ నిష్ఠా మాత్మవిద్భి స్సాంఖ్యై రనుష్ఠేయా మప్రాప్తైనైవ ఇత్యేవమర్థ మర్జునస్య ప్రశ్న మాశంక్య స్వయమేవ వా శాస్త్రార్థస్య వివేకప్రతిపత్త్యర్థ మేతం వైత మాత్మానం విదిత్వా, నివృత్తమిథ్యాజ్ఞానాః సంతో బ్రాహ్మణా మిథ్యాజ్ఞానవద్భి రవశ్యం కర్తవ్యేభ్యః పుత్రైషణాదిభ్యో వ్యుత్థాయాథభిక్షాచర్యం శరీరస్థితిమాత్ర ప్రయుక్తం చరంతి, న తేషా మాత్మజ్ఞాననిష్ఠావ్యతిరేకేణాన్యత్కార్య మస్తీత్యేవం శ్రుత్యర్థ మిహ గీతాశాస్త్రే ప్రతిపిపాదయిషిత మావిష్కుర్వ న్నాహ భగవాన్ యస్త్వితి. యస్తు సాంఖ్య ఆత్మజ్ఞాననిష్ఠ ఆత్మరతి రాత్మన్యేవ రతి ర్న విషయేషు యస్య స ఆత్మరతిరేవ స్యా ద్భవే దాత్మతృప్త శ్చాత్మనైవ తృప్తో నాన్నరసాదినా స మానవో మనుష్యః సంన్యా స్యాత్మన్యేవచ సంతుష్టః సంతోషోహి

నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన,
నచాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రియః. 18

తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. 19

---

యందే సంతసముఁ జెందువాఁడును "ఆత్మ న్యేవచ సంతుష్టః" అనబడుచు న్నాఁడు. ఈగీతమునందలి రెండు 'ఏవ' కారములును నాత్మభిన్నవిషయసంబంధము నత్యంతము దోఁసిపుచ్చుచున్నవి. ఇట్టి యాత్మనిష్ఠుఁ డగు సంన్యాసికి నాచరింపవలసిన కార్య మొకటియును లేదు; అనగా నీయజ్ఞములతో నెట్టి యవసరమును లేదని తాత్పర్యము. 17

టీ:—తస్య - అట్టి సంన్యాసికి, కృతేన - కర్మచేతను, అర్థః - ప్రియోజనము, న ఏవ - లేదు, అకృతేన - చేయకపోవుటచే, ఇహ - ఈలోకమునందు, కశ్చన - ఒకానొకప్రిత్యవాయమును, న - లేదు, అస్య - ఈజ్ఞానికి, సర్వభూతేషు - బ్రిహ్మాది స్తంబ పర్యన్తము గల ప్రాణులయందు, కశ్చిత్ - ఒకానొక, అర్థవ్యపాశ్రియః చ - ఆశ్రియింపఁదగిన ప్రియోజనముగూడ, న - లేదు. 18

తా:—ఆత్మజ్ఞానికి ముల్లోకములందును బొందఁదగు ప్రియోజనము లేదు గావునఁ ప్రియోజనములకు సాధనభూతములగు కర్మలతో నవసరము లేదని తాత్పర్యము. 18

టీ:—తస్మాత్ - ఆకారణముచేత, అసక్తః - ఫలాభిసంధివర్జితుఁడవై, కార్యం - నియతమగు కర్మను, సమాచర - లెస్సగాఁజేయుమా! పూరుషః - పురు

---

బాహ్యార్థలాభే సర్వస్య భవతి; త మనపేక్ష్యాత్మన్యేవ చ సంతుష్టః సర్వతో వీత తృష్ణ ఇత్యేతత్, య ఈదృశ ఆత్మవి త్తస్య కార్యం కరణీయం న విద్యతే నాస్తీత్యర్థః. 17

కించనైవేతి. నైవ తస్య పరమాత్మరతేః కృతేన కర్మణాఽర్థః ప్రియోజన మస్తి. అస్తు తర్హ్యకృతే నాకరణేన ప్రిత్యవాయాఖ్యోఽనర్థో నాకృతేనేహ లోకే కశ్చన కశ్చిదపి ప్రత్యవాయప్రాప్తిరూప ఆత్మహానిలక్షణోవా నైవాస్తి; నచాస్య సర్వభూతేషు బ్రహ్మాదిస్థావరాంతేషు భూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః ప్రయోజన నిమిత్తక్రియాసాధ్యః వ్యపాశ్రయో వ్యపాశ్రియణ మాలంబనమ్ కంచిద్భూత విశేష మాశ్రిత్య నసాధ్యః, కశ్చి దర్థోఽస్తు యేన తదర్థా క్రియానుష్ఠేయా స్యాత్, న త్వ మేతస్మిన్ సర్వతః సంప్లుతోదకస్థానీయే సమ్యగ్దర్శనే వర్తసే. 18

యత ఏవమ్ - తస్మా దితి. తస్మా దసక్తః సంగవర్జితః సతతం సర్వదా కార్యం

కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. 20

---

మును, అసక్తః - ఫలాభిసంధిరహితుఁడై, కర్మ - నియతకర్మను, ఆచరన్ - ఆచరించుచు, పరం - ఉత్కృష్టపురుషార్థమును, ఆప్నోతి హి - పొందునుగదా! 19

తా:- ఈగీతమునందలి మొదటిచరణము, ఎనిమిదవగీతమునందలి "నియతం కురు కర్మ త్వం" అను విధియొక్క యనువాదము. ఉత్కృష్ట పురుషార్థ మన మోక్ష మని యర్థము. నిష్కామకర్మచే మోక్షము గల్గునన జిత్తశుద్ధిద్వారా కర్మ మోక్షమునకు సాధన మని యభిప్రాయము. 19

టీ:–జనకాదయః - జనకుఁడు, అశ్వపతి మొదలుగాఁ గల రాజర్షులు, కర్మణా ఏవ - కర్మచేతనే, సంసిద్ధిమ్ - మోక్షమును పొందుటకు, ఆస్థితాః, ప్రవర్తించిరి. లోకసంగ్రహమ్ ఏవ అపి - లోకసంగ్రహమునైనను, సంపశ్యన్ - లెస్సగా విచారించుచు, కర్తుం - కర్మ నాచరించుటకు, అర్హసి - తగియుంటివి. 20

తా:–ఇచ్చట "కర్మణైవ హి" అనుచో 'ఏవకార హి'శబ్దములు జనకాదుల యొక్క యధీతిబోధాచరణంబులను ధ్రువపరచుచున్నవి. కావున నట్లే నీవును గర్మ నాచరింపు మని హితోపదేశము. ఒకవేళ జనకాదు లజ్ఞులగుటచేఁ గర్మయందే నిలిచి యుండిరనియు దాను బ్రాజ్ఞుఁడగుటచే విరమించుట యుచిత మనియుఁ దలంచినచో నట్లు విరమించుట యుక్తము గాదనియు లోకసంగ్రహముకొఱకు గర్మఁ జేయవలయునని యుపదేశము. 20

---

కర్తవ్యం నిత్యం కర్మ సమాచర నిర్వర్తయ; అసక్తోహి యస్మాత్సమాచర న్నీశ్వరార్థం కర్మ కుర్వ న్పరం మోక్ష మాప్నోతి పురుషః సత్త్వశుద్ధిద్వారేణేత్యర్థః. 19

యస్మాచ్చ - కర్మణైవేతి. కర్మణైవహి యస్మాత్పూర్వే క్షత్త్రియాః విద్వాంసః సంసిద్ధిం మోక్షం గంతు మాస్థితాః ప్రవృత్తాః జనకాదయో జనకాశ్వపతిప్రభృతయః యది తే ప్రాప్తసమ్యగ్దర్శనా స్తతో లోకసంగ్రహార్థం ప్రారబ్ధకర్మత్వా త్కర్మణా సహైవాసంన్యస్యైవ కర్మసంసిద్ధి మాస్థితా ఇత్యర్థః, అథాప్రాప్తసమ్యగ్దర్శనా జనకాదయ స్తదా కర్మణా సత్త్వశుద్ధిసాధనభూతేన క్రమేణ సంసిద్ధి మాస్థితా ఇతివ్యాఖ్యేయః శ్లోకః. అథ మన్యసే పూర్వైరపి జనకాదిభి రప్యజానద్భిరేవ కర్తవ్యం కర్మ కృతం తావతా నావశ్యమన్యేన కర్తవ్యం సమ్యగ్దర్శనవతా కృతార్థేనేతి, తథాపి ప్రారబ్ధకర్మాయత్త స్త్వం లోకసంగ్రహమేవాపి లోకస్యోన్మార్గప్రవృత్తినివారణం లోకసంగ్రహ స్తమేవాపి ప్రయోజనం సంపశ్యన్ కర్తుమర్హసి. 20

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స య త్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే. 21

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణి. 22

యది హ్యహం నవర్తేయ జాతు కర్మ ణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః. 23

---

టీ:—శ్రేష్ఠః - ముఖ్యుఁడు, యత్ యత్ - ఏ యే కర్మను, ఆచరతి - పుష్కలముగఁ జేయుచుండునో, తత్ తత్ ఏవ - ఆ యాయి కర్మనే, ఇతరః - వేరగు, జనః - జనుఁడు, (ఆచరతి - ఆచరించును) సః - అట్టి శ్రేష్ఠుఁడు, యత్ - ఏ, ప్రమాణం - లౌకిక ప్రమాణముగాని వైదికప్రమాణమునుగాని, కురుతే - చేయునో, లోకః - లోకము, తత్ - అట్టి ప్రమాణమునే, అనువర్తతే - అనుసరించును. కావున లోకసంగ్రహము నుద్దేశించి ప్రాజ్ఞుడు కర్మ నాచరించునది. 21

టీ:—పార్థ - అర్జునా! మే-నాకు, త్రిషు లోకేషు - మూఁడులోకములయందును, కర్తవ్యం - చేయఁదగినది, కించన - కొంచెమైనను, నాస్తి - లేదు. అవాప్తవ్యం - పొందఁదగినది, అనవాప్తం - పొందఁబడకుండ, న - లేదు. అయినను, కర్మణిచ - కర్మయందుఁగూడ, వర్తే ఏవ - ప్రవర్తించుచునేయున్నాను. 22

టీ:—అహం - నేను, జాతు - ఒకానొకప్పుడైనను, కర్మణి - కర్మయందు, అతంద్రితః - అలసత లేనివాఁడనై, న వర్తేయం యది - వ్యవహరింపకపోయినట్టయిన,

---

లోకసంగ్రహః కిమర్థం కర్తవ్య ఇత్యుచ్యతే యద్యదితి. యద్యత్కర్మాచరతి శ్రేష్ఠః ప్రధాన స్తత్తదేవ కర్మాచరతీతరోఽన్యో జన స్తదనుగతః; కించ న శ్రేష్ఠో యత్ప్రమాణం కురుతే లౌకికం వైదికంవా లోక స్తదనువర్తతే తదేవ ప్రమాణీ కరోతీత్యర్థః. 21

యద్యత్ర తే లోకసంగ్రహకర్తవ్యతాయాం విప్రతిపత్తి స్తర్హి మాం కిం నపశ్యసి - నమ ఇతి. నమే మమ పార్థ నాస్తి నవిద్యతే నకర్తవ్యం త్రిష్వపి లోకేషు కించన కించిదపి కస్మాత్ నానవాప్త మప్రాప్త మవాప్తవ్యం ప్రాపణీయం తథాపి వర్త ఏవచ కర్మ ణ్యహమ్. 22

యదీతి. యది హి పునరహం నవర్తేయం జాతు కదాచిత్కర్మ ణ్యతంద్రితోఽనలసః స న్మమ శ్రేష్ఠస్య సతో వర్త్మ మార్గ మనువర్తన్తే మనుష్యాః హేపార్థ! సర్వశః సర్వప్రకారైః. 23

ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్,
సంకరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః. 24

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్! 25

---

పార్థ! - అర్జునా!, మనుష్యాః - మనుష్యులు, సర్వశః - అన్నివిధములచేతను, మమ - నాయొక్క, వర్త్మ - మార్గమును, అనువర్తన్తే - అనుసరించుదురు. 23

టీ:—అహం - నేను, కర్మ - కర్మను, న కుర్యాం చేత్ - చేయకపోయినచో, ఇమే లోకాః - ఈ సకలలోకములు, ఉత్సీదేయుః - నశించేని, సంకరస్య చ - వర్ణసంకరమును, కర్తా - చేయువాఁడను, స్యాం - అయ్యేని, ఇమాః - ఈ, ప్రజాః - ప్రజలను, ఉపహన్యామ్ - పాడుచేయువాఁడ నయ్యేని. 24

తా:—కర్మతో నవసరము లేనివాఁడయ్యు లోకసంగ్రహమునకై కర్మల నాచరించువాఁ డెందైనఁ గలఁడా యనినచో నందులకుఁ దానే యుత్కృష్టతమంబగు దృష్టాన్త మని సహేతుకంబుగ నీమూఁడుగీతములచే శ్రీకృష్ణభగవానులు పలుకుచున్నారు. సకలప్రజలును దమ తమ ధర్మముల విడనాడినచో వర్ణసాంకర్యము గలుగు నని భగవదాశయము. యుద్ధములోఁ బురుషులు చచ్చుటచే స్త్రీలు చెడి వర్ణసాంకర్యము గలుగు నని యర్జునుఁడు వ్యక్తీకరించియున్నాఁడు. ధర్మసాంకర్యము ద్వారా వర్ణసాంకర్యము గలుగుగావున ధర్మము నాచరించితీరవలయు నని శ్రీకృష్ణాశయము.

టీ:—భారత! సక్తాః - ఫలకాములగు, అవిద్వాంసః - అజ్ఞులు, కర్మణి - కర్మయందు, యథా - ఏతీరున నభినివేశముతో ఫలము నుద్దేశించి, కుర్వన్తి - చేయుదురో, లోకసంగ్రహం - లోకసంగ్రహమును, చికీర్షుః - చేయనిచ్ఛయించిన, విద్వాన్ - ప్రాజ్ఞుఁడు, అసక్తః - ఫలాభిసంధివర్జితుఁడై, తథా - అట్టి యభినివేశముతో, కుర్యాత్ - చేయవలయును.

---

ఉత్సీదేయురితి. ఉత్సీదేయు ర్వినశ్యేయు రిమే సర్వే లోకా లోకస్థితినిమిత్తస్య కర్మణోఽభావాత్ నకుర్యాం కర్మచే దహమ్, కించ సంకరస్యచ కర్తా స్యామ్, తేన కారణేనోపహన్యా మిమాః ప్రజాః ప్రజానా మనుగ్రహాయ ప్రవృత్త ఉపహతి ముపహననం కుర్యా మిత్యర్థః; మమేశ్వరస్యా ననురూప మాపద్యేత. 24

యది పున రహమివ త్వం కృతార్థబుద్ధి రాత్మవి దన్యో వా తస్యా ప్యాత్మనః కర్తవ్యాభావేఽపి పరానుగ్రహఏవ కర్తవ్యఇత్యాహ సక్తా ఇతి. సక్తాః కర్మణ్యస్య

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్తః సమాచరన్. 26
ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. 27

---

టీ:—కర్మసంగినాం - కర్మయం దభినివేశము గలిగిన, అజ్ఞానాం - అవివేకులకు, బుద్ధిభేదం - చిత్తచాంచల్యమును, న జనయేత్ -పుట్టింపఁగూడదు. యుక్తః - నిగ్రహము గలిగిన, విద్వాన్ - ప్రాజ్ఞుఁడు, సర్వకర్మాణి - సమస్తములగు కర్మలను, సమాచరన్ - లెస్సగాఁ జేయుచు, జోషయేత్ - ఇతరులను బ్రేరణచేయవలయును. 26

తా:—లోకసంగ్రహమునకై కర్మ నాచరించుటలో స్వోపయోగము లేమిం జేసి నిర్లక్ష్యబుద్ధితో విద్వాంసుఁడు కర్మల నాచరింపఁగూడదనియు, నజ్ఞులకుఁ గర్మయందు నైరస్యభావమును గలుగఁజేయకుండ సర్వకార్యముల యథోచితముగా నాచరించుచు నితరు లాచరించునట్లు చేయుచుండవలయుననియు భగవదాజ్ఞ. 25-26

టీ:—ప్రకృతేః - సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయాశక్తియొక్క, గుణైః - వికారములచే, సర్వశః - అన్నివిధముల, కర్మాణి - కర్మలు, క్రియమాణాని - చేయఁబడుచున్నవి. అహంకారవిమూఢాత్మా - దేహేంద్రియసంఘాతము నాత్మగాఁ దలంచునజ్ఞుఁడు, అహం - తానే, కర్తా ఇతి - సకలకార్యములకుఁ గర్తనని, మన్యతే - తలంచుచున్నాఁడు. 27

---

కర్మణః ఫలం మమ భవిష్యతీతి కేచి దవిద్వాంసః యథా కుర్వంతి భారత, కుర్యా ద్విద్వా నాత్మవి త్తథాఽసక్తస్సన్, తద్వత్ కిమర్థం కరోతి తచ్ఛృణు చికీర్షుః కర్తుమిచ్ఛుః లోకసంగ్రహమ్. 25

ఏవం లోకసంగ్రహం చికీర్షో ర్న మమాత్మవిదః కర్తవ్య మస్త్యన్యస్య వా లోకసంగ్రహం ముక్త్వా తత స్తస్యాత్మవిద ఇద ముపదిశ్యతే నేతి. బుద్ధే ర్భేదో బుద్ధిభేదో మయేదం కర్తవ్యం భోక్తవ్యం చాస్య కర్మణః ఫలమితి నిశ్చితరూపాయాః బుద్ధే ర్భేదనం చాలనం బుద్ధిభేద స్తం నజనయే న్నోత్పాదయే దజ్ఞానామవివేకినాం కర్మసంగినాం కర్మ ణ్యాసక్తానా మాసంగవతాం కింతు కుర్యా జ్జోషయే త్కారయే త్సర్వకర్మాణి విద్వాన్ స్వయం తదేవావిదుషాం కర్మయుక్తోఽభియుక్త స్సమాచరన్. 26

అవిద్వా నజ్ఞః కథం కర్మసు సజ్జతే ఇత్యాహ ప్రకృతేరితి. ప్రకృతేః ప్రకృతిః ప్రధానం సత్త్వరజస్తమసాం గుణానాం సామ్యావస్థా, తస్యాః ప్రకృతేః

తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః,
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే. 28

---

తా:-ఇచట బ్రకృతివికారము లన దేహేంద్రియ మనోబుద్ధు లని యభిప్రాయము. ప్రకృతి యన దేహేంద్రియమనోబుద్ధులకుఁ గారణరూపమగు సత్త్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థారూపము. ఇది యింద్రియములకు గోచరము గాకుండుటచే నవ్యక్త మని చెప్పఁబడుచున్నది. ఇట్టి యవ్యక్తము 'మాయ' యనియు 'అవిద్య' యనియు 'అజ్ఞాన' మనియు వేదాంతులచేఁ బేర్కొనఁ బడుచున్నది. కాపిల సాంఖ్యమందును పాతంజలయోగమందు నియ్యది ప్రధాన మని పేర్కొనఁబడుచున్నది. కాపిల సాంఖ్యులు దీనిని నిత్యమనియు మూలకారణమనియు స్వతంత్రమనియుఁ దలంచుచున్నారు. పాతంజలు లీశ్వరాధిష్ఠిత మగుటచే నస్వతంత్రమనియు దలంచుచున్నారు. వేదాన్తు లనిర్వచనీయ మని తలంచుచున్నారు. భాష్యకారులచే నిచట బ్రధానశబ్దము మాయాశక్తి యను తలంపున నుపయోగింపఁబడిన దని తెలియునది.

టీ:-మహాబాహో! గుణకర్మవిభాగయోః - గుణములయొక్కయు కర్మలయొక్కయు విభాగమును, తత్త్వవిత్ తు - తత్త్వమును లెస్సగా గుర్తెఱింగిన విద్వాంసుఁ డన్ననో, గుణాః - ఇంద్రియములు, గుణేషు - విషయములయందు, వర్తన్తే - సంక్రమించుచున్నవి గాని యాత్మ యెంతమాత్రము సంక్రమింపఁ జాలదు, ఇతి - అని, మత్వా - తెలిసికొని, న సజ్జతే - సక్తతను జెందఁడు. 28

---

ర్గుణై ర్వికారైః కార్యకరణరూపైః క్రియమాణాని కర్మాణి లౌకికాని శాస్త్రీయాణిచ సర్వశః సర్వప్రకారై రహంకారవిమూఢాత్మా కార్యకరణసంఘాతాత్మప్రత్యయోఽహంకార స్తేన వివిధం నానారూపం మూఢ ఆత్మా అంతఃకరణం యస్య సోఽయం కార్యకరణధర్మా కార్యకరణాభిమా న్యవిద్యయా కర్మా ణ్యాత్మని మన్యమాన స్తత్తత్కర్మణా మహం కర్తేతి మన్యతే. 27

యః పున ర్విద్వాన్ - తత్త్వవిదితి. తత్త్వవిత్తు మహాబాహో! కస్య తత్త్వవిత్? గుణకర్మవిభాగయోః గుణవిభాగస్య కర్మవిభాగస్యచ తత్త్వవి దిత్యర్థః; గుణాః కరణాత్మకాః గుణేషు విషయాత్మకేషు వర్తంతే నాత్మేతి మత్వా న సజ్జతే సక్తిం న కరోతి. 28

ప్రకృతే ర్గుణసంమూఢాః సజ్జన్తే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. 29

మయి సర్వాణి కర్మాణి సంన్య స్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరః. 30

---

టీ:—ప్రకృతేః - మాయాశక్తియొక్క, గుణసంమూఢాః - వికారములచే వ్యామోహములఁ జెందినవారు, గుణకర్మసు - ఇంద్రియ వ్యాపారరూప మగు కర్మలయందు, సజ్జన్తే - ఆసక్తిని జెందుదురు. తాన్ - అట్టి, అకృత్స్నవిదః - కర్మ ఫలమాత్రమునే తెలిసికొనిన, మందాన్ - అజ్ఞులను, కృత్స్నవిత్ - ఆత్మవేత్త, నవిచాలయేత్ - చలింపఁజేయఁడు. 29

తా:—ప్రాజ్ఞుఁ డజ్ఞులకు బుద్ధిభేదముఁ గలుఁగఁజేసినచో నజ్ఞులు చెడుటచే లోకమునకు ముప్పు గలుఁగు నని తాత్పర్యము. 29

టీ:—అధ్యాత్మచేతసా - ఆత్మానాత్మ వివేకజ్ఞానముచే, సర్వాణి - సమస్తములగు, కర్మాణి - కర్మలను, మయి - నాయందు - అనగా సర్వజ్ఞుఁడును సర్వాత్మయునగు పరమేశ్వరునియందు, సంన్యస్య - అర్పించి, నిరాశీః - కోరికలను విడచినవాఁడవు, నిర్మమః - మమకారవర్జితుఁడవు, విగతజ్వరః - తాపము తొలఁగినవాఁడవును, భూత్వా - అయి, యుద్ధ్యస్వ - యుద్ధముచేయుమా! 30

---

యే పునః - ప్రకృతే రితి. ప్రకృతే ర్గుణై స్సమ్యఙ్మూఢాః సంమోహితాః సంతః సజ్జన్తే గుణానాం కర్మసు గుణకర్మసు వయం కర్మ కుర్మః ఫలాయేతి తాఁ కర్మసంగినోఽకృత్స్నవిదః కర్మఫలమాత్రదర్శినో మందాన్ మందప్రజ్ఞాఁ కృత్స్నవి దాత్మవిత్ స్వయం న విచాలయేత్, బుద్ధిభేదకరణమేవ చాలనం తన్న కుర్యా దిత్యర్థః. 29

కథం పునః కర్మణ్యధికృతే నాజ్ఞేన ముముక్షుణా కర్మ కర్తవ్య మిత్యుచ్యతే - మయీతి. మయి వాసుదేవే పరమేశ్వరే సర్వజ్ఞే సర్వాత్మని సర్వాణి కర్మాణి సంన్యస్య నిక్షి ప్యాధ్యాత్మచేతసా వివేకబుద్ధ్యాఽహం కర్త్రేశ్వరాయ భృత్యవత్కరోమీత్యనయా బుద్ధ్యా కించ నిరాశీః త్యక్తాశీ ర్నిర్మమో మమభావశ్చ నిర్గతో యస్య తవ స త్వం నిర్మమో భూత్వా యుద్ధ్యస్వ విగతజ్వరో విగత సంతాపో విగతశోకస స్నిత్యర్థః. 30

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యన్తే తేఽపి కర్మభిః. 31

యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠన్తి మే మతమ్,
సర్వజ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా నచేతసః. 32

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

---

టీ:—మే - నాయొక్క, ఇదం - ఈ, మతం - ఆశయమును, యే - ఏ, మానవాః - మనుజులు, శ్రద్ధావంతః - శ్రద్ధతోఁగూడినవారలును, అనసూయంతః - అసూయా రహితులును నయి, నిత్యం - ఎల్లప్పుడును, అనుతిష్ఠంతి - కర్మ నాచరింతురో, తే అపి - వారలుగూడ, కర్మభిః - ధర్మాధర్మరూపము లగుకర్మలనుండి, ముచ్యంతే - ముక్తిని జెందుచున్నారు. 31

టీ:- యే తు - ఎవ్వరైతే, మే - నాయొక్క, ఏతత్ మతం - ఈమతమును, అభ్యసూయంతః - అసూయగలవారలై, న అనుతిష్ఠన్తి - ఆచరింపరో, తాన్ - అట్టి వారలను, సర్వజ్ఞానవిమూఢాన్ - సకలవిషయములయందు నజ్ఞత గలవారలుగను, అచేతసః - అవివేకులుగను, నష్టాన్ - చెడినవారలుగను, విద్ధి - తెలిసికొనుమా! 32

తా:— ఫలాభిసంధిరహితముగా నీశ్వరార్పణబుద్ధిచేఁ దమ తమ వర్ణాశ్రమములకు నియతములగు ధర్మముల నాచరించి తీరవలయు నని శ్రీకృష్ణభగవానుల యభిప్రాయము.

టీ:—జ్ఞానవాన్ అపి - విద్వాంసుఁడుకూడ, స్వస్యాః - తనయొక్క, ప్రకృతేః - ప్రాక్తన జన్మకర్మపుంజ పరిపాకమువలన నలవడిన దేహేంద్రియ మనోబుద్ధులకు,

---

యదేత న్మమ మతం కర్మ కర్తవ్యమితి సప్రమాణ ముక్తం తత్తథా- యేమ ఇతి. యే మే మదీయ మిదం మత మనుతిష్ఠ న్త్యనువర్తనే మానవాః మనుష్యాః శ్రద్ధావన్త శ్శ్రద్దధానా అనసూయంతోఽసూయాంచ మయి పరమగురౌ వాసుదేవేఽకుర్వన్తో ముచ్యన్తే తేఽప్యేవం భూతాః కర్మభి ర్ధర్మాధర్మాఖ్యైః. 31

యేత్వితి. యేతు తద్విపరీతా ఏత న్మమ మత మభ్యసూయన్తో నిందన్తో నానుతిష్ఠన్తి నానువర్తన్తే మే మతం సర్వేషు జ్ఞానేషు వివిధం మూఢా స్తే సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా న్నాశంగతా నచేతసోఽవివేకినః. 32

కస్మా త్పునః కారణా త్త్వదీయం మతం నానుతిష్ఠన్తి పరధర్మా ననుతిష్ఠన్తి స్వధర్మంచ నానువర్తన్తే త్వత్ప్రతికూలాః కథం న బిభ్యతి త్వచ్ఛాసనాతిక్రమ

ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ. 34

---

సదృశం - అనురూపముగా, చేష్టతే - వ్యవహరించుచున్నాఁడు, భూతాని - సకల ప్రాణులును, ప్రకృతిం - స్వభావమునే, యాంతి - పొందుచున్నవి, నిగ్రహః - నాయొక్కగాని మఱియొకరి యొక్కగాని నిరోధము కిం కరిష్యతి - ఏమిచేయఁగలదు? అనగాఁ బ్రకృతిని నిగ్రహించుట దుర్ఘటమని యభిప్రాయము. 33

టీ:—ఇంద్రియస్య ఇంద్రియస్య - సర్వేంద్రియములయొక్క, అర్థే - శబ్దాది విషయములయందు, రాగద్వేషౌ - రాగద్వేషములు, అనగా నిష్టమందు రాగము ననిష్టమందు ద్వేషమును, వ్యవస్థితౌ-అవశ్యము సంభవించుచున్నవి. కావున, తయోః- ఆరాగద్వేషములయొక్క, వశం - స్వాధీనమును, న ఆగచ్ఛేత్ - ఎంతమాత్రమును బొందఁగూడదు. హి - ఏలనన, తౌ - ఆరాగద్వేషములు, అస్య - ఈపురుషునకు, పరిపంథినౌ - శత్రువులు, అనగా శ్రేయోమార్గమునకు భంగకరము లని యభిప్రాయము. 34

తా:—రాగద్వేషములు సకలప్రవృత్తులకును మూలము. ప్రవృత్తియన్నచో బంధహేతువు. ప్రవృత్తి లేకుండవలయునన్నచో తత్కారణములగు రాగద్వేషములు నశింపవలయు నని తాత్పర్యము.

---

దోషాత్, తత్రాహ సదృశమితి. సదృశ మనురూపం చేష్టతే, కస్యాః స్వస్యాః స్వకీయాయాః ప్రకృతేః, ప్రకృతిర్నామ పూర్వకృతధర్మాధర్మాదిసంస్కారః వర్తమానజన్మాదా వభివ్యక్తః సా ప్రకృతి స్తస్యా స్సదృశమేవ సర్వో జన్తుః జ్ఞానవానపి చేష్టతే, కిం పున ర్మూర్ఖః; తస్మా త్ప్రకృతిం యాం త్యనుగచ్ఛన్తి భూతాని నిగ్రహః నిషేధరూపః కింకరిష్యతి మమ వాఽన్యస్య వా: 33

యది సర్వో జన్తు రాత్మనః ప్రకృతిసదృశమేవ చేష్టతే, నచ ప్రకృతిశూన్యః కశ్చి దస్తి; తతః పురుషకారస్య విషయానుపపత్తేః శాస్త్రానర్థక్యప్రాప్తా విద ముచ్యతే ఇంద్రియస్యేతి. ఇంద్రియ స్యేన్ద్రియస్యార్థే సర్వేంద్రియాణా మర్థే శబ్దాదివిషయ ఇష్టే రాగోఽనిష్టే ద్వేష ఇత్యేవం ప్రతీంద్రియార్థం రాగద్వేషా వవశ్యంభావినౌ తత్రాయం పురుషకారస్య శాస్త్రార్థస్యచ విషయ ఉచ్యతే; శాస్త్రార్థే ప్రవృత్తః పూర్వమేవ రాగద్వేషయో ర్వశం నాగచ్ఛేత్; యాహి పురుషస్య ప్రకృతిః సా రాగద్వేషపురస్సరైవ స్వకార్యే పురుషం ప్రవర్తయతి; తదా

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. 35

---

టీ:—సు అనుష్ఠితాత్ - లెస్సగా నాచరింపబడినట్టి, పరధర్మాత్ - ఇతరవర్ణాశ్రమ ధర్మముకంటె, విగుణః - గుణరహితమైనను, స్వధర్మః - తనయొక్క వర్ణాశ్రమ ధర్మము, శ్రేయాన్ - ప్రశస్తమైనది. స్వధర్మే - తనయొక్క వర్ణాశ్రమ ధర్మమందు, నిధనం - మరణమైనను, శ్రేయః - మంచిదే. ఏలనన, పరధర్మః - ఇతర వర్ణాశ్రమ ధర్మము, భయావహః - నరకాదిదుర్దశలకు హేతువగుటచే భయమును గలుగఁజేయును. 35

తా:—రాగద్వేషములకు వశము గాకుండవలయునన్నచో విషయాభిలాష నశింపవలయును. విషయములనుండి యింద్రియములను మరలింపవలయు ననినచో నవ్వాని నొకశాస్త్రీయవ్యాపారమునఁ బ్రవర్తింపజేయవలయును. అట్లు చేయనిచో నింద్రియములు స్వచ్ఛందప్రవృత్తిని జెంది పురుషు ననర్థములపాలుచేయును. అట్లనర్థముఁ జెందకుండ నుత్తమత్వమును బడయుటకు స్వధర్మము తక్క వేఱొండు సాధనము లేదనియు బరధర్మము నాశ్రయించుట సర్వానర్థములకు మూలమనియు శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు. ఇచట స్వధర్మ మనఁ దనవర్ణమునకు నాశ్రమమునకు ననువగు శ్రుతిస్మృత్యుదిత నిత్యనైమిత్తిక కర్మ లని యభిప్రాయము. తదితర మెంతమాత్రము గాదు. 35

---

స్వధర్మపరిత్యాగః పరధర్మానుష్ఠానంచ భవతి, యదా పునా రాగద్వేషౌ తత్ప్రతిపక్షేణ నియమయతి తదా శాస్త్రదృష్టిరేవ పురుషో భవతి, న ప్రకృతివశః; తస్మాత్తయో రాగద్వేషయో ర్వశం నా గచ్ఛేత్; యత స్తౌ హ్యస్య పురుషస్య పరిపంథినౌ శ్రేయోమార్గస్య విఘ్నకర్తారౌ తస్కరావివ పథీత్యర్థః. 34

తత్ర రాగద్వేషప్రయుక్తో మన్యతే శాస్త్రార్థ మప్యన్యథా పరధర్మోఽపి ధర్మత్వా దనుష్ఠేయ ఏవేతి తదసత్ - శ్రేయానితి. శ్రేయాన్ ప్రశస్యతరః స్వో ధర్మః స్వధర్మో విగుణోఽపి విగతగుణోఽప్యనుష్ఠీయమానః పరధర్మాత్స్వనుష్ఠితా త్సాద్గుణ్యేన సంపాదితాదపి; స్వధర్మే స్థితస్య నిధనం మరణమపి శ్రేయః పరధర్మే స్థితస్య జీవితాత్ కస్మాత్పరధర్మో భయావహః నరకాదిలక్షణం భయమావహతి యతః. 35

అర్జున ఉవాచ:—

అథ కేన ప్రయుక్తో౽యం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.　　36

శ్రీభగవా నువాచ:—

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.　　37

---

టీ:–వార్ష్ణేయ! అయం - ఈ, పూరుషః - పురుషుఁడు, కేన - దేనిచేతను, ప్రయుక్తః - నియమింపఁబడి, అనిచ్ఛన్ అపి - ఇచ్ఛ లేకుండినను, బలాత్ - బలాత్కారముగ, నియోజితః ఇవ - నియమింపబడినవానివలె, పాపం - పాపమును, అథ చరతి - చేయుచున్నాఁడు అని.　　36

తా:—పురుషులయొక్క కామ్యప్రతిషిద్ధప్రవృత్తికిఁ గారణ మేమైయుండునని తనప్రవృత్తికి మూలకారణంబును దెలిసికొను గూఢాశయముతో నర్జునుఁడు ప్రశ్నించుచున్నాఁడు.　　36

టీ:- రజోగుణసముద్భవః - రజోగుణము కారణముగాఁ గలిగినట్టియు లేదా రజోగుణమునకుఁ గారణమైనట్టియు, ఏషః - ఈ, కామః - కామము, ఏషః - ఈ, క్రోధః - క్రోధము, మహాశనః - ఎక్కువతృష్ణతోఁగూడినట్టి, మహాపాప్మా - మహాపాపస్వరూపము, ఇహ - ఈ సంసారమందు, ఏనం - ఇట్టికామమును, వైరిణం - శత్రువుగా, విద్ధి - తెలిసికొనుమా!　　37

---

యద్య ప్యనర్థమూలం "ధ్యాయతో విషయా న్పుంసః" (గీ. 2-62.) "రాగ ద్వేషౌ వ్యస్య పరిపంథినౌ" (గీ. 3-34) ఇతి చోక్తం విక్షిప్త మనవధారితంచ తదుక్తమ్ తత్సంక్షిప్తం నిశ్చితం చేద మేవేతి జ్ఞాతు మిచ్ఛ న్నర్జున ఉవాచ; జ్ఞాతేహి తస్మిం స్తదుచ్ఛేదాయ యత్నం కుర్యామితి అథేతి. అథ కేన హేతుభూతేన ప్రయుక్తస్సన్ రాజ్ఞేవ భృత్యో౽యం పాపం కర్మ చర త్యాచరతి పూరుషః స్వయ మనిచ్ఛన్నపి హేవార్ష్ణేయ! వృష్ణికులప్రసూత! బలాదివ నియోజితో రాజ్ఞే వేత్యుక్తో దృష్టాన్తః.　　36

శృణు త్వం తం వైరిణం సర్వానర్థకరం, యం త్వం పృచ్ఛసీతి భగవా నువాచ - కామఇతి. "ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః, వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీంగనా." (విష్ణు 6-5-74) ఐశ్వర్యాదిషట్కం యస్మిన్వాసుదేవే నిత్య మప్రతిబద్ధత్వేన సామగ్ర్యేనచ వర్తతే "ఉత్పత్తిం ప్రలయం

ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ,
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్. 38

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేనచ. 39

---

టీ:- యథా - ఏరీతిగా, వహ్నిః - అగ్ని, ధూమేన - పొగచేత, ఆవ్రియతే- ఆవరింపఁబడుచున్నదో, ఆదర్శః - అద్దము, మలేనచ - మాలిన్యముచే, యథా - ఏరీతిగా, ఆవ్రియతే- ఆవరింపఁబడుచున్నదో, యథా - ఏరీతిగా, గర్భః - శిశువు, ఉల్బేన - మావిచేత, ఆవృతః - ఆవరింపఁబడినదో, తథా - ఆరీతిగా, తేన - కామముచేత, ఇదం - ఈజ్ఞానము, ఆవృతం - ఆవరింపఁబడినది. 38

టీ:- ఏతేన - ఈ, నిత్యవైరిణా - సహజశత్రువైనట్టియు, దుష్పూరేణ - పూరించుట కలవికానట్టియు, అనలేన - అగ్నితుల్యమైనట్టియు, కామరూపేణ -

---

చైవ భూతానా మాగతిం గతిమ్, వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి" (విష్ణు5-6-78.) ఉత్పత్త్యాది విషయం చ విజ్ఞానం యస్య స వాసుదేవో వాచ్యో భగవానితి.

కామ ఏవ సర్వలోకశత్రు ర్యన్నిమిత్తా సర్వానర్థప్రాప్తిః ప్రాణినామ్ స ఏష కామః ప్రతిహతః కేనచిత్క్రోధత్వేన పరిణమతే. అతః క్రోధోఽప్యేష ఏవ రజోగుణసముద్భవో రజశ్చ తద్గుణశ్చ రజోగుణ స్స సముద్భవో యస్య స కామో రజోగుణసముద్భవః రజోగుణస్యవా సముద్భవః, కామో హ్యుద్భూతో రజః ప్రవర్తయ న్పురుషం ప్రవర్తయతి, తృష్ణయాహ్యహం కారిత ఇతిదుఃఖితానాం రజఃకార్యే సేవాదౌ ప్రవృత్తానాం ప్రలాపః శ్రూయతే; మహాశనో మహ దశన మస్యేతి మహాశనోఽతఏవ మహాపాప్మా; కామేనహి ప్రేరితో జంతుః పాపం కరోతి, అతో విద్ధ్యేనంకామ మిహ సంసారే వైరిణమ్. 37

కథం వైరీతిదృష్టాన్తైః ప్రత్యాయయతి - ధూమేనేతి. ధూమేన సహజే నావ్రియతే వహ్నిః ప్రకాశాత్మకోఽప్రకాశాత్మకేన, యథావాఽఽదర్శో మలేనచ యథోల్బేన చ జరాయుణా గర్భవేష్టనేన ఆవృత ఆచ్ఛాదితో గర్భ స్తథా తేనేద మావృతమ్. 38

కింపున స్త దిదంశబ్దవాచ్యమ్ యత్కామేనావృత మిత్యుచ్యతే - ఆవృత మితి. ఆవృత మేతేన జ్ఞానంజ్ఞానినో నిత్యవైరిణా జ్ఞానీహి జానా త్యనేనాహ

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. 40

తస్మా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్. 41

---

కామముచే, కౌన్తేయ!, జ్ఞానినః - జ్ఞానియొక్క, జ్ఞానం - జ్ఞానము, ఆవృతమ్ - ఆవరింపఁబడినది. 39

టీ:- అస్య - ఈకామమునకు, ఇంద్రియాణి - ఇంద్రియములు, మనః - మనస్సు, బుద్ధిః - బుద్ధియు, అధిష్ఠానం - ఆశ్రయముగా, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. ఏతైః - ఈ యింద్రియమనోబుద్ధులచేత, జ్ఞానం - జ్ఞానమును, ఆవృత్య - కప్పి, ఏషః - ఈకామము, దేహినం - ఆత్మను, విమోహయతి - నానావిధములుగా వ్యామోహము చేయుచున్నది. 40

టీ:- తస్మాత్ - ఆకారణముచే, భరతర్షభ! త్వం - నీవు, ఆదౌ - మున్ముందు, ఇంద్రియాణి - ఇంద్రియములను, నియమ్య - స్వాధీనముచేసికొని, ఏనం - ఈ, జ్ఞానవిజ్ఞాన నాశనమ్ - జ్ఞానవిజ్ఞానములఁ జెరుచునట్టి, పాప్మానం - మహాపాపియగు కామమును, ప్రజహిహి - పరిత్యజింపుమా! 41

తా:—విహితము నాచరింపకుండుటకును, నవిహితమునందు వర్తించుటకును మూలకారణము కామమనియు నయ్యది క్రోధముగాఁ బరిణమించుటఁజేసి యనర్థములు వాటిల్లుననియుఁ, గామముకంటెఁ బ్రబలశత్రువు వేఱొండు లేదనియు బై

---

మనర్థే ప్రయుక్తః పూర్వ మేవేతి దుఃఖీచ భవతి నిత్యమేవ. అతో౽సౌ జ్ఞానినో నిత్యవైరీ నతు మూర్ఖస్య, సహి కామం తృష్ణాకాలే మిత్రమివ పశ్యం స్తత్కార్యే దుఃఖే ప్రాప్తే జానాతి తృష్ణయా౽హం దుఃఖిత్వ మాపాదిత ఇతి న పూర్వమేవ అతో౽తో జ్ఞానినఏవ నిత్యవైరీ, కింరూపేణ? కామరూపేణ కామ ఇచ్ఛైవ రూప మస్యేతి కామరూప స్తేన దుష్పూరేణ, దుఃఖేన పూరణ మస్యేతి దుష్పూర స్తేనా నలేన నాస్యాలం పర్యాప్తి ర్విద్యత ఇత్యనల స్తేనచ. 39

కిమధిష్ఠానః పునః కామో జ్ఞానస్యావరణత్వేన వైరీ సర్వస్య లోకస్యే త్యపేక్షాయా మాహ. జ్ఞాతేహి శత్రో రధిష్ఠానే సుఖేన శత్రునిబర్హణం కర్తుం శక్యతఇతి - ఇంద్రియాణీతి. ఇంద్రియాణి మనోబుద్ధి శ్చాస్య కామ స్యాధిష్ఠాన మాశ్రయ ఉచ్యతే, ఏతై రింద్రియాదిభి రాశ్రయై ర్విమోహయతి వివిధం మోహయ త్యేష కామో జ్ఞాన మావృ త్యాచ్ఛాద్య దేహినం శరీరిణమ్. 40

యత ఏవమ్ - తస్మా దితి. తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ పూర్వమేవ నియమ్య వశీకృత్య భరతర్షభ! పాప్మానం పాపాచారం కామం ప్రజహిహి పరి

ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. 42

---

నాల్గుగీతముల తాత్పర్యము. కామమునకుఁ దృప్తి యనునది యెన్నడును దెలియ రాదు గావున నియ్యది మహాశనమని జెప్పఁబడుచున్నది. కామమునకుఁ బ్రతి బంధము గల్గినచో నయ్యది క్రోధముగాఁ బరిణమించును. కామముయొక్క యవ స్థాన్తరమే క్రోధముగాని క్రోధ మనునది ప్రత్యేకవ్యక్తి కాదు. దానంజేసి ప్రకృత మున యుద్ధరూపమున నిలిచియుండు సమావేశమే కామక్రోధముల మూర్తీభావ మని సూచించుటకై "ఏషః కామః ఏషః క్రోధః" అని హస్తవిన్యాసముచేఁ బ్రత్యక్షవిషయములుగాఁ గామక్రోధముల నిర్దేశించుచున్నారు. కామక్రోధములఁ బ్రత్యేకముగాఁ బఠించిన నొక్క కామమునే మహాశత్రువుగా వర్ణించుటచేఁ గ్రోధ ము కామముయొక్క చేష్టయేగాని వేఱొండు గాదని సుస్పష్టము. ఇంద్రియ మనో బుద్ధులు కామవశము లైనచో నవిహితప్రవృత్తి గలుగును. అందు నింద్రియములు ముఖ్యసాధనములు. అట్టి యింద్రియములు కామవశములు గాకుండ నిగ్రహింపఁ బడినచోఁ గామ మునికి లేక తనంతట దానే తొలఁగిపోవునను పరమరహస్యముఁగ నింద్రియనిగ్రహము కామవిజయోపాయముగ నుపదేశింపఁబడినది. 37-41

టీ:- ఇంద్రియాణి - ఇంద్రియములు, పరాణి - శ్రేష్ఠములని, ఆహుః - చెప్పుచున్నారు. ఇంద్రియేభ్యః - ఇంద్రియములకంటె, మనః - మనస్సు, పరం - శ్రేష్ఠమైనది. మనసః తు - మనస్సుకంటె, బుద్ధి - బుద్ధి, పరా - శ్రేష్ఠమైనది. బుద్ధేః - బుద్ధికంటె, పరతః - పరమందైన, యః - ఇంద్రియమనోబుద్ధులకు ద్రష్ట యెవఁడో, సః - వాఁడే పరమాత్మ. 42

---

త్యజ, ఏనం ప్రకృతం వైరిణం జ్ఞానవిజ్ఞాననాశనం, జ్ఞానం శాస్త్రత ఆచార్యత శ్చాత్మాదీనా మవబోధః, విజ్ఞానం విశేషత స్తదనుభవః, తయోః జ్ఞాన విజ్ఞా నయోః శ్రేయఃప్రాప్తిహేత్వో ర్నాశనం నాశకరం ప్రజహిహి ఆత్మనః పరిత్య జేత్యర్థః. 41

ఇంద్రియా ణ్యాదా నియమ్య కామం శత్రుం జహి హీత్యుక్తమ్, తత్ర కి మాశ్రియః కామం జహ్యా దిత్యుచ్యతే - ఇంద్రియాణీతి. ఇంద్రియాణి శ్రోత్రాదీని పంచ దేహం స్థూలం బాహ్యం పరిచ్ఛిన్నం చాపేక్ష్య సౌక్ష్మ్యాంతరస్థత్వవ్యాపి త్వాద్యపేక్షయా పరాణి ప్రకృష్టా న్యాహుః పండితాః తథేంద్రియేభ్యః పరం మనస్సంకల్పవికల్పాత్మకం తథా మనసస్తు పరా బుద్ధి ర్నిశ్చయాత్మికా, తథా య స్సర్వదృశ్యేభ్యో బుద్ధ్యంతేభ్యోఽభ్యంతరో యం దేహిన మింద్రియాదిభి రాశ్రయై ర్యుక్తః కామో జ్ఞానావరణద్వారేణ మోహయతీత్యుక్తమ్, బుద్ధేః పరతస్తు స స బుద్ధే ర్ద్రష్టా పర ఆత్మా. 42

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్.          43

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
కర్మయోగోనామ తృతీయోధ్యాయః.

---

టీ:- ఏవం - ఈప్రకారము, మహాబాహో! బుద్ధేః - బుద్ధికంటె, పరం ఆత్మానం - శ్రేష్ఠమగు పరమాత్మను, బుద్ధ్వా - తెలిసికొని, ఆత్మనా - నిగ్రహింపఁబడిన తన మనస్సుచేత, దురాసదం - దుర్విజ్ఞేయమగు, కామరూపం - కామమే స్వరూపముగా గల, శత్రుం - అన్తశ్శత్రువును, సంస్తభ్య - అరికట్టి, జహి - పోఁగొట్టుమా !                                                    43

తా:- ఇంద్రియనిగ్రహమెట్లు లభింపఁగలదను విషయము సహేతుకముగా నుపదేశింపఁబడుచున్నది. పురుషప్రవృత్తికి సాధనము లగుటంజేసి యింద్రియములు శ్రేష్ఠములని చెప్పఁబడుచున్నవి. ఇంద్రియముల ప్రవృత్తికి మనస్సు కారణ మగుటఁ జేసి యింద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము. మన స్సెల్లప్పుడును బుద్ధి ననుసరించు గావున మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠము. బుద్ధికంటె బరమందైన యాత్మ బుద్ధి కధిష్ఠాన మగుటంజేసి యాత్మ యింద్రియమనోబుద్ధులకంటె శ్రేష్ఠతమము. బుద్ధి స్వాధీనము గావలయునన్నచో నద్దాని కాధారమును దానికంటె శ్రేష్ఠమునగు నాత్మ వలనఁ గావలయు. ఆతీరుననే మనస్సు బుద్ధిద్వారా స్వాధీనము గావలయు, నత్తె ఱంగుననే యింద్రియములు మనస్సుద్వారా స్వాధీనములు గావలయుఁగాని వేఱొండు మార్గము లేదు. కావున నింద్రియమనోబుద్ధులు కామవశములు గాకుండ జేయవలయుననిన-చో నింద్రియమనోబుద్ధులకంటె శ్రేష్ఠతమంబగు నాత్మ నాశ్రయింపవలయును. ఆత్మ నాశ్రయించుట యన నాత్మను దెలిసికొనుటయే. ఆత్మను దెలిసికొనినచో సర్వము తెలియును, సర్వము వశమగును .కావునఁ గామమును బుష్కలముగా దొలఁగింపఁదలఁచినవాఁ డాత్మజ్ఞానముఁ బడసి యింద్రియ మనోబుద్ధుల స్వాధీనము చేసికొనవలయు నను నుపదేశముచే మూఁడవ యధ్యాయము ముగియుచున్నది.

ఇట్టి యుపదేశమునందు గూఢాభిసంధి: ఓయీ యర్జునా! నీవు కామవశుఁడవై విహితమగు యుద్ధమునుండి మరలఁదలఁచుచు నీ కవిహితమగు నుపర

---

తతః కిమ్ - ఏవ మితి. ఏవం బుద్ధేః పరమాత్మానం బుద్ధ్వా జ్ఞాత్వా సంస్తభ్య సమ్యక్ స్తంభనం కృత్వా స్వేనై వాత్మనా సంస్కృతేన మనసా సమ్యక్సమాధాయేత్యర్థః; జహి ... మహాబాహో! కామరూపం దురా

మముఁ జేకొనఁ దలంచుచున్నావు. కావున నాత్మజ్ఞానముఁ బడసి కామమును దొలగించుకొని నీకు నుచితమును స్వధర్మమునగు యుద్ధమును ఫలాభిసంధిరహితముగ నాచరించి యైహికాముష్మికనిశ్శ్రేయసములఁ బడయుమా! అని.

కర్మయోగమునందలి సారాంశము:— ప్రతిమనుజుఁడును స్వవర్ణాశ్రమోచిత నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానము నాచరించి తీరవలయును. కామ్యప్రతిషిద్ధముల నెంతమాత్రము నాచరింపఁగూడదు. అంతియేకాదు. శాస్త్రవిహితములయ్యు పరధర్మములనఁ దనవర్ణాశ్రమములకు భిన్నములగు వర్ణాశ్రమధర్మముల నెంతమాత్ర మాచరింపఁగూడదు. ఒకానొక వేళ తన వర్ణాశ్రమధర్మము విగుణముగాఁ దోఁచినను నద్దాని జక్కఁగా నాచరింపలేకపోయినను యథాశక్తి యథోచితముగా నద్దానినే యాచరించి తీరవలయును. వేయేల! స్వధర్మమునందు మరణము తటస్థించినను నద్దానినే యాచరించితీరవలయునుగాని పరధర్మమును దా నెంతచక్కఁగ నాచరింపఁ గల్గినను నాచరింపఁగూడదు. కర్మలవలన ఫలములు గల్గుగావున ఫలాభిలాష లేకపోవుటచేఁ గర్మల విడనాడఁగూడదు. ఫలాభిలాష నశించినను జిత్తశుద్ధిని బడయుటకుఁ గర్మలే కారణము గావున ఫలాభిసంధివర్జితుఁ డయ్యును జిత్తశుద్ధిని బడయుటకు నిత్యనైమిత్తికముల నాచరింపవలయును. అట్లు చిత్తశుద్ధి నభిలషించి కర్మల నాచరించినవారలలో జనకుఁడు, అశ్వపతి మొదలగువారు దృష్టాన్తము. అశేషకర్తవ్యతాశూన్యుఁ డగు జ్ఞానికూడ లోకసంగ్రహమునకై యథోచితశాస్త్రీయనిత్యనైమిత్తికంబుల నాచరింపుచుండవలయు నని శ్రీకృష్ణభగవదాశయము. అశేషకర్తవ్యతాశూన్యుఁడగు మహనీయుఁడు లోకసంగ్రహమునకై కర్మల నాచరించుటలో శ్రీకృష్ణభగవానులు తననే దృష్టాన్తముగా బోధించుచున్నారలు. దానంజేసి ఫలాభిలాష లేనివారలు చిత్తశుద్ధికొఱకును, అశేష కర్తవ్యతాశూన్యు లగు జ్ఞానులు లోకసంగ్రహమునకును గర్మల నాచరించితీరవలయు నని మూఁడవ యధ్యాయపు పరమరహస్యము.

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్యస్వాముల వారిచే రచింపఁబడిన
గీతామృత తరంగిణియందు తృతీయ తరంగము.

పదం దుఃఖేన ఆసద ఆసాదనం ప్రాప్తి ర్యస్య తం దురాసదం దుర్విజ్ఞేయానేకవిశేష మితి. 43

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## చతుర్థోధ్యాయః

శ్రీభగవా నువాచః—

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్. 1

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప. 2

---

కాండద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మస్వరూపిణే,
స్వర్గాపవర్గరూపాయ శ్రీకృష్ణాయ నమోనమః.

టీ:- ఇమం - ఈగడచిన రెండుమూఁడధ్యాయములచేఁ జెప్పఁబడిన, అవ్యయమ్ - మార్పు లేనట్టి, యోగం - యోగమును, అహం - నేను, వివస్వతే - సూర్యునికొఱకు, ప్రోక్తవాన్ - సృష్ట్యాదియందుఁ జెప్పినవాఁడనైతిని. వివస్వాన్ - సూర్యుఁడు, మనవే - వైవస్వత మనువుకొఱకు, ప్రాహ - పలికెను, మనుః - వైవస్వతమనువు, ఇక్ష్వాకవే - తనపుత్త్రుఁడగు నిక్ష్వాకుమహారాజుకొఱకు, అబ్రవీత్ - ఉపదేశించెను ఏవం - ఈతీరున, పరంపరాప్రాప్తం - క్షత్త్రియపరంపరచేఁ బొందఁబడినట్టి, ఇమం - ఈయోగమును, రాజర్షయః - రాజన్యులు, విదుః - గుర్తెఱుంగుచున్నారు. సః యోగః - అట్టి పరంపరా ప్రాప్తమగు నీయోగము, ఇహ - ఈ లోకమునందు, మహతా - దీర్ఘమగు, కాలేన - కాలముచే, నష్టః - సంప్రదాయ విచ్ఛిత్తిచే లుప్తప్రాయ మాయెను. పరంతప - అర్జునా! పురాతనః - చిరకాలము

---

యోఽయం యోగోఽధ్యాయద్వయేనోక్తో జ్ఞాననిష్ఠాలక్షణః స సంన్యాసః కర్మయోగోపాయో యస్మి న్వేదార్థః పరిసమాప్తః ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ గీతాసుచ సర్వాస్వయ మేవ యోగో వివక్షితో భగవతా, అతః పరిసమాప్తం వేదార్థం మన్వాన స్తం వంశకథనేన స్తౌతి శ్రీభగవాన్ - ఇమ మితి. ఇమ మ్యయధాద్వయే నోక్తం యోగం వివస్వత ఆదిత్యాయ సర్గాదా ప్రోక్త వా నహం జగత్పరిపాలయితౄణాం క్షత్త్రియాణాం బలాధానాయ తేన యోగ

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్. 3

---

నాఁటి, సః అయం యోగః ఏవ - ఆ యీ యోగమే, అద్య - ఇప్పుడు, తే - నీకొఱకు, మయా - నాచేతను, ప్రోక్తః - ఉపదేశింపఁబడెను. మే - నాకు, భక్తః - భక్తుఁడవు, సఖా చ - స్నేహితుఁడవును, అసి ఇతి - అగుచున్నావని, హి - నిశ్చయముగా, ఏతత్ - ఈ, ఉత్తమం - పరమపవిత్రమగు, రహస్యం - రహస్యము, ప్రోక్తం - చెప్పఁబడినది. 1-3

తా:—శ్రీకృష్ణభగవాను లర్జునున కుపదేశము చేసినపిమ్మట నర్జునుం డుపదేశమునందలి సారమును గ్రహించినవాఁడై పిమ్మట సందేహమనస్కుఁడై యట్టి సందియమును దొలగించి తనకు శ్రేయస్సాధన మెద్దియో నద్దాని నొక్కదానినే నిశ్చయముగ నుపదేశింపవలయు నని ప్రార్థింప నందులకు దగు సమాధానముగా మూఁడవ యధ్యాయము కలిగినట్లు నిశ్చయముగాఁ దెలియవచ్చినవిషయమేకదా! మూఁడవ యధ్యాయమునందలి విషయమును గ్రహించుటచే నర్జునుండు సందేహమును విడనాడి తా నవశ్యము యుద్ధరూపమగు స్వధర్మము నాచరించితీరవలసిన దేయనునిశ్చయమును బొంది యూరకుండినట్లు మూఁడవ యధ్యాయాంతమునఁ దెలియవచ్చెడిని. అర్జునుఁడు ప్రకృతమున దృప్తిఁజెంది యూరకుండినను బైయుపదేశ

---

బలేన యుక్తాః సమర్థా భవంతి బ్రహ్మ పరిరక్షితుమ్; బ్రహ్మక్షత్త్రే పరిపాలితే జగత్పరిపాలయితు మలమ్ అవ్యయ మవ్యయఫలత్వాత్ ; నహ్యస్య యోగస్య సమ్యగ్దర్శననిష్ఠాలక్షణస్య మోక్షాఖ్యం ఫలం వ్యేతి; సచ వివస్వా న్మనవే ప్రాహ, మనురిక్ష్వాకవే స్వపుత్త్రాయాదిరాజా యాబ్రవీత్. 1

ఏవమితి. ఏవం క్షత్త్రియపరంపరాప్రాప్త మిమం రాజర్షయో రాజానశ్చ త ఋషయశ్చ రాజర్షయో విదు రిమం యోగం, స యోగః కాలే నేహ మహతా దీర్ఘేణ నష్టో విచ్ఛిన్నసంప్రదాయః సంవృత్తో హే పరంతప! ఆత్మనో విపక్షభూతాః పరా ఇత్యుచ్యన్తే, తాన్ శౌర్య తేజోగభస్తిభి ర్భాను రివ తాపయతీతి పరంతప శ్శత్రుతాపన ఇత్యర్థః. 2

దుర్బలా నజితేంద్రియా న్ప్రాప్య నష్టం యోగ మిమ ముపలభ్య లోకం చాపురుషార్థసంబంధినం - సఏవాయ మితి. సఏవాయం మయా తే తుభ్య మద్యేదానీం యోగః ప్రోక్తః పురాతనః, భక్తోఽసి మే సఖా చాసీతి రహస్యం హి యస్మా దేత దుత్తమం యోగో జ్ఞాన మిత్యర్థః. 3

మునం దర్జునునకుఁ దత్కాలమున భాసింపనట్టియు నొకానొకప్పుడు భాసించిన మనో
వైకల్యముఁ గలిగించునట్టియు విషయములు కొన్ని పూర్వగ్రంథమం దుండుటం
జేసి యవ్వానిసి బోధించుటకై శ్రీకృష్ణభగవానులు స్వయముగానే ఫలశ్రుతి
రూపముగ వైజ్ఞానపుటతిశయమును వర్ణించువ్యాజమున విద్యావంశమును వర్ణించి
యున్నారు. పై గ్రంథమున నర్జునుండు గమనింపని విషయములు: రెండవయధ్యాయ
మున నరువదియొకటవ గీతమున "యుక్త ఆసీత మత్పరః", మూఁడవ యధ్యాయ
మున ముప్పదియవగీతమున "మయి సర్వాణి కర్మాణి సంన్యస్య", మూఁడవయధ్యా
యమున మూఁడవగీతమున "పురా ప్రోక్తా మయా" ముప్పదియొకటి ముప్పదిరెండు
గీతములయందలి "మే మత మిదం" అనుస్థలమునందలి "అహం" శబ్దార్థమును;
'పురా' యను శబ్దార్థమును. ఇవి యటుండ మూఁడవయధ్యాయపుటుపక్రమ
గీతమునందలి 'తే మతా చేత్" అను దానిచే నీయభిప్రాయ మనుటవలన
శ్రీకృష్ణుని ప్రత్యేకాభిప్రాయమా లేక శ్రుతిస్మృతి సదాచారానుగుణ మగు
నభిప్రాయమా యనుశంకకుఁగూడ నవకాశము గలుగును. ఇంతియ కాదు;
ఇంతవఱకు శ్రీకృష్ణ భగవానులయం దర్జునునకుఁ దనకంటె నతిశయమగు
జ్ఞానముతోఁగూడిన గురువ్యక్తి యని యభిప్రాయము కాని శ్రీకృష్ణ రూప
మున దనయెదుట నిలిచియుండిన బరాత్పరుఁ డనుజ్ఞాన మొకింతయు నర్జునునకు
బొడమలేదు. అట్లు తెలియవచ్చుటకు నవకాశము లేదు. దానంజేసి యట్టి జ్ఞాన
ముపదేశించుటచే సర్వసంశయములు దొలగునను మహాశయము మీఱ శ్రీకృష్ణభగ
వానులే యుపక్రమించుచున్నారు. ఇచ్చట "ఇమం యోగం" అనగా నిదివఱకు
గడచిన రెండధ్యాయములం దుపదేశింపఁబడిన జ్ఞానకర్మద్వైవిధ్యముతో నొప్పు
బ్రహ్మనిష్ఠ యని "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ, జ్ఞాన
యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్" అను (గీ.3-37) గీతముచేతను,
'ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు'(గీ.2-35)అనుగీతముచేతను
దెలియవచ్చెడిని. ఇచ్చట సాంఖ్యశబ్దము జ్ఞానపరము, యోగశబ్దము కర్మపరము.
ఈ రెండు నొకేనిష్ఠయొక్క యవస్థాభేదములుగాని యత్యంతవిలక్షణంబు లెంతమా
త్రముగావని "సాంఖ్యయోగా పృథక్ బాలాః ప్రవదన్తి నపండితాః, ఏకమప్యా
స్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. యత్సాంఖ్యైః ప్రాప్యతే జ్ఞానం తద్యోగైరపి

గమ్యతే, ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి." (గీ. 5-4, 5) యను గీతపులవలనఁగూడ ముందు వివరింపఁబడుచున్నది. జ్ఞానకర్మలని వర్ణింపఁబడు సాంఖ్యయోగము లొక్క నిష్ఠయొక్క యవాంతరభేదము లనుటకు "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా" "ఇమం యోగ"మ్మనుస్థలమందలి యేకవచనప్రయోగమే పరమప్రమాణము. అవ్యయ మ్మను శబ్దము యోగశబ్దమునకు విశేషణముగా బరగుచున్నది. అవ్యయఫలహేతు వగుటచే నీయోగముకూడ నవ్యయ మనఁబడుచున్నది. ఏలనన సమ్యగ్దర్శననిష్ఠాలక్షణమగు నీయోగమువలనఁ గలుగు మోక్షఫల మెన్నడు నెట్టి మార్పు జెందకుండ నుండు గావున దత్కారణంబగు యోగముగూడ నవ్యయ మని చెప్పఁబడుచున్నది. "వివస్వతే ప్రోక్తవాన్" 'సూర్యునకొఱకు చెప్పినవాఁడనైతిని' ఎప్పుడన సృష్ట్యాదియందని పూర్వాపరసందర్భమువలన సుకరముగా దెలియనగును. ఇయ్యది మూఁడవయధ్యాయమున మూఁడవగీతమందలి "పురా మయా ప్రోక్తా" యను దాని వివరణము. సృష్ట్యాదియందు నాచే నుపదేశముఁ బడసిన సూర్యుఁ డీయోగమునే వైవస్వతమనువున కుపదేశించెననియు నద్దానినే మను విక్ష్వాకుమహారాజున కుపదేశించెననియు నట్లు క్రమక్రమముగాఁ బారంపర్య క్రమమున నీయోగమును రాజర్షులు గుర్తెఱింగియున్నారనియు నయ్యది దీర్ఘకాలముచే నేటికి లుప్తప్రాయమైనదనియు నద్దానినే ప్రకృతమునఁ దా నర్జునున కుపదేశించెననియు శ్రీకృష్ణభగవానులు వక్కాణించుచున్నారు. ఇక్కడ గమనింపవలసిన విషయ మెద్దియన సృష్ట్యాది యెప్పుడు? ప్రకృతకాల మెప్పుడు? దీర్ఘకాలమన నెంత? యనువిషయము.

సృష్ట్యాదిగడచి నేఁటికి 195,58,85,035 సంవత్సరము లని గణకులు చెప్పు చెప్పుచున్నారు. భారతయుద్ధము ప్రకృతపు కలియుగమునకుఁ బూర్వము 38 వ సంవత్సరమునందుఁ గార్తిక బహుళ యమావాస్యయందుఁ బ్రారంభమైన ట్లుద్యోగపర్వమునందలి శ్రీకృష్ణ కర్ణ సంవాదమువలనఁ దెలియుచున్నది. "సప్తమా ద్దివసా దస్మా చ్ఛామావాస్యా భవిష్యతి, సంగ్రామో యుజ్యతాం తాత తా మాహుః శ్శక్ర దైవతాం" అని శ్రీకృష్ణభగవానులచేఁ బలుకఁబడి యక్కాలపు గ్రహస్థితి గూడ యొకింత నిరూపింపఁబడినది.

అదెట్లనిన: మేషమునఁ గేతువు, వృషభమున శని, కన్యయందు శుక్రుఁడు, తులయందు రవి బుధ రాహువులు, వృశ్చికమునందుఁ గుజచంద్రులు మకరమునందు గురుఁడును. కొందఱు విమర్శకు లమావాస్యకుఁ బరమందైన యేకాదశి యని పలుకుచున్నారు. ఏది యెట్లైనను సంవత్సరమునందు భిన్నాభిప్రాయము లేదు. దానంజేసి భారతయుద్ధము జరిగి నేఁటికి, 5035 + 38=5073 సంవత్సరములాయెను. అనగా శ్రీకృష్ణభగవాను లర్జునున కుపదేశముచేసి 5073 వత్సరములు గడచినట్లు తెలియవచ్చెడిని. ఇఁక దీర్ఘకాలమన 195,58,85,035—5073 = 195,58,79,962 సంవత్సరములు. అర్జునుని దృష్టియందు భారతయుద్ధకాలమునకు శ్రీకృష్ణభగవానులకు 87 సంవత్సరములు వయస్సు. ఏలనన శ్రీకృష్ణావతారకాలము 125 సంవత్సరముల ఏఁడు మాసముల యెనిమిదిదినముల ముప్పదిగడియలు. శ్రీకృష్ణనిర్యాణము కల్యాదియందు. కల్యాదికి 38 సంవత్సరములకుఁ బూర్వము భారతయుద్ధము జరిగినట్లు తెలియవచ్చెడిని. దానంజేసి శ్రీకృష్ణభగవానులకు భారతయుద్ధకాలమునకు 87 సంవత్సరముల వయస్సని తెలియవచ్చెడిని. అగుటంజేసి సృష్ట్యాదియందు శ్రీకృష్ణభగవానులే సూర్యున కుపదేశము ఁ యోగమునే చేసినట్లు పలుకుట విప్రతిషిద్ధము. ఇయ్యది విప్రతిషిద్ధముగా బాహ్యమునకుఁ బామరదృష్టిచేఁ దోఁచు ననునాశయము మీఱ శ్రీకృష్ణభగవాను లీవిషయమును రహస్యమనియు నుత్తమమనియుఁ జెప్పుచున్నారు. ఉత్తమరహస్య మని యోగమునుగూడఁ జెప్పినఁ జెప్పవచ్చుఁ గాని యిందు సృష్ట్యాదియం దుపదేశము చేసినది తా ననియు నిప్పుడును నట్టితానే యుపదేశము చేసితినని వక్కాణించుటయుఁ గూడ నుత్తమరహస్య మని కోవిదులకు సుస్పష్టముగ స్ఫురించెడిని. దానంజేసి "ఇమం వివస్వతే యోగం" అను గీతము మొదలు "భక్తోఽసి మే సఖా చేతి" యను వాక్యమువఱకుఁ గల యర్థసందర్భమంతయుఁ గూడ "రహస్యం హ్యేత దుత్తమ" మ్మను వాక్యముచేఁ బరామర్శ చేయఁబడుచున్నట్లు నిశ్చయముగ దెలిసికొనవచ్చును.

ఇంతియకాదు. ఉత్తరమం దర్జునుఁడు వైచిన ప్రశ్నముగూడ పైగీతమువలన దెలియవచ్చెడు నర్థసందర్భము ననుసరించియేయున్నది. ఏలనన నిట్టి యర్థసందర్భ ముత్తమరహస్యమేకాక సుకరముగఁ దెలియఁదగిన విషయమే యైనచో శ్రీకృష్ణ

అర్జున ఉవాచ:—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. 4

---

భగవాను లద్దాని నపూర్వముగాఁ బలుకుటయు నద్దానియందు సంశయము గలుగు టయుఁ గలుగనేరదు. వేయేల! శ్రీకృష్ణభగవానులు చెప్పినను లౌకికదృష్టిచే విశ్వ సించుటకు నేరికిని శక్యముగాదని యప్పుడేకా దిప్పటికిని విస్మయకారణం బగుచు విశ్వాసార్హముగాఁ దోఁపదు. ప్రకృతమున శ్రీకృష్ణభగవానులు చెప్పినరహస్యమును గూర్చి తత్సాన్నిధ్యమున నున్న యర్జునునికే సందియము గలుగ శ్రీకృష్ణార్జును లిద్దరు చారిత్రపురుషులా లేక యాలంకారికపాత్రములా యను విచారము చేయు కాలమున నీరహస్యమందు విశ్వాస మెట్లు కలుగునో ప్రాజ్ఞులు యోజింపవలసిన విషయము. వాస్తవముచే నీగీతాశాస్త్రమును బ్రమాణముగాఁ దలంచువారలు మున్ముందుగా నీ రహస్యమును గమనింపవలయును. గీతాశాస్త్రమున సకలజనులకు ససమంజసముగా సామాన్యదృష్టికి భాసించువిషయ మి దొక్కటియే. ఏతద్విష యమే సత్యేతరవిషయ మైనచో నిట్టి సత్యేతరవిషయములను బల్కిన శ్రీకృష్ణ భగవానులకు మృషావాదిత్వదోషము ఘటిల్లును. మృషావాది చెప్పినదంతయు మృషావాదమే యగును గాని వాస్తవమై యెన్నటికిని విశ్వాసార్హము కానేరదు. మృషావాది యొకప్పుడు వాస్తవమును జెప్పినను నయ్యది శ్వదృతి ధృత గోక్షీర న్యాయముచే మృషయే యగును గాని సత్య మెంతమాత్రమును గానేఱదు. “కడ వెడు పాలలో నొక చల్లచుక్క” యను సామెత మీఱ నీ రహస్యమే యసృత మైనచో గీతాశాస్త్రమంతయు నతిశయమును గోలుపోవుటయే కాక, నిరర్థకమును నిష్ప్రయోజనము నగుటయే కాక యనర్థకంబులకుఁ గూడ కారణంబగును. గీతా శాస్త్రమును బ్రమాణ మని తలంచువార లంద రీ విషయము పరమప్రమాణం బనియు నుత్తమంబగు రహస్యమనియు సర్వవిధములఁ దలఁచుచున్నారు. ఏలనన నీరహస్యమందలి సందియ మర్జునునిచే నడుగఁబడి భగవానులచేఁ దృప్తికరముగ సమాధానము చెప్పఁబడి యతిశయముగా నిలిచియున్నది. 1-3

టీ:—భవతః - నీయొక్క, జన్మ - పుట్టుక, అపరం - నుమా రెనుబదియేడు వత్స రములకిందట గదా! వివస్వతః - సూర్యునియొక్క, జన్మ - పుట్టుక, పరం - నేటికి

---

భగవతా విప్రతిషిద్ధ ముక్త మితి మాభూ త్కస్యచిద్బుద్ధి రితి పరిహారార్థం చోద్య మివ కుర్వ న్నర్జున ఉవాచ - అపరమితి. అపర మర్వా గ్వసు దేవగృహే

శ్రీభగవా నువాచ:—

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. 5

---

195,58,79,962 సంవత్సరములకుఁ బూర్వముగ దా! త్వం - నీవే, ఆదా - సృష్ట్యాది యందు, ప్రోక్తవా నితి - ఉపదేశము చేసితివను, ఏతత్ - ఈవిషయమును, కథం - ఎట్లు, విజానీయాం - తెలిసికొందును? అనగా - విశ్వసింపఁగలను. గురువులుగాఁ మిమ్ములఁ దలంచు చున్న నేను మిమ్ములను మృషావాదిగ సంశయింపఁజాలనుగదా యని వినయపూర్వకముగ దనసందియమును వెలిబుచ్చుచున్నాఁడు. 4

టీ:—పరంతప! - అర్జున! మే-నాకు, బహూని - అనేకములగు, జన్మాని - పుట్టుకలు, వ్యతీతాని - గడచినవి, తవ చ - నీకును అట్టులే. తాని సర్వాణి - ఆ జన్మల నన్నిటిని, అహం - నేను, వేద - తెలిసికొనుచున్నాను. త్వం - నీవు, న వేత్థ - తెలిసికొనఁ జాలకున్నావు. 5

తా:—శ్రీకృష్ణభగవానులు తా రెండవయధ్యాయమున "దేహినోఽస్మిన్ యథాదేహే" "అంతవంత ఇమే దేహాః" "వాసాంసి జీర్ణాని" "అవ్యక్తాదీని భూతాని" యను గీతములచే వ్యక్తీకరించిన యభిప్రాయము నర్జునుండు గ్రహింపక పోవుటచే నిట్టి విప్రతిపత్తిని బొందియున్నాఁడనియు; నట్టి యభిప్రాయమును వివరించుటయే గాక సకలజనులకు నెవ్విధముచే నైనను దెలిసికొనుట కవకాశ మించుకేనియు లేని యీశ్వరతత్త్వమునుగూడ నతిశయముగ వర్ణించుచున్నారు. ఇక్కడ చకార మనుక్తసముచ్చయార్థక మగుటంజేసి, యచ్చట నుండు నెల్లవారలకును బెక్కు జన్మలు గడచినవనియు గూడ భగవదాశయ మైనట్లు "న త్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః, నచైవ నభవిష్యామ స్సర్వే వయ మతఃపరం" (గీ. 2-12). అను గీతాభిప్రాయమునే వెల్లడింపుచున్నారు. ఇట్లు శ్రీకృష్ణభగవానులును

---

భవతో జన్మ, పరం పూర్వం సర్గాదౌ జన్మోత్పత్తి ర్వివస్వత ఆదిత్యస్య; తత్కథ మేత ద్విజానీయా మవిరుద్ధార్థతయా య స్త్వ మేవాదౌ ప్రోక్తవా నిమం యోగం స ఏవ త్వ మిదానీం మహ్యం ప్రోక్తవా నసీతి. 4

యా వాసుదేవేఽనీశ్వరాఽసర్వజ్ఞా శంకా మూర్ఖాణాం తాం పరిహరన్ శ్రీభగవా నువాచ యదర్థో హ్యర్జునస్య ప్రశ్నః - బహూనీతి. బహూని మే మమ వ్యతీతాన్యతిక్రాన్తాని జన్మాని తవచ హేఽర్జున! తాన్యహం వేద జానే సర్వాణి, న త్వం వేత్థ న జానీషే, ధర్మాధర్మాదిప్రతిబద్ధజ్ఞానశక్తిత్వాత్; అహం పునర్నిత్య శుద్ధ బుద్ధముక్తస్వభావత్వా దనావరణజ్ఞానశక్తిరితి వేదాఽహం హే పరంతప. 5

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. 6

---

తదితరులును సృష్ట్యాదినుండియు జన్మల నెత్తుచు వచ్చుచుండినచో శ్రీకృష్ణ భగవానులయొక్క యతిశయ మేమగు ననినచో నయ్యది యీశ్వరత్వము సర్వజ్ఞత్వమని తెలియవచ్చెడిని. నీ వించుకేనియు నెఱుంగవనుటలో నర్జునుని యజ్ఞత సుస్పష్టముగ దెలియవచ్చుచున్నది. శ్రీకృష్ణభగవానులయొక్క సర్వజ్ఞతవలన నర్జునుని యజ్ఞతవలనను జీవేశ్వరులకుఁ గల తారతమ్యము స్పష్టముగ నిరూపింపఁబడుచున్నది. 5

టీ:-అజః - పుట్టుకలేనివాఁడను, అవ్యయాత్మా - నిర్వికార స్వరూపుండను, సన్ అపి - అయినప్పటికి, భూతానాం - బ్రహ్మాది స్తంబ పర్యంతము గల సకలప్రాణులకు, ఈశ్వరః - నియామకుఁడను, సన్ అపి - అయినప్పటికి, స్వాం - నాసంబంధమగు, ప్రకృతిం - మాయాశక్తిని, ఆత్మమాయయా - నాయొక్క మాయచేతను, అధిష్ఠాయ - స్వాధీనము చేసికొని, సంభవామి - పుట్టినవానివలె నగుచున్నాను. 6

తా:-శ్రీకృష్ణభగవానులు సర్వజ్ఞుఁడగు నీశ్వరుడే యైనచో నజ్ఞుఁడగు నర్జునునివలె జన్మపరంపరయందుఁ జిక్కుకొనుట యేల యనుసందియము గల్గు. అట్టి సందియము నీగీతముచే వారించుచున్నారు. ఇందు మొదటిచరణముచే నిత్యసిద్ధేశ్వరలక్షణము వక్కాణింపఁబడుచున్నది. ఇట్టి నిత్యసిద్ధేశ్వరుఁడు లోకానుగ్రహముచేఁ దనయొక్క ప్రకృతి నధిష్ఠించి యవతరించుచుండును. ఈప్రకృతినే మాయాశక్తియని కోవిదులు వక్కాణించుచున్నారు. అట్టి యభిప్రాయమును వివరించుటకై రెండవచరణమునందుఁ బ్రకృతి మాయాశబ్దము లుచ్చరింపఁబడియున్నవి. "మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరమ్" అను శ్రుత్యర్థ మిందు వ్యక్తీకరింపఁబడుచున్నది. జీవుఁడుగూడ నీశ్వరునివలె పుట్టుకలేనివాఁడును నిర్వికారుఁడు నైనను సర్వభూతనియామకుఁడు గాఁడు. సర్వభూతనియామకత్వ మీశ్వరలక్షణము. ఆతీరుననే సర్వజ్ఞత్వమును. ప్రకృతియొక్క స్వరూపస్వభావము లేడవ యధ్యాయమున విపులముగా వివరింపఁబడియున్నవి. 6

---

కథం తర్హి నిత్యేశ్వరస్య తవ ధర్మాధర్మాభావేఽపి జన్మే త్యుచ్యతే అజోఽపీతి. అజోఽపి జన్మరహితోఽపిసన్ తథాఽవ్యయాత్మాఽక్షీణజ్ఞాన శక్తి స్వభావోఽపిసన్ తథా భూతానాం బ్రహ్మాదిస్తంబపర్యన్తానా మీశ్వర ఈశనశీలోఽపిసన్ ప్రకృతిం స్వాం మమవైష్ణవీం మాయాం త్రిగుణాత్మికాం, యస్యా వశే సర్వం జగ ద్వర్తతే యయా మోహితం సత్ స్వ మాత్మానం వాసుదేవం నజానాతి తాం ప్రకృతిం స్వా మధిష్ఠాయ వశీకృత్య సంభవామి దేహవా నివ భవామి, జాత ఇవాత్మమాయయాఽఽత్మనో మాయయా న పరమార్థతో లోకవత్. 6

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. 7
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 8

---

టీ:—భారత ! యదాయదా హి - ఎప్పు డెప్పుడైతే, ధర్మస్య - శ్రుతిస్మృతి సదాచార సిద్ధమగు వర్ణాశ్రమధర్మమునకు, గ్లానిః - నాశము, భవతి - కలుగునో, అధర్మస్య - ధర్మవిపరీతమగు వర్ణసంకరము యొక్క, అభ్యుత్థానం - పుట్టుక కలుగునో, తదా - అప్పుడు, ఆత్మానం - నన్ను, అహం - నేను, సృజామి - మాయచే సృజించుకొందును. అనగా నే నవతరించెద నని యభిప్రాయము. 7

టీ:—సాధూనాం - శ్రుతిస్మృతి సదాచార సిద్ధంబగు వర్ణాశ్రమ ధర్మతత్పరులయొక్క, పరిత్రాణాయ - సంరక్షణకొఱకును, దుష్కృతాం - ధర్మద్రోహులగు వర్ణసంకరకారకులయొక్క, వినాశాయ చ - నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ - వర్ణాశ్రమధర్మ సంస్థాపనము కొఱకును, యుగేయుగే - ప్రతియుగమందును అనగా నాయాయితరుణములయందు, సంభవామి- అవతరించుచుందును.

తా:—సర్వజ్ఞుండును సర్వభూత నియామకుండు నగు నిత్యసిద్ధేశ్వరుఁ డవతరించుటకుఁ గల కారణ మీ గీతములచే వివరింపఁబడుచున్నది. ధర్మమును విడనాడి కేవల మర్థకామములే ప్రధానముగాఁ గల్గి వ్యవహరించుట యాసురవృత్తి. అద్దానిచే నధర్మము గలుగు. సాధుపరిత్రాణము దుష్టశిక్షణము శ్రుతిస్మృతి సదాచారసిద్ధమగు ధర్మసంస్థాపనమును భగవదవతారకృత్యములు. పైమూఁడు కారణములచేతను భగవదవతారము లనుమేయములు. భగవంతుఁ డవతారకాలమున ధరించురూపము భగవన్మాయాకార్యమై భగవంతుని స్వేచ్ఛాయత్తమై యుండును. ప్రాణులయొక్క యుపాధులట్లు కర్మాయత్త మెంతమాత్రమును గావు. భగవంతుఁ డేతరుణమున నెట్టిరూపము నెంతలో ధరింపవలయునని తలంచునో

---

తచ్చ జన్మ కదా కిమర్థం చే త్యుచ్యతే - యదేతి, యదాయదాహి ధర్మస్య గ్లాని ర్హాని ర్వర్ణాశ్రమాదిలక్షణస్య ప్రాణినా మభ్యుదయనిశ్శ్రేయససాధనస్య భవతి భారత, అభ్యుత్థాన ముద్భవోఽధర్మస్య తదా తదాఽఽత్మానం సృజా మ్యహం మాయయా. 7

కిమర్థమ్ - పరిత్రాణాయేతి. పరిత్రాణాయ పరిరక్షణాయ సాధూనాం సన్మార్గస్థానాం వినాశాయచ దుష్కృతాం పాపకారిణాం, కించ ధర్మసంస్థాపనార్థాయ ధర్మస్య సమ్యక్ స్థాపనం తదర్థం సంభవామి యుగేయుగే ప్రతియుగమ్. 8

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున. 9

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. 10

---

నంతలో నాతని బ్రకృతి యటులఁ బరిణమించును. ఇట్టి భగవచ్ఛక్తితత్త్వమును గుర్తెఱింగినవారలకు మత్స్య కూర్మ వరాహ నారసింహాది యవతారముల యతిశయ మొక యచ్చెరువుగాఁ దోఁపదు. ఆతీరుననే యష్టాదశపురాణములందును దెలియవచ్చెడి యవతార విశేషములయొక్క యుపపత్తి ప్రాజ్ఞులకు సుకరముగా దెలియఁగలదు. 7-8

టీ:- మే - నాయొక్క, దివ్యం - ఈశ్వరసంబంధమగు, జన్మ - మాయారూపమగు పుట్టుకను, కర్మ చ-సాధుపరిత్రాణాదికమును, ఏవం - పైనచెప్పఁబడినతీరున, తత్త్వతః - యథార్థముగా, యః - ఎవఁడు, వేత్తి - తెలిసికొనుచున్నాఁడో, సః - వాఁడు, దేహం - ఈ దేహమును, త్యక్త్వా - విడిచి, పునః - తిరుగ, జన్మ - పుట్టుకను, న ఏతి - పొందఁడు, మాం - నన్ను, ఏతి - పొందును. అర్జున! అనగా ముక్తిఁ జెందు నని యాశయము.

తా:- జన్మకర్మలయొక్క తత్త్వ మన నీ రెండును మాయాకార్యము లను నిర్ణయము. 9

టీ:- వీతరాగభయక్రోధాః - పోయిన రాగభయక్రోధములు గలవారును, మన్మయాః - ఈశ్వరునితో నభేదభావమును దెలిసికొనినవారలును, మాం - పరమేశ్వరుఁడనగు నన్ను, ఉపాశ్రితాః - లెస్సగ నాశ్రయించినవారలు; అనగా జ్ఞాననిష్ఠులు. బహవః - అనేకులు, జ్ఞానతపసా - పరమాత్మజ్ఞాన మనెడి తపస్సుచేత,

---

తత్ - జన్మేతి. జన్మ మాయారూపం కర్మచ సాధుపరిత్రాణాది మే మమ దివ్య మప్రాకృత మైశ్వర్యమేవ యథోక్తం యో వేత్తి తత్త్వత స్తత్త్వేన యథావ త్త్యక్త్వా దేహ మిమం పునర్జన్మ పునరుత్పత్తిం నైతి న ప్రాప్నోతి. మా మేత్యాగచ్ఛతి స ముచ్యతే హేఽర్జున. 9

నైష మోక్షమార్గ ఇదానీం ప్రవృత్తః కిం తర్హి పూర్వ మపి - వీతరాగేతి. వీతరాగభయక్రోధా రాగశ్చ భయంచ క్రోధశ్చ వీతా విగతా యేభ్య స్తే వీతరాగభయక్రోధా మన్మయా బ్రహ్మవిద ఈశ్వరాభేదదర్శినో మామేవచ పరమేశ్వర ముపాశ్రితాః కేవలజ్ఞాననిష్ఠా ఇత్యర్థః. బహవోఽనేకే జ్ఞానతపసా జ్ఞాన

యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః. 11

---

పూతాః - ఉత్కృష్టమగు శుద్ధిని బడసి, మద్భావం - ఈశ్వరభావమగు మోక్షమును, ఆగతాః - లెస్సగాఁ బొందియున్నారు. 10

తా:— పై గీతమున "మామేతి" యనుదానికి వివరణము మద్భావ మనునది. దీనింబట్టి యీశ్వరభావాపత్తియే మోక్షమని వ్యక్తీకరింపఁబడుచున్నది. అట్టి మోక్షమును బొందుటకుఁ దగు సాధనములు, రాగభయక్రోధములు విడనాడుట, భగవదుపాసనము జ్ఞాన మనెడి తపస్సును. ఇచట "జ్ఞానతపసా" యనుటచే నితరతపో నిరపేక్ష మగు జ్ఞాననిష్ఠయే ముక్తి సాధనమనియు "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" యను శ్రుతియొక్క యర్థమే స్మరింపఁబడుచున్నది. ఇట్టి జ్ఞాననిష్ఠచే ననేకులు ముక్తిని బొందిరి యను నర్థవాదము జిజ్ఞాసువుల రుచికి నుపదేశింపఁబడుచున్నది.

టీ:— యే - ఎవరు, యథా - ఏరీతిగా నే ప్రయోజనముచే నన నే ఫలాభిలాషచే, మాం - నన్ను, ప్రపద్యన్తే - ఉపాసింతురో, తాన్ - వారలను, తథైవ - ఆఫలము నిచ్చుటచేతనే, అహం - నేను, భజామి - అనుగ్రహించుచున్నాను, పార్థ! మనుష్యాః - మనుజులు, అనగా నేఫలాభిలాషచే నేకర్మయం దధికారము గల్గి ప్రయత్నింతురో యట్టివారలు సర్వశః - అన్నివిధములచేతను, మమ - నాయొక్క, వర్త్మ - మార్గమును, అనువర్తన్తే - అనుసరించుచున్నారు.

తా:— మోక్షాభిలాషులకు మోక్షమును, ఫలాభిలాషులకు ఫలమును, తత్తదధికారానుగుణంబుగ నొసంగెదను. ఫలప్రదానమునకు వారివారి కర్మయు వారివారి యభినివేశములును గారణంబులు. దానంజేసి యీశ్వరుఁడును ఫలప్రదాతయు నగు నాయందు వైషమ్యనైర్ఘృణ్యాదిదోషప్రసక్తికి నవకాశ మెంతమాత్రమును లేదు. శ్రుతిస్మృత్యుదితాధికారముల ననుసరించి యేయే మనుజులే యేకర్మల నాచరింతురో వార లందరును నాయొక్కమార్గమునే యన శాసనమునే యనుసరించుచున్నా రని భగవదాశయము.

---

మేవచ పరమాత్మవిషయం తపః తేన జ్ఞానతపసా పూతాః పరాం శుద్ధిం గతాః సన్తః, మద్భావ మీశ్వరభావం మోక్ష మాగతా స్సమనుప్రాప్తాః ఇతరతపోనిరపేక్షజ్ఞాననిష్ఠా ఇత్యస్య లింగం జ్ఞానతపసేతి విశేషణమ్. 10

తవ తర్హి రాగద్వేషౌ స్తః, యేన కేభ్యశ్చిదే వాత్మభావం ప్రయచ్ఛసి న సర్వేభ్య ఇత్యుచ్యతే - యే యథేతి. యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ తత్ఫలదానేన భజా

కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా. 12

టీ:—కర్మణాం - కర్మలయొక్క, సిద్ధిం - ఫలమును, కాంక్షన్తః - కోరుచున్న వారలై, ఇహ - ఈలోకమునందు, దేవతాః - ఇంద్రాదిదేవతలఁ గూర్చి, యజన్తే - యాగములఁ జేయుదురు. మానుషే లోకే - మనుష్యలోకమునందు, కర్మజా - కర్మలవలన బుట్టెడి, సిద్ధిః - ఫలము, క్షిప్రం - శీఘ్రముగా, భవతి హి - లభించునుగదా!

తా:—ఎవ్వరే యే విధముల సేవించిన వారల కాయాయి ఫలముల ననుగ్రహించుచుండ నెల్లరును మోక్షమునే యభిలషింపకుండగాఁ జరించుటకుఁ గల కారణ మీ గీతముచే నుపదేశింపఁబడుచున్నది. ఫలాభిలాషచేతను ఫలానుభవాహ్లాదముచేతను గర్మఫలాయత్తహృదయు లగుటచే ముక్తికి దూరులై యందులకుఁ దగు జన్మలఁ బొందుచుందు రని తాత్పర్యము. 12

మ్యనుగృహ్ణా మ్యహ మిత్యేతత్; తేషాం మోక్షం ప్రత్యనర్థిత్వాత్ నహ్యేకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగపత్సంభవతి, అతో యేఫలార్థిన స్తాన్ ఫలప్రదానేన యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన యే జ్ఞానినః సంన్యాసినో ముముక్షవశ్చ తా న్మోక్షప్రదానేన తథాఽఽర్తానా ర్తిహరణే నేత్యేవం యథాప్రపద్యన్తే యే, తాం స్తథైవ భజామీత్యర్థః. నపునా రాగద్వేష నిమిత్తం మోహనిమిత్తంవా కంచిద్భజామి సర్వథాపి సర్వావస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గ మనువర్తన్తే మనుష్యాః, యత్ఫలార్థితయా యస్మిన్ కర్మణ్యధికృతా యే ప్రయతంతే తే మనుష్యా అత్రోచ్యన్తే హేపార్థ! సర్వశః సర్వప్రకారైః. 11

యది తవేశ్వరస్య రాగాదిదోషాభావా త్సర్వప్రాణి ష్వనుజిఘృక్షాయాం తుల్యాయాం సర్వఫలప్రదానసమర్థేచ త్వయి సతి "వాసుదేవః సర్వ" మితిజ్ఞానే నైవ ముముక్షవః సన్తః కస్మా త్త్వామేవ సర్వే న ప్రతిపద్యన్త ఇతి; శృణు తత్ర కారణమ్—కాంక్షన్త ఇతి. కాంక్షన్తోఽభీప్సంతః కర్మణాం సిద్ధిం ఫలనిష్పత్తిం ప్రార్థయంతో యజంత ఇహాస్మిన్లోకే దేవతా ఇంద్రాగ్న్యాద్యాః "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసావన్యోఽహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానామ్" (బృ. 1-4-10) ఇతిశ్రుతేః; తేషాం హి భిన్నదేవతాయాజినాం ఫలాకాంక్షిణాం క్షిప్రం శీఘ్రం హి యస్మా న్మానుషే లోకే మనుష్యలోకే హి శాస్త్రాధికారః, "క్షిప్రం హి మానుషే లోకే" ఇతివిశేషణా దన్యేష్వపి కర్మఫలసిద్ధిం దర్శయతి భగవాన్ మానుషే లోకే వర్ణాశ్రమాదికర్మాణీతి విశేషః, తేషాం చ వర్ణాశ్రమాద్యధికారికర్మణాం ఫలసిద్ధిః క్షిప్రం భవతి కర్మజా కర్మణో జాతా. 12

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. 13

టీ:—చాతుర్వర్ణ్యం - బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రు లను నాలుగు వర్ణములును, గుణకర్మవిభాగశః - గుణవిభాగముచేతను, కర్మవిభాగముచేతను, మయా - నాచేతను, సృష్టం - సృజింపఁబడినవి. అనగాఁ బుట్టింపఁబడినవి. తస్య - ఆచాతుర్వర్ణ్యముయొక్క, కర్తార మపి - కర్తనైనట్టి, మాం - నన్ను, అవ్యయం - నిర్వికార మగు, అకర్తారం - అసంసారియగు పరమాత్మగా, విద్ధి - తెలిసికొనుమా! 13

తా:—నాలుగు వర్ణములవారును వారివారి గుణకర్మల ననుసరించి యను వగు యోనులందుఁ బ్రవేశపెట్టుటచే నాయాయి యోనిభేదములయందు బ్రవేశపెట్టుట వలన వైషమ్యనైర్ఘృణ్యాదోషప్రసక్తి యెంతమాత్రము గలుగ దనుటకు హేతు వీగీతమున వ్యక్తీకరింపఁబడుచున్నది. గుణము లన సత్త్వరజస్తమస్సులు. కర్మ లన నాగుణముల కనువగు జన్మలును జేష్టలును. ఈచాతుర్వర్ణ్యవిభాగహేతు వగు గుణకర్మవిభాగమందలి సాంప్రదాయరహస్యము నిక్కాలమున దిఙ్మాత్రముగ బ్రదర్శింప నవసరమగుటంజేసి యయ్యది సంగ్రహముగ వివరింపఁబడును. శేషము గురుముఖైకవేద్యము. ఇచట గర్మయన "భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః" యను నెనిమిదవ యధ్యాయపు మూఁడవగీతమువలన గ్రహింపనగును. భూతభావము లనగా బ్రాణుల దేహములు. అట్టి దేహములయుత్పత్తికిఁ గారణభూతమగు విసర్గ మన శుక్లశోణితవిభాగవ్యవస్థ యని యర్థము. ప్రాణిదేహములయందలి భేదమునకు సత్త్వరజస్తమోగుణవిభాగమును, శుక్లశోణితవిభాగమును నిదాన మయ్యెడిని. ఇట్టి విభాగాతిశయమును దెలిసికొనుటకు దేహిదేహతత్త్వ మొకింత గమనింపవలయును. దేహికి వ్యవహారదశయందు స్థూల సూక్ష్మకారణంబులను మూడు దేహంబులు తెలియఁబడుచున్నవి. అందు సూక్ష్మకారణంబులు గుణవిభాగంబుచేతను స్థూలంబు కర్మవిభాగముచేతను బ్రవర్తిల్లుచున్నవి. సూక్ష్మకారణంబులందలి భేద మదృష్ట మగుటచే ననుమేయము; స్థూలశరీరభేద మన్ననో ప్రత్యక్షానుభవసిద్ధము. స్థూలశరీరము మాతాపితరులచే భుజింపఁబడిన యన్నరసవికారంబులగు లోహితశుక్లసంయోగముచేఁ గలుగుచున్నటుల నెల్లరకును దెలిసిన విషయమే. ఒకే

మానుషఏవ లోకే వర్ణాశ్రమాదికర్మాధికారో నాన్యేషు లోకేష్వితి నియమః కింనిమిత్త ఇతి, అథవా వర్ణాశ్రమాదిప్రవిభాగోపేతా మనుష్యా మమ వర్త్మానువర్తన్తే సర్వశ ఇత్యుక్తం, కస్మాత్పునః కారణాన్నియమేన తవైవ వర్త్మానువర్తన్తే నాన్యస్యేతి; ఉచ్యతే — చాతుర్వర్ణ్య మితి. చాతుర్వర్ణ్యం చత్వారఏవ

మాతాపితరులకు జనించు స్త్రీ పురుషులకుఁ దత్త్వమునందు భేదము లున్నట్టుల గుర్తెఱుంగుట సుకరమే. ఋతుకాలమునందు సమావేశము నందిన స్త్రీపురుషులయొక్క లోహిత శుక్లమిశ్రబిందువునందు శుక్లాధిక్యముచేఁ బురుషుఁడును లోహితాధిక్యముచే స్త్రీయును జనించునట్లు కోవిదులు తెలిసికొనియున్నారు. ఆ తీరుననే మిశ్రబిందువునందలి లోహితశుక్ల తారతమ్యముచేఁ బురుషులందుఁ గాని స్త్రీలయందుఁ గాని భేద ముండు ననుట యొక వింతగాదు. స్త్రీపుంజన్మలకుఁ గారణంబగు లోహితశుక్లమిశ్రబిందుభేదముచే జాతివ్యవస్థ గల్గుచున్నది. అ దెట్టు లనిన దేహోత్పత్తికిఁ గారణభూతంబగు లోహిత శుక్ల మిశ్రబిందువుయొక్క బరువు చాతుర్వర్ణ్యంబున దొమ్మిదిగాఁ దలంపఁబడుచున్నది. ఇట్టి మిశ్రబిందువులకు బరువుచే భేదము లేకపోయినను లోహిత శుక్ల వ్యత్యాసముచే నెనిమిది తెఱంగుల భేదము తెలియవచ్చెడిని. అ దెట్టులన—

81,72,63,54, 45,36,27,18. ఇట్టి యెనిమిదిబిందువులందును మొదటి నాల్గును బురుషబిందువులు, రెండవనాల్గును స్త్రీబిందువులు. అనగా బ్రాహ్మణపుంబిందువు 81- స్త్రీబిందువు 18, క్షత్త్రియపుంబిందువు 72, స్త్రీబిందువు 27. వైశ్యపుంబిందువు 63, స్త్రీబిందువు 36. శూద్రపుంబిందువు 54, స్త్రీబిందువు 45. ఇట్టి మిశ్రబిందువిభాగమునకుఁ గర్మవిభాగ మని పేరు. దీనికే విసర్గ మని పేరు. విసర్గయను దానికి (ః) రెండు బిందువుల సమాహారమని వాడుక, వర్ణసమామ్నాయమందలి బిందువిసర్గజ్ఞానమువలనఁ దెలియనగును. ఈ బిందు విసర్గలతత్త్వము గురుముఖైకవేద్యము. బిందువులు బాహ్యమున నొకేతీరున గన్పట్టినను వాస్తవముచే నొకబిందువు శుక్లమును రెండవబిందువు లోహితమును సూచించును. అట్టి శుక్ల లోహిత తారతమ్యముచే స్త్రీపుంజాతిభేదము చాతుర్వర్ణ్యభేదమును బరగుచున్నవి. ఋతుకాలమునందు సమావేశము చెందిన స్త్రీపురుషులయొక్క లోహితశుక్లమిశ్రముముచేఁ బుట్టిన స్థూలదేహము మరణపర్యన్త మొకేవిధమగు స్వభావమును గల్గియుండును. దానంజేసి యొకే జన్మయందు నొకజాతినుండి మఱియొకజాతికిఁ బరివర్తనముఁ జెందుటకు సావకాశ మెంతమాత్రము గలుగదు.

---

వర్ణా శ్చాతుర్వర్ణ్యం మయేశ్వరేణ సృష్ట ముత్పాదితం "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" (ఋ. 10-90-12) ఇత్యాదిశ్రుతేః గుణకర్మవిభాగశో గుణవిభాగశః కర్మవిభాగశశ్చ గుణా స్సత్త్వరజస్తమాంసి తత్ర సాత్త్వికస్య సత్త్వప్రధానస్య

పైన నుదాహరింపఁబడిన నాలుగువిధములగు పుంబిందువులకును బ్రత్యేక ప్రత్యేకముగా నాలుగువిధములగు స్త్రీబిందువులతో సంసర్గము గల్గుటచేఁ గలుగుమిశ్రబిందువుల స్వరూపమునఁబట్టి జాతివిభాగ మేర్పడుచున్నది. సవర్ణ స్త్రీపుంబిందుసంబంధముచే నుత్తమవర్ణము లగు బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యశూద్ర జాతులును, అసవర్ణస్త్రీపుంబిందుసంబంధముచే ననులోమవిలోమాది జాతులును బుట్టుచున్నవి. స్త్రీపుంబిందు సంబంధం బన స్త్రీపురుషుల సమావేశముచేఁ బుట్టు లోహిత శుక్లబిందు సంసర్గ మని యభిప్రాయము. ఉత్తమవర్ణములందును, ననులోమ విలోమ జాతులందును దెలియవచ్చెడి మిశ్రబిందువుల స్వరూపము లొకేతీరున నుండక బహుభంగుల నొప్పుచుండును. దానంజేసి మానవకోటి యందుఁ దెలియవచ్చెడి దేహములు కరచరణాద్యవయవములచే సామాన్యముగా నొకే తీరున గన్పట్టుచున్నను, దత్త్వమున గడు వైషమ్యమును గలిగి యుండును. అట్టి వైషమ్యముచేతనే మానవజాతియందలి శ్రుతిస్మృతిసదాచారసిద్ధం బగు జాతివిభాగము. దీని రహస్య మొకింత బ్రదర్శింపఁబడును.

బ్రాహ్మణపుంబిందువు 81, గదా. ఇయ్యది బ్రాహ్మణస్త్రీ బిందువు 18 తోఁ గూడినపుడు గల్గు మిశ్రబిందువులు రెండు విధము లగును:—

I (8-1) + (8-1) = (8-9-1) బ్రా.పుం
II (1-8) + (1-8) = (1-9-8) బ్రా.స్త్రీ

అటులనే క్షత్త్రియ స్త్రీ బిందువుతోఁ గూడినప్పుడు కూడ రెండు విధము లగును:—

I (8-1) + (7-2) = (8-8-2) క్ష.పుం
II (2-7) + (1-8) = (2-8-8) క్ష.స్త్రీ

అటులనే వైశ్యస్త్రీ బిందువుతోఁ గూడినప్పుడును రెండు విధము లగును-—

I (8-1) + (6-3) = (8-7-3) వై.పుం
II (3-6) + (1-8) = (3-7-8) వై.స్త్రీ

---

బ్రాహ్మణస్య "శమో దమ స్తపః" (గీ. 18-42) ఇత్యాదీని కర్మాణి; సత్త్వోపసర్జనరజఃప్రధానస్య క్షత్త్రియస్య శౌర్యతేజఃప్రభృతీని కర్మాణి, తమఉపసర్జనరజఃప్రధానస్య వైశ్యస్య కృష్యాదీని కర్మాణి, రజఉపసర్జనతమఃప్రధానస్య శూ

ఆ తీరుననే శూద్రస్త్రీబిందువుతోఁ గూడినపుడును రెండు విధములగును:—

I (8-1) + (5-4) = (8-6-4) శూ.పుం

II (4-5) + (1-8) = (4-6-8) శూ.స్త్రీ

ఇచ్చట మిశ్రబిందువు లెనిమిది విధములుగాఁ దెలియవచ్చుచున్నవి. ఇందు నాల్గు పుంబిందువులు, నాల్గు స్త్రీబిందువులును. అందు బ్రాహ్మణపుంబిందువుతో సమానమగునది యొకటి బ్రాహ్మణస్త్రీ బిందువుతో సమానమగునది మఱియొకటి. ఇవిరెండు నుత్తమవర్ణమగు బ్రాహ్మణజాతికిఁ జెందిన స్త్రీపురుష దేహతత్త్వ సూచకములు. శేషించిన నారుబిందువులలోను మూఁడుపుంబిందువులు, మూఁడు స్త్రీ బిందువులును. ఇయ్యవి యనులోమజాతికిఁ జెందిన కొన్ని దేహముల తత్త్వసూచకములు. ఈ తీరుననే యనులోమ విలోమ జాతులయొక్క మిశ్రబిందువుల తత్త్వ మంతయు బుష్కలముగా వ్యవస్థ సేయనగును. గ్రంథవిస్తరభీతిచే నావిశేష మంతయు నిచట విరమింపఁబడినది. ఇట్టి మిశ్రబిందు స్వరూపమునుబట్టియే మానవకోటి యందు ద్విజులు ద్విజసములు, శూద్రులు శూద్రసములు, అస్పృశ్యులు దస్యులు, అను విభాగమును మన్వాదులు బ్రదర్శించియున్నారు. మనుస్మృతియందలి పదవ యధ్యాయమును నీగీతాశాస్త్రమునందలి గుణత్రయ దైవాసుర సంపచ్ఛ్రద్ధా త్రయ విభాగయోగములతోఁ జేర్చి సమన్వయమును యోజించిన మానవకోటి యందలి వైచిత్ర్యతత్త్వము జిజ్ఞాసువులకు నిస్సందేహముగాఁ దేటతెల్ల మగు చున్నది. 13

దస్యు శుశ్రూషైవ కర్మేత్యేవం గుణకర్మవిభాగశ శ్చాతుర్వర్ణ్యం మయా సృష్ట మిత్యర్థః. తచ్చేదం చాతుర్వర్ణ్యం నాన్యేషు లోకేష్వతో మానుషే లోక ఇతివిశేషణమ్. హన్త తర్హి చాతుర్వర్ణ్యసర్గాదేః కర్మణః కర్తృత్వా త్తత్ఫలేన యుజ్యసే౽తో న త్వం నిత్య ముక్తో నిత్యేశ్వర శ్చేతి - ఉచ్యతే, యద్యపి మాయా సంవ్యవహారేణ తస్య కర్మణః కర్తార మపి సన్తం మాం పరమార్థతో౽కర్తారం, అతఏ వావ్యయ మసంసారిణం చ మాం విద్ధి. 13

న మాం కర్మాణి లింపన్తి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. 14

---

టీ:—మాం - నన్ను, కర్మాణి - కర్మలు, న లింపంతి - స్పృశింపనేఱవు, మే - నాకు, కర్మఫలే - కర్మఫలమందు, స్పృహా - ఇచ్ఛ, న - లేదు. ఇతి - ఈలాగున, మాం - నన్ను, యః - ఎవఁడు, అభిజానాతి - తెలిసికొనుచున్నాఁడో, సః - వాఁడు, కర్మభిః - కర్మలచేత, న బధ్యతే - కట్టఁబడఁడు. 14

తా:—చాతుర్వర్ణ్యసృష్టికిఁ దాను గర్తయైనప్పటికి గర్తృభావము తనకు లేకుండుటకు ఆసృష్టియను గర్మయొక్క ఫలము నందలి స్పృహ లేకపోవుటయే కారణ మని చెప్పఁబడుచున్నది. ఇంక నొక విశేషము గలదు. మహత్తరముగాఁ దోఁచు నీసృష్టికర్మఁ జేసినను నాకర్మలయొక్క గుణదోషములు శ్రీకృష్ణభగవానుల నంటనేర వని చెప్పఁబడుచున్నది. అందులకు గారణ మాతనియొక్క నిరంజన జ్ఞానస్వరూపమే. శ్రీకృష్ణభగవాను లిట్టి నిరంజనజ్ఞానస్వరూపుఁ డని దెలిసికొనిన వాఁడు కూడ గర్మలచేఁ బంధింపఁబడఁ డని చెప్పఁబడుచున్నది. ఎవ్వఁడైనను దన యొక్కస్వరూపము నిరంజనజ్ఞానస్వరూప మని తెలిసికొనినచో వాఁడు కర్మలచే బంధింపఁబడకుండవలయునుగాని శ్రీకృష్ణస్వరూపము దెలిసికొనినచో దనకు బ్రయోజన మెట్లు ఘటించును? తన స్వరూపమే శ్రీకృష్ణస్వరూప మైనచో ఘటింప వచ్చును. శ్రీకృష్ణస్వరూపజ్ఞానముచే బ్రతివానికి బంధము తొలఁగు నని చెప్పఁబడుటచేఁ బరమార్థమున బ్రతివాఁడును శ్రీకృష్ణుఁడే యైయుండవలయును. దానంజేసి యీగీతముచే జీవేశ్వరాభేద ముపదేశింపఁబడుచున్నట్లు తెలియునది.

---

యేషాంతు కర్మణాం కర్తారం మాం మన్యసే పరమార్థత స్తేషా మకర్తైవాహమ్, యతః? న మా మితి. న మాం తాని కర్మాణి లింపన్తి దేహాద్యారంభకత్వేనాహంకారాభావాత్; నచ తేషాంకర్మణాం ఫలేషు మే మమ స్పృహా తృష్ణా యేషాంతు సంసారిణా మహం కర్తే త్యభిమానః కర్మసు స్పృహా తత్ఫలేషు చ తాన్ కర్మాణి లింపంతీతి యుక్తం తదభావా న్న మాం కర్మాణి లింపంతీ త్యేవం యోఽన్యోఽపి మా మాత్మత్వే నాభిజానాతి నాహం కర్తా న మే కర్మ ఫలే స్పృహేతి న కర్మభి ర్న బధ్యతే; తస్యాపి న దేహాద్యారంభకాణి కర్మాణి భవంతీ త్యర్థః. 14

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. 15

కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 16

---

టీ:—ఏవం - ఈప్రకారము, జ్ఞాత్వా - తెలిసికొని, పూర్వైః - పూర్వకాలమం దుండు, ముముక్షుభిరపి - మోక్షకాములచేఁగూడ, కర్మ - కర్మ, కృతం - చేయబడి నది. తస్మాత్ - ఆకారణముచే, త్వం అపి - నీవుకూడ, కర్మ ఏవ - కర్మనే, కురు - చేయుము. పూర్వైః - పూర్వులగుజనకాదులచే, పూర్వతరం - తమకుఁబూర్వమం దాచరింపఁబడిన కర్మ, కృతం - చేయఁబడినది. అనగా నాధునికమగు కర్మ చేయఁబడలేదు. అనగా నీకుఁబూర్వులగు జనకాదులు వారలకుఁ బూర్వులగువార లాచరించినకర్మనే యాచరించిరి. ఆపూర్వు లన్ననో వారికిఁ బూర్వు లాచరించిన విధమున నాచరించిరి. ఇట్లు ప్రతిజనుఁడును దమకుఁబూర్వు లాచరించిన విధమున నాచరించుట న్యాయముగ నున్నది గావున నీకుఁ బూర్వులగు జనకాదులు కర్మల నాచరించిన విధముననే నీవుకూడ గర్మ నాచరింపుమని యభిప్రాయము. 15

టీ:—కర్మ కిం - కర్మయననేమి? అకర్మ కిం - అకర్మయననేమి?, ఇతి - అను, అత్ర - ఈవిషయమున, కవయః అపి - మేధావంతులుగూడ, మోహితాః - వ్యామోహమును జెందుచున్నారు. తత్ - ఆకారణముచే, తే - నీకొఱకు, కర్మ - కర్మను, అకర్మ - అకర్మను, కర్మాకర్మల విభాగముననని భావము, ప్రవక్ష్యామి - చెప్పఁగలను, యత్ - ఏకర్మాకర్మల విభాగమును, జ్ఞాత్వా - తెలిసికొని, శుభాత్ అశుభాత్ - శుభాశుభరూపమగు సంసారమునుండి, మోక్ష్యసే - విముక్తిని జెందఁ గలవు. 16

---

నాహం కర్తా న మే కర్మఫలేస్పృహేతి — ఏవ మితి. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరప్యతిక్రాంతైర్ముముక్షుభిః, కురు తేన కర్మైవ త్వం, న తూష్ణీమాసనం నాపి సంన్యాసః కర్తవ్యః; తస్మాత్త్వం పూర్వైరప్యనుష్ఠితత్వాత్ యద్యనాత్మజ్ఞస్త్వం తదాఽఽత్మశుద్ధ్యర్థం తత్త్వవిచ్చేల్లోకసంగ్రహార్థం పూర్వైర్జనకాదిభిః పూర్వతరం కృతం నాధునాతనం కృతం నిర్వర్తితమ్. 15

తత్ర కర్మచేత్కర్తవ్యం త్వద్వచనాదేవ కరోమ్యహం కింవిశేషితేన పూర్వైః పూర్వతరం కృతమితి; ఉచ్యతే - యస్మాన్మహద్వైషమ్యం కర్మణి కథమ్—కింకర్మేతి; కిం కర్మ కించాకర్మేతి కవయో మేధావినోఽప్యత్రాస్మిన్ కర్మాదివిషయే మోహితాః మోహంగతాః, తత్ అత స్తేతుభ్య మహం కర్మా

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. 17

కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. 18

---

టీ:—కర్మణః హి అపి - విహితకర్మనుగూర్చియు, బోద్ధవ్యం - తెలిసికొనవలయును. వికర్మణః చ - ప్రతిషిద్ధకర్మనుగూర్చియు, బోద్ధవ్యం - తెలియఁదగినది. అకర్మణః చ - తూష్ణీంభావమగు నైష్కర్మ్యమును గూర్చియు, బోద్ధవ్యం - తెలియదగినది. ఏలనన, కర్మణః - కర్మాకర్మ వికర్మలయొక్క, గతిః - తత్త్వము, గహనా - విషమమును దుర్జ్ఞేయమును. 17

తా:—శాస్త్రచోదితములగు విహితప్రతిషిద్ధ కర్మలఁగూర్చియు, నైష్కర్మ్యరూపమగు నకర్మనుగూర్చియు నిస్సందేహముగ దెలిసికొనవలయు నని యభిప్రాయము. 17

టీ:—కర్మణి - వ్యాపార మాత్రమందు, అకర్మ - కర్మాభావరూప మగు నాత్మను, యః - ఎవఁడు, పశ్యేత్ - తెలిసికొనునో, అకర్మణి - కర్మాభావరూప మగు తూష్ణీంభావమునందు, కర్మ - వ్యాపారమాత్రమును, (యః-ఎవఁడు, పశ్యేత్ - తెలిసికొనునో) సః - అట్టివాఁడు, మనుష్యేషు - మనుష్యులయందు, బుద్ధిమాన్ - ప్రాజ్ఞుఁడు, సః - వాఁడే, యుక్తః - యోగి, కృత్స్నకర్మకృత్ - సర్వకర్మలను నిర్వర్తించినవాఁడు. 18

---

కర్మచ ప్రవక్ష్యామి, యత్ జ్ఞాత్వా విదిత్వా కర్మాది మోక్ష్యసేశుభాత్సంసారాత్. 16

నచైత త్త్వయా మంతవ్యం-కర్మనామ దేహాదిచేష్టా లోకప్రసిద్ధం, అకర్మ నామ తదక్రియా తూష్ణీమాసనం, కిం తత్ర బోద్ధవ్యం ఇతి. కస్మాత్? ఉచ్యతే - కర్మణ ఇతి. కర్మణ శ్శాస్త్రవిహితస్య హి యస్మా దప్యస్తి బోద్ధవ్యం చాస్త్యేవ వికర్మణః ప్రతిషిద్ధస్య తథాఽకర్మణశ్చ తూష్ణీంభావస్య బోద్ధవ్య మస్తీతి త్రిష్వప్యధ్యాహారః కర్తవ్యః, యస్మా ద్గహనా విషమా దుర్జ్ఞేయా కర్మణ ఇత్యుపలక్షణార్థం కర్మాదీనాం కర్మాకర్మవికర్మణాం గతి ర్యాథాత్మ్యం తత్త్వ మిత్యర్థః. 17

కింపున స్తత్త్వం కర్మాదే ర్యద్బోద్ధవ్యం వక్ష్యామీతి ప్రతిజ్ఞాతమ్? ఉచ్యతే - కర్మణీతి. కర్మణి క్రియతఇతి కర్మ వ్యాపారమాత్రం, తస్మిన్, కర్మ

---

తా:-ఇచట కర్మయనగా నామరూపాత్మకమగు సకలప్రపంచము. అకర్మ యనఁగాఁ దద్భిన్నమును నిర్వికారమును నిరంజనమును జ్ఞానమాత్రమునునగు నాత్మ స్వరూపము. ఒకింత సూక్ష్మముగాఁ దెలిపిన నీకర్మశబ్దముచే దేహేంద్రియ మనో బుద్ధులు గ్రాహ్యము లగుచున్నవి. దానంజేసి కర్మశబ్దమునకు దేహేంద్రియ మనోబుద్ధులతోఁ గూడిన నామరూప ప్రపంచ మంతయును శాస్త్ర దృష్టిచే గ్రాహ్యము. ఇట్టి కర్మలయం దకర్మ యన జిన్మాత్రమును నిర్వికారమునగు

---

ణ్యకర్మ కర్మాభావం యః పశ్యేత్ అకర్మణిచ కర్మాభావే కర్తృతంత్రత్వా త్ప్రవృత్తినివృత్త్యోః వస్తుప్రాప్యైవహి సర్వఏవ క్రియాకారకాదివ్యవహారో౽ విద్యాభూమావేవ కర్మ యః పశ్యేత్ పశ్యతి, స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తో యోగీచ కృత్స్నకర్మకృ త్సమస్తకర్మకృచ్చ స ఇతి స్తూయతే కర్మాకర్మణో రితరేతరదర్శీ.

నను కిమిదం విరుద్ధ ముచ్యతే కర్మ ణ్యకర్మ యః పశ్యేదితి, అకర్మణిచ కర్మేతి. నహి కర్మాకర్మ స్యా దకర్మవాకర్మ తత్ర విరుద్ధం కథం పశ్యేత్ ద్రష్టా? న అకర్మైవ పరమార్థత స్సత్కర్మవ దవభాసతే మూఢదృష్టే ర్లోకస్య, తథా కర్మైవాకర్మవత్, తత్రయథాభూతదర్శనార్థ మాహ భగవాన్ "కర్మణ్యకర్మ యః పశ్యేది"త్యాది. అతో న విరుద్ధమ్ బుద్ధిమత్త్వాద్యుపపత్తేశ్చ "బోద్ధవ్యం" (గీ. 4-17.) ఇతిచ యథా భూతదర్శన ముచ్యతే, నచ విపరీతజ్ఞానా దశుభా న్మోక్షణం స్యాత్ "యత్ జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్" (గీ. 4-16) ఇతి చోక్తమ్; తస్మా త్కర్మాకర్మణీ విపర్యయేణ గృహీతే ప్రాణిభి స్తద్విపర్యయగ్రహ ణనివృత్త్యర్థం భగవతో వచనం "కర్మ ణ్యకర్మ యః"ఇత్యాది; నచాత్రకర్మాధి కరణ మకర్మాస్తి కుండే బదరాణీవ నాప్యకర్మాధికరణం కర్మాస్తి కర్మాభావత్వా దకర్మణః; అతో విపరీతగృహీతే ఏవ కర్మాకర్మణీ లౌకికైః యథా మృగతృష్ణి కాయా ముదకం శుక్తికాయాం వా రజతమ్.

నను కర్మైవ సర్వేషాం న క్వచి ద్వ్యభిచరతి, తన్న, నౌస్థస్య నావి గచ్ఛన్త్యాం తటస్థే ష్వగతిషు నగేషు ప్రతికూలగతిదర్శనాత్ దూరేషు చక్షుషా౽ సన్నికృష్టేషు గచ్ఛత్సు గత్యభావదర్శనాత్, ఏవ మిహా ప్యకర్మణి కర్మదర్శనం కర్మణి చాకర్మదర్శనం విపరీతదర్శనం యేన తన్నిరాకరణార్థ ముచ్యతే కర్మ ణ్యకర్మ యః పశ్యే దిత్యాది.

నాత్మను దెలిసికొనుట; అనగా నీకర్మ యకర్మ నధిష్ఠానముగాఁ గల్గి, రజ్జుసర్పాదు లట్లు బయలువెడలినట్టి వాచారంభణమాత్రిమనియు మిథ్యారూప మనియు గ్రహించుటయే. ఇఁక నకర్మయందుఁ గర్మఁ దెలిసికొనుట యన నకర్మ యన నిర్వ్యాపారము. నిర్వ్యాపార మనునదిగూడ వ్యాపారమట్లు మనస్సుయొక్క యవస్థావిశేష మే. ఒకానొకఁడు మనస్సుచే యోజనచేయుచు వ్యవహరించుచున్నానని తలంచును. యోజన చేయక యుండినప్పుడు తా నేమియుఁ జేయక యూరకుంటి నని తలంచును. దేహేం

---

తదేత దుక్తప్రతివచన మప్యసకృ దత్యన్తవిపరీతదర్శనభావితతయా మోముహ్యమానో లోకః శ్రుతమ ప్యసకృ త్తత్త్వం విస్మృత్యవిస్మృత్య మిథ్యాప్రసంగ మవతార్యావతార్య చోదయతీతి పునఃపున రుత్తర మాహ భగవాన్ దుర్విజ్ఞేయత్వం చాలక్ష్య వస్తునః "అవ్యక్తోఽయ మచింత్యోఽయం"(గీ.2-25)"న జాయతే మ్రియతే "(గీ.2-20) ఇత్యాదినాఽఽత్మని కర్మాభావః శ్రుతిస్మృతి న్యాయప్రసిద్ధ ఉక్తో వక్ష్యమాణశ్చ, తస్మి న్నాత్మని కర్మాభావేఽకర్మణి కర్మ విపరీతదర్శన మత్యంతనిరూఢమ్ యతః "కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః" (గీ.4-16) దేహాద్యాశ్రియం కర్మాత్మ న్యధ్యారోప్యాహం కర్తా "మమైత త్కర్మ", "మయాఽస్య కర్మణః ఫలం భోక్తవ్య మి"తిచ; తథా "అహం తూష్ణీం భవామి" యేనాహం నిరాయాసోఽకర్మా సుఖీ స్యామితి కార్య కరణాశ్రియం వ్యాపారోపరమం తత్కృతంచ సుఖత్వ మాత్మ న్యధ్యారోప్య "న కరోమి కించి త్తూష్ణీం సుఖ మాసే" ఇత్యభిమన్యతే లోకః; తత్రేదం లోకస్య విపరీతదర్శనాపనయాయాహ భగవాన్ "కర్మ ణ్యకర్మ యః పశ్యే" దిత్యాది.

అత్రచ కర్మ కర్మైవ సత్కార్యకరణాశ్రియం కర్మరహితేఽవిక్రియ ఆత్మని సర్వై రధ్యస్తయతః పండితోఽప్యహం కరోమీతి మన్యతే; అత ఆత్మ సమవేతతయా సర్వలోకప్రసిద్ధే కర్మణి నదీకూలస్థేష్వివ వృక్షేషు గతిప్రాతిలో మ్యేన, అకర్మ కర్మాభావం యథాభూతం గత్యభావమివ వృక్షేషు యః పశ్యే దక ర్మణిచ కార్యకరణవ్యాపారోపరమే కర్మవ దాత్మ న్యధ్యారోపితే "తూష్ణీ మకు ర్వన్ సుఖ మాసే" ఇత్యహంకారాభిసంధిహేతుత్వా త్తస్మి న్నకర్మణిచ కర్మ యః పశ్యేత్ ; య ఏవం కర్మాకర్మవిభాగజ్ఞః స బుద్ధిమాన్ పండితో మనుష్యేషు స యుక్తో యోగీ కృత్స్నకర్మకృచ్చ సోఽశుభా న్మోక్షితః; కృతకృత్యో భవ తీత్యర్థః.

ద్రియమనోబుద్ధులు చలించినఁ జలించినట్లు, చలింపకుండిన నిశ్చలముగ నుండినట్లును దలంచును. దేహేంద్రియ మనోబుద్ధులయొక్క నిశ్చలన మాత్మయొక్క నిర్వికార నిశ్చలనస్వరూప మెంతమాత్రము గాదు. అదియును నాత్మస్వరూపదృష్టిచేఁ జలన రూప మగుకర్మయే. ఇట్లు దేహేంద్రియ మనోబుద్ధులయొక్క. నిశ్చలరూప మగు నకర్మను స్వస్వరూపవ్యతిరిక్త మగు కర్మగాఁ దెలిసికొనుటయే యకర్మయందుఁ గర్మఁ దెలిసికొనుట. అనఁగాఁ దాను నిశ్చలముగ నున్నాననుకొనుటయుఁ జలించుచున్నా

అయం శ్లోకోఽన్యథా వ్యాఖ్యాతః కైశ్చిత్. కథం? నిత్యానాంకిల కర్మణా మీశ్వరార్థే ఽనుష్ఠీయమానానాం తత్ఫలాభావా దకర్మాణి తాన్యుచ్యన్తే గౌణ్యా వృత్త్యా; తేషాం చాకరణ మకర్మ, తచ్చప్రత్యవాయఫలత్వా త్కర్మోచ్యతే గౌణ్యైవ వృత్త్యా; తత్ర నిత్యే కర్మ ణ్యకర్మ యః పశ్యే త్ఫలాభావాత్, యథా ధేనురపి గౌః అగౌ రిత్యుచ్యతే క్షీరాఖ్యం ఫలం న ప్రయచ్ఛతీతి తద్వత్; తథా నిత్యాకరణే త్వకర్మణిచ కర్మ యః పశ్యే న్నరకాదిప్రత్యవాయఫలం ప్రయచ్ఛతీతి - నైత ద్యుక్తం వ్యాఖ్యానమ్, ఏవం జ్ఞానా దశుభా న్మోక్షానుపపత్తేః "యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్" (గీ. 4.16) ఇతి భగవతోక్తం వచనం బాధ్యేత: కథం నిత్యానా మనుష్ఠానా దశుభా త్స్యాన్నామ మోక్షణం, నతు తేషాం ఫలాభావజ్ఞానాత్; నహి నిత్యానాం ఫలాభావజ్ఞాన మశుభ ముక్తిఫలత్వేన చోదితం, నిత్యకర్మజ్ఞానం వా నహి భగవతైవేహోక్తమ్, ఏతేనాకర్మణి కర్మదర్శనం ప్రత్యుక్తమ్, నహ్యకర్మణి కర్మేతి దర్శనం కర్తవ్యతయేహ చోద్యతే నిత్యస్యతు కర్తవ్యతామాత్రమ్, నచాకరణా న్నిత్యస్య ప్రత్యవాయో భవతీతివిజ్ఞానా త్కించి త్ఫలం స్యాత్, నాపి నిత్యాకరణం జ్ఞేయత్వేన చోదితమ్, నాపి కర్మాకర్మేతిమిథ్యాదర్శనా దశుభా న్మోక్షణం బుద్ధిమత్త్వం యుక్తతా కృత్స్నకర్మకృత్త్వాదిచ ఫల ముపపద్యతే స్తుతిర్వా, మిథ్యాజ్ఞాన మేవహి సాక్షా దశుభరూపమ్ కుతోఽన్యస్మా దశుభా న్మోక్షణం; నహి తమ స్తమసో నివర్తకం భవతి.

నను కర్మణి యదకర్మదర్శన మకర్మణివా కర్మదర్శనం న తన్మిథ్యాజ్ఞానం కింతర్హి గౌణఫలభావాభావనిమిత్తం, న, కర్మాకర్మవిజ్ఞానాదపి గౌణా త్ఫలస్యాశ్రవణాత్, నాపి శ్రుతహాన్యశ్రుతపరికల్పనాయాం కశ్చిద్విశేష ఉపలభ్యతే, స్వ శబ్దేనాపి శక్యం వక్తుం నిత్యకర్మణాం ఫలం నాస్త్యకరణాచ్చ తేషాం నరకపాతః స్యా దితి; తత్ర వ్యాజేన పరవ్యామోహరూపేణ కర్మ ణ్యకర్మ యః పశ్యేదిత్యా

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః. 19

ననుకొనుటయు నీరెండును నజ్ఞానవిలసితములే యని గ్రహించుట యకర్మయందుఁ గర్మను గ్రహించుననుట. ఇట్లాత్మయొక్క స్వరూపమును, దద్భిన్నమగు దేహేంద్రియ మనోబుద్ధ్యాది ప్రపంచముయొక్క మిథ్యాత్వమును దెలిసికొనిన విద్వాంసుఁడే బుద్ధిమంతుఁడుగను మనుష్యులలో లౌకికదృష్టిచేఁ బ్రజ్ఞాధురంధరుఁడుగాను, గార్మిక దృష్టిచేఁ గృతకృత్యుండుగను, శాస్త్రదృష్టిచే యోగిరాట్టుగను నగ్రస్థానము వహించునని భావము. ఈగీతము "యా నిశా సర్వభూతానాం" (గీ. 2-69) అను గీతముయొక్క వివరణముగాఁ దెలియునది. 18

టీ:- యస్య - ఎవనికి ననఁగా నేకర్మాకర్మవిభాగదర్శికి, సర్వే - సమస్తములగు, సమారంభాః - కర్మలు, కామసంకల్పవర్జితాః - ఫలాభిసంధివర్జితము

దినా, కిమ్ తత్రైవం వ్యాచక్షాణేన భగవతోక్తం వాక్యం లోకవ్యామోహార్థమితి వ్యక్తం కల్పితం స్యాత్, నచైత చ్ఛద్మరూపేణ వాక్యేన రక్షణీయం వస్తు, నాపి శబ్దాన్తరేణ పునఃపున రుచ్యమానం సుబోధం స్యా దిత్యేవం వక్తుం యుక్తమ్; "కర్మ ణ్యేవాధికార స్తే" (గీ. 2-47) ఇత్యత్రహి స్ఫుటతర ఉక్తోఽర్థో నపున ర్వక్తవ్యో భవతి; సర్వత్రచ ప్రశస్తం బోద్ధవ్యంచ కర్తవ్య మేవ; న నిష్ప్రయోజనం బోద్ధవ్య మిత్యుచ్యతే.

నచ మిథ్యాజ్ఞానం బోద్ధవ్యం భవతి, తత్ప్రత్యుపస్థాపితంవా వస్త్వాభాసమ్ నాపి నిత్యానా మకరణా దభావా త్ప్రత్యవాయభావోత్పత్తిః "నాసతో విద్యతే భావః" (గీ. 2-16) ఇతివచనా త్కథం "అసత స్స జ్జాయేత" (ఛాం. 6 - 2 - 2) ఇతిచ దర్శితం, అసత స్సజ్జన్మప్రతిషేధాత్ అసత స్సదుత్పత్తిం బ్రువతాఽసదేవ సద్భవే త్సచ్చా ప్యస ద్భవే దిత్యుక్తం స్యాత్; తచ్చాయుక్తం సర్వప్రమాణ విరోధాత్; నచ నిష్ఫలం విదధ్యా చ్ఛాస్త్రం దుఃఖస్వరూపత్వా ద్దుఃఖస్యచ బుద్ధిపూర్వకతయా కార్యత్వానుపపత్తేః తదకరణేచ నరకపాతాభ్యుపగమా దన ర్థాయైవోభయథాఽపి కరణేఽకరణేచ శాస్త్రం నిష్ఫలం కల్పితం స్యాత్, స్వాభ్యు పగమవిరోధశ్చ నిత్యం నిష్ఫలం కర్మేత్యభ్యుపగమ్య మోక్షఫలాయేతి బ్రువతః; తస్మా ద్యథాశ్రుతఏవార్థః కర్మ ణ్యకర్మ య ఇత్యాదేః, తథాచ వ్యాఖ్యాతోఽ స్మాభిః శ్లోకః. 18

తదేతత్కర్మ ణ్యకర్మాదిదర్శనం స్తూయతే - యస్యేతి. యస్య యథోక్త దర్శినః సర్వే యావన్త స్సమారంభాః కర్మాణి, సమారభ్యన్త ఇతిసమారంభాః కామసంకల్పవర్జితాః కామై స్తత్కారణై స్సంకల్పైశ్చ వర్జితాః ముధైవచేష్టా

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తో ఽపి నైవ కించి త్కరోతి సః. 20

---

లగునో, తం - అట్టి, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం - జ్ఞానమనెడి యగ్నిచేఁ బ్రమాతృత్వ కర్తృత్వభోక్తృత్వములు నశించినవానిని, బుధాః - విద్వాంసులు, పండితం - పారమార్థికదృష్టిచేఁ బండితునిగా, ఆహుః - చెప్పుచున్నారు. 19

టీ:—కర్మఫలాసంగం - కర్మఫలలిప్సను, త్యక్త్వా - విడిచి, నిత్యతృప్తః - విషయతృష్ణ లేనట్టియు, నిరాశ్రయః - దృష్టాదృష్ట ఫలసాధనముల నపేక్షింప నియు విద్వాంసుఁడు, కర్మణి - లోకసంగ్రహరూప మగుకర్మయందు, అభిప్రవృత్తః అపి - పుష్కలముగఁ బ్రవర్తించినను, సః - అట్టి నిష్క్రియాత్మదర్శి, కించిత్ - కొంచెమైన ననఁగా నేమాత్రపు గర్మనైనను, న కరోతి ఏవ - చేయని వాఁడే. 20

---

మాత్రా అనుష్ఠీయన్తే ప్రవృత్తేనచే ల్లోకసంగ్రహార్థం నివృత్తేన చే జ్జీవనమాత్రార్థం తం జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం కర్మాదా వకర్మాదిదర్శనం జ్ఞానం తదేవాగ్ని స్తేన జ్ఞానాగ్నినా దగ్ధాని శుభాశుభలక్షణాని కర్మాణి యస్య త మాహుః పరమార్థతః పండితం బుధా బ్రహ్మవిదః. 19

య స్త్వకర్మాదిదర్శీ సోఽకర్మాదిదర్శనా దేవ నిష్కర్మా సంన్యాసీ జీవనమాత్రార్థచేష్టః స న్కర్మాణి నప్రవర్తతే, యద్యపి ప్రాగ్వివేకతః ప్రవృత్తః యస్తు ప్రారబ్ధకర్మాస న్నుత్తరకాల ముత్పన్నాత్మసమ్య గ్దర్శనః స్యా త్స సర్వకర్మణి ప్రయోజన మపశ్య న్ససాధనం కర్మ పరిత్యజత్యేవ; స కుతశ్చి న్నిమిత్తాత్కర్మపరిత్యాగాసంభవేసతి కర్మణి తత్ఫలేచ సంగరహితతయా స్వప్రయోజనాభావా ల్లోకసంగ్రహార్థం పూర్వవత్కర్మణి ప్రవృత్తోఽపి నైవకించి త్కరోతి, జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వా త్తదీయం కర్మాకర్మైవ సంపద్య తే ఇత్యేతమర్థం దర్శయిష్య న్నాహ - త్యక్త్వేతి. త్యక్త్వా కర్మ స్వభిమానం ఫలాసంగంచ యథోక్తేన జ్ఞానేన నిత్యతృప్తో నిరాకాంక్షో, విషయేష్వి త్యర్థః నిరాశ్రయ ఆశ్రయరహితః, ఆశ్రయో నామ యదాశ్రిత్య పురుషార్థం సిసాధయిషతి దృష్టాదృష్టఫలసాధనాశ్రయరహిత ఇత్యర్థః, విదుషా క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మైవ తస్య నిష్క్రియాత్మదర్శనసంపన్నత్వాత్; తేనైవంభూతేన ప్రయోజనాభావా త్ససాధనం కర్మ పరిత్యక్తవ్య మేవేతిప్రాప్తే తతో నిర్గమాసంభవా ల్లోకసంగ్రహచికీర్షయా శిష్టవిగర్హణాపరిజిహీర్షయా పూర్వవ త్కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నిష్క్రియాత్మదర్శనసంపన్నత్వా న్నైవ కించి త్కరోతి సః. 20

నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్. 21

---

టీ:—నిరాశీః - సమస్తములగు కోరికలు తొలఁగినట్టియు, త్యక్త సర్వ పరిగ్రహః - సకలపరిగ్రహముల విడిచిపెట్టినట్టియు నన నేషణత్రయమును విడచి సర్వ కర్మ సంన్యాసమును గావించినట్టియు, యతచిత్తాత్మా - అంతఃకరణమగు మనస్సును బాహ్యమగు దేహేంద్రియసంఘాతమును నియమించినట్టి సంన్యాసి, కేవలం - కేవలము, శారీరం - శారీరస్థితి కనువగు, కర్మ - భిక్షాస్వీకారాదిరూపమగు కర్మను,

---

యః పునః పూర్వోక్తవిపరీతః ప్రాగేవ కర్మారంభా ద్బ్రహ్మణి సర్వాంతరే ప్రత్యగాత్మని నిష్క్రియే సంజాతాత్మదర్శనః స దృష్టాదృష్టేష్టవిషయాశీర్వివర్జితతయా దృష్టాదృష్టార్థే కర్మణి ప్రయోజన మపశ్యన్ ససాధనం కర్మ సంన్యస్య శరీరయాత్రామాత్రచేష్టః యతి ర్జ్ఞాననిష్ఠో ముచ్యతే ఇత్యేతమర్థం దర్శయితు మాహ నిరాశీరితి. నిరాశీ ర్నిర్గతా ఆశిషో యస్మాత్స నిరాశీః, యతచిత్తాత్మా చిత్త మంతఃకరణ మాత్మా బాహ్యః కార్యకరణసంఘాత స్తావుభావపి యతౌ సంయతౌ యేన స యతచిత్తాత్మా, త్యక్తసర్వపరిగ్రహ స్త్యక్త స్సర్వః పరిగ్రహో యేన స త్యక్తసర్వపరిగ్రహః, శారీరం శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలం తత్రాప్యభిమానవర్జితం కర్మ కుర్వ న్నాప్నోతి న ప్రాప్నోతి కిల్బిష మనిష్టరూపం పాపం ధర్మంచ ధర్మోఽపి ముముక్షోః కిల్బిష మేవ, బంధాపాదకత్వాత్; తస్మా త్తాభ్యాం ముక్తో భవతి, సంసారా న్ముక్తో భవతీత్యర్థః.

కించ శారీరం కేవలం కర్మేత్యత్ర కింశరీరనిర్వర్త్యం శారీరం కర్మాభిప్రేత మాహోస్విచ్ఛరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మేతి, కించాతో యదిశరీరనిర్వర్త్యం శారీరం కర్మ యదివా శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరమితి; ఉచ్యతే - యదా శరీరనిర్వర్త్యం కర్మ శారీర మభిప్రేతం స్యా త్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ ప్రతిషిద్ధమపి శరీరేణ కుర్వ న్నాప్నోతి కిల్బిష మితి బ్రువతో విరుద్ధాభిధానం ప్రసజ్యేత, శాస్త్రీయంచ కర్మ దృష్టాదృష్టప్రయోజనం శరీరేణ కుర్వ న్నాప్నోతి కిల్బిష మిత్యపి బ్రువతోఽప్రాప్తప్రతిషేధప్రసంగః; శారీరం కర్మ కుర్వ న్నితివిశేషణా త్కేవలశబ్దప్రయోగాచ్చ వాఙ్మనసనిర్వర్త్యం కర్మ విధిప్రతిషేధవిషయం ధర్మాధర్మశబ్దవాచ్యం కుర్వన్ ప్రాప్నోతి కిల్బిష మిత్యుక్తం స్యాత్; తత్రాపి వాఙ్మనసాభ్యాం విహితానుష్ఠానపక్షే కిల్బిషప్రాప్తివచనం విరుద్ధ మాపద్యేత ప్రతిషిద్ధసేవాపక్షేఽపి భూతార్థానువాదమాత్ర మనర్థకం స్యాత్; యదాతు శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మాభిప్రేతం భవే త్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ విధిప్రతిషేధగమ్యం శరీరవాఙ్మనస

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే. 22

---

కుర్వన్ - చేయుచున్నప్పటికి, కిల్బిషమ్ - పాపమును, న ఆప్నోతి - పొందఁడు అనఁగా ననుచితకార్యములఁ జేసినవాఁడు కాఁడు. 21

టీ:—యదృచ్ఛాలాభసంతుష్టః - తాను గోరకుండగను ప్రియత్నము చేయకుండగను లభించిన యన్నవసనాదులచే సంతుష్టిఁ జెందునట్టియు, ద్వంద్వాతీతః - శీతోష్ణాదిద్వంద్వముల కతీతుఁడును, (అనఁగా నవ్వానిని సహించుటచే విషాదముఁ జెందనివాఁడును అని), విమత్సరః - నిర్వైరస్వభావముగలవాఁడును, సిద్ధౌ - యదృచ్ఛాలాభసిద్ధియందును, అసిద్ధౌచ - సిద్ధింపకుండుటయందును, సమః - సమభావమును గల్గినట్టి, యనగా హర్షవిషాదరహితుఁడైన సంన్యాసి, కృత్వాఽపి - భిక్షాటనాదికర్మలఁ జేసినప్పటికి, న నిబధ్యతే - ఎంతమాత్రము గర్మబద్ధుఁడు కానేరఁడు. 22

---

నిర్వర్త్య మన్య దకుర్వం స్తై రేవ శరీరాదిభి శ్శరీరస్థితి మాత్రప్రయోజనం కేవల శబ్దప్రయోగా దహంకరోమీత్యభిమానవర్జితః శరీరాదిచేష్టామాత్రం లోకదృష్ట్యా కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్; ఏవంభూతస్య పాపశబ్దవాచ్యకిల్బిషప్రాప్త్యసంభవాత్కిల్బిషం సంసారం నాప్నోతి జ్ఞానాగ్నిదగ్ధసర్వకర్మత్వా దప్రతిబంధేన ముచ్యత ఏవేతి పూర్వోక్తసమ్యగ్దర్శనఫలానువాద ఏవైషః; ఏవం శారీరం కేవలం కర్మ ఇత్యస్యార్థస్య పరిగ్రహే నిరవద్యం భవతి. 21

త్యక్తసర్వపరిగ్రహస్య యతే రన్నాదేః శరీరస్థితిహేతోః పరిగ్రహస్యాభావా ద్యాచనాదినా శరీరస్థితౌ కర్తవ్యతాయాం ప్రాప్తాయాం "అయాచిత మసంక్లృప్త ముపపన్నం యదృచ్ఛయా" (బౌ. 21-8-12) ఇత్యాదినా వచనేనానుజ్ఞాతం యతే శ్శరీరస్థితిహేతో రన్నాదేః ప్రాప్తిద్వార మావిష్కుర్వ న్నాహ - యదృచ్ఛేతి. యదృచ్ఛాలాభసంతుష్టోఽప్రార్థితోపనతో లాభో యదృచ్ఛాలాభ స్తేన సంతుష్ట స్సంజాతాలంప్రత్యయః ద్వంద్వాతీతో ద్వంద్వైః శీతోష్ణాదిభి ర్హన్యమానోఽప్యవిషణ్ణచిత్తో ద్వంద్వాతీత ఉచ్యతే. విమత్సరో విగతమత్సరో నిర్వైరబుద్ధిః సమ స్తుల్యః యదృచ్ఛాలాభస్య సిద్ధావసిద్ధౌచ, య ఏవంభూతో యతి రన్నాదేః శరీరస్థితిహేతో ర్లాభాలాభయో స్సమో హర్షవిషాదవర్జితః కర్మాదావకర్మాదిదర్శీ యథాభూతాత్మదర్శననిష్ఠస్సన్ శరీరస్థితిమాత్రప్రయోజనే భిక్షాటనాదికర్మణి శరీరాదినిర్వర్త్యే "నైవ కించి త్కరోమ్యహం" (గీ. 5-8). "గుణా గుణేషు వర్తన్తే" (గీ. 3-28.) ఇత్యేవం సదా సంపరిచక్షాణ ఆత్మనః కర్తృత్వాభావం పశ్యన్నైవ కించిద్భిక్షాటనాదికం కర్మ కరోతి; లోకవ్యవహారసామాన్యదర్శ

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే. 23

---

టీ:—గతసంగస్య - విషయాభిలాష నశించినట్టియు, జ్ఞానావస్థితచేతసః - జ్ఞాననిష్ఠయందుఁ బుష్కలముగ లగ్నమయిన నంతఃకరణ గలిగినట్టియు, యజ్ఞాయ - ఈశ్వరార్పణబుద్ధితో లోకసంగ్రహమునకై చేయు, ఆచరతః - ఆచరించునట్టి, ముక్తస్య - బ్రహ్మవేత్తయగు సన్న్యాసియొక్క, కర్మ - కర్మ, సమగ్రం - పుష్కలముగా ననఁగా ఫలముతోఁగూడ, ప్రవిలీయతే - నశించుచున్నది. అనఁగా నేమాత్రము బంధహేతువు గానేరదు. 23

తా:—"యస్య సర్వే సమారంభాః" అను గీతము మొదలు "గతసంగస్య ముక్తస్య" అను గీతమువఱకుఁ గల యైదుగీతములచే స్థితప్రజ్ఞుఁడును బ్రహ్మవిదుడు నగుసంన్యాసియొక్క స్వరూపస్వభావప్రవృత్తులు సంక్షేపంబుగా నుపదేశింపఁబడినవి. ఇయ్యవి రెండవయధ్యాయమందలి స్థితప్రజ్ఞస్వరూపబోధకగీతములతోఁ జేర్చి యోజించిన స్థితప్రజ్ఞ విశేషలక్షణముఁ దెలిసికొనుటకు విశేషముగ నవకాశము గలుగును. 19-23

---

నేనతు లౌకికై రారోపితకర్తృత్వే భిక్షాటనాదౌ కర్మణి కర్తా భవతి స్వానుభవేనతు శాస్త్రప్రమాణాదిజనితేన అకర్తైవ; స ఏవం పరాధ్యారోపితకర్తృత్వం శరీరస్థితిమాత్రప్రయోజనం భిక్షాటనాదికం కర్మ కృత్వాపి న నిబధ్యతే. బంధహేతోః కర్మణః సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వా దిత్యుక్తానువాదఏవైషః. 22

"త్యక్త్వా కర్మఫలాసంగం" (గీ. 4-20.) ఇత్యనేన శ్లోకేన యః ప్రారబ్ధకర్మాసన్ యదా నిష్క్రియబ్రహ్మాత్మదర్శనసంపన్నః స్యా త్తదా తస్యాత్మనః కర్తృకర్మప్రయోజనాభావదర్శినః కర్మపరిత్యాగే ప్రాప్తే కుతశ్చి న్నిమిత్తా త్తదసంభవే సతి పూర్వవ త్తస్మి న్కర్మణ్యభిప్రవృత్తోఽపి "నైవ కించి త్కరోతి సః" (గీ. 4-20) ఇతి కర్మాభావః ప్రదర్శితః. యస్యైవం కర్మాభావో దర్శిత స్తస్యైవ గతసంగస్యేతి. గతసంగస్య సర్వతోనివృత్తాసక్తేః ముక్తస్య నివృత్తధర్మాధర్మాదిబంధనస్య జ్ఞానావస్థితచేతసః, జ్ఞానఏవావస్థితం చేతో యస్య సోఽయం జ్ఞానావస్థితచేతా స్తస్య, యజ్ఞాయ యజ్ఞనిర్వృత్త్యర్థ మాచరతో నిర్వర్తయతః కర్మ సమగ్రం సహాగ్రేణ ఫలేన వర్తత ఇతి సమగ్రం కర్మ తత్సమగ్రం ప్రవిలీయతే వినశ్యతీత్యర్థః, 23

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా. 24

---

టీ:—అర్పణం-హవిర్నిక్షేపసాధనములగు స్రుక్స్రువాదులు, బ్రహ్మ - బ్రహ్మస్వరూపము, హవిః - హోమద్రవ్యము లగు పశుపురోడాశసోమాదికము, బ్రహ్మ - బ్రహ్మస్వరూపము, బ్రహ్మాగ్నౌ - బ్రహ్మరూపమగు నగ్నియందు (అనఁగా హోమాధారభూతమగు నగ్నియు బ్రహ్మమే. అట్టి బ్రహ్మమునందు), బ్రహ్మణా - బ్రహ్మము

---

కస్మాత్పునః కారణాత్క్రియమాణం కర్మ స్వకార్యారంభమకుర్వత్సమగ్రం ప్రవిలీయత ఇత్యుచ్యతే, యతః - బ్రహ్మేతి. బ్రహ్మార్పణం యేన కరణేన బ్రహ్మవిద్ధవిరగ్నావర్పయతి తద్బ్రహ్మైవేతి పశ్యతి; తస్యాత్మవ్యతిరేకేణాభావం పశ్యతి యథా శుక్తికాయాం రజతాభావం పశ్యతి, తదుచ్యతే బ్రహ్మైవార్పణమితి, యథా యద్రజతం తచ్ఛుక్తికైవేతి, బ్రహ్మ అర్పణ మిత్యసమస్తే పదే యదర్పణబుద్ధ్యా గృహ్యతే లోకే తదస్య బ్రహ్మవిదో బ్రహ్మైవేత్యర్థః; బ్రహ్మహవిస్తథా యద్ధవిర్బుద్ధ్యా గృహ్యమాణం తద్బ్రహ్మైవాస్య; తథా బ్రహ్మాగ్నావితి సమస్తం పదం. అగ్నిరపి బ్రహ్మైవ యత్ర హూయతే బ్రహ్మణా కర్త్రా బ్రహ్మైవ కర్తేత్యర్థః, యత్తేన హుతం హవనక్రియా తద్బ్రహ్మైవ, యత్తేన గంతవ్యం ఫలం తదపి బ్రహ్మైవ, బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ కర్మ బ్రహ్మకర్మ, తస్మిన్ సమాధిర్యస్య స బ్రహ్మకర్మసమాధిస్తేన బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ గంతవ్యమ్.

ఏవం లోకసంగ్రహం చికీర్షుణాఽపి క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మ బ్రహ్మబుద్ధ్యుపమృదితత్వాత్; ఏవంసతి నివృత్తకర్మణోఽపి సర్వకర్మసంన్యాసినః సమ్యగ్దర్శనస్తుత్యర్థం యజ్ఞత్వసంపాదనం జ్ఞానస్య సుతరా ముపపద్యతే యదర్పణాద్యధియజ్ఞే ప్రసిద్ధం తదస్యాధ్యాత్మం బ్రహ్మైవ పరమార్థదర్శిన ఇతి; అన్యథా సర్వస్య బ్రహ్మత్వేఽర్పణాదీనా మేవ విశేషతో బ్రహ్మత్వాభిధాన మనర్థకం స్యాత్; తస్మాద్బ్రహ్మైవేదం సర్వమిత్యభిజానతో విదుషః సర్వకర్మాభావః, కారకబుద్ధ్యభావాచ్చ; నహి కారకబుద్ధిరహితం యజ్ఞాఖ్యం కర్మ దృష్టం సర్వమేవాగ్నిహోత్రాదికం కర్మశబ్దసమర్పితదేవతావిశేషసంప్రదానాదికారకబుద్ధిమత్కర్త్రభిమానఫలాభిసంధిమచ్చ దృష్టం నోపమృదితక్రియాకారకఫలభేదబుద్ధిమత్కర్తృత్వాభిమానఫలాభిసంధిరహితం వా; ఇదంతు బ్రహ్మబుద్ధ్యుపమృదితార్పణాదికారకక్రియాఫలభేదబుద్ధి కర్మ, అతోఽకర్మైవ తత్; తథాచ దర్శితం "కర్మణ్యకర్మ యః పశ్యేత్" (గీ. 4-18) "కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః" (గీ. 4.20) "గుణా గుణేషు వర్తన్తే" (గీ. 3.28) "నైవ కించిత్కరోమీతి యుక్తో

చేత ననఁగా యజ్ఞమునఁ గర్తయగు యజమానుఁడును బ్రహ్మమే కాననట్టివానిచే, హుతమ్ - చేయఁబడు హవనక్రియయు బ్రహ్మమే, తేన - అట్టి హవనక్రియచే, బ్రహ్మకర్మసమాధినా - కర్మయే బ్రహ్మమను నిశ్చయజ్ఞానము గల బ్రహ్మవిదునిచే, గన్తవ్యం - పొందఁదగు ఫలముకూడ, బ్రహ్మైవ - బ్రహ్మమే. **24**

తా: -పై గీతమునందు బ్రహ్మవిదునిచేఁ జేయఁబడుకర్మ "సమగ్రం ప్రవిలీయతే" యని చెప్పబడినది. అట్లు కర్మ పుష్కలముగ నశించుటకుఁ గలకారణ మీగీతముచే వివరింపఁబడుచున్నది. బ్రహ్మవిదుఁడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను

మన్యేత తత్త్వవిత్" (గీ. 5.8) ఇత్యాదిభిః; తథాచ దర్శయంస్తత్రతత్ర క్రియాకారకఫలభేదబుద్ధ్యుపమర్దం కరోతి; దృష్టాచ కామ్యాగ్నిహోత్రాదౌ కామోపమర్దేన కామ్యాగ్నిహోత్రాదిహానిః; తథా మతిపూర్వకామతిపూర్వకాదీనాం కర్మణాం కార్యవిశేషస్యారంభకత్వం దృష్టమ్. తథేహాపి బ్రహ్మబుద్ధ్యుపమృదితార్పణాదికారకక్రియాఫలభేదబుద్ధే ర్బాహ్యచేష్టామాత్రేణ కర్మాపి విదుషోఽకర్మ సంపద్యతే, అత ఉక్తం "సమగ్రం ప్రవిలీయతే" ఇతి.

అత్ర కేచి దాహుః యత్ బ్రహ్మ తదర్పణాదీని బ్రహ్మైవ కిలార్పణాదినా పంచవిధేన కారకాత్మనా వ్యవస్థితం సత్తదేవ కర్మ కరోతి, తత్ర నార్పణాదిబుద్ధి ర్నివర్త్యతే; కింత్వర్పణాదిషు బ్రహ్మబుద్ధి రాధీయతే, యథా ప్రతిమాదౌ విష్ణ్వాది బుద్ధి ర్యథా వా నామాదౌ బ్రహ్మబుద్ధిః - ఇతి. సత్యమ్ ఏవమపి స్యాద్యది జ్ఞానయజ్ఞస్తుత్యర్థం ప్రకరణం న స్యాత్; అత్రతు సమ్యగ్దర్శనం జ్ఞానయజ్ఞశబ్దిత మనేకా న్యజ్ఞశబ్దితాన్ క్రియావిశేషా నుపన్యస్య "శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః." (గీ 4-33) ఇతిజ్ఞానం స్తౌతి. అత్రచ సమర్థ మిదం వచనం "బ్రహ్మార్పణ" మిత్యాదిజ్ఞానస్య యజ్ఞత్వసంపాదనే, అన్యథా సర్వస్య బ్రహ్మత్వేఽర్పణాదీనామేవ విశేషతో బ్రహ్మత్వాభిధాన మనర్థకం స్యాత్; యే త్వర్పణాదిషు ప్రతిమాయాం విష్ణుదృష్టివ ద్బ్రహ్మదృష్టిః క్షిప్యతే నామాదిష్వివచేతి బ్రువతే న తేషాం బ్రహ్మవిద్యోక్తేహ వివక్షితా స్యాత్, అర్పణాదివిషయత్వాత్ జ్ఞానస్య; నచ దృష్టిసంపాదనజ్ఞానేన మోక్షఫలం ప్రాప్యతే "బ్రహ్మైవ తేన గంతవ్య" మితి చోచ్యతే విరుద్ధంచ సమ్యగ్దర్శనమంతరేణ మోక్షఫలం ప్రాప్యతఇతి ప్రకృతవిరోధశ్చ, సమ్యగ్దర్శనంచ ప్రకృతం "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" (గీ. 4-18) ఇత్యత్ర, అంతేచ సమ్యగ్దర్శనం తస్యైవోపసంహారాత్ "శ్రేయాన్ ద్రవ్యమయా

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి. 25

---

పుష్కలభావముచే లోకసంగ్రహమునకై కర్మల నాచరించు గావున నట్టి లోక సంగ్రహరూప మగు కర్మ యెంతమాత్రము బంధహేతువు గాదు. అనగా బ్రహ్మ విదునకు మరల జననమరణప్రవాహరూప మగు సంసారహేతు వెంతమాత్రము గాదని పరమతాత్పర్యము. 24

టీ:—అపరే - బ్రహ్మజ్ఞాననిష్ఠులకంటె భిన్నులగు, యోగినః - కొందఱు యోగులు, దైవం - ఇంద్రాదిదేవతలతో సంబంధించిన, యజ్ఞం ఏవ - కర్మరూప మగు యజ్ఞమునే, పర్యుపాసతే - చేయుదురు. అపరే - మఱికొందఱు, బ్రహ్మాగ్నౌ - బ్రహ్మ మనెడి యగ్నియందు, యజ్ఞం - ఆత్మను, యజ్ఞేన - స్వస్వరూపముచేత, ఉపజుహ్వతి - హోమము చేయుదురు. 25

తా:— ఇచట బ్రహ్మాగ్నియందుఁ జేయఁబడు యజ్ఞమనునది "బ్రహ్మా ర్పణం బ్రహ్మహవిః" అను గీతముచేఁ బైన జెప్పఁబడిన బ్రహ్మయజ్ఞమే నానావిధము లగుయజ్ఞములను వర్ణించుటలోఁ బ్రసంగవశమున మఱల ననువదింపఁబడినది. 25

---

ద్రవ్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః" (గీ.4-33) "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం" (గీ.4-39) ఇత్యాదినా సమ్యగ్దర్శనస్తుతిమేవ కుర్వ న్నుపక్షీణోఽధ్యాయః. తత్రాకస్మా దర్పణాదౌ బ్రహ్మదృష్టి గప్రకరణే ప్రతిమాయా మివ విష్ణుదృష్టి రుచ్యత ఇత్యనుపపన్నమ్; తస్మా ద్యథావ్యాఖ్యాతార్థ ఏవాయం శ్లోకః. 24

తత్రాధునా సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సంపాద్య తత్ స్తుత్యర్థ మన్యేఽపి యజ్ఞా ఉపక్షిప్యన్తే దైవమేవేతి. దైవమేవ దేవా ఇజ్యన్తే యేన యజ్ఞేనాసౌ దైవో యజ్ఞ స్తమేవాపరే యజ్ఞం యోగినః కర్మిణః పర్యుపాసతే కుర్వన్తీత్యర్థః, బ్రహ్మాగ్నౌ "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తై.2-1) "విజ్ఞాన మానందం బ్రహ్మ" (బృ.3-9-28) "య త్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః" (బృ.3-4-1) ఇత్యాదివచనోక్త మశనాయాదిసర్వసంసారధర్మవర్జితం "నేతినేతి" (బృ.4-4-22) ఇతి నిరస్తాశేషవిశేషం బ్రహ్మశబ్దే నోచ్యతే, బ్రహ్మచ తదగ్నిశ్చ సహోమాధికరణత్వవివక్షయా బ్రహ్మాగ్ని స్తస్మిన్ బ్రహ్మాగ్నావపరేఽన్యే బ్రహ్మవిదో యజ్ఞం, యజ్ఞశబ్దవాచ్య ఆత్మాఽఽత్మనామసు యజ్ఞశబ్దస్య పాఠాత్; త మాత్మానం యజ్ఞం పరమార్థతః పరమేవ బ్రహ్మ సంతం బుద్ధ్యాద్యుపాధిసంయుక్త మధ్యస్త సర్వోపాధిధర్మక మాహుతిరూపం యజ్ఞేనైవాత్మనైవోక్తలక్షణే నోపజుహ్వతి ప్రక్షిపన్తి. సోపాధిక స్యాత్మనో నిరుపాధికేన పరబ్రహ్మస్వరూపేణైవ యద్దర్శనం స తస్మిన్ హోమ స్తం కుర్వంతి బ్రహ్మాత్మైకత్వదర్శననిష్ఠాః సంన్యాసిన ఇత్యర్థః. 25

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి. 26

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే, 27

---

టీ:—అన్యే - మఱికొందఱు యోగులు, శ్రోత్రాదీని - శ్రోత్రము మొదలుగాఁగల, ఇంద్రియాణి - జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను, సంయమాగ్నిషు - నిగ్రహమనెడి యగ్నియందు, జుహ్వతి - హోమముచేయుదురు. అనగా నింద్రియనిగ్రహమునే చేయుదురని యభిప్రాయము. అన్యే - మఱికొందఱు యోగులు, శబ్దాదీని శబ్దము మొదలుగాఁగల, విషయాన్ - విషయములను, అనఁగా - శబ్దస్పర్శరూపరసగంధములను దదాధారములగు నాకాశాదులను, ఇంద్రియాగ్నిషు - ఇంద్రియములనెడి యగ్నులయందు, జుహ్వతి - హోమము చేయుదురు. అనఁగా శ్రోత్రమార్గమున కవిరుద్ధమగు విషయములనుమాత్రమే గ్రహించుదు రని యభిప్రాయము. 26

టీ:—అపరే - మఱికొందఱు యోగులు, సర్వాణి - సమస్తములగు, ఇంద్రియకర్మాణి - ఇంద్రియ వ్యాపారములను ప్రాణకర్మాణి - ఆధ్యాత్మిక వాయుకార్యములగు నాకుంచన ప్రసారణాదికములను, జ్ఞానదీపితే - వివేకవిజ్ఞానముచేఁ బ్రజ్వలింపఁజేయఁబడిన, ఆత్మసంయమ యోగాగ్నౌ - ఆత్మసంయమమనెడి యోగాగ్ని యందుజుహ్వతి - హోమము చేయుదురు. 27

---

సోఽయంసమ్యగ్దర్శనలక్షణో యజ్ఞో దైవయజ్ఞాదిషు యజ్ఞేషూపక్షిప్యతే "బ్రహ్మార్పణం" (గీ. 4-24) ఇత్యాదశ్లోకైః ప్రస్తుతః "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప" (గీ. 4-33) ఇత్యాదినా స్తుత్యర్థమ్ శ్రోత్రాదీనీతి। శ్రోత్రాదీనీంద్రియా ణ్యన్యే యోగినః సంయమాగ్నిషు ప్రతీంద్రియం సంయమోభిద్యతఇతిబహువచనమ్ సంయమాఏ వాగ్నయ స్తేషుజుహ్వ తీంద్రియసంయమమేవ కుర్వన్తీ త్యర్థః శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు, ఇంద్రియాణ్యేవాగ్నయ స్తేష్వింద్రియాగ్నిషు జుహ్వతి శ్రోత్రాదిభి రవిరుద్ధవిషయగ్రహణం హోమంమన్యన్తే. 26

కించ సర్వాణీతి. సర్వాణీంద్రియకర్మా ణీంద్రియాణాం కర్మాణీంద్రియకర్మాణి, తథా ప్రాణకర్మాణి, ప్రాణో వాయు రాధ్యాత్మిక స్తత్కర్మాణ్యాకుంచనప్రసారణాదీని తాని చాపర ఆత్మసంయమయోగాగ్నౌ వాత్మని సంయమ ఆత్మసంయమః, స్సఏవ యోగాగ్ని స్తస్మి న్నాత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః. 28

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణే ఽపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. 29

---

టీ:–అపరే - మఱికొందరు, తథా - ఆతీరున నే, ద్రవ్యయజ్ఞాః- తీర్థమునందు ద్రవ్యత్యాగమును జేయువారలును, అపరే - మఱికొందరు, తపోయజ్ఞాః - కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు నాచరించువారలును, అపరే - మఱికొందరు, యోగ యజ్ఞాః - యమనియమాసనప్రాణా యామప్రత్యాహార ధ్యానధారణ సమాధి రూపమగు నష్టాంగయోగముల నభ్యసించువారలును, అపరే- మఱికొందఱు, స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాః చ - యథావిధిగా ఋగాది వేదాభ్యాసము చేయువారలును తదర్థ పరిజ్ఞాననిష్ఠులును, అపరే - మఱికొందఱు, సంశితవ్రతాః - తీక్ష్ణములగు కాయ క్లేశాది హేతువులగు వ్రతముల నాచరించువారును. 28

టీ:–తథా- ఆరీతిగా, అపరే- మఱికొందఱు, అపానే - అపానవృత్తియందు, ప్రాణం - ప్రాణవృత్తిని అనగాఁ బూరకమను బ్రాణాయామమును, జుహ్వతి - హోమము జేయుదురు. అపరే - మఱికొందఱు, ప్రాణే - ప్రాణమందు, అపానం - అపానమును, జుహ్వతి - హోమముచేయుదురు. అనఁగా రేచకమను బ్రాణాయామమును జేయుదురు. ప్రాణాపానగతీః - ప్రాణాపానవృత్తులయొక్క వ్యాపారము

---

ప్రక్షిపంతి, జ్ఞాన దీపితే స్నేహేనేవ ప్రదీపే వివేకవిజ్ఞానే నోజ్జ్వలభావ మాపాదితే ప్రవిలాపయ న్తీత్యర్థః. 27

ద్రవ్యేతి. ద్రవ్యయజ్ఞా స్తీర్థేషుద్రవ్యవినియోగం యజ్ఞబుద్ధ్యా కుర్వన్తి యే తే ద్రవ్యయజ్ఞాః, తపోయజ్ఞాః, తపః యజ్ఞః యేషాం తపస్వినాం తే తపోయజ్ఞాః, యోగయజ్ఞాః ప్రాణాయామప్రత్యాహారాదిలక్షణో యోగో యజ్ఞో యేషాం తే యోగయజ్ఞాః, తథాఽపరే స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ స్వాధ్యాయో యథావిధి ఋగాద్యభ్యాసో యజ్ఞో యేషాం తే స్వాధ్యాయయజ్ఞాః, జ్ఞానయజ్ఞా జ్ఞానం శాస్త్రార్థపరిజ్ఞానం యజ్ఞో యేషాం తే జ్ఞానయజ్ఞాశ్చ యతయో యతనశీలాః సంశితవ్రతాః సమ్యక్ శితాని తనూకృతాని తీక్ష్ణీకృతాని వ్రతాని యేషాం తే సంశితవ్రతాః. 28

కించ - అపానఇతి. అపానేఽపానవృత్తౌ జుహ్వతి ప్రక్షిపన్తి ప్రాణం ప్రాణవృత్తిం పూరకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తీత్యర్థః; ప్రాణేఽపానం తథాఽపరే జుహ్వతి, రేచకాఖ్యంచ ప్రాణాయామం కుర్వన్తీత్యర్థః. ప్రాణాపానగతీ ముఖ

అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః. 30

లను, రుద్ధ్వా - అరికట్టు, ప్రాణాయామ పరాయణాః - ప్రాణాయామ తత్పరులుగ నుందురు. అనఁగాఁ గుంభకమను బ్రాణాయామమును జేయుదురు. 29

టీః—అపరే - మఱికొందఱు, నియతాహారాః - పరిమితమగు నాహారము గల వారలై, ప్రాణాన్ - వాయుభేదముల ననఁగాఁ బ్రాణాపానాది వాయువృత్తులను, ప్రాణేషు - ప్రాణాది వాయువృత్తులయందే, జుహ్వతి - హోమము చేయుదురు. అనగా నేయేవాయువృత్తి తద్భిన్నమగు నేయే వాయువృత్తితోఁ గూడిన నిరోధము గల్గునో యట్లు సమకూర్చుచుందురు. ఏతే - "దైవమేవాపరేయజ్ఞం" అను గీతము మొదలు "అపరేనియతాహారాః" యను గీతమువఱకు గల గ్రంథమున వర్ణింపఁబడిన, సర్వేఽపి - అన్నివిధములగు యోగులును, యజ్ఞవిదః - యజ్ఞమును గుఱ్ఱెఱింగిన వారలును, యజ్ఞక్షపితకల్మషాః - యజ్ఞముచే నాశము నొందింపఁబడిన పాపముగల వారును, అనగా విగతకల్మషులగు పునీతులని యభిప్రాయము. ఇందు నీయజ్ఞభేదములను బేర్కొనుటయందుఁ దాత్పర్యమేమన "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" యను గీతముచే నుపదేశింపఁబడిన బ్రహ్మయజ్ఞ ముత్కృష్టతమమనియు నద్దానియందే సమస్తమగు వారలయొక్క చిత్తము లగ్నము గావలయు ననిి, తదతిశయమునే బోధించుటయుగాని యివి యన్నియును నుపాదేయములని బోధించుటకుగాదు. కావున బ్రాజ్ఞు లీయజ్ఞమున విశేషాన్వేషణమునుగూర్చి చిత్తవిక్షేపము నొందఁగూడదు. అట్టి యభిప్రాయము త్తరగీతములవలన నువ్యక్తమగును. 30

నాసికాభ్యాం వాయో ర్నిర్గమనం ప్రాణస్యగతిః తద్విపర్యయేణాథోగమన మపానస్య గతిః, తే ప్రాణాపానగతీ, ఏతే రుద్ధ్వా నిరుధ్య ప్రాణాయామపరాయణాః ప్రాణాయామతత్పరాః కుంభకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తీత్యర్థః. 29

కించ అపరఇతి. అపరే నియతాహారాః, నియతః పరిమిత ఆహారో యేషాం తే నియతాహారాః సంతః ప్రాణాన్వాయుభేదాన్ ప్రాణేష్వేవ జుహ్వతి; యస్య యస్య వాయో ర్జయః క్రియత ఇతరాన్వాయుభేదాం స్తస్మిం స్తస్మిన్ జుహ్వతి. తే తత్ర ప్రవిష్టాఇవ భవంతి. సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషా యజ్ఞై ర్యథోక్తైః క్షపితో నాశితః కల్మషః యేషాం తే యజ్ఞక్షపితకల్మషాః. 30

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ. 31

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

---

టీ:—కురుసత్తమ! యజ్ఞశిష్టామృతభుజః - యజ్ఞశిష్టమను నమృతమును భుజించినవారలు, సనాతనమ్ - నిత్యమగు, బ్రహ్మ - పరమాత్మను, యాంతి - పొందుచున్నారు. అయజ్ఞస్య - యజ్ఞవిరహితునకు ననగా నెద్దియేని యొక యజ్ఞమునైన నాచరింపనివానికి, అయం - ఈ సర్వప్రాణిసాధారణమగు, లోకః - ప్రపంచము, నాస్తి - లేదు, అన్యః - ఇతరములగు స్వర్గాది, లోకములు, కుతః - ఎట్లు లభింపఁగలవు? అనగా లభింపవని యాశయము. ఇచట "యజ్ఞ శిష్టామృతభుజః" యను పదము మూఁడన యధ్యాయమునందలి పదమూఁడవ గీతమున స్మరింపఁబడిన "యజ్ఞ శిష్టాశినః" యను పదమునకు బర్యాయపదమగుటచే నీ పదమందలి యజ్ఞశబ్దము మూఁడవ యధ్యాయమందు సూచింపఁబడిన నిత్యనైమిత్తిక కర్మఁబులను పేరఁ బరగు మహాయజ్ఞములని గ్రహించునది. 31

టీ:—ఏవం - ఈరీతిగా, బహువిధాః - నానాప్రకారములగు, యజ్ఞాః - యజ్ఞములు, బ్రహ్మణః - వేదముయొక్క, ముఖే - ముఖమునందు, వితతాః - చెప్పఁబడినవి. తాన్ సర్వాన్ - ఆయజ్ఞముల నన్నిటిని, కర్మజాన్ - కర్మవలనఁ బుట్టినవిగా, విద్ధి - తెలిసికొనుము. అనఁగా నకర్త్రాత్మకమగు పరబ్రహ్మమునందు దేహేంద్రియ మనోబుద్ధ్యాది సకలప్రపంచము నారోపణ చేయుటచేఁ గల్గు కర్తృభావ

---

ఏవం యథోక్తాన్ యజ్ఞా న్నిర్వర్త్య - యజ్ఞశిష్టేతి. యజ్ఞశిష్టామృతభుజః, యజ్ఞానాం శిష్టం యజ్ఞశిష్టం యజ్ఞశిష్టంచ తదమృతంచ యజ్ఞశిష్టామృతం, తత్ భుంజత ఇతి యజ్ఞశిష్టామృతభుజః యథోక్తాన్ యజ్ఞాన్ కృత్వా తచ్ఛిష్టేన కాలేన యథావిధిచోదితే మన్న మమృతాఖ్యం భుంజత ఇతి యజ్ఞశిష్టామృతభుజః; యాన్తి గచ్ఛన్తి బ్రహ్మ సనాతనం చిరంతనం ముముక్షవశ్చేత్, కాలాతిక్రమాపేక్షయేతి సామర్థ్యా ద్గమ్యతే; నాయం లోక స్సర్వప్రాణిసాధారణోఽప్యస్తి యథోక్తానాం యజ్ఞానా మేకోఽపి యజ్ఞో యస్య నాస్తి సోఽయజ్ఞ స్తస్య, కుతోఽన్యో విశిష్టసాధనసాధ్యః కురుసత్తమ. 31

ఏవ మితి. ఏవం యథోక్తా బహువిధా బహుప్రకారా యజ్ఞా వితతా విస్తీర్ణా బ్రహ్మణో వేదస్య ముఖే ద్వారే వేదద్వారేణావగమ్యమానా బ్రహ్మణో ముఖే వితతా ఉచ్యన్తే; తద్యథా వాచిహి ప్రాణం జుహుమ ఇత్యాదయః;

శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే. 33

---

ముచే నీయజ్ఞములు గల్గుచున్న వని "కర్మణ్యకర్మ యఃపశ్యేత్" అనుస్థలమున నుపదేశించినవిధమున దెలిసికొనవలయు నని యాశయము. ఏవం - ఈరీతిగా ననఁగా "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అను గీతోక్తవిధమున, జ్ఞాత్వా - తెలిసికొని, విమోక్ష్యసే - సంసారబంధమునుండి విముక్తిఁ జెందఁగలవు. 32

టీ:—పరంతప! ద్రవ్యమయాత్ - ద్రవ్యసాధనముచే సాధింపఁ బడునట్టి, అనగా ఫలమును గలుగఁజేయునట్టి, యజ్ఞాత్ - యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః - జ్ఞానయజ్ఞము అనఁగా బ్రహ్మార్పణబుద్ధితోఁ జేయఁబడునట్టియు ఫలారంభకము గానట్టియు యజ్ఞము, శ్రేయాన్ - శ్రేష్ఠమైనది. పార్థ! సర్వం - సమస్తమైనట్టి కర్మలును, జ్ఞానే - జ్ఞానమందు, అఖిలం - అప్రతిబద్ధముగా, పరిసమాప్యతే - అంతర్భావము నొందుచున్నది. అనఁగా సర్వతస్సంప్లుతోదకస్థానీయమగు జ్ఞానమందు నంతర్భావమునొందు చున్నదని యాశయము.

---

కర్మజా న్కాయిక వాచిక మానస కర్మోద్భవాన్ విద్ధి, తాన్ సర్వా ననాత్మజాన్, నిర్వ్యాపారో హ్యాత్మా అతఏవం జ్ఞాత్వా విమోక్ష్యసేఽశుభాత్; న మద్వ్యాపారా ఇమే, నిర్వ్యాపారోఽహ ముదాసీన ఇత్యేవం జ్ఞాత్వాఽస్మాత్సమ్యగ్దర్శనా న్మోక్ష్యసే సంసారబంధనా దిత్యర్థః. 32

బ్రహ్మార్పణ మిత్యాదిశ్లోకేన సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సంపాదితమ్; యజ్ఞాశ్చానేకే ఉపదిష్టాః తై స్సిద్ధపురుషార్థప్రయోజనై ర్జ్ఞానం స్తూయతే. కథమ్? శ్రేయానితి. శ్రేయాన్ ద్రవ్యమయాత్ ద్రవ్యసాధనసాధ్యా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞో హే పరంతప! ద్రవ్యమయో హి యజ్ఞః ఫలస్యారంభకో, జ్ఞానయజ్ఞో నఫలారంభకోఽతః శ్రేయాన్ ప్రశస్యతరః. కథమ్? యత స్సర్వం కర్మ సమస్త మఖిల మప్రతిబద్ధం పార్థ! జ్ఞానే మోక్షసాధనే సర్వత స్సంప్లుతోదకస్థానీయే పరిసమాప్యతేఽన్తర్భవతీత్యర్థః "యథా కృతాయ విజితాయాధరేయాః సంయన్త్యేవ మేనం సర్వం తదభిసమేతి యత్కించ ప్రజాః సాధు కుర్వంతి యస్త ద్వేద యత్స వేద" (ఛాం. 4-1-4). ఇతిశ్రుతేః. 33

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. 34

యత్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాండవ,
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి. 35

---

టీ:—తత్ - అట్టి సర్వతస్సంప్లుతోదకస్థానీయుమగు జ్ఞానమును, ప్రణిపాతేన - సాష్టాంగ వందనాదికముచేతను, పరిప్రశ్నేన - బంధమోక్షాది విషయక జిజ్ఞాసానుగుణమగు ప్రశ్నచేతను, సేవయా - గురుశుశ్రూషచేతను, విద్ధి - తెలిసికొనుమా! తత్త్వదర్శినః - తత్త్వవేత్తలగు, జ్ఞానినః - జ్ఞానవంతులు, తే - నీకొఱకు, జ్ఞానం - జ్ఞానమును, ఉపదేక్ష్యన్తి - ఉపదేశింపఁగలరు. అని పవిత్రతమంబగు జ్ఞానమునకు సాధనరూపమగు గురుశుశ్రూషాదిక మీగీతముచే విధింపఁబడుచున్నది. తత్త్వవేత్తలగు జ్ఞానులనగా బ్రహ్మనిష్ఠులగు పరమహంసపరివ్రాజకులను సంన్యాసులు. అట్టివారలచే నుపదేశింపఁబడు జ్ఞానమే కార్యక్షమమై ప్రయోజనమును గలుగఁజేయుననియు వేఱొకటి యెంతమాత్రమును బ్రయోజనకారి కాదనియు శ్రీకృష్ణభగవానులమతము. 34

టీ:—యత్ - ఏజ్ఞానము తత్త్వవేత్తలచే నుపదేశింపఁబడునో, తత్ - దానిని జ్ఞాత్వా - తెలిసికొని, పునః - తిరిగి, ఏవం - ప్రకృతమున బొందినట్లు, మోహం - మోహమును, పాండవ! న యాస్యసి - పొందవు, అంతియే కాదు. యేన - ఏజ్ఞానముచే, అశేషేణ - నిశ్శేషముగా, భూతాని - బ్రహ్మాదిస్తంబపర్యన్తములగు సమస్త

---

తదేత ద్విశిష్టం జ్ఞానం తర్హి కేన ప్రాప్యత ఇత్యుచ్యతే - తద్విద్ధీతి. తద్విద్ధి విజానీహి యేన విధినా ప్రాప్యతఇతి ఆచార్యా నభిగమ్య ప్రణిపాతేన ప్రకర్షేణ నీచైః పతనం ప్రణిపాతో దీర్ఘనమస్కార స్తేన కథం బంధః కథం మోక్షః కా విద్యా కా చావిద్యా ఇతి పరిప్రశ్నేన సేవయా గురుశుశ్రూష యైవమాదినా ప్రశ్రయేణావర్జితా ఆచార్యా ఉపదేక్ష్యన్తి కథయిష్యన్తి; తే జ్ఞానం యథోక్తవిశేషణం జ్ఞానినః జ్ఞానవంతోఽపి కేచి ద్యథావ త్తత్త్వదర్శనశీలాః అపరే న అతో విశినష్టి తత్త్వదర్శిన ఇతి; యే సమ్యగ్దర్శిన స్తై రుపదిష్టం జ్ఞానం కార్యక్షమం భవతి నేతర దితి భగవతో మతమ్. 34

తథాచ సతీదమపి సమర్థం వచనమ్ యదితి. యత్ జ్ఞాత్వా యత్ జ్ఞానం తై రుపదిష్ట మధిగమ్య ప్రాప్య, పునర్భూయః మోహ మేవం యథేదానీం మోహం గతోఽసి పునరేవం న యాస్యసి హేపాండవ! కించ యేన జ్ఞానేన భూతా న్యశేషేణ బ్రహ్మాదీని స్తంబపర్యంతాని ద్రక్ష్యసి సాక్షా దాత్మని ప్రత్యగాత్మని

అపి చేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి. 36
యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతే ఽర్జున,
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37

---

ప్రాణులను, ఆత్మని - ప్రత్యగాత్మయగు నీయందును, అథో మయి - పరమేశ్వరుండనగు నాయందునుగూడ, ద్రక్ష్యసి - ప్రత్యక్షముగాఁ దెలిసికొనఁగలవో యట్టి జ్ఞానమును దెలిసికొను మని పూర్వమున కన్వయము. 35

తా:-ఇందు సర్వభూతములను ప్రత్యగాత్మయగు నీయందును బరమేశ్వరుఁడనగు నాయందును దెలిసికొనుట యన, సర్వభూతములకు నధిష్ఠానము నీవని యును నే ననియును నిర్వచించిన ట్లగుచున్నది. దానంజేసి సర్వభూతాధిష్ఠానరూపమగు బ్రహ్మమే నీవును నేను నని చెప్పఁబడుటచే జీవేశ్వరాభేదము భగవంతునిచేఁ గంఠోక్తిగ నుపదేశింపఁబడుచున్నది. 35

టీ:-సర్వేభ్యః- సమస్తములగు, పాపేభ్యః - పాపులకంటె, పాపకృత్తమః - ఎక్కువ నికృష్టమగు పాపివి, అసి చేత్ అపి - అయినప్పటికి, సర్వం - సమస్తమైన వృజినం - పాపసముద్రమును, జ్ఞాన ప్లవేన ఏవ - జ్ఞానమనెడినావచేతనే, సంతరిష్యసి - దాటగలవు" అని జ్ఞానముయొక్క సర్వోత్కృష్టత వర్ణింపఁబడుచున్నది. 36

టీ:-అర్జున! సమిద్ధః - లెస్సగాఁ బ్రజ్వలింపఁ జేయఁబడిన, అగ్నిః - నిప్పు, ఏధాంసి - కట్టెలను, భస్మసాత్ - బూడిదగా, యథా - ఏరీతిగా, కురుతే - చేయునో, తథా - ఆరీతిగా, జ్ఞానాగ్నిః - జ్ఞానమనెడు నగ్నిహోత్రము, సర్వకర్మాణి - సమస్తములగు కర్మలను, అనగా నేకర్మ ఫలరూపముగ బరిణమించుటచే నీ దేహ

---

మత్సంస్థా నీమాని భూతానీతి. అథో అపి మయి వాసుదేవే పరమేశ్వరే చేమానీతి క్షేత్రజ్ఞేశ్వరైకత్వం సర్వోపనిషత్ప్రసిద్ధం ద్రక్ష్యసీత్యర్థః. 35

కిం చైతస్య జ్ఞానస్య మాహాత్మ్యమ్ - అపీతి. అపిచేదసి పాపేభ్యః పాపకృద్భ్యః సర్వేభ్యోఽతిశయేన పాపకృత్పాపకృత్తమః, సర్వం జ్ఞానప్లవేనైవ జ్ఞానమేవ ప్లవం కృత్వా వృజినం వృజినార్ణవం పాపసముద్రం సంతరిష్యసి. ధర్మోఽపీహ ముముక్షోః పాప ముచ్యతే. 36

జ్ఞానం కథం నాశయతి పాపమితి, దృష్టాంత ఉచ్యతే - యథేతి. యథైధాంసి కాష్ఠాని, సమిద్ధః సమ్యగిద్ధః దీప్తోఽగ్ని ర్భస్మసా ద్భస్మీభావం కురుతే హేఽర్జున! జ్ఞానమేవాగ్నిః జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా నిర్బీజీకరోతీత్యర్థః; నహి సాక్షాదేవ జ్ఞానాగ్నిః కర్మాణీంధనవ ద్భస్మీకర్తుం శక్నోతి; తస్మా త్సమ్యగ్దర్శనం సర్వకర్మణాం నిర్బీజత్వే కారణ మిత్యభిప్రాయః. సామర్థ్యాద్యేన కర్మణా శరీర మారబ్ధం తత్ప్రవృత్తఫలత్వా దుపభోగేనైవ క్షీయతే. అతో

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే,
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి. 38

శ్రద్ధావాఁల్లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః,
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి. 39

---

ము ప్రారంభమాయెనో ఆకర్మ యొక్కటి తక్క దదితరములగు సకలకర్మలను, భస్మసాత్ - బూడిదగా, కురుతే - చేయును. దేహము మాత్రము ముక్తేషున్యాయమున పాతమువఱకు లోకదృష్టిచే నిలిచియున్నట్లుండును. 37

టీ:--ఇహ - ఈలోకమున, జ్ఞానేన - జ్ఞానముతో, సదృశం - సమానమగు, పవిత్రం - శోధకమగువస్తువు, నహి విద్యతే - ఎంతమాత్రమును తెలియఁబడదు గదా! తత్ - అట్టిజ్ఞానమును, యోగసంసిద్ధః - కర్మయోగముచేఁ గాని జ్ఞానయోగముచేఁ గాని సంస్కరింపఁబడిన ముముక్షువు, స్వయం - స్వయముగా, కాలేన - కొంతకాలమునకు, ఆత్మని - స్వస్వరూపమునందే, విందతి - పొందును. 38

టీ:--తత్పరః - జ్ఞానప్రాప్తి సాధనమగు గురూపాసనాదికములయందు గుఱులుఁడైనట్టియు, సంయతేంద్రియః - ఇంద్రియనిగ్రహము గలిగినట్టియు, శ్రద్ధావాఁ - శ్రద్ధాళువు, జ్ఞానం - జ్ఞానమును, లభతే - పొందును. జ్ఞానం - జ్ఞానమును, లబ్ధ్వా - పొంది, పరాం - ఉత్కృష్టమగు, శాంతిం - బ్రహ్మనిర్వాణ రూపమగు నుత్తమశాంతిని అనగా మోక్షమును, అచిరేణ - శీఘ్రముగా, అధిగచ్ఛతి - పొందును. ఇచట

---

యా న్యప్రవృత్తఫలాని జ్ఞానోత్పత్తేః ప్రాక్కృతాని జ్ఞానసహభావీని చాతీతానేకజన్మకృతానిచ తాన్యేవ సర్వాణి భస్మసాత్కురుతే. 37

యత ఏవమతః- నహీతి. నహి జ్ఞానేన సదృశం తుల్యం పవిత్రం పావనం శుద్ధికర మిహ విద్యతే; తత్ జ్ఞానం స్వయమేవ యోగసంసిద్ధో యోగేన కర్మయోగేన సమాధియోగేనచ సంసిద్ధ స్సంస్కృతో యోగ్యతామాపన్నః సన్ ముముక్షుః కాలేన మహతాఽఽత్మని విందతి లభత ఇత్యర్థః. 38

యే నైకాంతేన జ్ఞానప్రాప్తిర్భవతి స ఉపాయ ఉపదిశ్యతే - శ్రద్ధావానితి. శ్రద్ధావాన్ శ్రద్ధాళుః, లభతే జ్ఞానమ్ శ్రద్ధాళుత్వేపి భవతి కశ్చిన్మందప్రస్థానోఽత ఆహ తత్పరో గురూపాసనాదా వభియుక్తో జ్ఞానలబ్ధ్యుపాయే శ్రద్ధావాన్ తత్పరోఽప్యజితేంద్రియః స్యా దిత్యత ఆహ సంయతేంద్రియః. సంయతాని విషయేభ్యో నివర్తితాని యస్యేంద్రియాణి స సంయతేంద్రియః, య ఏవంభూతశ్శ్రద్ధావాం స్తత్పరస్సంయతేంద్రియశ్చ సోఽవశ్యం జ్ఞానం లభతే ప్రణిపాతాదిస్తు బాహ్యోఽనైకాంతికోఽపి భవతి మాయావిత్వాదిసంభవాత్; నతు తచ్ఛ్రద్ధావత్త్వాదా విత్యేకాంతతో జ్ఞానలబ్ధ్యుపాయః. కింపున ర్జ్ఞానలాభా త్స్యా దిత్యు

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః. 40
యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్,
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ! 41

---

శాంతి యను పదముచే నుద్దేశింపఁబడిన యర్థము రెండవ యధ్యాయపు డెబ్బదియొక
టవ గీతమునందలి శాంతిపదార్థముయొక్క యనువాదరూపము. 39

టీ:- అజ్ఞశ్చ - అజ్ఞుఁడును, అశ్రద్దధానశ్చ - శ్రద్ధారహితుఁడును, సంశ
యాత్మా - సందేహమనస్కుఁడును, వినశ్యతి - నశించును. ఇచట 'వినశ్యతి'యను
పదమునకుఁ బ్రత్యేకపరిసమాప్తి. సంశయాత్మనః - సందిగ్ధమనస్కునకు, అయం
లోకః- ఈలోకము, అనగా నైహికఫలము, న అస్తి - లేదు. పరః - పరలోకముగూడ
న అస్తి - లేదు. సుఖం - సౌఖ్యమును, న - లేదు. అనఁగా నజ్ఞుఁడు ప్రాజ్ఞతఁ
బొందునపుడు, శ్రద్ధావిహీనుఁడు శ్రద్ధను బొందునపుడును బాగుపడుట కవకాశము
గలదుగాని సంశయాత్మకుఁ డందరలోను పాపి యగుటచే నెన్నటికిని బాగుపడుట
కవకాశము లేక నశించును. కావున సంశయగ్రస్తుఁ డెంతమాత్రము గాకూడదనియు
నిశ్చయజ్ఞానమునే బడయవలయుననియు హితశాసనము. 40

టీ:- ధనంజయ! యోగసంన్యస్తకర్మాణం - పరమాత్మదర్శనరూప మగు
జ్ఞానయోగముచే సకలకర్మల సంన్యసించునట్టియు, జ్ఞానసంఛిన్నసంశయం - జీవేశ్వరా
భేదజ్ఞానముచే సకలసంశయంబులను దొలగించుకొనినట్టియు, ఆత్మవంతం - వివేక
జ్ఞానముచే నప్రమత్తుఁడైనట్టియు విద్వాంసుని, కర్మాణి - గుణచేష్టారూపములగు

---

చ్యతే; జ్ఞానం లబ్ధ్వా పరాం మోక్షాఖ్యాం శాంతి ముపరతి మచిరేణ క్షిప్రమే
వాధిగచ్ఛతి. సమ్యగ్దర్శనాత్ క్షిప్రమేవ మోక్షో భవతీతి సర్వశాస్త్రన్యాయ
ప్రసిద్ధ స్సునిశ్చితోఽర్థః. 39

అత్ర సంశయో నకర్తవ్యః పాపిష్ఠోహి సంశయః కథ మిత్యుచ్యతే-అజ్ఞశ్చేతి.
అజ్ఞ శ్చానాత్మజ్ఞశ్చ శ్రద్దధానశ్చ గురువాక్యశాస్త్రేషు అవిశ్వాసవాంశ్చ
సంశయాత్మాచ సంశయచిత్తశ్చ వినశ్యతి; అజ్ఞాశ్రద్దధానా యద్యపి వినశ్యత
స్తథాపి న తథా యథా సంశయాత్మా; సంశయాత్మాతు పాపిష్ఠ స్సర్వేషామ్;
కథమ్? నాయం సాధారణోఽపి లోకోఽస్తి, తథా న పరో లోకో, నసుఖం తత్రాపి
సంశయోత్పత్తేః సంశయాత్మన స్సంశయచిత్తస్య తస్మా త్సంశయో నకర్తవ్యః. 40

కస్మాత్ యోగేతి. యోగసంన్యస్త కర్మాణం పరమార్థదర్శనలక్షణేన
యోగేన, సంన్యస్తాని కర్మాణి యేన పరమార్థదర్శినా ధర్మాధర్మాఖ్యాని తం
యోగసంన్యస్తకర్మాణం కథం యోగసంన్యస్త కర్మేత్యాహ జ్ఞానసంఛిన్న
సంశయం జ్ఞానేనాత్మేశ్వరైకత్వదర్శనలక్షణేన సంఛిన్నః సంశయో యస్య న జ్ఞాన

తస్మా దజ్ఞానసంభూతం హృత్థ్సం జ్ఞానాసినాఽఽత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. 42

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
జ్ఞానకర్మసంన్యాసయోగోనామ చతుర్థోఽధ్యాయః.

---

దృష్టకర్మలు, న నిబధ్నంతి - అనిష్టములగు జన్మాదిఫలములను గలుగఁజేయనేరవు. అనగా సర్వకర్మలు నివృత్తిఁ జెందునని యాశయము. 41

టీ:- తస్మాత్ - ఆకారణమువలన, భారత ! అజ్ఞానసంభూతం - అవివేకము వలనఁ గలిగినట్టియు, హృత్ స్థం - హృదయమం దున్నట్టియు, ఏనం - ఈ పాపస్వ రూపమగు, ఆత్మనః - నీయొక్క, సంశయం - యుద్ధము చేయవలయునా లేక మాన వలయునా యను సందియమును, జ్ఞానాసినా - జ్ఞాన మనెడిఖడ్గముచే, ఛిత్త్వా- ఛేదించి, యోగం - సమ్యగ్దర్శనమునకు సాధనభూతమగు నిష్కామకర్మానుష్ఠానమును, ఆతిష్ఠ - సలుపుము, ఉత్తిష్ఠ - ప్రకృతమున యుద్ధమునకు లెమ్ము.

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమహాంతాచార్యస్వాములవారిచే రచింపఁబడిన
గీతామృతతరంగిణియందు చతుర్థతరంగము.

---

సంఛిన్నసంశయః, య ఏవం యోగసంన్యస్తకర్మా త మాత్మవంత మప్రమత్తం గుణచేష్టారూపేణ దృష్టాని కర్మాణి న నిబధ్న న్త్యనిష్టాదిరూపం ఫలం నార భంతే హే ధనంజయ. 41

యస్మా త్కర్మయోగానుష్ఠానా దశుద్ధిక్షయహేతుకజ్ఞానసంఛిన్నసంశయో న నిబధ్యతే కర్మభి ర్జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వా దేవ, యస్మాచ్చ జ్ఞానకర్మానుష్ఠానవిషయే సంశయవా న్వినశ్యతి తస్మా దితి; "తస్మా త్పాపిష్ఠ మజ్ఞానసంభూత మజ్ఞానా దవి వేకా జ్జాతం హృత్థ్సం, హృది బుద్ధౌ స్థితం, జ్ఞానాసినా శోకమోహాదిదోషహరం సమ్యగ్దర్శనం జ్ఞానం తదేవాసిః ఖడ్గ స్తేన జ్ఞానాసినా, ఆత్మనః స్వస్య, ఆత్మవిష యత్వా త్సంశయస్య; నహి పరస్య సంశయః పరేణ ఛేత్తవ్యతాం ప్రాప్తో యేన స్వస్యేతివిశేష్యేత అత ఆత్మవిషయోఽపి స్వస్యైవ భవతి, ఛిత్త్వైనం సంశయం స్వవినాశహేతుభూతం యోగం సమ్యగ్దర్శనోపాయం కర్మానుష్ఠాన మాతిష్ఠ కుర్విత్యర్థః ఉత్తిష్ఠ చేదానీం యుద్ధాయ భారతేతి. 42

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
జ్ఞానకర్మసంన్యాసయోగోనామ చతుర్థోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## పంచమోఽధ్యాయః

అర్జున ఉవాచ—

> సంన్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి,
> యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్. 1

---

టీ:- అర్జునుఁడు పలుకుచున్నాఁడు: కృష్ణ! కర్మణాం - శ్రుతిస్మృతులయందు నుపదేశింపఁబడిన యనుష్ఠానవిశేషములయొక్క, సంన్యాసం - పరిత్యాగమును; పునః - తిరిగి, యోగం చ - అట్టి శ్రుతి స్మృత్యుదితకర్మాచరణముయొక్క యవశ్య కతను, శంససి - కొనియాడుచున్నావు. ఏతయోః - కర్మసంన్యాస కర్మయోగము లలో, యత్ ఏకం - ఏ ఒక్కటి, శ్రేయః - పురుషార్థసాధనమో, తత్ - దానిని, సునిశ్చితం - లెస్సగ నిర్ణయించినదానిగా, బ్రూహి - చెప్పుమా! 1

---

“కర్మ ణ్యకర్మ యః పశ్యేత్” (గీ. 4-18). ఇత్యారభ్య “స యుక్తః కృత్స్నకర్మకృత్” (గీ. 4-18.) “జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం” (గీ. 4-19). “శారీరం కేవలం కర్మ కుర్వ౯” (గీ. 4-21). “యదృచ్ఛాలాభసంతుష్టః” (గీ. 4-22). “బ్రహ్మార్పణం బ్రహ్మహవిః” (గీ 4-24) “కర్మజా న్విద్ధి తాన్ సర్వాన్” (గీ. 4-32) “సర్వం కర్మాఖిలం పార్థ” (గీ. 4-33) “జ్ఞానాగ్నిః సర్వకర్మాణి” (గీ. 4-37.) “యోగసంన్యస్తకర్మాణం” (గీ. 4-41.) ఇత్యన్తై ర్వచనై స్సర్వకర్మ సంన్యాస మవోచ ద్భగవాన్. “ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠ” (గీ. 4-42.) ఇత్యనేన వచనేన యోగంచ కర్మానుష్ఠానలక్షణ మనుతిష్ఠేత్యుక్తవాన్. తయో రుభయోశ్చ కర్మానుష్ఠానకర్మసంన్యాసయోః స్థితిగతివ త్పరస్పరవిరోధా దేకేన సహ కర్తుమశక్యత్వా త్కాలభేదేన చానుష్ఠానవిధానాభావా దర్థా దేతయో రన్యతరకర్తవ్యతాప్రాప్తౌ సత్యాం యచ్ఛ్రేయస్తర మేతయోః కర్మానుష్ఠానకర్మ సంన్యాసయో స్తత్కర్తవ్యం నేతర దిత్యేవంమన్యమానః ప్రశస్యతరబుభుత్స యాఽర్జున ఉవాచ “సంన్యాసం కర్మణాం కృష్ణ” (గీ. 5-1.) ఇత్యాదినా.

---

తా:- నాలుగవయధ్యాయమున "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అని ప్రారంభముచేసి "సయుక్తః కృత్స్నకర్మకృత్" "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" "శారీరం కేవలం కర్మ కుర్వన్" "యదృచ్ఛాలాభసంతుష్టః" "బ్రహ్మార్పణంబ్రహ్మహవిః" "కర్మజాన్ విద్ధి తాన్సర్వాన్" "సర్వం కర్మాఖిలం పార్థ" "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి" "యోగసంన్యస్తకర్మాణం" అను వాక్యమంతముగాఁ గల్గినగీతములచే సర్వకర్మసంన్యాస ముపదేశింపఁబడినది. "ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" యనుగీతముచేఁ

---

నను చాత్మవిదో జ్ఞానయోగేన నిష్ఠాం ప్రతిపిపాదయిషుః పూర్వోదాహృతై ర్వచనై ర్భగవా న్సర్వకర్మసంన్యాస మవోచ న్నత్వనాత్మజ్ఞస్య; అతశ్చ కర్మానుష్ఠానకర్మసంన్యాసయో ర్భిన్నపురుషవిషయత్వా దన్యతరస్య ప్రశస్యతరత్వబుభుత్సయా ప్రశ్నోఽనుపపన్నః.

సత్యమేవ త్వదభిప్రాయేణ ప్రశ్నో నోపపద్యతే ప్రష్టుః స్వాభిప్రాయేణ పునః ప్రశ్నో యుజ్యత ఏవేతి వదామః. కథమ్? పూర్వోదాహృతై ర్వచనై ర్భగవతా కర్మసంన్యాసస్య కర్తవ్యతయా వివక్షితత్వా త్ప్రాధాన్యమంతరేణచ కర్తారం తస్య కర్తవ్యత్వాసంభవా దనాత్మవిదపి కర్తా పక్షే ప్రాప్తోఽనూద్యత ఏవ నపున రాత్మవిత్కర్తృకత్వ మేవ సంన్యాసస్య వివక్షిత మిత్యేవమన్వానస్యార్జునస్య కర్మానుష్ఠానకర్మసంన్యాసయో రవిద్వత్పురుషకర్తృకత్వమ ప్యస్తీతి పూర్వోక్తేన ప్రకారేణ తయోః పరస్పరవిరోధా దన్యతరస్య కర్తవ్యత్వే ప్రాప్తే ప్రశస్యతరంచ కర్తవ్యం నేతర దితి ప్రశస్యతరవివిదిషయా ప్రశ్నో నానుపపన్నః.

ప్రతివచనవాక్యార్థనిరూపణేనాపి ప్రష్టు రభిప్రాయ ఏవమేవేతి గమ్యతే. కథం? "సంన్యాసకర్మయోగౌ నిశ్శ్రేయసకరా తయోస్తు కర్మయోగో విశిష్యతే" (గీ. 5.2) ఇతిప్రతివచనమ్ ఏతన్నిరూప్యమ్ - కిమనేనాత్మవిత్కర్తృకయోః సంన్యాసకర్మయోగయో ర్నిశ్శ్రేయసకరత్వం ప్రయోజన ముక్త్వా తయోరేవ కుతశ్చిద్విశేషా త్కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వ ముచ్యతే; ఆహోస్వి దనాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో స్తదుభయ ముచ్యతఇతి కించాతః యద్యాత్మవిత్కర్తృకయోః సంన్యాసకర్మయోగయో ర్నిశ్శ్రేయసకరత్వం తయోస్తు కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వ ముచ్యతే; యదివాఽనాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో సదుభయ ముచ్యతఇతి; అత్రోచ్యతే - ఆత్మ

గర్మానుష్ఠానలక్షణమగు యోగ మనుష్ఠింపవలయు నని శాసింపఁబడెను. ప్రకృత
మున నుపదేశింపఁబడిన కర్మసంన్యాసకర్మయోగములు విరుద్ధధర్మాక్రాంతములగు
స్థితిగతులవలె నొకే పురుషునిచే నాచరింపఁబడుట కవకాశము లేకపోవుటచేతను
గాలభేదముచేనైన ననుష్ఠించుట కవకాశవిధానము లుపదేశింపఁబడకపోవుటచే నీ
రెంటిలో నెద్దియో యొక్కటియే చేయవలసివచ్చుటచేతను గర్మకంటె జ్ఞానము
శ్రేష్ఠ మని రెండవయధ్యాయమునం దుపదేశించుటచేతను, జ్ఞాననిష్ఠసాంఖ్యులను

---

విత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో రసంభవా త్తయో ర్నిశ్శ్రేయసకర
త్వవచనం తదీయాచ్చ కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వాభిధాన మిత్యేత
దుభయ మనుపపన్నం, యద్యనాత్మవిదః కర్మసంన్యాస స్తత్ప్రతికూలశ్చ కర్మా
నుష్ఠానలక్షణః కర్మయోగ స్సంభవేతాం, తదా తయో ర్నిశ్శ్రేయసకరత్వోక్తిః
కర్మయోగస్యచ కర్మసంన్యాసా ద్విశిష్టత్వాభిధాన మిత్యేత దుభయ ముపపద్యేత
ఆత్మవిదస్తు సంన్యాసకర్మయోగయో రసంభవా త్తయో ర్నిశ్శ్రేయసకరత్వాభి
ధానం కర్మసంన్యాసాచ్చ కర్మయోగో విశిష్యత ఇతి చానుపపన్నమ్.

అత్రాహ - కిమాత్మవిద స్సంన్యాసకర్మయోగయో రుభయోర ప్యసంభవ
ఆహోస్వి దన్యతరస్యాసంభవః యదాచాన్యతరస్యాసంభవ స్తదా కిం కర్మసంన్యా
సస్య ఉత కర్మ యోగస్య ఇతి, అసంభవే కారణంచ వక్తవ్య మితి.

అత్రోచ్యతే - ఆత్మవిదో నివృత్తమిథ్యాజ్ఞానత్వా ద్విపర్యయజ్ఞానమూ
లస్య కర్మయోగ స్యాసంభవః స్యాత్ జన్మాదిసర్వవిక్రియారహితత్వేన నిష్క్రియ
మాత్మాన మాత్మత్వేన యో వేత్తి తస్యాత్మవిదః సమ్యగ్దర్శనే నాపాస్తమిథ్యా
జ్ఞానస్య నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణం సర్వకర్మసంన్యాస ముక్త్వా తద్విప
రీతస్య మిథ్యాజ్ఞానమూల కర్తృత్వాభిమాన పురస్సరస్య సక్రియాత్మస్వరూపావ
స్థానరూపస్య కర్మయోగస్యేహ శాస్త్రే తత్ర తత్రాత్మస్వరూపనిరూపణప్రదే
శేషు సమ్యక్ జ్ఞాన మిథ్యాజ్ఞాన తత్కార్యవిరోధా దభావః ప్రతిపాద్యతే యస్మా
త్తస్మా దాత్మవిదో నివృత్తమిథ్యాజ్ఞానస్య విపర్యయజ్ఞానమూలః కర్మయోగో న
సంభవతీతి యుక్త ముక్తం స్యాత్. కేషు కేషు పునరాత్మస్వరూపనిరూపణప్ర
దేశే ష్వాత్మవిదః కర్మాభావః ప్రతిపాద్యత ఇతి, అత్రోచ్యతే "అవినాశితు తద్విద్ధి"
(గీ 2.17) ఇతిప్రకృత్య "య ఏనం వేత్తి హంతారమ్" (గీ 2-19) "వేదావినా
శినం నిత్యం" (గీ 2-21) ఇత్యాదౌ తత్ర తత్రాత్మవిదః కర్మాభావ ఉచ్యతే.

సర్వకర్మసంన్యాసులకు విధింపఁబడినట్లు "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అని మూఁడవ యధ్యాయమున విధింపఁబడి "నచ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి" యనుగీతముచేఁ గేవలము సంన్యాసమువలననే ప్రయోజన మలవడదని నిర్వచించుటచేత నర్జునుఁడు తా నేమి నిశ్చయమును బడయవలయునో గుర్తెఱుంజాలక రెండవయధ్యా

ననుచ కర్మయోగోఽప్యాత్మస్వరూపనిరూపణప్రదేశేషు తత్రతత్ర ప్రతిపాద్యత ఏవ తద్యథా, "తస్మా ద్యుధ్యస్వ భారత" (గీ.2-18) "స్వధర్మ మపి చావేక్ష్య" (గీ.2-31) "కర్మణ్యేవాధికార స్తే" (గీ.2-47) ఇత్యాదౌ, అతశ్చ కథ మాత్మవిదః కర్మయోగస్యాసంభవః స్యా దితి, అత్రోచ్యతే సమ్యగ్జ్ఞానమిథ్యాజ్ఞానతత్కార్యవిరోధాత్, "జ్ఞానయోగేన సాంఖ్యానాం" (గీ.3-3) ఇత్యనేన సాంఖ్యానా మాత్మతత్త్వవిదా మనాత్మవిత్కర్తృకకర్మయోగనిష్ఠాతో నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణాయా జ్ఞానయోగనిష్ఠాయాః పృథక్కరణాత్, కృతకృత్యత్వే నాత్మవిదః ప్రయోజనాంతరాభావాత్, "తస్య కార్యం న విద్యతే" (గీ.3-17) ఇతికర్తవ్యాన్తరాభావవచనాచ్చ, "న కర్మణా మనారంభాత్" (గీ.3-4) "సంన్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః" (గీ.5-6) ఇత్యాదినా చాత్మజ్ఞానాంగత్వేన కర్మయోగస్య విధానాత్ "యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" (గీ.6-3) ఇత్యనేన చోత్పన్నసమ్యగ్దర్శనస్య కర్మయోగాభావవచనాత్ "శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం (గీ.4-21) ఇతిచ శరీరస్థితికారణాతిరిక్తస్య కర్మణో నివారణాత్ "నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" (గీ.5-8) ఇత్యనేనచ శరీరస్థితిమాత్రప్రయుక్తేష్వపి దర్శనశ్రవణాది కర్మ స్వాత్మయాథాత్మ్యవిదః కరోమీతి ప్రత్యయస్య సమాహితచేత స్తయా సదాఽకర్తవ్యత్వోపదేశా దాత్మతత్త్వవిదః సమ్యగ్దర్శనవిరుద్ధో మిథ్యాజ్ఞానహేతుకః కర్మయోగః స్వప్నేఽపి న సంభావయితుం శక్యతే యస్మాత్, తస్మా దనాత్మవిత్కర్తృకయో రేవ సంన్యాసకర్మయోగయోర్నిః శ్రేయసకరత్వవచనం, తదీయాచ్చ కర్మసంన్యాసాత్ పూర్వోక్తాత్మవిత్కర్తృకసర్వకర్మసంన్యాసవిలక్షణాత్స త్యేవకర్తృత్వవిజ్ఞానే కర్మైకదేశవిషయా ద్యమనియమాదిసహితత్వేన చ దురనుష్ఠేయత్వా త్సుకరత్వేనచ కర్మయోగస్య విశిష్టత్వాభిధాన మిత్యేవం ప్రతివచనవాక్యార్థనిరూపణేనాపి పూర్వోక్తః ప్రష్టురభిప్రాయో నిశ్చీయత ఇతిస్థితమ్.

"జ్యాయసీచే త్కర్మణ స్తే" (గీ.3-1) ఇత్యత్ర జ్ఞానకర్మణోః సహాసంభవే "యచ్ఛ్రేయ ఏతయో స న్మే బ్రూహి" (గీ.5-1) ఇత్యేవం పృష్టేఽ

శ్రీభగవానువాచ:—

సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే. 2

---

యాంతమున "తదేకం వద నిశ్చిత్య" యని పలికిన తెఱంగుననే కర్మసంన్యాసకర్మయోగములలోఁ దానెద్దాని నాచరింపవలయునో యద్దాని నొక్కదానినే నిశ్చయముచేసి చెప్పవలయు నని మరలఁ బ్రశ్నించుచున్నాఁడు. 1

టీ:—సంన్యాసః - సర్వకర్మములయొక్క పరిత్యాగము, కర్మయోగః చ - నిత్యనైమిత్తికాది కర్మలయొక్క యనుష్ఠానమును, ఉభౌ - రెండును, నిశ్శ్రేయసకరా- జ్ఞానోత్పత్తికి సాధనము లగుటవలన మోక్షమును గలుగఁజేయునవే, తు - అయినప్పటికి, తయోః - కర్మసంన్యాసకర్మయోగములలో, కర్మసంన్యాసాత్ - జ్ఞానరహితకర్మసంన్యాసముకంటె, కర్మయోగః - కర్మానుష్ఠానము, విశిష్యతే - శ్రేష్ఠమగుచున్నది. 2

---

ర్జునేన భగవాన్ సాంఖ్యానాం సంన్యాసినాం జ్ఞానయోగేన నిష్ఠా, పునః కర్మయోగేన యోగినాం నిష్ఠా ప్రోక్తేతి నిర్ణయం చకార, "నచ సంన్యసనాదేవ కేవలాత్సిద్ధిం సమధిగచ్ఛతి" (గీ. 3-4) ఇతి వచనాత్ జ్ఞానసహితస్య సిద్ధిసాధనత్వమిష్టం, కర్మయోగస్యచ విధానాత్ జ్ఞానరహిత స్సంన్యాసః శ్రేయాన్ కిం వా కర్మయోగః శ్రేయా నిత్యేతయో ర్విశేషబుభుత్సయా.

సంన్యాస మితి. సంన్యాసం పరిత్యాగం కర్మణాం శాస్త్రీయాణా మనుష్ఠానవిశేషాణాం శంససి ప్రశంససి కథయసీ త్యేతత్ పునర్యోగంచ తేషా మేవానుష్ఠానమవశ్యకర్తవ్యత్వం శంస స్యతో మే కతరచ్ఛ్రేయ ఇతి సంశయః కిం కర్మానుష్ఠానం శ్రేయః కింవా తద్ధాన మితి ప్రశస్యతరం చానుష్ఠేయమ్; అతశ్చ యచ్ఛ్రేయః ప్రశస్యతర మేతయోః కర్మసంన్యాసకర్మయోగయోః, యదనుష్ఠానాచ్ఛ్రేయో ఽవాప్తి ర్మమ స్యాదితి మన్యసే తదేక మన్యతర త్సహైకపురుషానుష్ఠేయత్వాసంభవా న్మే బ్రూహి సునిశ్చిత మభిప్రేతం తవేతి. 1

స్వాభిప్రాయ మాచక్షాణో నిర్ణయాయ శ్రీభగవా నువాచ - సంన్యాస ఇతి. సంన్యాసః కర్మణాం పరిత్యాగః కర్మయోగశ్చ తేషా మనుష్ఠానం తావుభావపి నిశ్శ్రేయసకరా నిశ్శ్రేయసం మోక్షం కుర్వాతే జ్ఞానోత్పత్తిహేతుత్వేన ఉభౌ యద్యపి నిశ్శ్రేయసకరా తథాపి తయోస్తు నిఃశ్రేయసహేత్వోః కర్మసంన్యాసాత్ కేవలాత్కర్మయోగో విశిష్యత ఇతికర్మయోగం స్తౌతి. 2

జ్ఞేయ స్స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే. 3

తా:—పూర్వగ్రంథమునందుఁ గర్మకంటె జ్ఞానము శ్రేష్ఠమనియు నట్టి జ్ఞానము సంన్యాసరూప మనియుఁ జెప్పఁబడియున్నది. దానంజేసి సంన్యాస మనఁగా జ్ఞాననిష్ఠ కర్మానుష్ఠానముకంటె శ్రేష్ఠ మని సుస్పష్టము. ప్రకృతమునఁ గర్మసంన్యాసముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠమని చెప్పఁబడుచున్నది. పూర్వగ్రంథమున సంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠ కర్మకంటె శ్రేష్ఠమని చెప్పి ప్రకృతమున గర్మసంన్యాసముకంటె గర్మయోగము శ్రేష్ఠమని చెప్పుట పూర్వాపరసందర్భవిరోధము గలదిగాఁ దెలియవచ్చెడిని. ఇట్టి పూర్వాపరసందర్భవిరోధముచే శ్రీకృష్ణభగవానులను మృషావాదియని చెప్పవలయునా లేక నిం దేమైన విశేషమును గమనింపవలయునా? భగవద్వాక్యము విశేషాభిప్రాయగర్భితమని చెప్పుటయే యుచితము. అట్టి విశేషాభిప్రాయ మెద్దియన "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అను గీతమువలన సర్వకర్మసంన్యాసులకు జ్ఞానయోగము విధింపఁబడుచున్నది. దానంజేసి సర్వకర్మసంన్యాసము జ్ఞానయోగమునకు ద్వారము. జ్ఞానయోగమునకుఁ జిత్తశుద్ధి మూలకారణము. చిత్తశుద్ధి కలిగినవాడే సర్వకర్మసంన్యాసమున కధికారి. చిత్తశుద్ధికిఁ గర్మయోగము కారణము. చిత్తశుద్ధి లేనివాఁడు తన కధికారములేని సంన్యాసముఁ జేకొని భ్రంశముఁ జెందుటకంటెఁ జిత్తశుద్ధిని బడయఁ గర్మయోగము ననుసరించుట శ్రేష్ఠమను గొప్పయాశయము మీఁద "కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే" యని యుపదేశింపఁబడుచున్నది. కావున పూర్వాపరసందర్భవిరోధ మెంతమాత్రమును లేదు. 2

టీ:—యః - ఎవఁడు, న ద్వేష్టి - దుఃఖమును ద్వేషింపఁడో, న కాంక్షతి - సుఖమును గోరఁడో, సః - అట్టి కర్మయోగి, నిత్యసంన్యాసీ - ఎల్లప్పుడును సన్యాసము గలవాఁడుగనే, జ్ఞేయః - తెలియఁదగినవాఁడు. అనఁగా రాగద్వేషములు లేనివాఁడగుటచే సంన్యాసియందుఁ దెలియవచ్చెడి రాగద్వేషశూన్యత నీకర్మయోగి గలిగియుండె నని యీకర్మయోగి సంన్యాసితోఁ దుల్యుఁ డగుచున్నాఁడు. దానంజేసి యీకర్మయోగిని గౌణముగ సంన్యాసియనఁదగును. మహాబాహో! నిర్ద్వంద్వః - శీతోష్ణాది ద్వంద్వవర్జితుఁ డగు కర్మయోగి, సుఖం - అనాయాసముగా, బంధాత్ - కర్మబంధమునుండి, ముచ్యతే హి - ముక్తిని జెందునుగదా! 3

కస్మా దిత్యాహ జ్ఞేయఇతి. జ్ఞేయో జ్ఞాతవ్యః స కర్మయోగీ నిత్యసంన్యాసీతి యో న ద్వేష్టి కించి న్న కాంక్షతి దుఃఖసుఖే తత్సాధనేచ ఏవంవిధో యః కర్మణి వర్తమానోఽపి స నిత్యసంన్యాసీతి జ్ఞాతవ్య ఇత్యర్థః. నిర్ద్వంద్వో ద్వంద్వవర్జితో హి యస్మా న్మహాబాహో సుఖం బంధా దనాయాసేన ప్రముచ్యతే.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః,
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలమ్. 4

---

టీ:—సాంఖ్యయోగౌ - సాంఖ్యయోగములు, పృథక్ - విరుద్ధస్వభావములను గలిగియున్నవనియు, భిన్నఫలములను సమకూర్చునవనియు, బాలాః - అవివేకులు, ప్రవదంతి - చెప్పుచున్నారు. పండితాః - ఆత్మానాత్మవివేకజ్ఞానము గల విద్వాంసులు, న - అట్లు చెప్పరు. ఏలనన, ఏకమపి - సాంఖ్యయోగములలో దేనినైన నొకదానిని, సమ్యక్ - లెస్సగా, ఆస్థితః - ఆచరించినవాఁడు, ఉభయోః - రెండిఁటియొక్కయు, ఫలం - ఫలమగు నిశ్శ్రేయసమును, విందతే - పొందుచున్నాఁడు. 4

తా:—ప్రకృతమున సంన్యాసకర్మయోగశబ్దములు ప్రస్తుతములై యుండ సాంఖ్యయోగశబ్దములయొక్క ఫలైకత్వము చెప్పుట యప్రకృతము గాదా యను సందేహము గలుగును. ప్రకృతమున బ్రస్తుతింపఁబడిన సంన్యాస కర్మయోగములే సాంఖ్యయోగశబ్దములచే నిరూపింపఁబడుచున్నవి గావున నప్రస్తుతప్రసంగ మెంతమాత్రము లేదు. ఇచ్చట సాంఖ్యమనెడి సంన్యాసమునకుఁ జిత్తశుద్ధి కారణమై యున్నది. చిత్తశుద్ధికిఁ గర్మయోగము కారణము. కావున గర్మయోగమువలనఁ జిత్తశుద్ధి, చిత్తశుద్ధివలన సాంఖ్య మనెడి సంన్యాసము, దానివలన జ్ఞాననిష్ఠ, దానివలన నిశ్శ్రేయసమనునది శాస్త్రహృదయము గావున సాంఖ్యయోగములు రెండు నొకేఫలమును సమకూర్చునని చెప్పఁబడినది. జ్ఞాననిష్ఠకు సాంఖ్యయోగములు సోపానములు. సోపానములందుఁ దరతమభావ ముండినను సోపానముల కన్యోన్య సంబంధము గలిగి సోపానములచేఁ బొందఁబడు స్థాన మొక్కటియే యైనట్లు శాస్త్రైక సమధిగమ్యమగు నిశ్శ్రేయసమను మోక్షమునకు సాంఖ్యయోగములు సోపానములు. దానంజేసి రెండును బాహ్యమునకు విరుద్ధములుగాఁ దోచినను విభిన్న

---

విరోధోయుక్తో నతూభయోర్నిశ్శ్రేయసకరత్వ మేవేతి ప్రాప్త ఇదముచ్యతే సాంఖ్యయోగావితి. సాంఖ్యయోగౌ పృథగ్విరుద్ధభిన్నఫలౌ బాలాః ప్రవదన్తి నపండితాః, పండితాస్తు జ్ఞానిన ఏకం ఫల మవిరుద్ధ మిచ్ఛన్తి; కథం? ఏకమపి సాంఖ్యయోగయోః సమ్యగాస్థితః సమ్యగనుష్ఠితవానిత్యర్థః, ఉభయోర్విందతే ఫల ముభయోస్తదేవ హి నిశ్శ్రేయసం ఫల మతో నఫలే విరోధోఽస్తి, నను సంన్యాసకర్మయోగశబ్దేన ప్రస్తుత్య సాంఖ్యయోగయోః ఫలైకత్వం కథమిహాప్రకృతం బ్రవీతి, నైషదోషః, యద్యప్యర్జునేన సంన్యాసం కర్మయోగంచ కేవల మభిప్రేత్య ప్రశ్నఃకృతో భగవాంస్తు తదపరిత్యాగేనైవ స్వాభిప్రేతంచ విశేషం సంయోజ్య శబ్దాన్తరవాచ్యతయా ప్రతివచనం దదౌ సాంఖ్యయోగా వితి తావేవ

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి. 5

సంన్యాసస్తు మహాబాహో! దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి. 6

---

ఫలకము లెంతమాత్రమును గావు. ఆ యాశయ ముత్తరగీతముచే సుస్పష్టముగా వ్యక్తీకరింపఁబడుచున్నది. 4

టీ:—యత్ - ఏ, స్థానం - మోక్షమను పేరుగల పరమపదము, సాంఖ్యైః - జ్ఞాననిష్ఠులగు సంన్యాసులచే, ప్రాప్యతే - పొందబడుచున్నదో, తత్ - ఆపరమపదము, యోగైరపి - ఫలాభిసంధిరహితముగా నీశ్వరార్పణబుద్ధితోఁ గర్మల నాచరించు యోగులచేఁగూడను, గమ్యతే - పొందఁబడుచున్నది. సాంఖ్యంచ - సాంఖ్యమును, యోగంచ - యోగమును, ఏకం - ఫలైకత్వముచే నొక్కటియే యని, యనగా సోపానప్రాయ మని, యః - ఎవఁడు, పశ్యతి - తెలిసికొనుచున్నాఁడో, సః - వాఁడే, పశ్యతి - శాస్త్రహృదయమును గుర్తెఱింగినవాఁడు. 5

టీ:—మహాబాహో! - అర్జునా!, సంన్యాసఃతు - పారమార్థికసంన్యాసమన్ననో, అయోగతః - కర్మయోగానుష్ఠానము లేకుండ, ఆప్తుం - పొందుటకు, దుఃఖం - కష్టము. యోగయుక్తః - శ్రుతిస్మృత్యుదితమగు కర్మయోగమును ఫలాభిసంధిరహితముగ నీశ్వరార్పణబుద్ధితోఁ జేయునట్టి, మునిః - ఈశ్వరస్వరూపమును మననము చేయు జిజ్ఞాసువు, బ్రహ్మ - పరమాత్మ జ్ఞానస్వరూపమగు సంన్యాస

---

సంన్యాసకర్మయోగా జ్ఞానతదుపాయసమబుద్ధిత్వాదిసంయుక్తౌ సాంఖ్యయోగశబ్దవాచ్యావితి భగవతో మతమ్; అతో నాప్రకృతప్రక్రియేతి. 4

ఏకస్యాపి సమ్యగనుష్ఠానాత్ కథ ముభయోః ఫలం విందత ఇత్యుచ్యతే - యదితి. యత్సాంఖ్యైః జ్ఞాననిష్ఠైః సంన్యాసిభిః ప్రాప్యతే స్థానం మోక్షాఖ్యం తద్యోగైరపి జ్ఞానప్రాప్త్యుపాయత్వేనేశ్వరే సమర్ప్య కర్మాణ్యాత్మనః ఫల మనభిసంధాయానుతిష్ఠన్తి ఏ తే యోగాః యోగినః తైరపి పరమార్థజ్ఞాన సంన్యాసప్రాప్తిద్వారేణ గమ్యత ఇత్యభిప్రాయః; అత ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి ఫలైకత్వా త్సపశ్యతి సమ్యక్పశ్య తీత్యర్థః. 5

ఏవం తర్హి యోగాత్సంన్యాసఏవ విశిష్యతే కథంతర్హీద ముక్తం తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే" (గీ. 5-2) ఇతి శృణు తత్ర కారణం త్వయా పృష్టం కేవలం కర్మసంన్యాసం కర్మయోగం చాభిప్రేత్య తయో రన్యతరః

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. 7

---

మును, న చిరేణ - శీఘ్రముగా, అధిగచ్ఛతి - పొందును. దానంజేసి జ్ఞానరహిత కర్మసంన్యాసముకంటెఁ గర్మయోగము శ్రేష్ఠమని యాశయము. 6

టీ:—యోగయుక్తః - యోగముతోఁ గూడినట్టియు, విశుద్ధాత్మా - చిత్తశుద్ధియన నిర్మలమగు సత్త్వభావముతోఁ గూడినట్టియు, విజితాత్మా - నిగ్రహింపఁబడిన దేహేంద్రియ మనోబుద్ధులు గలిగినట్టియు, సర్వభూతాత్మ భూతాత్మా - సర్వభూతములయొక్క స్వరూపము తన యాత్మగా గుర్తెఱింగిన సమ్యగ్దర్శి, కుర్వన్ అపి - లోకసంగ్రహార్థము కర్మల నాచరించినను, న లిప్యతే - కర్మలచేఁ గట్టువడఁడు. 7

---

కః శ్రేయాన్ ఇతి తదనురూపం ప్రతివచనం మయోక్తం కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతఇతి జ్ఞాన మనపేక్ష్య జ్ఞానాపేక్షస్తు సంన్యాసః సాంఖ్యమితి మయాఽభిప్రేతః పరమార్థయోగశ్చ సఏవ యస్తు కర్మయోగో వైదికః సచ తాదర్థ్యా ద్యోగః సంన్యాస ఇతిచోపచర్యతే కథం తాదర్థ్య మిత్యుచ్యతే సంన్యాస ఇతి. సంన్యాసస్తు పారమార్థికో హే మహాబాహో! దుఃఖ మాప్తుం ప్రాప్తు మయోగతో యోగేనవినా యోగయుక్తో వైదికేన కర్మయోగేనేశ్వర సమర్పితరూపేణ ఫలనిరపేక్షేణయుక్తో ముని ర్మననా దీశ్వరస్వరూపస్య మునిర్బ్రహ్మ పరమాత్మజ్ఞాన లక్షణత్వాత్ప్రకృతః సంన్యాసో బ్రహ్మోచ్యతే "న్యాసఇతి బ్రహ్మా బ్రహ్మాహి పరః" (నా రా.78) ఇతిశ్రుతేః. బ్రహ్మపరమార్థసంన్యాసం పరమాత్మజ్ఞాననిష్ఠా లక్షణం నచిరేణ క్షిప్రమేవ అధిగచ్ఛతి ప్రాప్నోత్యతో మయోక్తం కర్మయోగో విశిష్యత ఇతి (గీ. 5-2). 6

యదా పునరయం సమ్యగ్దర్శనప్రాప్త్యుపాయత్వేన యోగయుక్త ఇతి యోగేన యుక్తో యోగయుక్తో విశుద్ధాత్మా విశుద్ధసత్త్వో విజితాత్మా విజిత దేహో విజితేంద్రియశ్చ సర్వభూతాత్మ భూతాత్మా, సర్వేషాం బ్రహ్మాదీనాం స్తంబపర్యాన్తానాం భూతానా మాత్మభూత ఆత్మాప్రత్యక్చేతనో యస్యస సర్వ భూతాత్మభూతాత్మా సమ్యగ్దర్శీత్యర్థః స తత్రైవం వర్తమానో లోకసంగ్రహాయ కర్మ కుర్వన్నపి నలిప్యతే నకర్మభి ర్బధ్యత ఇత్యర్థః. 7

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశఞ్జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్. 8
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్. 9
బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా. 10

---

టీ:- యుక్తః - సమాహితచిత్తుఁడగు, తత్త్వవిత్ - ఆత్మయాథాత్మ్య జ్ఞానమును దెలిసికొనిన పరమార్థదర్శి, పశ్యన్ - చూచుచు, శృణ్వన్ - వినుచును, స్పృశన్ - తాఁకుచు, జిఘ్రన్ - వాసనచూచుచు, అశ్నన్ - భుజించుచు, గచ్ఛన్ - నడచుచు, స్వపన్ - నిద్రించుచు, శ్వసన్ - ఊపిరి విడుచుచు, ప్రలపన్ - మాటలాడుచు, విసృజన్ - విడిచిపెట్టుచు, గృహ్ణన్ - గ్రహించుచు, ఉన్మిషన్ - కన్నులు తెఱచుచు, నిమిషన్ - మూయుచు, అపి - పూర్వోక్తక్రియల జేయుచున్నప్పటికిని అపి యను నది ప్రత్యేకప్రత్యేకముగా నన్వయించును. ఇంద్రియాణి - ఇంద్రియములు, ఇంద్రియార్థేషు - ఆయాయి విషయములయందు, వర్తన్తే ఇతి - ప్రవర్తించుచున్నవని, ధారయన్ - తెలిసికొనుచు, కించిత్ - ఎట్టికార్యమును, న కరోమి ఏవ ఇతి - నే నెంతమాత్రమును జేయలేదని, మన్యేత - తలఁచును. 8-9

టీ:-యః - ఎవఁడు, కర్మాణి - సకలకర్మలను, బ్రహ్మణి - పరమాత్మయందు, ఆధాయ - ఉంచి యనగా నీశ్వరప్రీతికై చేయుచున్నానని, సంగం - మోక్షఫలమందుఁగూడ నాసక్తిని, త్యక్త్వా - విడచి, కరోతి - చేయుచున్నాఁడో, సః -

---

నచాసౌ పరమార్థతః కరోతీత్యతః నైవేతి. నైవ కించిత్కరోమీతి యుక్తః సమాహితస్సన్మన్యేత చింతయేత్, తత్త్వవిదాత్మనో యాథాత్మ్యం తత్త్వంవేత్తీతి తత్త్వవిత్పరమార్థదర్శీత్యర్థః.

కదా కథంవా తత్త్వమవధారయన్మన్యేతే త్యుచ్యతే పశ్యన్నితి. మన్యేతేతి పూర్వేణ సంబంధః యస్యైవం తత్త్వవిదః సర్వకార్యకరణచేష్టాసు కర్మస్వకర్మైవ పశ్యతః సమ్యగ్దర్శినస్తస్య సర్వకర్మసంన్యాసఏవాధికారః, కర్మణోఽభావదర్శనాత్; నహి మృగతృష్ణికాయా ముదకబుద్ధ్యా పానాయ ప్రవృత్త ఉదకాభావజ్ఞానేఽపి తత్రైవ పానప్రయోజనాయ ప్రవర్తతే. 8-9

యస్తు పున రతత్త్వవిత్ప్రవృత్తశ్చ కర్మయోగే బ్రహ్మణీతి. బ్రహ్మణీశ్వరే ఆధాయ నిక్షిప్య తదర్థం కరోమీతి భృత్యఇవ స్వామ్యర్థం సర్వాణి కర్మాణి

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి,
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వా ఽఽత్మశుద్ధయే. 11

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

---

వాఁడు, అంభసా - నీటిచేత, పద్మపత్రమివ - తామరాకువలెనే, పాపేన - పాపముచే, న లిప్యతే - స్పృశింపఁబడఁడు. 10

టీ:—యోగినః - యోగులు, సంగం-ఫలమందలి యభినివేశమును, త్యక్త్వా విడిచి, ఆత్మశుద్ధయే - చిత్తశుద్ధికొఱకు, కాయేన-దేహముచేతను, మనసా-మనస్సుచేతను, బుద్ధ్యా - బుద్ధిచేతను, కేవలైః - మమకారరహితములగు, ఇంద్రియైః అపి - ఇంద్రియములచేతను, కర్మ-శ్రుతిస్మృత్యుదితధర్మమును, కుర్వన్తి-చేయుచున్నారు. ఇచట కేవలశబ్దము కాయమనోబుద్ధులతోఁగూడ బ్రత్యేకముగా సంబంధించును. "కర్మ కుర్వన్తి ఆత్మశుద్ధయే"యని చెప్పుటచేఁ గర్మయొక్క ఫల మాత్మశుద్ధి యనగాఁ జిత్తశుద్ధి యని నిర్వచింపఁబడుచున్నది. దానంజేసి కర్మ చిత్తశుద్ధిద్వారా మోక్షమునకు సాధనముగాని సాక్షాత్తుగా సాధన మెంతమాత్రము గాదనియు సాంఖ్యమను సంన్యాసమునకు సోపానమనియు గ్రహించునది. 11

టీ:- యుక్తః - కర్మ లీశ్వరప్రీతికొఱకుగాని నాఫలముకొఱకు గాదని నిశ్చయజ్ఞానము నందినవాఁడు, కర్మఫలం - తాఁజేయు కర్మలయొక్క ఫలమును, త్యక్త్వా - పుష్కలముగా విడచి, నైష్ఠికీమ్ - నిష్ఠాసంబంధమగు, శాంతిం - మోక్షమును,

---

మోక్షేఽపి ఫలే సంగం త్యక్త్వా కరోతి య స్సర్వకర్మాణి, లిప్యతే న సపాపేన న సంబధ్యతే పద్మపత్రమి వాంభ సోదకేన కేవలం సత్త్వశుద్ధిమాత్రఫల మేవ తస్య కర్మణః స్యాత్. 10

యస్మాత్ కాయేనేతి. కాయేన దేహేన మనసా బుద్ధ్యాచ కేవలై ర్మమత్వవర్జితైఃఈశ్వరాయైవ కర్మ కరోమి న మమ ఫలాయేతి మమత్వబుద్ధిశూన్యై రింద్రియైరపి కేవలశబ్దః కాయాదిభి రపి ప్రత్యేకం సంబధ్యతే సర్వవ్యాపారేషు మమతావర్జనాయ యోగినః కర్మిణః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వా ఫలవిషేష మాత్మశుద్ధయే సత్త్వశుద్ధయ ఇత్యర్థః; తస్మా త్త్వమపి తత్రైవ తవాధికార ఇతి కురు కర్మైవ. 11

యస్మాచ్చ - యుక్తఇతి. యుక్త ఈశ్వరాయ కర్మాణి కరోమి న మమ ఫలాయే త్యేవం సమాహితస్సన్ కర్మఫలం త్యక్త్వా పరిత్యజ్య శాంతిం మోక్షాఖ్యా మాప్నోతి, నైష్ఠికీం నిష్ఠాయాం భవాం సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తి సర్వకర్మ

సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. 13

---

ఆప్నోతి - పొందును. అనఁగాఁ జిత్తశుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మసంన్యాస జ్ఞాననిష్ఠలను గ్రమముగాఁబొంది ముక్తిఁబొందు నని యభిప్రాయము. ఏలనన, బైగీతమున గర్మ చిత్తశుద్ధికిఁ గారణ మనియే చెప్పఁబడినది. ఇచట 'శాంతి' యనుపదముచే రెండవయధ్యాయమున డెబ్బదియొకటవ గీతమున నుపదేశింపఁబడిన శాంతిరూపమగు బ్రహ్మనిర్వాణమునే గ్రహింపవలయును. అయుక్తః - కామకామి, కామకారేణ - కోరికలచేఁ బ్రేరణచేయఁబడినవాఁడై, ఫలే - ఫలమందు, సక్తః - తగుల్కొనినవాఁడై, నిబధ్యతే - సంసారమున బంధింపఁబడును. ఇచట 'అయుక్తః కామకారేణ' యను రెండవచరణము రెండవయధ్యాయమునందలి డెబ్బదియవ గీతమున స్మరింపఁబడిన "న కామకామీ" యను పదవివరణమే. 12

టీ:- వశీ - జితేంద్రియుఁడగు, దేహీ - దేహి, సర్వకర్మాణి - నిత్యనైమిత్తికకామ్యప్రతిషిద్ధ రూపములగు సకలకర్మలను, మనసా - కర్మయం దకర్మను అకర్మయందుఁ గర్మను దెలిసికొనుటచేఁ గల్గు వివేకజ్ఞానముచే, సంన్యస్య - పుష్కలముగ విడిచి, యనఁగా శ్రుతిస్మృతిసదాచారవిధి ననుసరించి సర్వకర్మ సంన్యాసమును గావించి,

---

సంన్యాస జ్ఞాననిష్ఠాక్రమేణేతి వాక్యశేషః; యస్తు పునరయుక్తోఽసమాహితః కామకారేణ కరణం కారః కామస్య కారః కామకార స్తేన కామకారేణ కామప్రేరిత యేత్యర్థః; మమ ఫలాయేదం కరోమి కర్మేత్యేవం ఫలే సక్తో నిబధ్యతేఽత స్త్వం యుక్తో భవేత్యర్థః. 12

యస్తు పరమార్థదర్శీ సః - సర్వకర్మాణీతి, సర్వాణి కర్మాణి సర్వకర్మాణి సంన్యస్య పరిత్యజ్య నిత్యం నైమిత్తికం కామ్యం ప్రతిషిద్ధంచ తాని సర్వాణి కర్మాణి మనసా వివేకబుద్ధ్యా కామాదావకర్మదర్శనేన సంత్యజ్యేత్యర్థః ఆస్తే తిష్ఠతి సుఖమ్. త్యక్తవాఙ్మనఃకాయచేష్టో నిరాయాసః ప్రసన్నచిత్తా ఆత్మనోఽన్యత్ర నివృత్త సర్వబాహ్య ప్రయోజనఇతి; సుఖమాస్త ఇత్యుచ్యతే వశీ జితేంద్రియ ఇత్యర్థః క్వ కథమాస్తఇత్యాహ నవద్వారే పురే నప్తశీర్షణ్యా న్యాత్మనఉపలబ్ధిద్వారాణి, అర్వాద్ద్వే మూత్రపురీషవిసర్గార్థే తై ర్ద్వారై ర్నవద్వారం పుర ముచ్యతే శరీరం పుర మివ పురమాత్మైకస్వామికం తదర్థప్రయోజనై శ్చేంద్రియమనోబుద్ధివిషయై రనేకఫలవిజ్ఞానస్యోత్పాదకైః పౌరై రివాధిష్ఠితమ్, తస్మి న్నవద్వారే పురే దేహీ సర్వం కర్మ సంన్యస్యాస్తే కిం విశేషేణ సర్వో హి దేహీ సంన్యస్య సంన్యాసీవా దేహ ఏవాస్తే తత్రానర్థకం విశేషణమితి ఉచ్యతే - య స్త్వజ్ఞో దేహీ దేహేంద్రియసంఘాతమాత్రాత్మ

నైవ కుర్వన్ - ఏకార్యమునైనఁ జేయకయు, న కారయన్ - చేయుటయందు వేఱొకరిని బ్రవర్తింపఁజేయకయు, నవద్వారే - తొమ్మిదిద్వారములతోఁగూడిన, పురే - పట్టణమందు అనఁగా నవరంధ్రములతోఁగూడిన యీదేహమందు, సుఖం - నిరాయాసముగా వాఙ్మనఃకాయచేష్టలను విడిచినవాఁడై, ఆస్తే - ఉండును. ఇచట దేహి దేహమందుండుననుటచే, దేహి దేహేంద్రియమనోబుద్ధులతోఁ జేయఁబడు సకల కార్యములనుండి యుపరమమును జెంది నిశ్చలమగు పరమాత్మభావమును బొంది యుండునని పరమతాత్పర్యము. ఇట్టి పరమాత్మభావమే సంన్యాసమనియు, ముక్తియనియు, బ్రహ్మవిదులచేఁ జెప్పఁబడుచున్నది. ఇట్టి యుపరమరూపమగు సంన్యాసముఁ బొందినవాఁడే సంన్యాసియనియు, స్థితప్రజ్ఞుఁడనియు, బండితుఁడనియు, గృతకృత్యుఁడనియు, జ్ఞానియనియు, విద్వాంసుఁడనియు బలువిధముల జెప్పఁబడుచున్నాఁడు. ఇట్టి సంన్యాసియగు స్థితప్రజ్ఞునియొక్క స్వరూపస్వభావములే యీ యధ్యాయ పరిసమాప్తి వఱకుఁ గల గీతములచే విశేషముగా వర్ణింపఁబడుచున్నవి. 13

దర్శీ స సర్వో "గేహే భూమా వాసనే వాసే" ఇతిమన్యతే; నహి దేహమాత్రాత్మదర్శినో గేహఇవ దేహ ఆస ఇతిప్రత్యయః సంభవతి దేహాదిసంఘాతవ్యతిరిక్తాత్మదర్శినస్తు 'దేహ ఆసే' ఇతి ప్రత్యయ ఉపపద్యతే; పరకర్మణాంచ పరస్మిన్నాత్మన్యవిద్యయాఽధ్యారోపితానాం విద్యయా వివేకజ్ఞానేన మనసా సన్యాస ఉపపద్యతే; ఉత్పన్నవివేకజ్ఞానస్య సర్వకర్మసంన్యాసినోఽపి గేహఇవ దేహఏవ నవద్వారే పుర ఆసనం ప్రారబ్ధఫలకర్మసంస్కారశేషానువృత్త్యా దేహఏవ విశేషవిజ్ఞానోత్పత్తేః దేహఏవాస్త ఇత్యస్త్యేవ విశేషణఫలం, విద్వదవిద్వత్ప్రత్యయభేదాపేక్షత్వాత్.

యద్యపి కార్యకరణకర్మాణ్యవిద్యయాఽత్మన్యధ్యారోపితాని "సంన్యస్యాస్తే" ఇత్యుక్తం, తథాప్యాత్మసమవాయితు కర్తృత్వం కారయితృత్వంచ స్యాదిత్యాశంక్యాహ నైవ కుర్వన్ స్వయం, నచ కార్యకరణాని కారయన్ క్రియాసు ప్రవర్తయన్, కిం యత్తత్కర్తృత్వం కారయితృత్వంచ దేహినః స్వాత్మసమవాయిసత్సంన్యాసాన్నసంభవతి యథా గచ్ఛతో గతిర్గమనవ్యాపారపరిత్యాగే సస్యాత్తద్వత్ కింవా స్వతఏవాత్మనో నాస్తీతి అత్రోచ్యతే, నాస్త్యాత్మనః స్వతః కర్తృత్వం, కారయితృత్వంచ, ఉక్తంహి "అవికార్యోఽయముచ్యతే"(గీ.2-25) "శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే" (గీ. 13-31) ఇతి "ధ్యాయతీవ లేలాయతీవ" (బృ. 4-3-7) ఇతిచ శ్రుతేః. 13

న క ర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః. 15

---

టీ:—ప్రభుః - ఆత్మ, అనగా దేహేంద్రియ మనోబుద్ధివ్యాపారముల నుండి యుపరమమును జెంది యాత్మభావమును బొందిన సంన్యాసి, లోకస్య - ప్రాణులకు, క ర్తృత్వం - క ర్తృభావమును, న సృజతి - కలుగఁజేయఁడు. కర్మాణి - ప్రాణులచే నభిలషింపఁబడు రథ ఘట ప్రాసాదాదులను, న సృజతి - కలుగజేయఁడు. కర్మఫలసంయోగం - రథాదికర్మల నొనరించినవానికి నట్టి కర్మలవలనఁ గల్గెడి ఫలమును, న సృజతి - కలుగఁజేయఁడు. స్వభావః తు - ఆత్మస్వరూపముకంటె భిన్నమగు నవిద్యయే, ప్రవర్తతే - ప్రవర్తించుచున్నది. 14

తా:—ప్రభువగు నాత్మ చేయుటగాని చేయించుటగాని యిచ్చుటగాని యిప్పించుటగాని లేనిచో జేయుట మొదలగుగాఁ గల వ్యాపారము లెట్లు పరగుచున్న వనిన స్వభావముచేఁ బరగుచున్న వని చెప్పఁబడుచున్నది. స్వభావ మనిన నవిద్య యనియుఁ బ్రకృతి యనియు మాయ యనియు నిర్వచింపఁ బడుచున్నది. ఈ శబ్దములచేఁ దెలియఁబడెడివిషయ మనిర్వచనీయ మనియు మిథ్య యనియుఁ గోవిదులు చెప్పుచున్నారు. ఈ స్వభావ మనునదియే యుత్తరగీతమునం దజ్ఞాన మని పేర్కొనఁబడుచున్నది. 14

టీ:—విభుః - దేహేంద్రియ మనోబుద్ధి వ్యాపారములనుండి యుపరమమును జెంది యాత్మభావమును జెందిన సంన్యాసి, కస్యచిత్ - ఒకానొక భక్తునియొక్కయు, పాపం - దుష్కృతమును, న ఆదత్తే - స్వీకరింపఁడు. కస్యచిత్ - ఒకానొక

---

కించ - నక ర్తృత్వమితి. నక ర్తృత్వం స్వతః కుర్వితి నాపి కర్మాణి రథఘట ప్రాసాదాదీ నీప్సితతమాని లోకస్య సృజ త్యుత్పాదయతి ప్రభు రాత్మా, నాపి రథాదికృతవత స్తత్ఫలేన సంయోగం నకర్మఫలసంయోగమ్ యది కించిదపి స్వతో నకరోతి నకారయతిచ దేహీ; క స్తర్హి కుర్వన్ కారయంశ్చ ప్రవర్తత ఇత్యుచ్యతే స్వభావస్తు స్వో భావ స్స్వభావోఽవిద్యాలక్షణాప్రకృతి ర్మాయా ప్రవర్తతే "దైవీహి" (గీ. 7-14) ఇత్యాదినా వక్ష్యమాణా. 14

పరమార్థతస్తు నాదత్త ఇతి. నాదత్తే నచ గృహ్ణాతి భక్తస్యాపి కస్యచి త్పాపం నచైవాదత్తే సుకృతం భక్తైః ప్రయుక్తం విభుః, కిమర్థం తర్హి భక్తైః పూజాది

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

---

భక్తునియొక్క, సుకృతం - పుణ్యమును గూడ, నచైవ ఆదత్తే - స్వీకరింపఁడు, జ్ఞానం - స్వస్వరూపజ్ఞానము, అజ్ఞానేన - అజ్ఞానముచే, ఆవృతం - కప్పివేయఁబడుచున్నది, తేన - ఆ హేతువుచే, జంతవః - సకలప్రాణులును, ముహ్యన్తి - చేయుచున్నాను, చేయించుచున్నాను, భుజించుచున్నాను, భుజింపఁ జేయుచున్నా నను వ్యామోహమును జెందుచు సంసారనిమగ్నము లగుచున్నవి. పై రెండు గీతములచేఁ దెలియవచ్చెడి రహస్య మేమన ప్రభు విభుశబ్దములచేఁ బేర్కొనఁబడిన యాత్మ, ప్రమాతృత్వ కర్తృత్వ భోక్తృత్వ శూన్యమగు నిర్వికారజ్ఞానస్వరూప మనియు నట్టి జ్ఞానస్వరూప మజ్ఞానముచే నావరింపఁబడుటవలనఁ బ్రమాతృత్వకర్తృత్వ భోక్తృత్వాది సంసారవ్యవహారము లన్నియుఁ గల్గుచున్న వనియును. ఇదియే శ్రుతి స్మృత్యనుప్రాణితమగు పరమరహస్యము. 15

టీ:— యేషాం తు - ఏజంతువులయొక్క, ఆత్మనః - స్వస్వరూపసంబంధము యొక్క, అజ్ఞానం - స్వస్వరూపమును గప్పిపుచ్చు నజ్ఞానము, జ్ఞానేన - శాస్త్రాచార్యోపదిష్టమగు నపరోక్షాత్మవిజ్ఞానముచే, నాశితం - నశింపఁ జేయఁబడుచున్నదో, తేషాం - అట్టివారలకు, తత్ - ఆ, పరం - పరమార్థతత్త్వరూపమగు, జ్ఞానం - జ్ఞానము, ఆదిత్యవత్ - సూర్యునివలె, ప్రకాశయతి - జ్ఞేయమగు సర్వమును ప్రకాశింపఁ జేయుచున్నది. 16

తా:— ఈ గీతమునందు జ్ఞానముచే నజ్ఞానము నశింపఁజేయఁబడునని చెప్పఁబడుటచే స్వస్వరూపము నావరించినయజ్ఞానము జ్ఞానముచేఁదక్క వేఱొండుసాధనముచేఁ దొలఁగనేఱదని నిర్వచింపఁబడుచున్నది. అజ్ఞానము స్వస్వరూపము నెట్లావరించె నను విషయము శ్రీకృష్ణభగవానులచే మూఁడవయధ్యాయమునందలి ముప్పదియొని

---

లక్షణం యాగదానహోమాదికంచ సుకృతంప్రయుజ్యత ఇత్యాహ, అజ్ఞానే నావృతం జ్ఞానం వివేకవిజ్ఞానం తేన ముహ్యన్తి "కరోమి, కారయామి, భోక్ష్యే, భోజయామి" ఇత్యేవం మోహం గచ్ఛన్త్యవివేకినః సంసారిణో జన్తవః. 15

జ్ఞానేనేతి. జ్ఞానేనతు యేనాఽజ్ఞానేనా వృతా ముహ్యంతి జన్తవ స్తదజ్ఞానం యేషాం జంతూనాం వివేకజ్ఞానేనాత్మవిషయేణ నాశిత మాత్మనో భవతి తేషా మాదిత్యవ ద్యథాఽఽదిత్యః సమస్తం రూపజాత మవభాసయతి తద్వత్ జ్ఞానం జ్ఞేయం వస్తు సర్వం ప్రకాశయతి, తత్పదం పరమార్థ తత్త్వమ్. 16

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

---

మిదవగీతమగు "ధూమే నావ్రియతే వహ్నిః." యనుదానిచే నిర్వచింపఁబడియున్నది. అచ్చట నుదాహరింపబడిన కామశబ్దవాచ్యము నిచట పైగీతమున నుదాహరింపఁబడిన యజ్ఞానశబ్దవాచ్యము నొక్కటేయని "ఆవ్రియతే" "ఆవృతః" అనుపద ప్రయోగములచే గ్రహింపనగును. అజ్ఞానము నశించుట యనఁగాఁ గామము నశించుటయే. సర్వానర్థములకుఁ గామము మూలమని శాస్త్రములన్నియుఁ బల్కుచున్నవి. కామము తొలఁగిన ముక్తి లభించునని చెప్పఁబడుచున్నది. ఇచట సర్వానర్థములకు నజ్ఞానము మూలమనియు నజ్ఞానము తొలఁగిన ముక్తి లభించుననియు జెప్పఁబడినది. దానంజేసి కామము నజ్ఞానమును బర్యాయపదములుగా నిచట వ్యవహరింపఁబడియె నని గ్రహించునది. స్వస్వరూపంబగు నాత్మకుఁ గామము జనించుటయే యజ్ఞాన మావరించుట. తనకుఁ గోరిక లెట్లు జనించుచున్నవో యద్దానిని గుర్తెఱింగినచో నాత్మయం దజ్ఞానము సోకుటకుఁ గల కారణము సువిదిత మగును. ఇయ్యది యనిర్వచనీయము, మిథ్య యను రెండుపదములచే శాస్త్రమున వక్కాణింపఁబడుచున్నది. 16

టీ:—తద్బుద్ధయః - పరమార్థ బ్రహ్మజ్ఞానమందు బుద్ధి గలిగినట్టియు, తదాత్మానః - పరబ్రహ్మమే స్వరూపముగాఁ గలిగినట్టియు, తత్పరాయణాః - ఆపర బ్రహ్మమే యుత్కృష్టమగు గతిగాఁ గల్గినట్టియు, తన్నిష్ఠాః - బ్రహ్మనిష్ఠులు, జ్ఞాననిర్ధూతకల్మషాః - అపరోక్షాత్మజ్ఞానముచే నశింపఁ జేయఁబడినపుణ్యపాపములు గలవారై, అపునరావృత్తిం - దేహసంబంధము లేని బ్రహ్మభావాపత్తిరూప మగు ముక్తిని, గచ్ఛన్తి - పొందుచున్నారు. అనగా జ్ఞాననిష్ఠులగు సంన్యాసులు బ్రహ్మభావాపత్తి రూపమగు ముక్తిని బొందుదు రని తాత్పర్యము. 17

---

యత్పరం జ్ఞానం ప్రకాశితమ్ తద్బుద్ధయ ఇతి. తస్మిన్ బ్రహ్మణి గతా బుద్ధిర్యేషాం తే తద్బుద్ధయః తదాత్మాన స్తదేవ పరంబ్రహ్మాత్మా యేషాం తే తదాత్మానః, తన్నిష్ఠా నిష్ఠాభినివేశ స్తాత్పర్యం సర్వాణి కర్మాణి సంన్యస్య తస్మిన్బ్రహ్మణ్యేవావస్థానం యేషాం తే తన్నిష్ఠా స్తత్పరాయణాశ్చ, తదేవ పర మయనం పరాగతి ర్యేషాం భవతి తే తత్పరాయణాః కేవలాత్మరతయ ఇత్యర్థః; యేషాం జ్ఞానేన నాశిత మాత్మనోఽజ్ఞానం తే గచ్ఛ న్త్యేవంవిధా అపునరావృత్తి మపునర్దేహసంబంధం జ్ఞాననిర్ధూతకల్మషా యథోక్తేన జ్ఞానేన నిర్ధూతో నాశితః కల్మషః పాపాదిసంసారకారణదోషో యేషాం తే జ్ఞాననిర్ధూతకల్మషా యతయ ఇత్యర్థః. 17

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః. 18

టీ:—విద్యావినయసంపన్నే - విద్వాంసుఁడును వినీతుఁడునగు, బ్రాహ్మణే - బ్రాహ్మణునియందును, గవి - గోవునందును, హస్తిని - ఏనుఁగునందును, శునిచ- శునకసూకరాదులయందును, శ్వపాకేచ - చండాలాదులయందును, సమదర్శినః ఏవ - సమం ద్రష్టుం శీలం యేషాం తే - సమదర్శినః, సమమును జూచుట స్వభావముగాఁ గలవారలే, పండితాః - పండితులు. 18

తా:—ఈ గీతమున బండితలక్షణ మొకటి నిర్వచింపఁబడినది. అదెద్దియన: ఉత్తమోపాధులుగఁ దలంపఁబడు బ్రాహ్మణాదిదేహములందును, మధ్యమోపాధులగు గవాశ్వాది దేహములందును, నికృష్టోపాధులగు శ్వసూకర చండాలాది దేహములందును సమమును జూచు స్వభావము గలవాఁడు పండితుఁడని. ఉపాధులందు సమమును గనిపెట్టుట యన నేమిరో యొకింత విచారింపవలయును. ఉపాధులయందు సమమును గనిపెట్టుట యనుటలో సకలోపాధులు నధిష్ఠానముగాఁ గలిగిన సమమను పేరఁ బరగు నొకవస్తువును దెలిసికొనుట. ఇచట నుపాధు లాధారము, సమ మాధేయము. ఉపాధు లనేకములు, సమ మొక్కటియే. సకలోపాధులయందు బాహ్యదృష్టికిఁ దెలియఁబడనట్టియు పండితునిచేఁ దెలిసికొనబడవలసినట్టి యొకే వస్తువగు సమ మేమై యుండవలయును? శాస్త్రదృష్టిచే బోధింపఁబడు సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమగు బ్రహ్మము గావలయును గాని వేఱొండు గానేరదు. సమశబ్దమునకు బ్రహ్మశబ్దము పర్యాయపదమా? అట్టి బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగత భేద రహితమా? యను సందియము గలుగును. అట్టి సందేహమును శ్రీకృష్ణభగవానులే యుత్తరగీతమునందు "నిర్దోషంహి సమం బ్రహ్మ" యని కంఠోక్తిగ నిర్వచించియున్నారు. "నిర్దోషం = దోషరహితము. అనగా భేదరహితము, అనగా సజాతీయవిజాతీయ స్వగతభేదరహితమగు, బ్రహ్మ = శ్రుతిస్మృతి ప్రసిద్ధమగు పరమాత్మ, సమంహి = సమశబ్దవాచ్యముగదా!" ఇట్లీ గీతమున

యేషాం జ్ఞానేన నాశిత మాత్మనోఽజ్ఞానం తే పండితాః కథం తత్త్వం పశ్యన్తీత్యుచ్యతే విద్యేతి. విద్యావినయసంపన్నే విద్యాచ వినయశ్చ విద్యావినయౌ వినయ ఉపశమః, తాభ్యాం విద్యావినయాభ్యాం సంపన్నో విద్యావినయసంపన్నః విద్వాన్ వినీతశ్చ యో బ్రాహ్మణ స్తస్మిన్ బ్రాహ్మణే గవి హస్తిని శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః విద్యావినయసంపన్నే ఉత్తమసంస్కారవతి బ్రాహ్మణే సాత్త్వికే, మధ్యమాయాంచ రాజస్యాం గతిసంస్కారహీనాయాం

ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. 19

---

సమశబ్ద మాధేయమగు బ్రహ్మమును బోధించుచుండ నాధారములు నుపాధులు నగు శ్వసూకరచండాలాది దేహములను బ్రాహ్మణాది దేహములతోఁ దుల్యములుగాఁ జూడవలయునను నర్థమును గల్పించుట వంచకోక్తిగాని వేఱొండు గాదు. 18

టీ:– యేషాం - ఏ పండితులయొక్క, మనః - మనస్సు, సామ్యే - సమభావ మగు బ్రహ్మయందు, స్థితం - నిశ్చలభావముఁ బొందునో, తైః - అట్టి బ్రహ్మ ధర్శులచేత, ఇహైవ - ఈ లోకమునందే, అనఁగా జీవించియుండగనే, సర్గః - జన్మ, అనగా బంధము, జితః - జయింపఁబడినది. అనగా జీవించియుండగనే ముక్తి లభించునని యభిప్రాయము. సమం - సమమనునది. నిర్దోషం - నిర్గుణమగు, బ్రహ్మహి - బ్రహ్మమే, తస్మాత్ - ఆ కారణమువలన, తే - ఆ సమదర్శులగు పండితులు, బ్రహ్మణి - బ్రహ్మమందు, స్థితాః - ఉన్నవారలు. అనగా బ్రహ్మ భావము నొందినవారలు. 19

---

అత్యన్తమేవ కేవలతామసే హస్త్యాదౌచ, సత్త్వాదిగుణైస్తజ్జైశ్చ సంస్కారైస్తథా రాజసైస్తథా తామసైశ్చ సంస్కారై రత్యంతమే వాస్పృష్టం సమ మేక మవిక్రియం బ్రహ్మ ద్రష్టుం శీలం యేషాం తే పండితాః సమదర్శినః. 18

నన్వభోజ్యాన్నాస్తే దోషవంతః "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" (గౌతమస్మృతిః) ఇతిస్మృతేః న తే దోషవంతః. కథమ్ - ఇహైవేతి. ఇహైవ జీవద్భిరేవ తైస్సమదర్శిభిః పండితైర్జితో వశీకృత స్సర్గో జన్మ, యేషాం సామ్యే సర్వభూతేషు సమభావే, స్థితమ్ నిశ్చలీభూతం మనోఽంతఃకరణమ్ నిర్దోషం య ద్యపి దోషవత్సు శ్వపాకాదిషు మూఢై స్తద్దోషై ర్దోషవదివ విభావ్యతే, తథాపి తద్దోషై రస్పృష్టమితి; నిర్దోషం దోషవర్జితం హి యస్మాత్ నాపి స్వగుణభేదభిన్నం నిర్గుణత్వాచ్చైతన్యస్య; వక్ష్యతిచ భగవా నిచ్ఛాదీనాం క్షేత్రధర్మత్వం "అనాదిత్వాన్నిర్గుణత్వాత్" (గీ. 13.31) ఇతిచ, నాప్యన్త్యావిశేషా ఆత్మనో భేదకాః సన్తి ప్రతిశరీరం తేషాం సత్త్వే ప్రమాణానుపపత్తేః; అత స్సమం బ్రహ్మైకంచ; తస్మా ద్బ్రహ్మణ్యేవ తే స్థితాః తస్మా న్న దోషగంధమాత్రమపి తాన్ స్పృశతి దేహాది సంఘాతాత్మదర్శనాభిమానాభావా త్తేషాం; దేహాదిసంఘాతాత్మదర్శనాభిమాన వద్విషయంతు తత్సూత్రం "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" (గౌతమస్మృతిః) ఇతి పూజావిషయత్వవిశేషణాత్; దృశ్యతేహి బ్రహ్మవిత్ షడంగవి

న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. 20

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

---

టీ:—స్థిరబుద్ధిః - సమము నిర్దోషమగు నాత్మయని సంశయరహితమగు బుద్ధి గల్గినట్టియు, అసమ్మూఢః - వ్యామోహరహితుఁ డైనట్టియు, బ్రహ్మణి - బ్రహ్మమందు, అనగా బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁ డైనట్టియు, బ్రహ్మవిత్ - సర్వకర్తృత్వతాశూన్యుఁడును గృతకృత్యుఁడును నగు సర్వకర్మసంన్యాసి, ప్రియం - ఇష్టమును, ప్రాప్య - పొంది, నప్రహృష్యేత్ - హర్షమును జెందఁడు. అప్రియంచ - అనిష్టమును, ప్రాప్య - పొంది, న ఉద్విజేత్ - విషాదమును జెందఁడు. 20

టీ:—బాహ్యస్పర్శేషు - బాహ్యవిషయములగు శబ్దస్పర్శాదులయందు, అసక్తాత్మా - లగ్నముకాని యంతఃకరణము గలవాఁడు. అనఁగా విషయములందుఁ బ్రీతిలేనివాఁడు, ఆత్మని - స్వస్వరూపమందు, యత్ - ఎట్టి, సుఖం - ఆనందమును, విందతి - పొందుచున్నాడో, సః - ఆ, బ్రహ్మయోగనిష్ఠాత్మా - బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడు, తత్ - అట్టి, సుఖం - ఆనందమును, అక్షయం - నాశము లేనిదిగా ననగా శాశ్వతమైనదిగా, అశ్నుతే - అనుభవించును. 21

---

చ్చతుర్వేదవిదితి పూజాదానాదౌ గుణవిశేష సంబంధః కారణమ్ బ్రహ్మతు సర్వగుణదోషసంబంధవర్జిత మిత్యతో బ్రహ్మణి తే స్థితా ఇతియుక్తమ్, కర్మ విషయంచ "సమాసమాభ్యాం" (గౌతమస్మృతిః) ఇత్యాది, ఇదంతు సర్వకర్మసంన్యాసవిషయం ప్రస్తుతం "సర్వకర్మాణి మనసా" (గీ.5-13) ఇత్యారభ్య ఆ అధ్యాయపరిసమాప్తేః 19

యస్మా న్నిర్దోషం సమం బ్రహ్మ ఆత్మా తస్మాత్ - నప్రహృష్యేదితి. న ప్రహృష్యేత్ నప్రహర్షం కుర్యాత్, ప్రియ మిష్టం ప్రాప్య లబ్ధ్వా నోద్విజేత్ప్రాప్య చాప్రియ మనిష్టం లబ్ధ్వా దేహమాత్రాత్మదర్శినాంహి ప్రియాప్రియప్రాప్తీ హర్షవిషాదస్థానే న కేవలాత్మదర్శినః, తస్య ప్రియాప్రియప్రాప్త్యసంభవాత్; కించ సర్వభూతే ష్వేక స్సమో నిర్దోష ఆత్మేతి స్థిరా నిర్విచికిత్సా బుద్ధిర్యస్య స స్థిరబుద్ధి రసమ్మూఢః సమ్మోహవర్జితశ్చ స్యా ద్యథోక్తబ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితోఽకర్మకృ త్సర్వకర్మసంన్యాసీ ఇత్యర్థః. 20

కించ బ్రహ్మణి స్థితః బాహ్యేతి. బాహ్యస్పర్శేషు బాహ్యాశ్చ తే స్పర్శాశ్చ బాహ్యస్పర్శాః స్పృశ్యన్త ఇతిస్పర్శాః శబ్దాదయో విషయా స్తేషు బాహ్యస్పర్శేషు, అసక్త ఆత్మాఽన్తఃకరణం యస్య సోఽయ మసక్తాత్మా విషయేషు ప్రీతి

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌన్తేయ! న తేషు రమతే బుధః. 22

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః. 23

---

టీ:—యే - ఏ, భోగాః - సుఖములు, సంస్పర్శజాః హి - విషయేంద్రియసంబంధమువలనఁ గలుగుచున్నవో, తే - అట్టి భోగములు, ఆద్యంతవంతః - ఉత్పత్తివినాశములు గల్గియున్నవై, దుఃఖయోనయ ఏవ - దుఃఖహేతువులే. కౌంతేయ - అర్జునా! తేషు - అట్టి భోగములందు, బుధః - పండితుఁడు, న రమతే - ఎంతమాత్రమును బ్రీతిని జెందడు. ఈ గీతము రెండవయధ్యాయమునందలి పదునాలుగవ గీతమగు "మాత్రాస్పర్శాస్తు కౌంతేయ" యను గీతముయొక్క యనువాదము. 22

టీ:—యః నరః - ఏనరుఁడు, శరీరవిమోక్షణాత్ ప్రాక్ - దేహపాతమునకుఁ బూర్వము, కామక్రోధోద్భవం - కామక్రోధములవలనఁ బుట్టునట్టి, వేగం - తీవ్ర

---

వర్జితః స న్విందతి లభతే ఆత్మని యత్సుఖం తద్విందతీత్యేతత్ స బ్రహ్మయోగయుక్తాత్మా బ్రహ్మణి యోగ స్సమాధి ర్బ్రహ్మయోగ స్తేన బ్రహ్మయోగేన యుక్త స్సమాహిత స్తస్మిన్ వ్యాపృత ఆత్మా అంతఃకరణం యస్య స బ్రహ్మయోగయుక్తాత్మా, సుఖమక్షయ మశ్నుతే వ్యాప్నోతి; తస్మా ద్బాహ్యవిషయప్రీతేః క్షణికాయా ఇంద్రియాణి నివర్తయే దాత్మన్యక్షయసుఖార్థీత్యర్థః. 21

ఇతశ్చ నివర్తయేత్ యేహీతి. యేహి యస్మాత్సంస్పర్శజా విషయేంద్రియసంస్పర్శేభ్యో జాతా భోగా భుక్తయో దుఃఖయోనయఏవ తేఽవిద్యాకృతత్వాత్ దృశ్యన్తే హ్యాధ్యాత్మికాదీని దుఃఖాని తన్నిమిత్తాన్యేవ యథేహ లోకే తథాపరలోకేఽపీతి గమ్యత, ఏవశబ్దాత్. న సంసారే సుఖస్య గంధమాత్ర మప్యస్తీతి బుద్ధ్వా విషయమృగతృష్ణికాయా ఇంద్రియాణి నివర్తయేత్, న కేవలం దుఃఖయోనయఏవ ఆద్యంతవంతశ్చ ఆది ర్విషయేంద్రియసంయోగో భోగానా మంతశ్చ తద్వియోగఏవ, అత ఆద్యంతవంతోఽనిత్యా మధ్యక్షణభావిత్వా దిత్యర్థః, కౌంతేయ న తేషు భోగేషు రమతే బుధో వివేక్యవగతపరమార్థతత్త్వః, అత్యంతమూఢానామేవహి విషయేషు రతి ర్దృశ్యతే, యథాపశుప్రభృతీనామ్. 22

అయంచ శ్రేయోమార్గప్రతిపక్షీ కష్టతమో దోషః సర్వానర్థ ప్రాప్తిహేతు ర్దుర్నివార శ్చేతి తత్పరిహారే యత్నాధిక్యం కర్తవ్య మిత్యాహ భగవాన్ శక్నోతీతి. శక్నో త్యుత్సహత ఇహైవ జీవన్నేవ, యః సోఢుం ప్రసహితుం, ప్రాక్

యోఽంతః సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి. 24

---

తను, సోఢుం - నిగ్రహించుకొనుటకు, శక్నోతి - సమర్థుఁడగుచున్నాఁడో, సః-వాడు, ఇహ ఏవ - ఇక్కడనే అనఁగా జీవించియుండగనే, యుక్తః - బ్రహ్మభావమును బొందినవాఁడును, సః - వాఁడే, సుఖీ - సుఖవంతుఁడును. ఈ గీతము రెండవ యధ్యాయమున బదునైదవగీత మగు "యంహి న వ్యథయంత్యేతే" యను గీతమున కనువాదము. 23

టీ:—యః - ఎవఁడు, అంతస్సుఖః - అంతరాత్మయందే సుఖము గలవాఁడును, అంతరారామః - అంతరాత్మయందే క్రీడించువాఁడును, తథా - ఆతీరుననే, యః-ఎవఁడు, అంతర్జ్యోతిః ఏవ - అంతరాత్మయే ప్రకాశముగాఁ గలవాఁడు ననఁగా సర్వ పదార్థములను గనిపెట్టు సాక్షిస్వరూపము తానేయని గుర్తెఱింగినట్టివాఁడు నగుచున్నాఁడో, సః యోగీ - అట్టి యపరోక్షాత్మజ్ఞాని, బ్రహ్మభూతః - జీవించియుండగనే బ్రహ్మభావమును బొందినవాఁడై, బ్రహ్మనిర్వాణం - సర్వోపరమస్వరూపమగు మోక్షమును, అధిగచ్ఛతి - పొందుచున్నాఁడు. 24

---

పూర్వం శరీరవిమోక్షణాత్ ఆమరణా దిత్యర్థః. మరణసీమాకరణం జీవతోఽవశ్యం భావీ హి కామక్రోధోద్భవో వేగోఽనంతనిమిత్తవాన్ హి స ఇతి. యావన్మరణం తావ న్నవిస్రంభణీయ ఇత్యర్థః. కామ ఇంద్రియగోచరప్రాప్త ఇష్టే విషయే శ్రూయమాణే స్మర్యమాణేవాఽనుభూతే సుఖహేతౌ యా గర్ధి స్తృష్ణా స కామః క్రోధ శ్చాత్మనః ప్రతికూలేషు దుఃఖహేతుషు దృశ్యమానేషు స్మర్యమాణేషువా యో ద్వేష స్స క్రోధః తౌ కామక్రోధావుద్భవో యస్య వేగస్య స కామక్రోధోద్భవో వేగః, రోమాంచప్రహృష్టనేత్రవదనాదిలింగోఽన్తఃకరణప్రక్షోభ రూపః కామోద్భవో వేగః, గాత్రప్రకంప ప్రస్వేద సందష్టోష్ఠపుటరక్తనేత్రాదిలింగః క్రోధోద్భవో వేగః, తం కామక్రోధోద్భవం వేగం య ఉత్సహతే ప్రసహతే సోఢుం ప్రసహితుం స యుక్తో యోగీ సుఖీ చేహలోకే నరః. 23

కథంభూతశ్చ బ్రహ్మణి స్థితో బ్రహ్మ ప్రాప్నోతీ త్యాహ భగవాన్ య ఇతి. యోఽంతస్సుఖో అంతరాత్మని సుఖం యస్య సోఽంతస్సుఖ స్తథాఽన్త రేవాత్మన్యారామ ఆరమణ మాక్రీడా యస్య సోఽంతరారామ స్తథైవాంతరేవ ఆత్మన్యేవ జ్యోతిః ప్రకాశో యస్య సోఽన్తర్జ్యోతిరేవ య ఈదృశ స్స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మణి నిర్వృతిం మోక్ష మిహ జీవన్నేవ బ్రహ్మభూతస్స న్నధిగచ్ఛతి ప్రాప్నోతి. 24

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః. 25

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

---

టీ:—క్షీణకల్మషాః - సకలపాపములు నశించినట్టియు, ఛిన్నద్వైధాః - సంశయరహితులైనట్టియు, యతాత్మానః - ఇంద్రియనిగ్రహము గలిగినట్టియు, సర్వభూతహితే - సమస్తభూతములయొక్క యానుకూల్యమునందు, రతాః - ప్రీతి గల్గినట్టియు ననగా హింసావర్జితులైనట్టియు, ఋషయః - సమ్యగ్దర్శులగు సంన్యాసులు, బ్రహ్మనిర్వాణం - మోక్షమును, లభన్తే - పొందుదురు. 25

టీ:—కామక్రోధవియుక్తానాం - కామక్రోధరహితులగునట్టియును, యతచేతసాం - మనోనిగ్రహము గలిగినట్టియు, విదితాత్మనాం - అపరోక్షాత్మసాక్షాత్కారము గల్గినట్టియు, యతీనాం - సంన్యాసులకు, అభితః - అంతట ననఁగా దేహముతోఁ గూడినను లేకపోయినను, బ్రహ్మనిర్వాణం - మోక్షము, వర్తతే - సిద్ధమగుచున్నది. ఈ మూఁడు గీతములును, రెండవ యధ్యాయమునందలి "విహాయ కామాన్" "ఏషా బ్రాహ్మీ స్థితిః" అను డెబ్బదియొక్కటి, డెబ్బదిరెండు గీతముల యొక్క యనువాదములు. 26

---

కించ లభంతఇతి. లభన్తే బ్రహ్మనిర్వాణం మోక్ష మృషయః సమ్యగ్దర్శినః సంన్యాసినః, క్షీణకల్మషాః, క్షీణపాపాదిదోషాః ఛిన్నద్వైధా శ్ఛిన్నసంశయాః, యతాత్మానః సంయతేంద్రియాః, సర్వభూతహితే రతా స్సర్వేషాం భూతానాం హిత ఆనుకూల్యే రతా అహింసకా ఇత్యర్థః. 25

కించ కామేతి. కామక్రోధవియుక్తానాం, కామశ్చ క్రోధశ్చ కామక్రోధౌ, తాభ్యాం వియుక్తానాం యతీనాం సంన్యాసినాం యతచేతసాం సంయతాంతఃకరణానా మభిత ఉభయతో జీవతాం మృతానాంచ బ్రహ్మనిర్వాణం మోక్షో వర్తతే, విదితాత్మనాం విదితో జ్ఞాత ఆత్మా యేషాం తే విదితాత్మాన స్తేషాం విదితాత్మనాం సమ్యగ్దర్శినా మిత్యర్థః. 26

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. 27

యతేంద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః,
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః. 28

---

టీ:—బాహ్యాన్ - శ్రోత్రాదీంద్రియములచే గ్రహింపఁబడు, స్పర్శాన్ - శబ్దాదివిషయములను, బహిః కృత్వా - బాహ్యముననే యుంచి యనఁగా బుద్ధిచే వానిని జింతింపక, భ్రువోః అంతరే - భ్రూమధ్యస్థానమున ననఁగా నాజ్ఞాచక్రమున, చక్షుః చ - చక్షురింద్రియమును, కృత్వా - ఉంచి, తథా - ఆతీరుననే, నాసాభ్యన్తర చారిణౌ - నాసికారంధ్రములయందుఁ జలించునట్టి, ప్రాణాపానౌ - ప్రాణాపానము లనెడి వాయువృత్తులను, సమౌ - సమములుగా, కృత్వా - చేసి, విగతేచ్ఛాభయ క్రోధః - ఇచ్ఛాభయక్రోధవర్జితుఁ డైనట్టియు, యతేంద్రియమనోబుద్ధిః - మనో బుద్ధుల నిగ్రహించినట్టియు, మోక్షపరాయణః - బ్రహ్మనిష్ఠుఁ డైనట్టియు, మునిః- మననశీలుఁడగు సంన్యాసి, యః - ఎవఁడో, సః ఏవ - అట్టి సంన్యాసియే, సదా-ఎల్ల ప్పుడును, ముక్తఏవ - ముక్తుఁడే. ఇచట 'ఏవ'కారము కాకాక్షిన్యాయముచే తచ్ఛబ్ద ముక్తశబ్దములతో నన్వయించునది. ఈ రెండుగీతములయందు గూఢముగా నున్న విషయమంతయు నారవయధ్యాయమున బుష్కలముగ వివరింపఁబడుటచే నారవ యధ్యాయ మీ రెండుగీతముల వ్యాఖ్యానముగాఁ బరగుచున్నది. ఇంతియ కాదు. రెండవ యధ్యాయమున నరువదియొకటవ గీతమగు "తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః" అను గీతముయొక్క యనువాదము లీ రెండుగీతములును. ఈ రెండుగీతములచే నుపదేశింపఁబడు విషయము, ధ్యానయోగమని చెప్పబడుచున్నది. ఈ ధ్యానయోగము సమ్యగ్దర్శనమున కంతరంగసాధన మగుటచే సమ్యగ్దర్శన ప్రస్తావమగు నీ యధ్యాయమున సూత్రప్రాయముగా నుపదేశింపఁబడినది. 27-28.

---

సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం సద్యోముక్తి రుక్తా కర్మయోగ శ్చేశ్వరా ర్పితసర్వభావేన, ఈశ్వరే బ్రహ్మ ణ్యాధాయ క్రియమాణ స్సత్త్వశుద్ధి జ్ఞానప్రాప్తిసర్వ కర్మసంన్యాసక్రమేణ మోక్షాయేతి భగవా న్వదేపదేఽబ్రవీ ద్వక్ష్యతిచ. అథేదా నీం ధ్యానయోగం సమ్యగ్దర్శనస్యాంతరంగం విస్తరేణ వక్ష్యామీతి తస్య సూత్రస్థానీ యాన్ శ్లోకా నుపదిశతిస్మ- స్పర్శానితి. స్పర్శాన్ శబ్దాదీన్ కృత్వా బహి ర్బాహ్యాన్ శ్రోత్రాదిద్వారేణాంతర్బుద్ధౌ ప్రవేశితా శ్శబ్దాదయో విషయా స్తానచింతయతః శబ్దాదయో బాహ్యా బహిరేవకృతాభవంతి. తా నేవం బహిఃకృత్వా చక్షుశ్చైవాం తరే భ్రువోః కృత్వే త్యనుషజ్యతే. తథాప్రాణాపానౌ నాసాభ్యంతరచారిణౌ సమౌ

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి. 29

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
సంన్యాసయోగోనామ పంచమోఽధ్యాయః.

---

టీ:—(జ్ఞాని) యజ్ఞతపసాం - యజ్ఞములయొక్కయు తపస్సులయొక్కయు, భోక్తారం - కర్తృరూపముచేతను, దేవతారూపముచేతను భోక్తృభావమును జెందినట్టియు, సర్వలోక మహేశ్వరం - సమస్తలోకములకు నుత్తమమగు ప్రభువునైనట్టియు, సర్వభూతానాం - సమస్తభూతములకును, సుహృదం - హితకారియైనట్టియు మాం - నన్ను, జ్ఞాత్వా - పరమాత్మరూపునిగాఁ దెలిసికొని, శాంతిం - సర్వసంసారోపరతిరూప మగు ముక్తిని, ఋచ్ఛతి - పొందుచున్నాఁడు. ఈ గీతముయొక్కయర్థవిశేష మేడవయధ్యాయము మొదలు పదునెనిమిదవ యధ్యాయాంతముగల గీతలచే విస్తరింపఁబడుచున్నది. 29

ఇది శ్రీవిద్యాశంకరపదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్యస్వాములవారిచే రచింపఁబడిన
గీతామృతతరంగిణియందుఁ బంచమతరంగము.

---

కృత్వా యతేంద్రియమనోబుద్ధి ర్యతాని సంయతానీంద్రియాణి మనోబుద్ధిశ్చ యస్య స యతేంద్రియమనోబుద్ధిః, మననా న్మునిః సంన్యాసీ, మోక్షపరాయణ ఏవం దేహసంస్థానో మోక్షపరాయణో మోక్ష ఏవ పర మయనం పరాగతి ర్యస్య సోఽయం మోక్షపరాయణో ముని ర్భవేత్. విగతేచ్ఛాభయక్రోధ ఇచ్ఛాచ భయంచ క్రోధశ్చేచ్ఛాభయక్రోధా స్తే విగతా యస్మాత్స విగతేచ్ఛాభయక్రోధః య ఏవం వర్తతే సదా సంన్యాసీ ముక్తఏవ స న తస్య మోక్షోఽన్యః కర్తవ్యోఽస్తి. 27-28

ఏవం సమాహితచిత్తేన కింవిజ్ఞేయ మిత్యుచ్యతే - భోక్తారమితి. భోక్తారం యజ్ఞతపసాం యజ్ఞానాం తపసాంచ కర్తృరూపేణ దేవతారూపేణచ సర్వలోకమహేశ్వరం సర్వేషాం లోకానాం మహాంత మీశ్వరం సుహృదం సర్వభూతానాం సర్వప్రాణినాం ప్రత్యుపకారనిరపేక్షత యోపకారిణం సర్వభూతానాం హృదయేశయం సర్వకర్మఫలాధ్యక్షం సర్వప్రత్యయసాక్షిణం మాం నారాయణం జ్ఞాత్వా శాంతిం సర్వసంసారోపరతి మృచ్ఛతి ప్రాప్నోతి. 29

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్యపాద
శిష్యస్య శ్రీమచ్ఛంకర భగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
సంన్యాసయోగో నామ పంచమోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## షష్ఠోఽధ్యాయః

శ్రీభగవానువాచ—

> అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
> స సంన్యాసీచ యోగీచ న నిరగ్ని ర్న చాక్రియః. 1

---

టీ:—యః - ఎవఁడు, కర్మఫలం - కర్మలయొక్క ఫలమును, అనాశ్రితః - ఆశ్రయింపనివాఁడై యనగా ఫలాభిసంధిరహితముగా, కార్యం - శ్రుతిస్మృతులచే నవశ్యకర్తవ్యముగా విధింపఁబడిన, కర్మ - నిత్యనైమిత్తికరూపమగు నగ్నిహోత్రాదులను, కరోతి - ఆచరించునో, సః - అట్టివాఁడు, సంన్యాసీచ - సంన్యాసియును,

---

అతీతానంతరాధ్యాయాన్తే ధ్యానయోగస్య సమ్యగ్దర్శనం ప్రత్యంతరంగస్య సూత్రభూతాః శ్లోకాః "స్పర్శాన్ కృత్వా బహిః" (గీ 5. 27) ఇత్యాదయ ఉపదిష్టాః తేషాం వృత్తిస్థానీయోఽయం షష్ఠోఽధ్యాయ ఆరభ్యతే. తత్ర ధ్యానయోగస్య బహిరంగం కర్మేతి యావద్ధ్యానయోగారోహణాసమర్థ స్తావద్గృహస్థేనాధికృతేన కర్తవ్యం కర్మ ఇత్యత స్తత్ స్తౌతి.

నను కిమర్థం ధ్యానయోగారోహణసీమాకరణం యావతాఽనుష్ఠేయమేవ విహితం కర్మ యావజ్జీవమ్ న, "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" (గీ. 6-3) ఇతి విశేషణా దారూఢస్య చ శమేనైవ సంబంధకారణాత్. ఆరురుక్షో రారూఢస్యచ శమః కర్మ చోభయం కర్తవ్యత్వే నాభిప్రేతం చే త్స్యాత్తదాఽఽరురుక్షో రారూఢస్యచేతి శమకర్మవిషయభేదేన విశేషణం విభాగకరణం చానర్థకం స్యాత్.

తత్రాశ్రమిణాం కశ్చి ద్యోగ మారురుక్షు ర్భవతి, ఆరూఢశ్చ కశ్చిత్, అన్యే నారురుక్షవో నచారూఢా స్తా నపేక్ష్య "ఆరురుక్షోః" "ఆరూఢస్యచే" తి విశేషణ విభాగకరణం చోపపద్యత ఏవేతి చే న్న, "తస్యైవే"తి వచనాత్, పునర్యోగ గ్రహ

యోగీచ - యోగియును, నిరగ్నిః - అగ్నిహోత్రములు లేనివాఁడు, న - కాఁడు, అక్రియశ్చ - క్రియాశూన్యుఁడును, న - కాఁడు.

తా:—సంన్యాసి యన సకలకర్మలను గర్మసాధనములగు నగ్నిహోత్రాదులను బుష్కలముగ ద్యజించినవాఁడు. ప్రకృత ముద్దేశింపఁబడినపురుషుఁడు కర్మలను దత్సాధనములగు నగ్నిహోత్రాదులను విడువక కర్మఫలమును మాత్ర మభిలషింపక గర్మల నాచరించువాఁడుగ నున్నాఁడు. ఫలముల నభిలషింపక కర్మల నాచరించువానికిఁ గర్మలఁ ద్యజించిన సంన్యాసికి వలె గర్మము ఫలప్రాపక మగు బంధహేతువు గానేఱదు. కావున నట్టి కర్మయోగి గౌణముగ సంన్యాసి యని చెప్పఁబడుచున్నాఁడు. అనఁగా సంన్యాసితుల్యుఁడని యాశయము. కర్మసాధనములగు నగ్నిహోత్రాదులను గల్గి కర్మల నాచరించుటచే నీకర్మయోగి సంన్యాసి వలె నిరగ్నియు నిష్క్రియుఁడు నెంతమాత్రము గాఁడని యుత్తరార్ధ పరమతాత్పర్యము.

---

ణాచ్చ 'యోగారూఢస్యే'తి య ఆసీత్పూర్వం యోగ మారురుక్షు స్తస్యైవారూఢస్య శమ ఏవ కర్తవ్య కారణం యోగఫలం ప్రత్యుచ్యత ఇతి. అతో న యావజ్జీవం కర్తవ్యత్వప్రాప్తిః కస్యచిదపి కర్మణః యోగవిభ్రష్టవచనాచ్చ గృహస్థస్య చేత్కర్మిణో యోగో విహితః షష్ఠేఽధ్యాయే, స యోగవిభ్రష్టోఽపి కర్మగతిం కర్మఫలం ప్రాప్నోతీతి తస్య నాశాశంకాఽనుపపన్నా స్యాత్. అవశ్యంహి కృతం కర్మ కామ్యం నిత్యంవా మోక్షస్య నిత్యత్వా దనారభ్యత్వే స్వం ఫల మారభత ఏవ నిత్యస్య చ కర్మణో వేదప్రమాణావబుద్ధత్వా త్ఫలేన భవితవ్య మిత్యవోచామ, అన్యథా వేదస్యానర్థక్యప్రసంగా దితి; నచ కర్మణి సత్యుభయ విభ్రష్టవచన మర్థవ త్కర్మణో విభ్రంశకారణానుపపత్తేః.

కర్మ కృత మీశ్వరే సంన్యస్యే త్యతః కర్తరి కర్మఫలం నారభత ఇతిచేత్, న, ఈశ్వరే సంన్యాస స్యాధికతరఫలహేతుత్వోపపత్తేః మోక్షాయైవేతిచే త్స్వకర్మణాం కృతానా మీశ్వరే న్యాసో మోక్షాయైవ న ఫలాంతరాయ యోగసహితః, యోగాచ్చ విభ్రష్టః, ఇత్యత స్తంప్రతి నాశశంకా యుక్తైవేతి చేన్న, "ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః" (గీ. 6-10) "బ్రహ్మచారి వ్రతే స్థితః" (గీ. 6-14) ఇతి కర్మసంన్యాసవిధానాత్. నచాత్ర ధ్యానకాలే స్త్రీసహాయత్వాశంకా యేనైకాకిత్వం విధీయతే, నచ గృహస్థస్య "నిరాశీ రపరిగ్రహః" ఇత్యాదివచన మనుకూలమ్, ఉభయవిభ్రష్ట ప్రశ్నానుపపత్తేశ్చ.

అయిదవ యధ్యాయాంతమున "స్పర్శాన్ కృత్వా" "యతేంద్రియమనో బుద్ధిః" యను గీతములచే సమ్యగ్దర్శనమును గూర్చి ధ్యానయోగ మంతరంగసాధన ముగా సూచింపఁబడియె. అట్టి ధ్యానయోగ మీ యధ్యాయమున వివరించు నుద్దేశముతో ధ్యానయోగమునకు బహిరంగసాధనము కర్మయోగమనియు నట్టి ధ్యానయోగమునం దధికారమును బొందువఱ కధికారము గల గృహస్థునిచేఁ గర్మయోగ మాచరింపఁ బడవలయు నను నాశయముమీఁఁ గర్మయోగ మిచట గొనియాడఁబడుచున్నది. కర్మయోగమువలనఁ జిత్తశుద్ధి, చిత్తశుద్ధివలన ధ్యానయోగము ధ్యానయోగమువలన జ్ఞానప్రాప్తి జ్ఞానమువలన సమ్యగ్దర్శనరూప మగు సంన్యాసమును గలుగు గావున గర్మయోగానుష్ఠాత భావిఫలము నుద్దేశించి సంన్యాసి యని యీ గీతమున స్తవము చేయఁబడుచున్నాఁడు. 1

---

అనాశ్రిత ఇత్యనేన కర్మిణఏవ సంన్యాసిత్వం యోగిత్వం చోక్తం, ప్రసిద్ధంచ నిరగ్నే రక్రియస్యచ సంన్యాసిత్వం యోగిత్వం చేతిచేత్, న, ధ్యానయోగం ప్రతి బహిరంగస్య సతః కర్మణః ఫలాకాంక్షా సంన్యాసస్తుతిపరత్వాత్; న కేవలం నిరగ్నిరక్రియఏవ సంన్యాసీ యోగీచ. కింతర్హి కర్మ్యపి కర్మఫలాసంగం సంన్యస్య కర్మయోగ మనుతిష్ఠన్ సత్త్వశుద్ధ్యర్థం "స సంన్యాసీచ యోగీచ" భవతీతి స్తూయతే. నచైకేన వాక్యేనకర్మఫలాసంగసంన్యాసస్తుతి శ్చతుర్థాశ్రమప్రతిషేధ శ్చోపపద్యతే నచ ప్రసిద్ధం నిరగ్నే రక్రియస్య పరమార్థసంన్యాసినః శ్రుతిస్మృతిపురాణేతిహాస యోగశాస్త్రేషు విహితం సంన్యాసిత్వం యోగిత్వంచ ప్రతిషేధతి భగవాన్ స్వవచనవిరోధాచ్చ "సర్వకర్మాణి మనసా సంన్యస్య ...నైవ కుర్వ న్నకారయ న్నాస్తే" (గీ. 5-13) "మౌనీ సంతుష్టో యేన కేనచి దనికేతః స్థిరమతిః" (గీ. 12-19) "విహాయ కామాన్యః సర్వా న్పుమాం శ్చరతి నిస్పృహః" (గీ.2-71) "సర్వారంభ పరిత్యాగీ" (గీ. 12-14). ఇతిచ తత్ర తత్ర భగవతా స్వవచనాని దర్శితాని, తై ర్విరుధ్యేత చతుర్థాశ్రమప్రతిషేధః. తస్మా న్మునే ర్యోగ మారురుక్షోః ప్రతిపన్న గార్హస్థ్యస్యా గ్నిహోత్రాదికర్మ ఫలనిరపేక్ష మనుష్ఠీయమానం ధ్యానయోగారోహణసాధనత్వం సత్త్వశుద్ధిద్వారేణ ప్రతిపద్యతఇతి "ససంన్యాసీచ యోగీచే" తి స్తూయతే. అనాశ్రితేతి - అనాశ్రితో న ఆశ్రితో ఽనాశ్రితః. కిమ్, కర్మఫలం కర్మణఃఫలం కర్మఫలం యత్త దనాశ్రితః కర్మఫలతృష్ణారహిత ఇత్యర్థః యోహి కర్మఫలతృష్ణావాన్ సకర్మఫల మాశ్రితో భవతి, అయంతు తద్విప

యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసంన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. 2

టీ:—యం - ఏ ఫలాభిసంధిరహిత మగు కర్మానుష్ఠానమును, యోగం ఇతి - యోగమని, ప్రాహుః - శ్రుతిస్మృతివిదులు చెప్పుచున్నారో, తం - అట్టి కర్మయోగమును, పాండవ ! — అర్జునా ! సంన్యాసం - పరమార్థసంన్యాసముగా, విద్ధి - తెలిసికొనుము. హి - ఏ కారణముచే, అసంన్యస్త సంకల్పః - ఫలాభిసంధిని విడువని, కశ్చన - ఎవఁడును, యోగీ - చిత్తసమాధానము కలవాఁడు, న భవతి - కానేరఁడు. 2

తా:—ఇచట కర్మానుష్ఠాత యగు కర్మయోగిని సర్వకర్మత్యాగి యగు సంన్యాసితో సరిపోల్చుటకుఁ గల సాదృశ్యము ఫలత్యాగమాత్రముచేతనే యని చెప్పుటచేఁ బూర్వగీతార్థానువాదమే యీ గీతము. 2

రీతో ఽతో ఽనాశ్రితః కర్మఫలమ్, ఏవంభూతస్సన్ కార్యం కర్తవ్యం నిత్యం కామ్యవిపరీత మగ్నిహోత్రాదికం కర్మ కరోతి నిర్వర్తయతి, యః కశ్చిదీదృశః కర్మీ స కర్మ్యంతరేభ్యో విశిష్యత ఇత్యేవ మర్థ మాహ. "స సంన్యాసీచ యోగీచేతి. సంన్యాసః పరిత్యాగః స యస్యాస్తి స సంన్యాసీచ యోగీచ, యోగ శ్చిత్తసమాధానం స యస్యాస్తి స యోగీచ ఇత్యేవం గుణసంపన్నో ఽయం మంతవ్యో న కేవలం నిరగ్ని రక్రియఏవ సంన్యాసీ యోగీచేతి మంతవ్యః, నిర్గతా అగ్నయః కర్మాంగభూతాః యస్మాత్స నిరగ్నిః, అక్రియ శ్చానగ్నిసాధనా అపి అవిద్యమానాః క్రియా స్తపోదానాదికా యస్యాసా వక్రియః. 1

ననుచ నిరగ్నే రక్రియస్యైవ శ్రుతిస్మృతియోగశాస్త్రేషు సంన్యాసిత్వం యోగిత్వంచ ప్రసిద్ధమ్, కథ మిహ సాగ్నేః సక్రియస్యచ సంన్యాసిత్వం యోగిత్వం చాప్రసిద్ధ ముచ్యతఇతి, నైష దోషః కయాచి ద్గుణవృత్త్యోభయస్య సంపిపాదయిషితత్వాత్. తత్కథం కర్మఫలసంకల్పసంన్యాసా త్సంన్యాసిత్వం యోగాంగత్వేన చ కర్మానుష్ఠానా త్కర్మఫలసంకల్పస్య చ చిత్తవిక్షేపహేతోః పరిత్యాగా ద్యోగిత్వంచేతి గౌణ ముభయం. న పున ర్ముఖ్యం సంన్యాసిత్వం యోగిత్వం చాభిప్రేత మిత్యేతమర్థం దర్శయితు మాహ — యమితి. యం సర్వకర్మ తత్ఫలపరిత్యాగ లక్షణం పరమార్థసంన్యాసమితి ప్రాహుః శ్రుతిస్మృతివిదః; యోగం కర్మానుష్ఠానలక్షణం తం పరమార్థసంన్యాసం విద్ధి జానీహి, హేపాండవ! కర్మయోగస్య ప్రవృత్తిలక్షణస్య తద్విపరీతేన నివృత్తిలక్షణేన పరమార్థసంన్యాసేన కీదృశం సామాన్య మంగీకృత్య తద్భావ ఉచ్యత ఇత్యపేక్షాయా మిద ముచ్యతే; అస్తిహి పరమార్థ

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.        3

---

టీ:—యోగం - ధ్యానయోగమును, ఆరురుక్షోః - పొందఁదలఁచినట్టి, మునేః - కర్మఫలసంన్యాసికి, కర్మ - నిష్కామకర్మానుష్ఠానము, కారణం - సాధన మని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. యోగారూఢస్య - ధ్యానయోగమును బొందినట్టి, తస్యైవ - నిష్కామకర్మానుష్ఠాతకే, శమః - ఉపశమము అన సర్వ కర్మలవలన నివృత్తి, కారణం - సాధన మని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. 3

తా:—ధ్యానయోగమును బొందదలఁచి యద్దానిని బొందుటకు సామర్థ్యము లేనివానికిఁ గర్మానుష్ఠాన మవశ్యకర్తవ్యము. ధ్యానయోగమును బ్రారంభించుట కధికారము నిష్కామకర్మానుష్ఠానముచేఁ గల్గును. కర్మానుష్ఠానముచే ధ్యాన యోగాధికారమును బొందినవారు ధ్యానయోగమును బ్రారంభించుటకు శమమును సాధనముగా గ్రహింపవలయును. శమమనగా సర్వకర్మసంన్యాసము. ఆరురుక్షు

---

సంన్యాసేన సాదృశ్యం కర్తృద్వారకం కర్మయోగస్య. యోహి పరమార్థసం న్యాసీ స త్యక్తకర్మసాధనతయా సర్వకర్మతత్ఫలవిషయం సంకల్పం ప్రవృత్తి హేతుకామకారణం సంన్యస్యతి. అయమపి కర్మయోగీ కర్మ కుర్వాణఏవ ఫల విషయం సంకల్పం సంన్యస్యతీ త్యేత మర్థం దర్శయ న్నాహ. నహి యస్మా దసం న్యస్తసంకల్పో ఽసంన్యస్తోఽపరిత్యక్తః ఫలవిషయ స్సంకల్పోఽభిసంధి ర్యేన సోఽ సంన్యస్తసంకల్పః కశ్చన కశ్చిదపి కర్మీ యోగీ సమాధానవా న్భవతి న సంభవతీ త్యర్థః, ఫలసంకల్పస్య చిత్తవిక్షేప హేతుత్వాత్ ; తస్మాద్యః కశ్చన కర్మీ సంన్యస్తఫల సంకల్పో భవేత్స యోగీ సమాధానవా నవిక్షిప్తచిత్తో భవే చ్చిత్తవిక్షేపహేతోః ఫలసంకల్పస్య సంన్యస్తత్వా దిత్యభిప్రాయః. 2

ఏవం పరమార్థసంన్యాసకర్మయోగయోః కర్తృద్వారకం సంన్యాససామాన్య మపేక్ష్య "యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ!" ఇతి కర్మ యోగస్య స్తుత్యర్థం సంన్యాసత్వ ముక్తమ్, ధ్యానయోగస్య ఫలనిరపేక్షః కర్మ యోగో బహిరంగం సాధనమితి తం సంన్యాసత్వేన స్తుత్వాఽధునా కర్మయో గస్య ధ్యానయోగసాధనత్వం దర్శయతి ఆరురుక్షోరితి. ఆరురుక్షో రారోఢు మిచ్ఛతోఽనారూఢస్య ధ్యానయోగేఽవస్థాతు మశక్తస్యైవేత్యర్థః. తస్యారురుక్షో ర్మునేః కర్మఫలసంన్యాసిన ఇత్యర్థః, కిమారురుక్షోః యోగమ్ కర్మకారణం సాధన ముచ్యతే యోగారూఢస్య పున స్తస్యైవ శమ ఉపశమః సర్వకర్మభ్యో నివృత్తిః కారణం యోగారూఢత్వస్య సాధన ముచ్యత ఇత్యర్థః, యావ ద్యావత్కర్మభ్య

యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

---

నకు నిష్కామకర్మానుష్ఠాన మెట్లవశ్యకర్తవ్యమో యట్లే యోగారూఢునకు సర్వకర్మసంన్యాస మవశ్యకర్తవ్య మని, కర్మయోగకర్మసంన్యాసము లవస్థాభేదముచే నేకకర్తృకము లని భగవదాశయము. 3

టీ:—సర్వసంకల్పసంన్యాసీ - ఐహికాముష్మికఫలహేతువు లగు సకలసంకల్పములను విడచిన యారురుక్షువు అనఁగా నిష్కామకర్మానుష్ఠాత, యదా - ఎప్పుడు, ఇంద్రియార్థేషు - శబ్దాదివిషయములయందు, నానుషజ్జతే - ఆసక్తుఁడు గాఁడో, కర్మసు - నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధకర్మలయందును, నానుషజ్జతే - చేయవలయునను నభినివేశమును జెందఁడో, తదా - అప్పుడే, యోగారూఢః - యోగారూఢుఁడని అనఁగా సర్వకర్మసంన్యాసమున కధికారి యని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నాఁడు. 4

తా:—ఈ గీతముచే సర్వకర్మ సంన్యాసమునకు యుక్తమగు తరుణ ముపదేశింపఁబడుచున్నది. అట్టి స్థితియందే యేద్విజుఁడైనను సర్వకర్మసంన్యాసము చేసి ధ్యానయోగము నాశ్రయించుటకు నర్హుఁడని తెలియవచ్చుచున్నది. 4

---

ఉపరమతే తావత్తావ న్నిరాయాసస్య జితేంద్రియస్య చిత్తం సమాధీయతే; తథాసతి స ఝడితి యోగారూఢో భవతి; తథాచోక్తం వ్యాసేన "నైతాదృశం బ్రాహ్మణ స్యాస్తి విత్తం, యథైకతా సమతా సత్యతాచ, శీలం స్థితి ర్దండనిధాన మార్జవం, తత స్తత శ్చోపరమః క్రియాభ్యః" (మ.భా.శాం. 175-37) ఇతి. 3

అథేదానీం కదా యోగారూఢో భవతీత్యుచ్యతే - యదేతి. యదా సమాధీయమానచిత్తో యోగీహి, ఇంద్రియార్థే ష్వింద్రియాణా మర్థాః శబ్దాదయ స్తేష్వింద్రియార్థేషు కర్మసు చ నిత్యనైమిత్తికకామ్యప్రతిషిద్ధేషు ప్రయోజనాభావబుద్ధ్యా నానుషజ్జతే ఒనుషంగం కర్తవ్యతాబుద్ధిం న కరోతీత్యర్థః; సర్వసంకల్పసంన్యాసీ, సర్వాన్ సంకల్పాన్, ఇహాముత్రార్థకామహేతూన్ సంన్యసితుం శీలమస్యేతి సర్వసంకల్పసంన్యాసీ, యోగారూఢః ప్రాప్తయోగ ఇత్యేతత్, తదా తస్మిన్కాల ఉచ్యతే, సర్వసంకల్పసంన్యాసీతివచనా త్సర్వాంశ్చ కామాన్ సర్వాణిచ కర్మాణి సంన్యస్యే దిత్యర్థః; సంకల్పమూలాహి సర్వే కామాః "సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః" (మను. 2. 3)" "కామ జానామి తే మూలం సంకల్పా త్త్వంహి జాయసే, న త్వాం సంకల్పయిష్యామి తేన మే నభవిష్యసి." (మ.భా. శాం.177-25) ఇత్యాదిస్మృతేః; సర్వకామపరిత్యాగేచ సర్వకర్మసంన్యాస

ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. 5

---

టీ:-ఆత్మనా - స్వీయప్రయత్నముచేత, ఆత్మానం - తన్ను, ఉద్ధరేత్ - సంసారసాగరమునుండి పైకి లేవనెత్తుకొనవలయును. ఆత్మానం - తన్ను, న అవసాదయేత్ - క్రిందికి ద్రోసికొనఁగూడదు. ఆత్మనః - తనకు, ఆత్మైవ - తానే, బంధుః - బంధువు, ఆత్మనః - తనకు, ఆత్మా ఏవ - తానే, రిపుః హి - శత్రువును గదా! 5

తా:-ప్రతిమనుష్యుడును దాను బాగుపడుటకుగాని చెడుటకుగాని కారణము తానే యని జెప్పఁబడుచున్నాఁడు. తనకు మంచి చేయఁగల వేఱొక హితుఁడు గాని, యనర్థము నొనర్చు వేఱొక యహితుఁడు గాని లేఁడనుటచేఁ గర్తవ్యతాఽకర్తవ్యతలయందు ప్రతిమానవునకుఁ గర్తృత్వము గల దనియు విహితప్రతిషిద్ధాచరణమునందుఁ బారతంత్ర్య మెంతమాత్రము లేదనియు నీ గీతముచేఁ జెప్పఁబడుచున్నది. తనకుఁ దానే బంధువుగను, దనకుఁ దానే శత్రువుగ నెట్లగుననునది యుత్తరగీతమునందుఁ జెప్పఁబడుచున్నది. 5

---

స్సిద్ధో భవతి, "స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే" (బృ. 4.4.5) ఇత్యాది శ్రుతిభ్యః "యద్యద్ధి కురుతే కర్మ త త్తత్కామస్య చేష్టితమ్" (మను. 2.4) ఇత్యాది స్మృతిభ్యశ్చ, న్యాయాచ్చ, నహి సర్వసంకల్ప సంన్యాసే కశ్చిత్ స్పందితుమపి శక్తః తస్మా త్సర్వసంకల్ప సంన్యాసీతి వచనా త్సర్వాన్ కామాన్ సర్వాణి చ కర్మాణి చ త్యాజయతి భగవాన్. 4

యదైవం యోగారూఢ స్తదా తేనాత్మా ఆత్మనా ఉద్ధృతో భవతి సంసారా దనర్థజాతాత్ అతః ఉద్ధరేదితి.ఉద్ధరేత్సంసారసాగరే నిమగ్నమాత్మనాఽఽత్మానం తతఉద్ధ్వం హరే దుద్ధరేత్, యోగారూఢతా మాపాదయే దిత్యర్థః; నాత్మాన మవసాదయేత్, నాఽధో నయే న్నాఽధో గమయేత్, ఆత్మైవహి యస్మా దాత్మనో బంధుః నహ్యన్యః కశ్చి ద్బంధు ర్య స్సంసారముక్తయే భవతి; బంధు రపి తావ న్మోక్షంప్రతి ప్రతికూల ఏవ స్నేహాదిబంధనాయతనత్వాత్; తస్మా ద్యుక్తమవధారణ మాత్మైవ హ్యాత్మనో బంధురితి ఆత్మైవ రిపుః శత్రుః యోఽన్యో ఽపకారీ బాహ్యః శత్రుః సోఽప్యాత్మప్రయుక్త ఏవేతి యుక్తమేవావధారణ మాత్మైవ రిపు రాత్మన ఇతి. 5

బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. 6

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

---

టీ:—యేన - ఏ యాత్మచే, ఆత్మా - దేహేంద్రియసంఘాతము, జితః - జయింపఁబడినదో యనఁగా నిగ్రహింపఁబడినదో, తస్య - అట్టి జితేంద్రియుఁడగు, ఆత్మనః - ఆత్మకు, ఆత్మా - దేహేంద్రియసంఘాతము, బంధుః - బంధువు, అనాత్మనః తు - ఇంద్రియనిగ్రహము లేనివానికన్ననో, ఆత్మా ఏవ - దేహేంద్రియ సంఘాతమే, శత్రువత్ - శత్రువువలె, శత్రుత్వే - శత్రుభావమునందు, వర్తేత - ఉండేని. 6

తా:—దేహేంద్రియసంఘాత మెవ్వనిచే స్వాధీనము చేసికొనఁబడుచున్నదో యట్టి వానికి దేహేన్ద్రియసంఘాతము జ్ఞానసాధన మగుచు పరమార్థహేతు వగుననియు, లేనిచో ననర్థహేతు వగునని భావము. 6

టీ:—జితాత్మనః - దేహేంద్రియసంఘాతమును స్వాధీనము చేసికొనినట్టియు, ప్రశాంతస్య- నిర్మలమగు నంతఃకరణము గలిగినట్టియు సంన్యాసియొక్క, పరమాత్మా - పరమాత్మ, శీతోష్ణసుఖదుఃఖేషు - శీతోష్ణాదిద్వంద్వములయందును, తథా - ఆ తీరుననే, మానావమానయోః - పూజాపరిభవాదులయందును, సమాహితః - నిర్వికార చిన్మాత్రభావముతో నుండును. 7

---

ఆత్మైవ బంధు రాత్మైవ రిపు రాత్మన ఇత్యుక్తమ్ తత్ర కింలక్షణ ఆత్మనో బంధుః కింలక్షణోవా ఽఽత్మనో రిపు రిత్యుచ్యతే బంధురితి. బంధు రాత్మాఽఽత్మన స్తస్య, తస్యాత్మన స్స ఆత్మా బంధుర్యేనాత్మనాఽఽత్మైవ జితః, ఆత్మా కార్యకరణసంఘాతో యేన వశీకృతో జితేంద్రియ ఇత్యర్థః. అనాత్మన స్త్వజితాత్మనస్తు శత్రుత్వే శత్రుభావే వర్తేతాత్మైవ శత్రువత్ యథాఽనాత్మా శత్రు రాత్మనోఽపకారీ తథాఽఽత్మానాత్మనోఽపకారే వర్తేతేత్యర్థః. 6

జితాత్మనఇతి. జితాత్మనః కార్యకరణసంఘాత ఆత్మా జితో యేన స జితాత్మా తస్య జితాత్మనః, ప్రశాంతస్య ప్రసన్నాంతఃకరణస్య సతః సంన్యాసినః పరమాత్మా సమాహితః సాక్షా దాత్మభావేన వర్తత ఇత్యర్థః; కించ శీతోష్ణసుఖదుఃఖేషు తథామానేఽపమానేచ మానాపమానయోః పూజాపరిభవయోః. 7

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు,
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. 9

---

టీ:— జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా - శాస్త్రజ్ఞానముచేతను ననుభవజ్ఞానముచేతను దృప్తినొందిన యంతఃకరణము గలిగినట్టియు, విజితేంద్రియః - ఇంద్రియనిగ్రహము గలిగినట్టియు, సమలోష్టాశ్మకాంచనః - మట్టి బెల్లునందును రాతియందును సువర్ణము నందును సమభావము గలిగినట్టియు, ననఁగా నుపాధులయందలి వైచిత్ర్యముచే వ్యవహారమునందుఁ దెలియవచ్చెడి న్యూనాధికభావములను సరకుఁగొననట్టియు, కూటస్థః - నిర్వికారుఁడైనట్టియు, యుక్తః - చిత్తసమాధానము గల సంన్యాసి, యోగీ ఇతి - యోగి యని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నాఁడు. 8

టీః— సుహృత్ - ప్రత్యుపకారము నపేక్షింపక యుపకృతినొనర్చువాఁడు, మిత్ర - స్నేహితుఁడు, అరి - శత్రువు, ఉదాసీన - తటస్థుఁడు, మధ్యస్థ - వాది ప్రతివాదులకు హితమును జెప్పువాఁడు, ద్వేష్య - తన కప్రియుఁడు, బంధు - సంబంధి, ఇట్టి వారలయందును, సాధుషు అపి - శాస్త్రానువర్తులయందును, పాపేషు చ - ప్రతిషిద్ధకృత్యములఁ జేయువారలయందును - వీరలందరయందును, సమబుద్ధిః - సమాన నుగు బుద్ధిగలవాఁడై, యనగా వీఁడెట్టివాఁడు ఎట్టి వ్యాపారము గలవాఁడు అని పరిగణింపని సంన్యాసి, లేదా, సమబుద్ధిః - సమదర్శి యనగా బ్రహ్మ నందఱి యందును దెలిసికొను సంన్యాసి, విశిష్యతే - యోగారూఢులలో శ్రేష్ఠుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. 9

---

జ్ఞానేతి. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా జ్ఞానం శాస్త్రోక్తపదార్థానాం పరిజ్ఞానం, విజ్ఞానంతు శాస్త్రతో జ్ఞాతానాం తథైవస్వానుభవకరణం, తాభ్యాం జ్ఞానవిజ్ఞానాభ్యాం, తృప్త స్సంజాతాలంప్రత్యయ ఆత్మాఽన్తఃకరణం యస్య స జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో ఽప్రకంప్యో భవతీత్యర్థః, విజితేంద్రియశ్చ య ఈదృశో యుక్త స్సమాహిత ఇతి స ఉచ్యతే కథ్యతే యోగీ, స సమలోష్టాశ్మకాంచనః లోష్టాశ్మకాంచనాని సమాని యస్య స సమలోష్టాశ్మకాంచనః. 8

కించ – సుహృదితి. సుహృ దిత్యాదిశ్లోకార్థ మేకం పదమ్ సుహృదితి, ప్రత్యుపకార మనపేక్ష్యోపకర్తా, మిత్రం స్నేహవాన్, అరిః శత్రుః, ఉదాసీనో న కస్యచి త్పక్షం భజతే, మధ్యస్థో యో విరుద్ధయో రుభయో ర్హితైషీ, ద్వేష్య ఆత్మనోఽప్రియః బంధుః సంబంధీ ఇత్యేతేషు సాధుషు శాస్త్రానువర్తిష్వపి చ పాపేషు

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. 10

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్. 11

---

తా:- ఈ గీత మయిదవయధ్యాయమున బదునెనిమిదవ గీతమగు పండిత లక్షణముయొక్క యనువాదము. ఈగీతమున విశిష్యతే యనుచోట విముచ్యతే, యను పాఠము తెలియఁబడుచున్నది. 9

టీ:- యోగీ - ధ్యానమును జేయువాఁడు, సతతం- ఎల్లప్పుడు, రహసి - ఏకాన్తమునందు, స్థితః - ఉన్నవాఁడై, ఏకాకీ - సర్వకర్మసంన్యాసమును జేసినవాఁడై, నిరాశీః - తృష్ణారహితుఁడై, అపరిగ్రహః - స్రక్చందనాది పరిగ్రహరహితుఁడై, యతచిత్తాత్మా - నియమింపఁబడిన దేహేంద్రియ మనోబుద్ధులు కలవాఁడునై, ఆత్మానం - అంతఃకరణమును, యుంజీత - లక్ష్యమునందు నియమింపవలయును. 10

టీ:- చైలాజినకుశోత్తరం - కుశాజినచేలము లుత్తరోత్తరములుగాఁ గలిగినట్టియు, న అత్యుచ్ఛ్రితం - ఎక్కువ యెత్తులేనట్టియు, న అతినీచం - ఎక్కువపల్లము కానట్టియు, స్థిరం - చలనములేనట్టియు, ఆత్మనః - తనయొక్క, ఆసనం - ఆసనమును, శుచౌ - స్వభావముచేఁ గాని సంస్కారముచేఁగాని పవిత్రమగు, దేశే - ప్రదే

---

ప్రతిషిద్ధకారిషు సర్వేష్వేతేషు సమబుద్ధిః "కః కింకర్మా" ఇత్యవ్యాపృతబుద్ధిరిత్యర్థః విశిష్యతే విముచ్యత ఇతివా పాఠాన్తరమ్; యోగారూఢానాం సర్వేషామయ ముత్తమ ఇత్యర్థః. 9

అతఏవ ముత్తమఫలప్రాప్తయే - యోగీతి. యోగీ ధ్యాయీ యుంజీత సమాదధ్యాత్సతతం సర్వదాఽఽత్మాన మంతఃకరణం రహస్యేకాంతే గిరిగుహాదౌ స్థితః సన్నేకాక్యసహాయః; రహసి స్థిత ఏకాకీచేతి విశేషణాత్సంన్యాసం కృత్వేత్యర్థః, యతచిత్తాత్మా చిత్త మంతఃకరణ మాత్మా దేహశ్చ సంయతౌ యస్య స యతచిత్తాత్మా నిరాశీ ర్వీతతృష్ణోఽపరిగ్రహః పరిగ్రహరహిత ఇత్యర్థః; సంన్యాసిత్వేఽపి త్యక్తసర్వపరిగ్రహస్సన్ యుంజీతేత్యర్థః. 10

అథేదానీం యోగం యుంజత ఆసనాహారవిహారాదీనాం యోగసాధనత్వేన నియమో వక్తవ్యః ప్రాప్తయోగలక్షణం తత్ఫలాదిచ ఇత్యత ఆరభ్యతే, తత్రాసనమేవ తావత్ప్రథమ ముచ్యతే - శుచావితి. శుచౌ శుద్ధే వివిక్తే స్వభావత స్సంస్కారతో వా దేశే స్థానే ప్రతిష్ఠాప్య స్థిర మచల మాత్మన ఆసనం నాత్యుచ్ఛ్రితం నాతీవోచ్ఛ్రితం నాప్యతినీచం, తచ్చ చైలాజినకుశోత్తరం చైల మజినం కుశాశ్చ

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. 12

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. 13

---

శమున, ప్రతిష్ఠాప్య - వేసికొని, తత్ర - ఆ, ఆసనే - పూర్వోక్తాసనమందు, ఉపవిశ్య - కూర్చుండి, మనః - మనస్సును, ఏకాగ్రం - నిశ్చలముగా, కృత్వా - చేసి, యతచిత్తేంద్రియక్రియః - నియమింపఁబడిన యింద్రియమనోవ్యాపారములు గలవాఁడై, ఆత్మవిశుద్ధయే - చిత్తశుద్ధికొఱకు, యోగం - ధ్యానయోగమును, యుంజ్యాత్ - కూడుకొనియుండవలయును. 11-12

తా:—ఇచట "యోగమాత్మ విశుద్ధయే" అని చెప్పఁబడుటచే చిత్తశుద్ధికి గర్మవలె యోగము కూడ సాధనముగాఁ జెప్పఁబడుచున్నది. 12

టీ:—కాయశిరోగ్రీవం - కాయమును, శిరమును, మెడను, అచలం - చలనరహితముగను, సమం - ఋజువుగను, ధారయన్ - ధరించుచు, స్థిరః - నిశ్చలస్వభావము కలవాఁడై, స్వం - తనయొక్క, నాసికాగ్రం - ముక్కుకొనను, సంప్రేక్ష్య - లెస్సగ జూచుచున్నట్లు అన, దిశః చ - దిక్కులను ఇతరవిషయములను, అనవలోకయన్ - చూడక. 13

---

త్తరే యస్మి న్నాసనే తదాసనం చైలాజినకుశోత్తరమ్ పాఠక్రమా ద్విపరీతోఽత్ర క్రమ శ్చైలాదీనామ్. 11

ప్రతిష్ఠాప్య కిమ్ తత్రేతి. తత్ర తస్మి న్నాసన ఉపవిశ్య యోగం యుంజ్యాత్. కథం? సర్వవిషయేభ్య ఉపసంహృత్యైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః, చిత్తం చేంద్రియాణిచ చిత్తేంద్రియాణి తేషాం క్రియా స్సంయతా యస్య సః యతచిత్తేంద్రియక్రియః; స కిమర్థం యోగం యుంజ్యా దిత్యాహ, ఆత్మవిశుద్ధయే అంతఃకరణస్య విశుద్ధ్యర్థ మిత్యేతత్. 12

బాహ్య మాసన ముక్తమ్, అధునా శరీరధారణం కథ మిత్యుచ్యతే సమ మితి. సమం కాయశిరోగ్రీవం కాయశ్చ శిరశ్చ గ్రీవాచ కాయశిరోగ్రీవం తత్సమం ధారయ న్నచలంచ సమం ధారయత శ్చలనం సంభవ త్యతో విశినష్టి అచల మితి. స్థిరః, స్థిరో భూ త్వేత్యర్థః, స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య సమ్యక్ ప్రేక్షణం దర్శనం కృత్వేవేతి; ఇవశబ్దో లుప్తో ద్రష్టవ్యః, నహి స్వనాసికాగ్రసంప్రేక్షణ మిహ విధిత్సితమ్, కింతర్హి చక్షుషో ర్దృష్టిసన్నిపాతః స చాంతఃకరణసమాధానాపేక్షో వివక్షితః స్వనాసికాసంప్రేక్షణమేవ చే ద్వివక్షితం మన స్తత్రైవ సమాధీయేత

ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. 14
యుంజ న్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15

---

టీ:—ప్రశాంతాత్మా - పుష్కలముగ నుపశమముఁ జెందిన యంతఃకరణము గలవాఁడును, విగతభీః - పోయినభయము గలవాఁడును, బ్రహ్మచారివ్రతే - గురుశుశ్రూషాది పరివ్రాజకధర్మములందు, స్థితః - ఉన్నటువంటివాఁడును, మనః - మనస్సును, సంయమ్య - నిగ్రహించి, మచ్చిత్తః - నాయందు బుద్ధిగలవాఁడై, యుక్తః - సమాహితుఁడై, మత్పరః - నేనే యాశ్రయనుభావము గలవాఁడై, ఆసీత - ఉండవలయును, ఇచట పదియవగీతము మొదలు పదునాలుగవగీతమువఱకుండెడి యైదుగీతములును రెండవ యధ్యాయమున నరువదియొకటవ గీతము యొక్క వివరణమే యని "యుక్త ఆసీత మత్పరః" యనులింగముచే సుస్పష్టముగాఁ దెలియవచ్చెడిని. 14

టీ:—యోగీ - యోగి, నియతమానసః - నియమింపఁబడిన మనస్సుగలవాఁడై, సదా - ఎల్లప్పుడు, ఆత్మానం - తనయంతఃకరణమును, ఏవం - పూర్వోక్తరీతిగా, యుంజన్ - సమాధానము చేయువాఁడై, మత్సంస్థాం - నాయధీనమగునట్టియు, నిర్వాణపరమాం - మోక్షము నిష్ఠగాఁ గల, శాంతిం - ఉపరతిని, అధిగచ్ఛతి - పొందును. 15

---

నాత్మని; ఆత్మనిహి మనసః సమాధానం వక్ష్యతి "ఆత్మసంస్థం మనః కృత్వా" (గీ. 6-25) ఇతి, తస్మా దివశబ్దలోపేనాక్ష్ణో ర్దృష్టిసన్నిపాతఏవ సంప్రేక్ష్యేత్యుచ్యతే, దిశ శ్చానవలోకయన్, దిశాం చావలోకన మంతరా కుర్వ న్నిత్యేతత్. 13

కించ ప్రశాంతేతి. ప్రశాంతాత్మా ప్రకర్షేణ శాంతః ఆత్మాఽన్తఃకరణం యస్య సోఽయం ప్రశాంతాత్మా, విగతభీ ర్విగతభయః బ్రహ్మచారివ్రతే స్థితో బ్రహ్మచారిణో వ్రతం బ్రహ్మచర్యం గురుశుశ్రూషా భిక్షా భుక్త్యాది తస్మిన్ స్థిత స్తదనుష్ఠాతా భవే దిత్యర్థః, కించ మన స్సంయమ్య మనసో వృత్తీ రుపసంహృత్యే త్యేత న్మచ్చిత్తో మయి పరమేశ్వరే చిత్తం యస్య సోయం మచ్చిత్తో యుక్తః సమాహితఃస న్నాసీ తోపవిశేత్, మత్పరః అహం పరో యస్య సోఽయం మత్పరః భవతి; కశ్చి ద్రాగీ స్త్రీచిత్తో నతు స్త్రియమేవ పరత్వేన గృహ్ణాతి కింతర్హి రాజానం మహాదేవంవా అయంతు మచ్చిత్తో మత్పరశ్చ. 14

అథేదానీం యోగఫల ముచ్యతే - యుంజన్నితి. యుంజన్ సమాధానం కుర్వన్నేవం యథోక్తేనవిధానేన సదాత్మానం యోగీ నియతమానసః నియతం సంయతం

నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః,
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. 16
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. 17

---

ఈ గీతము రెండవయధ్యాయమునందలి డెబ్బదియొకటవగీతమగు "విహాయ కామాన్" అనుగీతముయొక్క అనువాదమే యని శాంతిలింగముచే సుస్పష్టమగుచున్నది. 15

టీ:—అర్జున ! అత్యశ్నతః తు - తిండిపోతునకన్నను, యోగః - ధ్యాననిష్ఠ, న అస్తి - లభింపదు. ఏకాంతం - అత్యన్తము, అనశ్నతః - భుజించుట మానినవానికి, యోగః - ధ్యాననిష్ఠ, నచ - లభింపదు. అతిస్వప్నశీలస్య చ - నిదురపోతునకును, నచ - యోగము లభింపదు. జాగ్రతః చ - అత్యన్తము నిద్రమానినవానికిని గూడ, న ఏవ - యోగ మెంతమాత్రము లభింపదు. 16

టీ:—యుక్తాహారవిహారస్య - నియతమగు నాహారవిహారాదులు కలిగినట్టియు, కర్మసు-వ్యాపారములయందు, యుక్తచేష్టస్య - నియతమగు చేష్టలు కలిగినటువంటియు, యుక్తస్వప్నావబోధస్య - నియతమగు జాగ్రత్స్వప్నములు కలిగి

---

మానసం మనో యస్య సోఽయం నియతమానసః, శాంతి ముపరతిం నిర్వాణపరమాం నిర్వాణం మోక్షః స్తత్పరమా నిష్ఠా యస్యాః శాన్తేః సా నిర్వాణపరమా, తాం నిర్వాణపరమాం మత్సంస్థాం మదధీనా మధిగచ్ఛతి ప్రాప్నోతి. 15

ఇదానీం యోగిన ఆహారాదినియమ ఉచ్యతే నేతి. నాత్యశ్నత ఆత్మసంమితమన్నపరిమాణ మతీత్య అశ్నతోఽత్యశ్నతో, న యోగోఽస్తి న చైకాంత మనశ్నతో యోగోఽస్తి "యదు హ వాఽఽత్మసంమిత మన్నం త దవతి త న్న హినస్తి, య ద్భూయో హినస్తి తద్య త్కనీయోన్నం న తదవతి" (శతపథ) ఇతిశ్రుతేః, తస్మాద్యోగీ నాత్మసంమితా దన్నా దధికం న్యూనం వాఽశ్నీయాత్; అథవా యోగినో యోగశాస్త్రే పరిపఠితా దన్నపరిమాణా దతిమాత్ర మశ్నతో యోగో నాస్తి; ఉక్తంహి "అర్ధం సవ్యంజనాన్నస్య తృతీయ ముదకస్యచ, వాయోస్సంచరణార్థంతు చతుర్థ మవశేషయేత్" (యోగశాస్త్రే) ఇత్యాది పరిమాణమ్. తథా న చాతిస్వప్నశీలస్య యోగో భవతి; నైవ చాతిమాత్రం జాగ్రతో యోగో భవతి చార్జున. 16

కథం పున ర్యోగో భవతీ త్యుచ్యతే. యుక్తేతి. యుక్తాహారవిహారస్య ఆహ్రియత ఇత్యాహారోఽన్నం, విహరణం విహారః పాదక్రమః తౌ యుక్తౌ నియతపరి

యదా వినియతం చి త్త మాత్మ న్యేవా వతిష్ఠ తే,
నిఃస్పృహః సర్వకా మేభ్యో యు క్త ఇత్యుచ్య తే తదా. 18
యథా దీపో నివాతస్థో నేంగ తే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. 19

---

నటువంటి యోగికి, యోగః - ధ్యాననిష్ఠ, దుఃఖహా - దుఃఖమును బోఁగొట్టునది, భవతి - అగుచున్నది.

తా:- దేహగతరుగ్మతలను వారించుట కౌషధసేవ కనుగుణమగు పథ్య మెట్లవసరమో యా తీరుననే మనోగతరుగ్మతలకు నౌషధమగు యోగానుష్ఠానము నకుఁ గూడ బథ్య మవసరమను నాశయముమీఱ నీ రెండు గీతములచే యోగానుష్ఠాతకుఁ బథ్యము జెప్పఁబడుచున్నది. 16-17

టీ:- యదా - ఎప్పుడు, వినియతం - విశేషముగా నేకాగ్రితఁ జెందిన, చిత్తం - అంతఃకరణము, ఆత్మన్యేవ - బాహ్యచింతలను వీడి కేవలస్వస్వరూపము నందే, అవతిష్ఠ తే - స్థితినిబొందునో, తదా - అప్పుడు, సర్వకా మేభ్యః - సమస్త ములగు కోరికలనుండి అనఁగా దృష్టాదృష్టవిషయములనుండి, నిస్పృహః - పోయినతృష్ణ కలవాఁడై, యు క్తః ఇతి - సమాహితుఁడని, ఉచ్య తే - చెప్పఁబడుచున్నాఁడు. ఈగీతముచే నిష్ఠాఫలప్రాప్తి కనుకూలమగు తరుణము సూచింపఁబడుచున్నది. 18

టీ:- యథా - ఏరీతిగా, నివాతస్థః - గాలిలేని స్థలమునందుండిన, దీపః - దీపము, న ఇంగ తే - చలింపదో, సా - ఆదీపస్థితియే, ఆత్మనః - తనయొక్క, యోగం-

---

మాణో యస్య స యుక్తాహారవిహారః తస్య, తథా యు క్తచేష్టస్య యుక్తా నియతా చేష్టా యస్య కర్మసు తస్య తథా యు క్తస్వప్నావబోధస్య యుక్తౌ స్వప్న శ్చావ బోధ శ్చ తౌ నియతకాలౌ యస్య తస్య యోగినో యోగో భవతి దుఃఖహా దుఃఖాని సర్వాణి హంతీతి దుఃఖహా సర్వసంసారదుఃఖక్షయకృ ద్యోగో భవతీత్యర్థః. 17

అథాధునా కదా యుక్తో భవతీ త్యుచ్య తే - యదేతి. యదా వినియతం విశేషేణ నియతం సంయత మేకాగ్రతా మాపన్నం చి త్తం హిత్వా బాహ్యచింతా మాత్మ న్యేవ కేవలేఽవతిష్ఠ తే స్వాత్మని స్థితిం లభత ఇత్యర్థః, నిఃస్పృహః సర్వ కామేభ్యః నిర్గతా దృష్టాదృష్టవిషయేభ్యః స్పృహా తృష్ణా యస్య యోగినః స యు క్తః సమాహిత ఇత్యుచ్య తే తదా తస్మిన్ కాలే. 18

తస్య యోగిన స్సమాహితం యచ్చి త్తం తస్యో పమోచ్య తే యథేతి. యథా దీపః ప్రదీపః, నివాతస్థో నివాతే వాతవర్జి తే దేశే స్థితో నేంగ తే న

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్య న్నాత్మని తుష్యతి. 20
సుఖ మాత్యంతికం య త్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. 21

---

సమాధిని, యుంజతః - ఆచరించునట్టి, యతచిత్తస్య - నిగృహీతాంతఃకరణ గలిగిన, యోగినః - యోగికి, ఉపమా - ఉపమగా, స్మృతా - తలంపఁబడుచున్నది. 19

టీ:—యోగసేవయా - యోగానుష్ఠానముచే, నిరుద్ధం - అరికట్టఁబడిన, చిత్తం - అంతఃకరణము, యత్ర - ఏకాలమందు, ఉపరమతే - ఉపశమమును బొందునో, యత్ర చ - ఏకాలమునందు, ఆత్మనా - శుద్ధాంతఃకరణముచేత, ఆత్మానం - చిన్మాత్రమగు స్వస్వరూపమును, పశ్యన్ - తెలిసికొని, ఆత్మని - స్వస్వరూపమందే, తుష్యతి - తృప్తిఁజెందునో. 20

టీ:—అతీంద్రియమ్ - ఇంద్రియగోచరము కానట్టియు, బుద్ధిగ్రాహ్యమ్ - బుద్ధిచేతనే గ్రహింపఁదగినట్టియు, యత్ - ఏ, ఆత్యన్తికం - నిరతిశయమగు, సుఖమ్ - సుఖమున్నదో, తత్ - దానిని, యత్ర - ఎప్పుడు, వేత్తి - అనుభవించునో, యత్ర - ఎప్పుడు, అయం - ఈ విద్వాంసుఁడు, తత్త్వతః - స్వస్వరూపభావముతో, స్థితః - ఉన్నవాఁడై, న చలతి - ప్రచ్యుతిని జెందఁడో. 21

---

చలతి సోపమా ఉపమీయతేఽనయే త్యుపమా, యోగజ్ఞై శ్చిత్తప్రచారదర్శిభిః స్మృతా చింతితా యోగినో యతచిత్తస్య సంయతాన్తఃకరణస్య యుంజతో యోగ మనుతిష్ఠత ఆత్మన స్సమాధి మనుతిష్ఠత ఇత్యర్థః. 19

ఏవం యోగాభ్యాసబలా దేకాగ్రీభూతం నివాతప్రదీపకల్పం సత్ యత్రేతి. యత్ర యస్మిన్ కాల ఉపరమతే చిత్త ముపరతిం గచ్ఛతి నిరుద్ధం సర్వతో నివారితప్రచారం యోగసేవయా యోగానుష్ఠానేన యత్ర చైవ యస్మిన్ కాల ఆత్మనా సమాధిపరిశుద్ధే నాంతఃకరణేనాత్మానం పరం చైతన్యం జ్యోతిస్స్వరూపం పశ్య న్నుపలభమానః స్వ ఏవాత్మని తుష్యతి తుష్టిం భజతే. 20

కించ సుఖేతి. సుఖ మాత్యన్తిక మత్యన్తమేవ భవతీ త్యాత్యంతిక మనంత మిత్యర్థః; య త్తద్బుద్ధిగ్రాహ్యం బుద్ధ్యైవేంద్రియనిరపేక్షయా గృహ్యత ఇతి బుద్ధిగ్రాహ్యమ్ అతీంద్రియ మింద్రియగోచరాతీత మవిషయజనిత మిత్యర్థః, వేత్తి తదీదృశం సుఖ మనుభవతి యత్ర యస్మిన్ కాలే న చైవాయం విద్వా నాత్మస్వరూపే స్థిత స్తస్మా న్నైవ చలతి తత్త్వత స్తత్త్వరూపా న్న ప్రచ్యవత ఇత్యర్థః. 21

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. 22

తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

---

టీ:—యం - దేనిని, లబ్ధ్వా - పొంది, తతః - దానికంటె, అపరం - వేరగు, లాభంచ - ప్రయోజనమును, అధికం - ఎక్కుడుగా, నమన్యతే - తలఁపఁడో, యస్మిన్ - ఏయాత్మతత్త్వమందు, స్థితః - ఉన్నవాఁడై, గురుణా - గొప్పదగు, దుఃఖేనాపి - శస్త్రపాతాదిరూపమగుదుఃఖముచేఁగూడ, నవిచాల్యతే-చలింపఁడో. 22

టీ:—తం-అట్టి, దుఃఖసంయోగవియోగం - దుఃఖములయొక్క సంయోగము లను దొలగించుదానిని, యోగసంజ్ఞితం - యోగమను పేరుగలదానిగా, విద్యాత్ - తెలిసికొనవలయును. సః యోగః - అట్టి యోగము, అనిర్విణ్ణచేతసా - నిర్వేదము లేని మనముచే, నిశ్చయేన - దృఢవిశ్వాసముచే, యోక్తవ్యః - ఆచరింపఁదగినది. 23

తా:—"యత్రోపరమతే చిత్తమ్" (గీ. 6-20.) అను గీతము మొదలు "గురుణాపి విచాల్యతే" "యం లబ్ధ్వా చాపరం లాభమ్" (6-22.) యనుగీతమువఱకు గల మూఁడు గీతములచే నుపదేశింపఁబడిన యోగము దుఃఖసంయోగమును దొల గించుట మహాఫలముగాఁ గల్గినదనియు, నయ్యది యవశ్యాచరణీయమనియుఁ బరమ తాత్పర్యము.

---

కించ యం లబ్ధ్వేతి. యం లబ్ధ్వా య మాత్మలాభం లబ్ధ్వా ప్రాప్య చాపర మన్య ల్లాభం లాభాన్తరం తతోఽధిక మస్తీతి న మన్యతే న చింతయతి; కించ యస్మి న్నాత్మతత్త్వే స్థితో దుఃఖేన శస్త్రనిపాతాదిలక్షణేన గురుణా మహతాపి న విచాల్యతే. 22

"యత్రోపరమతే" (గీ. 6-20) ఇత్యాద్యారభ్య యావద్భి ర్విశేషణై ర్విశిష్ట ఆత్మావస్థావిశేషో యోగ ఉక్తః తమితి. తం విద్యా ద్విజానీయా ద్దుఃఖసం యోగవియోగం దుఃఖై స్సంయోగో దుఃఖసంయోగ స్తేన వియోగో దుఃఖ సంయోగవియోగ స్తం దుఃఖసంయోగవియోగం యోగ ఇత్యేవ సంజ్ఞితం విపరీత లక్షణేన విద్యా ద్విజానీయా దిత్యర్థః; యోగఫల ముపసంహృత్య పున రన్వారం భేణ యోగస్య కర్తవ్యతోచ్యతే, నిశ్చయానిర్వేదయో ర్యోగసాధనత్వవిధా నార్థమ్; స యథోక్తఫలో యోగో నిశ్చయే నాధ్యవసాయేన యోక్తవ్యోఽనిర్విణ్ణ చేతసా న నిర్విణ్ణ మనిర్విణ్ణం కింతత్ చేత స్తేన నిర్వేదరహితేన చేతసా చిత్తే నేత్యర్థః. 23

సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. 24

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్. 25

యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియ మ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

---

టీ:—సంకల్ప ప్రభవాన్ - సంకల్పమాత్రముచేఁబుట్టు, సర్వాన్ - సమస్తము లగు, కామాన్ - కోరికలను, అశేషతః - పూర్ణముగా, త్యక్త్వా - విడచి, ఇంద్రియ గ్రామం - జ్ఞానకర్మేంద్రియ సముదాయమును, మనసైవ - వివేకముతోఁగూడిన మనస్సుచే, సమంతతః - సంపూర్ణముగా, వినియమ్య - నియమించి. 24

టీ:—ధృతిగృహీతయా - ధైర్యముచే నిగ్రహింపఁబడిన, బుద్ధ్యా - బుద్ధి చేతను, శనైః శనైః - మెల్లమెల్లగా, ఉపరమేత్ - విషయములనుండి యుపరతిని జెందవలయును. మనః - మనస్సును, ఆత్మసంస్థం - స్వస్వరూపమున లగ్నమైనదిగా, కృత్వా - చేసి, కించిదపి - ఎట్టివిషయమును, నచింతయేత్ - చింతింపఁగూడదు. 25

టీ:—చంచలం - చలనస్వభావము గలిగినట్టియు, అస్థిరం - చంచలమైనదగు టచే నస్థిరమైనట్టియు, మనః - మనస్సు, యతః యతః - ఏ యే శబ్దాదులనుండి, నిశ్చరతి - బయలువెడలిపోవుచుండునో, తతః తతః - ఆ యాయిశబ్దాదులనుండి,

---

కించ సంకల్పేతి. సంకల్పప్రభవాన్ సంకల్పః ప్రభవో యేషాం కామానాం తే సంకల్పప్రభవాః కామాః, తాన్ త్యక్త్వా పరిత్యజ్య సర్వా నశేషతో నిర్లే పేన కించ మనసైవ వివేకయుక్తే నేంద్రియగ్రామ మింద్రియసముదాయం విని యమ్య నియమనం కృత్వా సమంతత స్సమంతాత్. 24

శనై రితి. శనైశ్శనై ర్న సహసోపరమే దుపరతిం కుర్యాత్ ; కయా? బుద్ధ్యా; కింవిశిష్టయా ? ధృతిగృహీతయా, ధృత్యా ధైర్యేణ గృహీతయా ధృతిగృహీ తయా, ధైర్యేణ యుక్తయే త్యర్థః. ఆత్మసంస్థ మాత్మని సంస్థితం "ఆత్మైవ సర్వం, న తతోఽన్య త్కించి దస్తి" ఇత్యేవ మాత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ; ఏష యోగస్య పరమో విధిః. 25

తత్రైవ మాత్మసంస్థం మనః కర్తుం ప్రవృత్తో యోగీ - యత ఇతి. యతో యతో యస్మా ద్యస్మా న్నిమిత్తా చ్ఛబ్దాదే ర్నిశ్చరతి నిర్గచ్ఛతి స్వభావదోషా న్మనః శ్చంచల మత్యర్థం చలమ్ అతఏవాస్థిరం తత స్తత స్తస్మా త్తస్మా చ్ఛబ్దాదే

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్. 27

యుంజ న్నేవం సదా త్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే. 28

---

ఏతత్ - ఈ మనస్సును, నియమ్య - నియమించి యనగా వెనుకకు మరలించి, ఆత్మన్యేవ - స్వస్వరూపమునందే, వశం - స్వాధీనమగు దానినిగా, నయేత్ - పొందించవలయును. 26

తా:--ఈ మూఁడు గీతములును, మూఁడవ యధ్యాయమునందలి నలుబది రెండు నలుబదిమూఁడవ గీతములగు, "ఇంద్రియాణి పరా ణ్యాహుః" "ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా" యను గీతములయొక్క వివరణరూపములు. ఇందు యోగముయొక్క యుత్కృష్టవిధాన ముపదేశింపఁబడుచున్నది. ఇయ్యది సద్గురుముఖైక వేద్యము.

టీ:--అకల్మషం - దోషరహితమైనట్టియు ననఁగా నధర్మాదిరహిత మైనట్టియు, శాంతరజసం - మోహాదిక్లేశములు తొలఁగినట్టియు, ప్రశాంతమనసం - ఉపశమము నొందింపఁబడిన మనస్సు గలిగినట్టియు, బ్రహ్మభూతం - బ్రహ్మభావమును బొందినట్టియు, ఏనం యోగినం - ఈపూర్వోక్తయోగనిష్ఠుని, ఉత్తమం - నిరతిశయమగు, సుఖం - సుఖము, అనఁగా బ్రహ్మానందము, ఉపైతి - పొందును. 27

టీ:--విగతకల్మషః - సమస్తములగు పాపములు పోయినట్టి, యోగీ - ధ్యాననిష్ఠుఁడు, ఏవం - పూర్వోక్తప్రకారముగా, సదా - ఎల్లప్పుడును, ఆత్మానం - అంతఃకరణమును, యుంజన్ - స్వస్వరూపమునందుఁ గూర్చినవాఁడై, బ్రహ్మ

---

ర్నిమిత్తా న్నియమ్య, తత్తన్నిమిత్తం యాథాత్మ్యనిరూపణే నాభాసీకృత్య వైరాగ్యభావనయా చైత న్మన ఆత్మన్యేవ వశం నయే దాత్మవశ్యతా మాపాదయేత్; ఏవం యోగాభ్యాసబలా ద్యోగిన ఆత్మన్యేవ ప్రశామ్యతి మనః. 26

ప్రశాంతేతి. ప్రశాంతమనసం ప్రకర్షేణ శాంతం మనో యస్య స ప్రశాంతమనా స్తం ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం నిరతిశయ ముపైత్యుపగచ్ఛతి; శాంతరజసం ప్రక్షీణమోహాదిక్లేశరజస మిత్యర్థః, బ్రహ్మభూతం జీవన్ముక్తం బ్రహ్మైవ సర్వ మిత్యేవం నిశ్చయవంతం బ్రహ్మభూత మకల్మష మధర్మాదివర్జితమ్. 27

యుంజ న్నితి. యుంజ న్నేవం యథోక్తేన క్రమేణ యోగీ యోగాంతరాయవర్జితః సదా త్మానం విగతకల్మషో విగతపాపః, సుఖేనానాయాసేన, బ్రహ్మ

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి. 30

---

సంస్పర్శం - పరబ్రహ్మతో సంబంధించిన, అత్యంతం - నిరతిశయమగు, సుఖం - ఆనందమును, సుఖేన - అనాయాసముగా, అశ్నుతే - పొందును. 28

ఈ రెండు గీతములచేఁ జైయోగఫలము వ్యక్తీకరింపఁబడుచున్నది.

టీ:—సర్వత్ర - బ్రహ్మాది స్తంబపర్యన్తముగల పరస్పరవిరుద్ధస్వభావములగు సమస్తభూతజాలమందును, సమదర్శనః - నిర్విశేష బ్రహ్మాత్మైకత్వమును దెలిసికొన్నట్టియు, యోగయుక్తాత్మా - సమాహితాంతఃకరణము గలిగినట్టియు పండితుఁడు, ఆత్మానం- తన్ను, సర్వభూతస్థం- సమస్తభూతములయం దున్న వానినిగాను, సర్వభూతాని - సమస్తభూతములును, ఆత్మని చ - తనయం దున్న వానినిగాను, ఈక్షతే - తెలిసికొనుచున్నాఁడు. ఈగీత మైదవయధ్యాయమునందలి "విద్యావినయ సంపన్నే" యను పదునెనిమిదవగీతముయొక్కయు నారవయధ్యాయమందలి "సుహృన్మిత్రారి" యను తొమ్మిదవగీతము యొక్కయు విశేషవివరణ మని సమదర్శన లింగముచే సుస్పష్ట మగుచున్నది. 29

టీ:—యః-ఎవఁడు, సర్వత్ర - సమస్తభూతములందును, మాం-నన్ను, పశ్యతి- తెలిసికొనుచున్నాఁడో, సర్వంచ - సమస్తప్రపంచమును, మయి - నాయందు, పశ్యతి - తెలిసికొనుచున్నాఁడో, తస్య - వానికి, అహం - నేను, న ప్రణశ్యామి -

---

సంస్పర్శం బ్రహ్మణా పరేణ సంస్పర్శో యస్య త ద్బ్రహ్మసంస్పర్శం సుఖ మత్యంతం అన్తమతీత్య వర్తత ఇత్యత్యన్త ముత్కృష్టం నిరతిశయ మశ్నుతే వ్యాప్నోతి. 28

ఇదానీం యోగస్య యత్ఫలం బ్రహ్మైకత్వదర్శనం సర్వసంసారవిచ్ఛేద కారణం తత్ప్రదర్శ్యతే సర్వేతి. సర్వభూతస్థం సర్వేషు భూతేషు స్థితం స్వ మాత్మానం సర్వభూతాని చాత్మని బ్రహ్మాదీని స్తంబపర్యన్తాని చ సర్వభూతా న్యాత్మ న్యేకతాం గతా నీక్షతే పశ్యతి. యోగయుక్తాత్మా సమాహితాన్తఃకరణః సర్వత్ర సమదర్శనః సర్వేషు బ్రహ్మాదిస్థావరాన్తేషు విషమేషు సర్వభూతేషు సమం నిర్విశేషం బ్రహ్మాత్మైకత్వవిషయం దర్శనం జ్ఞానం యస్య స సర్వత్ర సమదర్శనః. 29

ఏతస్యాత్మైకత్వదర్శనస్య ఫల ముచ్యతే యఇతి. యో మాం పశ్యతి వాసుదేవం సర్వస్యాత్మానం సర్వత్ర సర్వేషు భూతేషు సర్వంచ బ్రహ్మాదిభూతజాతం

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
సర్వథా వ ర్తమానోఽపి స యోగీ మయి వ ర్త తే. 31

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. 32

---

పరోక్షభావమును జెందను, అనగా స్వస్వరూపముగ దెలియఁబడుచున్నాను. నచ - అట్టివాఁడు, మే - నాకును, నప్రణశ్యతి - పరోక్షభావమును జెందఁడు. అనఁగా నట్టివానిని నాస్వరూపముగానే తెలిసికొందును. ఈపై రెండుగీతములచేతను జీవేశ్వరాభేద మనగా బ్రత్యగ్బ్రహ్మైభేదము శ్రీకృష్ణభగవానునిచేఁ గంఠోక్తిగా నుపదేశింపఁబడుచున్నది. 30

టీ:—యః - ఎవఁడు, ఏకత్వం - ప్రత్యగ్బ్రహ్మైక్యమును, ఆస్థితః -పొందిన వాఁడై, సర్వభూతస్థితం- సర్వభూతములయం దున్నటువంటి, మాం-నన్ను, భజతి- పొందుచున్నాఁడో. సః యోగీ - అట్టి యోగి, సర్వథా - సర్వప్రకారములచేతను, అనగా నైదవయధ్యాయమున నెనిమిది తొమ్మిది గీతములచే వివరింపఁబడినవిధ మున, వర్తమానః అపి - ఉన్నవాఁడై నప్పటికి, మయి - నాయందు, వ ర్త తే - ఉండును, అనగా ముక్తినిబొందు నని తాత్పర్యము. 31

టీ:—అర్జున ! యః - ఎవఁడు, సర్వత్ర - సమస్తభూతములయందును, ఆత్మౌ పమ్యేన - తనతోసాటిగా, సుఖం వా - సుఖమును, యది - లేక, దుఃఖంవా - దుఃఖ మును, సమం - తుల్యభావముతో, పశ్యతి - చూచుచున్నాఁడో, అనగా దనకు ననిష్ట

---

మయి సర్వాత్మని పశ్యతి తస్యైవ మాత్మైకత్వదర్శినోఽహం మీశ్వరో న ప్రణ శ్యామి న పరోక్షతాం గమిష్యామి, సచ మే న ప్రణశ్యతి సచ విద్వాన్మమ వాసు దేవస్య న ప్రణశ్యతి న పరోక్షే భవతి, తస్యచ మమ చైకాత్మకత్వాత్ ; స్వాత్మా హి నామా త్మనః ప్రియఏవ భవతి యస్మా చ్చాహమేవ సర్వాత్మైకత్వదర్శీ. 30

ఇత్యేత త్పూర్వశ్లోకార్థం సమ్యగ్దర్శన మనూద్య తత్ఫలం మోక్షోఽభిధీ యతే సర్వేతి. సర్వథా సర్వప్రకారై ర్వర్తమానోఽపి సమ్యగ్దర్శీ యోగీ మయి వైష్ణవే పరమే పదే వర్తతే, నిత్యముక్త ఏవ స, న మోక్షంప్రతి కేన చి త్ప్రతిబధ్యత ఇత్యర్థః. 31

కిం చాన్యత్ ఆత్మౌపమ్యేనేతి. ఆత్మౌపమ్యే నాత్మా స్వయ మేవోపమీ యతే అనయా ఇత్యుపమా, తస్యా ఉపమాయా భావ ఔపమ్యం, తేనాత్మౌపమ్యేన సర్వత్ర సర్వభూతేషు సమం తుల్యం పశ్యతి యోఽర్జున, సచ కిం సమం పశ్యతీ

అర్జున ఉవాచ:—

యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. 33
చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. 34

---

మగునది సమస్తభూతములకు ననిష్టమే యనియు నాతీరుననే తనకు బ్రియమగు నది ప్రియమే యనియుఁ దెలిసి యొకానొక ప్రాణికిని హింస కలుగకుండ వర్తించుచున్నాఁడో, సః యోగీ - అట్టిబ్రహ్మనిష్ఠుఁడు, పరమః - శ్రేష్ఠుఁ డని, మతః - తలంపఁబడుచున్నాఁడు. ఇయ్యది స్థితప్రజ్ఞలక్షణము. 32

టీ:—మధుసూదన! యః అయం యోగః - ఏ యీ యోగము, త్వయా - నీచేత, సామ్యేన - సమభావముచే, ప్రోక్తః - చెప్పఁబడినదో, ఏతస్య - ఈ యోగముయొక్క, స్థిరామ్ - నిశ్చలమగు, స్థితిం - స్థితిని, చంచలత్వాత్ - చలనస్వభావము గలవాఁడ నగుటవలన, న పశ్యామి - తెలిసికొనఁజాలకున్నాను. 33

టీ:— కృష్ణ! మనః - మనస్సు చంచలం హి - చలనస్వభావము కలదియును, ప్రమాథి - శరీరమును, ఇంద్రియములను విక్షేపము నొందించునదియును, బలవత్ - నియమింప నశక్యమును, దృఢమ్ - ఛేదించుటకు నలవి కానిదియును,

---

త్యుచ్యతే యథా మమ సుఖ మిష్టం తథా సర్వప్రాణినాం సుఖ మనుకూలమ్. వాశబ్ద శ్చార్థే. యదివా యచ్చ దుఃఖం మమ ప్రతికూల మనిష్టం యథా తథా సర్వప్రాణినాం దుఃఖ మనిష్టం, ప్రతికూల మిత్యేవ మాత్మౌపమ్యేన సుఖదుఃఖే అనుకూలప్రతికూలే తుల్యతయా సర్వభూతేషు సమంపశ్యతి నకస్యచిత్ప్రతికూల మాచరతి, అహింసక ఇత్యర్థః. య ఏవ మహింసకః సమ్యగ్దర్శననిష్ఠః స యోగీ పరమ ఉత్కృష్టో మతోఽభిప్రేత స్సర్వయోగినాం మధ్యే. 32

ఏతస్య యథోక్తస్య సమ్యగ్దర్శనలక్షణస్య యోగస్య దుఃఖసంపాద్యతా మాలక్ష్య శుశ్రూషు ర్ధ్రువం తత్ప్రాప్త్యుపాయం అర్జున ఉవాచ - యోఽయమితి. యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన సమత్వేన హే మధుసూదన! ఏతస్య యోగ స్యాహం నపశ్యామి నోపలభే చంచలత్వా న్మనసః కిమ్? స్థిరా మచలాం స్థితిమ్. 33

ప్రసిద్ధ మేతత్ చంచల మితి. చంచలం హి మనః కృష్ణేతి. కృష తే ర్విలేఖనార్థస్య రూపం, భక్తజనపాపాదిదోషాకర్షణా త్కృష్ణః న కేవలం ఘుత్యర్థం

శ్రీభగవానువాచ—

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే. 35

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

---

తస్య - అట్టి మనస్సుయొక్క, నిగ్రహం - అరికట్టుటను, వాయోరివ - వాయువు నరికట్టుటవలెనే, సుదుష్కరం - కష్టతరమని, మన్యే - తలఁచుచున్నాను. ఇరువది యారవ గీతమున "మన శ్చంచల మస్థిరం" అను వాక్యము నాధారముగాఁ జేసికొని యీ ప్రశ్నము నర్జునుఁడు వేయుచున్నట్లు "చంచలమ్" అను లింగముచేఁ దెలియునగును. 34

టీ:—మహాబాహో! మనః - మనస్సు, చలం - చంచలమనియు, దుర్నిగ్రహమ్ - నిగ్రహించుటకు దుశ్శకమనియు, అసంశయం - నిస్సందేహమే, తు-కాని, కౌంతేయ! అభ్యాసేన - ధ్యానయోగముయొక్క యభ్యాసముచేతను, వైరాగ్యేణచ - దృష్టాదృష్టేష్ట భోగములయందు దోషదర్శనాభ్యాసముచేఁ గల్గు విరాగము చేతను, గృహ్యతే - నిగ్రహింపఁబడుచున్నది. 35

టీ:—అసంయతాత్మనా - అభ్యాసవైరాగ్యములచే నిగ్రహింపఁబడని యంతఃకరణము గలవానిచే, యోగః - యోగము, దుష్ప్రాపః ఇతి - పొందుటకు శక్యము

---

చంచలం, ప్రమాథిచ ప్రమథనశీలం ప్రమథ్నాతి శరీర మింద్రియాణిచ విక్షిపతి పరవశీకరోతి, కించ బలవ న్న కేనచి న్నియంతుం శక్యం దుర్నివారత్వాత్, కించ దృఢం తంతునాగవ దవిచ్ఛేద్యమ్, తస్యైవంభూతస్య మనసోఽహం నిగ్రహం నిరోధం మన్యే వాయోరివ; యథా వాయో ర్దుష్కరో నిగ్రహ స్తతోఽపి మనసో దుష్కరం మన్యే ఇత్యభిప్రాయః. 34

శ్రీభగవానువాచ. ఏవ మేత ద్యథా బ్రవీషి అసంశయమితి. అసంశయం, నాస్తి సంశయో మనో దుర్నిగ్రహం చల మిత్యత్ర హేమహాబాహో! కింత్వభ్యాసేనతు అభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాంచి త్సమానప్రత్యయావృత్తి శ్చిత్తస్య, వైరాగ్యేణ వైరాగ్యం నామ దృష్టాదృష్టేష్టభోగేషు దోషదర్శనాభ్యాసా ద్వైతృష్ణ్యం, తేనచ వైరాగ్యేణ గృహ్యతే విక్షేపరూపః ప్రచార శ్చిత్తస్య,ఏవం త న్మనో గృహ్యతే, నిగృహ్యతే నిరుధ్యత ఇత్యర్థః. 35

యః పున రసంయతాత్మా తేన అసంయతాత్మనేతి. అసంయతాత్మనా అభ్యాసవైరాగ్యాభ్యా మసంయత ఆత్మాఽన్తఃకరణం యస్య సోఽయ మసంయ

అర్జున ఉవాచ—

అయతిః శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. 37

కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. 38

---

గానిదని, మే - నాయొక్క., మతిః - అభిప్రాయము. యతతా - ప్రయత్నించుచునట్టి, వశ్యాత్మనాతు - వశీకృతచిత్తునిచే, ఉపాయతః - నేర్పువలన, అవాప్తుం - పొందుటకు, శక్యః - సమర్థమగును. అనగా నభ్యాసవైరాగ్యములచేఁ జిత్తము నిగ్రహింపఁ బడుననియు, జిత్తనిగ్రహము గలవానికి యోగము సుకరమనియు, దానంజేసి యభ్యాసవైరాగ్యము లవశ్యము సంగ్రహింపఁ బడనలయుననియుతాత్పర్యము. 37.

టీ:- కృష్ణ! శ్రద్ధయా - శ్రద్ధచే, ఉపేతః - కూడుకొనిన, అయతిః - ప్రయత్నరహితుఁడు, యోగసంసిద్ధిం - యోగఫలమగు సమ్యగ్దర్శనమును, అప్రాప్య - పొందకయే, యోగాత్ - యోగమునుండి దేహవియోగకాలమున, చలితమానసః - స్మృతిభ్రంశమును జెందినవాఁడై, కాం - ఏ, గతిం - అవస్థను, గచ్ఛతి - పొందును? 37

టీ:—మహాబాహో! బ్రహ్మణః - బ్రహ్మసంబంధమగు, పథి - మార్గమందు, విమూఢః - వివేకములేనివాఁడై, అప్రతిష్ఠః - నిరాశ్రయుఁడై, ఉభయవిభ్రష్టః -

---

తాత్మా, తేనాసంయతాత్మనా యోగో దుష్ప్రాపో దుఃఖేన ప్రాప్యత ఇతి మే మతిః యస్తు పున ర్వశ్యాత్మా ఽభ్యాసవైరాగ్యాభ్యాం వశ్యత్వ మాపాదిత ఆత్మా మనో యస్య సోఽయం వశ్యాత్మా తేన వశ్యాత్మనాతు యతతా భూయోఽపి ప్రయత్నం కుర్వతా శక్యోఽవాప్తుం యోగ ఉపాయతో యథోక్తా దుపాయాత్.36

తతో యోగాభ్యాసాంగీకరణేనేహలోకపరలోకప్రాప్తినిమిత్తాని కర్మాణి సంన్యస్తాని, యోగసిద్ధిఫలం చ మోక్షసాధనం సమ్యగ్దర్శనం న ప్రాప్త మితి యోగీ యోగమార్గా న్మరణకాలే చలితచిత్త ఇతి తస్య నాశ మాశంక్య అర్జున ఉవాచ - అయతిరితి. అయతి రప్రయత్నవా న్యోగమార్గే శ్రద్ధయాఽఽస్తిక్య బుద్ధ్యా చోపేతో యోగా దన్తకాలే చలితం మానసం మనో యస్య స చలితమానసో భ్రష్టస్మృతిః, సోఽప్రాప్య యోగసంసిద్ధిం యోగఫలం సమ్యగ్దర్శనం కాం గతిం హేకృష్ణ గచ్ఛతి. 37

కచ్చిదితి - కచ్చి త్కిం నోభయవిభ్రష్టః కర్మమార్గా ద్యోగమార్గాచ్చ

ఏత న్మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్య తే. 39

శ్రీభగవా నువాచ—

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. 40

---

కర్మజ్ఞాననిష్ఠల రెంటికిని జెడినవాఁడై, ఛిన్నాభ్రమివ - చిందరవందరలైన మేఘ ములవలె, న నశ్యతి కచ్చిత్ - నశింపఁడా? 38

టీ:—కృష్ణ! మే - నాయొక్క, ఏతత్ - ఈ, సంశయం - సందేహమును, అశే షతః - సంపూర్ణముగా, ఛేత్తుం - తొలగించుకొఱకు, అర్హసి - తగియున్నావు. అస్య - ఈ, సంశయస్య - సందేహముయొక్క, ఛేత్తా - తొలగించువాఁడు, త్వదన్యః నీకంటె మఱియొకఁడు, న ఉపపద్య తే హి - తెలియఁబడఁడుగదా! 39

తా:—కర్మసంన్యాసమును గావించి ధ్యానయోగము నాశ్రయించినవాఁడు, ధ్యానయోగఫలమగు సమ్యగ్దర్శనమును బొందకయే చచ్చినచో కర్మసంన్యా సము చేయుటచేఁ గర్మఫలమును విడచుటచేతను, సమ్యగ్దర్శనమును బొందక పోవుటచే సమ్యగ్దర్శనఫలమగు ముక్తి లభింపక పోవుటచేతను, కర్మఫలము, ముక్తి ఫలము నను రెండు ఫలములుతక్క ఫలాంతరము దెలియఁబడకపోవుటచేత నిట్టి యోగి యుభయభ్రష్టుఁడై చెడవలయునా లేక గత్యన్తర మెద్దియేని కలదా యను సందియముమీర నర్జునుఁ డీ మూఁడుగీతములచేఁ బ్రశ్నించుచున్నాఁడు.

టీ:—పార్థ! తస్య - అట్టియోగభ్రష్టునకు, ఇహ - ఈ లోకమందుగాని, అముత్ర-పరలోకమునందుగాని, వినాశః-చెడుగు, నఏవ విద్యతే - లేనేలేదు. తాత!

---

విభ్రష్టః సంఛిన్నాభ్రమివ నశ్యతి కింవా న నశ్యత్యప్రతిష్ఠో నిరాశ్రయో హే మహాబాహో విమూఢస్సన్ బ్రహ్మణః పథి బ్రహ్మప్రాప్తిమార్గే. 38

ఏత దితి. ఏత న్మే మమ సంశయం కృష్ణ ఛేత్తు మపనేతు మర్హ స్యశేషతః త్వదన్య స్త్వత్తోఽన్య ఋషి ర్దేవో వా ఛేత్తా నాశయితా సంశయస్యాస్య, నహి యస్మా దుపపద్య తే సంభవతి, అత స్త్వమేవ ఛేత్తు మర్హసీత్యర్థః. 39

పార్థేతి. హేపార్థ! నైవేహ లోకే నాముత్ర పరస్మి న్వా లోకే వినాశ స్తస్య విద్యతే నాస్తి, నాశో నామ పూర్వస్మా ద్ధీనజన్మప్రాప్తిః స యోగభ్రష్టస్య నాస్తి నహి యస్మా త్కల్యాణకృ చ్ఛుభకృత్ కశ్చిత్ దుర్గతిం కుత్సితాం గతిం

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. 42

---

కుమారా? కల్యాణకృత్ - శుభముల నొనర్చినవాఁడు, కశ్చిత్ - ఒకానొకఁడును, దుర్గతిం - చెడుగును, నహి గచ్ఛతి - పొందఁడుగదా. 40

టీ:—యోగభ్రష్టః - యోగభ్రష్టుఁడు, పుణ్యకృతాం - పుణ్యకార్యములను జేసినవారలయొక్క, లోకాన్ - లోకములను, ప్రాప్య-పొంది, శాశ్వతీః - అనేకములగు, సమాః - సంవత్సరములు, ఉషిత్వా - నివసించి, అనంతరము శుచీనాం-పవిత్రమగునట్టియు, శ్రీమతాం - ఐశ్వర్యవంతులైనవారలయొక్కయు, గేహే - గృహమందు, అభిజాయతే - పుట్టును. 41

టీ:—అథవా - లేక, ధీమతాం - బుద్ధిమంతులైనట్టియు, యోగినాంఏవ-సదాచారవంతులయొక్క- కులే - కులమునందు, భవతి - పుట్టును, ఏతత్ - ఇట్టి, యత్ - ఈదృశం - పైని చెప్పఁబడినటువంటి, జన్మ - పుట్టుక, లోకే - ఈలోకమునందు, దుర్లభతరంహి - సుకరముగ బొందుటకు శక్యము కాదు గదా! అనఁగా ఐశ్వర్యవంతుల యింఁడ్లయందు జన్మ లభించుట సుకరముగాని సదాచారవంతులగు కులీనుల వంశమందు జన్మ లభించుట దుర్ఘటమని తాత్పర్యము. 42

---

హే తాత! తనో త్యాత్మానం పుత్రరూపేణేతి పితా తాత ఉచ్యతే, పితైవ పుత్త్ర ఇతి పుత్త్రోపి తాత ఉచ్యతే, శిష్యోఽపి పుత్త్ర ఉచ్యతే, గచ్ఛతి. 40

కిం త్వస్య భవతి - ప్రాప్యేతి. యోగమార్గే ప్రవృత్త స్సంన్యాసీ సామర్థ్యాత్ప్రాప్య గత్వా పుణ్యకృతా మశ్వమేధాదియాజినాం లోకాన్ తత్ర చోషిత్వా వాస మనుభూయ శాశ్వతీ ర్నిత్యా స్సమాః సంవత్సరాన్, తద్భోగక్షయే శుచీనాం యథోక్తకారిణాం శ్రీమతాం విభూతిమతాం గేహే గృహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

అథవేతి. అథవా శ్రీమతాం కులా దన్యస్మి న్యోగినా మేవ దరిద్రాణాం కులే భవతి జాయతే ధీమతాం బుద్ధిమతామ్ ఏతద్ధి జన్మ య ద్దరిద్రాణాం యోగినాం కులే దుర్లభతరం దుఃఖలభ్యతరం పూర్వ మపేక్ష్య లోకే జన్మ య దీదృశం యథోక్తవిశేషణే కులే. 42

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన. 43

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. 44

---

టీ:—తత్ర - ఆ యోగులకులమందు, పౌర్వదేహికమ్ - పూర్వదేహసంబంధమగు, తం - అట్టి, బుద్ధిసంయోగమ్ - ఉత్తమజ్ఞానమును, లభతే - పొందును, కురునందన! తతః - అట్టి బుద్ధిసంయోగమువలన, భూయః - తిరుగ, సంసిద్ధౌ - సంసిద్ధివిషయమై, యతతే - ప్రయత్నించును. 43

టీ:—తేన - ఆ, పూర్వాభ్యాసేనఏవ - పూర్వదేహసంబంధమగు నభ్యాసపాటవముచేతనే, సః - ఆ యోగభ్రష్టుఁడు, అవశః అపి - వశము తప్పినవాఁడైనను, హ్రియతే హి - ఆకర్షింపఁబడును, అనఁగాఁ బూర్వాభ్యాసవశమున మరల యోగమునందుఁ బ్రవృత్తుఁడగు నని తాత్పర్యము. యోగస్య-యోగముయొక్క, జిజ్ఞాసురపి స్వరూపమును దెలిసికొన నిచ్ఛయించినవాఁడై, యోగమునందుఁ బ్రవర్తించినవాఁడై నప్పటికి, శబ్దబ్రహ్మ - వేదోక్తకర్మానుష్ఠానఫలమును, అతివర్తతే - అతిక్రమించుచున్నాఁడు. అట్టి విషయమును దెలిసికొని యోగమార్గము ననుసరించినచో మహాఫలమునుఁ బొందుటకు సందియము లేదని తాత్పర్యము. 44

---

యస్మాత్ త త్రేతి. తత్ర యోగినాం కులే తం బుద్ధిసంయోగం బుద్ధ్యా సంయోగం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం, పూర్వస్మిన్ దేహే భవం పౌర్వదేహికం యతతే చ ప్రయత్నం కరోతి, తత స్తస్మాత్పూర్వకృతాత్సంస్కారాత్ భూయో బహుతరం సంసిద్ధౌ సంసిద్ధినిమిత్తం హే కురునందన! 43

కథం పూర్వదేహబుద్ధిసంయోగ ఇతి తదుచ్యతే పూర్వాభ్యాసేనేతి. యః పూర్వజన్మని కృతోఽభ్యాస స్స పూర్వాభ్యాసః తేనైవ బలవతా హ్రియతే, హి యస్మా దవశోఽపి స యోగభ్రష్టః న కృతం చే ద్యోగాభ్యాసా త్సంస్కారా ద్బలవత్తర మధర్మాదిలక్షణం కర్మ తదా యోగాభ్యాసజనితేన సంస్కారేణ హ్రియతే అధర్మ శ్చే ద్బలవత్తరః కృత స్తేన యోగజోఽపి సంస్కారోఽభిభూయత ఏవ; తత్క్షయే తు యోగజ స్సంస్కారః స్వయ మేవ కార్య మారభతే న దీర్ఘకాలస్థస్యాపి వినాశ స్తస్యా స్తీత్యర్థః. జిజ్ఞాసు రపి యోగస్య స్వరూపం జ్ఞాతు మిచ్ఛన్ యోగమార్గే ప్రవృత్తః సంన్యాసీ యోగభ్రష్టః సామర్థ్యా త్సోఽపి శబ్దబ్రహ్మ వేదోక్తకర్మానుష్ఠానఫల మతివర్తతేఽపాకరిష్యతి కిముత బుద్ధ్వా యో యోగం తన్నిష్ఠోఽభ్యాసం కుర్యాత్. 44

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. 45

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున! 46

---

టీ:— ప్రయత్నాత్ - పూనికతో, యతమానః తు - ప్రయత్నించునట్టి, యోగీ - విద్వాంసుఁడు, సంశుద్ధకిల్బిషః - పాపములనుండి శుద్ధిఁజెందినవాఁడై, అనేకజన్మసంసిద్ధః - అనేకజన్మలయందుఁ గ్రమక్రమముగా సంపాదింపఁబడిన జ్ఞానముచే సమ్యగ్దర్శనమును బడసినవాఁడై, తతః - దానివలన, పరాం - ఉత్కృష్టమగు, గతిం - స్థానమగుముక్తిని, యాతి - పొందుచున్నాఁడు. 45

టీ:—యోగీ - యోగి, తపస్విభ్యః - తాపసులకంటెను, అధికః - శ్రేష్ఠుడగను, జ్ఞానిభ్యోఽపి - శాస్త్రజ్ఞానసంపన్నులకంటెను, అధికః - ఎక్కువవాఁడుగను, మతః - తలంపఁబడుచున్నాఁడు. యోగీ - యోగి, కర్మిభ్యశ్చ - కార్మికులకంటెను, అధికః - అధికుఁడే, తస్మాత్ - ఆకారణమువలన, అర్జున! (త్వం - నీవు) యోగీ - యోగానుష్ఠానపరుఁడవు, భవ - కమ్మా! 46

---

కుతశ్చ యోగిత్వం శ్రేయ ఇతి. ప్రయత్నాదితి. ప్రయత్నా ద్యతమానోఽధికం యతమాన ఇత్యర్థః. తత్ర యోగీ విద్వాన్ సంశుద్ధకిల్బిషః విశుద్ధకిల్బిషః సంశుద్ధపాపోఽనేకజన్మసంసిద్ధోఽనేకేషు జన్మసు కించి త్కించిత్సంస్కారజాత ముపచిత్య తేనోపచితే నానేకజన్మకృతేన సంసిద్ధోఽనేకజన్మసంసిద్ధ స్తతో లబ్ధసమ్యగ్దర్శనః సన్ యాతి పరాం ప్రకృష్టాం గతిమ్. 45

యస్మా దేవం తస్మాత్ తపస్విభ్య ఇతి. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి జ్ఞాన మత్ర శాస్త్రపాండిత్యం తద్వద్భ్యోఽపి మతో జ్ఞాతోఽధికః శ్రేష్ఠ ఇతి. కర్మిభ్యః అగ్నిహోత్రాది కర్మ తద్వద్భ్యోఽధికః యోగీ విశిష్టో యస్మా త్తస్మా ద్యోగీ భవార్జున. 46

యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః. 47

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
ధ్యానయోగోనామ షష్ఠోఽధ్యాయః.

---

టీ:-సర్వేషాం - సమస్తమగు, యోగినామపి - రుద్రాదిత్యాదిధ్యాననిష్ఠులలో, మద్గతేన - నన్ను బొందినటువంటి, అంతరాత్మనా - అంతఃకరణముచే, యః - ఏ, శ్రద్ధావాన్ - శ్రద్ధావంతుఁడు, మాం - నన్ను, భజతే - సేవించునో, సః - వాఁడు- మే - నాకు, యుక్తతమః - శ్రేష్ఠుఁ డని, మతః - అభిప్రాయము. 47

ఇది శ్రీవిద్యాశంకరపదమావేశపరికాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్యస్వాములవారిచే రచింపఁబడిన
గీతామృతతరంగిణియందు షష్ఠతరంగము.

---

యోగినామితి. యోగినా మపి సర్వేషాం రుద్రాదిత్యాదిధ్యానపరాణాం మధ్యే మద్గతేన మయి వాసుదేవే సమాహితేనాంతరాత్మనాఽంతఃకరణేన శ్రద్ధావాన్ శ్రద్దధానః స న్భజతే సేవతే యో మాం స మే మమ యుక్తతమో ఽతిశయేన యుక్తో మతోఽభిప్రేత ఇతి.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకర భగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
ధ్యానయోగోనామ షష్ఠోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## సప్తమోధ్యాయః

శ్రీభగవానువాచ:—

మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. 1

---

వాచకః ప్రణవో యస్య క్రీడావ స్త్వఖిలం జగత్,
శ్రుతి రాజ్ఞా వపు ర్జ్ఞానం తం వందే దేవకీసుతమ్.

టీ:—పార్థ! మయి - పరమేశ్వరుఁడనగు నాయందు, ఆసక్తమనాః - మనస్సును లగ్నముచేసినట్టియు, మదాశ్రయః-పరమేశ్వరుఁడ నగు నేనే యాధారముగా గల్గినట్టియు నీవు, యోగం - మనస్సమాధానమును, కుర్వన్ - చేయుచున్నవాఁడవై, సమగ్రం - విభూతిబలశక్త్యైశ్వర్యాదిగుణసంపన్నుఁడనగు, మాం - నన్ను, యథా - ఏప్రకారము, అసంశయం - సందేహరహితముగ, జ్ఞాస్యసి - తెలిసికొనఁగలవో, తత్ - నాచేఁ జెప్పఁబడునట్టి విషయమును, శృణు - వినుము.

తా:—రెండవ యధ్యాయమున నరువదియొకటవ గీతమున "యుక్త ఆసీత మత్పరః" అనువిధి నుపదేశించి యందు "మత్పరః" యను శబ్దమునందలి మచ్ఛబ్దముచే గ్రహింపవలసిన యర్థమును విశేషించి యాఱవయధ్యాయాంతమువఱకు

---

"యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యోమాం స మే యుక్తతమో మతః" (గీ. 6-47)

ఇతి ప్రశ్నబీజ ముపన్యస్య స్వయ మేవేదృశం మదీయం తత్త్వమేవం మద్గతాన్తరాత్మా స్యా దిత్యేత ద్వివక్షుః శ్రీభగవా నువాచ మయ్యాసక్తమనా ఇతి. మయి వక్ష్యమాణవిశేషణే పరమేశ్వరే ఆసక్తం మనో యస్య స మయ్యాసక్తమనాః హేపార్థ! యోగం యుంజన్మనస్సమాధానం కుర్వన్మదాశ్రయోఽహమేవ పరమేశ్వర ఆశ్రయో యస్య స మదాశ్రయః. యోహికశ్చి త్పురుషార్థేన కేన చిదర్థీ భవతి స తత్సాధనం కర్మ అగ్నిహోత్రాది తపోదానం వా కించి దాశ్ర

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే. 2

---

గల గ్రంథమున నచ్చటచ్చట శ్రీకృష్ణభగవానులు విశేషించి పలుకుచున్నను, నద్దానియందు నర్జునునియొక్క బుద్ధి లగ్నము కాకపోవుటచే మచ్ఛబ్దవాచ్యముచే గ్రహింపవలసిన స్వరూపవిశేషమును స్వయముగ నుపదేశింపఁదలఁచి యీయధ్యాయము నుపదేశించుచున్నారు. 1

టీ:—యత్ - ఏజ్ఞానమును, జ్ఞాత్వా - తెలిసికొనినపిదప, ఇహ - ఈలోకము నందు, భూయః - తిరిగి, అన్యత్ - వేఱొక, జ్ఞాతవ్యం - తెలియఁదగిన విషయము, న అవశిష్యతే - మిగిలియుండదో అట్టి, ఇదం - ఈ, సవిజ్ఞానం - స్వానుభవజ్ఞాన ముతోఁ గూడిన, జ్ఞానం - జ్ఞానమును, అశేషతః - పుష్కలముగ, తే - నీకొఱకు, అహం - నేను, వక్ష్యామి - చెప్పుచున్నాను. 2

తా:—తాఁ జెప్పఁబోవు జ్ఞానము స్వానుభవ పూర్వకజ్ఞానముగాని కేవల శాస్త్రాధ్యయనాదికముచే గ్రహింపఁబడినది మాత్రము కాదని నొక్కి చెప్పుటచే నీజ్ఞానము దుర్లభమనియు నెక్కుడు ఫలప్రదమనియుఁ దెలియవచ్చుచున్నది. 2

---

యం ప్రతిపద్యతేఽయంతు యోగీ మా మేవాశ్రయం ప్రతిపద్యతే హిత్వాఽన్య త్సాధనాంతరం మయ్యేవాసక్తమనా భవతి, యస్త్వమేవంభూత స్సన్నసంశయం సమగ్రం సమస్తం విభూతిబలశక్త్యైశ్వర్యాదిగుణసంపన్నం మాం యథా యేన ప్రకారేణ జ్ఞాస్యసి సంశయ మంతరేణ ఏవమేవ భగవా నితి తచ్ఛృణూచ్యమానం మయా. 1

యచ్చ మద్విషయమ్ - జ్ఞానమితి. జ్ఞానం తే తుభ్య మహం సవిజ్ఞానం విజ్ఞాన సహితం స్వానుభవయుక్త మిదం వక్ష్యామి కథయిష్యా మ్యశేషతః కార్త్స్న్యేన. తత్ జ్ఞానం వివక్షితం స్తౌతి శ్రోతు రభిముఖీకరణాయ. యత్ జ్ఞాత్వా యత్ జ్ఞానం జ్ఞాత్వా నేహ భూయః పున రన్యత్ జ్ఞాతవ్యం పురుషార్థసాధన మవశిష్యతే నావశిష్టం భవతి, ఇతి మత్తత్త్వజ్ఞః యస్స సర్వజ్ఞో భవతీత్యర్థః. అతో విశిష్టఫల త్వా ద్దుర్లభం జ్ఞానమ్. 2

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3
భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. 4

---

టీ:—మనుష్యాణాం - మనుష్యులయొక్క, సహస్రేషు - వేలలో, కశ్చిత్ - ఒకానొకఁడు, సిద్ధయే - జ్ఞానోత్పత్తికొఱకు, యతతి - ప్రయత్నించును, యతతాం- ప్రయత్నము చేయునట్టి, సిద్ధానా మపి - సత్త్వశుద్ధి గలవారలలోఁ గూడ, కశ్చిత్ - ఒకానొకఁడు, మాం - నన్ను, తత్త్వతః - యథార్థముగా, వేత్తి - తెలిసికొనును. 3

తా:— తాఁ జెప్పఁబోవు జ్ఞానము దుర్జ్ఞేయము గావున నెక్కువ శ్రద్ధతో వినవలయు నను నభిప్రాయముతో శ్రోత యగు నర్జునుని నుద్దేశించి యీ గీత మును బలికి జ్ఞాన ముపదేశింప నుపక్రమించుచున్నారు.

టీ:—భూమిః - అన పృథివీతన్మాత్రను మాత్రము గ్రహింపవలయును. ఆ తీరుననే, "ఆపః, అనలః, వాయుః, ఖం," అను పదములచే నబాది తన్మాత్రలే గ్రాహ్యములు, మనః - మనస్సునకుఁ గారణమగు నహంకారము, బుద్ధిః - అహం కారమునకుఁ గారణమగు మహత్తత్త్వము, అహంకారః - అవిద్యతోఁగూడిన నవ్య క్తము, ఇతి - అని, మే - నాయొక్క, ఇయం - ఈ పురోవర్తిని యగు, ప్రకృతిః - మాయాశక్తి, అష్టధా - ఎనిమిది విధములుగ, భిన్నా - భేదమును బొందుచున్నది. 4

---

కథ మిత్యుచ్యతే మనుష్యాణా మితి. మనుష్యాణాం మధ్యే సహస్రేష్వనే కేషు కశ్చి ద్యతతి ప్రయత్నం కరోతి సిద్ధయే సిద్ధ్యర్థమ్, తేషాం యతతా మపి సిద్ధానాం, సిద్ధా ఏవ హి తే, యే మోక్షాయ యతన్తే, తేషాం కశ్చి దేవ మాం వేత్తి తత్త్వతో యథావత్. 3

శ్రోతారం ప్రరోచనే నాభిముఖీ కృత్యాహ - భూమిరితి. భూమి రితి పృథివీ తన్మాత్రముచ్యతే, న స్థూలా "భిన్నా ప్రకృతి రష్టధా" ఇతివచనాత్; తథాఽబాదయోఽపి తన్మాత్రాణ్యేవోచ్యన్తే ఆపోఽనలో వాయుః ఖమ్ మన ఇతి మనసః కారణ మహంకారో గృహ్యతే బుద్ధి రిత్యహంకారకారణం మహత్త త్త్వమ్ అహంకార ఇత్యవిద్యాసంయుక్త మవ్యక్తమ్ యథా విషసంయుక్త మన్నం విష మిత్యుచ్యతే, ఏవ మహంకారవాసనావ దవ్యక్తం మూలకారణ మహంకార ఇత్యుచ్యతే ప్రవర్తకత్వా దహంకారస్య; అహంకార ఏవ హి సర్వస్య ప్రవృత్తి బీజం దృష్టం లోకే ఇతీయం యథోక్తా ప్రకృతి ర్మే మమైశ్వరీ మాయా శక్తి రష్టధా భిన్నా భేద మాగతా. 4

అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్. 5

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా. 6

---

టీ:—ఇయం - ఈయష్టవిధములగు మాయాశక్తి, అపరా - నికృష్టమును, అశుద్ధమును, అనర్థకరము నగు సంసారబంధరూపము. ఇతః తు - ఈయపరప్రకృతి కంటె విలక్షణమగు, మే నాయొక్క, అన్యాం - మఱియొక, పరాం - శ్రేష్ఠమగు, జీవభూతాం - జీవరూపమగు, ప్రకృతిం - శక్తిని, విద్ధి - తెలిసికొనుము, మహాబాహో! యయా - ఎట్టి పరప్రకృతిచే, ఇదం - ఈ పరిదృశ్యమానమగు, జగత్ - ప్రపంచము, ధార్యతే - ధరింపఁబడుచున్నదో. 5

టీ:—సర్వాణి - సమస్తములగు, భూతాని - జరాయుజాండజస్వేదజోద్భిజ రూపములగు భూతములు, ఏతద్యోనీని ఇతి - ఈపరాపర ప్రకృతులు రెండును గారణములుగాఁ గలవని, ఉపధారయ - తెలిసికొనుము. అహం - నేను, కృత్స్నస్య పుష్కలమగు, జగతః - ప్రపంచమునకు, ప్రభవః - ఉత్పత్తియు, తథా - ఆతీరు ననే, ప్రలయః - ప్రళయమును అనఁగాఁ బరాపరప్రకృతుల ద్వారా నేనే జగత్తునకుఁ గారణమని భావము. ఈమూఁడు గీతములును "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మ," అను సకలశ్రుతిశిరోఽవతంసమగు బ్రహ్మబోధక శ్రుతియొక్క స్మృతులు. అట్టి శ్రుతియొక్క విశేషవ్యాఖ్యాన మీ మూఁడు గీతములును. దీని వలనఁ దెలియవచ్చెడి విశేషవిషయ మేమన సకలచరాచరభూతములకు నుపాదాన కారణము ప్రకృతి యనుపేరఁ బఱగు మాయాశక్తి యనియు నయ్యది పరాపర

---

అపరేతి. అపరా న పరా నికృష్టా ఽశుద్ధాఽనర్థకరీ సంసారబంధనాత్మికే-యమ్ ఇతోఽస్యా యథోక్తాయా స్త్వన్యాం విశుద్ధాం ప్రకృతిం మమాత్మభూతాం విద్ధి, మే పరాం ప్రకృష్టాం జీవభూతాం క్షేత్రజ్ఞలక్షణాం ప్రాణధారణ నిమిత్తభూతాం హే మహాబాహో యయాప్రకృ త్యేదం ధార్యతే జగ దంతః ప్రవిష్టయా. 5

ఏతదితి. ఏతద్యోనీని ఏతే పరాపరే క్షేత్రక్షేత్రజ్ఞలక్షణే ప్రకృతీ యోని ర్యేషాం భూతానాం తా న్యేతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ జానీహి యస్మా న్మమ ప్రకృతీ యోనిః కారణం సర్వభూతానా మతోఽహం కృత్స్నస్య

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 7

రసోఽహ మప్సు కౌంతేయ! ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు. 8

---

భేదముచే ద్వివిధమనియు నందుఁ బరాశక్తి ప్రాణధారణమునకు హేతుభూతమగు జీవభావమను చైతన్యమనియు నపరాశక్తి జీవభావముచే వ్యవహారక్షమమగు జడమనియు నీచిజ్జడభావములు రెండును నీశ్వరునియొక్క శక్తులే యనుటచే నీశ్వరునితో సంబంధించినవనియు నీశ్వరునికంటె భిన్నములుననియు దెలియవచ్చెడిని. దానంజేసి యీద్వివిధశక్తికి నధిష్ఠానరూపమగు పరబ్రహ్మమే తానను శాస్త్రదృష్టి మీఁర శ్రీకృష్ణభగవాను లర్జునున కుపదేశించుచున్నారని పరమతాత్పర్యము. ఏతదాశయమే రాఁబోవు నైదుగీతములచే వివరింపఁబడుచున్నది. 6

టీ:—ధనంజయ! మత్తః - నాకంటె, పరతరం - శ్రేష్ఠమగు కారణము, అన్యత్ - మఱియొకటి, కించిత్ - ఎద్దియును, న అస్తి - లేదు. సూత్రే - దారమందు, మణిగణాఇవ - మణులసమూహములవలెనే, మయి - పరమేశ్వరుఁడ నగు నాయందు, ఇదం సర్వం - ఈ పరిదృశ్యమానమగు జగమంతయు, ప్రోతం - కూర్పఁబడియున్నది. అనఁగా సకల జగదాధారభూతుఁడను నేనే యని భావము. ఇచ్చట "సూత్రే మణిగణా ఇవ" యను నుపమానముచే నుపమేయమగు బ్రహ్మమందు గ్రహింపఁదగిన సర్వానుస్యూతత్వము పైగీతములచే వివరింపఁబడుచున్నది. 7

టీ:—కౌంతేయ! అప్సు - ఉదకములయందలి, రసః - సారభూతమగు రసము, అహం - నేను. ఇచట నుదకముల కధిష్ఠానభూతమగు తానే రసస్వరూపుఁడ ననియు

---

సమస్తస్య జగతః ప్రభవ ఉత్పత్తిః ప్రళయో వినాశ స్తథా ప్రకృతిద్వయద్వారేణాహం సర్వజ్ఞ ఈశ్వరో జగతః కారణ మిత్యర్థః. 6

యత స్తస్మాత్ మత్త ఇతి. మత్తః పరమేశ్వరా త్పరతర మన్యత్కారణాంతరం కించి న్నాస్తి న విద్యతే ఽహమేవ జగత్కారణ మిత్యర్థః హేధనంజయ యస్మా దేవం తస్మా న్మయి పరమేశ్వరే సర్వాణి భూతాని సర్వ మిదం జగత్ప్రోత మనుస్యూత మనుగత మనువిద్ధం గ్రథిత మిత్యర్థః దీర్ఘతంతుషు పటవత్సూత్రే చ మణిగణా ఇవ. 7

కేన కేన ధర్మేణ విశిష్టే త్వయి సర్వ మిదం ప్రోత మిత్యుచ్యతే రసఇతి. రసోఽహ మపాం య స్సార స్సరస స్తస్మిన్ రసభూతే మయ్యాపః ప్రోతా ఇత్యర్థః

పుణ్యో గంధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు. 9

నట్టి యాధారమగు రసమునందు నాధేయములుగా నుదకము లుండ నైయాయి కాదు లుదకమునందు రస మాధేయముగా నున్నదని చెప్పుట కేవల భ్రాంతి మూలక మని యెఱుంగునది. ఈ తీరుననే యుత్తరవిషయములందు గూడ లోక దృష్టికి విపరీతముగాఁ దత్త్వ ముపదేశించినట్లు గ్రహించునది. అనఁగా లోక దృష్టమగు నాధారాధేయభావమందు నాధేయము నాధారముగను నాధారము నాధేయముగను గ్రహించుటయే గాక నాధేయముగాఁ దోఁచు సారమంతయు నాధారమగు బ్రహ్మ యని పరమార్థము. ఏ ప్రకారము నే నుదకముల యందలి రసమో యా తీరుననే, శశిసూర్యయోః - చంద్రసూర్యులయందలి, ప్రభా - కాంతిగా, అస్మి - అగుచున్నాను. సర్వవేదేషు - సమస్త వేదములందును, ప్రణవః - ప్రణవరూప 'మగుచున్నాను. అనఁగా వర్ణములలో నోంకారమును, సంఖ్యలలో నవసంఖ్యయును. అట్టి ప్రణవరూపమగు నాయందు సకలవేదములును గూర్పఁబడియున్నవి. తథా - ఆతీరుననే, ఖే - ఆకసమునందు, శబ్దః - సారభూత మగు శబ్దమగుచున్నాను. అట్టి శబ్దరూపమగు నాయందు నాకసము కూర్పఁబడి యున్నది. తథా - ఆ తీరుననే, నృషు - మనుష్యులయందు, పౌరుషం, పుంబుద్ధియు నగుచున్నాను. అనఁగాఁ బురుషబుద్ధిస్వరూప మగు నాయందుఁ బురుషులు కూర్పఁబడుచున్నారు. 8

టీ: -పృథివ్యాం - పృథివియందు, పుణ్యః - పవిత్రమగు, గంధః చ - గంధ మును నేనే అనగా గంధరూపమగు నాయందుఁ బృథివి కూర్పఁబడినది. విభావసౌ - అగ్నిహోత్రునియందు, తేజః చ - దీప్తియును, అస్మి - అగుచున్నాను. తథా - ఆతీరు ననే, సర్వభూతేషు - సమస్తప్రాణికోటియందును, జీవనం - జీవభావము, అస్మి - అగుచున్నాను. తపస్విషు - తాపసులయందు, తపఃచ- తపస్సు, అస్మి అగుచున్నాను.

---

ఏవం సర్వత్ర యథాఽహ మప్సు రస ఏవం ప్రభాస్మి శశిసూర్యయోః ప్రణవ ఓంకార స్సర్వవేదేషు తస్మిన్ ప్రణవభూతే మయి సర్వే వేదాః ప్రోతాః, తథా ఖే ఆకాశే శబ్దః సారభూతః, తస్మి న్మయి ఖం ప్రోతమ్. తథా పౌరుషం పురుషస్య భావః పౌరుషం యతః పుంబుద్ధి ర్నృషు తస్మిన్ మయి పురుషాః ప్రోతాః. 8

పుణ్యఇతి. పుణ్యః సురభి ర్గంధః పృథివ్యాం చాహం తస్మి న్మయి గంధ భూతే పృథివీ ప్రోతా పుణ్యత్వం గంధస్య స్వభావత ఏవ పృథివ్యాం దర్శితం

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్. 10

బలం బలవతాం చాహం కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. 11

---

తా:—ఇచట జీవన మనఁగా దేనిచే సకలభూతములును స్థితియను జీవభావమును బొందుచున్నవో యా బ్రహ్మము నేనే. 9

టీ:—పార్థ! మాం - నన్ను, సర్వభూతానాం - సమస్తభూతములకును, సనాతనం - చిరంతనమగు, బీజం - ఉత్పత్తికారణముగా, - విద్ధి తెలిసికొనుమూ! ఈచరణ మారవగీతమందలి "అహం కృత్స్నస్య జగతః ప్రభవః" అనువాక్య వివరణము. బుద్ధిమతాం - వివేకవంతులయొక్క, బుద్ధిః - అంతఃకరణముయొక్క వివేచనా శక్తియు, తేజస్వినాం - సమర్థులయొక్క, తేజః - ప్రాగల్భ్యమును, అహం - నేనే, అస్మి - అగుచున్నాను. 10

టీ:—బలవతాం - బలవంతులయొక్క, కామరాగవివర్జితం - తృష్ణానురాగశూన్యమగు, బలం - సామర్థ్యము, అహంచ - నేనే, భరతర్షభ! భూతేషు - భూతములయందు, ధర్మావిరుద్ధః - శాస్త్రార్థావిరుద్ధమగు, కామః - దేహధారణమాత్రమున కుపయుక్తములగు నన్నపానాది విషయకమగు నిచ్ఛనై, అస్మి - అగుచున్నాను. 11

---

అబాదిషు రసాదేః పుణ్యత్వోపలక్షణార్థమ్ అపుణ్యత్వం తు గంధాదీనా మవిద్యాధర్మాద్యపేక్షం సంసారిణాం భూతవిశేషసంసర్గనిమిత్తం భవతి, తేజశ్చ దీప్తి శ్చాస్మి విభావసా వగ్నౌ, తథా జీవనం సర్వభూతేషు యేన జీవంతి సర్వాణి భూతాని త జ్జీవనమ్ తప శ్చాస్మి తపస్విషు, తస్మిం స్తపసి మయి తపస్వినః ప్రోతాః. 9

బీజమితి. బీజం ప్రరోహకారణం మాం విద్ధి సర్వభూతానాం హేపార్థ సనాతనం చిరంతనమ్. కించ బుద్ధి ర్వివేకశక్తి రంతఃకరణస్య బుద్ధిమతాం వివేకశక్తిమతా మస్మి తేజః ప్రాగల్భ్యం తద్వతాం తేజస్వినా మహమ్. 10

బలమితి. బలం సామర్థ్య మోజో బలవతా మహమ్ తచ్చ బలం కామరాగవివర్జితం కామశ్చ రాగశ్చ కామరాగౌ, కామ స్తృష్ణా ఽసన్నికృష్టేషు విషయేషు, రాగో రంజనా ప్రాప్తేషు విషయేషు, తాభ్యాం కామరాగాభ్యాం వివర్జితం దేహాదిధారణమాత్రార్థం బలం సత్త్వ మహ మస్మి, నతు య త్సంసారిణాం తృష్ణారాగకారణమ్, కించ ధర్మావిరుద్ధో ధర్మేణ శాస్త్రావిరుద్ధో నావిరుద్ధో యః ప్రాణిషు భూతేషు కామో యథా దేహధారణమాత్రాద్యర్థో ఽశనపానాదివిషయః స కామోస్మి హేభరతర్షభ. 11

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. 12

త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్. 13

---

టీ:—సాత్త్వికాః - సత్త్వసంబంధములగు, భావాః - పదార్థములు, యేచ ఏవ - ఏవి కలవో, రాజసాః - రజోగుణసంబంధములగు భావము లేవి కలవో, తామసాః చ - తమోగుణసంబంధములగు భావములును, యేచ - ఏవికలవో, తాన్ - ఆ భావముల నన్నిటిని, మత్తః ఏవ ఇతి - నావలననే పుట్టినవిగా, విద్ధి - తెలిసికొనుము. అహం - నేను, తేషు - వానియందు, నతు - ఎంతమాత్రమును లేను. అనఁగా నా భావము లెంతమాత్రమును నా కాశ్రయములు గావు. తే - ఆ భావములు, మయి - నాయం దున్నవి. అనఁగా ఆ భావములకు నేన యాధారమై యున్నాను. సకలభావములకు నాధారభూతము లగు బ్రహ్మము తా ననియు, సకల భావములు తననే యాశ్రయించియున్న వనియు నట్టి భావములు దనకు నెంత మాత్ర మాశ్రయములు గావనియుఁ దాత్పర్యము. ఈ గీతములు రెండవ యధ్యాయమున "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" అను బదునాఱవ గీతముయొక్కయు, మూఁడవ యధ్యాయమున "ఇంద్రియాణి పరా ణ్యాహుః" అను నలుఁబదిరెండవ గీతముయొక్కయు నాలుగవ యధ్యాయమున "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను పదునెనిమిదవ గీతముయొక్కయు, నైదవయధ్యాయమున "విద్యావినయసంపన్నే" యను పదునెనిమిదవ గీతముయొక్కయు నాఱవ యధ్యాయమున "సర్వభూతస్థ మాత్మానం" "యో మాం పశ్యతి" యను నిరువదితొమ్మిది ముప్పదియవ గీతములయొక్కయు వివరణరూపములు. 12

టీ:—ఏభిః - ఈ పరిదృశ్యమానములగు, త్రిభిః - మూఁడగు, గుణమయైః - సాత్త్వికరాజసతామసభేదములతో నొప్పు రాగద్వేషమోహాదిరీతులచేఁ బ్రకా

---

కించ యే ఇతి. యే చైవ సాత్త్వికాః సత్త్వనిర్వృత్తా భావాః పదార్థా రాజసా రజోనిర్వృత్తాః తామసా స్తమోనిర్వృత్తాశ్చ యే కేచి త్ప్రాణినాం స్వకర్మ వశా జ్జాయంతే భావా స్తాన్ మత్త ఏవ జాయమానా నిత్యేవం విద్ధి సర్వాన్ సమస్తా నేవ యద్యపి తే మత్తో జాయన్తే తథాపి న త్వహం తేషు తదధీన స్తద్వశో యథా సంసారిణః తే పున ర్మయి మద్వశా మదధీనాః. 12

ఏవంభూతమపి పరమేశ్వరం నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావం సర్వభూతాత్మానం నిర్గుణం సంసారదోషబీజప్రదాహకారణం మాం నాభిజానాతి జగ దిత్యను

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరంతి తే. 14

---

శించు, భావైః - పూర్వోక్తములగు పృథివ్యాదిపదార్థములచే, ఇదం - ఈ పరిదృశ్యమానమగు, సర్వం - సమస్తమునగు, జగత్ - ప్రపంచము, మోహితం - వ్యామోహము పెట్టఁబడి, ఏభ్యః - ఈ భూతభావములకంటె, పరం - భిన్నమును విలక్షణమును, అవ్యయం - జన్మాదివికారరహితము నగు, మాం - నన్ను, న అభిజానాతి - తెలియఁజాలకున్నది. 13

తా:— నాయందుఁ బరాపరప్రకృతిసంయోగముచే రజ్జు సర్పములట్లు వెలువడిన సకలభూతభావములును శబ్దాదివిషయములందలి రాగ ద్వేష మోహాదులచే నావరింపఁబడి విషయప్రీతి మీఱి నీభావములకు నతీతము విలక్షణము నిర్వికారము నిరంజనము నగు నాయొక్క పారమార్థిక స్వరూపముఁ దెలిసికొనఁజాలకున్నారని భావము. స్వస్వరూపమును గుర్తెఱుంగజాలకున్నారని రహస్యము. రెండవ యధ్యాయమున "ఆశ్చర్యవ త్పశ్యతి" యను నిరువదితొమ్మిదవగీతముయొక్కయు, మూఁడవయధ్యాయమున "ఆవృతం జ్ఞాన మేతేన" "ఇంద్రియాణి మనోబుద్ధిః" అను నిరువదితొమ్మిది ముప్పదవ గీతములయొక్కయు, నాలుగవయధ్యాయమున "తస్మాదజ్ఞానసంభూతమ్" అను నలువదిరెండవ గీతముయొక్కయు, నయిదవయధ్యాయమున "నాదత్తే కస్యచి త్పాపం" అనుపదునైదవ గీతముయొక్కయు విశేషవివరణముగా నీగీతము పరగుచున్నదని 'మోహితం, ముహ్యన్తి, విమోహయతి' యనులింగములచేఁ దెలియవచ్చెడిని. 13

టీ:— మమ - నాయొక్క, ఏషా - ఈ పరాపరరూపమగు, గుణమయీ - త్రిగుణాత్మకమును, దైవీ - ఈశ్వరసంబంధమునగు, మాయా - మాయాశక్తి, దుర

---

క్రోశం దర్శయతి భగవాన్ తచ్చ కింనిమిత్తం జగతోఽజ్ఞాన మిత్యుచ్యతే త్రిభిరితి. త్రిభి ర్గుణమయై ర్గుణవికారై రాగద్వేషమోహాదిప్రకారై ర్భావైః పదార్థై రేభి ర్యథోక్తైః సర్వ మిదం ప్రాణిజాతం జగన్మోహిత మవివేకతా మాపాదితం స న్నాభిజానాతి మాం ఏభ్యో యథోక్తేభ్యో గుణేభ్యః పరం వ్యతిరిక్తం విలక్షణం చావ్యయం వ్యయరహితం జన్మాదిసర్వభావవికారవర్జిత మిత్యర్థః. 13

కథం పున ర్దైవీ మేతాం త్రిగుణాత్మికాం వైష్ణవీం మాయా మతిక్రామన్తీ త్యుచ్యతే దైవీతి. దైవీ దేవస్య మమ ఈశ్వరస్య విష్ణోః స్వభూతా హి యస్మా

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః,
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. 15

---

త్యయా - అతిక్రమించుటకుఁ గష్టతరమైనది. యే - ఎవరలైతే, మాం ఏవ - సర్వధర్మములను విడచి కేవలపరమాత్మస్వరూపుఁడ నగు నన్నే, ప్రపద్యన్తే - పొందుచున్నారో, తే - వారలే, ఏతాం - ఈ దేవతా సంబంధమగు, మాయాం - అజ్ఞానమును, తరంతి - దాఁటుచున్నారు. 14

తా:—సకలప్రాణివ్యామోహకారణ మగు నీభగవన్మాయను దాఁటుటకు సర్వకర్మ సంన్యాస పూర్వక జ్ఞాననిష్ఠతక్క వేఱొకటి సాధనము గానేఱదని తాత్పర్యము. మూఁడవ యధ్యాయమున "ఏవంబుద్ధేః పరం బుద్ధ్వా" యను నలుబది మూఁడవ గీతముయొక్కయు, నాలుగవ యధ్యాయమున యోగసంన్యస్తకర్మాణం అను నలుబదియొకటవ గీతముయొక్కయు, నయిదవయధ్యాయమున, 'భోక్తారం యజ్ఞతపసాం' అను నిరువదితొమ్మిదవ గీతముయొక్కయు, నాఱవ యధ్యాయమున "యోగినా మపి సర్వేషాం" అను నలుబదవ గీతముయొక్కయు వివరణరూపమీ గీతము. 14

టీ:—దుష్కృతినః - పాపకర్ములును, మూఢాః - వివేకహీనులును అగు, నరాధమాః - నికృష్టులగు మనుష్యులు, మాయయా - అజ్ఞానముచేతను, అపహృతజ్ఞానాః - పోయినవివేకముగలవారై, ఆసురం - హింసాఽనృతాదిరూపమగు, భావం - స్వభావమును, ఆశ్రితాః - ఆశ్రయించినవారలై, మాం - పరమేశ్వరుఁడ నగునన్ను, న ప్రపద్యన్తే - పొందనేరరు. 15

తా:—ఆసురభావము నాశ్రయించిన వారలయొక్క స్వరూపస్వభావములు దైవాసుర సంపద్విభాగయోగమునందును శ్రద్ధాత్రయవిభాగయోగమునందును విపులముగ వివరింపఁబడియున్నవి. 15

---

దేషా యథోక్తా గుణమయీ మమ మాయా దురత్యయా దుఃఖే నాత్యయోఽతిక్రమణం యస్యాః సా దురత్యయా. తత్రైవంసతి సర్వధర్మాన్పరిత్యజ్య మామేవ మాయావినం స్వాత్మభూతం సర్వాత్మనా యే ప్రపద్యన్తే తే మాయా మేతాం సర్వభూతమోహినీం తర న్త్యతిక్రామంతి, సంసారబంధనా న్ముచ్యంత ఇత్యర్థః. 14

యది త్వాం ప్రపన్నా మాయా మేతాం తరంతి కస్మా త్త్వామేవ సర్వే న ప్రపద్యన్తే ఇత్యుచ్యతే - నమామితి. న మాం పరమేశ్వరం నారాయణం దుష్కృతినః పాపకారిణః మూఢాః ప్రపద్యన్తే నరాధమా నరాణాం మధ్యేఽధమా

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ! 16
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః. 17

---

టీ:-భరతర్షభ! అర్జున! సుకృతినః - పుణ్యకర్మల నొనరించినట్టి, జనాః - మనుష్యులు, చతుర్విధాః - నాలుగువిధములుగ, మాం - నన్ను, భజన్తే - సేవించుచున్నారు. అట్టి నాలుగువిధములగువార లెవ్వరన, ఆర్తః - దొంగలు క్రూరమృగములు, శత్రువులు రోగములు మొదలగువానిచేఁ బీడింపఁబడినవాఁడు, అర్థార్థీ-సంపత్కాముఁ డన దారపుత్త్ర ధనాదుల నపేక్షించువాఁడు, జిజ్ఞాసుః - బ్రహ్మతత్త్వము నెఱుంగ నిచ్ఛయించినవాఁడు, జ్ఞానీచ - బ్రహ్మవేత్తయును. 16

తా:-భగవంతుని నుపాసించుభక్తులు తమతమ యభీష్టభేదముచే నార్తులనియు, నర్థార్థులనియు, జిజ్ఞాసువులనియు, జ్ఞానులనియు నాల్గుతెఱంగులఁ బరంగుచున్నా రని భావము. 16

టీ:-తేషాం - ఆ నాలుగు విధములగు భక్తులలో, జ్ఞానీ - బ్రహ్మవేత్త, నిత్యయుక్తః - నిరంతరధ్యాననిష్ఠుఁడును, ఏకభక్తిః - అద్వితీయమగు స్వస్వరూపమును సేవించువాఁడునై, విశిష్యతే - ఉత్తమభావమునుబొందుచున్నాఁడు. అహం - నేను, జ్ఞానినః - జ్ఞానికి, అత్యర్థం - అతిశయముగ, ప్రియోహి - ఇష్టుఁడనుగదా! స చ - ఆజ్ఞానియు, మమ - నాకు, ప్రియః - ఇష్టుఁడును. 17

---

నికృష్టాః తేచ మాయయాపహృతజ్ఞానాః సమ్ముషితజ్ఞానాః ఆసురం భావం హింసానృతాదిలక్షణ మాశ్రితాః. 15

యే పున ర్నరోత్తమాః పుణ్యకర్మాణః - చతుర్విధాఇతి. చతుర్విధాః చతుఃప్రకారాః భజన్తే సేవంతే మాం జనాస్సుకృతినః పుణ్యకర్మాణో హేఅర్జున! ఆర్త ఆర్తిపరిగృహీత స్తస్కరవ్యాఘ్రరోగాది నాభిభూత ఆపన్నో జిజ్ఞాసు ర్భగవత్తత్త్వం జ్ఞాతు మిచ్ఛతి యః అర్థార్థీ ధనకామః, జ్ఞానీ విష్ణో స్తత్త్వవిచ్చ హే భరతర్షభ! 16

తేషామితి. తేషాం చతుర్ణాం మధ్యే జ్ఞానీ తత్త్వవి త్తత్త్వవిత్త్వా న్నిత్యయుక్తో భవ త్యేకభక్తి శ్చాన్యస్య భజనీయస్యాదర్శనా దతః స ఏకభక్తి ర్విశిష్యతే. విశేష మాధిక్య మాపద్యతే, ఽతిరిచ్యత ఇత్యర్థః. ప్రియో హి యస్మా దహ మాత్మా జ్ఞానినోఽత స్తస్యాహ మత్యర్థం ప్రియః, ప్రసిద్ధం హి లోక ఆత్మా

ఉదారా స్సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మేవా నుత్తమాం గతిమ్. 18
బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః. 19

---

టీ:—సర్వే - ఈ నాలుగు విధములగు, ఏతే - ఈ భక్తులు, ఉదారా ఏవ - ఇతర మనుజులకంటె శ్రేష్ఠులే. వారలలోఁగూడ, జ్ఞానీతు - జ్ఞానియన్ననో మే - నా యొక్క, ఆత్మైవ - స్వరూపమే యని, మతం - నా యభిప్రాయము. ఇచట 'మే' యను పదము దేహళీదీపన్యాయముచే నుభయత్ర యన్వయించును. యుక్తాత్మా - సమాహితాంతఃకరణ గలిగిన, సః - ఆజ్ఞాని, మాం ఏవ - పరబ్రహ్మ మగు నన్నే, అనుత్తమాం - నిరుపమానమగు, గతిం - గమ్యస్థానముగాఁ బొందుటకు, ఆస్థితః హి - ప్రవర్తించియున్నాఁడు గదా! 18

తా:-జ్ఞాని సర్వోత్కృష్టుఁడును, జిజ్ఞాసు వుత్కృష్టుడుగను, ఆర్తార్థార్థులు సామాన్యులుగను దెలియవచ్చుచున్నను వీర లందరను సమానముగ నుదారులే యని చెప్పుటకుఁగల కారణ మేమన దమతమ యభీష్టములచే మందమధ్యమోత్తమ భావములఁ బరగుచున్నను దమతమ యభీష్టసిద్ధికిఁ బరమేశ్వరుఁడే గతియని భగవంతునియందు విశ్వాసము గలిగినవార లగుటచే నహంకార మమకారగ్రస్తులగు గురు దేవతాధిక్కారులకంటె సర్వవిధముల వీరలు శ్రేష్ఠు లని యభిప్రాయము. 18

టీ:—బహూనాం - అనేకములగు, జన్మనాం - జన్మలయొక్క, అంతే - సమాప్తియందు, జ్ఞానవాన్ - జ్ఞానవంతుఁడు, మాం - నన్ను, ప్రపద్యతే - పొందుచున్నాఁడు, అనఁగా జ్ఞాన మనేకజన్మలయందలి సత్కర్మపరిపాకమువలన నలవడునని తాత్ప

---

ప్రియో భవతీతి; తస్మాత్ జ్ఞానిన ఆత్మత్వా ద్వాసుదేవః ప్రియో భవతీత్యర్థః. సచ జ్ఞానీ మమ వాసుదేవస్యాత్మైవేతి మమాత్యర్థం ప్రియః. 17

న తర్హ్యార్తాదయ స్త్రయో వాసుదేవస్య ప్రియాః న, కింతర్హి ఉదారా ఇతి. ఉదారా ఉత్కృష్టా స్సర్వఏవైతే త్రయోఽపి మమ ప్రియా ఏవేత్యర్థః; నహి కశ్చిన్మద్భక్తో మమ వాసుదేవస్యాప్రియో భవతి. జ్ఞానీ త్వత్యర్థం ప్రియో భవతీతి విశేషః; తత్కస్మా దిత్యత ఆహ. జ్ఞానీత్వాత్మైవ నాన్యో మత్త ఇతి మే మమ మతం నిశ్చయః, ఆస్థిత ఆరోఢుం ప్రవృత్తః స జ్ఞానీ హి యస్మా దహమేవ భగవా న్వాసుదేవో నాన్యోఽస్మీత్యేవం యుక్తాత్మా సమాహితచిత్తః స న్మామేవ పరం బ్రహ్మ గన్తవ్య మనుత్తమాం గతిం గంతుం ప్రవృత్త ఇత్యర్థః. 18

జ్ఞానీ పునరపి స్తూయతే బహూనామితి. బహూనాం జన్మనాం జ్ఞానార్థసంస్కారాశ్రయాణాం అంతే సమాప్తౌ జ్ఞానవాన్ ప్రాప్తపరిపాకజ్ఞానో మాం వాసుదేవం

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః,
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా. 20

ర్యము. ఎట్టిజ్ఞానము గలిగిన జ్ఞానియగునో యయ్యది యీ రెండవచరణముచేఁ జెప్పఁబడుచున్నది. వాసుదేవః - పరమాత్మయగు నేనే, సర్వం - ఈపరిదృశ్యమానమగు జగమంతయును, ఇతి - అను జ్ఞానము బడసిన, సః - అట్టి, మహాత్మా - పరమాత్మయేస్వస్వరూపమని భావము జెందినవాఁడు, సుదుర్లభః - లభించుట కష్టతరము. అనఁగా ననేకమనుష్యసహస్రములందు నిట్టివాఁడు లభించుట దుర్ఘట మని యీ యధ్యాయము నందలి "మనుష్యాణాం సహస్రేషు" అను మూఁడవగీతము యొక్క యభిప్రాయ మనువదింపఁబడుచున్నది. 19

టీ:—స్వయా - తమతమయొక్క, ప్రకృత్యా - పూర్వజన్మలయందుఁ జేసిన కర్మలయొక్క వాసనావిశేషముచే, నియతాః - నియమింపఁబడినవారలై, తైః తైః - ఆయాయి, కామైః - కోరికలచే, అపహృతజ్ఞానాః - కోలుపోయిన వివేకము గలవారలై, తం తం - ఆయాయికోరికల కనుగుణమగు, నియమం - నియమమును అనఁగా వ్రతాదులను, ఆస్థాయ - ఆశ్రయించి, అన్యదేవతాః - పరమాత్మ కంటె భిన్నమగు నితరదేవతలను, ప్రపద్యన్తే - పొందుచున్నారలు.

తా:—ఈ గీత మీయధ్యాయమందలి "త్రిభి ర్గుణమయై ర్భావైః" అను పదమూఁడవగీతముయొక్క వివరణము. 20

ప్రత్యగాత్మానం ప్రత్యక్షతః ప్రతిపద్యతే కథమ్, వాసుదేవ స్సర్వమితి. యఏవం సర్వాత్మానం మాం నారాయణం ప్రతిపద్యతే స మహాత్మా, న తత్సమోఽన్యోఽస్త్యధికో వా, అత స్సుదుర్లభో "మనుష్యాణాం సహస్రేషు" (గీ. 7-3 ఇత్యుక్తమ్).19

ఆత్మైవ సర్వో వాసుదేవ ఇత్యేవ మప్రతిపత్తౌ కారణ ముచ్యతే కామై రితి. కామై స్తైస్తైః పుత్రపశుస్వర్గాదివిషయై ర్హృతజ్ఞానా అపహృతవివేకవిజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః ప్రాప్నువంతి వాసుదేవా దాత్మనోఽన్యా దేవతాః, తంతం నియమం దేవతారాధనే ప్రసిద్ధో యోయో నియమ స్తం త మాస్థాయాశ్రిత్య ప్రకృత్యా స్వభావేన జన్మాన్తరార్జితసంస్కారవిశేషేణ నియతా నియమితాః స్వయా ఆత్మీయయా. 20

యో యో యాంయాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్. 21

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యా రాధన మీహతే,
లభతే చ తతః కామా న్మయైవ విహితాన్హితాన్. 22

---

టీ:—యః యః - ఏయే, భక్తః - భక్తుఁడు. యాం యాం - ఏయేదేవతా సంబంధమగు, తనుం - శరీరమును, శ్రద్ధయా - విశ్వాసముతో, అర్చితుం-పూజించుటకు, ఇచ్ఛతి - తలఁచుచున్నాఁడో, తస్య తస్య - ఆయాయికోరికలు గల భక్తునకు, తాం - ఆదేవతయందలి, శ్రద్ధాంఏవ - విశ్వాసమునే, అహం - నేను, విదధామి - దృఢపరచుచున్నాను. అనఁగా నాయాయిఫలములను బొందించు చున్నానని తాత్పర్యము. ఇచట 'యాంయాంతనుం' అని దేవతలను దేహపర్యాయపదమగు తనుశబ్దముచే నుదాహరించుటచే శ్రుతిస్మృతులందు దెలియవచ్చెడి దేవత లందరును బరమేశ్వరునియొక్క పరాపరప్రకృతి వికారవిశేషములే యనియు నా దేహవిశేషములచే భక్తులు వడయు ఫలములన్నిటికి నధిష్ఠానమగు తానే పరమకారణమనియు రహస్యము. ఈ రహస్య ముత్తరగీతముచే వ్యక్తీకరింపఁబడుచున్నది. 21

టీ:— సః - ఆ కోరికలను గోరు భక్తుఁడు, తయా - అట్టి దేవతాసంబంధమగు, శ్రద్ధయా - విశ్వాసముతో, యుక్తః - కూడుకొనినవాఁడై, తస్యాః - ఆ దేవతయొక్క, రాధనం - పూజావిశేషమును, ఈహతే - ఆచరించుచున్నాఁడు. తతః - ఆరాధన చేయఁబడిన ఆ యాయిదేవతా శరీరమువలన, మయాఏవ - పరమేశ్వరుఁడ నగు నాచేత, విహితాన్ - కర్మఫలవిభాగముచే నొసంగఁబడెడు, తాన్ - అట్టి, కామాన్ - కోరికలను, లభతేహి - పొందుచున్నాఁడు గదా! 22

తా:—ఈ రెండు గీతములయందును దేవతాశబ్ద స్మారకమగు తనుశబ్ద ప్రయోగమువలన నొక విశేషము తెలియవచ్చెడిని. అ దెద్దియన, తనుభేదముచే దేవతాభేదము తెలియఁబడుచున్నదనియు, దనుశబ్దము స్త్రీలింగశబ్ద మగుటచే

---

తేషాంచ కామినామ్ - యో యఇతి. యో యః కామీ యాం యాం దేవతా తనుం శ్రద్ధయా సంయుక్తో భక్తశ్చన న్నర్చితుం పూజయితు మిచ్ఛతి తస్యతస్య కామినోఽచలాం స్థిరాం శ్రద్ధాం తామేవ విదధామి స్థిరీకరోమి యమైవ పూర్వాం ప్రవృత్తః. 21

స్వభావతో యో యాం దేవతాతనుం శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి - స తమేతి. స తయా మద్విహితయా శ్రద్ధయా యుక్తః సం స్తస్యా దేవతాతన్వా

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్య్వల్పమేధసామ్,
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి. 23

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః,
పరం భావ మజానంతో మమావ్యయ మను త్తమమ్. 24

---

దేవతలకు మూలకారణము ప్రకృతి యని సూచింపఁబడుచున్నది. వ్యవహారము నందు దేవతలకు స్త్రీపుంభేదము దెలియఁబడుచున్నను నియ్యది కల్పితభేదమనియు నన్ని యుపాధులును బ్రకృతి వికారములే యగుటచేఁ బురుషుఁ డనుపేరఁ బరగు పరమాత్మ కంటె నత్యంతము విలక్షణ మగుటంజేసి స్త్రీ శబ్దవాచ్యము లగుచున్నవి. సకలోపాధిశూన్యమగు పరమాత్మను బురుషుఁ డనినచో దద్విలక్షణ మగు నుపాధు లన్నియు స్త్రీశబ్దవాచ్యములే యగును. 22

టీ: - తేషాం - ఆ కోరికలను గోరునట్టి, అల్పమేధసాం - స్వల్పబుద్ధులయొక్క, తత్ - ఆ కర్మల సంబంధమగు, ఫలం - ప్రయోజనము, అంతవత్ తు - నశించు స్వభావము కలదియే. అనగా శాశ్వత మెంతమాత్రము కాదు. దేవాన్ - దేవతలను, దేవయజః - దేవతల నారాధించువారు. యాంతి - పొందుచున్నారు. మద్భక్తాః - నాయొక్క భక్తులు, మాం అపి - నన్నే, యాంతి - పొందుదురు. ఇచట అపిశబ్ద మేవకారార్థము. 23

టీ:—మమ - నాయొక్క, అవ్యక్తం - అవాఙ్మనసగోచరమైనట్టియు, అవ్యయం - నిర్వికార మగునట్టియు, అనుత్తమమ్ - నిరతిశయ మైనట్టియు, పరం -

---

రాధన మారాధన మీహ తే చేష్టతే లభతేచ తత స్తస్యా ఆరాధితాయా దేవతాతన్వాః కామా నీప్సితా న్మయైవ పరమేశ్వరేణ సర్వజ్ఞేన కర్మఫలవిభాగజ్ఞతయా విహితా న్నిర్మితాం స్తాన్, హి యస్మా త్తే భగవతా విహితాః కామా స్తస్మాత్తా నవశ్యం లభత ఇత్యర్థః; హితానితి పదచ్ఛేదే హితత్వం కామానా ముపచరితం కల్ప్యం, నహి కామా హితాః కస్యచిత్. 22

యస్మా దంతవత్సాధనవ్యాపారా అవివేకినః కామినశ్చ తే అతః - అంతవదితి. అంతవ ద్వినాశి తు ఫలం తేషాం తద్భవ త్య్వల్పమేధసా మల్పప్రజ్ఞానామ్ దేవా న్దేవయజః యాంతి దేవా న్యజన్తే ఇతి దేవయజః, తే దేవా న్యాంతి మద్భక్తా యాంతి మామపి ఏవం సమానేఽప్యాయాసే మామేవ న ప్రపద్యన్తేఽనంత ఫలాయ. అహో ఖలు కష్టం వర్తన్తే ఇత్యనుక్రోశం దర్శయతి భగవాన్. 23

కింనిమిత్తం మామేవ న ప్రపద్యన్తే ఇత్యుచ్యతే - అవ్యక్తమితి, అవ్యక్తమప్రకాశం వ్యక్తి మాపన్నం ప్రకాశం గత మిదానీం మన్యన్తే మాం నిత్య

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్. 25

---

ఉత్కృష్టమగు, భావం - పరమాత్మస్వరూపమును, అజానంతః - గుర్తెఱుంగని, అబుద్ధయః - అవివేకులు, మాం - నన్ను, వ్యక్తిం - ఇంద్రియగోచరమగు తనుభావమును, ఆపన్నం - పొందినవానిగా, మన్యన్తే - తలంచుచున్నారు. 24

టీ:- అహం - నేను, యోగమాయా సమావృతః - త్రిగుణాత్మకమగు మాయచే నావరింపఁబడినవాఁడనై, సర్వస్య - సమస్త ప్రాణికోటికిని, ప్రకాశః - తెలియువాఁడను, న - కాను. అనఁగా జ్ఞానులకు మాత్రమే గోచరించువాఁడ నని భావము. అయం - ఈ, మూఢః - అవివేకమగు, లోకః - మనుష్యకోటి, అజం - పుట్టుక లేనట్టియు, అవ్యయమ్ - నాశరహితమగునట్టి, మాం - నన్ను, న అభిజానాతి - తెలిసికొనలేదు. 25

తా:- ఈ యధ్యాయమునందలి "త్రిభి ర్గుణమయైః" "నమాం దుష్కృతినః" అను పదమూఁడు పదునేడవ గీతములయొక్క వ్యాఖ్యానవిశేషమే యీ రెండు గీతములును. 25

---

ప్రసిద్ధ మీశ్వరమపి సంత మబుద్ధయోఽవివేకినః పరం భావం పరమాత్మస్వరూప మజానంతోఽవివేకినో మమావ్యయం వ్యయరహిత మనుత్తమం నిరతిశయం మదీయం భావ మజానన్తో మన్యంత ఇత్యర్థః. 24

తదీయ మజ్ఞానం కింనిమిత్త మిత్యుచ్యతే నాహమితి. నాహం ప్రకాశ స్సర్వస్య లోకస్య కేషాంచిదేవ మద్భక్తానాం ప్రకాశోఽహ మిత్యభిప్రాయః. యోగమాయాసమావృతో యోగో గుణానాం యుక్తి ర్ఘటనం, సైవ మాయా యోగమాయా, తయా యోగమాయయా సమావృతః సంఛన్న ఇత్యర్థః, అతఏవ మూఢో లోకోఽయం నాభిజానాతి మా మజ మవ్యయమ్. యయా యోగమాయయా సమావృతం మాం లోకో నాభిజానాతి, నాసౌ యోగమాయా మదీయా సతీ మమేశ్వరస్య మాయావినో జ్ఞానం ప్రతిబధ్నాతి యథాఽన్యస్యాపి మాయావినః మాయాజ్ఞానం తద్వత్. 25

వేదాహం సమతీతాని వ ర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత,
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప! 27

---

టీ:—అర్జున! అహం - నేను, సమతీతాని - గడచినట్టియు, వ ర్తమానాని - ప్రకృతమున నున్నట్టియు; భవిష్యాణిచ - రాబోవునట్టియు, భూతాని - సమ స్తభూతములగూర్చియు, వేద - తెలిసికొనుచున్నాను. మాంతు - నన్ననన్నో, కశ్చన - ఒకానొకఁడును, న వేద - తెలిసికొనఁజాలకున్నాఁడు. 26

తా:— ఈగీతము రెండవయధ్యాయమున "న త్వేవాహం" అను పండ్రెండవ గీతముయొక్కయు, నాలుగవయధ్యాయమున "బహూని మే వ్యతీతాని" అను నైదవ గీతముయొక్కయు వివరణమని "న వేద" యనులింగముచే గ్రహింపనగును. 26

టీ:—పరంతప! భారత! ఇచ్ఛాద్వేషసముత్థేన - కామక్రోధములచే బయలువెడలిన, ద్వంద్వమోహేన - శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వములయందలి వ్యామోహముచే, సర్వభూతాని - సమ స్తభూతములును, సర్గే - ఉత్పత్తికాలమున, సంమోహం - పుష్కలమగు మూఢభావమును, యాంతి - పొందుచున్నవి. 27

తా:— ఈగీత మీయధ్యాయమందలి "త్రిభిర్గుణమయైః" అను పదమూఁడవ గీతముయొక్క వివరణము. 27

---

యత ఏవ మతః - వేదేతి. అహంతు వేద జానే సమతీతాని సమతిక్రాన్తాని భూతాని వ ర్తమానాని చార్జున, భవిష్యాణి చ భూతాని వేదాహం, మాంతు వేద న కశ్చన మద్భ క్తం మచ్ఛరణ మేకం ముక్త్వా మ త్తత్త్వవేదనాభావాదేవ న మాం భజ తే. 26

కేన పున ర్మత్తత్త్వవేదన ప్రతిబంధేన ప్రతిబద్ధాని సంతి జాయమానాని సర్వభూతాని మాం న విదన్తీ త్యపేక్షాయా మిద మాహ - ఇచ్ఛేతి. ఇచ్ఛాద్వేషసముత్థేన, ఇచ్ఛాచ ద్వేష శ్చేచ్ఛాద్వేషౌ, తాభ్యాం సముత్తిష్ఠతీ తీచ్ఛాద్వేషసముత్థ స్తే నేచ్ఛాద్వేష సముత్థేన కేనేతి విశేషాపేక్షాయా మిద మాహ-ద్వంద్వమోహేన ద్వంద్వనిమిత్తో మోహో ద్వంద్వమోహ స్తేన తావేవేచ్ఛాద్వేషౌ శీతోష్ణవ త్పరస్పరవిరుద్ధౌ సుఖదుఃఖ తద్ధేతువిషయౌ యథాకాలం సర్వభూతై స్సంబధ్యమానౌ ద్వంద్వశబ్దే నాభిధీయే తే. తతో యదా ఇచ్ఛాద్వేషౌ సుఖదుఃఖ తద్ధేతుసంప్రాప్త్యా లబ్ధాత్మకౌ భవత స్తదా తౌ సర్వభూతానాం ప్రజ్ఞాయాః

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. 28
జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్. 29

---

టీ:- యేషాం - యే, పుణ్యకర్మణాం - పుణ్యకర్మల నాచరించినవారల యొక్క, పాపం - దుష్కృతము, అంతగతం - క్షీణముగునో, తేతు-వారలన్ననో, ద్వంద్వమోహనిర్ముక్తాః - శీతోష్ణాది ద్వంద్వములయందలి వ్యామోహమునుండి విడువఁబడిన వారలై, దృఢవ్రతాః - తీవ్రమగు నిష్ఠగలిగినవారలై, మాం-నన్ను భజన్తే- సేవించుచున్నారు. 28

టీ:-జరామరణమోక్షాయ - జరామరణములనుండి విముక్తిఁ జెందుటకు, మాం - నన్ను, ఆశ్రిత్య - ఆశ్రయించి, యే - ఎవరు, యతంతి - ప్రయత్నము

---

స్వవశాపాదనద్వారేణ పరమార్థాత్మతత్త్వవిషయ జ్ఞానోత్పత్తి ప్రతిబంధకారణం మోహం జనయతః న హీచ్ఛాద్వేషదోషవశీకృతచిత్తస్య యథాభూతార్థవిషయ జ్ఞాన ముత్పద్యతే, బహిరపి కిము వక్తవ్యం తాభ్యా మాదిష్టబుద్ధే స్సంమూఢస్య ప్రత్యగాత్మని బహుప్రతిబంధే జ్ఞానం నోత్పద్యత ఇతి. అతస్తేనేచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత భరతాన్వయజ! సర్వభూతాని సంమోహితాని సన్తి సమ్మోహం సమ్మూఢతాం సర్గే జన్మని, ఉత్పత్తికాల ఇత్యేతత్ యాంతి గచ్ఛన్తి హేపరంతప! మోహవశాన్యేవసర్వభూతాని జాయమానాని జాయంత ఇత్యభిప్రాయః; యతఏవ మత స్తేన ద్వంద్వమోహేన ప్రతిబద్ధప్రజ్ఞానాని సర్వభూతాని సంమోహితాని మా మాత్మభూతం న జానంతి, అతఏవాత్మభావేన మాం న భజన్తే. 27

కే పున రనేన ద్వంద్వమోహేన నిర్ముక్తా స్సంత స్త్వాం విదిత్వా యథాశాస్త్ర మాత్మభావేన భజన్త ఇత్యపేక్షిత మర్థం దర్శయితు ముచ్యతే యేషామితి. యేషాంతు పున రంతగతం సమాప్తప్రాయం క్షీణం పాపం జనానాం పుణ్యకర్మణాం పుణ్యం కర్మ యేషాం సత్త్వశుద్ధికారణం విద్యతే తే పుణ్యకర్మాణస్తేషాం పుణ్యకర్మణాం, తే ద్వంద్వమోహనిర్ముక్తా యథోక్తేన ద్వంద్వమోహేన నిర్ముక్తా భజన్తే మాం పరమాత్మానం దృఢవ్రతాః; ఏవమేవ పరమార్థతత్త్వం నాన్యథే త్యేవం నిశ్చితవిజ్ఞానా దృఢవ్రతా ఉచ్యన్తే. 28

తే కిమర్థం భజంత ఇత్యుచ్యతే జరేతి. జరామరణమోక్షాయ జరామరణమోక్షార్థం మాం పరమేశ్వర మాశ్రిత్య మత్సమాహితచిత్తా స్సంతో యతంతి

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః.  30

ఇతిశ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే జ్ఞానవిజ్ఞానయోగోనామ
సప్తమోఽధ్యాయః.

---

చేయుదురో, తే - వారు, తత్ - ఆశ్రుతిప్రసిద్ధమగు, బ్రహ్మ - పరబ్రహ్మను, కృత్స్నం - పుష్కలమగు, అధ్యాత్మం - ప్రత్యగాత్మతత్త్వమును, అఖిలం - సమస్తమగు, కర్మచ - కర్మను, విదుః - తెలిసికొనఁగలరు.  29

టీ:— యే - ఎవరు, సాధిభూతాధిదైవం - అధిభూతాధి దైవములతోఁ గూడినటువంటియు, సాధియజ్ఞంచ - అధియజ్ఞముతోఁ గూడినటువంటియు, మాం- నన్ను, విదుః - తెలిసికొనుచున్నారో, తేచ - అట్టివారలే, యుక్తచేతసః - సమాహితచిత్తులై, ప్రయాణకాలేఽపి - మరణకాలమందుగూడ, మాం - నన్ను, విదుః- తెలిసికొనుచున్నారు.  30

తా:—ఈ యిరువది తొమ్మిది, ముప్పది గీతములయొక్క విశేష వ్యాఖ్యానముగ నెనిమిదవ యధ్యాయము మలరారుచున్నది.  30

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద
భారతీ మాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన గీతామృత
తరంగిణియందు సప్తమతరంగము సంపూర్ణము.

---

ప్రయతంతే యే తే యద్బ్రహ్మపరం తద్విదుః కృత్స్నం సమస్త మధ్యాత్మం ప్రత్యగాత్మవిషయం వస్తు తద్విదుః కర్మ చాఖిలం సమస్తం విదుః.  29

సాధీతి. సాధిభూతాధిదైవ మధిభూతం చాధిదైవం చాధిభూతాధిదైవం, సః అధిభూతాధిదైవేన సాధిభూతాధిదైవం చ మాం యే విదుః, సాధియజ్ఞంచ సహాధియజ్ఞేన సాధియజ్ఞం యే విదుః, ప్రయాణకాలే మరణకాలేఽపిచ మాం తే విదుర్యుక్తచేతసః సమాహితచిత్తా ఇతి.  30

ఇతిశ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్యపాద
శిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీభగవద్గీతాభాష్యే
జ్ఞానవిజ్ఞానయోగోనామ సప్తమోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## అష్టమోధ్యాయః

అర్జున ఉవాచ—

కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. 1

అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః. 2

---

గడచిన యధ్యాయాంతమునందలి రెండు గీతములను వినిన యర్జునుఁ డా గీతములయందలి విషయములు తనకుఁ గ్రొత్తగాఁ దోఁచుటచే నట్టి విషయములను సమగ్రముగాఁ దెలియఁగోరి యీ రెండుగీతములచే నీ ప్రశ్నసప్తకంబును బలుకుచున్నాఁడు. పురుషోత్తముఁడా! 1. పూర్వము నీవు తెలిపిన బ్రహ్మమన నేమి, 2. అధ్యాత్మమన నేమి? 3. కర్మయన నేమి? 4. అధిభూతమన నేమిచెప్పఁబడుచున్నది? 5. అధిదైవమనఁగా నేమిచెప్పఁబడుచున్నది? 6. మధుసూదనుఁడా! ఈ దేహమునం దధియజ్ఞ మన నేమి? 7. దేహపాతకాలమందు సమాహితచిత్తులచే నెట్లు తెలియఁబడుదువు? అని. 1-2

---

"తే బ్రహ్మ త ద్విదుః కృత్స్నమ్" (గీ. 7-29) ఇత్యాదినా భగవతాఽర్జునస్య ప్రశ్నబీజా న్యుపదిష్టాని; అత స్తత్ప్రశ్నార్థం అర్జున ఉవాచ- ఏషాం ప్రశ్నానాం యథాక్రమం నిర్ణయాయ శ్రీభగవా నువాచ - అక్షరమితి. న క్షరతీతి పరమ ఆత్మా "ఏతస్య వాఽక్షరస్య ప్రశాసనే గార్గి" (బృ. 3-8-9) ఇతి శ్రుతేః. ఓంకారస్యచ "ఓమి త్యేకాక్షరం బ్రహ్మ" (గీ. 8-13) ఇతి పరేణ విశేషణా దగ్రహణమ్ పరమ మితిచ నిరతిశయే బ్రహ్మ ణ్యక్షర ఉపపన్నతరం విశేషణమ్ తస్యైవ పరస్య బ్రహ్మణః ప్రతిదేహం ప్రత్యగాత్మభావః స్వభావః, స్వభావోఽధ్యాత్మ ముచ్యతే - ఆత్మానం దేహ మధికృత్య ప్రత్యగాత్మతయా ప్రవృత్తం పరమార్థబ్రహ్మావసానం వస్తుస్వభావోఽధ్యాత్మ ముచ్యతే, అధ్యాత్మశబ్దే నాభిధీయతే, భూత

శ్రీభగవా నువాచ—

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర. 4

---

టీ:— పరమం - ఉత్కృష్టమగు, బ్రహ్మ - ఆత్మ, అక్షరం - నాశములేని సత్పదార్థము. స్వభావః - ప్రతి దేహముతో సంబంధించిన బ్రహ్మయొక్క ప్రత్య గాత్మభావము అనఁగా జీవభావము, అధ్యాత్మం - అధ్యాత్మమని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. భూత భావోద్భవకరః - చతుర్విధ భూతభావములయొక్క పుట్టుకను గలుగఁజేయునట్టి, విసర్గః - విశేషసృష్టికి హేతుభూతమగు యజ్ఞము, కర్మ సంజ్ఞితః - కర్మయనఁబరగుచున్నది. 3

ఇచట "భూతభావోద్భవకరః" యను చరణమందలి సాంప్రదాయపు రహస్యము నాలుగవ యధ్యాయమున "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" అను పదమూఁడవగీతముయొక్క వ్యాఖ్యానసందర్భమున సూచింపఁబడియున్నది.

టీ:—క్షరః - నశించునట్టి, భావః - ప్రతివస్తువును, అనఁగాఁ బుట్టుక గల్గిన ప్రతివస్తువును, అధిభూతం - అధిభూత మనఁబడుచున్నది. పురుషః చ - పురుషుఁడు, అనఁగా సర్వప్రాణులయొక్క యింద్రియములకు శక్తిని గలుగఁజేయునట్టియు, ఆదిత్యమండలాంతర్వర్తియు నగు హిరణ్యగర్భుఁడు, అధిదైవతం - అధిదైవతమను పేరఁ బరగుచున్నాఁడు. దేహభృతాంవర! - దేహధారులలో శ్రేష్ఠుఁడవగు నో యర్జునా! అత్ర-ఈ పరిదృశ్యమానమగు, దేహే - దేహమందు, అధియజ్ఞః - సకల యజ్ఞములయం దభిమానము గలిగిన దేవతయగు విష్ణువు, అహమేవ - నేనే. 4

తా:—ఇచట 'దేహభృతాంవర' అని యర్జునుని సంబోధించి "అత్ర దేహే అహమేవ" అని దేహధారినను నభిమానము గల నీవు నేనే యని వక్కాణించుట

---

భావోద్భవకరో భూతానాం భావో భూతభావ స్తస్యోద్భవో భూతభావోద్భవ స్తం కరోతీతి భూతభావోద్భవకరో భూతవస్తూత్పత్తికర ఇత్యర్థః; విసర్గో విసర్జనం దేవతోద్దేశేన చరుపురోడాశాదేః ద్రవ్యస్య పరిత్యాగః, స ఏష విసర్గలక్షణో యజ్ఞః కర్మసంజ్ఞితః కర్మసంజ్ఞిత ఇత్యేతత్ ; ఏతస్మాద్ధి బీజభూతాత్ వృష్ట్యాదిక్రమేణ స్థావరజంగమాని భూతా న్యుద్భవంతి. 3

అధిభూతమితి. అధిభూతం ప్రాణిజాత మధికృత్య భవతీతి, కోఽసౌ? క్షరః క్షరతీతి క్షరో వినాశీ, భావో యత్కించి జ్జనిమద్వస్త్విత్యర్థః, పురుషః పూర్ణ మనేన సర్వమితి పురి శయనా ద్వా పురుష ఆదిత్యాన్తర్గతో హిరణ్యగర్భః సర్వప్రాణి

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేవరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః. 5

యంయం వాపి స్మరన్భావం త్యజ త్యంతే కలేవరమ్,
తంత మేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః. 6

---

చేతను దాను బరబ్రహ్మయగు విష్ణువునే యని నిర్వచించుటవలనను జీవబ్రహ్మ భేద బోధకమగు 'తత్త్వమసి' యను వాక్యముయొక్క యర్థమును శ్రీకృష్ణభగవానులు స్పష్టముగఁ దెలుపుచున్నటుల సుస్పష్ట మగుచున్నది. 4

టీ:—అంతకాలేచ - మరణకాలమునందును గూడ, మామేవ - నన్నే, స్మరన్ - స్మరించుచు, కలేవరం - శరీరమును, ముక్త్వా - విడచి, యః - ఎవఁడు, ప్రయాతి - పోవుచున్నాఁడో, సః - వాఁడు, మద్భావం - నా స్వరూపమును, యాతి - పొందుచున్నాఁడు. అత్ర - ఈ విషయమున, సంశయః - సందియ మెంత మాత్రము, నాస్తి - లేదు. 5

తా:—ఇచట చకార మనుక్త సముచ్చయార్థము. సర్వకాల సర్వావస్థల యందును, అని యర్థము. అనగా సర్వకాల సర్వావస్థలయందుఁ బరమాత్మ నగు నన్ను స్మరించుచు నంతకాలమునందుఁ గూడ స్మరించినయెడల ఫలము సమకూరునని యాశయము. "మద్భావం యాతి" యనుటచే బ్రహ్మభావాప్తి మోక్షమని వ్యక్తీకరింపఁబడుచున్నది. 5

టీ:–యం యం - ఏయే, భావం అపివా - భావమునైనను, స్మరన్ - స్మరించుచు, కలేవరం - శరీరమును, అంతే - ప్రాణవియోగకాలమందు, త్యజతి - విడిచి

---

కరణానా మనుగ్రాహక స్సోఽధిదైవతమ్ అధియజ్ఞః సర్వయజ్ఞాభిమానినీ విష్ణ్వాఖ్యా దేవతా "యజ్ఞో వై విష్ణుః (తై. సం. 1-7-4) ఇతిశ్రుతేః, సహి విష్ణు రహమేవ అత్రాస్మి న్దేహే యో యజ్ఞ స్తస్యాహ మేవాధియజ్ఞః, యజ్ఞో హి దేహనిర్వ ర్త్యత్వేన దేహసమవాయీతి దేహాధికరణో భవతి దేహభృతాంవర. 4

అంతకాలఇతి. అంతకాలేచ మరణకాలే మామేవ పరమేశ్వరం విష్ణుం స్మరన్ముక్త్వా పరిత్యజ్య కలేవరం శరీరం యః ప్రయాతి గచ్ఛతి స మద్భావం వైష్ణవం తత్త్వం యాతి, నాస్తి న విద్యతేఽత్రాస్మి న్నర్థే సంశయో యాతి వా న వేతి. 5

న మద్విషయ ఏవాయం నియమః, కింతర్హి యమితి. యంయం వాపి యంయం భావం దేవతావిశేషం స్మరం శ్చింతయం స్త్యజతి పరిత్యజ త్యంతే

తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్యచ,
మ య్యర్పితమనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః. 7

---

పెట్టుచున్నాఁడో, సదా - ఎల్లప్పుడు, తద్భావభావితః - ఆయాయిభావములచే సంస్కరింపఁబడిన యంతఃకరణము గలవాఁడై, కౌంతేయ! తం తం ఏవ - ఆయాయి భావములనే, ఏతి - పొందుచున్నాఁడు. 6

తా:—యావజ్జీవము నెట్టి భావముచే నంతఃకరణము సంస్కరింపఁబడియుండు నో, యట్టి భావమే ప్రాణవియోగకాలమందును గూడఁ గల్గుటచే నట్టి భావమున కనురూపమగు భావిఫలము లభించును. అనఁగా నేయే దేవతాభావములతో నంతః కరణము యావజ్జీవము సంస్కరింపఁబడునో యట్టి దేవతాభావమునే పొందునని యు, దేవతాభావములేగాక మఱి యేయే యితరభావములచే నంతఃకరణము సం-స్కరింపఁబడునో యాయాయిభావముల కనురూపమగు ఫలములను బొందుచుండు నని యభిప్రాయము. 6

టీ:—తస్మాత్ - ఆకారణముచే, సర్వేషు - సమస్తములగు, కాలేషు - కాలములయందును, మాం - నన్ను, అనుస్మర - స్మరింపుమా! యుద్ధ్యచ - యుద్ధము చేయుము. మయి - నాయందు, అర్పిత మనోబుద్ధిః - సమర్పింపఁబడిన మనోబుద్ధులు కలవాఁడవై, మాం ఏవ - నన్నే, ఏష్యసి - పొందఁగలవు, అసంశయః - ఇందు సందియము లేదు. 7

తా:—ఇందు "సర్వేషు కాలేషు" అను పదము లైదవగీతమందలి చకార-ముచే సూచింపఁబడిన యర్థప్రకాశకములు. "మయ్యర్పిత మనోబుద్ధిః" అనునది 'మా మనుస్మర' యను దానియొక్క వివరణము. 7

---

ప్రాణవియోగకాలే కళేవరం తం త మేవ స్మృతం భావమేవైతి నాన్యం కౌంతేయ, సదా సర్వదా తద్భావభావిత స్తస్మి న్భావః తద్భావః, స భావితః స్మర్యమాణ తయాఽభ్యస్తో యేన స తద్భావభావితఃసన్. 6

యస్మా దేవ మంత్యా భావనా దేహాంతరప్రాప్తౌ కారణమ్ తస్మాదితి. తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర, యథా శాస్త్రం యుద్ధ్యచ యుద్ధంచ స్వధర్మం కురు. మయి వాసుదేవేఽర్పితే మనోబుద్ధీ యస్య తవ స త్వం మయ్య ర్పితమనోబుద్ధిఃస న్మామేవ యథాస్మృత మేష్య స్యాగమిష్యసి, అసంశయో న సంశయోఽత్ర విద్యతే. 7

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. 8

కవిం పురాణ మనుశాసితార మణో రణీయాంస మనుస్మరే ద్యః,
సర్వస్య ధాతార మచింత్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. 9

---

టీ:- పార్థ! అభ్యాసయోగయుక్తేన - ఆరవయధ్యాయమున "యోగీ యుంజీత" మొదలుగాఁగల గీతములచే వివరింపఁబడిన ధ్యాననిష్ఠయందు లగ్నమైనట్టియు, నాన్యగామినా - విషయాంతరములఁ బొందనట్టియు, చేతసా - అంతఃకరణముచే, దివ్యం-సూర్యమండలాంతర్వర్తియు, పరమం- నిరతిశయమునగు, పురుషం- దేవతాస్వరూపమును, అనుచింతయన్ - శాస్త్రాచార్యోపదేశము ననుసరించి సతతము ధ్యానించువాఁడు, (తం - ఆ పురుషుని) యాతి - పొందును. 8

తా:-ఇచట యోగనిష్ఠునకు ధ్యేయవిషయమును గమ్యస్థానమును గూడ దేవతాస్వరూపమే యగుచున్నది. 'పరమపురుషం' అనునది తంత్రోచ్చారణచే యానచింతన క్రియలతో బ్రత్యేకముగా నన్వయించునది. 8

టీ:-ప్రయాణకాలే - మరణకాలమందు, యోగబలేనచఏవ - సమాధివలన బుట్టు చిత్తస్థైర్యముచే, భ్రువోఃమధ్యే - ఆజ్ఞాచక్రమందు. ప్రాణం - వాయువును, ఆవేశ్య - నిలిపి, అచలేన - నిశ్చలమగు, మనసా - మనస్సుచేతను, భక్త్యా-భక్తితో, యుక్తః - కూడుకొనినవాఁడై, కవిం - సర్వజ్ఞుఁడైనట్టియు, పురాణం - చిరంతనుఁడైనట్టియు, అనుశాసితారం - సకలజగన్నియంత యగునట్టియు, అణోః అణీయాంసం - ఇంద్రియాతీత మగునట్టియు, అచింత్యరూపం - మనస్సుచేఁ జింతించుటకలవి కానట్టియు, తమసః - అజ్ఞానమనెడి మోహాంధకారముకంటె, పరస్తాత్ -శ్రేష్ఠ

---

కించ అభ్యాసేతి. అభ్యాసయోగయుక్తేన మయి చిత్తసమర్పణవిషయభూతఏకస్మిం స్తుల్యప్రత్యయావృత్తిలక్షణో విలక్షణప్రత్యయానంతరితోఽభ్యాసస్స చాభ్యాసో యోగ స్తేన యుక్తం తత్రైవ వ్యాపృతం యోగిన శ్చేత స్తేన చేతసా నాన్యగామినా నాన్యత్ర విషయాంతరే గంతుం శీల మస్యేతి నాన్యగామి తేన నాన్యగామినా, పరమం నిరతిశయం పురుషం దివ్యం దివి సూర్యమండలే భవం యాతి గచ్ఛతి, హేపార్థ! అనుచింతయన్ శాస్త్రాచార్యోపదేశ మనుధ్యాయన్నిత్యేతత్. 8

కింవిశిష్టంచ పురుషం యాతీత్యుచ్యతే కవిమితి. కవిం క్రాంతదర్శినం సర్వజ్ఞం పురాణం చిరంతన మనుశాసితారం సర్వస్య జగతః ప్రశాసితారం అణోః

ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్. 10

యదక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః,
య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. 11

---

మగునట్టియు, (వెలుగునట్టియు) ఆదిత్యవర్ణం - నిత్యచైతన్య ప్రకాశస్వరూపుఁ డైనట్టియు, సర్వస్య - సమస్తమగు కర్మఫలజాలమును, ధాతారం - ఇచ్చునట్టి పరమేశ్వరుని, సమ్యక్ - లెస్సగా నన బ్రమాదము లేని యంతఃకరణముతో, యః - ఏ ధ్యాననిష్ఠుఁడు, అనుస్మరేత్ - ధ్యానముచేయునో, సః - అట్టి ధ్యాననిష్ఠుఁడు, తం - అట్టి, పరం - ఉత్కృష్టమగు, దివ్యం పురుషం - సూర్యమండలాంతర్వర్తి యగు పురుషుని, ఉపైతి - పొందును. ఈ రెండుగీతములు నెనిమిదవ గీతము యొక్క విశేషవివరణము. 9-10

టీ:—వేదవిదః - వేదవేత్తలు, యత్ - ఏ, అక్షరమ్ - నాశనము లేనిబ్రహ్మను, వదంతి - పలుకుచున్నారో, వీతరాగాః - వైరాగ్యసంపత్తిగలిగిన, యతయః -

---

సూక్ష్మా దప్యణీయాంసం సూక్ష్మతర మనుస్మరే దనుచింతయే ద్యః కశ్చిత్, సర్వస్య కర్మఫలజాతస్య ధాతారం విధాతారం విచిత్రతయా ప్రాణిభ్యో విభక్తారం అచింత్యరూపం నాఽస్యరూపం నియతం విద్యమానమపి కేనచి చ్చింతయితుం శక్యత ఇత్యచింత్యరూప స్తం, ఆదిత్యవర్ణ మాదిత్యస్యేవ నిత్యచైతన్యప్రకాశో వర్ణో యస్య త మాదిత్యవర్ణం తమసః పరస్తా దజ్ఞానలక్షణా న్మోహాంధకారా త్పరం త మనుచింతయన్ యాతీతి పూర్వేణ సంబంధః. 9

కించ ప్రయాణేతి. ప్రయాణకాలే మరణకాలే మనసాఽచలేన చలనవర్జితేన భక్త్యా యుక్తో భజనం భక్తిః తయా యుక్తో యోగబలేన చైవ యోగస్య బలం యోగబలం సమాధిజసంస్కారప్రచయజనితచిత్తస్థైర్యలక్షణం యోగబలం తేనచ యుక్త ఇత్యర్థః పూర్వం హృదయపుండరీకే వశీకృత్య చిత్తం తత ఊర్ధ్వగామిన్యా నాడ్యా భూమిజయక్రమేణ భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య స్థాపయిత్వా సమ్య గప్రమత్తఃసన్ స ఏవం విద్వా న్యోగీ "కవిం పురాణం" (గీ. 8-9) ఇత్యాది లక్షణం తం పరం పురుష ముపైతి ప్రతిపద్యతే దివ్యం ద్యోతనాత్మకమ్. 10

పునరపి వక్ష్యమాణేనోపాయేన ప్రతిపిత్సితస్య బ్రహ్మణో వేదవిద్వదనాది విశేషణ విశేష్యస్యాభిధానం కరోతి భగవాన్ యదితి. యదక్షరం న క్షరతీ

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్. 12

---

సంన్యాసులు, యత్ - దేనిని, విశంతి - ప్రవేశించుచున్నారో, యత్ - దేనిని, ఇచ్ఛన్తః - ఇచ్ఛయించినవారలై, బ్రహ్మచర్యం - బ్రహ్మనిష్ఠను, చరంతి - గురుసన్నిధియం దాచరించుచున్నారో, తత్ - అట్టి అక్షరమగు, పదం - గమ్యస్థానమును, తే - నీకొఱకు, సంగ్రహేణ - సంక్షేపముగా, ప్రవక్ష్యే - చెప్పుచున్నాను. 11

టీ:—సర్వద్వారాణి - సకలేంద్రియములను, సంయమ్య - నిగ్రహించి, హృది - హృదయపుండరీకమందు అనఁగా ననాహతచక్రమందు, మనః - మనస్సును, నిరుధ్య - అరికట్టి, ఆత్మనః - తనయొక్క, ప్రాణం - వాయువును, మూర్ధ్ని - సహ

---

త్యక్షర మవినాశి వేదవిదో వేదార్థజ్ఞాః వదంతి “ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి” (బృ. 3-8-8) ఇతి శ్రుతేః సర్వవిశేషనివర్తకత్వే నాభివదన్తి “అస్థూల మనణు” (బృ. 3-8-8) ఇత్యాది; కించ విశంతి ప్రవిశంతి సమ్యగ్దర్శనప్రాప్తౌ సత్యాం య ద్యతయో యతనశీలాః సంన్యాసినః వీతరాగాః, వీతో విగతో రాగో యేభ్య స్తే వీతరాగాః యచ్చాక్షర మిచ్ఛన్తో జ్ఞాతు మితివాక్యశేషః, బ్రహ్మచర్యం గురౌ చరన్త్యాచరంతి త త్తే పదం తదక్షరాఖ్యం పదం పదనీయం తే తుభ్యం సంగ్రహేణ సంగ్రహ స్సంక్షేప స్తేన సంక్షేపేణ ప్రవక్ష్యే కథయిష్యామి. 11

“స యో హ వై తద్భగవ న్మనుష్యేషు ప్రాయాణాంత మోంకార మభిధ్యాయీత కతమం వావస తేన లోకం జయతి తస్మై సహోవాచ, ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః” (ప్రశ్న. 5-1-2) ఇత్యుపక్రమ్య “యః పున రేతం త్రిమాత్రేణో మిత్యేతేనైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత” (ప్రశ్న 5-4) ఇత్యాదినా వచనేన “అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్” (కఠ. 2-14) ఇతిచోపక్రమ్య “సర్వే వేదా యత్పద మామనంతి తపాంసి సర్వాణిచ యద్వదంతి యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి త త్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్” (కఠ. 2-15) ఇత్యాదిభిశ్చ వచనైః పరస్య బ్రహ్మణో వాచకరూపేణ ప్రతిమావ త్ప్రతీకరూపేణవా, పరబ్రహ్మప్రతిపత్తిసాధనత్వేన మందమధ్యమబుద్ధీనాం వివక్షితస్యోంకార స్యోపాసనం కాలాంతరే ముక్తిఫల ముక్తం య త్తదే వేహాపి “కవిం పురాణ మనుశాసితారం” (గీ. 8-9) “యదక్షరం వేదవిదో వదన్తి” (గీ. 8-11) ఇతి చోపన్యస్తస్య పరస్య బ్రహ్మణః పూర్వోక్తరూపేణ ప్రతిపత్త్యుపాయభూత స్యోంకారస్య కాలాంతరముక్తిఫల ముపాసనం యోగధా

ఓమి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్,
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్. 13

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. 14

---

స్ారిచక్రమందు, ఆధాయ - ఉంచి, యోగధారణామ్ - ఇట్టి యోగధారణ గుటించి, ఆస్థితః - ప్రివర్తించినవాఁడై. 12

టీ:—మాం - నన్ను, అనుస్మరన్ - ధ్యానించుచు, ఏకాక్షరం - బ్రిహ్మ, బ్రిహ్మవాచకమగు, ఓం ఇతి - ఓంకారమును, వ్యాహరన్ - ఉచ్చరించుచు, దేహం - దేహమును, త్యజన్ - విడిచి, యః - ఎవఁడు, ప్రియాతి - పోవుచున్నాఁడో, సః - వాఁడు, పరమాం - ఉత్కృష్టమగు, గతిం - స్థానమును, యాతి - పొందుచున్నాఁడు. ఈ రెండు గీతములును బూర్వోక్త రెండుగీతములయొక్క యనువాదములే. ఎనిమిదవ గీతము మొదలు పదమూఁడవ గీతమువఱకుఁ గల విషయ మంతయు సాంప్రదాయరహస్య మగుటచే సద్గురుముఖైకవేద్యము. ఉత్తమాధికారి విషయము. 13

టీ:—పార్థ ! యః - ఎవఁడు, అనన్యచేతాః - ఏకాగ్రిచిత్తుఁడై, నిత్యశః-దీర్ఘకాలము, సతతం - ఎడతెగకుండ, మాం - నన్ను, స్మరతి - ధ్యానము చేయునో,

---

రణాసహితం వక్తావ్యం ప్రసక్తానుప్రసక్తంచ యత్కించిత్, ఇత్యేవమర్థఉత్తరో గ్రంథ ఆరభ్యతే సర్వేతి. సర్వద్వారాణి సర్వాణిచ తాని ద్వారాణిచ సర్వద్వారాణ్యుపలబ్ధా తాని సర్వాణి సంయమ్య సంయమనం కృత్వా మనో హృది హృదయ పుండరీకే నిరుధ్య నిరోధం కృత్వా నిష్ప్రిచారతా మాపాద్య తత్రి వశీకృతేన మనసా హృదయా దూర్ధ్వగామిన్యా నాడ్యోర్ధ్వ మారుహ్యా మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితః ప్రివృత్తో యోగధారణాం ధారయితుమ్. 12

తత్రైవచ ధారయన్ ఓమితి. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, బ్రహ్మణోఽభిధానభూత మోంకారం వ్యాహర న్నుచ్చారయం స్తదర్థభూతం మా మీశ్వర మనుస్మర న్ననుచింతయన్ యః ప్రయాతి మ్రియతే, స త్యజన్ పరిత్యజన్ దేహం శరీరం త్యజన్, దేహమితి ప్రయాణవిశేషణార్థం, దేహత్యాగేన ప్రయాణ మాత్మనో న స్వరూపనాశే నేత్యర్థః, స ఏవం త్యజ న్యాతి గచ్ఛతి పరమాం ప్రకృష్టాం గతిమ్. 13

కించ అనన్యచేతాఇతి. అనన్యచేతా నాన్యవిషయే చేతో యస్య సోఽయ మనన్యచేతా యోగీ సతతం సర్వదా యో మాం పరమేశ్వరం స్మరతి నిత్యశః

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. 15

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. 16

---

తస్య - అట్టి, నిత్యయుక్తస్య - సమాహితుఁడైన, యోగినః - సంన్యాసికి, అహం - నేను, సులభః - అనాయాసముగాఁ బొందఁదగినవాఁడను. 14

టీ:–మహాత్మానః - యతులు, పరమాం - ఉత్కృష్టమగు, సంసిద్ధిం - మోక్షమును, గతాః - పొందినవారలై, మాం - నన్ను, ఉపేత్య - పొంది యనఁగా బ్రహ్మభావమును బొంది, అశాశ్వతం - అనిర్వచనీయస్వరూపమును, (అనిత్యమును) దుఃఖాలయం - దుఃఖములకు నిలయమునగు, జన్మ - పుట్టుకను, పునః - మఱల, న ఆప్నువంతి - పొందరు. 15

టీ:–అర్జున ! ఆ బ్రహ్మభువనాత్ - బ్రహ్మభువనముతోఁ గూడిన, లోకాః - సమస్తమగు లోకములును, పునరావర్తినః - పునరావర్తనము స్వభావముగాఁ

---

సతతమితి నైరంతర్య ముచ్యతే, నిత్యశ ఇతి దీర్ఘకాలత్వ ముచ్యతే, న షణ్మాసం సంవత్సరం వా కింతర్హి యావజ్జీవం నైరంతర్యేణ యో మాం స్మరతీత్యర్థః; తస్య యోగినోఽహం సులభ స్సుఖేన లభ్యః హే పార్థ నిత్యయుక్తస్య సదా సమాహిత చిత్తస్య యోగినః, యత ఏవ మతోఽనన్యచేతాః స న్మయి సదా సమాహితో భవేత్. 14

తవ సౌలభ్యేన కింస్యాదిత్యుచ్యతే శృణు; తన్మమ సౌలభ్యేన యద్భవతి మామితి. మా ముపేత్య మా మీశ్వర ముపేత్య మద్భావ మాపాద్య పునర్జన్మ పునరుత్పత్తిం నాప్నువంతి న ప్రాప్నువంతి కింవిశిష్టం పునర్జన్మ న ప్రాప్నువంతీతి తద్విశేషణ మాహ - దుఃఖాలయం దుఃఖానా మాధ్యాత్మికాదీనా మాలయ మాశ్రయ మాలీయంతే యస్మిన్ దుఃఖానీతి దుఃఖాలయం జన్మ న కేవలం దుఃఖాలయ మశాశ్వత మనవస్థితస్వరూపం చ నాప్నువంతీదృశం పునర్జన్మ మహాత్మానో యతయః సంసిద్ధిం మోక్షాఖ్యాం పరమాం ప్రకృష్టాం గతాః ప్రాప్తాః యే పునర్మాం న ప్రాప్నువంతి తే పునరావర్తన్తే. 15

కింపున స్త్వత్తోఽన్య త్ప్రాప్తాః పునరావర్తన్త ఇత్యుచ్యతే ఆబ్రహ్మేతి. ఆబ్రహ్మభువనా ద్భవంతి అస్మిన్ భూతానీతి భువనం బ్రహ్మభువనం బ్రహ్మలోక ఇత్యర్థః ఆ

గలవి. అనఁగా నశించుటయుఁ బుట్టుటయు స్వభావముగాఁ గలవి. కౌంతేయ! మాం - అద్వితీయమగు నన్ను, ఉపేత్యతు - పొందినచో, పునర్జన్మ - పునరుత్పత్తి, న విద్యతే - లేదు. 16

తా:—ఇచట 'ఆబ్రహ్మభువనాత్' అనుచోట "ఆఙ్ మర్యాదాభివిధ్యోః" అను స్మృతిననుసరించి ఆఙ్‌నకు మర్యాదార్థమును గొందఱు గ్రహించుచున్నారు. దానివలన లభించు నర్థవిశేషమేమన బ్రహ్మలోకము తక్క దదితరములగు లోకము లన్నియుఁ బుట్టుటయును నశించుటయును స్వభావముగాఁ గలవని; బ్రహ్మలోకము మాత్ర మట్లుగాక యెల్లప్పుడు నిలచియుండు ననియును. వీరు బ్రహ్మలోక మన స్వశేముష్యనుసారముగాఁ గైలాస మనియు వైకుంఠ మనియు శ్రీనగర మనియు నిట్లు పలువిధముల వర్ణించియున్నారు. ఇఁక నభివిధ్యర్థ మాఙ్జునకు గ్రహించినచో నితరలోకములవలె బ్రహ్మలోకముకూడ నశించుటయుఁ బుట్టుటయు స్వభావముగాఁ గలదియే యని తెలియవచ్చుచున్నది. దానంజేసి సకలలోకములును నశించుట యును బుట్టుటయును స్వభావముగాఁ గలసను లోకధర్మము నవ్యాహతముగ గ్రహించుట కవకాశము కలుగును. లోకత్వసామాన్యముచే నొకలోకమునకు నాశ మును, వేఱొక లోకమునకు నిత్యత్వము నాపాదించుట యసమంజసము. కావున నిర్హేతుకముగ బ్రహ్మలోకమునకు నిత్యత్వమును తదితరలోకముల కనిత్యత్వము నా పాదించుట యసమంజసము. అందుచే నిచట నాఙ్జున కభివిధ్యర్థము గ్రహించుటయే సమంజసము. అయ్యదియే శ్రీకృష్ణభగవదాశయము. అట్లైనచో బ్రహ్మలోకమును బొందినవారలకుఁగూడ బ్రహ్మలోకముతోఁబాటుగ నుత్పత్తివినాశములు గలవా? యను సందియ మొకటి గల్గును. ఇట్టి సందియ మిట్లు వారింపఁబడుచున్నది. కల్ప మధ్యమునందు బ్రహ్మలోకమును బొందినవార లితరలోకమును బొందినవారలవలె పునరావృత్తి నెంతమాత్రమును జెందక కల్పాంతమువఱకు బ్రహ్మలోకమునందు నిలిచి కల్పాంతమందు లోకాంతరములవలె బ్రహ్మలోకముగూడ లయమును జెందగాఁ దల్లోకేవాసులు తదధిపతియగు బ్రహ్మతోఁగూడ బ్రహ్మభావమును బొందుదురుగాన గల్పాదియందు బ్రహ్మలోకమునకు బునరావర్తనము ఘటించినను బ్రహ్మభావమును జెందినవారలకు మాత్రము పునరావర్తనము లేదు. ఈ గంభీ

---

బ్రహ్మభువనాత్సహబ్రహ్మభువనేన లోకాస్సర్వే పునరావర్తినః పునరావర్తనస్వభా వాః హేఅర్జున! మామేకమేవ ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ పునరుత్పత్తిర్న విద్యతే. 16

సహస్రయుగపర్యంత మహ ర్య ద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః. 17

అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవ న్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రైవా వ్యక్తసంజ్ఞకే. 18

---

రాశియము మీర శ్రీకృష్ణభగవానులు "మా ముపేత్య తు కౌంతేయ! పునర్జన్మ న విద్యతే" యని నిగూఢముగ సూచించుచున్నారు. 16

టీ:- తే - ఆసుప్రసిద్ధమగు, అహోరాత్రవిదః - కాలసంఖ్యను గుర్తెఱింగిన యట్టి, జనాః - జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, బ్రహ్మణః - ప్రజాపతియొక్క, యత్ అహః- ఏ పగలు కలదో, (తత్ - ఆపగటిని) సహస్రయుగపర్యంతం - వేయిమహాయుగములు పరిమాణము కలదిగా, విదుః - తెలిసికొనుచున్నారు. (ఆతీరుననే) రాత్రిం - ప్రజాపతియొక్క రాత్రిని, యుగసహస్రాంతాం - వేయి యుగములు పరిమితి కలదిగా (విదుః - తెలిసికొనుచున్నారు.) 17

టీ:-అవ్యక్తాత్ - ప్రజాపతియొక్క సుషుప్తినుండి, అహరాగమే - ప్రజాపతి యొక్క ప్రబోధకాలమందు, సర్వాః - సమస్తమగు, వ్యక్తయః - స్థావరజంగమ ములు, ప్రభవంతి - బయలువెడలుచున్నవి, రాత్ర్యాగమే - ప్రజాపతియొక్క నిద్రావస్థయందు, తత్ర అవ్యక్తసంజ్ఞకే ఏవ - పైన జెప్పఁబడినబ్రహ్మయొక్క స్వాపమునందే (సర్వాః - సమస్తమగు స్థావరజంగమములు) ప్రలీయంతే - లయ మును జెందుచున్నవి. 18

---

బ్రహ్మలోకసహితా లోకాః కస్మా త్పునరావర్తినః కాలపరిచ్ఛిన్నత్వాత్; కథమ్? సహస్రేతి. సహస్రయుగపర్యంతం సహస్రాణి యుగాని పర్యంతః పర్యవసానం యస్యాహ్న స్త దహః సహస్రయుగపర్యంతం బ్రహ్మణః ప్రజాపతే ర్విరాజో విదుః, రాత్రి మపి యుగసహస్రాంతా మహః పరిమాణమేవ కే విదు రిత్యాహ. తేఽహోరాత్రవిదః కాలసంఖ్యావిదః జనా ఇత్యర్థః, యతఏవం కాలపరిచ్ఛిన్నా స్తేఽతః పునరావర్తినో లోకాః. 17

ప్రజాపతే రహని యద్భవతి రాత్రౌ చ తదుచ్యతే - అవ్యక్తాదితి. అవ్యక్తా దవ్యక్తం ప్రజాపతేః స్వాపావస్థా తస్మా దవ్యక్తా ద్వ్యక్తయో వ్యజ్యంత ఇతివ్యక్త యః స్థావరజంగమలక్షణాః సర్వాః ప్రజాః ప్రభవ న్త్యభివ్యజ్యంతే ఽహ్న ఆగమో ఽహరాగమ స్తస్మిన్ అహరాగమే కాలే బ్రహ్మణః ప్రబోధకాలే తథా రాత్ర్యా గమే బ్రహ్మణః స్వాపకాలే ప్రలీయ న్తే సర్వాః వ్యక్తయ స్తత్రైవ పూర్వోక్తే ఽవ్యక్తసంజ్ఞకే, 18

భూతగ్రామస్సఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవంత్యహరాగమే. 19

టీ:—సః అయం భూతగ్రామః ఏవ - పూర్వకల్పమందుండెడి ఆ యీభూతసముదాయమే, భూత్వా భూత్వా - ఉండిఉండి, (మాటిమాటికి) రాత్ర్యాగమే - ప్రజాపతియొక్క స్వాప్నావస్థయందు, అవశః - వశముఁదప్పి, ప్రలీయతే - లయముఁజెందుచుండును. పార్థ! అహరాగమే - ప్రజాపతియొక్క ప్రబోధకాలమునందు, ప్రభవతి - అవశమై పుట్టుచున్నది. 19

తా:—బ్రహ్మలోకాధిపతియగు ప్రజాపతికి నాయువు నూరువత్సరములనియు నందలి యొక్కొక యహోరాత్రము మానుషగణనచే రెండువేల మహాయుగముల పరిమితి గలదనియు నందుఁ బ్రత్యేకముగా నహస్సు నొక వేయిమహాయుగముల కాలముతోడను, రాత్రి యొక వేయిమహాయుగముల కాలముతోడను గూడి యున్నదని జ్యోతిశ్శాస్త్రవిదులు చెప్పుచున్నారు. ప్రజాపతియొక్క ప్రబోధ కాలము సృష్టియనియు, మెలకువ కాలము స్థితి యనియు సుషుప్తికాలము లయ మనియుఁ జెప్పఁబడుచున్నది. ప్రబోధకాలమున సకలప్రాణులును బయలువెడలుచు స్థితికాలమునఁ దమతమ కర్మానుగుణముగ షడ్భావవికారములఁ బొందుచు లయకాలమున లయమును జెందుచుండును. ఇట్లు భూతగ్రామమంతయు స్వీయ కర్మానుగుణముగ బరివర్తనము నొందుచుండును. ప్రజాపతియొక్క 'ప్రబోధకాలమున బ్రహ్మలోకముతోఁ గూడ సకలలోకములు బయలువెడలుటయు, లయకాలమున బ్రహ్మలోకముతోఁ గూడ సకలలోకములు లయముఁ జెందుటయును దెలియ వచ్చుటచే లోకములు పునరావర్తన స్వభావము గలవి యని చెప్పఁబడినది. రెండవ యధ్యాయమునందలి పండ్రెండవ గీతనుగు "న త్వేవాహం జాతు నాసం" అను దానియొక్క యభిప్రాయమునే యీ గీత మనువదించుచున్నది. 17-18-19.

అకృతాభ్యాగమ కృతవిప్రణాశ దోషపరిహారార్థం బంధమోక్ష శాస్త్ర ప్రవృత్తిసాఫల్యప్రదర్శనార్థం, అవిద్యాదిక్లేశమూల కర్మాశయవశాచ్చావశో భూతగ్రామో భూత్వాభూత్వా ప్రలీయతే ఇత్యతః సంసారే వైరాగ్యప్రదర్శనార్థం చేదమాహ - భూతగ్రామఇతి. భూతగ్రామో భూతసముదాయః స్థావర జంగమలక్షణో యః పూర్వస్మిన్‌కల్ప ఆసీత్సఏవాయం నాన్యో భూత్వాభూత్వా అహరాగమే ప్రలీయతే పునఃపునా రాత్ర్యాగమేఽహ్నః క్షయే ఽవశోఽస్వతంత్ర ఏవ హేపార్థ, ప్రభవతి జాయతే అవశఏవాహరాగమే. 19

పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ. 21

---

టీ:—సర్వేషు - సమస్తములగు, భూతేషు - బ్రహ్మాది స్తంబపర్యంతము గల ప్రాణికోటులు, నశ్యత్సు - నశించుచుండగా, యః - ఏభావము, న వినశ్యతి - నశింపదో, సః భావః - ఆ భావము, తస్మాత్ అవ్యక్తాత్ - పూర్వోక్తమైన భూతగ్రామ కారణమగు నవ్యక్తముకంటె, అన్యః తు - విలక్షణమును, అవ్యక్తః - అవాఙ్మనసగోచరమును, సనాతనః - త్రికాలాబాధ్యమును, పరః - శ్రేష్ఠమును. 20

టీ:—అవ్యక్తః - పరమగు నవ్యక్తము, అక్షరః ఇతి - అక్షరరూపపరమాత్మ యని, ఉక్తః - చెప్పఁబడుచున్నది. తం - అట్టి యక్షరమును, పరమాం-ఉత్కృష్ట మగు, గతిం - స్థానముగ, ఆహుః - బ్రహ్మవిదులు చెప్పుచున్నారు, యం - ఏఅక్షర మును, ప్రాప్య - పొంది, న నివర్తన్తే - సంసారమునకు మఱలిరారో, తత్ - ఆ అక్షరము, మమ - నాయొక్క, పరమం - ఉత్కృష్టమగు, ధామ - స్థానము. 21

తా:—పదునారవ గీతమందలి "మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" యను చరణమందలి, 'మాం' అను పద మీ రెండుగీతములచే వ్యక్తీకరింపఁబడుచున్నది. 20-21

---

య దుపన్యస్త మక్షరం తస్యప్రాప్త్యుపాయో నిర్దిష్ట "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" (గీ. 8-13) ఇత్యాదినా; అథేదానీ మక్షరస్యైవ స్వరూపనిర్దిదిక్షయేద ముచ్యతే ఽనేనయోగమార్గే ణేదం గంతవ్య మితి పరఇతి. పరో వ్యతిరిక్తో భిన్నః కుత స్తస్మాత్పూర్వోక్తాత్ తుశబ్దోఽక్షరస్య వివక్షితస్యా వ్యక్తాద్వైలక్షణ్య విశేషణార్థః భావోఽక్షరాఖ్యం పరంబ్రహ్మ అవ్యతిరిక్తత్వేసత్యపి సాలక్షణ్యప్రసంగోఽస్తీతి తద్వినివృత్త్యర్థ మాహ అన్యఇతి. అన్యో విలక్షణః స చావ్యక్తోఽనింద్రియగోచరః పర స్తస్మాదిత్యుక్తమ్, కస్మాత్పునః పరః పూర్వోక్తాద్భూత గ్రామబీజభూతా దవిద్యాలక్షణా దవ్యక్తాత్ సనాతన శ్చిరంతనః య స్స భావ స్సర్వేషు భూతేషు బ్రహ్మాదిషు నశ్యత్సు న వినశ్యతి. 20

అవ్యక్తఇతి. యోఽసా వవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమేవాక్షర సంజ్ఞక మవ్యక్తం భావ మాహుః పరమాం ప్రకృష్టాం గతిమ్ యంభావం ప్రాప్య గత్వా న నివర్తన్తే సంసారాయ, తద్ధామ స్థానం పరమం ప్రకృష్టం మమ పరమం పద మిత్యర్థః. 21

పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్.　　22
యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ!　　23

---

టీ:—పార్థ! సః - అపూర్వోక్తాక్షర శబ్దవాచ్యమును, పరః - భూతబీజమగు నవ్యక్తముకంటె పరమునగు, పురుషః - అక్షరుఁడగు పురుషుఁడు, అనన్యయా - ఏకాంతమగు, భక్త్యాతు - భక్తిచేతనే, లభ్యః - పొందఁదగినవాఁడు, భూతాని - సమస్తభూతములును, యస్య - ఏపురుషునియొక్క, అంతస్థాని - కార్యభూతము లగుచు మధ్య నిలిచియున్నవో, యేన- ఏపురుషునిచే, ఇదం సర్వం - ఈపరిదృశ్యమానమగు జగమంతయు, తతం - వ్యాపింపఁబడియున్నదో, అట్టి పురుషుఁ డని పూర్వమున కన్వయము.　　22

తా:—ఈ గీతముచేఁ బరమాత్మను బొందుట కనన్యభక్తి సాధన మని నిర్వచింపఁబడియున్నది.　　22

టీ:—యోగినః - యోగులు, యత్రి కాలేతు - ఏకాలమునందు అనఁగా మార్గమునందు, ప్రియాతాః - దేహపాతానంతరమందు వెళ్లినవారలై, అనావృత్తిం - అనావృత్తిని, ఆవృత్తించ ఏవ - ఆవృత్తినిగూడ, యాంతి - పొందుదురో, తం - అట్టి, కాలం - మార్గమును, భరతర్షభ, వక్ష్యామి - చెప్పుచున్నాను.　　23

తా:—ఈ గీతమునందలి విశేషము రాఁబోవు మూఁడుగీతములచేతను వివరింపఁబడుచున్నది. ఇచట కాలశబ్దము కాలాభిమానినియగు దేవతాసామాన్య

---

తల్లభ్యే రుపాయ ఉచ్యతే పురుషఇతి. పరుషః పురి శయనాత్పూర్ణత్వాద్వా స పరః పార్థ! పరో నిరతిశయో యస్మాత్పురుషాన్న పరంకించిత్, స భక్త్యా లభ్యస్తు జ్ఞానలక్షణయాఽనన్యయాఽఽత్మవిషయయా యస్య పురుష స్యాంతఃస్థాని మధ్యస్థాని భూతాని కార్యభూతాని కార్యంహి కారణ స్యాంతర్వర్తి భవతి యేన పురుషేణ సర్వ మిదం జగత్తతం వ్యాప్తం ఆకాశేనేవ ఘటాది.　　22

ప్రకృతానాం యోగినాం ప్రణవావేశితబ్రహ్మబుద్ధీనాం కాలాంతరముక్తిభాజాం బ్రహ్మప్రతిపత్తయ ఉత్తరో మార్గో వక్తవ్య ఇతి "యత్రకాల" ఇత్యాది వివక్షితార్థసమర్పణార్థ ముచ్యతే, ఆవృత్తిమార్గోపన్యాస ఇతరమార్గస్తుత్యర్థః - యత్రేతి. యత్రికాలే ప్రియాతా ఇతివ్యవహితేన సంబంధః, యత్రి యస్మిన్ కాలే త్వనావృత్తి మపునర్జన్మ ఆవృత్తిం తద్విపరీతాంచైవ యోగిన ఇతి యోగినః కర్మిణ శ్చోచ్యన్తే కర్మిణస్తు గుణతః "కర్మయోగేణ యోగినామ్" (గీ.3-3)

అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

---

పరము. ఈ దేవతలు మరణానంతరము లోకాంతరములకుఁ బోవువారలు బోవు మార్గములయందు చమతమస్థానములు గలిగినవారలు. 23

టీ:—అగ్నిః - అగ్నియను కాలాభిమానినియగు దేవత, జ్యోతిః - అగ్నివలె కాలాభిమానిని యగు దేవత, అహః - పగటికాలమున కభిమానినియగు దేవత, శుక్లః - శుక్లపక్షాభిమానినియగు దేవత, షణ్మాసాః - ఆఱుమాసములతోఁ గూడిన, ఉత్తరాయణం - ఉత్తరాయణాభిమానిని యగు దేవతయు, తత్ర - పైని చెప్పఁబడిన దేవతలు నిలిచియుండు మార్గమునందు, ప్రయాతాః - పోవునట్టి, బ్రహ్మవిదః జనాః - బ్రహ్మవేత్తలగు మనుష్యులు, బ్రహ్మ - పరబ్రహ్మను, గచ్ఛన్తి - క్రమముగాఁ బొందుదురు. అనఁగా బ్రహ్మలోకమును బొంది యచ్చట కల్పావసానమువఱకు నిలిచి కల్పావసానమున బ్రహ్మభావమును బొందుదురు అనిభావము. ఏతద్విషయమున "సంప్రాప్తే ప్రతిసంచరే పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం" అనువాక్యము ప్రమాణము. 24

---

ఇతివిశేషణా ద్యోగినః యత్రకాలే ప్రయాతా మృతా యోగినోఽనావృత్తిం యాంతి యత్రకాలేచ ప్రయాతా ఆవృత్తిం యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ! 23

తం కాల మాహ - అగ్నిరితి. అగ్నిః కాలాభిమానినీ దేవతా తథా జ్యోతిరపి దేవతైవ కాలాభిమానినీ అథవాఽగ్నిజ్యోతిషీ యథాశ్రుతే ఏతే దేవతే, భూయసాంతు నిర్దేశో 'యత్రకాలే' 'తంకాలం' ఇత్యామ్రవణవత్, తథాఽహర్దేవతాఽహః శుక్లం శుక్లపక్షదేవతా షణ్మాసా ఉత్తరాయణం తత్రాపి దేవతైవ మార్గభూతేతి స్థితోఽన్యత్రాయం న్యాయః తత్ర తస్మిన్మార్గే ప్రయాతా మృతా గచ్ఛన్తి, బ్రహ్మ బ్రహ్మవిదో బ్రహ్మోపాసకా బ్రహ్మోపాసనపరా జనాః క్రమేణేతి వాక్యశేషః; నహి సద్యోముక్తిభాజాం సమ్యగ్దర్శననిష్ఠానాం గతిరాగతిర్వా క్వచిదస్తి "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" (బృ. 4.4.6) ఇతిశ్రుతేః బ్రహ్మసంలీన ప్రాణా ఏవ తే బ్రహ్మమయా బ్రహ్మభూతా ఏవ తే. 24

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే,
ఏకయా యా త్యనావృత్తి మన్యయా ౽౽వర్తతే పునః. 26

---

టీ:—ధూమః - ధూమమను కాలాభిమానినియగు దేవత, రాత్రిః - రాత్రియం దభిమానముగల దేవత, కృష్ణః - కృష్ణపక్షాభిమానిని యగు దేవత, షణ్మాసాః-ఆఱుమాసములు పరిమితిగల, దక్షిణాయనం - దక్షిణాయనమం దభిమానిని యగు దేవత, తత్ర - ధూమాదిదేవతలు నిలిచినమార్గముగుండ, యోగీ - మరణానంతరము వెడలినయోగి, చాంద్రమసం - చంద్రసంబంధమగు, జ్యోతిః - తేజస్సును, ప్రాప్య, పొంది, నివర్తతే - అచట కర్మఫలము ననుభవించి యయ్యది నశింపఁ దిరుగ నీభూమికి మరలివచ్చును. 25

టీ:—ఏతే - ఈ రెండగు, శుక్లకృష్ణే - శుక్లకృష్ణము లను పేర్లను గలిగిన, గతీ - మార్గములు, జగతః - జ్ఞానకర్మలయం దధికారము గలవారలకు, శాశ్వతే - క్రమముగా నియతసంబంధము గలవిగా, మతే - తలంపఁబడుచున్నవి. ఏకయా - అందు మొదటి దగు శుక్లమను పేరఁ బరగు అగ్న్యాదిమార్గముచే, అనావృత్తిం - ఆవృత్తిరహితమగు బ్రహ్మభావమును|గ్రమముగా, యాతి పొందును. బ్రహ్మవేత్త యని యధ్యాహారము. అన్యయా - రెండవది యగు కృష్ణ మను పేరఁ బరగు ధూమాదిమార్గముచే (బోయినవాఁడు), పునః - తిరిగి చంద్రలోకమునుండి, ఆవర్తతే - భూమిపైకి మరల వచ్చును. 26

---

ధూమఇతి. ధూమో రాత్రి ర్ధూమాభిమానినీ రాత్ర్యభిమానినీ చ దేవతా తథా కృష్ణః కృష్ణపక్షదేవతా షణ్మాసా దక్షిణాయనమితిచ పూర్వవ ద్దేవతైవ తత్ర చంద్రమసి భవం చాంద్రమసం జ్యోతిః ఫల మిష్టాదికారీ యోగీ కర్మ ప్రాప్య భుక్త్వా తత్ క్షయా దిహ పున ర్నివర్తతే. 25

శుక్లేతి. శుక్లకృష్ణే శుక్లాచ కృష్ణాచ శుక్లకృష్ణే జ్ఞానప్రకాశకత్వా చ్ఛుక్లా తదభావా త్కృష్ణా ఏతే శుక్లకృష్ణే హి గతీ జగత ఇత్యధికృతానాం జ్ఞానకర్మణోః

నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున! 27

---

తా:- శాస్త్రాధికారయోగ్యతను గలిగిన మనుజులలోఁ గర్మానుష్ఠానమును జేసిన యోగులు ధూమాది మార్గముగుండ చంద్రలోకమును బొంది యచట దమతమ కర్మానుగుణముగ సుఖముల ననుభవించి, తాము చేసిన పుణ్యము క్షయము గాఁగ మిగిలిన కర్మతో నందుల కుచితమగు యోనులందు జన్మించుదురు. జ్ఞాననిష్ఠు లన్ననో శుక్లమార్గముగుండ బ్రహ్మలోకమును బొంది కల్పావసానమున బ్రహ్మభావమును బొందుదురు. దానం జేసి యీ భూమికిఁ గార్మికులవలె బ్రహ్మవేత్తలు మరలిరారు. బ్రహ్మలోకము బొంది కల్పావసానమున బ్రహ్మభావమును బొందుట క్రమముక్తి యనఁబడుచున్నది. కేవల జ్ఞానులన్ననో దేహపాతానంతరముననే బ్రహ్మభావమును బొందుదురు. వారల కీరెండు మార్గములతోఁ బ్రసక్తి లేదు. కార్మికులు, జ్ఞాననిష్ఠులు, జ్ఞానులను మూఁడు విధములగు మనుజులకంటె భిన్నమగు వారలయొక్క గతివిశేషము శాస్త్రముచే నిర్వచించుటకుగూడ నవకాశము లేనంత గంభీర మని "గహనా కర్మణో గతిః" (గీ. 4-17) యని భగవానులచే నిర్వచింపఁబడినది. 26

టీ:- పార్థ! ఏతే సృతీ - ఈ మార్గములను, జానన్ - గుర్తెఱిఁగిన అనఁగా వీటిలో నొకటి మోక్షహేతు వనియు, వేఱొకటి సంసారహేతు వనియుఁ దెలిసికొనిన, కశ్చన - ఒకానొక, యోగీ - యోగియైనను, న ముహ్యతి - వ్యామోహమును జెందఁడు. అనఁగా యుక్తాయుక్త వివేకజ్ఞానమును బొందును. తస్మాత్ - ఆకారణమువలన, సర్వేషు కాలేషు - సర్వకాలసర్వావస్థలయందును, అర్జున! యోగయుక్తః - యోగముతోఁ గూడినవాఁడవై, భవ - కమ్మా. 27

---

న జగతః సర్వస్యైవైతే గతీ సంభవతః శాశ్వతే నిత్యే సంసారస్య నిత్యత్వాన్మతే అభిప్రేతే తత్రైకయా శుక్లయా యాత్యనావృత్తి మన్యయేతరయా ఽఽవర్తతే పున ర్భూయః. 26

నైతేఇతి. నైతే యథోక్తే సృతీ మార్గౌ పార్థ! జానన్ సంసారాయైకాన్యా మోక్షాయచేతి యోగీ న ముహ్యతి కశ్చన కశ్చిదపి. తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తః సమాహితో భవార్జున. 27

వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతితత్సర్వమిదం విదిత్వా యోగీపరంస్థానముపైతి చాద్యమ్.28

ఇతి శ్రీ మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
బ్రహ్మాక్షరనిర్దేశోనామ అష్టమోఽధ్యాయః.

---

టీ:- యోగీ - యోగి, ఇదం - పూర్వోక్తమగు ప్రశ్నసప్తకమునకు సమాధానముగా నీయఁబడిన యీ జ్ఞానమును, విదిత్వా - తెలిసికొని, వేదేషు - వేదములందును, యజ్ఞేషు - యజ్ఞములందును, తపస్సు - తపములందును, దానేషుచ ఏవ- దానములందును, యత్ - ఏ, పుణ్యఫలం - ఉత్తమఫలము, ప్రదిష్టమ్ - చెప్పఁబడినదో, తత్ సర్వం - ఆఫలజాతమునంతయు, అత్యేతి - అతిక్రమించుచున్నాఁడు. ఆద్యం - కారణభూతమగునట్టియు, పరం - సర్వోత్కృష్టమగు నట్టియు, స్థానం - బ్రహ్మపదమును, ఉపైతిచ - పొందుచున్నాఁడు. 28

తా:- ఈ గీతము రెండవయధ్యాయమున "యావా నర్థ ఉదపానే" యను నలుబదియారవగీతముయొక్క యాశయమునే వివరించుచున్నది. 28

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన
గీతామృత తరంగిణియందు అష్టమతరంగము.

---

శృణు తస్య యోగస్య మాహాత్మ్యమ్ వేదేష్వితి. వేదేషు సమ్యగధీతేషు యజ్ఞేషుచ సాద్గుణ్యేనానుష్ఠితేషు తపస్సుచ సుతప్తేషు దానేషుచ సమ్యగ్దత్తేషు ఏతేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం శాస్త్రేణా త్యేత్యతీత్య గచ్ఛతి తత్సర్వం ఫలజాతం ఇదం విదిత్వా సప్తప్రశ్ననిర్ణయద్వారేణోక్త మర్థం సమ్యగవధార్యానుష్ఠాయ యోగీ పరం ప్రకృష్ట మైశ్వరం స్థాన ముపైతిచ ప్రతిపద్యతే. ఆద్య మాదౌ భవం కారణం బ్రహ్మేత్యర్థః. 28

ఇతిశ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతా
భాష్యే బ్రహ్మాక్షరనిర్దేశో నామాష్టమోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## నవమోధ్యాయః

శ్రీ భగవా నువాచః—

> ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
> జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. 1

---

టీ:—యత్ - ఏ, విజ్ఞానసహితం - స్వానుభవముతోఁ గూడిన, జ్ఞానం - జ్ఞానమును, జ్ఞాత్వా - తెలిసికొని, ఽశుభాత్ అశుభాత్ - శుభాశుభ రూపమగు సంసారమునుండి, మోక్ష్యసే - ముక్తిని బొందఁగలవో, తత్ - అట్టి, గుహ్యతమం - అతి రహస్యమగు, ఇదంతు - చెప్పఁబోవు జ్ఞానమును, అనసూయవే - అసూయారహితుఁడవగు, తే - నీకొఱకు, ప్రవక్ష్యామి - చెప్పుచున్నాను. 1

---

అష్టమే నాడీద్వారేణ ధారణాయోగ స్సగుణ ఉక్తః, తస్య చ ఫల మగ్న్యర్చిరాదిక్రమేణ కాలాంతరే బ్రహ్మప్రాప్తిలక్షణ మేవానావృత్తిరూపం నిర్దిష్టమ్, తత్రానేనైవ ప్రకారేణ మోక్షప్రాప్తిఫల మధిగమ్యతే, నాన్యథేతి; తదాశంకావ్యావృత్త్యర్థం శ్రీభగవా నువాచ - ఇదమితి. ఇదం బ్రహ్మజ్ఞానం వక్ష్యమాణ ముక్తం చ పూర్వేష్వధ్యాయేషు; తద్బుద్ధౌ సన్నిధీకృత్యే దమిత్యాహ తుశబ్దో విశేషనిర్ధారణార్థః; ఇదమేవ తు సమ్యగ్జ్ఞానం సాక్షా న్మోక్షప్రాప్తిసాధనం "వాసుదేవ స్సర్వమితి" (గీ. 7-19) "ఆత్మైవేదం సర్వం" (ఛాం. 7.25.2) "ఏక మేవాద్వితీయమ్" (ఛాం. 6.2.1) ఇత్యాదిశ్రుతిస్మృతిభ్యః నాన్యత్, "అథ తే యేఽన్యథాతో విదు రన్యరాజాన స్తే క్షయ్యలోకా భవంతి" (ఛాం. 7.25) ఇత్యాదిశ్రుతిభ్యశ్చ తే తుభ్యం గుహ్యతమం గోప్యతమం ప్రవక్ష్యామి కథయిష్యా మ్యనసూయవే ఽసూయారహితాయ; కిం తత్ జ్ఞానం కింవిశిష్టం విజ్ఞానసహిత మనుభవయుక్తమ్ యత్ జ్ఞానం జ్ఞాత్వా ప్రాప్య మోక్ష్యసే ఽశుభా త్సంసారబంధనాత్ .1

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని. 3

---

టీ:– ఇదం - ఈజ్ఞానము, రాజవిద్యా - విద్యలలో శ్రేష్ఠమైనది. రాజగుహ్యం - రహస్యములలో నతి గహస్యమైనది. ఉత్తమం - శ్రేష్ఠమగు, పవిత్రం - పాపమును బోఁగొట్టునది. ప్రత్యక్షావగమం - సుఖాదులవలెఁ బ్రత్యక్షముగ దెలియఁబడునది. ధర్మ్యం - శ్రుతిస్మృతి విహితధర్మమునకు విరుద్ధము కానిది. అవ్యయం - నిత్యమును నిరతిశయము నగు ఫలము నిచ్చునది. కర్తుం - ఆచరించుటకు, సుసుఖం - ఆయాసము లేనిది. 2

టీ:–పరంతప! అస్య - ఈ, ధర్మస్య - జ్ఞానమునుగుఱించి, అశ్రద్దధానాః - విశ్వాసము లేనట్టి, పురుషాః - పాపకర్ములగు నాస్తికులు, మాం - నన్ను, అప్రాప్య - పొంద నేరక, మృత్యు సంసారవర్త్మని - మృత్యువుతోఁ గూడిన సంసార పథమునందే, నివర్తన్తే - ఎల్లప్పుడు నుందురు. 3

---

తచ్చ - రాజవిద్యేతి. రాజవిద్యా విద్యానాం రాజా దీప్త్యతిశయవత్త్వాత్ దీప్యతే హ్యయ మతిశయేన బ్రహ్మవిద్యా సర్వవిద్యానాం తథా రాజగుహ్యం గుహ్యానాం రాజా పవిత్రం పావన మిద ముత్తమం సర్వేషాం పావనానాం శుద్ధికారణం బ్రహ్మజ్ఞాన ముత్కృష్టతమమ్ అనేకజన్మసహస్రసంచితమపి ధర్మాధర్మాది సమూలం కర్మ క్షణమాత్రా దేవ భస్మీకరోతి; యతో ఽతః కిం తస్య పావనత్వం వక్తవ్యమ్, కించ ప్రత్యక్షావగమం ప్రత్యక్షేణ సుఖాదేరివావగమో యస్య తత్ప్రత్యక్షావగమమ్ అనేకగుణవతో ఽపి ధర్మవిరుద్ధత్వం దృష్టం న తథా ఽఽత్మజ్ఞానం ధర్మవిరోధి, కింతు ధర్మ్యం ధర్మా దనపేతమ్ ఏవమపి స్యా ద్దుఃఖసంపాద్య మిత్యత ఆహ. సుసుఖం కర్తుం యథా రత్నవివేకవిజ్ఞానమ్ తత్రాల్పాయాసానాం కర్మణాం సుఖసంపాద్యానా మల్పఫలత్వం దుష్కరాణాంచ మహాఫలత్వం దృష్టమితి; ఇదం తు సుఖసంపాద్యత్వా త్ఫలక్షయా ద్వ్యేతీతి ప్రాప్త ఆహ - అవ్యయ మితి. నాస్య ఫలతః కర్మవ ద్వ్యయో ఽస్తీ త్యవ్యయమ్ అత శ్శ్రద్ధేయ మాత్మజ్ఞానమ్. 2

యే పునః అశ్రద్దధానా ఇతి, అశ్రద్దధానాః శ్రద్ధావిరహితా ఆత్మజ్ఞానస్య ధర్మస్యాస్య స్వరూపే తత్ఫలే చ నాస్తికాః పాపకారిణో ఽసురాణా ముపనిషదం దేహమాత్రాత్మదర్శన మేవ ప్రతిపన్నా అసుతృపః పాపాః పురుషా అశ్రద్దధానాః

మయా తత మిదం సర్వం జగ దవ్య క్తమూ ర్తినా,
మత్ స్థాని సర్వభూ తాని న చాహం తే ష్వవస్థితః. 4

తా:—ఈమూఁడు గీతములచేతను శ్రీకృష్ణభగవానులు దాను మున్ముం దుపదేశింపఁదలఁచిన యుత్తమోత్తమమగు బ్రహ్మవిద్యయొక్క యతిశయమును వర్ణించుచున్నారు. ఈయధ్యాయమున నుపదేశింపఁబోవు జ్ఞాన మేడవయధ్యా యమునందును నాలుగవ యధ్యాయమునందు నుపదేశింపఁబడిన జ్ఞానముయొక్క సార మని మొదటిగీతముయొక్క రెండవచరణమునందలి లింగమువలన నుస్పష్ట ముగాఁ దెలియవచ్చెడిని. ఇందలి "జ్ఞానం విజ్ఞానసహితం" అనులింగ మేడవ యధ్యాయమునందలి "జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః" అను గీతమును, "యత్ జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్" అను లింగము నాలుగవ యధ్యా యమున "తత్తే కర్మ ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్" అను పదు నాఱవగీతమును సూచించుచున్నది. దానంజేసి యాయధ్యాయములయందుఁ బ్రస్తావనచేఁ జెప్పఁబడిన యితరవిషయములనుండి సారభూతమగు తత్త్వమును వేఱుచేసి యిందు సుగమముగ నుపదేశింపఁబడుచున్నదని సువ్యక్తము. 3

టీ:—ఇదం - ఈ పరిదృశ్యమానమగు, సర్వం - సమస్తమైన, జగత్ - ప్రపం చము, అవ్యక్తమూర్తినా - అవాఙ్మానసగోచర స్వరూపమగు, మయా - నాయొక్క యుత్కృష్టమగు పరమాత్మభావముచే, తతం - వ్యాపింపఁబడినది. సర్వభూతాని - బ్రహ్మాదిస్తంబపర్యంతము గల సకలభూతములును, మత్ స్థాని - నాయం దున్నవి. అనఁగా నాయొక్క స్వరూపముచేతనే తమతమ భావములను బొందినవి గావున నాయం దున్నవని చెప్పఁబడుచున్నవి. అహంచ - నే నన్ననో, తేషు - ఆభూత

పరంతప! అప్రాప్య మాం పరమేశ్వరం మత్ప్రాప్తౌ నైవాశంకేతి మత్ప్రాప్తిమార్గ సాధనభేదభక్తిమాత్రమ ప్యప్రాప్యేత్యర్థః. నివర్తంతే నిశ్చయేనావర్తంతే; క్వ? మృత్యుసంసారవర్త్మని మృత్యుయుక్త స్సంసారో మృత్యుసంసార స్తస్య వర్త్మ నరకతిర్యగాదిప్రాప్తిమార్గ స్తస్మిన్నేవ వర్తన్త ఇత్యర్థః. 3

స్తుత్వా ఽర్జున మభిముఖీ కృత్యాహ - మయేతి. మయా మమ యః పరో భావః, తేన తతం వ్యాప్తం సర్వ మిదం జగ దవ్యక్తమూర్తినా న వ్యక్తా మూర్తిః స్వరూపం యస్య మమ సోఽహ మవ్యక్తమూర్తి స్తేన మయా ఽవ్యక్తమూర్తినా కరణాగోచరస్వరూపే ణేత్యర్థః, తస్మి న్మయ్యవ్యక్తమూర్తౌ స్థితాసి మత్ స్థాని సర్వభూతాని బ్రహ్మాదీని స్తంబపర్యంతాని, న హి నిరాత్మకం కించిద్భూతం

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

గాత్రిమమునందు, న అవస్థితః - ఉండువాఁడను గాను, అనఁగా సకలభూతములకు నధిష్ఠానమగు స్వరూపము నేనే యగుటఁజేసి నేనా భూతములయందుంటి నని తలఁచుట యవివేక మని తాత్పర్యము. 4

టీ:-అర్జున! మే - నాయొక్క, ఐశ్వరం - ఈశ్వరసంబంధమగు, యోగం - సంఘటనమును, పశ్య - చూఁడుమా! భూతాని - సమస్తభూతములు, మత్స్థానిచ - నాయందున్నవైగూడ, న - కావు. భూతభావనః - భూతములచే భావన చేయఁబడు, అనఁగా భూతములద్వారా తెలిసికొనఁబడు, మమ - నాయొక్క, ఆత్మా - స్వరూపము, భూతభృత్ చ - భూతములను ధరించినదియు, అనఁగా భూతముల కాధారమైనదియు, భూతస్థః చ - భూతములయం దున్నదియును, అనఁగా భూతముల కాధేయ మైనదియు, న - ఎంతమాత్రిమును గాదు. లేక, భూతభావనః - భూతముల యుత్పత్తి స్థితులకుఁ గారణభూతమగు, మమఆత్మా - నాయొక్క స్వరూపము. భూతభృత్ - భూతములను ధరించినదియు, భూతస్థః - భూతములయం దున్నదియు, న - కాదు. ఎట్లన, రజ్జుసర్పస్థలమునందు సర్పము యొక్క యుత్పత్తిస్థితులకుఁ గారణభూతమగు రజ్జువు సర్పముచే భావనచేయఁబడుచు, సర్పమున కాధారముగాని సర్పమున కాధేయముగాని యెంతమాత్రిము కానే అదో యాతీరుననే భూతములయొక్క యుత్పత్తిస్థితులకుఁ గారణభూతమైనట్టియు భూతములచే భావనచేయఁబడునట్టియు పరమాత్మయగు బ్రిహ్మము భూతములకు

---

వ్యవహారాయావకల్పతే అతో మత్స్థాని మయా ఽఽత్మనా ఽఽత్మవత్త్వేన స్థితాన్యతో మయి స్థితానీత్యుచ్యన్తే, తేషాం భూతానా మహమేవాత్మా ఇత్యత స్తేషు స్థిత ఇతి మూఢబుద్ధీనా మవభాసతే, అతో బ్రివీమి న చాహం తేషు భూతేష్వవస్థితో మూర్తవత్సంశ్లేషాభావేనాకాశస్యాప్యంతరతమో హ్యహమ్, న హ్యసంసర్గి వస్తు క్వచిదాధేయభావేనావస్థితం భవతి 4

అత ఏవాసంసర్గిత్వా న్మమ నచేతి. న చ మత్స్థాని భూతాని బ్రహ్మాదీని పశ్య మే యోగం యుక్తిం ఘటనం మే మమైశ్వరం యోగ మాత్మనో యాథాత్మ్యమిత్యర్థః తథాచ శ్రుతి రసంసర్గిత్వా దసంగతాం దర్శయతి "అసంగో న హి సజ్యతే" (బృ. 3-9-26) ఇతి. ఇదం చాశ్చర్యమన్య త్పశ్య భూతభృదసంగోఽపి సన్ భూతాని బిభర్తి నచ భూతస్థో యథోక్తేన న్యాయేన దర్శితత్వా ద్భూతస్థత్వానుపపత్తేః కథం పునరుచ్యతేఽసౌ మమాత్మేతి విభజ్య దేహాదిసంఘాతం,

యథాఽఽకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. 6

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్. 7

---

నాధారముగాని భూతములకు నాధేయముగాని యెంతమాత్రము గానేఱదని తాత్పర్యము. ఈభూతములు రెండు నేడవయధ్యాయమునందు

"యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి".

అను పండ్రెండవగీతముయొక్క విశేషవివరణము. 5

టీ:-యథా - ఏప్రకారము, నిత్యం - ఎల్లప్పుడును, మహాన్-గొప్పదగు, వాయుః - వాయువు, సర్వత్రగః - అంతటను నిండినదై ఆకాశస్థితః - ఆకాశమునందున్నదో, తథా - ఆతీరుననే, సర్వాణి భూతాని- సమస్తములగు భూతములును, మత్ స్థాని ఇతి-నాయందున్నవని, ఉపధారయ- తెలిసికొనుము, 6

తా:-మహత్పరిమాణవిశిష్టమును సర్వవ్యాపకము నగు వాయు వాకాశముతో నెట్టి సంబంధము లేకుండ యాకాశమునం దంతట, నెట్లు నిండియున్నదో యట్లు సమస్త భూతములును నాతో నెట్టి సంబంధము లేక నాయం దున్నవని పైని చెప్పఁబడిన రెండు గీతములయందలి విశేషవిషయమును గ్రహించుటకై దృష్టాన్త మీ గీతమునం దివ్వఁబడినది. 6

టీ:-కౌంతేయ! కల్పక్షయే - ప్రళయకాలమందు, సర్వభూతాని - సమస్త భూతములును, మామికాం - నాసంబంధమగు, ప్రకృతిం - త్రిగుణాత్మకమగు

---

తస్మి న్నహంకార మధ్యారోప్య లోకబుద్ధి మనుసర న్వ్యపదిశతి మమాత్మేతి. స పునరాత్మన ఆత్మాఽన్య ఇతి లోకవ దజాన న్తథా భూతభావనో భూతాని భావయ త్యుత్పాదయతి వర్ధయతీతి వా భూతభావనః. 5

యథో క్తేన శ్లోకద్వయేనో క్త మర్థం దృష్టాన్తే నోపపాదయన్నాహ- యథేతి. యథా లోక ఆకాశస్థిత ఆకాశే స్థితో నిత్యం సదా వాయుః సర్వత్ర గచ్ఛతీతి సర్వత్రగో మహా న్పరిమాణత స్తథాఽఽకాశవత్సర్వగతే మయ్యసంశ్లేషేణైవ స్థితానీ త్యేవ ముపధారయ విజానీహి. 6

ఏవం వాయు రాకాశఇవ మయి స్థితాని సర్వభూతాని స్థితికాలే, తాని సర్వేతి సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం త్రిగుణాత్మికా మపరాం నికృష్టాం

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృ తే ర్వశాత్. 8

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవ దాసీన మస క్తం తేషు కర్మసు. 9

---

నవరాప్రకృతిని, యాంతి - పొందుచున్నవి. కల్పాదా - సృష్టికాలమందు, తాని - ఆభూతములను, అహం - నేను పునః - తిరుగ, విసృజామి - పుట్టించుచున్నాను. 7

టీ:—స్వాం - నాసంబంధమగు, ప్రకృతిం - అవిద్యారూపమగు ప్రకృతిని, అవష్టభ్య - స్వాధీనము చేసికొని, పునః పునః - మాటిమాటికి, ఇమం భూతగ్రామం - ఈభూతసముదాయమును, విసృజామి - పుట్టించుచున్నాను. కృత్స్నం - సమస్తమగు భూతజాలము, ప్రకృతేః - ప్రకృతికి, వశాత్ - స్వాధీనమగుటవలన, అవశం- పరవశమై స్వాధీనముఁ దప్పియున్నది. 8

తా:- ఈ రెండు గీతములు నెనిమిదవ యధ్యాయమందలి "అవ్యక్తాద్వ్యక్తయః" భూతగ్రామ స్సవా౽యమ్" అను పదునెనిమిది, పందొమ్మిది గీతముల యొక్క యనువాదరూపములు. 7-8

టీ:—ధనంజయ ! తేషు - అట్టి, కర్మసు - ఉత్పత్తిస్థితిలయరూపములగు కర్మలయందు, ఉదాసీనవత్ - తటస్థునివలె, ఆసీనం - ఉన్నట్టియు, అసక్తం- అభినివేశము లేనట్టియు, మాం - నన్ను, తాని కర్మాణి - ఆ ఉత్పత్త్యాది కర్మలు, న చ నిబధ్నంతి - ఎంతమాత్రమును బంధింపనేరవు. 9

---

యాంతి మామికాం మదీయాం కల్పక్షయే ప్రళయకాలే పున స్తాని భూతాన్యుత్పత్తికాలే కల్పాదా విసృజా మ్యుత్పాదయా మ్యహం పూర్వవత్. 7

ఏవ మవిద్యాలక్షణామ్ - ప్రకృతిమితి ప్రకృతిం. స్వాం స్వీయా మవష్టభ్య వశీకృత్య విసృజామి పునఃపునః ప్రకృతితో జాతం భూతగ్రామం భూతసముదాయ మిమం వర్తమానం కృత్స్నం సమగ్ర మవశ మస్వతంత్ర మవిద్యాదిదోషైః పరవశీకృతం ప్రకృ తే ర్వశాత్స్వభావవశాత్. 8

తర్హి తస్య తే పరమేశ్వరస్య భూతగ్రామ మిమం విషమం విదధత స్తన్నిమిత్తాభ్యాం ధర్మాధర్మాభ్యాం సంబంధః స్యాదితీద మాహ భగవాన్ - నచేతి. న చ మా మీశ్వరం తాని భూతగ్రామస్య విషమసర్గనిమిత్తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ! తత్ర కర్మణా మసంబద్ధత్వే కారణమాహ - ఉదాసీనవదాసీనం యథోదాసీన ఉపేక్షకః కశ్చిత్తద్వదాసీనం ఆత్మనో ౽విక్రియత్వాత్ అసక్తం

మయా ఉధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. 10

---

తా:—ఈ గీతము నాలుగవ యధ్యాయమందలి "నమాం కర్మాణి లింపంతి" యను పదునాలుగవ గీతముయొక్క యనువాదము. 9

అధ్యక్షేణ - సర్వసాక్షియు నిర్వికారరూపమునగు, మయా - నాచే, (నధిష్ఠింపఁబడి) ప్రకృతిః - త్రిగుణాత్మకమగు నవిద్య, సచరాచరం - చరాచరములతోఁ గూడిన ప్రపంచమును, సూయతే - పుట్టించుచున్నది. (కనుచున్నది.) కౌంతేయ! అనేన - ఈ నా యధ్యక్షభావమనెడి, హేతునా - కారణముచే. జగత్ - ప్రపంచమంతయు, విపరివర్తతే - వ్యామోహమును జెందుచున్నది. ఈ గీత మయిదవ యధ్యాయమందలి "అజ్ఞానే నావృతంజ్ఞానం" అను పదునైదవగీతముయొక్కయు, నేడవ యధ్యాయమందలి "త్రిభిర్గుణమయై ర్భావైః" అను పదమూఁడవ గీతముయొక్కయు, నెనిమిదవ యధ్యాయమందలి "ఇచ్ఛాద్వేష సముత్థేన" అను నిరువదియేడవ గీతముయొక్కయు ననువాదము. 10

---

ఫలాసంగరహితః మభిమానవర్జిత మహం కరోమీతి తేషు కర్మసు అతోఽన్యస్యాపి కర్తృత్వాభిమానాభావః ఫలాసంగాభావశ్చాబంధకారణమ్, అన్యథా కర్మభి ర్బధ్యతే మూఢః కోశకారవదిత్యభిప్రాయః. 9

తత్ర "భూతగ్రామ మిమం విసృజామి" (గీ. 9-8) "ఉదాసీనవ దాసీనం" ఇతి చ విరుద్ధముచ్యతే ఇతి తత్పరిహారార్థ మాహ - మయేతి. మయా సర్వతో దృశిమాత్రస్వరూపేణావిక్రియాత్మనా ఉధ్యక్షేణ మమ మాయా త్రిగుణాత్మికా ఽవిద్యాలక్షణా ప్రకృతి స్సూయత ఉత్పాదయతి సచరాచరం జగత్, తథాచ మంత్రవర్ణః "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" (శ్వే 6-11) ఇతి హేతునా నిమిత్తేనానేనాధ్యక్షత్వేన కౌంతేయ జగత్సచరాచరం వ్యక్తావ్యక్తాత్మకం విపరివర్తతే సర్వావస్థాసు దృశి కర్మత్వాపత్తి నిమిత్తా హి జగత స్సర్వా ప్రవృత్తిః "అహ మిదం భోక్ష్యే, పశ్యామీదం, శృణోమీదం సుఖ మనుభవామి, దుఃఖ మనుభవామి, ఏతదర్థ మిదం కరిష్యే, ఇదం జ్ఞాస్యామి ఇత్యాద్యా అవగతి నిష్ఠా అవగత్యవసానైవ "యో ఽస్యాధ్యక్షః పరమే వ్యోమన్" (ఋ 10-129-7) ఇత్యాదయశ్చ మంత్రా ఏతమర్థం దర్శయంతి, తత శ్చైకస్య దేవస్య సర్వాధ్యక్షభూతచైతన్యమాత్రస్య పరమార్థత స్సర్వభోగానభిసంబంధినో ఽన్యస్య చేతనాంతరస్యాభావే భోక్తు రన్యస్యాభావాత్. కింనిమిత్తేయం సృష్టి రిత్యత్ర ప్రశ్నప్రతి

అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్,
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్.                11

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః,
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః        12

---

టీ:—మమ - నాయొక్క, భూతమహేశ్వరం - సకలభూతముల నప్రతిహతముగ నియమించునట్టి, పరం - నిరతిశయమగు, భావం - పరమాత్మతత్త్వమును, అజానంతః - తెలిసికొనలేని, మూఢాః - అవివేకులు, మాం - నన్ను, మానుషీం మనుష్యసంబంధమగు, తనుం - శరీరమును, ఆశ్రితమ్ - ఆశ్రయించినవానిగా నను దదభిమాన గ్రస్తునిగా, అవజానన్తి - పరిభవమును జేయుచున్నారు.        11

తా:—పరమాత్మయుఁబరమేశ్వరుఁడగునన్ను మూఢులు తమవలె సామాన్య జనునిగాఁ దలఁచుచు రాగద్వేషాదులఁబొంది, నాయందుఁ దిరస్కారభావమును వహించుచున్నారు. ఇయ్యది అవివేకవిలసితము. ఈ గీత మేడవ యధ్యాయమందలి "అవ్యక్తం వ్యక్తిమాపన్నం" అను నిరువదినాలుగవ గీతనుయొక్క యను వాదము.        11

టీ:—(మూఢాః - మూఢులు) రాక్షసీం - రాక్షససంబంధమగు నట్టియు, ఆసురీం - అసురసంబంధమగునట్టియు, మోహినీం - వ్యామోహకరమగునట్టియు,

---

వచనే అనుపపన్నే "కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః" (ఋ. 10-129-6) ఇత్యాదిమంత్రవర్ణేభ్యః, దర్శితం చ భగవతా "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః" (గీ. 5-15) ఇతి.        10

ఏవం మాం నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావం సర్వజ్ఞం సర్వజంతూనా మాత్మాన మపి సంతమ్ అవజానంతీతి - అవజానంత్యవజ్ఞాం పరిభవం కుర్వన్తి మాం మూఢా అవివేకినో మానుషీం మనుష్యసంబంధినీం తనుం దేహమాశ్రితం మనుష్యదేహేన వ్యవహరంత మిత్యేతత్. పరం ప్రకృష్టం భావం పరమాత్మతత్త్వ మాకాశకల్ప మాకాశా దప్యంతరతమ మజానంతో మమ భూతానాం మహాన్త మీశ్వరం స్వమాత్మానమ్ తత శ్చ తస్య మమా వజ్ఞానభావనేనాహతా వరాకా స్తే.        11

కథమ్ - మోఘాశాఇతి. మోఘాశా వృథా ఆశా ఆశిషో యేషాం తే మోఘాశాః తథా మోఘకర్మాణో యాని చాగ్నిహోత్రాదీని తైరనుష్ఠీయ - మానాని కర్మాణి తాని చ తేషాం భగవత్పరిభవా త్స్వాత్మభూతస్యావజ్ఞానా న్మోఘాన్యేవ నిష్ఫలాని కర్మాణి భవంతీతి మోఘకర్మాణః తథా మోఘజ్ఞానాః

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః,
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. 13

---

ప్రకృతిం - దేహాత్మభావమును, శ్రితాః - ఆశ్రయించినవారలై, మోఘాశాః - వ్యర్థమగు నాశలఁగలవారలుగను, మోఘకర్మాణః - వ్యర్థమగు గర్మలగలవారలుగను, మోఘజ్ఞానాః - వ్యర్థమగు లౌకికజ్ఞానముకలవారలుగను, విచేతసః, వివేకశూన్యులుగను, (భవంతి అగుచున్నారు.) 12

తా:—ఈగీత మేడవయధ్యాయమునందలి "న మాందుష్కృతినో మూఢాః" యను బదునేనవగీతముయొక్క యనువాదము. ఈ గీతముయొక్క విశేషవ్యాఖ్యానము బదునాఱవ యధ్యాయమున నేడవగీతము మొదలు ఇరువదవ గీతమువఱకుఁగల పదునాలుగు గీతములచే వివరింపఁబడినది. 12

టీ:=పార్థ! మహాత్మానః తు - ఉదారస్వభావులన్ననో, దైవీం - దేవతాసంబంధమగు, అనఁగా శమదమదయాశ్రద్ధాదిగుణయుక్తమగు, ప్రకృతిం - స్వభావమును, ఆశ్రితాః - ఆశ్రయించినవారలై, అనన్యమనసః - ఏకాగ్రహృదయులై, భూతాదిం - ఆకాశాదిభూతకారణమైనట్టియు, అవ్యయమ్ - నాశరహితమైనట్టియు, మాం - ఈశ్వరుఁడనగు నన్ను, భజంతి - సేవించుచుందురు. 13

తా:—దైవీప్రకృతి నాశ్రయించిన వారలయొక్క స్వభావము పదునారవ యధ్యాయమున మొదటి మూఁడుగీతములచే వివరింపఁ బడుచున్నది. 13

---

నిష్ఫలజ్ఞానా జ్ఞానమపి తేషాం నిష్ఫలమేవ స్యాత్ విచేతసో విగతవివేకాశ్చ తే భవంతీత్యభిప్రాయః. కించ తే భవంతి రాక్షసీం రక్షసాం ప్రకృతిం స్వభావ మాసురీ మసురాణాం చ ప్రకృతిం మోహినీం మోహకరీం దేహాత్మవాదినీం శ్రితా ఆశ్రితాః, ఛింద్ధి, భింద్ధి, పిబ, ఖాద, పరస్వమపహర, ఇత్యేవంవదనశీలాః క్రూరకర్మాణో భవన్తీత్యర్థః "అసూర్యా నామ తే లోకాః" (ఈశ. 3) ఇతిశ్రుతేః. 12

యే పునః శ్రద్ధధానా భగవద్భక్తిలక్షణే మోక్షమార్గే ప్రవృత్తాః - మహాత్మాన ఇతి. మహాత్మాన స్త్వక్షుద్రచిత్తా మామీశ్వరం పార్థ! దైవీం దేవానాం ప్రకృతిం శమదమదయాశ్రద్ధాదిలక్షణా మాశ్రితా స్సంతో భజన్తి సేవన్తేఽనన్యమనసోఽనన్యచిత్తా జ్ఞాత్వా భూతాదిం భూతానాం వియదాదీనాం ప్రాణినాం చాదిం కారణ మవ్యయమ్, 13

సతతం కీ ర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. 14

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. 15

---

టీ:—భక్త్యా - ప్రేమచేత, నిత్యయుక్తాః - ఎల్లప్పుడును గూడుకొనినట్టియు, దృఢవ్రతాః- స్థిరమగు నియమము గలిగినట్టియు, యతంతః చ - యమనియమాదులచేఁ బ్రయత్నము చేయునట్టియు, మహాత్ములు, సతతం - ఎల్లప్పుడును, మాం - నన్ను, కీర్తయంతః - స్తవముచేయుచును, నమస్యంతఃచ - నమస్కరించుచును, మాం - నన్ను, ఉపాసతే - ఉపాసన చేయుచుందురు. 14

టీ:—అన్యేచ - మఱికొందరు, జ్ఞానయజ్ఞేనాపి - భగవద్విషయకజ్ఞానమే యజ్ఞమను భావనచే, మాం - నన్ను, యజన్తః - పూజించుచు, ఉపాసతే - ఉపాసన చేయుదురు. మఱికొందఱు, ఏకత్వేన - ఇంద్రాదిత్యాదిదేవతలతో నభేదముగను, మఱికొందఱు, విశ్వతోముఖం - సర్వతోముఖుండనగు నన్ను, పృథక్త్వేన - వ్యష్టిభావముచే ననఁగా నాయాయిదేవతలుగ, బహుధా - అనేక విధములుగ, ఉపాసతే - ఉపాసింతురు. 15

తా:=ఈ మూఁడు గీతములచేఁ బురుషులయొక్క యంతఃకరణతారతమ్యమునుబట్టి ఉపాసనావైచిత్ర్యము బరగుచున్నదని యభిప్రాయము. ఇచట

---

కథమ్ - సతతమితి. సతతం సర్వదా భగవంతం బ్రహ్మస్వరూపం మాం కీర్తయంతో యతంత శ్చేంద్రియోపసంహారశమదమదయాహింసాదిలక్షణై ర్ధర్మైః ప్రయతంత శ్చ దృఢవ్రతా దృఢం స్థిర మచాల్యం వ్రతం యేషాం తే దృఢవ్రతా, నమస్యన్తశ్చ మాం హృదయేశయ మాత్మానం భక్త్యా నిత్యయుక్తాః సన్తః ఉపాసతే సేవంతే. 14

తే కేనకేన ప్రకారేణోపాసత ఇత్యుచ్యతే - జ్ఞానయజ్ఞేనేతి. జ్ఞానయజ్ఞేన జ్ఞానమేవ భగవద్విషయం యజ్ఞ స్తేన జ్ఞానయజ్ఞేన యజన్తః పూజయన్తో మామీశ్వరం చాప్యన్యే ఉన్యా ముపాసనాం పరిత్యజ్యోపాసతే తచ్చ జ్ఞానమేకత్వేన ఏకమేవ పరం బ్రహ్మ ఇతి పరమార్థదర్శనేన యజన్త ఉపాసతే కేచిచ్చ పృథక్త్వేన, ఆదిత్యచంద్రాదిభేదేన స ఏవ భగవాన్విష్ణు రవస్థిత ఇత్యుపాసతే కేచిద్బహుధా ఉవస్థితః స ఏవ భగవాన్విశ్వతోముఖ స్సర్వతోముఖో విశ్వరూప ఇతి తం విశ్వరూపం సర్వతోముఖం బహుధా బహుప్రకారేణోపాసతే. 15

అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధమ్,
మంత్రోఽ హ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్. 16

పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్ సామ యజురేవ చ. 17

---

"పృథ క్త్వేన బహుధా విశ్వతోముఖ ముపాసతే" యను నభిప్రాయము రాబోవు మూఁడు గీతములచేతను సామాన్యముగను, బదవ యధ్యాయమున విశేషముగ వివరింపఁబడుచున్నది. 15

టీ:- అహం నేను, క్రతుః - శ్రౌతకర్మస్వరూపము. అహం - నేను యజ్ఞః - స్మార్త కర్మరూపము. అహం - నేను, స్వధా - పితృదేవతలచే భుజింపఁబడు నన్నరూపము అహం - నేను, ఔషధం - సర్వప్రాణులచే భుజింపఁబడు నన్నరూపము, అహం-నేను, మంత్రః - పితరులకును దేవతలకును హవిస్సునిచ్చునపుడు వినియోగించు మంత్ర స్వరూపము. అహమ్ఏవ - నేనే, ఆజ్యం - ఘృతస్వరూపము, అహం - నేను, అగ్నిః - హోమాధారమగు నగ్నిహోత్రము. అహం - నేను, హుతం - హవన కర్మయు. 16

టీ:-అహం - నేను, అస్య - ఈ, జగతః - జగత్తునకు, పితా - తండ్రియు, మాతా - తల్లియు, ధాతా - కర్మఫలదాతయు, పితామహః - తాతయు నేనే. వేద్యం - తెలిసికొనఁదగినదియు, పవిత్రం - పావనహేతువును. ఓంకారః - ఓంకార స్వరూపమును. ఋక్ - ఋగ్వేదమును, సామ - సామవేదమును, యజుః ఏవచ - యజుర్వేదమును. 17

---

యది బహుభిః ప్రకారైరుపాసతే కథం త్వామేవోపాసత ఇత్యత ఆహ - అహమితి. అహం క్రతుః శ్రౌతకర్మభేదో ఽహమేవ అహం యజ్ఞః స్మార్తః కించ స్వధా ఽన్నమహం పితృభ్యో యద్దీయతే అహ మౌషధం సర్వప్రాణిభి ర్యదద్యతే, తదౌషధ శబ్దవాచ్యం వ్రీహియవాదిసాధారణమ్, అథవా స్వధేతి సర్వప్రాణిసాధారణమన్నం. ఔషధమితి - వ్యాధ్యుపశమార్థం భేషజమ్ మంత్రోఽహం యేన పితృభ్యో దేవతాభ్యశ్చ హవిర్దీయతే అహమేవాజ్యం హవిశ్చ అహమగ్నిః యస్మిన్ హూయతే హవిః సోఽగ్ని రహమ్ అహం హుతం హవనకర్మచ. 16

కించ - పితేతి. పితా జనయితాఽహ మస్య జగతో, మాతా జనయిత్రీ, ధాతా కర్మఫలస్య ప్రాణిభ్యో విధాతా, పితామహః పితుః పితా, వేద్యం వేదితవ్యం పవిత్రం పావన మోంకారః ఋక్సామయజురేవచ. 17

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున. 19

---

టీ:- అహం - నేను గతిః - కర్మఫలమును. భర్తా - పోషకుఁడను. ప్రభుః - స్వామిని. సాక్షీ-ప్రాణులయొక్క కృతాకృతములఁ గని పెట్టువాఁడను, నివాసః-ప్రాణులకు నివాసస్థానమును. శరణం - ఆర్తులచేఁ బొందఁబడు నార్తిహరుఁడను. సుహృత్ - ప్రత్యుపకారము నపేక్షింపక యుపకార మొనర్చువాఁడను. ప్రభవః - జగదుత్పత్తి కారణమును. ప్రలయః - జగల్లయకారణమును, స్థానం - జగత్తుయొక్క స్థితికారణమును, నిధానం - ప్రాణులకుఁ గాలాంతరోపభోగియు నగు నిక్షేపమును. అవ్యయం - నాశరహితమగు, బీజం - ప్రరోహకారణమును. 18

టీ:- అహం - నేను, తపామి - ఆదిత్యరూపమునఁ దపింపఁ జేయుచుంటిని. అహం - నేను, వర్షం - వర్షమును, నిగృహ్ణామి - ఆకర్షించుచున్నాను. ఉత్సృజామి చ - విడిచిపెట్టుచున్నాను. అహం - నేను, అమృతం చ ఏవ - అమృతస్వరూపుఁడను, మృత్యుశ్చ - మృత్యుస్వరూపుఁడను. సత్ - కారణస్వరూపమును, అసత్ చ - కార్యస్వరూపమును. 19

---

కించ గతిరితి - గతిః కర్మఫలం భర్తా పోష్టా, ప్రభుః స్వామీ, సాక్షీ ప్రాణినాం కృతాకృతస్య, నివాసో యస్మిన్ప్రాణినో నివసంతి, శరణమార్తానాం ప్రపన్నానా మార్తిహరః, సుహృత్ప్రత్యుపకారానపేక్షః సన్నుపకారీ, ప్రభవ ఉత్పత్తిర్జగతః,ప్రలయః ప్రలీయతేఽస్మిన్నితి, తథా స్థానం తిష్ఠత్యస్మిన్నితి, నిధానం నిక్షేపః కాలాంతరోపభోగ్యం ప్రాణినాం బీజం ప్రరోహకారణం ప్రరోహధర్మిణా మవ్యయం యావత్సంసారభావిత్వాదవ్యయమ్ నహ్యబీజం కించిత్ప్రరోహేత్, నిత్యం చ ప్రరోహదర్శనాద్బీజసంతతి ర్న వ్యేతీతి గమ్యతే. 18

కించ - తపామీతి. తపామ్యహ మాదిత్యో భూత్వా కైశ్చిద్రశ్మిభి రుల్బణైః అహం వర్షం కైశ్చిద్రశ్మిభి రుత్సృజామి, ఉత్సృజ్య పున ర్నిగృహ్ణామి కైశ్చిద్రశ్మిభి రష్టభిర్మాసైః పునరుత్సృజామి ప్రావృషి. అమృతం చైవ దేవానాం మృత్యుశ్చ మర్త్యానామ్ సత్ యస్య యత్సంబంధితయా విద్యమానం తద్విపరీత మసచ్చైవాహ మర్జున! న పున రత్యంతమేవాఽసద్భగవా న్స్వయం కార్యకారణే వా సదసతీ. 19

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః,
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్. 20

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే. 21

---

టీ:— త్రైవిద్యాః - ఋగ్యజుస్సామవిదులు, సోమపాః - సోమపానము చేసిన వారై, పూతపాపాః - పాపమును బోఁగొట్టుకొనినవారై, యజ్ఞైః - అగ్నిష్టోమాదులచే, మాం-నన్ను ఇష్ట్వా - పూజించి, స్వర్గతిం - స్వర్గగమనమును, ప్రార్థయన్తే- అపేక్షింతురు. తె - వారు, పుణ్యం - పవిత్రమగు, సురేంద్రలోకం - దేవేంద్రలోకమును ఆసాద్య - పొంది, దివి - స్వర్గమందు, దివ్యాన్ - దేవలోక సంబంధమగు. దేవభోగాన్ - దేవతలనుభవించెడి భోగములను, అశ్నంతి - అనుభవింతురు. 20

టీ:— తే - వారు, విశాలం - విస్తీర్ణమగు, తం - ఆ, స్వర్గలోకం - చంద్రలోకమును, భుక్త్వా - అనుభవించి, పుణ్యే - సుకృతము, క్షీణే - నశింపఁగా, మర్త్యలోకం - మనుష్యలోకమును, విశంతి - ప్రవేశింతురు. ఏవం - ఈప్రకారము

---

యే పూర్వోక్తై ర్వివృత్తిప్రకారై రేకత్వపృథక్త్వాదివిజ్ఞానై ర్యజ్ఞై ర్మాం పూజయంత ఉపాసతే, జ్ఞానవిద స్తే యథావిజ్ఞానం మామేవ ప్రాప్నువంతి యే పున రజ్ఞాః కామకామాః, త్రైవిద్యాఇతి. త్రైవిద్యా ఋగ్యజుస్సామవిదో మాం వస్వాదిదేవరూపిణం సోమపాః సోమం పిబంతీతి సోమపాః తేనైవ సోమపానేన పూతపాపాఃశుద్ధకిల్బిషాః యజ్ఞై రగ్నిష్టోమాదిభి రిష్ట్వా పూజయిత్వా స్వర్గతిం స్వర్గగమనం ప్రార్థయంతే. తేచ పుణ్యం పుణ్యఫల మాసాద్య సంప్రాప్య సురేంద్రలోకం శతక్రతోఃస్థాన మశ్నంతి భుంజతే, దివ్యాన్ దివిభవా నప్రాకృతా న్దేవభోగా న్దేవానాం భోగాన్, 20

తే తమితి. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం విస్తీర్ణం క్షీణే పుణ్యే మర్త్యలోక మిమం విశంత్యావిశంతి ఏవం యథోక్తేన ప్రకారేణ త్రయీధర్మం కేవలం వైదికం కర్మాఽనుప్రపన్నా గతాగతం గతం చాగతం గతాగతం గమనాగమనం

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

---

త్రియీధర్మం - వైదికకర్మానుష్ఠానమును, అనుప్రపన్నాః - ఆచరించిన, కామకామాః - కోరికలఁ గోరువారు, గతాగతం - రాకపోకలుగల సంసారమును, లభంతే - పొందుదురు. 21

తా:—ఈ రెండుగీతములు నారవయధ్యాయమునందలి "ప్రాప్య పుణ్యకృతాం" "అథవా యోగినామేవ" అను నలుబదియొకటి నలుబదిరెండవ గీతములయొక్కయు, నెనిమిదవ యధ్యాయమున "ధూమో రాత్రిః" యను నిరువదియైదవగీతము యొక్కయు నర్థవిశేషమును వివరించుచున్నవి. 20-21

టీ.—యే జనాః - ఏసంన్యాసులు, అనన్యాః - ఏకత్వమును గుర్తెఱింగినవారై, మాం - నారాయణస్వరూపుఁడనగు నన్ను, చింతయంతః - స్వస్వరూపముగాఁ దలంచుచు, పర్యుపాసతే - ఉపాసింతురో, తేషాం - అట్టి, నిత్యాభియుక్తానాం - నిరంతరజ్ఞానసంపన్నులగు వారియొక్క యోగక్షేమం - యోగక్షేమములను, అహం - నేను, వహామి - వహించుదును. 22

తా:—యోగమనఁగా లేనిదానిని బొందుట, క్షేమమనఁగాఁ బొందిన దానిని రక్షించుట. అనన్యభక్తులనఁగా జ్ఞానులగు సంన్యాసులని యే యాశయము 22

---

కామకామాః కామా న్కామయంత ఇతి కామకామా లభన్తే గతాగతమేవ నతు స్వాతంత్ర్యం క్వచిల్లభన్త ఇత్యర్థః, 21

యే పున ర్నిష్కామా స్సమ్యగ్దర్శినః అనన్యాఇతి-అనన్యా అపృథగ్భూతాః పరం దేవం నారాయణ మాత్మత్వేన గతా స్సంత శ్చింతయంతో మాం యే జనా స్సంన్యాసినః పర్యుపాసతే తేషాం పరమార్థదర్శినాం నిత్యాభియుక్తానాం సతతాభియోగినాం యోగక్షేమం యోగోఽప్రాప్తస్య ప్రాపణం క్షేమ స్తద్రక్షణం, తదుభయం వహామి ప్రాపయామ్యహమ్ "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (గీ. 7-18) "సచ మమ ప్రియః" (గీ. 7-17) యస్మా త్తస్మా త్తే మమాత్మభూతాః ప్రియా శ్చేతి, నన్వ న్యేషా మపి భక్తానాం యోగక్షేమం వహత్యేవ భగవాన్ సత్యం వహత్యేవ కింత్వయం విశేషః అన్యే యే భక్తా స్తే ఆత్మార్థం స్వయమపి యోగక్షేమ మీహన్తే అనన్యదర్శినస్తు న ఆత్మార్థం యోగక్షేమ మీహన్తే నహి తే జీవితే మరణేవా ఽఽత్మనో గృద్ధిం కుర్వంతి కేవలమేవ భగవచ్ఛరణా స్తే అతో భగవానేవ తేషాం యోగక్షేమం వహతీతి. 22

యే ఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః,
తే ఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకమ్. 23

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ,
న తు మా మభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే. 24

---

టీ:-యేఽపి - ఎవరు, శ్రద్ధయా - శ్రద్ధతో, అన్వితాః - కూడుకొనిన వారలై, అన్యదేవతాభక్తాః - ఇతర దేవతలయందు భక్తిగలవారలై, యజన్తే - ఇతర దేవతలను పూజింతురో, తేఽపి - వారలుగూడ, అవిధిపూర్వకమ్ - అజ్ఞాన పూర్వకముగా, కౌంతేయ! మామేవ - నన్నే, యజన్తే - పూజించుచున్నారు. 23

తా:-ఈ గీత యేడవ యధ్యాయమందలి "కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః" "యో యో యాం యాం తనుం" "స తయా శ్రద్ధయా యుక్తః" యను నిరు వదియొకటి యిరువదిరెండు ఇరువదిమూడు గీతముల యనువాదము. 23

టీ:-సర్వయజ్ఞానాం - శ్రౌతస్మార్తరూపములగు సకల యజ్ఞములకును, భోక్తాచ - దేవతారూపముచే భోక్తయు, ప్రభుశ్చ - స్వామియు, అహంఏవహి - నేనే, యే - ఎవరు. మాం - నన్ను, నతు అభిజానంతి - గుర్తెఱుంగఁజాలరో, తే - వారు, అతః - నన్ను గుర్తెంఱుగఁజాలని కారణమువలన, తత్త్వేన - పరమార్థముచే, చ్యవంతి ప్రచ్యుతిని జెందుదురు. 24

తా:-ఈ గీత తొమ్మిదవ యధ్యాయమందలి "భోక్తారం యజ్ఞతపసాం" అను గీతాభిప్రాయమును వెల్లడిచేయుచున్నది. 24

---

నన్వన్యా అపి దేవతా స్త్వమేవచే త్తద్భక్తాశ్చ త్వామేవ యజన్తే సత్య మేవమ్ - యఇతి యే. ఽప్యన్యదేవతాభక్తా అన్యాసు దేవతాసు భక్తా అన్యదేవతా భక్తా స్సంతో యజన్తే పూజయంతి శ్రద్ధయా ఆస్తిక్యబుద్ధ్యా అన్వితా అనుగతాః, తేఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వక మవిధి రజ్ఞానం తత్పూర్వక మజ్ఞానపూర్వకం యజన్త ఇత్యర్థః. 23

కస్మా త్తేఽవిధిపూర్వకం యజన్త ఇత్యుచ్యతే, యస్మాత్ - అహమితి. అహం హి సర్వయజ్ఞానాం శ్రౌతానాం స్మార్తానాంచ సర్వేషాం యజ్ఞానాం దేవతాత్మత్వేన భోక్తాచ ప్రభురేవచ మత్స్వామికో హి యజ్ఞో "అధియజ్ఞోఽహమేవాత్ర" (గీ. 8-4) ఇతి హ్యుక్తమ్, తథా న తు మా మభిజానంతి తత్త్వేన యథావత్, అత శ్చావిధిపూర్వక మిష్ట్వా యాగఫలా చ్చ్యవన్తి ప్రచ్యవన్తే తే. 24

యాంతి దేవవ్రితా దేవా౯ పితౄన్యాంతి పితృవ్రితాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్. 25

పత్రిం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రియచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రియతాత్మనః. 26

---

టీ:—దేవవ్రితాః - దేవతలయందు భక్తిగలిగి దేవతల నారాధించువారు, దేవాన్ - ఆయాయి దేవతలను, యాంతి - పొందుదురు. పితృవ్రితాః - పితృదేవతల యందు భక్తిగలిగి పితృదేవతల నారాధించువారు, పితౄన్ - తత్తత్పితృదేవత లను, యాంతి - పొందుదురు. భూతేజ్యాః - క్షుద్రిదేవతలయందు భక్తిగలిగి క్షుద్ర దేవతలఁ బూజించువారు, భూతాని - క్షుద్రిదేవతలను, యాంతి-పొందుదురు. మద్యాజినః అపి - నన్ను బూజించువారుగూడ, మాం - నన్ను, యాంతి - పొందు దురు. ఈ గీత మేడవయధ్యాయ మందలి "అంతవత్తు ఫలం తేషాం" అను నిరువది మూఁడవ గీతముయొక్క యనువాదము. 25

టీ.—యః - ఏభక్తుఁడు, మే - నాకొఱకు, పత్రిం, పుష్పం, ఫలం, తోయం - పత్రిపుష్ప ఫలజలములలో నెద్దానినైనను, భక్త్యా - ప్రీతితో, ప్రియచ్ఛతి - సమ ర్పించుచున్నాఁడో, ప్రియతాత్మనః - నిర్మలచిత్తుఁడగు వానియొక్క, భక్త్యుప హృతం - భక్తిపూర్వకముగా సమర్పింపఁబడినదానిని, అహం - నేను, అశ్నా మి - స్వీకరింతును. 26

---

యేఽన్యదేవతాభక్తిమత్త్వేనా ఽవిధిపూర్వకం యజన్తే తేషామపి యాగ ఫల మవశ్యంభావి, కథమ్ - యాంతీతి. యాంతి గచ్ఛన్తి దేవవ్రితా దేవేషు వ్రితం నియమో భక్తిశ్చ యేషాం తే దేవవ్రితా దేవా న్యాంతి పితౄ నగ్ని ష్వాత్తాదీ న్యాంతి పితృవ్రితాః శ్రాద్ధాదిక్రియాపరాః పితృభక్తాః భూతాని వినా యక మాతృగణ చతుర్భగిన్యాదీని యాంతి భూతేజ్యాః భూతానాం పూజకాః, యాంతి మద్యాజినో మద్యజనశీలాః వైష్ణవా మామేవ, సమానేఽప్యాయాసే మామేవ న భజన్తేఽజ్ఞానాత్ తేన తేఽల్పఫలభాజో భవంతీత్యర్థః. 25

న కేవలం మద్భక్తానా మనావృత్తిలక్షణ మనంతఫలం సుఖారాధన శ్చాఽ హమ్, కథమ్ - పత్రిమితి. పత్రం పుష్పం ఫలం తోయ ముదకం యో మే మహ్యం భక్త్యా ప్రియచ్ఛతి తదహం పత్రాది భక్త్యోపహృతం భక్తిపూర్వకం ప్రాపితం భక్త్యుపహృత మశ్నామి గృహ్ణామి ప్రియతాత్మన శ్శుద్ధబుద్ధేః- 26

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. 27

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. 28

---

టీ:—కౌంతేయ ! యత్ - ఏకార్యమును, కరోషి - చేయుచుందువో, యత్ - ఏయాహారమును అశ్నాసి - భుజించుచుందువో, యత్ - ఏ శ్రౌతముగాని స్మార్తముగాని యగు హవనమును. జుహోషి - చేయుదువో, యత్ - ఏహిరణ్యాదికమును, దదాసి - బ్రాహ్మణాదుల కిచ్చెదవో, యత్ - ఏకృచ్ఛ్రచాన్ద్రాయణాదికమును తపస్యసి - ఆచరింతువో తత్ - దానినంతయును, మదర్పణం - నాకొఱ కర్పించుటను, కురుష్వ - చేయుము. ఈ గీత మెనిమిదవ యధ్యాయమందలి యేడవగీతమున స్మరింపఁబడిన "మయ్యర్పిత మనోబుద్ధిః" యనుదాని యనువాదము. 27

టీ:—ఏవం - పూర్వోక్తప్రకారము సకల కర్మలసమర్పించుటచే, శుభాశుభ ఫలైః. పుణ్యాపుణ్య ఫలములఁ బొందించునట్టి, కర్మబంధనైః - కర్మలనెడి పాశములచే, మోక్ష్యసే - ముక్తిని జెందెదవు. సంన్యాస యోగయుక్తాత్మా, సంన్యాసమనెడి యోగముచేఁ గూడిన యంతఃకరణముగలిగినవాఁడవై, విముక్తః - కర్మబంధములనుండి విడువఁబడినవాఁడవై, మాం - నన్ను ఉపైష్యసి - శరీరపాతానంతరమునఁ బొందఁగలవు. ఈగీత మెనిమిదవ యధ్యాయమునందలి యేడవగీతమున స్మరింపఁబడిన "మామేవైష్యసి" యనువాక్యము యొక్క వివరణము. 28

---

యతఏవ మతః - యదితి. యత్కరోషి స్వతః ప్రాప్తం, యదశ్నాసి, యచ్చ జుహోషి, హవనం నిర్వర్తయసి, శ్రౌతం స్మార్తంవా యద్దదాసి ప్రయచ్ఛసి బ్రాహ్మణాదిభ్యో హిరణ్యాన్నాజ్యాది యత్తపస్యసి తప శ్చరసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం మత్సమర్పణమ్. 27

ఏవం కుర్వత స్తవ యద్భవతి తచ్ఛృణు - శుభేతి. శుభాశుభఫలైః శుభాశుభే ఇష్టానిష్టఫలే యేషాం తాని శుభాశుభఫలాని కర్మాణి తైః శుభాశుభఫలైః కర్మబంధనైః కర్మాణ్యేవ బంధనాని తైః కర్మబంధనై రేవం మదర్పణం కుర్వన్మోక్ష్యసే సోఽయం సంన్యాసయోగో నామ సంన్యాస శ్చాసౌ మత్సమర్పణతయా కర్మత్వా ద్యోగశ్చాసా వితి తేన సంన్యాసయోగేన యుక్త ఆత్మాఽంతఃకరణం యస్య తవ సత్వం సంన్యాసయోగ యుక్తాత్మా స న్విముక్తః కర్మబంధనై ర్జీవన్నేవ పతితే చాస్మిన్ శరీరే మా ముపైష్య స్యాగమిష్యసి. 28

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. 29
అపి చేత్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః. 30

---

టీ:—అహం - నేను, సర్వభూతేషు - సమస్తభూతముల యందును, సమః - తుల్యుఁడను. మే-నాకు, ద్వేష్యః- ద్వేషముతోఁ జూడబడువాఁడు, న - లేఁడు, ప్రియః- ప్రియముతోఁజూడఁబడు వాఁడు, న అస్తి - లేఁడు. అనఁగా నాకొకరియందు ద్వేషము గాని మఱియొకరియందుఁ బ్రీతిగాని యెంతమాత్రములేదు. యే తు - ఎవ్వరైతే, మాం - నన్ను, భక్త్యా - ప్రీతితో, భజంతి - సేవించుదురో, తే - వారలు, మయి - నాయందును, తేషుచ - వారలయందు, అహం అపి - నేనును, ఉన్నాము. ఈగీత మాఱవ యధ్యాయమందలి "యో మాం పశ్యతి" "సర్వభూతస్థితం" యను ముప్పటి ముప్పదియొకటవ గీతములయొక్క యనువాదము. 29

తా:—ఇచట "సమోఽహం సర్వభూతేషు" అనుటలో రెండభిప్రాయ ములు స్పష్టమగుచున్నవి. సర్వభూతములయందు నాకు సమభావము గలదు. అనఁగా నే వ్యక్తియందును నాకు రాగముగాని ద్వేషముగాని లేదనియొకటి. సర్వభూతములకు నాధారభూతమై సామ్యభావముచే నాత్మరూపమున నున్నాఁడ ననునది రెండవది. ఇచట "భక్త్యా భజన్తి" యనువాక్యము పూర్వగీతమందలి 'సంన్యాస యోగయుక్తాత్మా' యను పదముయొక్క యనువాదము. బంధమునుండి విడి తన్ను బొందుటకు సంన్యాసమనెడి యోగము కారణమని స్మరించుటచే సర్వ కర్మసంన్యాసము ముక్తికిఁ గారణమని శ్రీకృష్ణభగవానుల యాశయమైనట్లు సుస్పష్టము. 29

టీ:— సుదురాచారః అపి - పుష్కలముగ నిందింపఁబడు గుత్సితకర్మల నాచ రించినవాఁడైనను, మాం - నన్ను, అనన్యభాక్ - అనన్యమగు భక్తిచే ననఁగా

---

రాగద్వేషవాం స్త్వర్హి భగవా న్యతో భక్తా ననుగృహ్ణాతి నేతరానితి తన్న-సమఇతి. సమస్తుల్యోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః అగ్నివ దహం దూరస్థానాం యథాఽగ్ని శ్శీతం నాపనయతి, సమీప ముపసర్పతా మపన యతి, తథాఽహం భక్తా ననుగృహ్ణామి నేతరాన్, యే భజంతి తు మా మీశ్వరం భక్త్యా మయి తే స్వభావత ఏవ న మమ రాగనిమిత్తం వర్తన్తే తేషు చాప్యహం స్వభావత ఏవ వర్తే నేతరేషు నైతావతా తేషు ద్వేషో మమ. 29

శృణు మద్భక్తే ర్మాహాత్మ్యమ్ - అపీతి. అపిచే ద్యద్యపి సుదురాచారః సుష్ఠు దురాచారః అతీవ కుత్సితాచారోఽపి భజతే మా మనన్యభా గనన్యభక్తిః

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

సర్వవ్యవహారములను సంపూర్ణముగాఁ ద్యజించి యెవ్విధమగు నభిమానములు లేక, భజతే చేత్ - సేవించినట్లైన, సః - అట్టివాఁడు, సాధురేవ - లెస్సయైన వ్యాపారము గలవాఁడుగా, మంతవ్యః - తలఁచుటకుఁదగినవాఁడు, హి - ఏకారణముచే ననఁగా, సః - అట్టివాఁడు, సమ్యక్ - లెస్సయగు, వ్యవసితః - నిశ్చయము గలవాఁడు. 30

తా:—ఒకానొకప్పుడొకానొకఁడు దురాచారరతుఁడైనను గొంతకాలము నకుఁ బశ్చాత్తాపమును జెంది యట్టి పశ్చాత్తాపముచేఁ దన పాపముల కనువగు ప్రాయశ్చిత్తములఁ జేసికొని యుత్తమభావమును జెందు దృఢనిశ్చయముచే సకల వ్యాపారముల విడచి భగవంతునియందే సర్వకాల సర్వావస్థలయందు లగ్నము చేయఁబడిన చిత్తముతో వాల్మీకివలె భగవంతుని సేవించువాఁడు సత్కర్మానుష్ఠాన పరునివలె గణనీయుఁడని తాత్పర్యము. 30

టీ:—బాహ్యమగు - సకల దురాచారములను బూర్తిగా విడనాడి, యంతస్సమాహితచిత్తుఁడై భగవంతుని సేవించువాఁడు, క్షిప్రం - శీఘ్రముగా, ధర్మాత్మా - ధర్మమునందు లగ్నమయిన బుద్ధిగలవాఁడై, శశ్వత్ - నిత్యము, శాంతిం - ఉపశమము, నిగచ్ఛతి - పొందును కౌంతేయ! అర్జునా! ప్రతిజానీహి - ముల్లోకములఁ గూర్చి నిశ్చయమగు ప్రతిజ్ఞ చేయుము. మే - నాయొక్క, భక్తః - భక్తుఁడు,న ప్రణశ్యతి - ఎంతమాత్రము చెడుగునొందఁడు అని. 31

తా:—ప్రారబ్ధకర్మవశమున నెట్టి దురాచారముల నాచరించినవాఁడైనను దీవ్రమగు పశ్చాత్తాపము గల్గినచో దరించుటకు సందియు మించుకేనియు లేదని తాత్పర్యము. ఇచట "కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి" యను వాక్యమున నొక విశేషము కలదు. అదెద్దియన తన భక్తుఁడు చెరుపును జెందఁ

---

న న్సాధురేవ సమ్యగ్వృత్తఏవ స మంతవ్యో జ్ఞాతవ్యః, సమ్యగ్యథావత్ వ్యవసితో హి సః, యస్మా త్సాధునిశ్చయః సః. 30

ఉత్సృజ్యచ బాహ్యాం దురాచారతా మన్త స్సమ్యగ్వ్యవసాయసామర్థ్యాత్ - క్షిప్రమితి. క్షిప్రం శీఘ్రం భవతి, ధర్మాత్మా ధర్మచిత్తఏవ, శశ్వ న్నిత్యాం శాంతిం చోపశమం నిగచ్ఛతి ప్రాప్నోతి శృణు పరమార్థం కౌంతేయ! ప్రతిజానీహి నిశ్చితాం ప్రతిజ్ఞాం కురు న మే మమ భక్తో మయి సమర్పితాంతరాత్మా మద్భక్తో న ప్రణశ్యతీతి. 31

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిమ్. 32

కింపున ర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

---

డను ప్రతిజ్ఞను దాను జేయుటకు మారుగ నర్జునుని బ్రతిన జేయుమనుటయందలి విశేష మేమి ? తాఁ జెప్పిన లోకము విశ్వసించుఁ గాని యర్జునుఁడు చెప్పిన లోకము విశ్వసించునా ? విశ్వసించుట కవకాశము గలదా ? శ్రీకృష్ణభగవానులు తాను బ్రతినచేయుటకంటె నర్జునుఁడు ప్రతినచేయుటయే యుత్తమమని తలఁచుచున్నారు' ఏలననఁ దాఁ జెప్పినచో నొకప్పుడు దృష్టాంతమును గుర్తెఱుఁగలేని యజ్ఞులు విశ్వసింప నేరరు. అర్జునుండు చెప్పినచో దమ యనుభవమును బ్రదర్శించుట తట స్థించు గావున విశ్వాస హేతువగును. ఇంతియ కాదు. అర్జునా ! నాయందు భక్తిగల్గి వర్తింపుము. నీవు చెరుపును జెందవు. నిన్ను దృష్టాంతముగాఁ జేకొని యర్జునుని యట్లు మనము గూడ దరింపఁ గలమని విశ్వాసమును బ్రాకృతజనులు పొందఁ గలరను గొప్ప యాశయముచే నర్జునముఖమున శ్రీకృష్ణభగవానులు సింహగర్జన ముతోఁ బ్రతిజ్ఞ చేయుచున్నారు. ఈ గీతములు రెండును "అపిచేదసి పాపేభ్యః" (గీ. 4-36) అను గీతముయొక్క యనువాదములు. 31

టీ:—పార్థ ! యే - ఏ, స్త్రియః - స్త్రీలును, వైశ్యాః - వైశ్యులును, తథా- ఆతీరుననే, శూద్రాః - శూద్రులును, పాపయోనయః -పాపముతోఁగూడిన జన్మగల వారలుగా, స్యుః అపి - అయియున్నారో, తేఽపి - అట్టి స్త్రీవైశ్యశూద్రులునుగూడ మాం - నన్ను, వ్యపాశ్రిత్య - ఆశ్రయించి, పరాం - ఉత్కృష్టమగు, గతిం - స్థాన మగుముక్తిని, యాంతి హి - నిశ్చయముగ బొందుచున్నారు. 32

టీ:—పుణ్యాః - పవిత్రమగు జన్మలను గలిగినట్టియు, భక్తాః - భక్తులైనట్టి, బ్రాహ్మణాః - బ్రాహ్మణులును, రాజర్షయః - రాజశ్రేష్ఠులును, - తథా - ఆతీరుననే ఉత్కృష్టమగు పురుషార్థమును బొందుదురని, కింపునః - వేఱె చెప్పనేల ? ఇమం - ఈ,

---

కించ - మాంహీతి. మాం హి యస్మాత్పార్థ! వ్యపాశ్రిత్య మమాశ్రయ త్వేన గృహీత్వా యేఽపి స్యుర్భవేయుః పాపయోనయః పాపా యోని ర్యేషాం తే పాపయోనయః పాపజన్మానః కే త ఇత్యాహ - స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేఽపి యాంతి గచ్ఛన్తి పరాం ప్రకృష్టాం గతిమ్. 32

కింపునరితి. కింపున ర్బ్రాహ్మణాః పుణ్యాః పుణ్యయోనయో భక్తా రాజ ర్షయ స్తథా రాజానశ్చ తే ఋషయశ్చేతి రాజర్షయః యతఏవ మతోఽనిత్యం

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

ఇతి శ్రీ మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజ విద్యారాజగుహ్యయోగో నామ నవమోధ్యాయః.

---

అనిత్యం - క్షణభంగురమైనట్టియు, అసుఖం - సుఖలేశమైనను లేనట్టియు, లోకం - మనుష్యలోకమును, ప్రాప్య - పొంది, అనగాఁ బురుషార్థ సాధనమగు మనుష్యభావమును బొందితివి కావున, మాం - నన్ను, భజస్వ - సేవింపుమా. 33

టీ:—మన్మనాః - నాయందు మనస్సుకలవాఁడవు, మద్భక్తః - నాయందు భక్తిగలవాఁడవు, మద్యాజీ - నన్నుద్దేశించి యాగముచేయువాఁడవును, భవ - కమ్ము. మాం - నన్ను, నమస్కురు - నమస్కరించుము, ఏవం - ఈరీతిగా, ఆత్మానం - సర్వ భూతములయొక్క యాత్మస్వరూపమగు, మాం - నన్ను, యుక్త్వా - చిత్తమందు నిలిపి, మత్పరాయణః (సన్), - నేనే యుత్కృష్టమగు స్థానమని నిశ్చయమును బొందినవాఁడవై, మాం ఏవ - నన్నే, ఏష్యసి - పొందఁగలవు. 34

తా:—ఈగీతము పూర్వగీతమందలి "మాం భజస్వ" యను విధియొక్క విశేష వివరణము. పరమేశ్వరుని యందలి యనన్యభక్తిచేఁ బరమేశ్వరభావమగు ముక్తి నిస్సందేహముగా లభించునని యధ్యాయ తాత్పర్యము.

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన గీతామృత తరంగిణియందు నవమతరంగము.

---

క్షణభంగుర మసుఖంచ సుఖవర్జిత మిమం లోకం మనుష్యలోకం ప్రాప్య పురు షార్థసాధనం దుర్లభం మనుష్యత్వం లబ్ధ్వా భజస్వ సేవస్వ మామ్. 33

మన్మనాఇతి. మయి వాసుదేవే మనో యస్య తవ స, త్వం మన్మనా భవ, తథా మద్భక్తో భవ, మద్యాజీ మద్యజనశీలో భవ, మామేవ చ నమస్కురు, మామేవేశ్వర మేష్య స్యాగమిష్యసి యుక్త్వా సమాధాయ చిత్తమ్; ఏవ మాత్మానం, అహం హి సర్వేషాం భూతానా మాత్మా, పరాచ గతిః, పరమయనం, తం మామే వంభూత మేష్యసీ త్యతీతేన సంబంధః మత్పరాయణస్స న్నిత్యర్థః. 34

ఇతిశ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతా భాష్యే రాజవిద్యారాజగుహ్యయోగో నామ నవమోధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## దశమోఽధ్యాయః

శ్రీభగవా నువాచ:—

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తే ఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. 1

---

భూతభావనభూతేశం దేవదేవం జగత్పతిమ్,
త మహం పరమాత్మానం కృష్ణం వందే జగద్గురుమ్.

టీ:—మహాబాహో! ప్రీయమాణాయ - నావాక్యములయందుఁ బ్రీతికలిగిన, తే - నీకొఱకు, హితకామ్యయా - హితముఁజేయునిచ్ఛచే, యత్ - దేనిని, అహం-నేను, భూయఏవ - తిరిగి, వక్ష్యామి - చెప్పుచున్నానో, (తత్ - అట్టి) పరమం - ఉత్కృష్టమగు, మే - నాయొక్క, వచః - వచనమును, శృణు - వినుము. 1

తా:-ఏడవ యధ్యాయమున "రసోఽహ మప్సు కౌంతేయ" అను నెనిమిదవ గీతము మొదలు "యే చైవ సాత్త్వికా భావాః" అను పండ్రెండవ గీతము వఱకునుగల గీతములచేతను తొమ్మిదవ యధ్యాయమున "అహం క్రతు రహం" అను పదునాఱవగీతము మొదలు "తపా మ్యహం" అను పందొమ్మిదవ గీతము వఱకునుగల గీతములచేతను శ్రీకృష్ణభగవానులయొక్క విభూతి విశేషములు

---

సప్తమేఽధ్యాయే భగవత స్తత్త్వం విభూతయశ్చ ప్రకాశితా నవమేచ. అథేదానీం యేషు యేషు భావేషు చింత్యో భగవాం స్తే తే భావా వక్తవ్యాః, తత్త్వంచ భగవతో వక్తవ్యం; ఉక్తమపి దుర్విజ్ఞేయత్వా దిత్యతః శ్రీభగవానువాచ - భూయఇతి. భూయఏవ భూయః పున స్త్వం మహాబాహో! శృణు మే మదీయం పరమం ప్రకృష్టం నిరతిశయవస్తునః ప్రకాశకం వచో వాక్యం య త్పరమం తే తుభ్యం ప్రీయమాణాయ మద్వచనా త్ప్రీయసే త్వ మతీవామృత మివ పిబం స్తతో వక్ష్యామి హితకామ్యయా హితేచ్ఛయా. 1

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః,
సర్వే సహైవావనిపాలసంఘైః,
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాఽసౌ,
సహాస్మదీయైరపి యోధముఖ్యైః.　　26
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి,
దంష్ట్రాకరాళాని భయానకాని,
కేచి ద్విలగ్నా దశనాంతరేషు,
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాంగైః.　　27

---

టీ:—త్వాం - నిన్నుగూర్చి, అమీ - ఈ, ధృతరాష్ట్రస్య - ధృతరాష్ట్రుని యొక్క, పుత్రాః - పుత్రులు, సర్వేచ - అందఱును, అవనిపాలసంఘైః సహఏవ - భూపాలసముదాయములతోడను, తథా - ఆతీరుననే, భీష్మః - భీష్ముఁడును, ద్రోణః - ద్రోణుఁడును, అసౌ - ఈ, సూతపుత్రః - కర్ణుఁడును, అస్మదీయైః - మా సంబంధమగు, యోధముఖ్యైః సహ అపి - యుద్ధవీరులతోడను, త్వరమాణాః - తత్తఱపడుచున్నవారలై, తే - నీయొక్క, దంష్ట్రాకరాళాని - కోరలచే వికృతమగునట్టియు, భయానకాని - భయంకరమగునట్టియు, వక్త్రాణి - ముఖములను, విశంతి - ప్రవేశించుచున్నారు. కేచిత్ - కొందఱు, దశనాంతరేషు - దంతముల యొక్క మధ్యయందు, చూర్ణితైః - చిదుగఁ గొట్టఁబడిన, ఉత్తమాంగైః - శిరములతో, విలగ్నాః - తగుల్కొని యున్నవారలై, సందృశ్యన్తే - కనఁబడుచున్నారు.　　26-27

తా:—ఈ రెండుగీతములచే నర్జునునకుఁ గల్గిన "న చైత ద్విద్మః కతర న్నో గరీయో యద్వా జయేమ యది వా నో జయేయుః" (గీ.2-6) అను సందియము

---

ముఖాని దృష్ట్వైవ త్యేతత్ దిశః పూర్వాపరవివేకేన న జానే దిఙ్మూఢో జాతోఽస్మి; అతో న లభేచ నోపలభేచ శర్మ సుఖమ్; అతః ప్రసీద ప్రసన్నో భవ హే దేవేశ! జగన్నివాస!.　　25

యేభ్యో మమ పరాజయాశంకా ఆసీ త్సా చాపగతా, యతః - అమీఇతి. అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా దుర్యోధనప్రభృతయః "త్వరమాణా విశంతి" ఇతి వ్యవహితేన సంబంధః; సర్వే సహైవ సహితా అవనిపాలసంఘై రవనిం పృథ్వీం పాలయంతీ త్యవనిపాలా స్తేషాం సంఘైః, కించ భీష్మో ద్రోణః సూతపుత్రః కర్ణ స్తథాఽసౌ సహాస్మదీయైరపి ధృష్టద్యుమ్నప్రభృతిభి ర్యోధముఖ్యై ర్యోధానాం ముఖ్యైః ప్రధానైః సహ.　　26

కించ - వక్త్రాణీతి. వక్త్రాణి ముఖాని తే తవ త్వరమాణా స్త్వరాయుక్తాః సంతో విశంతి; కింవిశిష్టాని ముఖాని? దంష్ట్రాకరాళాని భయానకాని భయంకరాణి

యథా నదీనాం బహవో ఽంబువేగాః
సముద్ర మేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి. 28

యథా ప్రదీ ప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

---

బోఁగొట్టుటకై, భగవంతుఁడు ప్రవర్తించినట్లు తెలిసికొని యర్జునుఁ డిట్లు పలుకుచున్నాఁడు. 26-27

టీ:—యథా - ఏ ప్రకారము, నదీనాం - నదులయొక్క, బహవః - అనేకములగు, అంబువేగాః - వేగముతోఁగూడిన ప్రవాహములు, సముద్రం ఏవ - సాగరమును గూర్చియే, అభిముఖాః - ఎదురుగా, ద్రవంతి - ప్రవహించుచున్నవో, తథా - ఆ తీరుననే, అమీ - ఈ, నరలోకవీరాః - మనుష్యలోకమందలి యుద్ధవీరులు, తవ - నీ యొక్క, అభివిజ్వలంతి - అంతటను బ్రజ్వలించు చున్నట్టి, వక్త్రాణి - ముఖములను, విశంతి - ప్రవేశించుచున్నారు. 28

టీ:—యథా - ఏ ప్రకారముగా, ప్రదీ ప్తం - బాగుగాఁ బ్రజ్వలించుచున్న, జ్వలనం - అగ్నిహోత్రమును గూర్చి, పతంగాః - మిడుతలు, నాశాయ - నాశనము

---

కించ కేచి న్ముఖాని ప్రవిష్టానాం మధ్యే విలగ్నా దశనాంతరేషు మాంస మివ భక్షితం సందృశ్యన్తే ఉపలభ్యంతే చూర్ణితై శ్చూర్ణీకృతై రుత్తమాంగైః శిరోభిః. 27

కథం ప్రవిశంతి ముఖా నీత్యత ఆహ - యథాఇతి. యథా నదీనాం స్రవంతీనాం, బహవోఽనేకే, అంబూనాం వేగా అంబువేగా స్త్వరావిశేషాః సముద్ర మేవాభిముఖాః ప్రతిముఖా ద్రవంతి ప్రవిశంతి తథా తద్వ త్తవా మీ భీష్మాదయో నరలోకవీరా మనుష్యలోకే శూరా విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి ప్రకాశమానాని. 28

తే కిమర్థం ప్రవిశంతి కథం చేత్యాహ - యథేతి. యథాప్రదీ ప్తం జ్వలన మగ్నిం పతంగాః పక్షిణః విశంతి నాశాయ వినాశాయ సమృద్ధవేగాః సమృద్ధ ఉద్భూతో వేగో గతి ర్యేషాం తే సమృద్ధవేగాః తథైవ నాశాయ విశంతి లోకాః ప్రాణినః తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతప న్తి విష్ణో! 30

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమో ఽస్తు తే దేవవర! ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. 31

---

కొఱకు, సమృద్ధవేగాః - తీవ్రమగు వేగముకలవై, విశంతి - ప్రవేశించునో, తథా ఏవ - ఆ తీరుననే, తవ - నీ యొక్క, వక్త్రాణి - ముఖములను గూర్చి, లోకా అపి - ఈ ప్రాణిసముదాయము గూడ, సమృద్ధవేగాః - రెట్టించిన వేగము గలవై, నాశాయ - నాశనముకొఱకు, విశంతి - ప్రవేశించుచున్నవి. 29

టీ:-విష్ణో! జ్వలద్భిః - మండుచుండెడి, వదనైః - ముఖములచే, సమంతాత్ - అంతయు, సమగ్రాన్ - సంపూర్ణములగు, లోకాన్ - లోకములను, గ్రసమానః - మ్రింగుచున్నవాఁడవై, లేలిహ్యసే - ఎక్కువగా రుచిచూచుచుంటివి. తవ - నీ యొక్క, ఉగ్రాః - తీక్ష్ణములగు, భాసః - కాంతులు, సమగ్రం - సంపూర్ణమగు, జగత్ - ప్రపంచమును, తేజోభిః - నిశితమగు కాంతులచే, ఆపూర్య - నింపి, ప్రతపంతి - తపింపఁజేయుచున్నవి. 30

టీ:-ఉగ్రరూపః - భయంకరమగు రూపముగల, భవాన్ - నీవు, కః - ఎవ్వఁడవో, మే - నాకొఱకు, ఆఖ్యాహి - చెప్పుమా, దేవవర - దేవతలలో శ్రేష్ఠుఁడా! తే - నీ కొఱకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక! ప్రసీద - అనుగ్రహింపుమా! ఆద్యం - మొదటివాఁడవగు, భవంతం - నిన్ను గూర్చి, విజ్ఞాతుం - తెలిసికొనుటకు, ఇచ్ఛామి - కోరుచుంటిని. తవ - నీయొక్క, ప్రవృత్తిం - చేష్టను, నహి ప్రజానామి - గుర్తెఱుంగఁజాలకున్నాను. 31

---

త్వం పునః లేలిహ్యసే ఇతి. లేలిహ్యసే ఆస్వాదయసి గ్రసమానోఽన్తః ప్రవేశయన్ సమంతాత్ సమంతతః లోకాన్ సమగ్రాన్ సమస్తాన్ వదనైః వక్త్రైర్జ్వలద్భిర్దీప్యమానైస్తేజోభి రాపూర్య సంవ్యాప్య జగత్సమగ్రం సహాగ్రేణ సమస్తమిత్యేతత్, కించ భాసో దీప్తయః స్తవోగ్రాః క్రూరాః ప్రతపన్తి ప్రతాపం కుర్వన్తి హే విష్ణో! వ్యాపనశీల! 30

యత ఏవ ముగ్రస్వభావోఽతః ఆఖ్యాహీతి. ఆఖ్యాహి కథయ మే మహ్యం కో భవా నుగ్రరూపః క్రూరాకారః, నమోఽస్తు తే తుభ్యం హే దేవవర

శ్రీభగవా నువాచ—

కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతే ఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యే ఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః, 32

తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ,
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ,
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్! 33

---

టీ:—లోకక్షయకృత్ - లోకములను నశింపఁజేయునట్టి, ప్రవృద్ధః - అతిశయమగు, కాలః - కాలస్వరూపుఁడును, అస్మి - అగుచున్నాను, ఇహ - ఇప్పుడు, లోకాన్ - లోకములను, సమాహర్తుం - సంహరించుటకు, ప్రవృత్తః - ప్రవర్తించినవాఁడను. ప్రత్యనీకేషు - శత్రుసైన్యములందు, యే యోధవీరాః - ఏ యుద్ధవీరులు, అవస్థితాః - ఉన్నారో, తే సర్వే - వా రందరును, త్వా ఋతేఽపి - నీవు లేకుండగనే, న భవిష్యన్తి - నిలువఁజాలరు. 32

టీ:—తస్మాత్ -ఆకారణమువలన, త్వం - నీవు, ఉత్తిష్ఠ-లెమ్ము, యశః-కీర్తిని, లభస్వ - పొందుము, శత్రూన్ - శత్రువులను, జిత్వా - జయించి, సమృద్ధం - పుష్కలమగునట్టియు నిష్కంటక మగునట్టియు, రాజ్యం - సామ్రాజ్యమును, భుంక్ష్వ - అనుభవింపుము. ఏ తే - వీర లందఱును, మయా ఏవ - నాచేతనే, పూర్వం ఏవ - ఇదివఱలోనే, నిహతాః - చంపఁబడిరి. సవ్యసాచిన్ - సవ్యాపసవ్యహస్తములచే యుద్ధము

---

దేవానాం ప్రధాన! ప్రసీద ప్రసాదం కురు విజ్ఞాతుం విశేషేణ జ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్య మాద్యం భవ మాద్యం నహి యస్మా త్ప్రజానామి తవ త్వదీయాం ప్రవృత్తిం చేష్టామ్. 31

శ్రీభగవా నువాచ - కాలోఽస్మీతి. కాలోఽస్మి లోకక్షయకృ ల్లోకానాం క్షయం కరోతీతి లోకక్షయకృ త్ప్రవృద్ధో వృద్ధిం గతో, యదర్థం ప్రవృద్ధ స్తచ్ఛృణు, లోకాన్ సమాహర్తుం సంహర్తు మిహాఽస్మిన్ కాలే ప్రవృత్తః ఋతేఽపి వినాపి త్వా త్వాం న భవిష్యన్తి భీష్మద్రోణకర్ణప్రభృతయ స్సర్వే, యేభ్య స్తవాశంకా, యేఽవస్థితాః ప్రత్యనీకేషు అనీక మనీకం ప్రతి ప్రత్యనీకేషు ప్రతిపక్షభూతే ష్వనీకేషు యోధా యోద్ధారః. 32

యస్మా దేవం - తస్మాదితి. తస్మా త్త్వ ముత్తిష్ఠ, భీష్మద్రోణప్రభృతయోఽతిరథా అజేయా దేవైరపి అర్జునేన జితా ఇతి యశో లభస్వ, కేవలం పుణ్యై

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథా ఽన్యానపి యోధవీరాన్,
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

---

చేయ సమర్థుఁడవగు నో యర్జునా! (త్వం - నీవు) నిమిత్తమాత్రం - నామమాత్రము
నిలుచుండువాఁడవు, భవ - అగుమా! 33

టీ:-మయా - నాచే, హతాన్ - చంపఁబడిన, ద్రోణంచ - ద్రోణుని, భీష్మంచ - భీష్ముని, జయద్రథంచ - సైంధవుని, కర్ణం - కర్ణుని, తథా - అటీరు ననే, అన్యాన్ - ఇతరులగు, యోధవీరాన్ అపి - యుద్ధవీరులనుగూడ, త్వం - నీవు, జహి - నిమిత్తమాత్రముగాఁ జంపుము. మా వ్యథిష్ఠాః - ఆ యోధవీరులవలన భయము నొందకుమా! యుధ్యస్వ - తప్పక యుద్ధముచేయుము. రణే - యుద్ధమున, సపత్నాన్ - శత్రువులను, జేతాసి - జయించుదువు. 34

తా:-ముప్పది యొకటవ గీతముచే శ్రీకృష్ణభగవాను లిట్టి యుగ్రరూపమును దాల్చుటకుఁ గల కారణమే మని యర్జునుఁడు ప్రశ్నింప నందులకుఁ దగుసమాధానమును భగవానులు పై నాలుగీతములచేఁ జెప్పిరి. ఇందలి యభిప్రాయవిశేష మేమన, ఏ భీష్మద్రోణకర్ణజయద్రథులను జయించుటకు సామర్థ్యము లేకపోవుటచే వారలవలనఁ జచ్చెద నని భయపడి యుద్ధమునుండి పలాయనముఁ గావించుటకు సంసిద్ధుఁడవై యుంటివో యట్టివార లట నిలిచియున్న ట్లగపడుచున్నను వాస్తవముచే శవతుల్యులే యగుటంజేసి, వారలవలన నించుకేనియు భయముఁ జెంద నవసరములేదు. నిమిత్తమాత్రముగ నిలుచుండి సవ్యాపసవ్యముల నాడించినంత మాత్రముననే వారల నందఱను జయించితివను యశమును బడయుటయేకాక నిష్కంటకమగు నఖండమండలాధిపత్యమును బొందఁగలవు. కావున "మా వ్యథిష్ఠాః" - 'భయపడకుము' అని. ఇచట "సవ్యసాచిన్" అను సంబోధన మపహాసగర్భితము. 34

---

ద్ధిః తత్ప్రాప్యతే, జిత్వా శత్రూన్ దుర్యోధనప్రభృతీన్, భుంక్ష్వ రాజ్యం సమృద్ధమసపత్న మకంటకమ్, మయైవైతే నిహతా నిశ్చయేన హతాః ప్రాణై ర్వియోజితాః పూర్వ మేవ, నిమిత్తమాత్రం భవ త్వం హే సవ్యసాచిన్! సవ్యేన వామే నాపి హస్తేన శరాణాం క్షేప్తా త్సవ్యసాచీ త్యుచ్యతేఽర్జునః. 33

ద్రోణం చేతి. ద్రోణంచ యేషు యేషు యోధే ష్వర్జున స్యాశంకా తాంస్తా న్వ్యపదిశతి భగవాన్- మయా హతానితి. తత్ర ద్రోణభీష్మయో స్తావ త్ప్రసిద్ధ మాశంకాకారణమ్ ద్రోణో ధనుర్వేదాచార్యో దివ్యాస్త్రసంపన్న ఆత్మనశ్చ

సంజయ ఉవాచ:—

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

---

టీ:— కేశవస్య - శ్రీకృష్ణునియొక్క, ఏతత్ - ఈ, వచనం - అభయము నిచ్చు వాక్యమును, శ్రుత్వా - విని, కిరీటీ - అర్జునుఁడు, వేపమానః - కంపించుచు, కృతాంజలిః - చేతులను మోడ్చి, నమస్కృత్వా - నమస్కరించి, భూయః ఏవ - తిరుగ, భీతభీతః - ఎక్కువ భయము నొందినవాఁడై, ప్రణమ్య - నమ్రతతో నమస్కరించినవాఁడై, సగద్గదం - గద్గదస్వరముగా, కృష్ణం - శ్రీకృష్ణుని, ఆహ - పలుకుచున్నాఁడు. 35

అని సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచున్నాఁడు. 35

---

విశేషతో గురు, ర్గరిష్ఠః భీష్మః స్వచ్ఛందమృత్యు ర్దివ్యాస్త్రసంపన్నశ్చ పరశురామేణ ద్వంద్వయుద్ధ మగమ న్నచ పరాజితః, తథా జయద్రథో యస్య పితా తప శ్చర 'మమ పుత్త్రస్య శిరో భూమౌ పాతయిష్యతి య స్తస్యాపి శిరః పతిష్య' తీతి, కర్ణోఽపి వాసవదత్తయా శక్త్యా త్వమోఘయా సంపన్నః సూర్యపుత్త్రః కానీనో యతోఽత స్తన్నామ్నైవ నిర్దేశః మయా హతాం స్త్వం జహి నిమిత్తమాత్రేణ మావ్యథిష్ఠా స్తేభ్యో భయం మా కార్షీః యుధ్యస్వ, జేతాసి దుర్యోధనప్రభృతీ న్రణే యుద్ధే సపత్నాన్ శత్రూన్. 34

ఏతచ్ఛ్రుత్వేతి. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య పూర్వోక్తం కృతాంజలిః సన్ వేపమానః కంపమానః కిరీటీ నమస్కృత్య భూయః పునరేవాహోక్తవాన్ కృష్ణం సగద్గదం, భయావిష్టస్య దుఃఖాభిఘాతాత్ స్నేహావిష్టస్య చ హర్షోద్భవా దశ్రుపూర్ణనేత్రత్వేసతి శ్లేష్మణా కంఠావరోధః, తతశ్చ వాచోఽపాటవం మంద శబ్దత్వం యత్సగద్గద స్తేనసహ వర్తత ఇతి సగద్గదం వచనం ఆహేతివచనక్రియా విశేషణ మేతత్, భీతభీతః పునఃపున ర్భయావిష్టచేతాః సన్ ప్రణమ్య ప్రహ్వోభూత్వా ఆహేతి వ్యవహితేన సంబంధః; అత్రావసరే సంజయవచనం సాభిప్రాయమ్ కథం? ద్రోణాదిష్వర్జునేన నిహతేష్వజేయేషు చతుర్షు నిరాశ్రయో దుర్యోధనో నిహత ఏవేతి మత్వా ధృతరాష్ట్రో జయం ప్రతి నిరాశస్సన్ సంధిం కరిష్యతి తత శ్శాంతి రుభయేషాం భవిష్యతీతి; తదపి నాశ్రౌషీత్ ధృతరాష్ట్రో భవితవ్యవశాత్. 35

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతేచ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః. 36

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్!
గరీయసే బ్రహ్మణో ౽ ప్యాదికర్త్రే,
అనంత! దేవేశ! జగన్నివాస!
త్వ మక్షరం సదస త్తత్పరం యత్. 37

---

టీ–హృషీకేశ! తవ - నీ యొక్క, ప్రకీర్త్యా - మాహాత్మ్యముచే, జగత్ - ప్రపంచము, ప్రహృష్యతి - ఎక్కువగా సంతసించుచున్నది. అనురజ్యతేచ - అనురక్తిని గూడ బొందుచున్నది. రక్షాంసి - రాక్షసులు, భీతాని - భయపడినవారై, దిశః - దిక్కులను గుఱించి, ద్రవంతి - పరుగెత్తుచున్నారు. సర్వే - సమస్తములగు, సిద్ధసంఘాః - సిద్ధసముదాయములు, నమస్యంతి చ - నమస్కరించుచున్నవి. 36

టీ:–బ్రహ్మణః అపి - హిరణ్యగర్భునికిఁ గూడ, ఆదికర్త్రే - మూలకారణమైనట్టియు, గరీయసే - గొప్పవాఁడవైనట్టియు, తే - నీకొఱకు, కస్మాత చ - ఏ కారణముచే, న నమేరన్ - నమస్కరింపరు? అనఁగా సర్వవిధముల నిన్నే నమస్క

---

స్థానేఇతి. స్థానే యుక్తం? కిం తత్? తవ ప్రకీర్త్యా త్వన్మాహాత్మ్యప్రకీర్తనేన శ్రుతేన హే హృషీకేశ! యజ్జగత్ప్రహృష్యతి ప్రహర్ష ముపైతి, తత్ స్థానే యుక్త మిత్యర్థః. అథవా విషయవిశేషణం స్థానే ఇతి - యుక్తో హర్షాదివిషయో భగవాన్ యత ఈశ్వరః సర్వాత్మా సర్వభూతసుహృచ్చేతి. తథా౽నురజ్యతే౽నురాగం చోపైతి తచ్చ విషయే ఇతి వ్యాఖ్యేయమ్. కించ రక్షాంసి భీతాని భయావిష్టాని దిశో ద్రవంతి గచ్ఛన్తి తచ్చ స్థానే విషయే, సర్వే నమస్యంతి నమస్కుర్వంతిచ సిద్ధసంఘాః సిద్ధానాం సముదాయాః కపిలాదీనాం తచ్చ స్థానే. 36

భగవతాం హర్షాదివిషయత్వే హేతుం దర్శయతి - కస్మాచ్చేతి. కస్మాచ్చ హేతో స్తే తుభ్యం న నమేర న్న నమస్కుర్యు ర్హే మహాత్మన్! గరీయసే గురుతరాయ, యతో బ్రహ్మణో హిరణ్యగర్భస్యా ప్యాదికర్తా, కారణ మత స్తస్మా దాదికర్త్రే కథ మేతే న నమస్కుర్యుః? అతో హర్షాదీనాం నమస్కారస్య చ స్థానం త్వ మర్హో విషయ ఇత్యర్థః. హే౽నంత! దేవేశ, హే జగన్నివాస, త్వ మక్షరం తత్పరం

త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప! 38

---

రించెదరు. నీవే నమస్కారార్హుఁడవు. మహాత్మన్ - మహానుభావా! అనంత! దేవేశ! జగన్నివాస! యత్ - ఏది, సత్ - విద్యమానస్వరూపము, అసత్ - అవిద్యమానస్వరూపము, పరం - శ్రేష్ఠమును, అక్షరం - నాశరహితమును అగుచున్నదో, తత్ - ఆ పరబ్రహ్మము, త్వం - నీవే. 37

టీ:—అనంతరూప! ఆదిదేవః - తొలిదైవమును, పురాణః - చిరంతనుఁడగు, పురుషః - పురుషుఁడును, త్వం - నీవే, అస్య - ఈపరిదృశ్యమానమగు, విశ్వస్య - జగత్తునకు, పరం - ఉత్కృష్టమగు, నిధానం - అధిష్ఠానమును, త్వం - నీవే, వేత్తా- తెలిసికొనఁదగినవానిని తెలిసికొనువాఁడవును, వేద్యం చ - తెలిసికొనుటకు దగిన విషయస్వరూపమును, పరం - ఉత్కృష్టమగు, ధామ చ - స్థానమగు పరమాత్మయు, అసి - అగుచున్నావు, త్వయా - నీచే, విశ్వం - ఈ ప్రపంచము, తతం - వ్యాపింపఁబడినది. 38

---

యద్వేదాన్తేషు శ్రూయతే కింతత్? సదసదితి - సద్విద్యమానం, అసచ్చ యత్రినాస్తీతి బుద్ధిః, తే ఉపధానభూతే సదసతీ యస్యాక్షరస్య యద్ద్వారేణ సదసతీ త్యుపచర్యతే పరమార్థతస్తు సదసతోః పరం తదక్షరం యదక్షరం వేదవిదో వదన్తి త త్త్వమేవ నాన్య దిత్యభిప్రాయః. 37

పున రపి స్తౌతి త్వమితి త్వ మాదిదేవో జగతః స్రష్టృత్వాత్, పురుషః పురిశయనాత్. పురాణ శ్చిరంతనః త్వ మేవాస్య విశ్వస్య పరం ప్రకృష్టం నిధానం నిధీయతేఽస్మిన్ జగ త్సర్వం మహాప్రళయాదా వితి; కించ వేత్తాఽసి, వేదితాఽసి సర్వస్యైవ వేద్యజాతస్య యచ్చ వేద్యం వేదనార్హం తచ్చాసి పరంచ ధామ పరమం పదం వైష్ణవం, త్వయా తతం వ్యాప్తం విశ్వం సమస్తం హే అనంతరూప! అంతో న విద్యతే తవ రూపాణామ్. 38

వాయు ర్యమో ఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమో నమ స్తే ఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమ స్తే.   39

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమో ఽస్తు తే సర్వత ఏవ సర్వ!
అనంతవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతో ఽసి సర్వః.   40

---

టీ:—వాయువు, అగ్ని, వరుణుఁడు, శశాంకః - చంద్రుఁడు, ప్రజాపతిః - కశ్యపాది ప్రజాపతి సముదాయమును, ప్రపితామహశ్చ - పితామహుఁడగు బ్రహ్మకుఁ దండ్రియగు నారాయణుండును, త్వం - నీవే. తే - నీకొఱకు, సహస్రకృత్వః - వేల కొలఁది, నమః నమః - నమస్కారములు, అస్తు - అగుగాక, పునః చ - మరలను, భూయః అపి - మరలను, నమః నమః - నమస్కారములు, తే - నీకొఱకు, (అస్తు - అగుగాక.)   39

టీ:—తే - నీయొక్క, పురస్తాత్ - ప్రాఙ్ముఖమునకు, నమః - నమస్కారము, అథ - తరువాత, తే - నీయొక్క, పృష్ఠతః - పశ్చిమముఖమునకు, నమః - నమస్కారము, సర్వ - సర్వతోముఖుఁడా! తే - నీయొక్క, సర్వతః ఏవ - అన్నిముఖములకును, నమః - నమస్కారము, అస్తు - అగుగాక! త్వం - నీవు, అనంతవీర్యామితవిక్రమః - హద్దులేని సామర్థ్యము, నిరతిశయమగు పరాక్రమమును గలిగినవాఁడవు.

---

కించ వాయురితి - వాయు స్త్వం యమ శ్చాగ్ని ర్వరుణోఽపాంపతి శ్శశాంక శ్చంద్రమాః ప్రజాపతి స్త్వం కశ్యపాదిః ప్రపితామహశ్చ పితామహస్యాపి పితా ప్రపితామహో బ్రహ్మణోఽపి పితే త్యర్థః. నమో నమ స్తే తుభ్య మస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి, నమో నమ స్తే, బహుశో నమస్కారక్రియాభ్యాసావృత్తిగణనం కృత్వసుచోచ్యతే - పునశ్చ భూయోఽపీతి, శ్రద్ధాభక్త్యతిశయా దపరితోష మాత్మనో దర్శయతి.   39

తథా నమఇతి. నమః పురస్తా త్పూర్వస్యాం దిశి తుభ్యం, అథ పృష్ఠత స్తే పృష్ఠతోఽపి చ తే నమోఽస్తు తే సర్వతఏవ సర్వాసు దిక్షు సర్వత్ర స్థితాయ హేసర్వ! అనంతవీర్యామితవిక్రమో ఽనంతం వీర్య మస్యాఽమితో విక్రమోఽస్యవీర్యం సామర్థ్యం, విక్రమః పరాక్రమః, వీర్యవానపి కశ్చి చ్ఛత్రువధాదివిషయే

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హేకృష్ణ, హేయాదవ, హేసఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి. 41

య చ్చావహాసార్థ మసత్కృతో౽సి,
విహారశయ్యాసనభోజనేషు,

సర్వం - సమస్తమగు ప్రపంచమును. సమాప్నోషి - లెస్సగా నీయొక్క స్వరూపముచే నావరించి యున్నాఁడవు. తతః - ఆహేతువువలన, సర్వం - సర్వస్వరూపుఁడవు, అసి - అగుచున్నావు. 40

టీ:-సఖా ఇతి - సమానవయస్కుఁడవని, మత్వా - తలచి, ప్రసభం - విపరీతజ్ఞానముచే నావరింపఁబడి, హేకృష్ణ! హేయాదవ! హేసఖా - చెలికాఁడా, ఇతి - అని, తవ - నీయొక్క, ఇదం - ఈ, మహిమానం - మాహాత్మ్యమును, అజానతా - తెలిసికొనలేని, మయా - నాచే, ప్రమాదాత్ - తొందరపాటుగల మనసుగలవాఁడ నగుటవలనగాని, ప్రణయేన వా౽పి - ప్రీతిచేఁగాని, యత్ ఉక్తం - ఏది పలుకఁబడెనో, విహారశయ్యాసనభోజనేషు - క్రీడలయందును శయనముల

న పరాక్రమ తే, మందపరాక్రమో వా త్వం త్వనంతవీర్యో౽మితవిక్రమ శ్చేత్యనంతవీర్యామితవిక్రమః, సర్వం సమస్తం జగ త్సమాప్నోషి సమ్యగేకేనా౽౽త్మనా వ్యాప్నోషి యత స్తత స్తస్మాదసి భవసి సర్వ స్త్వం త్వయా వినా భూతం న కించి దస్తీత్యర్థః. 40

యతో౽హం త్వన్మాహాత్మ్యపరిజ్ఞానాపరాద్ధః, అతః - సఖేతి. సఖా సమాన వయా ఇతి మత్వా జ్ఞాత్వా విపరీతబుద్ధ్యా ప్రసభ మభిభూయ ప్రసహ్య యదుక్తం హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి! చా౽జానతా౽జ్ఞానినా మూఢేన కి మజానతే త్యాహ - మహిమానం మాహాత్మ్యం తవేద మీశ్వరస్య విశ్వరూపమ్ తవేదం మహిమాన మజానతేతి వైయధికరణ్యేన సంబంధః. తవేమ మితి పాఠో యద్యస్తి తదా సామానాధికరణ్య మేవ, మయా ప్రమాదా ద్విక్షిప్తచిత్తతయా ప్రణయేన వాపి ప్రణయో నామ స్నేహనిమిత్తో విస్రంభః, తేనాపి కారణేన యదుక్తవా నస్మి. 41

యచ్చేతి. యచ్చావహాసార్థం పరిహాసప్రయోజనా౽యాసత్కృతః పరిభూతో౽సి భవసి, క్వ? విహారశయ్యాసనభోజనేషు విహరణం విహారః పాదవ్యాయా

ఏకోఽథవాఽప్యచ్యుత! తత్సమక్షం
తత్ క్షామయే త్వా మహ మప్రమేయమ్. 42

పితాఽసి లోకస్య చరాచరస్య,
త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమో ఽస్త్యభ్యధికః కుతో ఽన్యో,
లోకత్రయే ఽప్యప్రతిమప్రభావ! 43

---

యందును, ఒక్కచో నుండుటయందును, భుజించుటయందును, ఏకః అపి - పరోక్షముగా నుండినవాఁడవై కాని, అథవా - లేక, తత్సమక్షం - ప్రత్యక్షముగాగాని, యత్ అపహాసార్థం - ఏ పరిహాసముకొఱకు, అసత్కృతః - పరిభవము చేయఁబడినవాఁడవు, అసి - అయితివో, తత్ - ఆపరిహాసరూపము లగు నపరాధములను గూర్చి, అహం- నేను, అప్రమేయం - ప్రమాణాతీతమగు, త్వాం - నిన్ను, క్షామయే - క్షమింప వేఁడుచున్నాను. 42

టీ:—అప్రతిమప్రభావ! నిరుపమానమగు ప్రభావము గలవాఁడా! త్వం- నీవు, అస్య - ఈ, చరాచరస్య - స్థావరజంగమాత్మకమగు, లోకస్య - ప్రాణిజాతమునకు, పితా - తండ్రివి, అసి - అగుచున్నావు. పూజ్యః - పూజార్హుఁడవును, (అసి - అగుచున్నావు) గరీయాన్ - గొప్పవాఁడగు, గురుః - ఉపదేశకుఁడవు. లోకత్రయే - మూఁడు లోకములయందును, త్వత్సమః అపి - నీతో సమానుఁడగువాఁడు గూడ, నఅస్తి - లేఁడు, అన్యః - వేఱగు, అభ్యధికః - గొప్పవాఁడు, కుతః - ఎందుఁ గలఁడు? అనఁగా ముల్లోకములందును నీకంటె బూజింపఁదగినట్టియు నాశ్రయింపఁదగినట్టియు గురువు వేఱొకఁడు లేఁడనియు, దానంజేసి నీవే జగద్గురువనియు నాశయము. 43

---

మః శయనం శయ్యా, ఆసన మాస్థాయికా, భోజన మదనం ఇత్యేతేషు విహారశయ్యాసనభోజనేషు, ఏకః పరోక్షస్స న్నసత్కృతోఽసి పరిభూతోఽసి; అథవాఽపి హే అచ్యుత! తత్సమక్షం తచ్ఛబ్దః క్రియావిశేషణార్థః, ప్రత్యక్షం వాఽసత్కృతోఽసి తత్సర్వ మపరాధజాతం క్షామయే క్షమాం కారయే త్వా మహ మప్రమేయం ప్రమాణాతీతమ్. 42

యత స్త్వం - పితాఽసీతి. పితాఽసి జనయితాఽసి లోకస్య ప్రాణిజాతస్య చరాచరస్య స్థావరజంగమస్య, న కేవలం త్వ మస్య జగతః పితా, పూజ్య శ్చ పూజార్హో యతో గురు ర్గరీయాన్ గురుతరః కస్మాద్గురుతర స్త్వ మిత్యాహ- నచ త్వత్సమ స్త్వత్తుల్యోఽన్యోఽస్తి. నహీశ్వరద్వయం సంభవత్యనేకేశ్వరత్వే వ్యవహారానుపపత్తేః, త్వత్సమ ఏవ తావదన్యో న సంభవతి కుత ఏవాన్యోఽభ్యధికః

తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్,
పి తేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయా ర్హసి దేవ! సోఢుమ్. 44

అదృష్టపూర్వం హృషితో ఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే,

---

టీ:—తస్మాత్ - ఆ కారణముచే, కాయం - శరీరమును, ప్రణిధాయ - లెస్సగా వంచి, ప్రణమ్య - నమస్కరించి, ఈశం - నియామకుఁడవై నట్టియు, ఈడ్యమ్ - స్తుతింపఁ దగినవాఁడ వై నట్టియు, త్వాం - నిన్ను, అహం - నేను, ప్రసాదయే - అనుగ్రహముకొఱకు ప్రార్థించుచున్నాను. దేవ - మహానుభావా! పుత్త్రస్య - పుత్త్రసంబంధమగు నపరాధమును, పితా ఇవ - తండ్రివలెనే, సఖ్యుః - చెలికాని యొక్క యపరాధమును, సఖా ఇవ - చెలికాఁడు వలెనే, ప్రియాయాః - ప్రియురాలియొక్క యపరాధమును, ప్రియః ఇవ - ప్రియుఁడువలెనే, సోఢుం - సహించుటకు, అర్హసి - తగుదువు. ఇచట "ప్రియాయాః అర్హసి" అను ప్రయోగమునకు మారుగా "ప్రియాయార్హసి" అను ప్రయోగ మర్జునునియొక్క చిత్తచాంచల్యమును భయమును, దత్తరపాటును సూచించుచున్నది. ఇయ్యది యర్జునునిచేతనే యుత్తరగీతమందు వివరింపఁబడుచున్నది. 44

టీ:—అదృష్టపూర్వం - ఇదివఱ కెన్నడును జూడఁబడని నీయొక్క విశ్వరూపమును, దృష్ట్వా - చూచి, హృషితః - సంతసించినవాఁడను, అస్మి - అగుచున్నాను.

---

స్యాత్ లోకత్రయేఽపి సర్వస్మిన్ అప్రతిమప్రభావ! ప్రతిమీయతే యయా సా ప్రతిమా, న విద్యతే ప్రతిమా యస్య తవ ప్రభావస్య స త్వ మప్రతిమప్రభావో హే అప్రతిమప్రభావ! నిరతిశయప్రభావేత్యర్థః. 43

యత ఏవం తస్మాదితి. తస్మా త్ప్రణమ్య నమస్కృత్య ప్రణిధాయ ప్రకర్షేణ నీచైర్ధృత్వా కాయం శరీరం ప్రసాదయే ప్రసాదం కారయే, త్వా మహ మీశ మీశితారం, ఈడ్యం స్తుత్యమ్ త్వం పునః పుత్త్రస్యాపరాధం పితా యథా క్షమతే, సర్వం సఖేవ చ సఖ్యు రపరాధం యథా వా ప్రియః ప్రియాయా అపరాధం క్షమతే. ఏవ మర్హసి హే దేవ! సోఢుం ప్రసహితుం క్షంతు మిత్యర్థః. 44

అదృష్టపూర్వమితి. అదృష్టపూర్వం న కదాచి దపి దృష్టపూర్వ మిదం విశ్వరూపం తవ మయాఽన్యై ర్వా తదహం దృష్ట్వా హృషితోఽస్మి భయేన చ

తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస! 45

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ,
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే! 46

---

మే - నా యొక్క, మనః - మనస్సు, భయేన చ - భయము మొదలగు వానిచే, ప్రవ్యథితం - క్షోభపెట్టఁబడుచున్నది. దేవ! దేవేశ! జగన్నివాస! మే - నాకొఱకు, తత్ రూపం ఏవ - ఆ నీయొక్క రూపమునే, దర్శయ - చూపుమా! ప్రసీద - అనుగ్రహింపుమా! అర్జునుఁ డెట్టిరూపము జూడ నభిలషించుచున్నాఁడో యట్టి రూప ముత్తరగీతముచే వర్ణింపఁబడుచున్నది. 45

టీ:- సహస్రబాహో! విశ్వమూర్తే! త్వాం - నిన్ను, తథాఏవ - ఆ ప్రకారముగానే, కిరీటినం - కిరీటము గలవానిగాను, గదినం - గద గలవానిగను, చక్రహస్తం - చక్రము చేతియందు గలవానిగాను, ద్రష్టుం - చూచుటకు, అహం-నేను, ఇచ్ఛామి - కోరుచుంటిని, తేన - వసుదేవపుత్రరూప మగునట్టియు, చతుర్భుజేన - నాలుగుబాహువులతోఁ గూడినట్టి, రూపేణ ఏవ - స్వరూపముగానే, భవ-అగుమా! ఈ భయంకరరూపమును విడిచి నాకుఁ బరిచితమగు వసుదేవపుత్రరూపమును బొందుమా! 46

---

ప్రవ్యథితం మనో మే అత స్తదేవ మే మమ దర్శయ హే దేవ! రూపం యస్మిత్సఖమ్ ప్రసీద దేవేశ! జగన్నివాస! జగతో నివాసో జగన్నివాసో హే జగన్నివాస! 45

కిరీటినమితి. కిరీటినం కిరీటవంతం, తథా గదినం గదావంతం, చక్రహస్తమిచ్ఛామి త్వాం ప్రార్థయే త్వాం ద్రష్టు మహం తథైవ పూర్వవ దిత్యర్థః, యత ఏవం తస్మా త్తేనైవ రూపేణ వసుదేవపుత్రరూపేణ చతుర్భుజేన సహస్రబాహో! వార్తమానికేన విశ్వరూపేణ భవ విశ్వమూర్తే! ఉపసంహృత్య విశ్వరూపం తేనైవ రూపేణ భవేత్యర్థః. 46

శ్రీభగవా నువాచ:—

మయా ప్రసన్నేన తవార్జునేదం,
రూపం పరం దర్శిత మాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. 47

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః,
ఏవంరూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! 48

---

టీ:—అర్జున! ప్రసన్నేన - నీయందనుగ్రహముగల, మయా - నా చేతను, త్వదన్యేన - నీకంటె భిన్నమగు మఱియొకనిచేతను, న దృష్టపూర్వం - ఇదివఱకు చూడఁబడని, మే - నాయొక్క, యత్ - ఏ, తేజోమయం - ప్రకాశమాన మగునట్టియు, అనంతం - హద్దులేనట్టియు, ఆద్యం - మొదటిదగునట్టియు, పరం -ఉత్కృష్ట మగు, ఇదం - ఈ, విశ్వం రూపం - విశ్వరూపము, ఆత్మయోగాత్ - నాయొక్క యోగసామర్థ్యముచే, తవ - నీకు, దర్శితం - చూపఁబడినది. 47

టీ:—కురుప్రవీర! అర్జునా! అహం - నేను, నృలోకే - మనుష్యలోకమందు, త్వదన్యేన - నీకంటె భిన్నమగు మఱియొకనిచే, ఏవంరూపః - ఈరూపము కలవాఁడనై, ద్రష్టుం - చూడబడుటకు, వేదయజ్ఞాధ్యయనైః - వేదాధ్యయనముచేగాని యజ్ఞస్వరూపపరిజ్ఞానముచేగాని, న శక్యః - సాధ్యుఁడనుగాను, దానైఃచ- దానము

---

అర్జునం భీత ముపలభ్య, ఉపసంహృత్య విశ్వరూపం ప్రియవచనేనా శ్వాసయన్ శ్రీభగవా నువాచ - మయేతి. మయా ప్రసన్నేన ప్రసాదో నామ త్వయ్యనుగ్రహబుద్ధి స్తద్వతా ప్రసన్నేన మయా తవ హే అర్జున! ఇదం పరం రూపం విశ్వరూపం దర్శిత మాత్మయోగా దాత్మన ఐశ్వర్యస్య సామర్థ్యాత్ తేజోమయం తేజఃప్రాయం విశ్వం సమస్తం, అనంత మంతరహితం, ఆదౌ భవ మాద్యం యద్రూపం మే మమ త్వదన్యేన త్వత్తోఽన్యేన కేనచి న్న దృష్టపూర్వమ్. 47

ఆత్మనో మమ రూపదర్శనేన కృతార్థ ఏవ త్వం సంవృత్త ఇతి తత్ స్తౌతి - న వేదేతి. న వేదయజ్ఞాధ్యయనైః చతుర్ణా మపి వేదానా మధ్యయనై ర్యథావ ద్యజ్ఞాధ్యయనైశ్చ, వేదాధ్యయనై రేవ యజ్ఞాధ్యయనస్య సిద్ధత్వా త్పృథ గ్యజ్ఞాధ్యయనగ్రహణం యజ్ఞవిజ్ఞానోపలక్షణార్థమ్; తథా న దానై స్తులాపురుషాదిభిః;

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. 49

---

లచేఁగూడ, న - సాధ్యుఁడను గాను, క్రియాభిః - శ్రౌతస్మార్తకర్మలచే, న - చూచుటకు సాధ్యుఁడను గాను, ఉగ్రైః - తీవ్రమగు, తపోభిః - తపస్సులచే, (న శక్యః - చూడఁబడుటకు సాధ్యుఁడను గాను.) 48

టీ:—మమ - నాయొక్క, ఇదం - పురోవర్తియగు, ఈదృక్ - ఇప్పుడు చూడఁబడుచుండెడి, ఘోరం - భయంకరమగు అనఁగాఁ బ్రళయకాలసదృశమగు, రూపం - స్వరూపమును, దృష్ట్వా - చూచి, తే - నీకు, వ్యథా-మనోవ్యథ, మా - లేకుండుగాక! విమూఢభావఃచ - మైమఱపుగూడ, మా - లేకుండుగాక, వ్యపేతభీః - పోయిన భయము గలవాఁడవై, ప్రీతమనాః - సంతుష్టిఁ జెందిన మనస్సు కలవాఁడవై, త్వం - నీవు, పునః - తిరుగ, మే - నాయొక్క, తదిదం - ఆ యీ వాసుదేవసంబంధమగు, రూపం ఏవ - రూపమునే, ప్రపశ్య - చూఁడుమా! 49

తా:—అర్జునుఁడు ఘోరమగు విశ్వరూపమును జూచుటచే సర్వవిధముల భయమును జెంది, యద్దానిఁ జూచుటకు శక్తిలేనివాఁడై, తన కిదివఱలో నలవడియున్న వాసుదేవరూపముతోఁ దన్ననుగ్రహింపవలయు నని ప్రార్థింప నిట్టి విశ్వరూపముఁ జూచుటకు నేరికిని భాగ్యము గలుగలేదనియు నట్టిభాగ్యమును బడయుటచే నర్జునుఁడు కృతార్థతఁ జెందె నని సూచించుచు దనతొల్లిటి వాసుదేవరూపమును జూఁడు మని వాసుదేవరూపముతో నిలిచిన ట్లీ మూఁడు గీతములచేఁ దెలియవచ్చుచున్నది. ఈ విషయమునే సంజయుఁ డుత్తరగీతముచేఁ బల్కుచున్నాఁడు. 47-49

---

నచ క్రియాభి రగ్నిహోత్రాదిభిః శ్రౌతాదిభిః నాపి తపోభి రుగ్రై శ్చాంద్రాయణాదిభి ర్ఘోరైః, ఏవంరూపో యథా దర్శితం విశ్వరూపం యస్య సోఽహ మేవంరూపః న శక్యోఽహం నృలోకే మనుష్యలోకే ద్రష్టుం త్వదన్యేన త్వత్తోఽన్యేన కురుప్రవీర! 48

మా తే వ్యథేతి. మా తే వ్యథా మాభూ త్తే భయం, మా చ విమూఢభావః విమూఢచిత్తతా, దృష్ట్వోపలభ్య, రూపం ఘోర మీదృ గ్యథా దర్శితం మమేదం వ్యపేతభీ ర్విగతభయః ప్రీతమనాశ్చసన్ పున ర్భూయ స్త్వం తదేవ చతుర్భుజం రూపం శంఖచక్రగదాధరం తవేష్టం రూప మిదం ప్రపశ్య. 49

సంజయ ఉవాచ:—

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా,
స్వకం రూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం,
భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా. 50

అర్జున ఉవాచ:—

దృష్ట్వేమం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. 51

---

టీ:—వాసుదేవః - శ్రీకృష్ణభగవానుఁడు, అర్జునం - అర్జునుని గూర్చి, ఇతి- "త దేవ మే రూపమిదం ప్రపశ్య" అని, ఉక్త్వా - పలికి, తథా - ఆ ప్రకారమే, భూయః- తిరిగి, స్వకం-తనసంబంధమగు అనఁగా వసుదేవపుత్త్రరూపమగు, రూపం- స్వరూపమునే, దర్శయామాస - ప్రదర్శించెను. మహాత్మా - మహానుభావుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు, పునః - తిరిగి, సౌమ్యవపుః - ప్రసన్నమగు దేహము గలవాఁడు, భూత్వా - అయి, భీతం - భయముఁ జెందిన, ఏనం - ఈ అర్జునుని, ఆశ్వాసయామాస చ - ఓదార్చెను. 50

టీ:—జనార్దన ! తవ - నీయొక్క, ఇదం- ఈ, మానుషం - మనుష్యసంబంధమగు, సౌమ్యం - ప్రసన్నమగు, రూపం - నా సుహృత్స్వరూపమును, దృష్ట్వా - చూచి, ఇదానీం - ఇప్పుడు, సంవృత్తః - బ్రతికినవాఁడను, అస్మి - అయితిని, సచేతాః - నిర్మలమగు నన్తఃకరణమును బొంది, ప్రకృతిం - నా యొక్క స్వరూపమును, గతః - పొందినవాఁడ నయితిని. 51

---

ఇత్యర్జునమితి. ఇత్యేవ మర్జునం వాసుదేవ స్తథాభూతం వచన ముక్త్వా స్వకం వసుదేవగృహే జాతం రూపం దర్శయామాస దర్శితవాన్, భూయః పునః ఆశ్వాసయామాస చ ఆశ్వాసితవాంశ్చ భీత మేనం భూత్వా పున స్సౌమ్యవపుః ప్రసన్నదేహో మహాత్మా. 50

దృష్ట్వేదమితి. దృష్ట్వేదం మానుషం రూపం మత్సఖం ప్రసన్నం తవ సౌమ్యం జనార్దన! ఇదానీ మధునాఽస్మి సంవృత్త స్సంజాతః, కిం? సచేతాః ప్రసన్నచిత్తః ప్రకృతిం స్వభావం గత శ్చాస్మి. 51

శ్రీభగవా నువాచ:—

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. 52

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా. 53

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధో ఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. 54

---

టీ—యత్ - ఏ, మమ - నాయొక్క, సుదుర్దర్శం - చూచుట కత్యంతము కష్టమగు, ఇదం - ఈ ప్రదర్శింపబడిన, రూపం - విశ్వరూపమును, త్వం - నీవు, దృష్టవాన్ - చూచినవాఁడవు, అసి - అయితివి. దేవా అపి - దేవతలుకూడ, నిత్యం - ఎల్లప్పుడును, అస్య - ఈ, రూపస్య - రూపముయొక్క, దర్శనకాంక్షిణః- దర్శనమును గోరువారలై యున్నారు. అనఁగాఁ జూచుటయం దభిలాష గలిగి ప్రయాసముఁ జెందుచున్నారు గాని నీ వలెఁ జూచుట లేదని తాత్పర్యము. 52

టీ:—మాం - నన్ను, యథా - ఏరీతిగా, దృష్టవాన్ - చూచినవాఁడవు, అసి - అయితివో, (తథా - ఆతీరున) ఏవంవిధః - ఆ యారీతిగా, ద్రష్టుం - చూచుటకు, అహం - నేను, వేదైః - నాల్గువేదములచేతను, న శక్యః - సాధ్యుఁడను గాను, తపసా - తీవ్రమగు చాంద్రాయణాదికముచేఁగూడ, న - సాధ్యుఁడను గాను. దానేన - గోభూహిరణ్యాదిదానములచే, న శక్యః - సాధ్యుఁడను గాను, ఇజ్యయా చ - యజ్ఞములచేతను బూజలచేతను గాని, న - సాధ్యుఁడను గాను. 53

టీ:—అర్జున! అనన్యయా - ఏకాంతమగు, భక్త్యాతు - భక్తిచేతనే, ఏవంవిధః - ఈ ప్రకారముగా, జ్ఞాతుం - తెలిసికొనుటకు, ద్రష్టుంచ - చూచుటకును,

---

సుదుర్దర్శమితి. సుదుర్దర్శం సుష్ఠు దుఃఖేన దర్శన మస్యేతి సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ దేవా అప్యస్య మమ రూపస్య నిత్యం సర్వదా దర్శనకాంక్షిణః దర్శనేప్సవోఽపి న త్వమివ దృష్టవంతో న ద్రక్ష్యంతి చేత్యభిప్రాయః. 52

కస్మాత్ - నాహమితి. నాహం వేదైః ఋగ్యజుస్సామాథర్వవేదై శ్చతుర్భిరపి, న తపసోగ్రేణ చాంద్రాయణాదినా, న దానేన గోభూహిరణ్యాదినా, న చేజ్యయా యజ్ఞేన పూజయా వా శక్య ఏవంవిధో యథా దర్శితప్రకారో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా త్వమ్. 53

కథం పున శ్శక్య ఇత్యుచ్యతే - భక్త్యేతి. భక్త్యా తు కింవిశిష్టయే త్యాహ - అనన్యయాఽపృథగ్భూతయా భగవతోఽన్యత్ర పృథ గ్న కదాచిదపి యా

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః,
నిర్వైర స్సర్వభూతేషు యః స మా మేతి పాండవ! 55

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
విశ్వరూపదర్శనం నామైకాదశోఽధ్యాయః.

---

తత్త్వేన - యథార్థముగా, ప్రవేష్టుంచ - పొందుటకును, పరంతప! అహం - నేను, శక్యః - సాధ్యుఁడ నగుచున్నాను. 54

తా:- భగవంతునియొక్క దర్శనలాభమునకు ననన్యభక్తి ముఖ్యసాధన మని నిర్వచించుటయే యీ గీతముల పరమతాత్పర్యము గాని, వేదాధ్యయన యజ్ఞతపోదానాదికములు నిష్ప్రయోజనము లనియు, హేయము లనియుఁ గాదు. వస్త్వంతరనిందచే వస్త్వంతరమును స్తుతించుట 'నహినిందాన్యాయ' మని కోవిదులచేఁ జెప్పఁబడుచున్నది. భక్తితోఁ గూడిన వేదాధ్యయనాదు లుత్తమగతి సాధనము లని భావము. 54

టీ:- యః - ఎవ్వఁడు, మత్కర్మకృత్ - నాయొక్క ప్రీతికొఱకు గర్మల నాచరించునో, మత్పరమః - నేనే యుత్కృష్టమగు గతి యనితలంచునో, మద్భక్తః- సర్వవిధములచేతను సర్వోత్సాహములచేతను నన్నే సేవించుచుండునో, సంగవర్జితః-

---

భవతి సా త్వనన్యా భక్తిః సర్వైరపి కరణై ర్వాసుదేవా దన్య న్నోపలభ్యతే యయా సా అనన్యాభక్తి స్తయా భక్త్యా శక్యోఽహ మేవంవిధో విశ్వరూప ప్రకారో హే అర్జున! జ్ఞాతుం శాస్త్రతో న కేవలం జ్ఞాతుం శాస్త్రతో ద్రష్టుం చ సాక్షాత్కర్తుం తత్త్వేన తత్త్వతః, ప్రవేష్టుం చ మోక్షం చ గంతుం పరంతప! 54

అధునా సర్వస్య గీతాశాస్త్రస్య సారభూతోఽర్థో నిఃశ్రేయసార్థోఽనుష్ఠేయత్వేన సముచ్చిత్యోచ్యతే మత్కర్మేతి. మత్కర్మకృత్, మదర్థం కర్మ మత్కర్మ తత్కరోతీతి మత్కర్మకృత్, మత్పరమః కరోతీతి భృత్యః స్వామికర్మ న త్వాత్మనః పరమా ప్రేత్య గంతవ్యా గతి రితి స్వామినం ప్రతిపద్యతే, అయంతు

ధన పుత్త్రమిత్రకళత్ర బంధువర్గములందు నాసక్తి లేనివాఁడును, సర్వభూతేషు సమస్తభూతములయందును, నిర్వైరః - ద్వేషము లేనివాఁడును, అనగా నహింసయే పరమధర్మముగాఁ దలఁచువాఁడును అగుచున్నాఁడో, సః - అట్టి యుత్తముఁడు, పాండవ - అర్జునా! మాం - నన్నే, ఏతి - పొందుచున్నాఁడు. అనఁగా నాయొక్కభావమగు ముక్తినిఁ బొందు నని తాత్పర్యము. ఈ గీతముచే భగవత్ప్రాప్తిసాధనమగు ననన్యభక్తి ప్రదర్శింపఁబడుచున్నది. ఇట్టి యనన్యభక్తితో నొప్పువానినే ఆర్తార్థార్థిజిజ్ఞాసుజ్ఞాను లను నాల్గువిధములగు భక్తులలో నగ్రగణ్యుఁడగు జ్ఞాని యేడవ యధ్యాయమున వర్ణింపఁబడిన జ్ఞానియే యని తెలియునది.

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన
గీతామృత తరంగిణియందు నేకాదశతరంగము.

---

మత్కర్మకృ న్మామేవ పరమాం గతిం ప్రతిపద్యత ఇతి మత్పరమః అహం పరమః పరా గతి ర్యస్య సోఽయం మత్పరమః, తథా మద్భక్తో మామేవ సర్వప్రకారై స్సర్వాత్మనా సర్వోత్సాహేన భజత ఇతి మద్భక్తః, సంగవర్జితో ధనపుత్త్రమిత్రకళత్రబంధువర్గేషు సంగవర్జితః సంగః ప్రీతిః స్నేహ స్తద్వర్జితో, నిర్వైరో నిర్గతవైరః సర్వభూతేషు శత్రుభావరహిత ఆత్మనోఽత్యంతాపకారప్రవృత్తేష్వపి, య ఈదృశో మద్భక్త స్స మామేతి, అహమేవ తస్య పరా గతి ర్నాన్యా గతిః కాచి ద్భవతి; అయం తవోపదేశ ఇష్టో మయోపదిష్టో హే పాండవేతి. 55

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
విశ్వరూపదర్శనం నామైకాదశోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## ద్వాదశోధ్యాయః

అర్జున ఉవాచ:—

ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

టీ:– యే భక్తాః - ఏభక్తులు, ఏవం - పూర్వాధ్యాయాంతమున "మత్కర్మకృత్" అను గీతముచే నుపదేశింపఁబడిన విధమున, సతతయుక్తాః - నిత్యయుక్తులై త్వాం - నీయొక్క విశ్వరూపమును, పర్యుపాసతే - ధ్యానము చేయుచున్నారో, యేచ అపి - ఏ మఱికొందఱు భక్తులు, అవ్యక్తం - అవాఙ్మానసగోచరమగు, అక్షరం - సర్వోపాధి రహితమగు బ్రహ్మమును, పర్యుపాసతే - ఉపాసించుచున్నారో, తేషాం - ఆ రెండువిధములగు నుపాసకులలోను, కే - ఏ తరగతివారలు, యోగవిత్తమాః - అతిశయముగా యోగమును గుర్తెఱింగినవారలు? 1

తా:– రెండవయధ్యాయము మొదలు పదియవ యధ్యాయాంతమువఱకు, గల శాస్త్రముచే సర్వోపాధివిశేషశూన్య మగునట్టి యక్షరబ్రహ్మోపాసనమును, జ్ఞానబల వీర్య తేజ ఐశ్వర్యవిశేషములతోఁ గూడి సత్త్వోపాధివిశిష్ట మగు నీశ్వరోపాసనముగూడ వర్ణింపఁబడినది. ప్రకృతమున నీశ్వరసంబంధమగు విశ్వరూపము

ద్వితీయప్రభృతిషు విభూత్యంతేష్వధ్యాయేషు పరమాత్మనో బ్రహ్మణోఽక్షరస్య విధ్వస్తసర్వోపాధివిశేషస్యోపాసన ముక్తం సర్వయోగైశ్వర్యసర్వజ్ఞానశక్తిమత్సత్త్వోపాధే రీశ్వరస్య తవ చోపాసనం తత్రతత్రోక్తమ్. విశ్వరూపాధ్యాయే తు ఐశ్వర మాద్యం సమస్తజగదాత్మరూపం విశ్వరూపం త్వదీయం దర్శిత ముపాసనార్థ మేవ త్వయా. తచ్చ దర్శయిత్వోక్తవా నసి "మత్కర్మకృత్" (గీ. 11-55) ఇత్యాది. అతోఽహ మనయో రుభయోః పక్షయో ర్విశిష్టతరబుభుత్సయా త్వాం పృచ్ఛామీ త్యర్జున ఉవాచ - ఏవమితి. ఏవ మిత్యతీతానంతరశ్లోకేనోక్త మర్థం పరామృశతి మత్కర్మకృ దిత్యాదినా. ఏవం సతతయుక్తా నైరంతర్యేణ

శ్రీభగవానువాచ—

> మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
> శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

---

నీయొక్కరూపముగాఁ బ్రదర్శింపఁబడినది. ఇట్లు ప్రదర్శింపఁబడి 'మత్కర్మకృత్' అను గీతముచే ననన్యభక్తి పరమపురుషార్థసాధనముగా నుపదేశింపఁబడినది. దానంజేసి నిన్నుపాసించువార లవ్యక్తాక్షరోపాసకులు, సగుణైశ్వరోపాసకు లని ద్వివిధములుగాఁ దెలియవచ్చుచున్నారు. ఈయుభయవిధములలో నెవ్వ రుత్తములను విశేషమును వివరింపవలయునని యర్జునుఁడు మఱల నీగీతముచేఁ బ్రశ్నింపుచున్నాఁడు. 1

టీ:—యే - ఏభక్తులు, నిత్యయుక్తాః - 'మత్కర్మకృత్' యను గీతమునందుఁ జెప్పఁబడిన క్రమమున సతతయుక్తులై, పరయా - ఉత్కృష్టమగు, శ్రద్ధయా - శ్రద్ధతో, మనః - మనస్సును, మయి - నాయొక్క విశ్వరూపమున, ఆవేశ్య-ఉంచి, మాం - అధీశ్వరుఁడనగు నన్ను, ఉపాసతే - ఉపాసించుచున్నారో, తే - వారు యుక్తతమాః - యుక్తతములని, మే - నాకు, మతాః - ఇష్టులు. 2

తా:—అక్షరోపాసకుల యతిశయమును వివరించుటకు బూర్వ మర్జునుని యొక్క దృష్టిపథమందుఁ బడని యితరోపాసకు లందఱికంటె నుత్తములుగఁ దలంపఁబడు నీశ్వరోపాసకులన విశ్వరూపోపాసకుల యతిశయము నీ గీతముచే భగవానులు వర్ణించి యున్నారు. ఇయ్యది పూర్వాధ్యాయాంతమునందు నుపదేశింపఁబడిన విశ్వరూపోపాసనతోఁ గల సంబంధమును విడువకుండఁ బ్రకరణము నుపక్ర

---

భగవత్కర్మాదౌ యథోక్తేఽర్థే సమాహితా స్సంతః ప్రవృత్తా ఇత్యర్థః యే భక్తా అనన్యశరణాస్సంత స్త్వాం యథాదర్శితం తం విశ్వరూపం పర్యుపాసతే ధ్యాయంతి యే చాన్యేఽపి త్యక్తసర్వైషణాః సంన్యస్తసర్వకర్మాణః యథావిశేషితం బ్రహ్మాక్షరం నిరస్తసర్వోపాధిత్వా దవ్యక్త మకరణగోచరమ్; యద్ధి లోకే కరణగోచరం తద్వ్యక్త ముచ్యతే, అంజే ర్ధాతో స్తత్కర్మకత్వాత్। ఇదం త్వక్షరం తద్విపరీతం శిష్టై శ్చోచ్యమానై ర్విశేషణై ర్విశిష్టం తద్యే చాపి పర్యుపాసతే తేషాముభయేషాం మధ్యే కే యోగవిత్తమాః? కేఽతిశయేన యోగవిదః ఇత్యర్థః. 1

యే త్వక్షరోపాసకాః సమ్యగ్దర్శినో నివృత్తైషణా స్తే తావ త్తిష్ఠన్తు తాన్ప్రతి యద్వక్తవ్యం తదుపరిష్టా ద్వక్ష్యామః యే త్వితరే మయీతి. మయి విశ్వరూపే పరమేశ్వరే ఆవేశ్య సమాధాయ మనః, యే భక్తా స్సంతో, మాం సర్వ

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. 3

---

మించు నాశయముచేఁ బ్రారంభించినట్లు దెలియనగు. విశ్వరూపోపాసకులు యుక్త తము లనుటయందు నక్షరోపాసకులకంటె శ్రేష్ఠులనుట భగవానుల యాశయము గాదు. అక్షరోపాసక విషయము రాఁబోవు గీతములచే వివరింపఁ బడును. అర్జునుని దృష్టియందులేని యుపాసకుల విషయ మీ యధ్యాయమున, 9-10-11 గీతములచే వివరింపఁ బడుచున్నది. 2

టీ:—యే తు - ఏభక్తులు, సర్వత్ర - సర్వకాలములయందు, సమబుద్ధయః - శీతోష్ణాదిద్వంద్వములయందు సమభావమునుగలిగి, సర్వభూతహి తే - సమస్తభూతములయొక్క హితమందు, రతాః - ఆసక్తిగలవారలై, ఇంద్రియగ్రామం - జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సమూహమును, సన్నియమ్య - లెస్సగా నిగ్రహించి, అనిర్దేశ్యం - అనిర్వచనీయమును, అవ్యక్తం - అప్రమేయమును, అచింత్యం - దుహూహమును, అచలమ్ - చలనరహితమును, కూటస్థం - నిర్వికారమును, ధ్రువం - స్థిరమును, సర్వత్రగం - సర్వవ్యాపకమును, అగు, అక్షరం - పరబ్రహ్మమును, పర్యుపాస తే - పూర్ణముగా నుపాసింతురో, తే - అట్టి జ్ఞానులు, మామేవ - నన్నే, ప్రాప్నువంతి - పొందుదురు. అనగా మద్భావరూపమగు ముక్తిని బొందుదురని

---

యోగేశ్వరాణా మధీశ్వరం సర్వజ్ఞం విముక్తరాగాదిక్లేశతిమిరదృష్టిం నిత్యయుక్తా అతీతానంతరాధ్యాయాంతోక్తశ్లోకార్థన్యాయేన సతతయుక్తాః సంత ఉపాసతే శ్రద్ధయా పరయా ప్రకృష్టయోపేతాః తే మే మమ మతా అభిప్రేతా యుక్తతమా ఇతి నైరంతర్యేణ హి తే మచ్చిత్తతయా ఽహోరాత్ర మతివాహయంతి అతో యుక్తం తాన్ప్రతి యుక్తతమా ఇతి వక్తుమ్. 2

కి మితరే యుక్తతమా న భవంతి? న, కింతు తాన్ప్రతి యద్వక్తవ్యం తచ్ఛృణు - యేత్వితి. యే త్వక్షర మనిర్దేశ్యం అవ్యక్తత్వా దశబ్దగోచరమితి న నిర్దేష్టుం శక్యతేఽతోఽనిర్దేశ్యం, అవ్యక్తం న కేనాపి ప్రమాణేన వ్యజ్యతే ఇత్యవ్యక్తం పర్యుపాసతే పరి సమన్తా దుపాసతే ఉపాసనం నామ యథాశాస్త్ర ముపాస్యస్యార్థస్య విషయీకరణేన సామీప్య ముపగమ్య తైలధారావ త్సమానప్రత్యయప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసన మాచక్షతే అక్షరస్య విశేషణ మాహ - ఉపాస్యస్య సర్వత్రగం వ్యోమవ ద్వ్యాపి, అచింత్యం చావ్యక్తత్వా దచింత్యం, యద్ధి కరణగోచరం తన్మనసాపి చింత్యం తద్విపరీతత్వా దచింత్య మక్షరం, కూటస్థం దృశ్యమానగుణం, అంతర్దోషం వస్తు కూటమ్ కూటరూపం

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః.　　4

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే.　　5

---

తాత్పర్యము. ఇచట "యే త్వక్షరం" అనుచో నుండిన తుశబ్దముచేఁ దత్పూర్వగీతమం దుద్దేశింపఁబడిన నిత్యయుక్తుఁడు వేఱుచేయఁబడుచున్నాఁడు. 3-4

తా:- ఈ రెండుగీతములచే నక్షరోపాసనాస్వరూపమును దానియొక్క మహాఫలమును వివరింపఁబడినది. విశ్వరూపోపాసకులు యుక్తతములని చెప్పఁబడుటచేతను, నక్షరోపాసకులు నాయొక్క భావమునే పొందుదురని చెప్పఁబడుటచేతను, "ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (7-18) అను గీతమందు నిరూపింపఁబడిన యభిప్రాయమే యిచ్చట వివరింపఁబడుచున్నదని తెలియనగును. ఇచట యుక్తతమశబ్దము ఉదారశబ్దపర్యాయము. 3-4

టీ:- అవ్యక్తాసక్తచేతసాం - అవ్యక్తమగు బ్రహ్మమునందు లగ్నముచేయఁబడిన యంతఃకరణము గలిగినట్టి, తేషాం - ఆ జ్ఞానులగు భక్తులకు, క్లేశః -

---

కూటసాక్ష్య మిత్యాదౌ కూటశబ్దః ప్రసిద్ధో లోకే, తథా చావిద్యాద్యనేకసంసారబీజ మంతర్దోషవ న్మాయావ్యాకృతాదిశబ్దవాచ్యతయా "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" (శ్వే. 4-10) "మమ మాయా దురత్యయా" (గీ. 6-14) ఇత్యాదౌ ప్రసిద్ధం యత్త త్కూటం తస్మిన్ కూటే స్థితం కూటస్థం తదధ్యక్షతయా; అథవా రాశి రివస్థితం కూటస్థమ్ అత ఏవాఽచలమ్ యస్మా దచలం తస్మాత్ ధ్రువం నిత్య మిత్యర్థః. 3

సన్నియమ్యేతి. సంనియమ్య సమ్యక్ నియమ్య ఉపసంహృత్య, ఇంద్రియగ్రామ మింద్రియసముదాయం సర్వత్ర సర్వస్మిన్ కాలే, సమబుద్ధయః సమా తుల్యా బుద్ధి ర్యేషా మిష్టానిష్టప్రాప్తౌ తె సమబుద్ధయః తే యే ఏవంవిధా స్తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః, న తు తేషాం వక్తవ్యం కించి న్మాం తే ప్రాప్నువంతీతి "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" (గీ. 7-18) ఇతి హ్యుక్తమ్; న హి భగవత్స్వరూపాణాం సతాం యుక్తతమత్వ మయుక్తతమత్వం వా వాచ్యమ్. 4

కింతు - క్లేశేతి. క్లేశోఽధికతరో యద్యపి మత్కర్మాదిపరాణాం క్లేశోఽధిక ఏవ క్లేశోఽధికతర స్త్వక్షరాత్మనాం పరమాత్మదర్శినాం దేహాభిమానపరిత్యాగనిమిత్తః, అవ్యక్తాసక్తచేతసా మవ్యక్తే ఆసక్తం చేతో యేషాం

యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. 6

---

కష్టము, అధికతరః - "మత్కర్మకృత్" అను గీతమందుఁ జెప్పఁబడినరీతిగా నుపాసన జేయువారల క్లేశముకంటె నెక్కుడైనది. ఏలనన, దేహవద్భిః - దేహమం దభిమానము గలవారలచే, అవ్యక్తా - అవాఙ్మానసగోచరమగు, గతిః - అక్షరాత్మకమగు స్థితి, దుఃఖం - ఆయాసముచే, అవాప్యతే హి - పొందఁబడునుగదా! 5

తా:- దేహాభిమానగ్రస్తులకు దేహేంద్రియమనోబుద్ధులతో సమానమగు వ్యక్తస్వరూపమునందే బుద్ధి లగ్నమగును గాని దేహేంద్రియమనోబుద్ధులకంటె నతీతమైనట్టియు నవాఙ్మానసగోచరమైనట్టియు నవ్యక్తబ్రహ్మమందు బుద్ధి సంక్రమించుట కష్టసాధ్య మనియు నట్టివారలకు నవ్యక్తాక్షరోపాసనము కంటె వ్యక్తేశ్వరోపాసనమగు విశ్వరూపోపాసనమే శ్రేయఃప్రదమనియుఁ దాత్పర్యము. అవ్యక్తోపాసనమున నర్హత చాలనివారలలో నుత్తములకు విశ్వరూపోపాసనము యుక్తమను నాశయము మీఁద రాఁబోవు మూఁడుగీతములచే విశ్వరూపోపాసనము యొక్క యతిశయము ప్రదర్శింపఁబడుచున్నది. 5

టీ:- యే తు - ఎవ్వరైతే, సర్వాణి - సమస్తములగు, కర్మాణి - కర్మలను మయి - ఈశ్వరుఁడ నగు నాయందు, సంన్యస్య - సంన్యసించి, మత్పరాః - నేనే పరమావధి యని నిశ్చయము గలవారై, అనన్యేన యోగేన ఏవ - విశ్వరూపము నందు లగ్నము చేయఁబడిన నిష్ఠచే, మాం - నన్ను, ధ్యాయంతః - ధ్యానించుచు, ఉపాసతే - ఉపాసించుచున్నారో, తేషాం - అట్టి, మయ్యావేశితచేతసాం - విశ్వరూపుఁడనగు నాయందుఁ బ్రవేశపెట్టఁబడినయంతఃకరణము గలవారలకు, అహం - నేను, పార్థ! మృత్యుసంసారసాగరాత్ - మృత్యువుతో గూడిన సంసారమనెడి మహాసముద్రమునుండి, సముద్ధర్తా - ఉద్ధరించువాఁడను, న చిరాత్ - త్వరితము గనే, భవామి - అగుచున్నాను. 6-7

---

తే ఽ వ్యక్తాసక్తచేతస స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్, అవ్యక్తా హి యస్మాత్ యా గతి రక్షరాత్మికా దుఃఖం సా దేహవద్భి ర్దేహాభిమానవద్భి రవాప్యతే ఽతః క్లేశో ఽధికతరః, అక్షరోపాసకానాం యద్వర్తనం తదుపరిష్టా ద్వక్ష్యామః. 5

యే త్వితి. యే తు సర్వాణి కర్మాణి మయీశ్వరే సంన్యస్య మత్పరాః, అహం పరో యేషాం తే మత్పరా స్సంతో ఽనన్యేనై వావిద్యమాన మన్య దాలంబనం విశ్వరూపం దేవ మాత్మానం ముక్త్వా యస్య సో ఽనన్య స్తేనానన్యేనైవ; కేన? యోగేన సమాధినా మాం ధ్యాయంత శ్చింతయంత ఉపాసతే. 6

తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్. 7

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. 8

---

తా:- ఈరెండుగీతములచే "మయ్యావేశ్య మనో యే మాం" అను రెండవ గీతమునందు యుక్తతములుగాఁ జెప్పఁబడిన విశ్వరూపోపాసకులకుఁ గర్తవ్యాంశమును ఫలమును జెప్పఁబడుచున్నది. ఈ రెండుగీతములచే నక్షరోపాసకులకంటె భిన్నమగు విశ్వరూపోపాసకులఁగూర్చి ముచ్చటింపఁబడుచున్న దని చెప్పుటకు లింగములు "యేతు" అనుచో తు శబ్దము, "మయ్యావేశితచేతసామ్" "మయి సంన్యస్య" అను నదియును. 6-7

టీ:—(పార్థ !) మయిఏవ - విశ్వరూపుఁడనగు నాయందు, మనః - సంకల్ప వికల్పాత్మకమగు మనస్సును, ఆధత్స్వ - ఉంచుము, మయి - నాయందు, బుద్ధిం - నిశ్చయాత్మకమగు బుద్ధిని, నివేశయ - ఉంచుము. అతఃఊర్ధ్వం - ఈ శరీరపాతమునకుఁ బిమ్మట, మయి ఏవ - నాయందే, నివసిష్యసి - నివసింపఁగలవు. అనఁగా నిశ్చయముగ నా స్వరూపముచే నా యందు నివాసము చేయఁగలవు. న సంశయః - ఇందు సందియ మించుకేనియు లేదు. పై రెండు గీతములచే విశ్వరూపోపాసనమును తత్ఫలమును జెప్పి యీ గీతముచే నర్జునునకుఁ గర్తవ్యాంశముగ విశ్వరూపోపాసనమును విధించుచున్నారు. అయిదవ గీతమున "అవ్యక్తాహి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే" యని యవ్యక్తోపాసనము దేహాభిమానులకుఁ గష్టసాధ్యమని చెప్పి

---

తేషాం కిం? - తేషా మితి. తేషాం మదుపాసనైకపరాణా మహ మీశ్వరః సముద్ధర్తా, కుత ఇత్యాహ - మృత్యుసంసారసాగరాత్, మృత్యుయుక్తః సంసారో మృత్యుసంసారః, సఏవ సాగర ఇవ సాగరో దుస్తరత్వాత్ తస్మా న్మృత్యుసంసారసాగరా దహం తేషాం సముద్ధర్తా భవామి, న చిరాత్, కిం తర్హి? క్షిప్రమేవ హే పార్థ! మయ్యావేశితచేతసాం మయి విశ్వరూపే ఆవేశితం సమాహితం ప్రవేశితం చేతో యేషాం తే మయ్యావేశితచేతసః తేషామ్. 7

యత ఏవం, తస్మాత్ - మయ్యేవేతి. మయ్యేవ విశ్వరూపే ఈశ్వరే మనః సంకల్పవికల్పాత్మక మాధత్స్వ స్థాపయ మయ్యేవా ఽధ్యవసాయం కుర్వతీం బుద్ధి మాధత్స్వ నివేశయ; తత స్తే కిం స్యాదితి శృణు, నివసిష్యసి నివత్స్యసి నిశ్చయేన మదాత్మనా మయి నివాసం కరిష్య స్యేవా ఽతః శరీరపాతా దూర్ధ్వం; న సంశయః సంశయో ఽత్ర న కర్తవ్యః. 8

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. 9

అభ్యాసే ఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. 10

---

ప్రకృతమున "మయ్యేవ మన ఆధత్స్వ" యని యర్జునునకు విశ్వరూపోపాసనము విధించుటచే నాతనికి నతుర్గోపాసనమునం దధికారము లేదని భగవానులు నిశ్చయించినటుల సుస్పష్ట మగుచున్నది. 8

టీ:—ధనంజయ! అర్జునా! అథ - ఒకానొకవేళ, మయి - నాయందు, అనఁగా విశ్వరూపమునందు, చిత్తం - అంతఃకరణమును, స్థిరం - నిశ్చలముగ, సమాధాతుం - స్థాపించుటకు, నశక్నోషి - సమర్థుఁడవు కాకపోయినచో, తతః - ఆకారణమువలన, అభ్యాసయోగేన - ఆఱవయధ్యాయమున నుపదేశింపఁబడిన యభ్యాసయోగముచే, మాం - నా విశ్వరూపమును, ఆప్తుం - పొందుటకును, ఇచ్ఛ - ప్రార్థింపుము. 9

తా:—ఈ గీతముచే విశ్వరూపోపాసనమునం దధికారముఁ బడయనివానికి ననగా నధికారము చాలనివానికి, నట్టి యధికారప్రాప్తికి సాధనముగా నభ్యాసయోగము విధింపఁబడుచున్నది. 9

టీ- అభ్యాసే అపి - అభ్యాసయోగమందుఁగూడ, అసమర్థః - సామర్థ్యము లేనివాఁడవు, అసి - అగుచో, మత్కర్మపరమః - నాయొక్క ప్రీతికొఱకు గర్మల నాచరించుటయే ప్రధానముగాఁ గలవాఁడవై, భవ - అగుము, మదర్థం - నాకొఱకు, అనఁగా నీశ్వరప్రీతికొఱకు, కర్మాణి - కర్మలను, కుర్వన్ అపి - చేయుచున్నవాఁడవైనప్పటికిగూడ, సిద్ధిం - అభ్యాసయోగమునకుఁ దగు సత్త్వశుద్ధిని, అవాప్స్యసి - పొందఁగలవు. 10

---

అథేతి. అథైవం యథాఽవోచం తథా మయి చిత్తం సమాధాతుం స్థాపయితుం స్థిర మచలం న శక్నోషిచేత్ తతః పశ్చా దభ్యాసయోగేన చిత్త స్యైకస్మి న్నాలంబనే సర్వతః సమాహృత్య పునః పునః స్థాపన మభ్యాసః, తత్పూర్వకో యోగః సమాధానలక్షణ స్తేనాభ్యాసయోగేన మాం విశ్వరూప మిచ్ఛ ప్రార్థయస్వ ఆప్తుం ప్రాప్తుం హే ధనంజయ! 9

అభ్యాసేఽపీతి. అభ్యాసేఽప్యసమర్థోఽప్యశక్తోఽసి తర్హి మత్కర్మపరమో భవ మదర్థం కర్మ మత్కర్మ తత్పరమో మత్కర్మపరమః మత్కర్మప్రధాన

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

---

తా:—ఈ గీతముచే నభ్యాసయోగమునం దధికారము బడయనివానికిం దదధికారప్రాప్తికై నిష్కామకర్మయోగము సాధనముగా నుపదేశింపబడుచున్నది.

టీ:—అథ - ఒకానొకవేళ, ఏతత్ అపి - ఈ నాయొక్కకర్మపరత్వముగూడ, కర్తుం-చేయుటకు, అశక్తః - సామర్థ్యము లేనివాఁడవై, అసి - అయినచో, మద్యోగం - కర్మయోగమును, ఆశ్రితః - ఆశ్రయించినవాఁడవై, యతాత్మవాన్ - నియతచిత్తుడవై, తతః - అనంతరమున, సర్వకర్మఫలత్యాగం - సమస్తమగు కర్మలయొక్క ఫలసంన్యాసమును, కురు - చేయుము. 11

తా:—ఈ గీతముచే నిష్కామకర్మానుష్ఠానమునం దధికారముఁ బడయనివానికిఁ దదధికారప్రాప్తికై మున్ముందు కర్మానుష్ఠానమును, దదనంతరము సర్వకర్మఫలసంన్యాసమును, విధింపఁబడు చున్నవి.

ఇంతవఱకుఁగల గ్రంథసందర్భమువలన నుత్కృష్టపురుషార్థరూపంబును, బ్రహ్మభావాపత్తియునగు ముక్తికి సోపానప్రాయముగ నైదు సాధనము లుపదేశింపఁబడు చున్నవి. 1. కర్మానుష్ఠానము, తత్ఫలత్యాగము. 2. నిష్కామకర్మానుష్ఠానము, అనఁగా నీశ్వరార్పణబుద్ధితోఁ గర్మల నాచరించుట. 3. అభ్యాసయోగము. 4. విశ్వరూపోపాసనము, 5. అక్షరోపాసనము. ఈ యయిదింటిలో నర్జునునకు నక్షరోపాసనయం దధికారమించుకేనియు లేదనియు, నద్దానింగూర్చి యనఁగా నట్టి యధికారప్రాప్తికొఱకు మిగిలిన నాలుగింటిలో నెద్దాని నాశ్రయించుటకు దాను దగియున్నాఁడో యద్దాని దానే యోజించుకొనిన బాగుండునను నాశయముచే "అథ చిత్తం సమాధాతుం" అను గీతమాదిగాఁగల మూఁడు గీతములను భగవానులు పలికియున్నారు. అట్లు పలుకుటలో శ్రీకృష్ణభగవాను లర్జునుని తత్త్వమును గుర్తెఱుంగఁజాలక యిట్లు పలికెనా లేక సాభిప్రాయముగ బలికెనా యని యోజించునది. అర్జునుని కక్షరోపాసనమునం దధికారము లేదని గుర్తెఱిఁగిన

---

ఇత్యర్థః, అభ్యాసేన వినా మదర్థమపి కర్మాణి కేవలం కుర్వన్ సిద్ధిం సత్త్వశుద్ధియోగజ్ఞానప్రాప్తిద్వారేణావాప్స్యసి. 10

అథైతదితి. అథ పునరేతదపి యదుక్తం మత్కర్మపరమత్వం తత్కర్తుమశక్తోఽసి మద్యోగమాశ్రితో మయి క్రియమాణాని కర్మాణి సంన్యస్య యత్కరణం తేషామనుష్ఠానం స మద్యోగః త మాశ్రితస్సన్ సర్వకర్మఫలత్యాగం తతోఽనంతరం కురు యతాత్మవాన్ సంయతచిత్తస్సన్నిత్యర్థః. 11

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనంతరమ్. 12

---

భగవాను లిక దేనియం దధికారము గలదో గుర్తెఱుఁగకుందురా? గుర్తెఱింగియే యున్నారు. అయ్యది యుత్తరగీతముచే వ్యక్తీకరింపఁబడుచున్నది. కాని యిందొక విశేషము నుద్దేశించి యర్జునునికి నొకదాని వెనుక నొకటిగ నాల్గు సోపానముల విధించియున్నారు అదెద్దియన నర్జునుఁడు గృహస్థుఁడు. జయకాంక్ష మీఱి యుద్ధము చేయవచ్చినవాఁడు. భీష్మాదులవలనఁ జచ్చెదనను గొప్ప భయముచే నెద్దియో యొక తీరున పలాయనము గావింపఁ నెంచుచున్న యర్జునుఁ డెక్కడ! సర్వకర్మ సంన్యాసపూర్వకమగు బ్రహ్మజ్ఞాననిష్ఠను బడసిన పరమహంస పరివ్రాజకులకుఁ దగిన యక్షరోపాసన మెక్కడ! నిరుపయోగమును, నిష్ప్రయోజనమును. ఇఁక నంతఃకరణపరిపాకవశమున గృహస్థుఁడు తన యధికారమున కను వగు పై నాల్గు సోపానములలో నెద్దానినైన నాశ్రయింపవచ్చు నను నాశయము మీఱ, శ్రీకృష్ణు లర్జునునిముందు విచారించుకొనుటకై యక్షరోపాసనముకంటె భిన్నములగు నాల్గింటిని గ్రమక్రమముగాఁ బ్రదర్శించియున్నారు. అర్జునునియెడఁ దమ యాశయ మన్నదో యుత్తరగీతమందు నిగూఢముగ వ్యక్తీకరించియున్నారు. 11

టీ:—అభ్యాసాత్ - అవివేకపూర్వకమగు నభ్యాసయోగముకంటె, జ్ఞానం- జ్ఞానపూర్వకమగు నభ్యాసయోగము, శ్రేయఃహి- ప్రశస్యతరము. జ్ఞానాత్ -జ్ఞాన

---

ఇదానీం సర్వకర్మఫలత్యాగం స్తౌతి - శ్రేయఇతి. శ్రేయో హి ప్రశస్యతరం జ్ఞానం, కస్మాత్ అవివేకపూర్వకా దభ్యాసాత్; తస్మాదపి జ్ఞానాత్ జ్ఞానపూర్వకం ధ్యానం విశిష్యతే, జ్ఞానవతో ధ్యానాదపి కర్మఫలత్యాగో విశిష్యతే ఇత్యనుష జ్యతే; ఏవం కర్మఫలత్యాగా త్పూర్వవిశేషణవతః శాంతి రుపశమః సహేతుకస్య సంసార స్యానంతరమేవ స్యాత్, న తు కాలాంతర మపేక్షతే.

అజ్ఞస్య కర్మణి ప్రవృత్తస్య పూర్వోపదిష్టోపాయానుష్ఠానాశక్తౌ సర్వకర్మణాం ఫలత్యాగః శ్రేయస్సాధన ముపదిష్టం న ప్రథమమేవ; అతశ్చ శ్రేయో హి జ్ఞాన మభ్యాసా దిత్యుత్తరోత్తరవిశిష్టత్వోపదేశేన సర్వకర్మఫలత్యాగః స్తూయతే సంపన్నసాధనానుష్ఠానాశక్తౌ వనుష్ఠేయత్వేన శ్రుతత్వాత్ కేన సాధర్మ్యేణ స్తుతిత్వం "యదా సర్వే ప్రముచ్యన్తే" (కఠ. 6-14) ఇతి సర్వకామప్రహాణాదమృతత్వముక్తం తత్ప్రసిద్ధమ్ కామాశ్చ సర్వే శ్రౌతస్మార్తకర్మణాం ఫలాని తత్త్యాగే చ విదుషో ధ్యాననిష్ఠస్యానంతరైన శాంతి రితి సర్వకామత్యాగసామాన్య మజ్ఞకర్మఫలత్యాగ స్యాస్తీతి తత్సామాన్యా త్సర్వకర్మఫలత్యాగస్తుతి రియం ప్రరోచనార్థా యథాఽ

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ. 13

---

పూర్వకాభ్యాసముకంటె, ధ్యానం - జ్ఞానపూర్వకమగు ధ్యానము, విశిష్యతే - శ్రేష్ఠమగుచున్నది. ధ్యానాత్ - జ్ఞానవంతునియొక్క ధ్యానముకంటెను గూడ, కర్మఫలత్యాగః - సర్వకర్మలయొక్క ఫలమును ద్యజించుట, విశిష్యతే - శ్రేష్ఠమగుచున్నది. త్యాగాత్ - సర్వకర్మఫలత్యాగముకంటె, అనంతరం - తరువాత, శాంతిః - సంసారముయొక్కయు దత్కారణమగు నజ్ఞానముయొక్కయు నుపశమము గలుగును. 12

తా:— ఇచట త్యాగమువలన శాంతి లభించును. అందుచేఁ గర్మఫలత్యాగము శ్రేష్ఠమని యంత్యసోపానమగు కర్మఫలత్యాగము స్తుతింపఁబడుచున్నది. కర్మఫలత్యాగమును స్తుతించుటచేఁ బ్రకృతమున నర్జునుండు యుద్ధరూపమగు కర్మ లనుష్ఠించి పిమ్మట నౌదార్యముమీఁఁ దత్కర్మఫలమగు రాజ్యసుఖాదులను ద్యజించినచో నిరతిశయమగు శాంతిని బడయఁగలఁ డను నాశయముతో నీ గీతమున సర్వకర్మఫలత్యాగ మన్నిఁటికంటె నెక్కుడు సాధనమని చెప్పఁబడినది. ఇందలి గూఢాభిసంధి, అర్జునుఁడు దాఁ జెప్పినటుల రాజ్యసుఖాదులయందు నించుకేనియు నభిలాష లేనివాఁ డైనచో నీ యుద్ధమును గావించి జయము నంది, పిమ్మట రాజ్యసుఖాదుల విడుచుట యిహమందును బరమందును శ్రేయోదాయకమగును గాని యుద్ధము చేయకుండ బలాయనము గావించిన నిహపరశ్రేయములకు దూరుఁ డగునని. 12

టీ:—సర్వభూతానాం - సమస్త భూతములను, అద్వేష్టా - ద్వేషింపనివాఁడును, అనఁగా దనకు దుఃఖహేతు వైనను ద్వేషభావము నొందనివాఁడు,

---

గస్త్యేన బ్రాహ్మణేన సముద్రః పీత ఇతీదానీంతనా అపి బ్రాహ్మణాః బ్రాహ్మణత్వసామాన్యాత్ స్తూయంతే; ఏవం కర్మఫలత్యాగా త్కర్మయోగస్య శ్రేయస్సాధనత్వ మభిహితమ్. 12

తత్ర చాత్మేశ్వరభేద మాశ్రిత్య విశ్వరూపే ఈశ్వరే చేతస్సమాధానలక్షణో యోగ ఉక్తః, ఈశ్వరార్థం కర్మానుష్ఠానాది చ "అథైతద ప్యశక్తోఽసి" (గీ12-11) ఇత్యజ్ఞానకార్యసూచనా న్నాభేదదర్శినోఽక్షరోపాసకస్య కర్మయోగ ఉపపద్యత ఇతి దర్శయతి. తథా కర్మయోగినోఽక్షరోపాసనానుపపత్తిం దర్శయతి భగవాన్ "తే ప్రాప్నువంతి మామేవ" (గీ. 12-4) ఇత్యక్షరోపాసకానాం కైవల్యప్రాప్తౌ స్వాతంత్ర్య ముక్త్వా, ఇతరేషాం పారతంత్ర్యా దీశ్వరాధీనతాం దర్శితవాన్ "తేషామహం సముద్ధర్తా" (గీ. 12-7) ఇతి యది హీశ్వరస్యాఽఽత్మభూతా స్తే మతా అభేదదర్శిత్వా దక్షరరూపా ఏవ తే ఇతి సముద్ధరణకర్మవచనం తాన్ప్రత్యపేశలం స్యాత్, యస్మా చ్చార్జునస్యాత్యంత మేవ హితైషీ భగవాం స్తస్య సమ్యగ్దర్శనాన్వ

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః. 14

---

మైత్రః - సర్వభూతములయందును మిత్రభావముచే మెలగువాఁడును, కరుణః ఏవ చ - దుఃఖితులయందు దయార్ద్రహృదయుఁడును, అనఁగా సర్వభూతాభయ ప్రదుఁడగు సంన్యాసి యని యాశయము. నిర్మమః - మమకారరహితుఁడు, నిర హంకారః - అహంకారవర్జితుఁడును, సమదుఃఖసుఖః - సుఖదుఃఖములయందు రాగద్వేషములు లేనివాఁడును, క్షమీ - ద్వంద్వసహిష్ణువును, సతతం - ఎల్లప్పు డును, సంతుష్టః - దేహస్థితికి యోగ్యమగు నన్నపానాదులు లభించినను లభింపక పోయినను సంతసించువాఁడు, యోగీ - సమాహితచిత్తుఁడును, యతాత్మా - నిగ్ర హింపబడిన యంతఃకరణము గలవాఁడును, దృఢనిశ్చయః - అప్రకంప్యమగు తత్త్వనిశ్చయము గలవాఁడును, మయి - నాయందు, అర్పితమనోబుద్ధిః - సంకల్ప వికల్పాత్మకమగు మనసును నధ్యవసాయాత్మకమగు బుద్ధిని లగ్నముచేసినవాఁడును అగు, యః - ఏ, మద్భక్తః - నాభక్తుఁడగు సంన్యాసి, (అస్తి - కలఁడో,) సః . అట్టి జ్ఞాని, మే - నాకు, ప్రియః - ఇష్టుఁడు. 13-14

---

న్యితం కర్మయోగం భేదదృష్టిమంత మే వోపదిశతి, న చాత్మాన మీశ్వరం ప్రమాణతో బుద్ధ్వా కస్యచి ద్గుణభావం జిగమిషతి కశ్చిత, విరోధాత్, తస్మా దక్షరోపాసకానాం సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం త్యక్తసర్వైషణానాం "అద్వేష్టా సర్వభూతానా" మిత్యాదిధర్మపూగం సాక్షా దమృతత్వకారణం వక్ష్యా మీతి ప్రవర్తతే - అద్వేష్టేతి. అద్వేష్టా సర్వభూతానాం న ద్వేష్టాఽఽత్మనో దుఃఖహేతు మపి న కించిత్ ద్వేష్టి, సర్వాణి భూతా న్యాత్మత్వేన హి పశ్యతి, మైత్రో మిత్రభావో మైత్రీ మిత్రతయా వర్తత ఇతి మైత్రః, కరుణఏవచ కరుణా కృపా దుఃఖితేషు దయా తద్వాన్ కరుణః, సర్వభూతాభయప్రదః, సంన్యాసీత్యర్థః, నిర్మమో మమప్రత్యయవర్జితః నిరహంకారో నిర్గతాహంప్రత్యయః సమదుఃఖసుఖః సమే దుఃఖసుఖే ద్వేషరాగయో రప్రవర్తకే యస్య స సమ దుఃఖసుఖః క్షమీ క్షమావాన్, ఆకృష్టోఽభిహతో వా అవిక్రియ ఏవాస్తే. 13

సంతుష్టఇతి. సంతుష్టః సతతం నిత్యం దేహస్థితికారణస్య లాభేఽలాభే చోత్పన్నాలంప్రత్యయః. తథా గుణవల్లాభే విపర్యయే చ సంతుష్టః సతతం యోగీ సమాహితచిత్తః యతాత్మా సంయతస్వభావః దృఢనిశ్చయః, దృఢః స్థిరో నిశ్చ యోఽధ్యవసాయో యస్యాత్మతత్త్వవిషయే స దృఢనిశ్చయః మయ్యర్పితమనో బుద్ధిః సంకల్పవికల్పాత్మకం మనః, అధ్యవసాయలక్షణా బుద్ధిః, తే మయ్యేవార్పితే

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

---

జెప్పఁబడిన గీతములు. ఈ గీతాశాస్త్రమున స్థితప్రజ్ఞుఁడు, భక్తుఁడు, జ్ఞాని, గుణాతీతుఁడు, సంన్యాసి, పండితుఁడు, యుక్తుఁడు, బుద్ధిమంతుఁడు, కృత్స్నకర్మకృత్, అను నీ పదము లన్నియుఁ బర్యాయపదములుగా నుపదేశింపఁ బడినట్లు విశేష వివరణములచే సుస్పష్ట మగుచున్నది. 25

టీ:—యః - ఏ యతిగాని, కర్మిగాని, మాంచ - నన్నే, అవ్యభిచారేణ - చలనరహితమగు, భక్తియోగేన - భక్తియనెడి సాధనముచే, సేవతే - ఉపాసించునో, సః - అట్టి యతిగాని కర్మిగాని, గుణాన్, ఏతాన్ - ఈ గుణములను, సమతీత్య - లెస్సగా నతిక్రమించి, బ్రహ్మభూయాయ - బ్రహ్మభావమగు ముక్తికొఱకు, కల్పతే - సమర్థుఁ డగుచున్నాఁడు. 26

తా:—భక్తియోగముచే నీ గుణములు జయింపఁ బడునని భక్తియోగ ముత్తమసాధనముగా గుణాతీతున కుపదేశింపఁ బడుచున్నది. 26

---

పరాభిప్రాయేణ మిత్రారిపక్షయోరివ భవంతీతి తుల్యో మిత్రారిపక్షయోరిత్యాహ- సర్వారంభపరిత్యాగీ దృష్టాదృష్టార్థాని కర్మాణ్యారభ్యన్త ఇత్యారంభాః సర్వా నారంభాన్ పరిత్యక్తుం శీల మస్యేతి సర్వారంభపరిత్యాగీ, దేహధారణమాత్రనిమిత్తవ్యతిరేకేణ సర్వకర్మపరిత్యాగీత్యర్థః గుణాతీతస్స ఉచ్యతే ఉదాసీనవదిత్యాది 'గుణాతీత స్స ఉచ్యత' ఇత్యేతదంత ముక్తం యావ ద్యత్నసాధ్యం తావత్సంన్యాసినాఽనుష్ఠేయం గుణాతీతత్వసాధనం ముముక్షోః, స్థిరీభూతం తు స్వసంవేద్యం సత్ గుణాతీతస్య యతే ర్లక్షణం భవతీతి. 25

అథునా "కథంచ త్రీన్గుణా నతివర్తతే" (గీ. 14-21) ఇతి ప్రశ్నస్య ప్రతివచనమాహ - మామితి. మాం చేశ్వరం నారాయణం సర్వభూతహృదయాశ్రితం యో యతిః కర్మీ వాఽవ్యభిచారేణ న కదాచి ద్యో వ్యభిచరతి భక్తియోగేన భజనం భక్తిః సైవ యోగ స్తేన భక్తియోగేన సేవతే, స గుణాన్సమతీత్యైతాన్యథోక్తాన్ బ్రహ్మభూయాయ, భవనం భూయో బ్రహ్మభూయాయ బ్రహ్మభవనాయ మోక్షాయ కల్పతే సమర్థో భవతీత్యర్థః. 27

బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకా న్తికస్య చ. 27

ఇతి శ్రీ మహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ
విభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

---

టీ:—అవ్యయస్య - వికారరహితమును, అమృతస్యచ - నాశరహితము, శాశ్వతస్యచ - నిత్యమును, ధర్మస్య - ధర్మస్వరూపమును, సుఖస్య - ఆనందరూపమును, ఏకాన్తికస్యచ - వ్యభిచరింపనట్టియు, బ్రహ్మణః - పరమాత్మకు, అహం- ప్రత్యగాత్మ రూపమగు నేను, ప్రతిష్ఠా హి - ఆధారమునుగదా! అనగా, ప్రత్యగాత్మరూపమగు నాకును, పరమాత్మరూపమగు బ్రహ్మమునకు నించుకేనియు భేదములేదని పరమతాత్పర్యము. 27

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన
గీతామృత తరంగిణియందు చతుర్దశతరంగము.

---

కుత ఏత దిత్యుచ్యతే - బ్రహ్మణఇతి. బ్రహ్మణః పరమాత్మనో హి యస్మాత్ప్రతిష్ఠాఽహం, ప్రతితిష్ఠ త్యస్మిన్నితి. ప్రతిష్ఠాఽహం ప్రత్యగాత్మా కీదృశస్య బ్రహ్మణః? అమృతస్యావిఽనాశినో ఽ వ్యయస్యావికారిణః శాశ్వతస్యచ నిత్యస్య ధర్మస్య ధర్మజ్ఞానస్య జ్ఞానయోగధర్మప్రాప్యస్య సుఖస్యానందరూపస్యైకాంతిక స్యావ్యభిచారిణోఽమృతాదిస్వభావస్య పరమానందరూపస్య పరమాత్మనః ప్రత్యగాత్మా ప్రతిష్ఠా, సమ్యగ్జ్ఞానేన పరమాత్మతయా నిశ్చీయతే తదేతత్ "బ్రహ్మభూయాయ కల్పతే" (గీ. 14-26) ఇత్యుక్తమ్, యయా చేశ్వరశక్త్యా భక్తానుగ్రహాదిప్రయోజనాయ బ్రహ్మప్రతిష్ఠతే ప్రవర్తతే, సా శక్తిర్బ్రహ్మైవాహం శక్తి శక్తిమతో రనన్యత్వా దిత్యభిప్రాయః. అథవా బ్రహ్మశబ్దవాచ్యత్వాత్సవికల్పకం బ్రహ్మ, తస్య బ్రహ్మణో నిర్వికల్పకోఽహమేవ నాన్యః ప్రతిష్ఠా ఽఽశ్రయః కింవిశిష్టస్యామృత స్యామరణధర్మకస్య, అవ్యయస్య వ్యయరహితస్య కించ శాశ్వతస్యచ నిత్యస్య ధర్మస్య జ్ఞాననిష్ఠాలక్షణస్య సుఖస్య తజ్జనితస్యైకాంతికస్య ఏకాంతనియతస్యచ "ప్రతిష్ఠాహ" మితి వర్తతే. 27

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## పంచదశోధ్యాయః

శ్రీభగవా నువాచ—

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. 1

---

టీ:—సంసారమనెడి వృక్షమును, ఊర్ధ్వమూలం - అవ్యక్త మాయాశక్తితోఁ గూడిన బ్రహ్మ మూలముగాఁగలదనియు, అధఃశాఖం - మహత్తు, అహంకారము, తన్మాత్రలు, మొదలుగాఁగల కార్యవిశేషములు శాఖలుగాఁగలదనియు, అశ్వత్థం-ప్రతిక్షణమును నశించునదనియు, అవ్యయం - అనాదికాలమునుండి ప్రవర్తించుటచేఁ బ్రవాహమువలె నిత్యమనియు, ప్రాహుః - వేదవిదులు చెప్పుచున్నారు. యస్య - ఏసంసారవృక్షమునకు, ఛందాంసి - వేదములు, పర్ణాని - ఆకులవలె నలరారుచున్నవో, తం - అట్టి సంసారవృక్షమును, యః - ఎవఁడు, వేద - సమూలముగా దెలిసికొనుచున్నాఁడో, సః - అట్టివాఁడే, వేదవిత్ - వేదార్థకోవిదుఁడు. 1

తా:—పూర్వాధ్యాయమున బరమేశ్వరుని భక్తియోగముచే నుపాసించు కార్మికులకుఁ గర్మఫలమును, జ్ఞానులకు జ్ఞానఫలము, నీశ్వరుఁడనుగ్రహించుననియు

---

యస్మా న్మదధీనం కర్మిణాం కర్మఫలం జ్ఞానినాం చ జ్ఞానఫల మతో భక్తియోగేన మాం యే సేవంతే తే మత్ప్రసాదాత్ జ్ఞానప్రాప్తిక్రమేణ గుణాతీతా మోక్షం గచ్ఛన్తి కిము వక్తవ్య మాత్మన స్తత్త్వమేవ సమ్య గ్విజానంత ఇత్యతో భగవా నర్జునేన పృష్టోఽప్యాత్మన స్తత్త్వం వివక్షు రువాచ - ఊర్ధ్వమూల మిత్యాదినా. తత్ర తావ ద్వృక్షరూపక కల్పనయా వైరాగ్యహేతో స్సంసారస్య రూపం వర్ణయంతి, విరక్తస్య హి సంసారా ద్భగవత్తత్త్వజ్ఞానేఽధికారో, నాన్యస్యేతి - ఊర్ధ్వమూల మితి. ఊర్ధ్వమూలం కాలతః సూక్ష్మత్వా త్కారణత్వా న్నిత్యత్వా న్మహత్వా చ్చోర్ధ్వం, ఉచ్యతే బ్రహ్మావ్యక్తమాయాశక్తిమత్, త

నద్దానిచే వారలు క్రిమముగా గుణాతీతులై ముక్తిని జెందుదురనియుఁ జెప్పఁబడెను. అట్టివిషయమున బరమార్థతత్త్వమును గుర్తెఱింగిన వారలు ముక్తినిబడయుదురను విషయము వింతగాదనియు, నెట్టి పరమార్థతత్త్వమును గుర్తెఱింగినచో నిరతిశయమగు ముక్తిలభించునో యద్దాని నర్జునుని స్థితిని గుర్తెఱింగిన శ్రీకృష్ణ భగవానులర్జుననిచేఁ బ్రశ్నింపఁబడకయే యీ యధ్యాయము నుపక్రమించినారు. అందు మున్ముందు మొదటి మూఁడు గీతములచే సంసారస్వరూపము నొకరూపక విశేషముచే వైరాగ్యహేతువగునను నాశయమున వర్ణించియున్నారు. 1

న్మూల మస్యేతి సోఽయం సంసారమూల ఊర్ధ్వమూలః శ్రుతేశ్చ - "ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః" (కఠ 6-1) ఇతి.

పురాణే చ— "అవ్యక్తమూలప్రభవ స్తస్యైవానుగ్రహోచ్ఛ్రితః,
బుద్ధిస్కంధమయ శ్చైవ ఇంద్రియాంతర కోటరః. 1
మహాభూత విశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా,
ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః. 2
ఆజీవ్య స్సర్వభూతానాం మహావృక్ష స్సనాతనః,
ఏత ద్బ్రహ్మవనం చైవ బ్రహ్మాచరతి నిత్యశః. 3
ఏత చ్ఛిత్వా చ భిత్త్వా చ జ్ఞానేన పరమాసినా,
తత శ్చాత్మరతిం ప్రాప్య యస్మా న్నావర్తతే పునః." 4
(మ. భా. అశ్వ 47-12-15)

ఇత్యాది - త మూర్ధ్వమూలం సంసారం మాయామయం వృక్ష మధశ్శాఖం మహదహంకార తన్మాత్రాదయః శాఖా ఇవా స్యాధో భవంతీతి సోఽయ మధశ్శాఖ స్త మధశ్శాఖం, న శ్వోఽపి స్థాతా ఇత్యశ్వత్థ స్తం క్షణప్రధ్వంసిన మశ్వత్థం ప్రాహుః కథయంతి, అవ్యయం సంసారమాయాయా అనాదికాల ప్రవృత్తత్వాత్సోఽయం సంసారవృక్షోఽవ్యయో ఽనాద్యనంత దేహాదిసంతానాశ్రయో హి సుప్రసిద్ధః, త మవ్యయమ్ తస్యైవ సంసారవృక్ష స్యేద మన్య ద్విశేషణం ఛందాంసి యస్య పర్ణాని ఛందాంసి ఛాదనా దృగ్యజుస్సామలక్షణాని యస్య సంసారవృక్షస్య పర్ణానీవ పర్ణాని యథా వృక్షస్య పరిరక్షణార్థాని పర్ణాని, తథా వేదాః సంసారవృక్షపరిరక్షణార్థా ధర్మాధర్మతద్ధేతుఫలప్రదర్శనార్థత్వాత్ యథా వ్యాఖ్యాతం

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా,
గుణప్రవృద్ధా విషయప్రవాలాః
అధశ్చ మూలా న్యనుసంతతాని,
కర్మానుబంధీని మనుష్యలోకే. 2

---

టీ:—గుణప్రవృద్ధాః - సత్త్వరజస్తమోగుణములచే నభివృద్ధి నొందింపఁబడినట్టియు, విషయప్రవాళాః - శబ్దాదులగు విషయములు చిగుళ్లుగాఁ గలిగినట్టియు, తస్య - ఆ సంసారవృక్షముయొక్క, శాఖాః - కొమ్మలు, అధః - మనుష్యులు మొదలు స్థావరముల వఱకును, ఊర్ధ్వంచ - మనుష్యులు మొదలు బ్రహ్మవఱకును, ప్రసృతాః - వ్యాపించి యున్నవి. అధశ్చ - క్రిందను, మనుష్యలోకే - మానవలోకమునందు, కర్మానుబంధీని - ధర్మాధర్మ లక్షణమగు కర్మ కార్యముగాఁ గలిగినట్టి, అనఁగా ధర్మాధర్మలక్షణమగు కర్మ వేటివలనఁ గలుగుచున్నదో అట్టి మూలాని - ధర్మాధర్మప్రవృత్తికిఁ గారణభూతమగు రాగద్వేషాది వాసనలు, అనుసంతతాని - ప్రవేశించియున్నవి. 2

తా:—సంసారమునకుఁ గారణము విహితప్రతిషిద్ధ కర్మాచరణము. ఇయ్యది రాగద్వేషాది వాసనామూలకము. అట్టి రాగద్వేషాది వాసనలు, మనుష్యలోకమునందుఁ దెలియఁబడుటం జేసి మనుష్యులే కర్మాధికారులై వ్యవహరించుచున్నారని భావము. 2

---

సంసారవృక్షం సమూలం య స్తం వేద స వేదవిత్ వేదార్థవి దిత్యర్థః న హి సమూలా త్సంసారవృక్షా దస్మాత్ జ్ఞేయో౽న్యో౽ణుమాత్రో౽ ప్యవశిష్టో౽స్త్యతః సర్వజ్ఞః సర్వవేదార్థవి దితి సమూలసంసారవృక్షజ్ఞానం స్తౌతి. 1

తస్యైతస్య సంసారవృక్ష స్యాపరా౽వయవకల్ప నోచ్యతే - అధశ్చేతి. అధో మనుష్యాదిభ్యో యావత్ స్థావర మూర్ధ్వం చ యావ ద్బ్రహ్మణః విశ్వసృజో ధామ ఇత్యేతదంతం యథాకర్మ యథాశ్రుతం జ్ఞానకర్మఫలాని తస్య వృక్షస్య శాఖాఇవ శాఖాః ప్రసృతాః ప్రగతా గుణప్రవృద్ధాః గుణైస్సత్త్వరజస్తమోభిః ప్రవృద్ధా స్థూలీకృతా ఉపాదానభూతై ర్విషయప్రవాళా విషయా శ్శబ్దాదయః ప్రవాళా ఇవ దేహాదికర్మఫలేభ్యః శాఖాభ్యో౽ంకురీభవంతీవ తేన విషయప్రవాళాః శాఖాః సంసారవృక్షస్య పరమమూల ముపాదానం కారణం పూర్వముక్త మథేదానీం కర్మఫలజనితరాగద్వేషాదివాసనామూలానీవ ధర్మాధర్మప్రవృత్తికారణా న్యవాంతరభావీని తా న్యధశ్చ దేహాద్యపేక్షయా మూలా న్యనుసంతతా న్యనుప్రవిష్టాని కర్మానుబం

న రూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశ స్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మి న్గతా న నివ ర్తంతి భూయః,

---

టీః—అస్య- ఈ సంసారవృక్షమునకు, ఇహ- ఈలోకమందు, రూపం-స్వరూపము, తథా - ఏరూపముగా వర్ణింపఁబడెనో యారూపమున, న ఉపలభ్యతే - పొందఁబడ లేదు. అయ్యది స్వప్నమరీచ్యుదక మాయాగంధర్వ నగరములతో సమానమగు దృష్టనష్టస్వరూపములఁ గలిగియుండుటచే నద్దానికి, అంతః - అవధి, న - తెలియఁ బడదు, ఆదిః చ - మొదలును, న- తెలియబడదు, సంప్రతిష్ఠా చ - స్థితియును, న - తెలియఁబడదు. ఏనం - ఇట్టి, సువిరూఢమూలం - లెస్సఁగాఁ బాదుకొనియున్న మూలము కలిగిన, అశ్వత్థం - క్షణప్రధ్వంసియగు నీ సంసారవృక్షమును, దృఢేన తీవ్రమగు, అసంగశ స్త్రేణ-సర్వకర్మసంన్యాసమ నెడి ఖడ్గముచే, ఛిత్త్వా-కుంకటివేళు తోఁగూడ తెగనఱికి, తతః-పిమ్మట, యస్మిన్ -ఏస్థానమందు, గతాః-పొందినవారలు, భూయః - తిరిగి, న నివ ర్తంతి-సంసారమునకు మఱలరారో, తత్ పదం - ఆబ్రహ్మ పదమును, యతః - ఏపురుషునివలన, పురాణీ - చిరంతనమగు, ప్రవృత్తిః - మాయా శక్తి, ప్రసృతా - బయలువెడలినదో, తం - ఆ, ఆద్యం - మూలకారణమగు,

---

ధీని కర్మ ధర్మాధర్మలక్షణ మనుబంధః పశ్చాద్భావీ యేషాముద్భూతి మనూద్భవతీతి తాని కర్మానుబంధీని మనుష్యలోకే విశేషతోఽత్ర హి మనుష్యాణాం కర్మాధికారః ప్రసిద్ధః. 2

య స్త్వయం వర్ణిత స్సంసారవృక్షః- న రూప మితి, న రూప మస్యేహ యథోపవర్ణితం తథా నై వోపలభ్యతే, స్వప్నమరీచ్యుదక మాయాగంధర్వనగర సమత్వాత్, దృష్టనష్టస్వరూపో హి స ఇత్యత ఏవ నాంతో న పర్యంతో నిష్ఠా పరి సమాప్తిర్వా విద్యతే తథా న చాదిః, ఇత ఆరభ్యాయం ప్రవృత్త ఇతి న కేనచి ద్గమ్యతే న చ సంప్రతిష్ఠా స్థితి ర్మధ్య మస్య న కేనచి దుపలభ్యతే అశ్వత్థ మేనం యథోక్తం సువిరూఢమూలం, సుష్ఠు విరూఢాని విరోహం గతాని సుదృఢాని మూలా న్యస్యత మేనం సువిరూఢ మూలం అసంగశస్త్రేణ అసంగః పుత్రవిత్తలోకైషణా దిభ్యో వ్యుత్థానం తేనాసంగశస్త్రేణ దృఢేన పరమాత్మాభిముఖ్యనిశ్చయదృఢీ కృతేన పునః పున ర్వివేకాభ్యాసాశ్మనిశితేన ఛిత్త్వా సంసారవృక్షం సబీజ ముద్ధృత్య. 3

తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ. 4

నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వై ర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పద మవ్యయం తత్. 5

---

పురుషం ఏవ - పరమాత్మనే, (అహం - నేను) ప్రపద్యేచ - పొందెదనని, పరిమార్గితవ్యం - వెదకఁదగినది. 3-4

తా:—అనాదివాసనావశమున బలవత్తరముగాఁ బెరుగుచుండిన కర్తృత్వభోక్తృత్వ ప్రమాతృత్వాది రూపమగు సంసారమును దీవ్రమగు వైరాగ్యపురస్సరంబగు సర్వకర్మ సంన్యాసముచేఁ ద్యజించి బ్రహ్మజ్ఞానము బడయ బ్రహ్మజిజ్ఞాసను జేయవలయును. ఈ గీతముచే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యను సూత్రార్థ మనువాదము చేయఁబడుచున్నది. 3-4

టీ:—నిర్మానమోహాః - మానమోహములను విడచినట్టియు, జితసంగదోషాః - సంగదోష శూన్యులైనట్టియు, అధ్యాత్మనిత్యాః - ఎల్లప్పుడును బరమాత్మ ధ్యానతత్పరులును, వినివృత్తకామాః - నిష్కాములగు సంన్యాసులు, సుఖదుఃఖసంజ్ఞైః - సుఖదుఃఖముల నెడు, ద్వంద్వైః - ద్వంద్వములచే, విముక్తాః - విడువఁబడిన వారును, అమూఢాః - మోహవర్జితులును, అయి, తత్ - ఆ శ్రుతిస్మృతి

---

తత ఇతి. తతః పశ్చాత్ పదం వైష్ణవం తత్పరిమార్గితవ్యం పరిమార్గణ మన్వేషణం జ్ఞాతవ్య మిత్యర్థః - యస్మి న్పదే గతాః ప్రవిష్టా న నివర్తంతి నావర్తన్తే భూయః పున స్సంసారాయ కథం పరిమార్గితవ్య మిత్యాహ - త మేవ చ యః పదశబ్దేనోక్తః ఆద్య మాదౌ భవం పురుషం ప్రపద్యే ఇత్యేవం పరిమార్గితవ్యం తచ్ఛరణతయేత్యర్థః కోఽసౌ పురుష ఇత్యుచ్యతే యతో యస్మా త్పురుషా త్సంసారమాయావృక్షప్రవృత్తిః ప్రసృతా నిఃసృతా ఐంద్రజాలికా దివ మాయా, పురాణీ చిరంతనీ. 4

కథంభూతా స్తత్పదం గచ్ఛన్తీ త్యుచ్యతే - నిర్మానమోహా ఇతి. నిర్మానమోహా మానశ్చ మోహశ్చ మానమోహౌ తౌ నిర్గతౌ యేభ్య స్తే నిర్మానమోహా మానమోహవర్జితాః జితసంగదోషాః సంగ ఏవ దోషః సంగదోషో జితః సంగదోషో యై స్తే జితసంగ దోషాః, అధ్యాత్మనిత్యాః పరమాత్మస్వరూపాలోచన

న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః,
య ద్గత్వా న నివ ర్తంతే తద్ధామ పరమం మమ. 6
మమై వాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనఃషష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

---

ప్రసిద్ధమగు, అవ్యయం - వికారరహితమగు, పదం - బ్రహ్మపదమును, గచ్ఛంతి-పొందుచున్నారు. 5

తా:-ఈ గీతముచే బ్రహ్మపదమును బొందఁగోరువారల కుండవలసిన గుణసంపత్తి వర్ణింపఁ బడినది. 5

టీ:-తత్ - ఆస్థానమును, సూర్యః - సూర్యుఁడు, న భాసయతే - ప్రకాశింపఁ జేయనేరఁడు, శశాంకః - చంద్రుఁడును, న - ప్రకాశింపఁ జేయనేరఁడు, పావకః - అగ్నిహోత్రుఁడును, న - ప్రకాశింపఁ జేయనేరఁడు, యత్ - ఏ స్థానమును, గత్వా - పొంది, న నివర్తంతే - మఱలి సంసారమునకు రారో, తత్ - ఆ స్థానము, మమ - నా యొక్క, పరమం - ఉత్కృష్టమగు, ధామ - స్థానము. 6

టీ:-జీవలోకే - ప్రాణిలోకమందు, జీవభూతః - కర్త భోక్తయను ప్రసిద్ధ వ్యవహారము కలిగిన, సనాతనః - చిరంతనుఁడగు జీవుఁడు, మమ - నా యొక్క, అంశః ఏవ - ఏకదేశమే, అట్టి జీవుఁడు, ప్రకృతిస్థాని - స్వస్థానములగు కర్ణశష్కులి మొదలుగాఁ గల గోళములయందున్న, మనః షష్ఠాని - మనస్సుతోఁగూడ నాఱగు, ఇంద్రియాణి - శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను, కర్షతి- ఆకర్షించుచున్నాడు. 7

---

నిత్యా స్తత్పరాః, వినివృత్తకామాః విశేషతో నిర్లేపేన నివృత్తాః కామా యేషాం తే వినివృత్తకామా యతయః సంన్యాసినో ద్వంద్వైః ప్రియాప్రియాదిభి ర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః పరిత్యక్తా గచ్ఛన్తి అమూఢా మోహవర్జితాః పద మవ్యయం త ద్యథోక్తమ్. 5

త దేవ పదం పున ర్విశిష్యతే - న తదితి. తద్ధామేతి వ్యవహితేన ధామ్నా సంబధ్యతే తత్ ధామ తేజోరూపం పదం న భాసయతే సూర్య ఆదిత్యః సర్వావభాసనశక్తిమత్త్వేఽపి సతి, తథా న శశాంకః చంద్రో, న పావకో నాగ్ని రపి యద్ధామ వైష్ణవం పదం గత్వా ప్రాప్య న నివర్తన్తే యచ్చ సూర్యాది ర్న భాసయతే తద్ధామ పదం పరమం మమ విష్ణోః యద్గత్వా న నివర్తన్త ఇత్యుక్తమ్. 6

నను సర్వా హి గతి రాగత్యంతా "సంయోగా విప్రయోగాన్తాః" ఇతి హి ప్రసిద్ధమ్ కథ ముచ్యతే తద్ధామ గతానాం నాస్తి నివృత్తి రితి, శృణు తత్ర కార

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్. 8

---

టీ:—ఈశ్వరః - దేహాది సంఘాతములకుఁ బ్రభువగు నీశ్వరుఁడు, యత్ - ఎప్పుడు, శరీరం - శరీరమును, ఆప్నోతి - పొందుచున్నాఁడో, యత్ చ అపి - ఏకాలమందు, ఉత్క్రామతి - శరీరమునుండి బయలువెడలుచున్నాఁడో, తదా - అప్పుడు, ఆశయాత్ - పుష్పాదులనుండి, వాయుః - వాయువు, గంధాన్ ఇవ - వాసనలను వలెనే, ఏతాని - ఈ మనస్సుతోఁగూడిన యాఱింద్రియములను, గృహీత్వా - స్వీకరించి, సంయాతి - లెస్సగా వెళ్లుచుండును. 8

తా:—లోకములో జీవులనువారుపాధివిశేషముచే నాయొక్క యేకదేశమునందుఁ గల్పింపఁబడినవారై యనావృత్తికి నిలయమగు నాస్థానమును బొందువఱకు దేహమునుండి దేహాంతరమునకును, లోకమునుండి లోకాంతరమునకును, గమనాగమనములను జేయుచుందురు. అట్లు దేహమునుండి దేహాంతరములఁ బొందునపుడును, లోకమునుండి లోకాంతరములఁ బొందునపుడును మనస్సుతోఁగూడిన శ్రోత్రాదీంద్రియములను దేహమునుండి యాకర్షించి వానితోఁగూడియే గమనాగమనములఁ జేయుచుందురు. 8

---

ణమ్ - మమేతి. మమైవ పరమాత్మనో నారాయణస్య, అంశో భాగోఽవయవ ఏకదేశ ఇత్యనర్థాన్తరం జీవలోకే జీవానాం లోకే సంసారే జీవభూతః కర్తా భోక్తా ఇతి ప్రసిద్ధః సనాతన శ్చిరంతనః యథా జలసూర్యక స్సూర్యాంశో జలనిమిత్తాపాయే సూర్య మేవ గత్వా న నివర్తతే తేనైవాత్మనా సంగచ్ఛ త్యేవమేవ; యథా వా ఘటాద్యుపాధిపరిచ్ఛిన్నో ఘటాద్యాకాశ ఆకాశాంశస్సన్ ఘటాదినిమిత్తాపాయ ఆకాశం ప్రాప్య న నివర్తత ఇత్యేవమ్ అత ఉపపన్న ముక్తం "యద్గత్వా న నివర్తంతే" (గీ. 15-6) ఇతి నను నిరవయవస్య పరమాత్మనః కుతోఽవయవ ఏకదేశోఽంశ ఇతి సావయవత్వే చ వినాశప్రసంగోఽవయవవిభాగాత్, నైష దోషోఽవిద్యాకృతోపాధిపరిచ్ఛిన్న ఏకదేశోఽంశఇవ కల్పితో యతః దర్శితశ్చాయ మర్థః క్షేత్రాధ్యాయే విస్తరశః స చ జీవో మదంశత్వేన కల్పితః కథం సంసరత్యుత్క్రామతి చేత్యుచ్యతే - మనఃషష్ఠానీంద్రియాణి శ్రోత్రాదీని ప్రకృతిస్థాని స్వస్థానే కర్ణశష్కుల్యాదౌ ప్రకృతౌ స్థితాని కర్షత్యాకర్షతి. 7

కస్మిన్ కాలే - శరీరమితి. యచ్చాపి యదా చాప్యుత్క్రామతీశ్వరో దేహాదిసంఘాతస్వామీ జీవ స్తదాకర్షతీతి శ్లోకస్య ద్వితీయపాదోఽర్థవశాత్ప్రాథమ్యేన సంబధ్యతే యదా చాపి పూర్వస్మాచ్ఛరీరా చ్ఛరీరాంతర మవాప్నోతి తదా

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ,
అధిష్ఠాయ మన శ్చాఽయం విషయా నుపసేవతే. 9

ఉత్క్రామంతం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితమ్,
విమూఢా నాఽనుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. 10

---

టీ:—అయం - ఈ జీవుఁడు, శ్రోత్రం - శ్రవణేంద్రియమును, చక్షుః - చక్షు రింద్రియమును, స్పర్శనం చ - త్వగింద్రియమును, రసనం - రసనేంద్రియమును, ఘ్రాణం ఏవచ - ఘ్రాణేంద్రియమును, మనశ్చ - అంతఃకరణమును, అధిష్ఠాయ - దేహమునందుండి యధిష్ఠించినవాఁడై, విషయాన్ - శబ్దాదివిషయములను, ఉపసేవతే - అనుభవించుచుండును. 9

టీ:—ఈ గీతముచే మనస్సుతోఁగూడిన నాఱింద్రియములు వివరింపఁబడు చున్నవి. ఈ యింద్రియములు జీవునకు భోగసాధనములు. భోగమనఁగా శబ్దాది విషయములను గ్రహించుట. 9

టీ:—ఉత్క్రామంతం - పూర్వోపాత్తమగు దేహమునుండి వెడలుచున్నట్టియు, స్థితం వా ఽ పి - లేదా దేహమందున్నట్టియు, భుంజానం వా - శబ్దాదివిషయము లనుభవించునట్టియు, గుణాన్వితం - సుఖదుఃఖమోహాది గుణములతోఁ గూడుకొన్న ట్టియు, దేహిని, విమూఢాః - దృష్టాదృష్ట విషయభోగాభిలాషచే నాకర్షింపఁ బడిన యంతఃకరణముగల యవివేకులు, న అనుపశ్యంతి - తెలిసికొనఁజాలరు. జ్ఞాన చక్షుషః - శాస్త్రాచార్యోపదేశ ప్రమాణముచేఁ గల్గిన జ్ఞానదృష్టిగలవారు. పశ్యంతి - తెలిసికొనఁగలరు. 10

---

గృహీత్వైతాని మనష్షష్ఠా నీంద్రియాణి సంయాతి సమ్య గ్యాతి గచ్ఛతి కిమివే త్యాహ, వాయుః పవనో గంధా నివాశయా త్పుష్పా దేః. 8

కాని పున స్తానీతి - శ్రోత్రమితి. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ త్వగింద్రియం రసనం ఘ్రాణ మేవ చ మనశ్చ షష్ఠం ప్రత్యేక మింద్రియేణ సహాధిష్ఠాయ దేహస్థో విషయాన్ శబ్దాదీ నుపసేవతే. 9

ఏవం దేహగతం దేహాత్ ఉత్క్రామంత మితి ఉత్క్రామంతం దేహం పూర్వోపాత్తం పరిత్యజన్తం స్థితం వాఽపి దేహే తిష్ఠన్తం భుంజానం వా శబ్దాదీం శ్చోపలభమానం గుణాన్వితం సుఖదుఃఖమోహాద్యై ర్గుణై రన్వితమనుగతం సంయుక్త మిత్యర్థః ఏవంభూత మప్యేన మత్యంతదర్శనగోచరప్రాప్తం విమూఢా దృష్టాదృష్టవిషయభోగబలాకృష్టచేత సయా ఽనేకధా మూఢా నానుపశ్యంతి

యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్,
యతంతో౽ప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః. 11

య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతే౽ఖిలమ్,
య చ్చంద్రమసి య చ్చా౽గ్నౌ త త్తేజో విద్ధి మామకమ్. 12

---

తా:- దేహేంద్రియ మనోబుద్ధులకును దద్వ్యాపారములకును సాక్షిగా నల రాదు నాత్మ నాత్మానాత్మ వివేకజ్ఞానశూన్యు లెంతమాత్రము, దెలిసికొనఁజాలరని యభిప్రాయము. 10

టీ:- యతంతః - ప్రయత్నించునట్టి, యోగినః - సమాహితచిత్తులు, ఏనం - ఈ యాత్మను, ఆత్మని - స్వస్వరూపమునందే, అవస్థితం - ఉన్నదానినిగా, ననగా దానే పరమాత్మనని, పశ్యంతి - తెలిసికొనుచున్నారు. అకృతాత్మానః - శాస్త్రాచార్యోప దేశములచే సంస్కరింపఁబడి సమాధానమునొందని యంతఃకరణముగల వారలు, యతంతః అపి - పలువిధములగు ప్రయత్నములఁ జేసినప్పటికి, ఏనం - ఈ యాత్మను, అచేతనః - అవివేకము గలవారలై, న పశ్యంతి - తెలిసికొనఁ జాలరు. 11

టీ:- యత్ - ఏ, ఆదిత్యగతం - సూర్యునిఁ బొందియున్న, తేజః - తేజస్సు, అఖిలం - సమస్తమగు, జగత్ - ప్రపంచమును, భాసయతే - ప్రకాశింపఁ జేయుచున్నదో, చంద్రమసి - చంద్రునియందు, యత్ - ఏ తేజస్సు, (చూడఁబడుచున్నదో) అగ్నౌ - అగ్నిహోత్రమునందు, యత్ చ - ఏ తేజస్సు (చూడఁబడు

---

అహో! కష్టం వర్తత ఇత్యనుక్రోశతిచ భగవాన్ యే తు పునః ప్రమాణజనిత జ్ఞానచక్షుష స్త ఏనం పశ్య న్తి జ్ఞానచక్షుషో వివి క్తదృష్టయ ఇత్యర్థః. 10

యతంత ఇతి. యతంతః ప్రయత్నం కుర్వంతో యోగినశ్చ సమాహిత చిత్తా ఏనం ప్రకృత మాత్మానం పశ్య న్తి అయ మహ మస్మీ త్యుపలభ న్తే ఆత్మని స్వస్యాం బుద్ధా వవస్థితమ్ యతంతో౽పి శాస్త్రాదిప్రమాణైః అకృతాత్మానో ౽సంస్కృతాత్మాన స్తపసేంద్రియజయేన చ దుశ్చరితా దనుపరతా అశాంత దర్పాః ప్రయత్నం కుర్వన్తో౽పి నైనం పశ్య న్త్యచేతసో౽వివేకినః. 11

యత్పదం సర్వస్యావభాసక మప్యగ్న్యాదిత్యాదికం జ్యోతి ర్నావభాసయతే, యత్ప్రాప్తాశ్చ ముముక్షవః పున స్సంసారాభిముఖా న నివ ర్తన్తే యస్య చ పద స్యోపాధిభేద మను విధీయమానా జీవాః ఘటాకాశాదయఇ వాకాశస్యాంశా స్తస్య పదస్య సర్వాత్మత్వం సర్వవ్యవహారాస్పదత్వం చ వివక్షు శ్చతుర్భి శ్శ్లోకై ర్విభూతిసంక్షేప ముక్తవా భగవాన్ - య దాది త్యేతి. య దాదిత్యగత మాది

గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః. 13

చున్నదో) తత్ - అట్టి సకలవస్తు ప్రకాశ హేతుభూతమగు, తేజః - తేజస్సు, మామకం - నా సంబంధమైనదని, విద్ధి - తెలిసికొనుము. 12

తా:—ఆదిత్యాది సకలోపాధులయందును దెలియఁబడు తేజ మధిష్ఠానమగు నా యొక్క తేజమే. ఈ గీతము "రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః" (గీ. 7-8) అను గీతముయొక్క యనువాదము. 12

టీ:—అహం - నేను, ఓజసా - కామరాగవివర్జితమగు బలముచే, గాం - పృథివిని, ఆవిశ్య - ప్రవేశించి, భూతానిచ - సమస్త భూతములను, ధారయామి - ధరించియున్నాను. రసాత్మకః - సర్వరసముల కాకరమగు, సోమః - సోమరూపముగా, భూత్వా - అయి, సర్వాః - సమస్తమగు, ఓషధీఃచ - ఓషధులను, పుష్ణామి - పుష్టికలవిగను రసవంతములుగను జేయుచున్నాను. 13

త్యాశ్రయం, కింత త్తేజో దీప్తిః ప్రకాశో జగ ద్భాసయతే ప్రకాశయ త్యఖిలం సమస్తం, య చ్చంద్రమసి శశభృతి తేజోఽవభాసకం వర్తతే, యచ్చాగ్నౌ హుతవహే, త త్తేజో విద్ధి విజానీహి మామకం మదీయం మమ విష్ణో స్త జ్జ్యోతిః. అథవా ఆదిత్యగతం తేజ శ్చైతన్యాత్మకం జ్యోతిః, య చ్చంద్రమసి యచ్చాగ్నౌ వర్తతే తత్తేజో విద్ధి మామకం మదీయం మమ విష్ణో స్తజ్జ్యోతిః.

నను స్థావరేషు జంగమేషు చ త త్సమానం చైతన్యాత్మకం జ్యోతిః తత్ర కథ మిదం విశేషణం, యదాదిత్యగత మిత్యాది, నైష దోషః, సత్త్వాధిక్యా దవిస్తరత్వోపపత్తేః ఆదిత్యాదిషు హి సత్త్వ మత్యంతప్రకాశ మత్యంతభాస్వర మతస్తత్రై వాఽవిస్తరం జ్యోతి రితి తద్విశిష్యతే, న తు తత్రైవ తదధిక మితి యథా హి లోకే తుల్యేఽపి ముఖసంస్థానే న కాష్ఠకుడ్యాదౌ ముఖ మావిర్భవ త్యాదర్శాదౌ తు స్వచ్ఛే స్వచ్ఛతరే చ తారతమ్యేనావిర్భవతి తద్వత్. 12

కించ గా మితి - గాం పృథివీ మావిశ్య ప్రవిశ్య ధారయామి భూతాని జగ దహ మోజసా బలేన, యద్బలం కామరాగవివర్జిత మైశ్వరం రూపం జగద్విధారణాయ పృథివ్యా మావిష్టం యేన గుర్వీ పృథివీ నాఽధఃపతతి న విదీర్యతే చ తథా చ మంత్రవర్ణః "యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా" (తై. సం. 4-1-8) "స దాధార పృథివీమ్" (తై. సం. 4-1-8) ఇత్యాదిశ్చ అతో గా మావిశ్య చ భూతాని చరాచరాణి ధారయామీతి యుక్త ముక్తమ్. కించ పృథివ్యాం జాతా ఓషధీః సర్వా వ్రీహియవాద్యాః పుష్ణామి పుష్టిమతీః రసస్వాదుమతీశ్చ కరోమి సోమో భూత్వా రసాత్మకః సోమస్సన్ రసాత్మకో రసస్వభావః సర్వరసానా మాకరస్సోమః స హి సర్వా ఓషధీః స్వాత్మరసాను ప్రవేశేన పుష్ణాతి 13

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. 14

సర్వస్య చాఽహం హృది సంనివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ,

---

టీ:— అహం - నేను, ప్రాణినాం - సకల ప్రాణులయొక్క, దేహం - శరీరమును, ఆశ్రితః - ప్రవేశించి, వైశ్వానరః - వైశ్వానరుఁడను భావమును, భూత్వా - పొంది, ప్రాణాపాన సమాయుక్తః - ప్రాణాపాన వాయువులతో లెస్సగా గలసియున్నవాఁడనై, చతుర్విధం - భక్ష్యభోజ్యచోష్య లేహ్యములఁను నాల్గు విధములగు, అన్నం - భుజింపఁబడిన పదార్థమును, పచామి - లోహితాది రూపముగాఁ బరిణతి నొందించుచున్నాను.

తా:— ఈ గీతమునందు దేహశబ్ద మేకవచనాంత మైనను దజ్జాత్యాక్రాంతములగు సకలదేహములనుఁ బోధించును. సకల దేహములందును వైశ్వానరభావమును దాను బొందుచున్నానని చెప్పుటచే సకల దేహములకు నాధారభూతమగు పరమాత్మయే వైశ్వానరుఁడని తెలియవచ్చు చున్నది. ఈ వైశ్వానరుఁడు బ్రహ్మయే యని "వైశ్వానరః సాధారణశబ్ద విశేషాత్" (బ్ర. సూ. 1-2-24) అను సూత్రముచే వైశ్వానరాధికరణమందు నిరూపింపఁ బడియున్నది. 14

టీ:— అహం - నేను, సర్వస్యచ - సకలప్రాణి జాతముయొక్కయు, హృది-హృదయమందు, సంనివిష్టః - లెస్సగానున్నవాఁడను. మత్తః - నావలననే, స్మృతిః - పూర్వానుభవ సంస్కారమువలనఁబుట్టు జ్ఞానమును, జ్ఞానం - ప్రత్యక్షా

---

కించ - అహ మితి. అహ మేవ వైశ్వానర ఉదరస్థోఽగ్ని ర్భూత్వా "అయ మగ్ని ర్వైశ్వానరో యోఽయ మంతఃపురుషే యేనేద మన్నం పచ్యతే" ఇత్యాదిశ్రుతే ర్వైశ్వానరస్సన్ ప్రాణినాం ప్రాణవతాం దేహ మాశ్రితః ప్రవిష్టః ప్రాణాపానసమాయుక్తః ప్రాణాపానాభ్యాం సమాయుక్తః సంయుక్తః పచామి పక్తిం కరోమి, అన్న మశనం చతుర్విధం చతుష్ప్రకారం భోజ్యం భక్ష్యం చోష్యం లేహ్యం చ భోక్తా వైశ్వానరోఽగ్నిః, భోజ్య మన్నం సోమః తదేత దుభయ మగ్నీషోమౌ సర్వ మితి పశ్యతోఽన్నదోషలేపో న భవతి. 14

కించ - సర్వస్యేతి. సర్వస్య ప్రాణిజాత స్యాఽహ మాత్మాసన్ హృది బుద్ధౌ సన్నివిష్టః అతో మత్త ఆత్మన స్సర్వప్రాణినాం స్మృతి ర్జ్ఞానం తదపోహన మపగమనం చ యేషాం యథా పుణ్యకర్మణాం పుణ్యకర్మానురోధేన జ్ఞానస్మృతీ

వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృద్వేదవిదేవ చాహమ్.　　15

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.　　16

---

దులచేఁ బుట్టుజ్ఞానమును, అపోహనంచ - యుక్తాయుక్త వివేచనముచేఁగల్గు జ్ఞానమును, గల్గుచున్నవి. సర్వైః - సమస్తములగు, వేదైః చ - శ్రుతిస్మృతులచేతను, వేద్యః - తెలియఁదగిన విషయమంతయు, అహం ఏవ 'అహ' మనునదియే అనఁగా 'అహ'మను వర్ణముచేతను బదముచేతను వాచ్యుఁడగు నీశ్వరుడును, లక్ష్యమగు పరమాత్మయును దెలియఁదగినది. వేదాంతకృత్ - వేదాంతములయొక్క ప్రవర్తకుఁడును, వేదవిత్ చ - వేదవేదార్థ జ్ఞానసంపన్నుఁడును, అహం ఏవ - అహమను పదముచేతను, వర్ణముచేతను వాచ్యుఁడగు నీశ్వరుఁడును లక్ష్యమగు పరమాత్మయే.　　15

తా:—ఈ గీతము "అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః" (గీ.10-20) అను గీతముయొక్క యనువాదము.　　15

టీ:—లోకే - లోకమందు, అనఁగా సంసారమందు, క్షరః చ - క్షరుఁడనియు, అక్షరః ఏవచ - అక్షరుఁడనియు, ఇమౌ - ఈ, ద్వౌ - ఇద్దఱగు, పురుషౌ - పురుషులని, ప్రత్యేకముగా జాతిభేదముచే విభాగము సుప్రసిద్ధముగాఁ దెలియవచ్చుచున్నది. అందు, సర్వాణి భూతాని - సకలవికార జాతమును, క్షరః - క్షరమనియును, కూటస్థః - సమూహమందుఁ దెలియవచ్చెడి జీవుఁడు, అక్షరః - అక్షరుఁడనియు, ఉచ్యతే - చెప్పబడుచున్నాఁడు.　　16

---

భవతః, తథా పాపకర్మణాం పాపకర్మానురూపేణ స్మృతిజ్ఞానయో రపోహనం చాఽపాయన మపగమనం చ వేదైశ్చ సర్వై రహ మేవ పరమాత్మా వేద్యో వేదితవ్యః వేదాంతకృ ద్వేదాంతార్థసంప్రదాయకృ దిత్యర్థః వేదవి ద్వేదార్థవిదేవ చాఽహమ్.　　15

భగవత ఈశ్వరస్య నారాయణాఖ్యస్య విభూతిసంక్షేప ఉక్తో విశిష్టోపాధికృతో "య దాదిత్యగతం తేజః" (గీ. 15-12) ఇత్యాదినా అథాఽధునా తస్యైవ క్షరాక్షరోపాధిప్రవిభక్తతయా నిరుపాధికస్య కేవలస్య స్వరూపనిర్ధిధారయిషయా ఉత్తరే శ్లోకా ఆరభ్యన్తే తత్ర సర్వమే వాతీతానాగతాధ్యాయార్థజాతం త్రిధా రాశీకృత్యాహ - ద్వా విమా వితి. ద్వా విమౌ పృథగ్రాశీకృతౌ పురుషౌ వీత్యు

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః. 17

తా:—ఇచట క్షరశబ్దముచే నపరాప్రకృతియును క్షేత్రమును, దేహమునని పూర్వమందుఁ జెప్పఁబడిన వికారజాతము నిర్దేశింపఁబడుచున్నది. అక్షరశబ్దముచేఁ బరాప్రకృతియును, క్షేత్రజ్ఞుఁడును, దేహియునని పూర్వమందుఁ జెప్పఁబడిన చిదాభాస విశేషము చెప్పఁబడుచున్నది. 16

టీ:—యః - ఏ, శ్రుతిస్మృతి ప్రసిద్ధమగు, అవ్యయః - నిర్వికారమగు, ఈశ్వరః - పరమాత్మ, లోకత్రయం - భూర్భువస్సువర్లోకముల మూఁడిఁటిని, ఆవిశ్య - తన చైతన్యశక్తిచేఁ బ్రవేశించి, బిభర్తి - భరించుచున్నాఁడో, అన్యఃతు - అట్టివేఁడగు, అనఁగాఁ బూర్వోక్తమగు క్షరాక్షరములకంటె విలక్షణమగు, ఉత్తమః - ఉత్కృష్టుఁడగునట్టి, పురుషః - పురుషశబ్దోపలక్షితుఁడు, పరమాత్మా ఇతి - దేహేంద్రియ మనోబుద్ధులకంటె భిన్నస్వరూపమగు బరమాత్మయని, ఉదాహృతః - వేదాంతమునం దుపదేశింపఁ బడుచున్నాఁడు. 17

చ్యేతే లోకే సంసారే క్షరశ్చ క్షరతీతి క్షరః, వినాశీత్యేకో రాశిః, అపరః పురుషోఽక్షర స్తద్విపరీతో భగవతో మాయాశక్తిః, క్షరాఖ్యస్య పురుష స్యోత్పత్తి బీజ మనేకసంసారిజంతుకామకర్మాదిసంస్కారాశ్రయోఽక్షరః పురుష ఉచ్యతే, కౌ తౌ పురుషౌ విత్యాహ స్వయమేవ భగవాన్ - క్షరః సర్వాణి భూతాని సమస్తం వికారజాత మిత్యర్థః, కూటస్థః కూటో రాశీ రాశి రివ స్థితః అథవా కూటో మాయా వంచనా జిహ్మతా కుటిలతేతిపర్యాయాః అనేకమాయావంచనాదిప్రకారేణ స్థితః కూటస్థః సంసారబీజానంత్యా న్న క్షరతీ త్యక్షరఉచ్యతే. 16

ఆభ్యాం క్షరాక్షరాభ్యాం విలక్షణః క్షరాక్షరోపాధిద్వయదోషేణాఽస్పృష్టో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావః - ఉత్తమ ఇతి. ఉత్తమ ఉత్కృష్టతమః పురుష స్త్వన్యోఽత్యంతవిలక్షణ ఆభ్యాం పరమాత్మేతి పరమ శ్చాసౌ దేహాద్యవిద్యాకృతాత్మభ్యః ఆత్మా చ సర్వభూతానాం ప్రత్యక్చేతన ఇత్యతః పరమాత్మే త్యుదాహృత ఉక్తో వేదాంతేషు స ఏవ విశేష్యతే, యో లోకత్రయం భూర్భువస్వరాఖ్యం స్వకీయయా చైతన్యబలశక్త్యాఽఽవిశ్య ప్రవిశ్య బిభర్తి స్వరూపసద్భావమాత్రేణ బిభర్తి ధారయతి అవ్యయో నాస్య వ్యయో విద్యత ఇత్యవ్యయ ఈశ్వరః సర్వజ్ఞో నారాయణాఖ్య ఈశనశీలః. 17

యస్మాత్ క్షర మతీతో౽హ మక్షరాదపి చోత్తమః,
అతో౽స్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. 18

యో మామేవ మసంమూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత! 19

---

టీ:- యస్మాత్ - ఏ కారణముచే, అహం - అహమను వర్ణమునకును పదమునకును వాచ్యుఁడగు నీశ్వరుఁడును, లక్ష్యమగు పరమాత్మయు నగు నేను, క్షరం - క్షరరూపమగు వికారజాతమును, అతీతః - దాఁటినవాఁడను, అనఁగా క్షరముకంటె విలక్షణుఁడను, అక్షరాత్ అపిచ - అక్షరమగు చిదాభాసగుణము కంటెఁ గూడ, ఉత్తమః - ఉత్కృష్టతముఁడను, అతః - ఆ కారణముచే, లోకే - లోకమందును, వేదేచ - శ్రుతిస్మృతులందును, పురుషోత్తమః - పురుషోత్తముఁడనని, ప్రథితః - ఖ్యాతిని వహించుచుంటిని. 18

తా:- భక్తజనులు నన్ను స్వీయగ్రంథములందుఁ బురుషోత్తమునిగా స్తుతించుచున్నారని భావము. ఇంతవఱకు బరమాత్మతత్త్వము సువిపులముగా ముచ్చటింపఁ బడినది. ఇట్టి పరమాత్మతత్త్వమును గుర్తెఱుంగుటవలనఁ గల్గు ప్రయోజన ముపసంహార గీతములచేఁ జెప్పఁబడుచున్నది. 18

టీ:- యః - ఎవఁడు, అసంమూఢః - సంమోహము లేనివాఁడై, పురుషోత్తమం - పురుషోత్తముఁడను, మాం - ఈశ్వరుఁడనగు నన్ను, ఏవం - పూర్వోక్తవిధమున, జానాతి - తెలిసికొనుచున్నాఁడో, సః - అట్టివాఁడు, సర్వవిత్ - సర్వజ్ఞుఁడై, మాం - సర్వభూతములయందున్న నన్ను, సర్వభావేన - సార్వాత్మ్యభావముచే,

---

యథావ్యాఖ్యాతస్యేశ్వరస్య పురుషోత్తమ ఇత్యేత న్నామ ప్రసిద్ధమ్, తస్య నామనిర్వచనప్రసిద్ధ్యా౽ర్థవత్త్వం నామ్నో దర్శయన్ నిరతిశయో౽హ మీశ్వర ఇత్యాత్మానం దర్శయతి భగవాన్ - యస్మాదితి. యస్మాత్ క్షర మతీతో౽హం సంసారమాయావృక్ష మశ్వత్థాఖ్య మతిక్రాన్తో౽హ మక్షరాదపి సంసారమాయావృక్షబీజభూతా దపి చోత్తమ ఉత్కృష్టతమః, ఊర్ధ్వతమో వా౽త స్తాభ్యాం క్షరాక్షరాభ్యా ముత్తమత్వా దస్మి లోకే వేదే చ ప్రథితః ప్రఖ్యాతః పురుషోత్తమ ఇత్యేవం మాం భక్తజనా విదుః కవయః కావ్యాదిషు చేదం నామ నిబధ్నంతి పురుషోత్తమ ఇత్యనేనాభిధానేనాభిగృణంతి. 18

అథేదానీం యథా నిరుక్త మాత్మానం యో వేద తస్యేదం ఫల ముచ్యతే - యో మా మితి. యో మా మీశ్వరం యథోక్తవిశేషేణ మేవం యథోక్తేన ప్రకారేణా

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ!
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత! 20

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే పురుషోత్తమయోగో నామ పంచదశోఽధ్యాయః.

---

భారత! అర్జునా! భజతి - సేవించును. ఇతి - ఈలాగుననని, అనఘ - పాపరహితుఁడ వగు నో యర్జునా! మయా - నాచేతను, ఇదం - ఈ, గుహ్యతమం - మిక్కిలి రహస్య మగు, శాస్త్రం - శాస్త్రతాత్పర్యరూపమగు నీయధ్యాయము, ఉక్తం - ఉపదేశింపఁ బడెను. భారత! - అర్జునా! ఏతత్ - ఈ శాస్త్రహృదయమును, బుద్ధ్వా - తెలిసి కొని, బుద్ధిమాన్ - బుద్ధిమంతుఁడును, కృతకృత్యః - కృతకృత్యుఁడును, స్యాత్ - అగుచున్నాఁడు. 19-20

---

ఽసంమూఢః సమ్మోహవర్జితః సన్ జానా త్యయ మహ మస్మీతి పురుషోత్తమం స సర్వవి త్సర్వాత్మనా సర్వం వేత్తీతి సర్వజ్ఞః సర్వభూతస్థం భజతి మాం సర్వభావేన సర్వాత్మతయా హేభారత!. 19

అస్మి న్నధ్యాయే భగవత్తత్త్వజ్ఞానం మోక్షఫల ముక్త్వాఽథేదానీం తత్ స్తౌతి ఇతీతి. ఇత్యేతత్ గుహ్యతమం గోప్యతమ మత్యంతరహస్య మిత్యేతత్ కిం తత్? శాస్త్రమ్ యద్యపి గీతాఖ్యం సమస్తం శాస్త్ర మిత్యుచ్యతే తథా ఽప్యయ మేవాధ్యాయ ఇహ శాస్త్ర మిత్యుచ్యతే స్తుత్యర్థం ప్రకరణాత్ సర్వో హి గీతాశాస్త్రార్థోఽస్మి న్నధ్యాయే సమాసేనోక్తః న కేవలం గీతాశాస్త్రార్థ ఏవ, కింతు సర్వశ్చ వేదార్థ ఇహ పరిసమాప్తః "య స్తం వేద స వేదవిత్" (గీ. 15-1) "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" (గీ. 15-15) ఇతి చోక్తమ్ ఇద ముక్తం కథితం మయా హే అనఘాఽపాప! ఏత చ్ఛాస్త్రం యథా దర్శితార్థం బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా ద్భవే న్నాన్యథా కృతకృత్య శ్చ భారత! కృతం కృత్యం కర్తవ్యం యేన స కృతకృత్యో విశిష్టజన్మప్రసూతేన బ్రాహ్మణేన యత్కర్తవ్యం త త్సర్వం భగవత్తత్త్వే విదితే కృతం భవే దిత్యర్థః న చాన్యథా కర్తవ్యం పరిసమాప్యతే కస్యచి దిత్యభిప్రాయః "సర్వం కర్మాఽఖిలం పార్థ! జ్ఞానే పరిసమా

తా:— ఈ యధ్యాయమంతయును "కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మ యః, స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్" (గీ.4-18) అను గీతము యొక్క వ్యాఖ్యానరూపమేయని యీ గీతముయొక్క రెండవచరణముచే సుకరముగాఁ దెలియుచున్నది.

ఇది శ్రీవిద్యాశంకరపదమావేశపవిత్రిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వాములవారిచే రచింపఁబడిన గీతామృతతరంగిణియందు పంచదశతరంగము.

---

వ్యతే" (గీ. 4-33) ఇతి చోక్తమ్ "ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః, ప్రాప్యైత త్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా" (మను. 12-13) ఇతి చ మానవం వచనమ్. యత ఏత త్పరమార్థతత్త్వం మత్తః శ్రుతవా నసి; అతః కృతార్థస్త్వం భారతేతి.　　20

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్య పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే పురుషోత్తమయోగో నామ పంచదశోఽధ్యాయః

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## షోడశోధ్యాయః

శ్రీభగవానువాచ—

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. 1

---

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమద్బ్రహ్మైవాఽహం నారాయణః పరః.

టీ:—అభయం - భయములేకుండుట, సత్త్వసంశుద్ధిః - అంతఃకరణమునందు బరవంచనాదికాలుష్యము లేకుండుట, జ్ఞానయోగవ్యవస్థితిః - శాస్త్రాచార్యోపదేశముచే నాత్మానాత్మవివేకజ్ఞానమును బడసి యింద్రియనిగ్రహపూర్వకముగా మనము నాత్మయందు లగ్నముచేసి తన్నిష్ఠకలవాఁడగుటయు, దానం - యుక్తాయుక్తవివేకముగా నన్నపానాదుల యథాశక్తి సంభాగము చేసి యిచ్చుట, దమఃచ - బాహ్యేంద్రియ నిగ్రహము, యజ్ఞఃచ - శ్రౌతరూపములగు నగ్నిహోత్రాదులు; స్మార్తరూపములగు దేవయజ్ఞాదులు, స్వాధ్యాయః - ఋగ్వేదా

---

దైవీ ఆసురీ రాక్షసీ చేతి ప్రాణినాం ప్రకృతయో నవమేఽధ్యాయే సూచితాః తాసాం విస్తరేణ ప్రదర్శనాయ 'అభయం సత్త్వసంశుద్ధిః' ఇత్యాదిరధ్యాయ ఆరభ్యతే, తత్ర సంసారమోక్షాయ దైవీ ప్రకృతిః, నిబంధాయాసురీ రాక్షసీ చేతి దైవ్యా ఆదానాయ ప్రదర్శనం క్రియతే; ఇతరయోః పరివర్జనాయ చ - అభయ మితి. అభయ మభీరుతా, సత్త్వసంశుద్ధిః సత్త్వస్యాఽంతఃకరణస్య సంశుద్ధిః సంవ్యవహారేషు పరవంచనమాయానృతాదిపరివర్జనం శుద్ధసత్త్వభావేన వ్యవహార ఇత్యర్థః జ్ఞానయోగవ్యవస్థితిః జ్ఞానం శాస్త్రత ఆచార్యత శ్చాత్మాది పదార్థానా మవగమోఽవగతానా మింద్రియాద్యుపసంహారే ణైకాగ్రతయా స్వాత్మసంవేద్యతాపాదనం యోగః, తయోః జ్ఞానయోగయో ర్వ్యవస్థితి ర్వ్యవస్థానం

అహింసా సత్య మక్రోధ స్త్యాగః శాన్తి రపైశునమ్,
దయా భూతే ష్వలోలు ప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. 2

తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాఽతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత! 3

---

దులఁ బారాయణము చేయుట, తపః - కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతముల నాచరించుట, ఆర్జవం - ఎల్లప్పుడును ఋజుభావమును గలిగియుండుట, అహింసా - ప్రాణి పీడనముఁ గావింపకుండుట, సత్యం - అప్రియానృత వర్జితమగు యథాభూతాను వచనము, అక్రోధః - ఇతరులచే బాధింపఁబడినను గోపగింపకుండుట, త్యాగః - సంన్యాసము, శాంతిః - అంతరిందిర్యియ నిగ్రహము - అపైశునమ్ - పరరంధ్రప్రకటీకరణ స్వభావము లేకుండుట, భూతేషు - దుఃఖించుచున్న భూతములయందు, దయా - కనికరము, అలోలుప్త్వం - విషయసన్నిధియందుఁ జాంచల్యరాహిత్యము, మార్దవం - మృదుత్వము, హ్రీః - లజ్జ, అచాపలమ్ - ప్రయోజనము లేనప్పుడు వాక్పాణిపాదాదులను తత్తద్వ్యాపారములయందుఁ బ్రసరింపఁ జేయకుండుట. 1-2

టీ:— తేజః - ప్రాగల్భ్యము, క్షమా - ఓర్పు, ధృతిః - విపత్తులందు మనఃస్థైర్యము, శౌచం - బాహ్యాభ్యన్తర శుచిత్వము, అద్రోహః - ఇతరులకు

---

తన్నిష్ఠతా ఏషా ప్రధానా దైవీ సాత్త్వికీ సంపత్ యత్ర చ యేషా మధికృతానాం యా ప్రకృతి స్సంభవతి సా త్త్వికీ సోచ్యతే దానం యథాశక్తి సంవిభాగోఽన్నాదీనాం, దమశ్చ బాహ్యాకరణానా ముపశమః, అంతఃకరణ స్యోపశమం శాంతిం వక్ష్యతి, యజ్ఞశ్చ శ్రౌతోఽగ్నిహోత్రాదిః స్మార్తశ్చ దేవయజ్ఞాదిః, స్వాధ్యాయ ఋగ్వేదాద్యధ్యయన మదృష్టార్థం తపో వక్ష్యమాణం శరీరాది, ఆర్జవం ఋజుత్వం సర్వదా. 1

కించ - అహింసేతి. అహింసాఽహింసనం ప్రాణినాం పీడావర్జనం, సత్య మప్రియానృతవర్జితం యథాభూతార్థవచనం, అక్రోధః పరై రాకృష్టస్యాభిహతస్య వా ప్రాప్తస్య క్రోధస్యోపశమనం, త్యాగః సంన్యాసః పూర్వం దానస్యోక్తత్వాత్, శాంతి రంతఃకరణ స్యోపశమః అపైశున మపిశునతా పరస్మై పరరంధ్రప్రకటీకరణం పైశునం తదభావోఽపైశునం దయా కృపా భూతేషు దుఃఖితేషు, అలోలుప్త్వ మింద్రియాణాం విషయసన్నిధా వవిక్రియా, మార్దవం మృదుతాఽక్రౌర్యం హ్రీ ర్లజ్జా, అచాపల మసతి ప్రయోజనే వాక్పాణిపాదాదీనా మవ్యాపారయితృత్వమ్. 2

కించ - తేజ ఇతి. తేజః ప్రాగల్భ్యం న త్వగ్గతా దీప్తిః క్షమాఽఽకృష్టస్య తాడితస్య వాఽంతర్విక్రియానుత్పత్తిః ఉత్పన్నాయాం విక్రియాయా ముపశమన

దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్య మేవచ,
అజ్ఞానం చాఽభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. 4

---

ద్రోహము చేయుటయందుఁ దలంపులేకుండుట, నాతిమానితా - స్వీయ గౌరవాదుల యందు నభిలాషలేకుండుట, అభయము మొదలు నాతిమానితవఱకుఁగల యిరువది యాఱుగుణములును, దైవీం - దేవతాసంబంధమగు సంపదం - సంపత్తునుగూర్చి, అభిజాతస్య - పుట్టినవానికి, భారత! - అర్జునా! భవన్తి - కలుగుచున్నవి. 3

తా:—ఏడవ యధ్యాయమునందు "మాయయాఽపహృతజ్ఞానాః ఆసురం భావ మాశ్రితాః" (గీ.7-15) అను గీతముచేతను, "రాక్షసీ మాసు రీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః" (గీ.9-12) యను గీతముచేతను, ప్రకృతులు దైవములని, ఆసురములని, రాక్షసములనియు మూఁడువిధములుగా నున్నట్లు సూచింపఁబడినది. ఈ మూఁడు ప్రకృతులును సవిస్తరముగాఁ జెప్పఁదలఁచి యర్జునునిచేఁ బ్రశ్నింపఁ బడకపోయినను బ్రకృతి విశేషకథనముచే నర్జునునకొకింత యభిమాన విశేషము గలిగి యుచితమగు ప్రవృత్తిని బడయునను నాశయముమీఱ నీ దైవాసురసంపద్వి భాగమును భగవాను లుపక్రమించిరి. 3

టీ:—పార్థ! ఆసురీం - అసురసంబంధమగు, సంపదం - సంపత్తునుగూర్చి, అభి జాతస్య - పుట్టినటువంటివానికి, దంభః - తనయందులేని యతిశయము నున్నట్లు నటించుచు ప్రగల్భములఁ గొట్టుట, దర్పః - ధనాదులచేఁగల్గు మత్తతయు, అతి

---

మక్రోధ ఇత్యవోచామ ఇత్థం క్షమాయా అక్రోధస్య చ విశేషః ధృతిః దేహేం ద్రియే ష్వవసాదం ప్రాప్తేషు తస్య ప్రతిషేధకోఽన్తఃకరణవృత్తివిశేషో యేనో త్తంభితాని కరణాని దేహశ్చ నావసీదన్తి, శౌచం ద్వివిధం మృజ్జలకృతం బాహ్య మాభ్యంతరం చ మనోబుద్ధ్యో ర్నైర్మల్యం మాయారాగాదికాలుష్యాభావః, ఏవం ద్వివిధం శౌచమ్ అద్రోహః పరజిఘాంసాఽభావోఽహింసనమ్ నాఽతిమానితా ఽత్యర్థం మానోఽతిమానః, స యస్య విద్యతే సోఽతిమానీ, తద్భావోఽతిమా నితా, తదభావో నాతిమానితాఽఽత్మనః పూజ్యతాతిశయభావనాఽభావ ఇత్యర్థః భవం త్యభయాదీ న్యేతదంతాని సంపద మభిజాతస్య కింవిశిష్టాం సంపదం? దైవీం దేవానాం యా సంపత్ తా మభిలక్ష్య జాతస్య దేవవిభూత్యర్హస్య భావికల్యాణ స్యేత్యర్థో హే భారత! 3

అథేదానీ మాసురీ సంప దుచ్యతే - దంభ ఇతి. దంభో ధర్మధ్వజిత్వం దర్పో ధనస్వజనాదినిమిత్త ఉత్సేకః అతిమానః, పూర్వోక్తః క్రోధశ్చ పారుష్య

దైవీ సంప ద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మా శుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!. 5

---

మానః చ - స్వీయగౌరవాదులయం దభినివేశము, క్రోధః - దురాగ్రహము, పారుష్యం ఏవచ - నైరస్యవచనములను బల్కుట, అజ్ఞానంచ - కర్తవ్యాకర్తవ్యముల యందు యుక్తాయుక్త వివేకము లేకుండుట, అను నీ యాఱుగుణములును గలుగు చున్నవి. 4

టీ:—దైవీ - దేవతాసంబంధమగు, సంపత్ - గుణవిశేషములు, విమోక్షాయ - మోక్షమునకు హేతువులుగను, ఆసురీ - అసురసంబంధమగు గుణవిశేషములు, నిబంధాయ - సంసారబంధమునకు హేతువులుగను, మతా - తలంపఁబడు చున్నది. పాండవ! దైవీం - దేవతాసంబంధమగు, సంపదం - సంపత్తునుగూర్చి, అభిజాతః - పుట్టినవాఁడవు, అసి - అగుచున్నావు, మా శుచః - దుఃఖింపవలదు. 5

తా:—ఈ దైవాసుర సంపత్తులవలనఁగల్గు ఫలములు మోక్షమనియు బంధమనియుఁ జెప్పఁబడినవి. అర్జునుని దైవీసంపత్తుతో నొప్పుచున్న వానిగాఁజెప్పి 'దుఃఖింపకుము' అని చెప్పుటలో దుఃఖమనునది దైవీసంపత్తునకు విరోధమనియు దానంజేసి యర్జునున కనుచితమనియుఁ బలుక నర్జునుండు తనయొక్క యతిశయమును బడయఁగోరి దుఃఖమునుండి విరమించి కర్తవ్యాంశమునందుఁ గడంగునని భగవదాశయము. 5

---

మేవచ పరుషవచనం యథా కాణం చక్షుష్మాన్, విరూపం రూపవాన్ హీనాభిజన ముత్తమాభిజన ఇత్యాది, అజ్ఞానం చావివేకజ్ఞానం కర్తవ్యాకర్తవ్యాది విషయ మిథ్యాప్రత్యయః, అభిజాతస్య పార్థ! కిమభిజాతస్యే త్యాహ - సంపద మాసురీ మసురాణాం సంప దాసురీ తా మభిజాతస్యేత్యర్థః. 4

అనయో స్సంపదోః కార్య ముచ్యతే - దైవీతి. దైవీ సంప ద్యా సా విమోక్షాయ సంసారబంధనాత్ నిబంధాయ నియతో బంధో నిబంధ స్తదర్థ మాసురీ సంపన్మతాఽభిప్రేతా తథా రాక్షసీ చ తత్రైవ ముక్తేఽర్జున స్యాంతర్గతం భావం 'కి మహ మాసురసంపద్యుక్తః కిం వా దైవసంపద్యుక్తః' ఇత్యేవ మాలోచనారూప మాలక్ష్యాహ భగవాన్- మా శుచః శోకం మాకార్షీః సంపదం దైవీ మభిజాతో ఽస్యభిలక్ష్యజాతోఽసి, భావికల్యాణ స్త్వ మసీ త్యర్థో హే పాండవ! 5

ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు. 6

---

టీ:—అస్మిన్ - ఈ, లోకే - సంసారమందు, దైవః - దేవతాసంబంధ మగునట్టియు, ఆసుర ఏవచ - అసురసంబంధ మగునట్టియు, అని, ద్వౌ - రెండువిధములగు, భూతసర్గౌ - మనుష్యులయొక్క సృష్టులు (స్తః - ఉన్నవి,), అందు, పార్థ! - అర్జునా! దైవః - దేవతాసంబంధమగు మనుష్యసృష్టిని గూర్చి, విస్తరశః - విపులముగాఁ బదునైదవ యధ్యాయమునందు, ప్రోక్తః - చెప్పఁబడినది. ఇఁక, మే - నావలన, ఆసురం - అసురసంపత్తుతోఁ గూడిన మనుజులయొక్క స్వభావమునుగూర్చి, శృణు - వినుము. 6

తా:—నాలవ యధ్యాయమున బ్రాహ్మణులు, క్షత్త్రియులు, వైశ్యులు, శూద్రులు, అను నాల్గువిధములగు మనుష్యులు సృజింపఁ బడెనని "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" (గీ.4-13) అను గీతముచే నుపదేశింపఁ బడినది. పిమ్మటను దొమ్మిదవ యధ్యాయమున "యేఽపి స్యుః పాపయోనయః, స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః" అను గీతముచే స్త్రీలు వైశ్యులు శూద్రులును బాపయోను లని చెప్పఁబడినది. పాపయోను లనఁగా జన్మాంతరములందుఁ బాపకర్మల నాచరించినవా రని యర్థము. ఏలనన బ్రాహ్మణస్త్రీలును క్షత్త్రియస్త్రీలును గూడ గీతమందుఁ జెప్పఁబడిన స్త్రీశబ్దవాచ్యు లగుచున్నారు. దానంజేసి స్త్రీసామాన్య మంతయును, బురుషులలో వైశ్య శూద్రులును బాపయోనులని శ్రీభగవానుల యాశయము. ఇఁక నీ యధ్యాయమం దన్నో అంతఃకరణ ధర్మమగు సత్త్వరజస్తమోగుణవిభాగముచేఁ గల్గు దైవాసురభేదమును వివరింపఁ దలంచుచున్నారు. పూర్వగీతములందు యోనిశబ్దగ్రహణముచే మాతాపితరుల దేహసంబంధముచేఁ గల్గు శుక్లశోణిత విభాగముచేఁ జాతుర్వర్ణ్యవిభాగము చేయఁబడినట్లు వివరింపఁ బడెను. ప్రకృతమున మానసికభేదములు వివరింపఁ బడుచున్నవి. దేహసంబంధ మప్రకృతము. ఏలననఁ జాతుర్వర్ణ్యమునందుఁ దెలియవచ్చెడి సకల జనులు దైవీసంప

---

ద్వావితి. ద్వౌ ద్విసంఖ్యాకౌ భూతసర్గౌ భూతానాం మనుష్యాణాం సర్గౌ సృష్టీ భూతసర్గౌ సృజ్యేతే ఇతి సర్గౌ భూతాన్యేవ సృజ్యమానాని దైవాసురసంపద్ద్వయయుక్తాని ద్వౌ భూతసర్గౌ విత్యుచ్యేతే "ద్వయా హ వై ప్రాజాపత్యా దేవా శ్చాసురాశ్చ" ఇతి శ్రుతేః లోకేఽస్మిన్ సంసార ఇత్యర్థః, సర్వేషాం ద్వైవిధ్యోపపత్తేః కౌ తౌ భూతసర్గౌ విత్యుచ్యేతే ప్రకృతావేవ దైవ ఆసుర ఏవచ ఉక్తయో రేవ పున రనువాదే ప్రయోజన మాహ. దైవో భూతసర్గః "అభయం

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః,
న శౌచం నాపి చాఽఽచారో న సత్యం తేషు విద్యతే. 7

---

త్తికిఁ జెందువారలు, ఆసురసంపత్తికిని సంబంధించిన వారలను ద్వైవిధ్యమాత్రముచేఁ బేర్కొనఁ బడుచుండుటవలన ఇచ్చట నుదాహరింపఁ బడిన భేదముచేఁ బ్రతి వర్ణమునందును దైవాసుర ద్వైవిధ్యమును గుర్తింప వచ్చును. 6

టీ:–ఆసురాః - అసురసంపత్తుతోఁగూడిన, జనాః - మనుజులు, ప్రవృత్తించ పురుషార్థసాధనమును బోధించువిధిశాస్త్రమునుగాని, నివృత్తించ - అనర్థహేతువులను బోధించు నిషేధశాస్త్రములనుగాని, న విదుః – గుర్తెఱుంగరు, తేషు - వారలయందు శౌచం - బాహ్యశౌచ హేతువులగు స్నానసంధ్యాదులుగాని, అంతశ్శౌచ హేతువులగు నహింసాదులుగాని, న విద్యతే – తెలియఁబడవు. ఆచారః అపిచ - శ్రుతిస్మృతి ప్రమాణవిదు లనుసరించు నడువడియుఁగూడ, న విద్యతే - తెలియఁబడదు. సత్యం - యథార్థకథనముకూడ, నవిద్యతే - తెలియఁబడదు. 7

తా:–బాహ్యాభ్యన్తరశౌచము లేనివారలు నాచారశూన్యులగు ననాచారపరులును, మాయావులు ననృతవాదులు నాసురసంపత్తికిఁ జెందిన వారలని తాత్పర్యము. 7

---

సత్త్వసంశుద్ధిః'' (గీ. 16-1) ఇత్యాదినా విస్తరశో విస్తరప్రకారైః ప్రోక్తః కథితః, న త్వాసురో విస్తరశః అత స్తత్పరివర్జనార్థ మాసురం పార్థ! మే మమ వచనా దుచ్యమానం విస్తరశః శృణ్వవధారయ! 6

ఆ అధ్యాయపరిసమాప్తే రాసురీ సంప త్ప్రాణివిశేషణత్వేన ప్రదర్శ్యతే ప్రత్యక్షీకరణేన చ శక్యతే తస్యాః పరివర్జనం కర్తు మితి- ప్రవృత్తి మితి. ప్రవృత్తించ ప్రవర్తనం యస్మి న్పురుషార్థసాధనే కర్తవ్యే ప్రవృత్తి స్తాం నివృత్తిం చైతద్విపరీతాం యస్మా దనర్థహేతో ర్నివర్తితవ్యం సా నివృత్తి స్తాం చ జనా ఆసురా న విదు ర్న జానంతి న కేవలం ప్రవృత్తినివృత్తీ ఏవ తే న విదుః, న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే అశౌచా అనాచారా మాయావినోఽనృతవాదినో హ్యసురాః, 7

అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. 8

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

---

టీ:- తే - వారు, జగత్ - ఈప్రపంచము, అసత్యం - తమవలెనే యసత్య మనియు, అప్రతిష్ఠం - ధర్మాధర్మ శూన్యమనియు, అనీశ్వరం - నిరీశ్వరమనియు, అపరస్పర సంభూతం - స్త్రీపురుషులయొక్క కామోద్రేకముచేఁ గల్గునదనియు, దానంజేసి, కామహైతుకం - కామమే కారణముగాఁగలదిగాని, అన్యత్ - మఱి యొక కారణము, కిం - ఏమున్నది? అనఁగా మఱియొకటి యేదియు గారణము కాదని కింశబ్దమున కాక్షేపార్థ మూహించునది. 8

టీ:- ఆసురసంపత్తితోఁగూడినవారు, ఏతాం - పూర్వగీతమునందుఁ జెప్ప బడిన, దృష్టిం - అభిప్రాయమును, అవష్టభ్య - ఆశ్రయించినవారై, నష్టాత్మానః- నశించిన స్వభావముగలవారై, అనఁగాఁ బరలోక భయాదులు లేనివారై, అల్ప బుద్ధయః - విషయములయందే ప్రీతిగలవారై, ఉగ్రకర్మాణః - హింసారూప మగు నుగ్రకర్మల నాచరించుచుండెడి వారలై, జగతః - జగత్తునకు, అహితాః - శత్రువులై, (జగతః - జగత్తుయొక్క) క్షయాయ - నాశనముకొఱకు, ప్రభవన్తి - సమర్థులగుచున్నారు. 9

తా:- ఈగీతమున "జగతః" అనునది క్షయాఽహితశబ్దములతోఁ గాకాక్షి న్యాయమున నన్వయించును. 9

---

కించ - అసత్య మితి. అసత్యం యథా వయ మనృతప్రాయా స్తథేదం జగ త్సర్వ మసత్య మప్రతిష్ఠం చ నాస్య ధర్మాధర్మౌ ప్రతిష్ఠాఽతోఽప్రతిష్ఠం చేతి త ఆసురా జనా జగ దాహు రనీశ్వరం న చ ధర్మాధర్మసవ్యపేక్షకోఽస్య శాసి తేశ్వరో విద్యత ఇత్యతోఽనీశ్వరం జగ దాహుః కిం చాఽపరస్పరసంభూతం కామ ప్రయుక్తయోః స్త్రీపురుషయో రన్యోన్యసంయోగా జ్జగ త్సర్వం సంభూతమ్, కి మన్య త్కామహైతుకం కామహేతుక మేవ కామహైతుకం కిమన్య జ్జగతః కారణమ్? న కించిదదృష్టం ధర్మాధర్మాది కారణాంతరం విద్యతే జగతః కామ ఏవ ప్రాణినాం కారణ మితి లోకాయతిక దృష్టి రియమ్. 8

ఏతా మితి. ఏతాం దృష్టి మవష్టభ్యాశ్రిత్య నష్టాత్మానో నష్టస్వభావా విభ్రష్ట పరలోకసాధనా అల్పబుద్ధయో విషయవిషయా ల్పైవ బుద్ధి ర్యేషాం

కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః. 10

చింతా మపరిమేయాం చ ప్రలయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. 11

---

టీ:-దుష్పూరం - పూరించుటకు నలవికాని, యనఁగా హద్దులేని, కామం - ఇచ్ఛావిశేషమును, ఆశ్రిత్య - పొంది, దంభమానమదాన్వితాః - దంభము, మానము, మదము అను దుర్గుణములతోఁ గూడినవారై, అసద్గ్రాహాన్ - అశుభము లవధిగాఁ గల్గిన కార్యములను, సాధనములను, మోహాత్ - అవివేకమువలన గృహీత్వా - స్వీకరించి, అశుచివ్రతాః - అపవిత్రములగు వ్రతముల నాశ్రయించి, ప్రవర్తన్తే - వ్యవహరించు చుందురు. 10

టీ:-కామోపభోగపరమాః - శబ్దాది విషయములగు స్రక్చందన వనితాది భోగములయందే యభినివేశము కలవారై, ఏతావత్ ఇతి - స్రక్చందనవనితాది భోగమే పరమావధియని, నిశ్చితాః - నిశ్చయించినవారలై, ఆశాపాశశతైః - పలువిధములగు నాశలను త్రాళ్లచేఁ గట్టఁబడినవారై, కామక్రోధపరాయణాః - కామక్రోధములనే సర్వవిధముల నాశ్రయించినవారై, అపరిమేయాం - మితిలేనట్టియు, ప్రలయాంతాం - మరణపర్యంతము విడువఁబడని, చింతాం - నిరంతరమగు తీవ్రేచ్ఛను, ఉపాశ్రితాః - లెస్సగా నాశ్రయించినవారై, కామభోగార్థం - స్రక్చం

---

తేఽల్పబుద్ధయః ప్రభవం త్యుద్భవం త్యుగ్రకర్మాణః క్రూరకర్మాణో హింసాత్మకాః క్షయాయ జగతః ప్రభవంతీతి సంబంధః జగతోఽహితా శ్శత్రవ ఇత్యర్థః, 9

తేచ కామ మితి కామ మిచ్ఛావిశేష మాశ్రిత్యావష్టభ్య దుష్పూర మశక్యపూరణం దంభమానమదాన్వితా దంభశ్చ మానశ్చ మదశ్చ దంభమానమదాస్తైరన్వితా దంభమానమదాన్వితా మోహాదవివేకతో గృహీత్వోపాదాయాసద్గ్రాహా నశుభనిశ్చయా న్ప్రవర్తన్తే లోకేఽశుచివ్రతా అశుచీని వ్రతాని యేషాం తేఽశుచివ్రతాః. 10

కించ - చింతా మితి. - చింతా మపరిమేయాం చ, న పరిమాతుం శక్యతే యస్యా శ్చింతాయా ఇయత్తా సాఽపరిమేయా తా మపరిమేయాం ప్రలయాంతాం మరణాంతా ముపాశ్రితా స్సదా చింతాపరా ఇత్యర్థః కామోపభోగపరమాః కామ్యంత ఇతి కామాః విషయాః శబ్దాదయ స్తదుపభోగపరమాః అయ మేవ పరమః పురుషార్థో యః కామోపభోగ ఇత్యేవం నిశ్చితాత్మానః ఏతావ దితి నిశ్చితాః. 11

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహ న్తే కామభోగార్థ మన్యాయేనాఽర్థసంచయాన్. 12

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యేమనోరథమ్,
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. 13

అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాఽపరా నపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ. 14

---

దనాది విషయభోగముల కొఱకే, అన్యాయేన - పరద్రవ్యాపహరణాది కుత్సిత ములగు మార్గములచే, అర్థసంచయాన్ - అర్థసమూహములను, ఈహ న్తే - కోరు చుందురు. 11-12

టీ:—ఇదం - ఈద్రవ్యము, అద్య - ఇప్పుడు, మయా - నాచే, లబ్ధం-పొందఁ బడినది. ఇదం - ఈ, మనోరథం - మనస్తుష్టిని, ప్రాప్స్యే - పొందఁగలను. ఇదం- ఈ విశేషము, అ స్తి - కలదు, ఇదం - ఈ, ధనం అపి - ధనముకూడ, పునః - తిరిగి, మే - నాకు, భవిష్యతి - కలుగఁగలదు. 13

టీ:—అసౌ - ఈ, శత్రుః - శత్రువు, మయా - నాచే, హతః - చంపఁబడి నాఁడు, అపరాన్ అపి - ఇతరశత్రువులనుగూడ, హనిష్యే - చంపఁగలను, అహం- నేను, ఈశ్వరః - సమర్థుఁడను, అహం - నేను, భోగీ - సర్వవిధములగు సుఖముల ననుభవించువాఁడను, అహం - నేను, సిద్ధః - పుత్త్రపౌత్త్ర నప్త్రాదులతో సంప న్నుఁడను, అహం - నేను, బలవాన్ - బలవంతుఁడను, సుఖీ - సుఖవంతుఁడను. 14

---

ఆశాపాశేతి- ఆశాపాశశతైః ఆశా ఏవ పాశా స్తచ్ఛతై రాశాపాశశతై ర్బద్ధా నియంత్రితా స్సంతః సర్వత ఆకృష్యమాణాః, కామక్రోధపరాయణాః కామక్రోధౌ పర మయనం పర ఆశ్రయో యేషాం తే కామక్రోధపరాయణాః. ఈహ న్తే చేష్ట న్తే కామభోగార్థం కామభోగప్రయోజనాయ న ధర్మార్థమ్ అర్థసం చయా నర్థప్రచయా నన్యాయేన పరస్వాపహరణాది నేత్యర్థః. 12

ఈదృశశ్చ తేషామభిప్రాయః, ఇద మితి. ఇదం ద్రవ్య మద్యేదానీం మయా లబ్ధం, ఇద మన్యత్ ప్రాప్స్యే మనోరథం మనస్తుష్టికరం, ఇదం చా స్తీద మపి మే భవిష్య త్యాగామిని సంవత్సరే పున ర్ధనం తేనాహం ధనీ విఖ్యాతో భవిష్యామీతి. 13

అసౌ మయేతి. అసౌ దేవద త్తనామా మయా హతో దుర్జయ శ్శత్రుః హనిష్యే చాపరా నన్యా న్వరాకా నపి కి మేతే కరిష్యంతి తపస్వినః, సర్వథాపి

ఆఢ్యోఽభిజనవా నస్మి కో ఽన్యోఽ స్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః. 15

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

---

టీః–(అహం - నేను) ఆఢ్యః - ధనవంతుఁడను, అభిజనవాన్ - శ్రోత్రియత్వాది గుణవిశిష్టుఁడను, అనఁగాఁ బూర్వమునుండియు మా కుటుంబము లవిచ్ఛిన్నముగా యజ్ఞాదికర్మలనుజేయు వారలను నహంకార విశిష్టులగుట, మయా - నాతో, సదృశః సాటియగు అన్యః - సమర్థుఁడగు నితరుఁడు, కః - ఎవ్వఁడు, అస్తి - కలఁడు? అనఁగా నాతోటి సాటియగువాఁడు మఱియొకఁడు లేఁడనిభావము. యక్ష్యే - యాగము చేయుచున్నాను, దాస్యామి - నటులు మున్నగువారి కిచ్చుచున్నాను, మోదిష్యే - ఆనందించుచున్నాను, ఇతి - అని, అజ్ఞాన విమోహితాః- అవివేకముచే, వ్యామోహమును జెందిన వారలును, అనేక చిత్త విభ్రాన్తాః - నానాప్రకారములగు చిత్త విక్షేపములచే భ్రాన్తిఁజెందినవారును, మోహజాల సమావృతాః - వ్యామోహమనెడి వలయందుఁ జిక్కిన వారలును, కామభోగేషు - విషయానుభవములయందు, ప్రసక్తాః - పుష్కలముగాఁ దగులువడి అశుచౌ - అపవిత్రమగు, నరకే - వైతరణీ రౌరవాదినరకములందు, పతంతి-పడుచున్నారు, 15-16

---

నాస్తి మత్తుల్యః, ఈశ్వరోఽహ మహం భోగీ సర్వప్రకారేణ చ సిద్ధోఽహం సంపన్నః పుత్రైః పౌత్రైర్నప్తృభిః న కేవలం మానుషోహం బలవా న్సుఖీ చాహమేవ అన్యే తు భూమిభారాయావతీర్ణాః. 14

ఆఢ్య ఇతి. ఆఢ్యో ధనేన అభిజనవాన్ సప్తపురుషం శ్రోత్రియత్వాది సంపన్నః, తేనాపి న మమ తుల్యోఽస్తి కశ్చిత్ కోఽన్యోఽస్తి సదృశ స్తుల్యో మయా కించ యక్ష్యే యాగేనా ప్యన్యా నభిభవిష్యామి, దాస్యామి నటాదిభ్యో, మోదిష్యే హర్షం చాతిశయం ప్రాప్స్యామీ త్యేవ మజ్ఞానవిమోహితా అజ్ఞానేన విమోహితా వివిధ మవివేకభావ మాపన్నాః. 15

అనేకేతి. అనేకచిత్తవిభ్రాంతా ఉక్తప్రకారై రనేకై శ్చిత్తై ర్వివిధం భ్రాంతా అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతా మోహోఽవివేకోఽజ్ఞానం తదేవ జాల మివావరణాత్మకత్వాత్, తేన సమావృతాః ప్రసక్తాః కామభోగేషు తత్రైవ నిషణ్ణా స్సన్త స్తేనోపచితకల్మషాః పతంతి నరకేఽశుచౌ వైతరణ్యాదౌ. 16

ఆత్మసంభావితా స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్. 17

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః. 18

---

టీ:—ఆత్మసంభావితాః - ఆత్మస్తుతిచేతనే గౌరవింపఁబడు చున్నవారును, స్తబ్ధాః - అవినీతులును, ధనమానమదాన్వితాః - ధనము హేతువుగాఁ గల్గిన మానమదములతోఁ గూడికొనిన వారలును, అయి, దంభేన - దంభముచే, అవిధిపూర్వకమ్ - శాస్త్రవిధుల నుల్లంఘించి, తే - వారు, నామయజ్ఞైః -నామమాత్రపు యజ్ఞములచే, యజన్తే - కర్మలఁ జేయుచున్నారు. 17

టీ:—అహంకారః - అహంకారమును, బలం -బలమును, దర్పం - గర్వమును, క్రోధం - క్రోధమును, సంశ్రితాః - పుష్కలముగ నాశ్రియించినవారై, ఆత్మపరదేహేషు - తమయొక్కయు నితరులయొక్కయు దేహములయం దుండెడి, మాం - అన్తర్యామియగు నన్నుగూర్చి, అభ్యసూయకాః - అసూయాగ్రస్తులై, ప్రద్విషన్తః - పుష్కలమగు ద్వేషభావమును వహించుచున్నారు. 18

---

ఆత్మేతి - ఆత్మసంభావితాః సర్వగుణవిశిష్టతయాఽఽత్మనైవ సంభావితా ఆత్మసంభావితా న సాధుభిః, స్తబ్ధా అప్రణతాత్మానః, ధనమానమదాన్వితాః, ధననిమిత్తో మానో మదశ్చ తాభ్యాం ధనమానమదాభ్యా మన్వితాః యజన్తే నామయజ్ఞైః నామమాత్రై ర్యజ్ఞైస్తే దంభేన ధర్మధ్వజితయాఽవిధిపూర్వకం విధివిహితాంగేతి కర్తవ్యతారహితమ్. 17

అహ మితి - అహంకార మహంకరణ మహంకారో విద్యమానై రవిద్యమానైశ్చ గుణై రాత్మ న్యధ్యారోపితై ర్విశిష్ట మాత్మాన మహ మితి మన్యతే. సోహంకారోఽవిద్యాఖ్యః కష్టతమః సర్వదోషాణాం మూలం సర్వానర్థప్రవృత్తీనాం చ తం తథా బలం పరాభిభవనిమిత్తం కామరాగాన్వితం, దర్పం దర్పో నామ యస్యోద్భవే ధర్మ మతిక్రామతి సోఽయ మంతఃకరణాశ్రయో దోషవిశేషః కామం స్త్ర్యాదివిషయం క్రోధ మనిష్ట విషయం, ఏతా నన్యాంశ్చ మహతో దోషాన్ సంశ్రితాః కించ తే మామీశ్వరమాత్మపరదేహేషు స్వదేహే పరదేహేషు చ తద్బుద్ధి కర్మసాక్షిభూతం మాం ప్రద్విషన్తో, మచ్ఛాసనాతివర్తిత్వం ప్రద్వేషన్తం కుర్వన్తోఽభ్యసూయకా స్సన్మార్గస్థానాం గుణే ష్వసహమానాః. 18

తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు. 19

ఆసురీం యోని మాపన్నా మూఢాః జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ! తతో యా న్త్యధమాం గతిమ్. 20

---

టీ:—ద్విషతః - ద్వేషభావము కలిగినట్టియు, క్రూరాన్ - దుర్మార్గులైనట్టియు, అశుభాన్ - అమంగళకృత్యములను సలుపునట్టియు, తాన్ - ఆ పూర్వమందుఁ జెప్పఁబడిన, నరాధమాన్ - మనుష్యాధములను, సంసారేషు - నరకసంసరణమార్గములగునట్టియు, ఆసురీషు - అసుర సంబంధములగునట్టియు, యోనిషు ఏవ - గర్భములందే, అజస్రం - ఎల్లప్పుడును, క్షిపామి - త్రోసివేయుచుందును. 19

తా:—ఇచట "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః" (గీ4-13) అను గీతమునందలి "సృష్టం" అను శబ్దముయొక్క యర్థవిశేషము "యోనిషు క్షిపామి" అను పదములచే వ్యక్తీకరింపఁబడుచున్నది. ఇట్టి యభిప్రాయమే "రమణీయ చరణాః రమణీయాం యోనిమాపద్యేరన్, బ్రాహ్మణయోనింవా క్షత్రియయోనింవా, కపూయ చరణాః కపూయాం యోని మాపద్యేరన్, శ్వయోనింవా సూకర యోనింవా, చాండాల యోనింవా" అనుశ్రుతిచే వ్యక్తీకరింపఁ బడుచున్నది. 19

టీ:—కౌంతేయ! - అర్జునా! ఆసురీం - అసురసంబంధమగు, యోనిం - గర్భమును, జన్మని జన్మని - ప్రతిజన్మమునందును, ఆపన్నాః - పొందునట్టి, మూఢాః అవివేకులు, మాం - ఈశ్వరుఁడనగు నన్ను, అప్రాప్య ఏవ - పొందకయే, తతః - దానంజేసి, సన్మార్గమునకు మితిలేని దూరమునందుండి, అధమాం - నికృష్టతమమగు, గతిం - స్థితిని, యాంతి - పొందుచున్నారు. 20

---

తా నహ మితి. తా నహం సర్వాన్ సన్మార్గప్రతిపక్షభూతాన్ సాధుద్వేషిణో ద్విషతశ్చ మాం క్రూరాన్ సంసారేష్వే వానేకనరకసంసరణమార్గేషు నరాధమా నధర్మదోషవత్త్వాత్ క్షిపామి ప్రక్షిపా మ్యజస్రం సంతత మశుభా నశుభకర్మకారిణ ఆసురీష్వేవ క్రూరకర్మప్రాయాసు వ్యాఘ్రసింహాదియోనిషు క్షిపామీత్యనేన సంబంధః. 19

ఆసురీ మితి. ఆసురీం యోని మాపన్నాః ప్రతిపన్నాః మూఢా అవివేకినః జన్మని జన్మని ప్రతిజన్మ తమోబహులాస్వేవ యోనిషు జాయమానా అధో గచ్ఛన్తో మూఢా మా మీశ్వర మప్రాప్యానాసాద్యైవ హే కౌంతేయ, తత స్తస్మా

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రియమ్ త్యజేత్. 21

---

తా:—ఇంతవఱకు నాసురసంపత్తివిశేషము, దద్వ్యక్తులగు నరాధముల కృత్యములును, దత్ఫలమును వివరింపఁబడినది. ఇఁక ముందు గీతములచే నాసుర సంపత్తికి మూలకారణమును దన్నివృత్త్యుపాయము నుపదేశింపఁబడుచున్నది. 20

టీ:—నరకస్య - నరకమును బొందుటకు, ద్వారం - మార్గము, ఇదం - ఈ చెప్పఁబోవు, త్రివిధం - మూఁడువిధములు. ఇదం - ఈ త్రివిధమగు ద్వారము, ఆత్మనః - ఆత్మకు, నాశనం - నాశనము నొనరించునది. అదెద్దియన, కామః - కామము, క్రోధః - క్రోధము, తథా - ఆ తీరుననే, లోభః - లోభమును, తస్మాత్ - ఆ హేతువువలన, (ప్రాజ్ఞుఁడు.) ఏత త్త్రియం - ఈ మూఁడిఁటిని, త్యజేత్ - పుష్కలముగా విడువవలయును. 21

తా:—ఈ గీతము "కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః, మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్" (గీ.3-37) అను గీతముయొక్క యను వాదమే. 21

---

దపి యా స్త్వధమాం నికృష్టతమాం గతిమ్ మా మప్రాప్యైవేతి న మత్ప్రాప్తౌ కాచి దప్యాశంకాఽస్తి అతో మచ్ఛిష్టసాధుమార్గ మప్రాప్యేత్యర్థః. 20

సర్వస్యా ఆసుర్యా స్సంపదః సంక్షేపోఽయ ముచ్యతే, యస్మిం స్త్రివిధే సర్వ ఆసురసంపద్భేదో ఽనంతోఽప్యంతర్భవతి, యత్పరిహారేణ పరిహృతశ్చ భవతి, య న్మూలం సర్వస్యానర్థస్య త దేత దుచ్యతే - త్రివిధ మితి. త్రివిధం త్రిప్రకారం నరకస్య ప్రాప్తావిదం ద్వారం నాశన మాత్మనః, య ద్వారం ప్రవిశన్నేవ నశ్య త్యాత్మా, కస్మైచి త్పురుషార్థాయ యోగ్యో న భవతీత్యేతత్, అత ఉచ్యతే ద్వారం నాశన మాత్మన ఇతి కిం తత ? కామః క్రోధ స్తథా లోభః తస్మా దేత త్త్రియం త్యజేత్. యత ఏత ద్వారం నాశన మాత్మన స్తస్మా త్కామాది త్రియ మేతత్ త్యజేత్. 21

ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. 22

య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. 23

---

టీ:—కౌంతేయ! ఏతైః - ఈ తమోద్వారైః - నరకమునకు ద్వారములగు-త్రిభిః - కామక్రోధలోభముల మూఁడిఁటిచేతను, విముక్తః - విడువఁబడిన, నరః, మనుజుఁడు, ఆత్మనః - తనకు, శ్రేయః - శ్రేయస్సును, ఆచరతి - ఆచరించును, తతః - అట్టి శ్రేయస్సాధనమగు సత్కర్మల నాచరించుటచే, పరాం - ఉత్కృష్టమగు, గతిం - స్థానమగు మోక్షమును గూడ, యాతి - పొందును. 22

టీ:— యః - ఎవఁడు, శాస్త్రవిధిం - కర్తవ్యాకర్తవ్య జ్ఞానకారణమగు విధి ప్రతిషేధశాస్త్రముయొక్క శాసనమును, అనఁగా శ్రుతిస్మృతుల శాసనమును, ఉత్సృజ్య - విడచి, కామకారతః - కామప్రియుక్తుఁడై, వర్తతే - స్వచ్ఛందముగా మెలఁగుచున్నాఁడో సః - అట్టివాఁడు, సిద్ధిం - పురుషార్థయోగ్యతను, న అవాప్నోతి - పొందనేరఁడు, సుఖం - ఈ లోకమందలి సుఖమునైన, న-పొందఁడు, పరాం - ఉత్కృష్టమగు, గతిం - స్థానమగు స్వర్గమునుగాని మోక్షమునుగాని, న - పొందనేరఁడు. 23

తా:—ఆసురసంపత్తిని బుద్ధికౌశలముగా విడచుటకును సత్కర్మానుష్ఠాన మొనరించుటకును శ్రుతిస్మృతి రూపమగు శాస్త్రము పరమప్రమాణమని యభిప్రాయము. ఈగీతమును "ఋషిభి ర్బహుధాగీతం ఛందోభి ర్వివిధైః పృథక్, బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః" (గీ.13-5) అను గీతము హృదయమందుఁ గల్గినవారై శ్రీభగవాను లుపదేశించుచున్నవారలు. 23

---

త్యాగస్తుతి రియమ్. ఏతై రితి. ఏతై ర్విముక్తః కౌంతేయ! తమోద్వారై స్తమసో నరకస్య దుఃఖమోహాత్మకస్య ద్వారాణి కామాదయ స్తై రేతై స్త్రిభిర్విముక్తో నర ఆచర త్యనుతిష్ఠతి కిమ్? ఆత్మనః శ్రేయః య త్ప్రతిబద్ధః పూర్వం నాచచార తదపగమా దాచరతి తత స్తదాచరణా ద్యాతి పరాం గతిం మోక్ష మపీతి. 22

సర్వ స్యైతస్యాసురసంపత్పరివర్జనస్య శ్రేయ ఆచరణస్యచ శాస్త్రం కారణం శాస్త్రప్రమాణా దుభయం శక్యం కర్తుం నాన్యథా అతః య ఇతి. యః శాస్త్రవిధిం కర్తవ్యాకర్తవ్యజ్ఞానకారణం విధిప్రతిషేధాఖ్య ముత్సృజ్య త్యక్త్వా వర్తతే కామకారతః కామప్రయుక్తస్సన్, న స సిద్ధిం పురుషార్థయోగ్యతా మవాప్నోతి నాప్యస్మిం ల్లోకే సుఖం, నాపి పరాం ప్రకృష్టాం గతిం స్వర్గం మోక్షం వా. 23

తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. 24

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంప
ద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.

---

టీ:–తస్మాత్ - ఆ కారణమువలన, తే - నీకు, అనఁగా సకల ప్రపంచమున కును, కార్యాకార్యవ్యవస్థితౌ - కర్తవ్యాకర్తవ్య నిర్ణయమందు, శాస్త్రం - శ్రుతి స్మృతి మీమాంసలు, ప్రమాణం - అప్రతిహతమగు జ్ఞానసాధనము. శాస్త్రవిధానోక్తం - శాస్త్రముచే నుపదేశింపఁ బడిన ధర్మమును, జ్ఞాత్వా - తెలిసికొని, ఇహ - ఇక్కడ, ఇప్పుడు, కర్మ - స్వధర్మరూపమగు యుద్ధమును, కర్తుం - చేయుటకు, అర్హసి - తగియున్నావు. 24

తా:–ఈ గీతముచే శ్రుతిస్మృతి ప్రమాణవిహితంబుగా నర్జుననకుఁ గర్తవ్యాంశము ప్రత్యక్షముగా నుపదేశింపఁ బడుచున్నది. ఇట్టి యుపదేశము "తస్మాద్యుధ్యస్వ భారత" (గీ. 2-18.) అను యనువాదము మొదలుకొని యింతవఱకు బలు విధముల బలుమారు లీ యుపదేశమునే యర్జుననకుఁ జేసియుండుట యొక వింత గాదు. ఎన్ని విధముల నెన్నియుక్తులఁ జెప్పిన నింతవఱకు నర్జునుని బుద్ధికి నిశ్చయ జ్ఞానము కలుగలేనట్లు సువిదితము. ఇది యొక వింతగాదు, ఇయ్యది ప్రాకృతబుద్ధికి సహజము. 24

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన
గీతామృతతరంగిణియందు షోడశతరంగము.

---

తస్మా దితి. తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం జ్ఞానసాధనం తే తవ కార్యాకార్యవ్యవస్థితౌ కర్తవ్యాకర్తవ్య వ్యవస్థాయామ్ అతో జ్ఞాత్వా బుద్ధ్వా శాస్త్రవిధానోక్తం విధి ర్విధానం శాస్త్రేణ విధానం శాస్త్రవిధానం కుర్యా న్న కుర్యా దిత్యేవంలక్షణం తేనోక్తం స్వకర్మ యత్త త్కర్తు మిహార్హసి ఇహేతి కర్మాధికార భూమిప్రదర్శనార్థ మితి.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్య
పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
దైవాసురసంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః.

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## సప్తదశోధ్యాయః

అర్జున ఉవాచ:—

> యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః,
> తేషాం నిష్ఠా తు కా? కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః.

టీ:— యే - ఎవరు, శాస్త్రవిధిం - శ్రుతిస్మృతి శాస్త్రోక్తవిధానమును, ఉత్సృజ్య - గుర్తెఱుఁగఁ జాలకుండుటచే నద్దాని ననుసరింపలేక, శ్రద్ధయా - ఆస్తిక్య బుద్ధితో, అన్వితాః - కూడుకొనినవారై, యజన్తే - వృద్ధవ్యవహారదర్శన మాత్రముచేతనే శ్రద్ధతో దేవాదులఁ బూజింతురో, తేషాం - వారలయొక్క, నిష్ఠాతు - ఆచరణమన్ననో, కృష్ణ! కా - ఎట్టిది? సత్త్వం - సాత్వికమా? ఆహో - లేక, రజః - రాజసమా? తమః - తామసమా? 1

తా:—ఇచ్చట "ఉత్సృజ్య" అను శబ్దమున కవివేక పురస్సరమగు పరిత్యాగ మభిప్రాయము గాని యప్రమాణ పురస్సరంబగు పరిత్యాగమభిప్రాయము గాదు. ఏలనన ప్రమాణభావము లేనివారలకు శ్రద్ధయుండు టయసంభవము. కావునఁ బ్రమాణభావము కలిగిన నర్థజ్ఞాన గ్రహణమునకుఁ దగిన యోగ్యత లేమిచే నుచితవిధిని విడచి యేద్దియో యొక సరణిని యాచరించుట యను నాశయముతో "శాస్త్రవిధి

"తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే" (గీ. 16-24) ఇతి భగవద్వాక్యా ల్లబ్ధ ప్రశ్నబీజః అర్జున ఉవాచ - యే ఇతి. యే కేచి దవిశేషితాః శాస్త్రవిధిం శాస్త్రవిధానం శ్రుతిస్మృతిశాస్త్రచోదనా ముత్సృజ్య పరిత్యజ్య యజన్తే దేవాదీన్ పూజయంతి శ్రద్ధయాన్వితాః, శ్రద్ధయాఽఽస్తిక్యబుద్ధ్యాఽన్వితా స్సంయుక్తా స్సంతః శ్రుతిలక్షణం స్మృతిలక్షణం వా కంచి చ్ఛాస్త్రవిధి మపశ్యన్తో వృద్ధవ్యవహారదర్శనాదేవ శ్రద్ధధానతయా యే దేవాదీన్ పూజయంతి త ఇహ "యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః" ఇత్యేవం గృహ్యన్తే యే పునః కంచి

శ్రీభగవానువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. 2

---

ముత్సృజ్య యజన్తే" యని పలుకఁబడుచున్నది కాని వేఱొకటి కాదు. ప్రకృత మున నర్జునుఁడు "కర్మకర్తుమిఃహార్హసి" యని ఘంటాపథంబుగ నుపదేశింపఁ బడి నప్పటికిని యజ్ఞానవశమువ నద్దాని సరసతను దెలిసికొనఁ జాలక ప్రశ్నాంతరము నొకదాని నెద్దియో యొక తీరున కాలయాపనమునకై సేకరించెను. దానంజేసియే "శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే" యను నసంబద్ధప్రలాపము. ఇట్టి యసంబద్ధప్రలాపము నవకాశము చేసికొని "శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమామతాః" (గీ. 12-2) అను గీతమునం దుపదేశింపఁబడిన యుత్కృష్టమగు శ్రద్ధను వివరింప నీ శ్రద్ధాత్రయ విభాగమును భగవాను లుపదేశించుచున్నారు. 1

టీ:—దేహినాం - దేహాభిమానులకు, స్వభావజా - జన్మాన్తర కృత ధర్మాధర్మాది సంస్కారమువలన నభివ్యక్తమగు, సా - ఆప్రసిద్ధమగు, శ్రద్ధా - ఆస్తిక్య బుద్ధి, సాత్త్వికీ - సాత్త్వికమనియును, రాజసీచఏవ - రాజసమనియును, తామసీచ తామసమనియు, ఇతి - అని, త్రివిధా - మూఁడువిధములుగ, భవతి - అగుచున్నది. తాం - అట్టి త్రివిధరూపమగు శ్రద్ధనుగూర్చి, శృణు - వినుము. 2

---

చ్ఛాస్త్రవిధి ముపలభమానా ఏవ త ముత్సృజ్యాఽయథావిధి దేవాదీన్ పూజయంతి త ఇహ "యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే" ఇతి న పరిగృహ్యన్తే కస్మాత్? శ్రద్ధయాన్వితత్వవిశేషణాత్ దేవాది పూజావిధిపరం కించి చ్ఛాస్త్రం పశ్యన్త ఏవ తదుత్సృజ్యాశ్రద్ధధానతయా తద్విహితాయాం దేవాదిపూజాయాం శ్రద్ధయాన్వితాః ప్రవర్తన్త ఇతి న శక్యం కల్పయితుం యస్మాత్, తస్మాత్పూర్వోక్తా ఏవ "యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః" ఇత్యత్ర గృహ్యన్తే తేషా మేవంభూతానాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః కిం సత్త్వం నిష్ఠాఽవస్థానం, ఆహోస్వి ద్రజః, అథవా తమ ఇతి ఏత దుక్తం భవతి, యా తేషాం దేవాదివిషయా పూజా, సా కిం సాత్త్వికీ, ఆహోస్వి ద్రాజసీ ఉత తామసీతి. 1

సామాన్యవిషయోఽయం ప్రశ్నః నాప్రవిభజ్య ప్రతివచన మర్హతీతి శ్రీ భగవానువాచ - త్రివిధేతి. త్రివిధా త్రిప్రకారా భవతి శ్రద్ధా, యస్యాం నిష్ఠాయాం త్వం పృచ్ఛసి దేహినాం సా స్వభావజా జన్మాంతరకృతో ధర్మాదిసంస్కారో మరణకాలేఽభివ్యక్తః స్వభావ ఉచ్యతే; తతో జాతా స్వభావజా సాత్త్వికీ సత్త్వ

సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః 3

---

టీ:—భారత! అర్జునా! సర్వస్య - సమస్తప్రాణిజాతమునకును, శ్రద్ధా - శ్రద్ధ, సత్త్వానురూపా - ఆయాయివ్యక్తుల కుచితమగు సంస్కారములతోఁ గూడిన యంతఃకరణమునకుఁ దగినదై, భవతి - అగుచున్నది. అయం - ఈ, పురుషః- దేహధారి, శ్రద్ధామయః - శ్రద్ధాస్వరూపుఁడే, యః - ఏపురుషుఁడు, యచ్ఛ్రద్ధః- ఎట్టి శ్రద్ధతోఁగూడినవాఁడో, సః - ఆపురుషుఁడు, సః ఏవ - ఆశ్రద్ధాస్వరూపుఁడే.

తా:—ఈ గీతమునందలి "శ్రద్ధామయోఽయం పురుషః" అను వాక్యము యొక్క వివరణమే "యోయచ్ఛ్రద్ధ స్సఏవ సః" అను వాక్యము లోకములో ముఖాద్యవయవములచే మనుష్యులందఱు నొకేతీరున భాసించుచున్నను ఆయాయి పురుషులయొక్క తెలివితేటలయందును వ్యవహారవిశేషములయందును బలు విధములగు భేదములు గానవచ్చుచున్నవి. విద్యావిశేషములయందును గూడ నత్యంత వైలక్షణ్యము గాన్పించుచున్నది. లోకములో వ్యవహార విశేషమందలి యభినివేశముగూడ విశేషముగ గాన్పించుచున్నది. ఇట్టి విశేషములయందుఁగల భేదమునకుఁ గారణము బాహ్యమున కెద్దియును గన్పట్టదు. కాన నంతరంగమున నెద్దియేని విశేష ముండితీరవలయును. సకల బాహ్యవ్యవహారములకు నంతరంగ సాధన మంతఃకరణమని శాస్త్రయుక్త్యనుభవములచేఁ దెలియవచ్చుచున్నది. అంతఃకరణ ప్రవృత్తి లేకుండ నింద్రియములుగాని దేహముగాని యెద్విధమగు ప్రవృత్తిని జెందుట కవకాశము లేదు. అంతఃకరణప్రవృత్తిననుసరించియే సకలేంద్రియములు వ్యవహరించుచున్నవి. అంతఃకరణమునం దెట్టి నిశ్చయము ననఁగా నభిమానమును బురుషుఁడు పొందుచున్నాఁడో యట్టి వ్యాపారమును జేయుచున్నాఁడు. ఈ గీతమునందలి శ్రద్ధయనునది పురుషునిచే నంతఃకరణమునందుఁ బొందఁబడు

---

నిర్వృత్తా దేవపూజాదివిషయా, రాజసీ రజోనిర్వృత్తా యక్షరక్షఃపూజాదివిషయా, తామసీ తమోనిర్వృత్తా ప్రేతపిశాచాది పూజావిషయా, ఏవం త్రివిధా, తా ముచ్యమానాం శ్రద్ధాం శృణు అవధారయ. 2

సైవం త్రివిధా భవతి - సత్త్వానురూపేతి. సత్త్వానురూపా విశిష్టసంస్కారోపేతాంతఃకరణానురూపా సర్వస్య ప్రాణిజాతస్య శ్రద్ధా భవతి భారత! యద్యేవం తతః కిం స్యా దిత్యుచ్యతే, శ్రద్ధామయః శ్రద్ధాప్రాయోఽయం పురుషః సంసారీ జీవః కథం? యో యచ్ఛ్రద్ధో యా శ్రద్ధా యస్య జీవస్య స యచ్ఛ్రద్ధః సఏవ తచ్ఛ్రద్ధానురూప ఏవ స జీవః. 3

యజన్తే సాత్త్వికా దేవా న్యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతా న్భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః. 4

నభిమాన విశేషమే. దానంజేసి యెట్టి శ్రద్ధను గలిగిన పురుషుఁ డట్టి శ్రద్ధారూప ముఁగాఁ దలంపఁబడుచున్నాఁడు. ఇట్టి యభిమానము పురుషునియొక్క జ్ఞానవిశేష ముచేఁ బరివర్తనముఁ జెందుటకుఁ దగుసావకాశము కలదుకాని దేహము గర్భ ప్రవేశము మొదలు క్రమక్రమముగా నొకింత యుచిత పరిమాణమును బొందు వఱకభివృద్ధిఁజెంది పిమ్మట దదన్తఃపాతివికారములకు మాత్రము పాల్పడును. అన్తఃకరణమన్ననో యట్లుకాక ప్రయత్న విశేషముకొలది సంకోచవికాసములఁ బొంద నవకాశము కలదియగుచున్నది. ఇట్టి శక్తికే కర్తృత్వశక్తియనిపేరు. ఇట్టి కర్తృత్వ శక్తి జ్ఞానముచే దోహదము చేయఁబడినచో పూర్ణమగు బ్రహ్మకు నెట్టి సర్వజ్ఞత్వాదులు వినఁబడుచున్నవో యట్టి సర్వజ్ఞత్వాదులను బొందువఱకు నభి వృద్ధినొంద నవకాశముగలదు. ఒకే జన్మయందు నన్తఃకరణ మింతపరివర్తనము జెందుటకు సావకాశముండినను, బరివర్తనముఁ జెందినను దేహవిశేషము మాత్రము జననకాలమం దెట్టి మాతా పితరులయొక్క శుక్లశోణితములతోఁ బ్రారంభమగు చున్నదో మరణ పర్యంత మట్టి స్వభావముతోడనే యుండునుగాని యన్తఃకరణ పరివర్తనము ననుసరించి వేఱొకపరివర్తనము నొందుటకు వీలులేదు. 3

టీ:—సాత్త్వికాః - సత్త్వగుణ సంపన్నులు, దేవాన్ - దేవతలను గుఱించి, యజన్తే - యాగములను జేయుదురు. రాజసాః - రజోగుణసంపన్నులు, యక్ష రక్షాంసి - యక్షులను రాక్షసులను బూజింతురు. అన్యే - ఇతరులగు, తామసాః - తమోగుణ సంపత్తిగల, జనాః - జనులు, ప్రేతాన్ - పిశాచములను, భూతగణాన్ గ్రామదేవతలను, యజన్తే - పూజింతురు. 4

తతశ్చ కార్యేణ లింగేన దేవాదిపూజయా సత్త్వాదినిష్ఠాఽనుమేయేత్యాహ- యజన్త ఇతి. యజన్తే పూజయంతి సాత్త్వికాః సత్త్వనిష్ఠాః దేవాన్, యక్షర క్షాంసి రాజసాః, ప్రేతాన్ భూతగణాంశ్చ సప్తమాతృకాదీం శ్చాన్యే యజన్తే తామసా జనాః. 4

అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. 5

కర్శయంతః శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాఽంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్. 6

---

టీ:—యే - ఏ, జనాః - మనుష్యులు, దంభాహంకారసంయుక్తాః - దంభము, అహంకారముతోఁ గూడినవారై, కామరాగబలాన్వితాః - కామరాగపురస్కృత మగు బలముతోఁగూడినవారై, లేక, కామము రాగము, బలము, అనువాటితోఁ గూడినవారలై, అచేతసః - యుక్తాయుక్త వివేకజ్ఞానము లేనివారై, శరీరస్థం - దేహమం దుండెడి, భూతగ్రామం - ఇంద్రియ సమూహమును, కర్శయంతః - కృశింపఁజేయువారై, అంతఃశరీరస్థం - శరీరాంతర్యామినగు, మాం చ ఏవ - నన్ను గూడ, కర్శయంతః - కృశింపజేయుచు, అశాస్త్రవిహితం - శాస్త్రముచే విధింపఁ బడనట్టియు, ఘోరం - ప్రాణిపీడాకరమగునట్టియు, తపః - తపస్సును, తప్యన్తే - చేయుదురో, తాన్ - అట్టివారలను, ఆసురనిశ్చయాన్ - ఆసురకృత్యములం దభినివేశము గలవారలుగా, విద్ధి - తెలిసికొనుము. 5-6

తా:—ఈ రెండు గీతములచే నాసురసంపత్తితోఁ గూడిన వారలయొక్క స్వభావము వివరింపఁ బడుచున్నది. 5-6

---

ఏవం కార్యతో నిర్ణీతాః సత్త్వాదినిష్ఠాః శాస్త్రవిధ్యుత్సర్గే తత్ర కశ్చిదేవ సహస్రేషు దేవపూజాదిపరః సత్త్వనిష్ఠో భవతి, బాహుల్యేన తు రజోనిష్ఠా స్తమోనిష్ఠాశ్చైవ ప్రాణినో భవంతి కథమ్ - అశాస్త్ర విహిత మితి. అశాస్త్రవిహితం న శాస్త్రవిహిత మశాస్త్రవిహితం ఘోరం పీడాకరం ప్రాణినా మాత్మనశ్చ తప స్తప్యన్తే నిర్వర్తయంతి యే జనా స్తే చ దంభాహంకారసంయుక్తాః దంభ శ్చాఽహంకారశ్చ దంభాహంకారౌ తాభ్యాం సంయుక్తా దంభాహంకారసంయుక్తాః, కామరాగ బలాన్వితాః, కామశ్చ రాగశ్చ కామరాగౌ తత్కృతం బలం కామరాగబలం తేనాఽన్వితాః కామరాగబలాన్వితాః. 5

కర్శయంత ఇతి. కర్శయంతః కృశీకుర్వంతః శరీరస్థం భూతగ్రామం కరణసముదాయ మచేతసోఽవివేకినో మాం చైవ తత్కర్మబుద్ధిసాక్షిభూత మంతశ్శరీరస్థం నారాయణం కర్శయంతో మదనుశాసనాఽకరణ మేవ మత్కర్శనం, తాన్విద్ధ్యాసుర నిశ్చయా నాసురో నిశ్చయో యేషాం తే ఆసురనిశ్చయా స్తాన్ పరిహారార్థం విద్ధీ త్యుపదేశః. 6

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. 7
ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః. 8

---

టీ:—సర్వస్య - సకలప్రాణిజాతమునకును, ప్రియః - ఇష్టమగు, ఆహారః తు అపి - ఆహారము గూడ, త్రివిధః - మూఁడు విధములుగా, భవతి - అగుచున్నది. తథా - ఆ తీరుననే, తేషాం - వారలయొక్క, యజ్ఞః - యాగము, తపః - తపస్సు, దానం - త్యాగవిశేషము గూడ, (త్రివిధం - మూఁడువిధములు) అగుచున్నది. తేషాం - ఆ యాహారాదులయొక్క, ఇమం - ఈ చెప్పఁబోవు, భేదం - తారతమ్యమును, శృణు - వినుము. 7

టీ:—ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః - ఆయుర్దాయమును, దేహబలమును, బుద్ధిబలమును, ఆరోగ్యమును, సుఖమును, సంతసమును, అభివృద్ధి నొందించునట్టివియు, రస్యాః - రసవంతములును, స్నిగ్ధాః - స్నేహవంతములును, స్థిరాః - చిరకాల ముండునవియు, హృద్యాః - మనోహరములు నగు, ఆహారాః - భోజనపదార్థములు, సాత్త్వికప్రియాః - సాత్త్విక సంపత్తి గలవారల కిష్టమగుచున్నవి. 8

---

ఆహారాణాం చ రస్యస్నిగ్ధాదివర్గత్రయరూపేణ భిన్నానాం యథాక్రమం సాత్త్వికరాజసతామసపురుషప్రియత్వదర్శన మిహ క్రియతే, రస్యస్నిగ్ధాది ష్వాహారవిశేషే ష్వాత్మనః ప్రీత్యతిరేకేణ లింగేన సాత్త్వికత్త్వం రాజసత్వం తామసత్వం చ బుద్ధ్వా రజస్తమోలింగానా మాహారాణాం పరివర్జనార్థం సత్త్వలింగానాం చోపాదానార్థమ్ తథా యజ్ఞాదీనా మపి సత్త్వాదిగుణభేదేన త్రివిధత్వప్రతిపాదన మిహ "రాజసతామసాన్ బుద్ధ్వా కథంతునామ పరిత్యజేత్, సాత్త్వికానేవాఽనుతిష్ఠేత్" ఇత్యేవ మర్థ మాహ - ఆహార ఇతి. ఆహార స్త్వపి సర్వస్య భోక్తుః ప్రాణిన స్త్రివిధో భవతి, ప్రియ ఇష్ట స్తథా యజ్ఞ స్తథా తప స్తథా దానమ్ తేషా మాహారాదీనాం భేద మిమం వక్ష్యమాణం శృణు. 7

ఆయు రితి. ఆయుశ్చ సత్త్వం చ బలం చాఽఽరోగ్యం చ సుఖం చ ప్రీతిశ్చాయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతయః తాసాం వివర్ధనా ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః తే చ రస్యా రసోపేతాః స్నిగ్ధాః స్నేహవంతః స్థిరా శ్చిరకాలస్థాయినో దేహే, హృద్యా హృదయప్రియాః ఆహారాః సాత్త్వికప్రియాః సాత్త్వికస్యేష్టాః. 8

కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

---

టీ:-కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః - ఎక్కువ కారముగునట్టియు, ఎక్కువ పులుపగు నట్టియు, ఎక్కువ ఉప్పగానున్నట్టియు, ఎక్కువ వేడిగానున్నట్టియు, ఎక్కువ తీక్ష్ణముగా నున్నట్టియు, ఎక్కువతీవ్రముగానున్నట్టియు ఎక్కువ దాహమును గలుగఁజేయునట్టివియును, దుఃఖశోకామయప్రదాః - దుఃఖమును, శోకమును, రోగమును గలుగఁ జేయునట్టివియు, ఆహారాః - భోజనపదార్థములు, రాజసస్య - రజోగుణసంపన్నునకు, ఇష్టాః - ప్రీతిని గలిగించునవి. 9

టీ:-యాతయామం - బాగుగా నుడుకనట్టియు, గతరసం, - రసముపోవుటచే నిర్వీర్యమైనట్టియు, పూతి - దుర్గంధముతోఁ గూడినట్టియు, పర్యుషితం - పక్వముచేయఁబడి రాత్రినిలువయున్నట్టియు, ఉచ్ఛిష్టమపి - భుజింపఁగా మిగిలినదియు, అమేధ్యంచ - యజ్ఞార్హముకానట్టియు, యత్ - ఏ, భోజనం - ఆహారపదార్థముకలదో, తత్ - ఆభోజనము, తామసప్రియం - తమోగుణ సంపన్నులకిష్టమైనది. 10

తా:-పైమూఁడు గీతములచేతను సాత్త్వికరాజస తామసస్వభావములతోఁ గూడినవారలకు నభీష్టమగు నాహారభేదము చెప్పఁబడినది. అనఁగా వారివారికి నభీష్టములగు నాహారములను విమర్శించుటచే వారివారి హృదయధర్మమును గుర్తింప నవకాశము కొంతవఱకు గలుగవచ్చునని యాశయము 10

---

కట్వితి. కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహిన ఇత్యత్రాఽతిశబ్దః కట్వాదిషు సర్వత్ర యోజ్యోఽతికటు రతితీక్ష్ణ ఇత్యేవమ్. తే చాఽఽహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదా దుఃఖం చ శోకం చాఽఽమయం చ ప్రయచ్ఛన్తీతి దుఃఖశోకామయప్రదాః. 9

యాతయామ మితి. యాతయామం మందపక్వం, నిర్వీర్యస్య గతరసేనోక్తత్వాత్, గతరసం రసవియుక్తం, పూతి దుర్గంధం, పర్యుషితం చ పక్వం సద్రాత్ర్యంతరితం చ యత్, ఉచ్ఛిష్ట మపిచ భుక్తశిష్ట మపి, అమేధ్య మయజ్ఞార్హం భోజన మీదృశం తామసప్రియమ్. 10

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః. 11

అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

---

టీ:—అఫలాకాంక్షిభిః - ఫలాకాంక్షలేనివారలచే, యష్టవ్యం ఏవఇతి - యాగముచేసి తీరవలయునను నిశ్చయముచే, మనః - మనస్సును, సమాధాయ - నిశ్చయించి, విధిదృష్టః - శాస్త్రముచే విధింపఁబడిన విధానమున, యః - ఏ, యజ్ఞః - యాగము, ఇజ్యతే - చేయఁబడుచున్నదో, సః - ఆ యాగము, సాత్త్వికః - సాత్త్వికమని చెప్పఁబడుచున్నది. 11

టీ:—భరతశ్రేష్ఠ! ఫలం - ఫలమును, అభిసంధాయ తు - అభిలషించియే కాని, దంభార్థం అపిచఏవ - బూటకము కొఱకుగాని, యత్ - ఏది, ఇజ్యతే- చేయబడుచున్నదో, తం - అట్టి యజ్ఞం- యాగమును రాజసం - రాజసమని, విద్ధి - తెలిసికొనుము. 12

టీ:—విధిహీనం - శాస్త్రమందుఁ జెప్పఁబడిన క్రమమునకు విపరీతమగునట్టియు, అసృష్టాన్నం - బ్రాహ్మణుల కన్నము పెట్టఁబడనిదియు, మంత్రహీనం - మంత్రములచేఁ గాని, స్వరములచేఁ గాని, వర్ణములచేఁ గాని, హీనమైనట్టియు, అదక్షిణం - దక్షిణలేనట్టియు, శ్రద్ధావిరహితం - శ్రద్ధలేనట్టియు, యజ్ఞం - యాగమును, తామసం - తామసమని, పరిచక్షతే - పెద్దలు చెప్పుచున్నారు. 13

---

అథేదానీం యజ్ఞ స్త్రివిధ ఉచ్యతే- అఫలేతి. అఫలాకాంక్షిభి రఫలార్థిభి ర్యజ్ఞో విధిదృష్టః శాస్త్రచోదనాదృష్టో యో యజ్ఞ ఇజ్యతే నిర్వర్త్యతే యష్టవ్య మేవేతి యజ్ఞస్వరూపనిర్వర్తన మేవ కార్య మితి మనః సమాధాయ నాఽనేన పురుషార్థో మమ కర్తవ్య ఇత్యేవం నిశ్చిత్య స సాత్త్వికో యజ్ఞ ఉచ్యతే. 11

అభిసంధాయేతి. అభిసంధాయోద్దిశ్య ఫలం దంభార్థ మపి చైవ యదిజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్. 12

విధిహీన మితి. విధిహీనం యథాచోదితవిపరీతమ్, అసృష్టాన్నం బ్రాహ్మణేభ్యో న సృష్టం న దత్త మన్నం యస్మిన్ యజ్ఞే సో౽సృష్టాన్న స్త మసృష్టాన్నం,

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే. 14

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. 15

---

తా:—పై మూఁడు గీతములచేతను యజ్ఞములయొక్క సాత్త్వికరాజస తామసత్వములు వివరింపఁ బడినవి. 13

టీ:—దేవద్విజగురుప్రాజ్ఞపూజనం - దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, విద్వాంసులను బూజించుటయును, శౌచం - బాహ్యాభ్యంతర శుచిత్వమును, ఆర్జవం - కుటిలస్వభావము లేకుండుటయు, బ్రహ్మచర్యం - స్వేచ్ఛందన వనితాదుల స్వీకరింపకుండుటయు, అహింసా చ - హింసింపకుండుటయు, శారీరం - శరీరసంబంధమగు, తపః - తపస్సు అని, ఉచ్యతే - చెప్పఁబడు చున్నది. 14

టీ:—అనుద్వేగకరం - ప్రాణులకు దుఃఖమును గల్గింపనట్టియు, సత్యం - యథార్థమైనట్టియు, ప్రియహితంచ - దృష్టాదృష్టఫలబోధకమగునట్టి, యత్-ఏ, వాక్యం - వాగింద్రియ వ్యాపారమును, స్వాధ్యాయాభ్యసనంచ ఏవ - అధీత వేదమును నిరంతరము పఠించుటయును వాఙ్మయం - వాగూపమగు, తపః - తపమని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. 15

---

మంత్రహీనం మంత్రితః స్వరతో వర్ణతో వా వియుక్తం మంత్రహీనం, అదక్షిణ ముక్తదక్షిణారహితం శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే తమోనిర్వృత్తం కథయంతి. 13

అథేదానీం తప స్త్రివిధ ముచ్యతే - దేవేతి. దేవాశ్చ ద్విజాశ్చ గురవశ్చ ప్రాజ్ఞాశ్చ దేవద్విజగురుప్రాజ్ఞాః, తేషాం పూజనం, దేవద్విజగురుప్రాజ్ఞపూజనం, శౌచ మార్జవ మృజుత్వం బ్రహ్మచర్య మహింసా చ శరీరనిర్వర్త్యం శారీరం శరీర ప్రధానైః సర్వై రేవ కార్యకరణైః కర్త్రాదిభిః సాధ్యం శారీరం తప ఉచ్యతే "పంచైతే తస్య హేతవః" (గీ. 18-15) ఇతి హి వక్ష్యతి. 14

అనుద్వేగేతి. అనుద్వేగకరం ప్రాణినా మదుఃఖకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ప్రియహితే దృష్టాదృష్టార్థే అనుద్వేగకరత్వాదిభి ర్ధర్మై ర్వాక్యం విశేష్యతే విశేషణ ధర్మసముచ్చయార్థ శ్చశబ్దః పరప్రత్యయార్థం ప్రయుక్తస్య వాక్యస్య సత్యప్రియహితానుద్వేగకరత్వానా మన్యతమేన ద్వాభ్యాం త్రిభి ర్వా హీనతా స్యా ద్యది, న త ద్వాఙ్మయం తపః తథా సత్యవాక్య స్యేతరేషా మన్య

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. 17

---

టీ:-మనఃప్రసాదః - మనస్సుయొక్క నిర్మలత్వము, సౌమ్యత్వం - మృదుస్వభావము, మౌనం - వాఙ్నియమము, ఆత్మవినిగ్రహః - అంతరింద్రియ నిగ్రహము, భావసంశుద్ధిః - మాయాకౌటిల్య వంచనాదులు లేకుండుటయు, ఇతి ఏతత్ - ఈ మొదలుగాఁ గల గుణసముదాయము, మానసం - మనస్సంబంధమగు, తపః - తపస్సు అని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. 16

టీ.-పరయా - ఉత్కృష్టమగు, శ్రద్ధయా - శ్రద్ధతో, తప్తం - తపింపఁబడిన, తత్ - ఆ, తపః - తపస్సుగూడ, త్రివిధం - మూఁడు విధములు, అఫలాకాంక్షిభిః - ఫలాభిలాష లేనట్టియు, యుక్తైః - ఇంద్రియనిగ్రహము కలిగినట్టియు, నరైః - మనుష్యులచే, (తప్తం - చేయఁబడు, తపః - తపస్సును) సాత్త్వికం - సాత్త్వికమని, పరిచక్షతే - చెప్పుదురు. 17

---

తమేన ద్వాభ్యాం త్రిభి ర్వా విహీనతాయాం న వాఙ్మయతప స్త్వమ్, తథా ప్రియవాక్యస్యాపీతరేషా మన్యతమేన ద్వాభ్యాం త్రిభిర్వా విహీనస్య న వాఙ్మయతప స్త్వమ్, తథా హితవాక్య స్యాపీతరేషా మన్యతమేన ద్వాభ్యాం త్రిభి ర్వా విహీనస్య న వాఙ్మయతప స్త్వమ్ కిం పున స్త త్తపః? య త్సత్యం వాక్య మనుద్వేగకరం ప్రియం హితం చ త త్తపోవాఙ్మయమ్ యథా "శాంతో భవ వత్స, స్వాధ్యాయం యోగం చాఽనుతిష్ఠ, తథా తే శ్రేయో భవిష్యతీ"తి స్వాధ్యాయాభ్యసనం చైవ యథావిధి వాఙ్మయం తప ఉచ్యతే. 15

మన ఇతి. మనఃప్రసాదో మనసః ప్రశాంతిః స్వచ్ఛతాపాదనం ప్రసాదః, సౌమ్యత్వం య త్సౌమనస్య మాహుః ముఖాదిప్రసాదాదికార్యోన్నేయా ఽంతఃకరణస్య వృత్తిః మౌనం వాక్సంయమోఽపి మనస్సంయమపూర్వకో భవతీతి కార్యేణ కారణ ముచ్యతే మనస్సంయమో మౌన మితి. ఆత్మవినిగ్రహో మనోనిరోధః సర్వతః సామాన్యరూప ఆత్మవినిగ్రహో వాగ్విషయస్యైవ మనః సంయమో మౌన మితివిశేషః, భావసంశుద్ధిః పరై ర్వ్యవహారకాలేఽమాయావిత్వం భావసంశుద్ధిః, ఇత్యేత త్తపో మానస ముచ్యతే. 16

యథోక్తం కాయికం వాచికం మానసం చ తప స్త పం నరై స్సత్త్వాది భేదేన కథం త్రివిధం భవతీ త్యుచ్యతే - శ్రద్ధయేతి. శ్రద్ధయాఽఽస్తిక్యబుద్ధ్యా

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్.          18

మూఢగ్రాహేణాఽఽత్మనో య త్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్.          19

---

టీ:—సత్కారమానపూజార్థం - సాధువని యనిపించుకొనుటకును, లేచి యెదురుగావచ్చుట మొదలగు గౌరవాదుల కొఱకును, పాదప్రక్షాలనాదిరూప మగు పూజాదులకొఱకును, దంభేన చ ఏవ - ఆడంబరముచేతనే, యత్ - ఏ, తపః - తపస్సు, క్రియతే - చేయఁబడుచున్నదో, తత్ - అట్టి తపస్సు, ఇహ - ఈప్రకరణము నందు, రాజసం - రాజసమనియు, చలం - చంచలమనియు, అధ్రువమ్ - స్థిరమగు ఫలము నొసంగదనియు, ప్రోక్తం - చెప్పఁబడినది.          18

టీ:—మూఢగ్రాహేణ-అవివేక పురస్సరంబగు నిశ్చయము తోడను,ఆత్మనః-తనయొక్క, పీడయా - కష్టముచేతను, పరస్య-ఇతరునియొక్క, ఉత్సాదనార్థంవా - చెఱుపుకొఱకుగాని, యత్ - ఏ, తపః - తపస్సు, క్రియతే - చేయఁబడుచున్నదో, తత్ - అయ్యది, తామసం - తామసమని, ఉదాహృతం - చెప్పఁబడినది.          19

తా:—పై యీఱు గీతములచేతను దపోవిశేషములు వివరింపఁబడుచున్నవి. 19

---

పరయా ప్రకృష్టయా త ప్త మనుష్ఠితం తప స్త త్ప్రకృతం త్రివిధం త్రిప్రకారం త్ర్యధిష్ఠానం నరై రనుష్ఠాతృభి రఫలాకాంక్షిభిః ఫలాకాంక్షారహితై ర్యుక్తై స్సమాహితై ర్యదీదృశం తప స్త త్సాత్త్వికం సత్త్వనిర్వృత్తం పరిచక్షతే కథ యంతి శిష్టాః.          17

సత్కారేతి - సత్కారః సాధుకారః సాధు రయం తపస్వీ బ్రాహ్మణ ఇత్యేవ మర్థం, మానో మాననం ప్రత్యుత్థానాభివాదనాది స్తదర్థం పూజాపాదప్రక్షాలనా ర్చ నాశయితృత్వాది స్తదర్థం చ తపస్సత్కారమానపూజార్థం దంభేన చైవ యత్క్రియతే తప స్తదిహ ప్రోక్తం కథితం రాజసం చలం కాదాచిత్కఫలత్వే నాఽధ్రువమ్.          18

మూఢేతి-మూఢగ్రాహేణాఽవివేకనిశ్చయేనాత్మనః పీడయాయత్క్రియతే తపః పర స్యోత్సాదనార్థం వినాశార్థం వా త త్తామసం తప ఉదాహృతమ్.          19

దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికమ్స్మృతమ్. 20

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం త ద్దానం రాజసం స్మృతమ్. 21

అదేశకాలే య ద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్. 22

---

టీ:-దాతవ్యం ఇతి - దానముదప్పక జేయఁదగినదను నిశ్చయముచే, దేశే - కురుక్షేత్రాదిపుణ్యస్థలములందును, కాలేచ - సంక్రాంత్యాది పుణ్యకాలములందును, పాత్రేచ - వేద వేదాంగవిదులయందును, అనుపకారిణే - ఎవరివలనఁ దానెట్టి యుపకారము నపేక్షింపఁడో యట్టివారికొఱకును, యత్ - ఏ, దానం - దానము, దీయతే - ఇవ్వఁబడు చున్నదో, తత్ - ఆ, దానం - దానము, సాత్త్వికం -సాత్త్విక మని, స్మృతం - చెప్పఁబడినది. 20

టీ:-ప్రత్యుపకారార్థం - తిరిగి యుపకారము నొందుటకుఁగాని, పునః - తిరిగి, ఫల ముద్దిశ్య వా - ఫలాభిసంధితోఁగాని, పరిక్లిష్టంచ - బలాత్కారముచేఁగాని, యత్ తు - ఏదానము, దీయతే - ఇవ్వఁబడు చున్నదో, తత్ - ఆ, దానం - దానము, రాజసమని, స్మృతం - చెప్పఁబడినది. 21

టీ:-అదేశకాలే - దేశకాల విచక్షణలేనివాటియందు, అపాత్రేభ్యః చ - అయోగ్యులకొఱకు, అసత్కృతం - పాదప్రక్షాళనాది రహితముగను, అవజ్ఞాతం - నిందాపూర్వకముగాను, యత్ - ఏ, దానం - దానము, దీయతే - ఇవ్వఁబడు

---

ఇదానీం దానత్రైవిధ్యముచ్యతే - దాతవ్య మిత్యేవం మనః కృత్వా యద్దానం దీయతేఽనుపకారిణే ప్రత్యుపకారాసమర్థాయ సమర్థాయాపి నిరపేక్షం దీయతే దేశే పుణ్యే కురుక్షేత్రాదౌ, కాలే సంక్రాంత్యాదౌ పాత్రే చ షడంగవిద్వేదపారగ ఇత్యాదౌ, తద్దానం సాత్త్వికం స్మృతం. 20

య త్త్వితి. యత్తు దానం ప్రత్యుపకారార్థం కాలే త్వయం మాం ప్రత్యుపకరిష్యతీ త్యేవమర్థం, ఫలం వాఽస్య దానస్య మే భవిష్య త్యదృష్ట మితి తదుద్దిశ్య పున ర్దీయతే చ పరిక్లిష్టం ఖేదసంయుక్తం తద్దానం రాజసం స్మృతమ్. 21

అదేశేతి. అదేశకాలేఽదేశేఽపుణ్యే దేశే మ్లేచ్ఛాశుచ్యాదిసంకీర్ణే ఽకాలే పుణ్యహేతుత్వేనాఽప్రఖ్యాతే సంక్రాంత్యాదివిశేషరహితే ఽపాత్రేభ్యశ్చ మూర్ఖ

ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః,
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా.        23

తస్మా దో మిత్యుదాహృత్య యజ్ఞ దానతపఃక్రియాః,
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్.        24

---

చున్నదో, తత్ - ఆదానము, తామసం - తామసమని, ఉదాహృతం - చెప్పఁబడినది.        22

తా:—పైమూఁడు గీతములచే దానవిశేషములు వివరింపఁబడుచున్నవి. 22

టీ:—బ్రహ్మణః - బ్రహ్మమునకు, నిర్దేశః - నామనిర్దేశము ఓం ఇతి - ఓం అనియును, తత్ ఇతి - తత్ అనియును, సత్ ఇతి - సత్ అనియును, త్రివిధః - మూఁడు విధములుగా, స్మృతః - స్మరింపఁబడుచున్నది. బ్రహ్మవేత్తలచేనని యధ్యాహారము చేయునది. తేన - అట్టిమూడువిధములగు నిర్దేశముచేతిను, వేదాః చ - వేదములును, యజ్ఞాఃచ - యజ్ఞములును, బ్రాహ్మణాః - బ్రాహ్మణులును, పురా - పూర్వము, విహితాః - నిర్మింపఁబడిరి.        23

టీ:—తస్మాత్ - ఆ కారణముచేత, బ్రహ్మవాదినాం - బ్రహ్మవాదు లనఁగా బ్రాహ్మణులయొక్క, విధానోక్తాః - శాస్త్రముచే విధింపఁబడిన, యజ్ఞదానతపః క్రియాః - యాగములు, దానములు, తపస్సులను కర్మలు, సతతం - ఎల్లప్పుడును, ఓం ఇతి - ఓం అని, ఉదాహృత్య - ఉచ్చరించి, ప్రవర్తన్తే- జరుగుచున్నవి.   24

---

తస్కరాదిభ్యో దేశాదిసంపత్తౌ వాఽసత్కృతం ప్రియవచనపాదప్రక్షాలన పూజాది రహిత మవజ్ఞాతం పాత్రపరిభవయుక్తం చ యద్దానం తత్తామస ముదాహృతమ్. 22

యజ్ఞదానతపఃప్రభృతీనాం సాద్గుణ్యకరణాయాఽయ ముపదేశ ఉచ్యతే - ఓం ఇతి. ఓం తత్స దిత్యేవం నిర్దేశో, నిర్దిశ్యతేఽనేనేతి నిర్దేశ స్త్రివిధో నామనిర్దేశో బ్రహ్మణః స్మృత శ్చింతితో వేదాంతేషు బ్రహ్మవిద్భిః బ్రాహ్మణా స్తేన నిర్దేశేన త్రివిధేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితా నిర్మితాః పురా పూర్వ మితి నిర్దేశస్తుత్యర్థ ముచ్యతే.        23

తస్మా దితి. తస్మాత్ ఓం ఇత్యుదాహృత్యోచ్చార్య యజ్ఞదానతపఃక్రియాః యజ్ఞాదిస్వరూపాః క్రియాః ప్రవర్తన్తే విధానోక్తాః శాస్త్రచోదితాః సతతం సర్వదా బ్రహ్మవాదినాం బ్రహ్మవాదనశీలానామ్.        24

తది త్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః. 25

సద్భావే సాధుభావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే-
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే. 26

యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే,
కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాఽభిధీయతే. 27

---

టీ:—మోక్షకాంక్షిభిః - మోక్షాభిలాషులచే, ఫలం - ప్రయోజనమును అనభిసంధాయ - అభిలషింపకుండగనే, యజ్ఞతపఃక్రియాః - యజ్ఞములు తపస్సులను క్రియలును, వివిధాః - నానావిధములగు, దానక్రియాః చ - దానరూపములగు కర్మలును, తత్ ఇతి - తత్ అను శబ్దోచ్చారణ పురస్సరంబుగా, క్రియన్తే - చేయఁబడుచున్నవి. 25

టీ:—పార్థ! సద్భావే - తెలియఁబడని యభీష్టకార్యము తెలియఁబడినపుడును, సాధుభావేచ - దుష్టుఁడు మంచివాఁడుగాఁ బరిణమించినపుడును, సత్ ఇతి ఏతత్ - సత్ అనునది, ప్రయుజ్యతే - ప్రయోగింపఁ బడుచున్నది, తథా - ఆ తీరుననే, ప్రశస్తే - శుభమగు, కర్మణి - కర్మయందు, సచ్ఛబ్దః - సత్ అను పదము, యుజ్యతే - వినియోగింపఁబడుచున్నది. 26

టీ:—యజ్ఞే - యజ్ఞమందును, తపసి - తపమునందును, దానేచ - దానమందును, స్థితిః - ఉనికి, సత్ ఇతిచ - సత్ అనియును, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది.

---

తదితి. తది త్యనభిసంధాయ తదితి బ్రహ్మాభిధాన ముచ్చార్యాఽనభిసంధాయ చ కర్మణః ఫలం యజ్ఞతపఃక్రియా యజ్ఞక్రియాశ్చ తపఃక్రియాశ్చ యజ్ఞతపఃక్రియా దానక్రియాశ్చ వివిధాః క్షేత్రహిరణ్యప్రదానాదిలక్షణాః క్రియన్తే నిర్వర్త్యన్తే మోక్షకాంక్షిభి ర్మోక్షార్థిభి ర్ముముక్షుభిః. 25

ఓంతచ్ఛబ్దయో ర్వినియోగ ఉక్తః అథేదానీం సచ్ఛబ్దస్య వినియోగః కథ్యతే - సద్భావే ఇతి. సద్భావేఽసతః సద్భావే యథాఽవిద్యమానస్య పుత్రస్య జన్మని తథా సాధుభావే చాఽసద్వృత్త స్యాఽసాధోః సద్వృత్తతా సాధుభావ స్తస్మిన్ సాధుభావే చ సదిత్యేత దభిధానం బ్రహ్మణః ప్రయుజ్యతేఽభిధీయతే. ప్రశస్తే కర్మణి వివాహాదౌ చ తథా సచ్ఛబ్దః పార్థ! యుజ్యతే ప్రయుజ్యత ఇత్యేతత్. 26

యజ్ఞే ఇతి. యజ్ఞే యజ్ఞకర్మణి యా స్థితిః, తపసి చ యా స్థితిః దానే చ యా స్థితిః సా చ సది త్యుచ్యతే విద్వద్భిః కర్మ చైవ తదర్థీయం యజ్ఞదానతపో

అశ్రద్ధయా హుతం ద త్తం తప స్తప్తం కృతం చ యత్,
అసది త్యుచ్యతే పార్థ! న చ త త్ప్రేత్య నో ఇహ. **28**

ఇతి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
శ్రద్ధాత్రయవిభాగయోగో నామ
సప్తదశోఽధ్యాయః.

---

తదర్థీయం ఏవ - యజ్ఞదానతపస్సులతో సంబంధించిన, కర్మచ - కార్యములు గూడను, సత్ ఇత్యేవ - సత్ అనియే, అభిధీయతే - చెప్పఁబడుచున్నది. **27**

తా:—పై యయిదుగీతములచేతను లోకవేదములందుఁ దెలియవచ్చెడి యుత్తమములగు వస్తువులను గర్మలను బ్రహ్మయొక్క నామములతో సంబంధించి వ్యవహరింపఁ బడుచున్న వనుటచే నుత్తమములగు కర్మలన్నియు బ్రహ్మయే పర మావధిఫలముగాఁ గల్గియుండుటంజేసి బ్రహ్మస్వరూపములనియేఁ జెప్పఁబడు చున్నవి. **27**

టీ:—పార్థ! అశ్రద్ధయా - శ్రద్ధాహీనముగ, హుతం - హోమముచేయఁ బడినదియు, దత్తం - ఇవ్వఁబడినదియు, తప్తం - తపస్సుచేయఁబడిన, తపః - తపస్సుమున్నగునది యత్ - ఏది, కృతంచ - స్తుతినమస్కారాది రూపమగు కార్యము గలదో, తత్ - అదియంతయు, అసత్ ఇతి - అసత్ అని, ఉచ్యతే - చెప్పఁ బడుచున్నది. తత్ - అట్టి అసత్కర్మ, ప్రేత్య - చచ్చిన వెనుక, న - ఫలముకొఱకు సమర్థమైనది కానేరదు. ఇహచ - ఈ లోకమందుఁగూడను, ఫలము కొఱకు సమర్థ మైనది కానేరదు. అనఁగా ననర్థముకొఱకే యగు నని భావము. **28**

---

ఽర్థీయ మథవా యస్యాభిధానత్రయం ప్రకృతం తదర్థీయం యజ్ఞదానతపోర్థీయ మీశ్వరార్థీయ మిత్యేతత్ సది త్యేవాభిధీయతే తదేత ద్యజ్ఞదానతపఆది కర్మ అసాత్త్వికం విగుణ మపి శ్రద్ధాపూర్వకం బ్రహ్మణోఽభిధానత్రయప్రయోగేణ సగుణం సాత్త్వికం సంపాదితం భవతి. **27**

తత్ర చ సర్వత్ర శ్రద్ధాప్రధానతయా సర్వం సంపాద్యతే యస్మాత్తస్మాత్- అశ్రద్ధయేతి. అశ్రద్ధయా హుతం హవనం కృతం, అశ్రద్ధయా దత్తం చ బ్రాహ్మ ణేభ్యః, అశ్రద్ధయా తప స్తప్త మనుష్ఠితం, తథాఽశ్రద్ధయైవ కృతం యత్ స్తుతి

తా:–"ఆహారస్త్వపి సర్వస్య" అను నేడవగీతము "ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః" అను నెనిమిదవ గీతము మొదలధ్యాయపరిసమాప్తి వఱకును భగవానులచేతనే స్వయముగ వ్యాఖ్యానము చేయఁబడినది. 28

ఇది శ్రీవిద్యాశంకర పదమావేశప్రకాశిత జగద్గురు శ్రీకల్యాణానంద భారతీమాంతాచార్య స్వాములవారిచే రచింపఁబడిన గీతామృత తరంగిణియందు సప్తదశతరంగము.

---

నమస్కారాది తత్సర్వ మసది త్యుచ్యతే మత్ప్రాప్తిసాధనమార్గబాహ్యత్వాత్పార్థ! న చ తద్బహ్వాయాస మపి ప్రేత్య ఫలాయ, నో అపీహార్థం సాధుభి ర్నిందితత్వా దితి. 28

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్య పాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః

ఓమ్.

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా.

## అష్టాదశోధ్యాయః

అర్జున ఉవాచ—

సంన్యాసస్య మహాబాహో! తత్త్వ మిచ్ఛామి వేదితుమ్,
త్యాగస్య చ హృషీకేశ! పృథ క్కేశినిషూదన! 1

---

టీ:—మహాబాహో! కేశినిషూదన - కృష్ణా! సంన్యాసస్య - సంన్యాసశబ్దము యొక్క యర్థవిశేషమందలి, తత్త్వం - యాథాత్మ్యమును, త్యాగస్యచ - త్యాగ శబ్దముయొక్క యర్థవిశేషమునందలి తత్త్వమును, పృథక్ - వేఱువేఱుగా, హృషీకేశ! వేదితుమ్ - తెలిసికొనుటకు, ఇచ్ఛామి - కోరుచుంటిని. 1

తా:—కేశినిషూదన యన కేశియను పేరుగల గుఱ్ఱపువేషము వేసికొనిన రాక్షసుని హంత యని యర్థము. పదునాఱవ యధ్యాయముయొక్క యుపసంహారమునందు "జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి" అని శ్రుతిస్మృతి చోదితవిధి ననుసరించి యర్జునునకుఁ గల యధికారవిశేషముచే నాతఁడు ప్రకృతమున యుద్ధము చేయుటకంటెఁ జేయవలసిన కార్యము వేఱొండు లేదని యుపదేశించి యట్లు చేయఁబోవు యుద్ధమును ఫలాభిసంధిరహితముగా జేయుట శ్రేయఃప్రదమని "తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః, దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే

---

సర్వస్యైవ గీతాశాస్త్రస్యార్థోఽస్మి న్నధ్యాయ ఉపసంహృత్య సర్వశ్చ వేదార్థో వక్తవ్య ఇత్యేవమర్థోఽయ మధ్యాయ ఆరభ్యతే, సర్వేషు హ్యతీతే ష్వధ్యాయేషూక్తోఽర్థోఽస్మి న్నధ్యాయేఽవగమ్యతే. అర్జునస్తు సంన్యాసత్యాగశబ్దార్థయో రేవ విశేషం బుభుత్సు రువాచ - సంన్యాసస్యేతి. సంన్యాసశబ్దార్థ స్యే త్యేతత్ హే మహాబాహో! తత్త్వం తస్య భావ స్తత్త్వం యాథాత్మ్య మిత్యేతత్, ఇచ్ఛామి వేదితుం జ్ఞాతుం త్యాగస్య చ త్యాగశబ్దార్థస్యే త్యేతత్ హృషీకేశ! పృథ గితరేతరవిభాగతః కేశినిషూదన! కేశినామా హయచ్ఛద్మాఽసుర స్తం నిషూదితవాన్ భగవాన్ వాసుదేవ స్తేన తన్నామ్నా సంబోధ్యతేఽర్జునేన. 1

శ్రీభగవానువాచ—

కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః,
సర్వకర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. 2

---

మోక్షకాంక్షిభిః" (గీ. 17-25) అని యన్యాపదేశముగా నుపదేశించి యట్టి యుద్ధమును బుష్కలమగు శ్రద్ధతో నాచరింప వలయుననియు నట్లు శ్రద్ధతో నాచరింపకుండిన నయ్యది యసత్కృత్య మగుననియు దానంజేసి యిహపరముల రెంటికిని దూరమగుదువని సూచించుచు "అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తంకృతంచ యత్, అస దిత్యుచ్యతే పార్థ! నచ తత్ప్రేత్య నో ఇహ" (గీ. 17-28) అని చెప్పి పదునేడవ యధ్యాయము ముగింప నర్జునుఁడు తా నేమిచేయుటకు నేమిపలుకుటకు నేమియు నవకాశము చిక్కకపోవుటచేతను, యుద్ధము చేయుటకు నిచ్ఛ జనింపకపోవుటచేతను దాను గావింపఁ దలచుకొనిన పలాయనమునందలి బుద్ధి నింక విడువక యట్టి పలాయనమెద్దియేని యొక తీరున నేకరించుకొనవలయునను తలంపుమీఱ శాస్త్రార్థవిచారమునుండి శబ్దార్థవిచారమునకుఁ గడఁగి పూర్వోత్తర సందర్భములు లేని సంన్యాసత్యాగ శబ్దములయొక్క యర్థవిశేషమును గూర్చి ప్రశ్నించుచున్నాఁడు. ఇట్టి ప్రశ్నసందర్భమును యోజించిన శ్రీకృష్ణభగవానులు పూర్వోపదిష్టములగు విషయములకంటె గ్రొత్తవిశేషములు లేకపోవుటచేఁ దా నిదివఱలోఁ జెప్పిన విషయమునంతయు సంగ్రహముగ నుపన్యసింపఁ బ్రశ్నానుగుణముగ బ్రకరణము నుత్తరగీతముచే నుపక్రమించుచున్నారు. 1

టీ:—కామ్యానాం - అశ్వమేధము మొదలుగాఁ గల యుత్కృష్టఫలములతో నొప్పు, కర్మణాం - కర్మలయొక్క, న్యాసం - పరిత్యాగము అనఁగాఁ జేయ

---

సంన్యాసత్యాగశబ్దౌ తత్ర తత్ర నిర్దిష్టౌ న నిర్లుఠితార్థౌ పూర్వేష్వధ్యాయేషు అతో౽ర్జునాయ పృష్టవతే తన్నిర్ణయాయ భగవా నువాచ - కామ్యానామితి. కామ్యానా మశ్వమేధాదీనాం కర్మణాం న్యాసం పరిత్యాగం సంన్యాసం సంన్యాసశబ్దార్థం అనుష్ఠేయత్వేన ప్రాప్తస్యా౽నుష్ఠానం, కవయః పండితాః కేచిద్విదు ర్విజానన్తి నిత్యనైమిత్తికానా మనుష్ఠీయమానానాం సర్వకర్మణా మాత్మసంబంధితయా ప్రాప్తస్య ఫలస్య పరిత్యాగః సర్వకర్మఫలత్యాగః, తం ప్రాహుః కథయంతి త్యాగం త్యాగశబ్దార్థం విచక్షణాః పండితాః యది కామ్యకర్మ పరిత్యాగః ఫలపరిత్యాగో వా౽ర్థో వక్తవ్యః, సర్వథా పరిత్యాగమాత్రం సంన్యాసత్యాగశబ్దయో రేకో౽ర్థః స్యా న్న ఘటపటశబ్దా వివ జాత్యంతరభూతార్థౌ.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః,
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్య మితి చాపరే. 3

---

కుండుట, సంన్యాసం - సంన్యాసశబ్దమున కర్థమని, కవయః - పండితులు కొందఱు, విదుః - తెలిసికొనుచున్నారు. విచక్షణాః - మఱికొందఱు పండితులు, సర్వకర్మ ఫలత్యాగం - ఆచరింపఁబడినట్టి నిత్యనైమిత్తిక కర్మల ఫలముయొక్క పరిత్యాగ మును, త్యాగం - త్యాగశబ్దార్థముగా, ప్రాహుః - పలుకుచున్నారు. 2

టీ:—ఏకే - మఱికొందఱు, మనీషిణః - విద్వాంసులు, కర్మ - సకలకర్మను, దోషవత్ - దోషములతోఁ గూడినదగుటచే, త్యాజ్యం ఇతి - విడువఁదగినది అని, ప్రాహుః - చెప్పుచున్నారు. అపరేచ - మఱికొందఱు, యజ్ఞ దానతపఃకర్మ - యజ్ఞ రూపమైనట్టియు, దానరూపమైనట్టియు తపో రూపమైనట్టియు కర్మ, న త్యాజ్యమ్ ఇతి - విడువఁదగినదికాదని చెప్పుచున్నారు. 3

తా:—ఈ రెండుగీతములచేత నక్కాలమున బుధులచేఁ దలంపఁబడు నాలు గభిప్రాయములు చెప్పఁబడుచున్నవి. 1 శాస్త్రముచే ననుష్ఠేయము లని విధింపఁ బడుటచేఁ దాఁ జేయవలసిన కామ్యకర్మలను జేయకుండుట. 2 విధింపఁబడిన కర్మల

---

నను నిత్యనైమిత్తికానాం కర్మణాం ఫలమేవ నాస్తి త్యాహుః కథ ముచ్యతే తేషాం ఫలత్యాగః యథా వంధ్యాయాః పుత్రత్యాగః నైవ దోషః; నిత్యానా మపి కర్మణాం భగవతా ఫలవత్త్వస్యేష్టత్వాత్ వక్ష్యతి హి భగవాన్ "అనిష్ట మిష్టం మిశ్రం చ" ఇతి "న తు సంన్యాసినా" మితి చ (గీ. 18-12) సంన్యాసినా మేవ హి కేవలం కర్మఫలాసంబంధం దర్శయ న్నసంన్యాసినాం నిత్యకర్మఫల ప్రాప్తిం "భవ త్యత్యాగినాం ప్రేత్య" (గీ. 18-12) ఇతి దర్శయతి. 2

త్యాజ్యం దోషేతి. త్యాజ్యం త్యక్తవ్యం, దోషవ ద్దోషోఽస్యాస్తీతి దోష వత్ కిం తత్, కర్మ బంధహేతుత్వా త్సర్వమేవ;అథవా దోషో యథా రాగాది స్త్యజ్యతే తథా త్యాజ్య మిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః పండితాః సాంఖ్యాది దృష్టి మాశ్రితాః అధికృతానాం కర్మిణా మపీతి తత్రైవ యజ్ఞదానతపః కర్మ న త్యాజ్య మితి చాపరే.

కర్మిణవ వాధికృతా స్తా నపేక్ష్యైతే వికల్పాః, న తు జ్ఞాననిష్ఠాన్ వ్యుత్థా యినః సంన్యాసినోఽపేక్ష్య "జ్ఞానయోగేన సాంఖ్యానాం నిష్ఠా మయా పురా ప్రోక్తా" (గీ. 3-3) ఇతి కర్మాధికారా దపోద్ధృతా యే, న తాన్ప్రతి చింతా.

నను "కర్మయోగేణ యోగినాం" (గీ. 3-3) ఇత్యధికృతాః పూర్వం విభక్తనిష్ఠా అపీహ సర్వశాస్త్రోపసంహారప్రకరణే యథా విచార్యన్తే తథా సాంఖ్య

నాచరించి వానివలన సంప్రాప్తమగు ఫలమును విడచుట. 3 కర్మ బంధహేతు వగుటంజేసి కర్మయం దధికారము గలిగినవారలుకూడ గర్మల నొనరింపక విరమించుట. 4 కర్మ బంధహేతువగుచు దోషభూయిష్ఠమైనను యజ్ఞదానతపోరూపమగు కర్మ యవశ్యము చేయఁబడవలయును. ఇఁక నుత్తర గ్రంథముచే శ్రీకృష్ణభగవానులు తమయాశయమును వ్యక్తీకరించుచున్నారు. 2-3

అపి జ్ఞాననిష్ఠా విచార్యన్తా మితి న తేషాం మోహదుఃఖనిమిత్తత్యాగానుపపత్తేః న కాయక్లేశనిమిత్తాని దుఃఖాని సాంఖ్యా ఆత్మని పశ్యంతి ఇచ్ఛాదీనాం క్షేత్రధర్మత్వేనైవ దర్శితత్వాత్, అతస్తే న కాయక్లేశదుఃఖభయా త్కర్మ పరిత్యజన్తి నాఽపి తే కర్మా ణ్యాత్మని పశ్యన్తి యేన నియతం కర్మ మోహా త్పరిత్యజేయుః గుణానాం కర్మ "నైవ కించి త్కరోమి" (గీ. 5-8)ఇతి హి తే సంన్యస్యంతి "సర్వకర్మాణి మనసా సంన్యస్య" (గీ. 5-13) ఇత్యాదిభి ర్హి తత్త్వవిదః సంన్యాసప్రకార ఉక్తః తస్మా ద్యేఽన్యేఽధికృతాః కర్మ ణ్యనాత్మవిదో యేషాం చ మోహాత్త్యాగః సంభవతి కాయక్లేశభయా చ్చ, త ఏవ తామసా స్త్యాగినో రాజసా శ్చేతి నిన్ద్యన్తే కర్మిణా మనాత్మజ్ఞానాం కర్మఫలత్యాగస్తుత్యర్థమ్ "సర్వారంభపరిత్యాగీ" (గీ. 12-16) "మౌనీ సంతుష్టో యేన కేనచి దనికేతః స్థిరమతిః" (గీ. 12-19) ఇతి గుణాతీతలక్షణే చ పరమార్థసంన్యాసినో విశేషితత్వాత్ వక్ష్యతి చ "జ్ఞానస్య యా పరా నిష్ఠా" (గీ. 18-5) ఇతి తస్మాత్ జ్ఞాననిష్ఠాః సంన్యాసినో నేహ వివక్షితాః కర్మఫలత్యాగఏవ సాత్త్వికత్వేన గుణేన తామసత్వాద్యపేక్షయా సంన్యాస ఉచ్యతే, న ముఖ్య స్సర్వకర్మసంన్యాసః.

సర్వకర్మసంన్యాసాసంభవే చ "న హి దేహభృతా" (గీ. 18-11) ఇతి హేతువచనా న్ముఖ్యఏవేతి చేత్ న, హేతువచనస్య స్తుత్యర్థత్వాత్ యథా "త్యాగాచ్ఛాన్తి రనంతరం" (గీ 12-12) ఇతి కర్మఫలత్యాగస్తుతి రేవ యథోక్తానేకపక్షానుష్ఠానాశక్తిమంత మర్జున మజ్ఞం ప్రతి విధానాత్; తథేద మపి "న హి దేహభృతా శక్య" మితి (గీ. 18-11) ఇతి కర్మఫలత్యాగస్తుత్యర్థం వచనమ్, న "సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవ కుర్వ న్న కారయ న్నాస్తే" (గీ. 5-13) ఇత్యస్య పక్షస్యాఽపవాదః కేనచి ద్దర్శయితుం శక్యః; తస్మా త్కర్మ ణ్యధికృతాన్ ప్రత్యేవై ష సంన్యాసత్యాగవికల్పః యే తు పరమార్థదర్శిన స్సాంఖ్యా స్తేషాం జ్ఞాననిష్ఠాయా మేవ సర్వకర్మసంన్యాసలక్షణాయా మధికారో నాన్యత్రేతి న తే వికల్పార్హాః తచ్చోపపాదిత మస్మాభిః "వేదాఽవినాశినం" (గీ. 2-21) ఇత్యస్మి న్ప్రదేశే తృతీయాదౌ చ.

నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధః సంప్రకీర్తితః.　　4

యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్.　　5

---

టీ:—పురుషవ్యాఘ్ర - పురుష శ్రేష్ఠుఁడవగు, భరతసత్తమ - అర్జునా! తత్ర - ఆ పూర్వోక్త వికల్పములందలి, త్యాగే - త్యాగశబ్దార్థము విషయమై, మే - నాయొక్క, నిశ్చయం - నిర్ణీతమగు నభిప్రాయమును, శృణు - వినుము. త్యాగో హి - త్యాగముకూడ, త్రివిధః - పూర్వాధ్యాయమున వర్ణింపఁబడిన శ్రద్ధాదులవలె మూఁడు విధములుగా, సంప్రకీర్తితః - చెప్పఁబడినది.　　4

టీ:—యజ్ఞః - యాగము, దానం - దానము, తపః - తపస్సు అను మూడు విధములగు, కర్మ - కర్మము, న త్యాజ్యం - విడువఁదగినది కాదు. తత్ - ఆకర్మ, కార్యం ఏవ - తప్పక చేయఁదగినదియే. యజ్ఞః దానం తపఃచ - యజ్ఞదానతపస్సులు మూఁడును, మనీషిణాం - ఫలాభిసంధివర్జితులకు, పావనాని ఏవ - చిత్తశుద్ధిహేతువు లగుచున్నవి.　　5

---

తత్రైతేషు వికల్పభేదేషు - నిశ్చయ మితి. నిశ్చయం శృణ్వవధారయ మే మమ వచనాత్; తత్ర త్యాగే త్యాగసంన్యాసవికల్పే యథాదర్శితే భరతసత్తమ! భరతానాం సాధుతమ!, త్యాగో హి త్యాగసంన్యాసశబ్దవాచ్యో హి యోఽర్థ స్స ఏకఏవే త్యభిప్రేత్యాహ - త్యాగో హీతి. పురుషవ్యాఘ్ర! త్రివిధ స్త్రిప్రకార స్తామసాదిప్రకారైః సంప్రకీర్తితః శాస్త్రేషు సమ్యక్కథితః యస్మా త్తామసాదిభేదేన త్యాగసంన్యాసశబ్దవాచ్యోఽర్థోఽధికృతస్య కర్మిణోఽనాత్మజ్ఞస్య త్రివిధ స్సంభవతి, న పరమార్థదర్శిన ఇత్యయ మర్థో దుర్జ్ఞానః; తస్మా దత్ర తత్త్వం నాన్యో వక్తుం సమర్థః. తస్మా న్నిశ్చయం పరమార్థశాస్త్రార్థవిషయ మధ్యవసాయ మైశ్వరం మే మత్తః శృణు.　　4

కః పున రసౌ నిశ్చయ ఇత్యత ఆహ - యజ్ఞ ఇతి. యజ్ఞో దానం తప ఇత్యేతత్ త్రివిధం కర్మ న త్యాజ్యం న త్యక్తవ్యం, కార్యం కరణీయమేవ తత్; కస్మాత్? యజ్ఞో దానం తపశ్చైవ పావనాని విశుద్ధికరాణి మనీషిణాం ఫలానభిసంధీనామిత్యేతత్.　　5

ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్. 6

---

టీ: ఏతాని - ఈ, కర్మాణ్యపి తు - కర్మలుగూడ, సంగం - అభినివేశమును, ఫలానిచ - ఫలములును, త్యక్త్వా - విడచి, కర్తవ్యాని ఇతి - చేయఁబడవలయునని, పార్థ! మే - నాయొక్క, నిశ్చితమ్ - నిర్ణయము చేయఁబడిన, ఉత్తమం - శ్రేష్ఠమగు, మతం - అభిప్రాయము. 6

తా:- ఇట్టి యభిప్రాయ మర్జునుని గూర్చియుఁ దత్సజాతీయాంతఃకరణము స్వభావము గలవారలగూర్చియు నుపదేశింపఁబడినదిగాఁ దెలియునది. 6

---

ఏతాన్యపిత్వితి. ఏతాన్యపి తు కర్మాణి యజ్ఞదానతపాంసి పావనా న్యుక్తాని సంగ మాసక్తిం తేషు త్యక్త్వా ఫలాని చ తేషాం పరిత్యజ్య కర్తవ్యానీ త్యనుష్ఠేయానీతి మే మమ నిశ్చితం మత ముత్తమమ్.

"నిశ్చయం శృణు మే తత్ర" (గీ. 18-4) ఇతి ప్రతిజ్ఞాయ పావనత్వం చ హేతు ముక్త్వా "ఏతాన్యపి చ కర్మాణి కర్తవ్యానీ" త్యేతత్ "నిశ్చితం మత ముత్తమ" మితి ప్రతిజ్ఞాతార్థోపసంహార ఏవ నాఽపూర్వార్థం వచనం "ఏతాన్యపీతి" ప్రకృతసంనికృష్టార్థత్వోపపత్తేః సాసంగస్య ఫలార్థినో బంధహేతవ ఏతాన్యపి కర్మాణి ముముక్షోః కర్తవ్యానీ త్యపిశబ్దస్యార్థో న త్వన్యాని కర్మాణ్యపేక్ష్యైతా న్యపీ త్యుచ్యతే.

అన్యే తు వర్ణయంతి నిత్యానాం కర్మణాం ఫలాభావాత్ "సంగం త్యక్త్వా ఫలాని చే"తి నోపపద్యతే; అత 'ఏతాన్యపీతి' యాని కామ్యాని కర్మాణి నిత్యేభ్యోఽన్యాని, ఏతాన్యపి కర్తవ్యాని కిముత యజ్ఞదానతపాంసి నిత్యానీతి తదసత్, నిత్యానామపి కర్మణా మిహ ఫలవత్త్వస్యోపపాదితత్వాత్ 'యజ్ఞో దానం తపశ్చైవ పావనాని' (గీ. 18-5) ఇత్యాదివచనేన నిత్యాన్యపి కర్మాణి బంధహేతుత్వాశంకయా జిహాసో ర్ముముక్షోః కుతః కామ్యేషు ప్రసంగః? "దూరేణ హ్యవరం కర్మ" [గీ. 2-39] ఇతి చ నిందితత్వాత్, "యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర" (గీ. 3-9) ఇతి చ కామ్యకర్మణాం బంధహేతుత్వస్య నిశ్చితత్వాత్ "త్రైగుణ్యవిషయా వేదాః" (గీ. 2-45) "త్రైవిద్యా మాం సోమపాః" (గీ. 9-20) "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" (గీ 9-21) ఇతి చ దూరవ్యవహితత్వాచ్చ న కామ్యేషు "ఏతాన్యపీ"తి వ్యపదేశః. 6

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. 7

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. 8

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః. 9

---

టీ:—నియతస్య - నిత్యమైన, కర్మణఃతు - కర్మయొక్క, సంన్యాసః - పరిత్యాగము, న ఉపపద్యతే - అజ్ఞుల కెంతమాత్రమును యుక్తముగాదు. మోహాత్ - అజ్ఞానమువలన, తస్య - ఆ, కర్మణః - కర్మయొక్క, పరిత్యాగః - విడచుట, తామసః - తమోగుణజన్యమగు త్యాగమని, పరికీర్తితః - చెప్పఁబడుచున్నది. 7

టీ:—యత్ - ఏ, కర్మ - కర్మను, కాయక్లేశభయాత్ - శరీరాయాసము గలుగు ననుభయముచే, దుఃఖం ఇతి ఏవ - దుఃఖస్వరూపమే యని, త్యజేత్ - విడచుచున్నాఁడో, సః - అట్టివాఁడు, రాజసం - రజోగుణ సంబంధమగు, త్యాగం - త్యాగమును, కృత్వా - చేసి, త్యాగఫలం - త్యాగముయొక్క ప్రయోజనమును, న లభేత్ ఏవ - ఎంతమాత్రమును బొందఁడు. 8

తా:—ఈ రెండు గీతములచేతను దామసరాజస త్యాగముల స్వరూపము వివరింపఁబడుచున్నది. 8

టీ:— అర్జునా! యత్ - ఏ, నియతం - నిత్యమగు, కర్మ - కర్మ కలదో, తత్ - అది, కార్యం, ఇతిఏవ - చేయఁదగినదియేయని, సంగం - అభినివేశమును,

---

తస్మా దజ్ఞస్యాధికృతస్య ముముక్షోః - నియతస్యేతి. నియతస్య తు నిత్యస్య సంన్యాసః పరిత్యాగః కర్మణో నోపపద్యతేఽజ్ఞస్య పావనత్వస్యేష్టత్వాత్ మోహాదజ్ఞానా త్తస్య నియతస్య పరిత్యాగః నియతం చాఽవశ్యం కర్తవ్యం త్యజ్యతే చేతి విప్రతిషిద్ధమ్; అతో మోహనిమిత్తః పరిత్యాగః తామసః పరికీర్తితో మోహాశ్చ తమ ఇతి. 7

కించ - దుఃఖ మితి. దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా చ్ఛరీర దుఃఖభయా త్త్యజే త్పరిత్యజేత్ స కృత్వా రాజసం రజోనిర్వర్త్యం త్యాగం నైవ త్యాగఫలం జ్ఞానపూర్వకస్య సర్వకర్మత్యాగస్య ఫలం మోక్షాఖ్యం న లభే నైవ లభేత. 8

కః పున స్సాత్త్విక స్త్యాగ ఇత్యాహ కార్య మితి కార్యం కర్తవ్య మిత్యేవ యత్కర్మ నియతం నిత్యం క్రియతే నిర్వర్త్యతే హే అర్జున! సంగం త్యక్త్వా

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నాఽనుషజ్యతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛ్ఛిన్నసంశయః. 10

---

ఫలంచ - ఫలమును, త్యక్త్వా ఏవ - విడచియే, క్రియతే - చేయఁబడుచున్నది. సః-అట్టి, త్యాగః - త్యాగము, సాత్త్వికః - సాత్త్వికమని, మతః - తలఁపఁ బడుచున్నది. 9

టీ:—ఛిన్నసంశయః - పోయిన సంశయములు గలిగినట్టియు, మేధావీ - విద్వాంసుఁ డైనట్టియు, సత్త్వసమావిష్టః - ఆత్మానాత్మ వివేకజ్ఞానముతో నొప్పుచున్నట్టియు, త్యాగీ - ఫలాభిసంధిరహితముగా నిత్యకర్మానుష్ఠాన మొనర్చు

---

ఫలం చైవ ఏత న్నిత్యానాం కర్మణాం ఫలవత్త్వే భగవద్వచనం ప్రమాణ మవోచామ, అథవా యద్యపి ఫలం న శ్రూయతే నిత్యస్య కర్మణ స్తథాపి నిత్యం కర్మ కృత మాత్మసంస్కారం ప్రత్యవాయపరిహారం వా ఫలం కరో త్యాత్మన ఇతి కల్పయ త్యేవాజ్ఞః; తత్రి తా మపి కల్పనాం నివారయతి 'ఫలం త్యక్త్వా' ఇత్యనేన; అతః సాధూక్తం 'సంగం త్యక్త్వా ఫలం చే'తి. స త్యాగో నిత్య కర్మసు సంగఫలపరిత్యాగః సాత్త్విక స్సత్త్వనిర్వృత్తో మతోఽభిప్రేతః.

నను కర్మపరిత్యాగ స్త్రివిధ స్సంన్యాస ఇతి చ ప్రకృతః, తత్రి తామసో రాజస శ్చోక్త స్త్యాగః కథ మిహ సంగఫలత్యాగ స్తృతీయత్వేనోచ్యతే యథా త్రయో బ్రాహ్మణా ఆగతాః తత్రి షడంగవిదౌ ద్వౌ, క్షత్రియ స్తృతీయ ఇతి తద్వత్ నైష దోషః, త్యాగసామాన్యేన స్తుత్యర్థత్వాత్; అస్తి హి కర్మసంన్యాసస్య ఫలాభిసంధిత్యాగస్య చ త్యాగత్వసామాన్యమ్; తత్రి రాజసా స్తామసత్వేన కర్మ త్యాగనిందయా కర్మఫలాభిసంధిత్యాగః సాత్త్వికత్వేన స్తూయతే "స త్యాగ స్సాత్త్వికో మత" ఇతి. 9

య స్త్వధికృతః సంగం త్యక్త్వా ఫలాభిసంధిం చ నిత్యం కర్మ కరోతి తస్య ఫలరాగాదినాఽకలుషీక్రియమాణ మంతఃకరణం నిత్యై శ్చ కర్మభి స్సంస్క్రియమాణం విశుధ్యతి విశుద్ధం ప్రసన్న మాత్మాలోచనక్షమం భవతి, తస్యైవ నిత్య కర్మానుష్ఠానేన విశుద్ధాంతఃకరణ స్యాత్మజ్ఞానాభిముఖస్య క్రమేణ యథా తన్నిష్ఠా స్యా త్తద్వక్తవ్య మిత్యాహ - న ద్వేష్టీతి. న ద్వేష్ట్యకుశల మశోభనం కామ్యం కర్మ శరీరారంభద్వారేణ సంసారకారణం కి మనేనే త్యేవమ్ కుశలే శోభనే నిత్యే కర్మణి సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తి తన్నిష్ఠాహేతుత్వేన "మోక్షకారణ మిద" మిత్యేవం నానుషజ్యతేఽనుషంగం ప్రీతిం న కరోతీత్యేతత్; కః పున రసౌ త్యాగీ పూర్వోక్తేన సంగఫలత్యాగేన తద్వాం స్త్యాగీ, యః కర్మణి సంగం త్యక్త్వా

న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే. 11

---

వాఁడు, అకుశలం - అమంగళమగు, కర్మ - కామ్యకర్మను, నద్వేష్టి - ద్వేషింపడు. కుశలే - శోభనమగు నిత్యకర్మయందు, న అనుషజ్యతే - సక్తతను జెందఁడు. అనఁగా ఫలము నపేక్షింపఁడు. 10

టీ:- దేహభృతా - దేహధారిచే ననఁగా దేహమే యాత్మ యను నభిమానము గలవానిచే, కర్మాణి - కర్మలు, అశేషతః - పుష్కలముగా, త్యక్తుం- విడుచుటకు, న శక్యంహి - ఎంతమాత్రము సమర్థము కాదుగదా! యః తు - ఎవ్వఁడు, కర్మ ఫలత్యాగీ- నిత్యకర్మల ఫలము నపేక్షింపకయే కర్మల నొనర్చునో, సః - అట్టివాఁడు త్యాగీ ఇతి - త్యాగియని, అభిధీయతే - చెప్పఁబడుచున్నాఁడు.

తా:- దేహధారియనఁగా దేహేంద్రియ మనోబుద్ధులందు నేననియు నావి యనియు అభిమానమును వహించుటయే యనఁగా వర్ణాశ్రమ వయోవిశేషంబులతోఁ దాదాత్మ్యాభిమానమును జెందుటయే దేహధారిత్వ మనఁబడు చున్నది. వర్ణాశ్రమ వయోఽవస్థా విశేషములందుఁ దాదాత్మ్యాభిమానము లేని వానికి నెట్టి

---

కర్మ తత్ఫలం చ నిత్యకర్మానుష్ఠాయీ స త్యాగీ కదా పున రసా వకుశలం కర్మ న ద్వేష్టి కుశలే చ నానుషజ్యత ఇతి ఉచ్యతే; సత్త్వసమావిష్టో యదా సత్త్వేనాత్మానాత్మ వివేకవిజ్ఞానహేతునా సమావిష్ట స్సంవ్యాప్తః సంయుక్త ఇత్యేతత్ అత ఏవచ మేధావీ మేధయాఽఽత్మజ్ఞానలక్షణయా ప్రజ్ఞయా సంయుక్త స్తద్వాన్ మేధావీ మేధావిత్వాదేవ ఛిన్నసంశయః, ఛిన్నోఽవిద్యాకృతః సంశయో యస్య 'ఆత్మస్వరూపావస్థానమేవ పరం నిఃశ్రేయససాధనం నాన్య త్కించి ది' త్యేవం నిశ్చయేన ఛిన్నసంశయః, యోఽధికృతః పురుషః పూర్వోక్తేన ప్రకారేణ కర్మ యోగానుష్ఠానేన క్రమేణ సంస్కృతాత్మాసన్ జన్మాదివిక్రియారహితత్వేన నిష్క్రియ మాత్మాన మాత్మత్వేన సంబుద్ధః స సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవ కుర్వ న్న కారయ న్నాసీనో నైష్కర్మ్యలక్షణాం జ్ఞాననిష్ఠా మశ్నుతే ఇత్యేత త్పూర్వోక్తస్య కర్మయోగస్య ప్రయోజన మనేన శ్లోకేనోక్తమ్. 10

యః పున రధికృతస్సన్ దేహాత్మాభిమానిత్వేన దేహభృ దజ్ఞోఽబాధితాత్మ కర్తృత్వవిజ్ఞానతయా ఽహంకర్తేతి నిశ్చితబుద్ధి స్తస్యాఽశేషకర్మపరిత్యాగ స్యాఽశక్యత్వా త్కర్మఫలత్యాగేన చోదితకర్మానుష్ఠాన ఏవాఽధికారో న తత్త్యాగ ఇత్యేత మర్థం దర్శయితుమాహ న హీతి. న హి యస్మా ద్దేహభృతా దేహం బిభర్తీతి దేహభృత్ దేహాత్మాభిమానవాన్ దేహభృ దుచ్యతే, న హి

అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్. 12

---

కర్మ యును సంభవింపనేరదు. సకలకర్మలును వర్ణాశ్రమ వయోఽవస్థావిశేషంబులు ప్రధానంబుగాఁ గలిగియే ప్రవర్తించుచున్నవి. సకలవిశేషంబులును దేహాభిమానపురస్సరంబులు, దేహాభిమానము లేనిచో విశేషాభిమానము గలుగదు. విశేషాభిమానము లేనిచో తజ్జన్యమగు కర్మ గలుగనేరదు. అట్టివానికి సర్వకర్మసంన్యాసము స్వాభావిక మగుచున్నది. యద్విధమగు దేహాభిమాన ముండినను దదనుగుణంబగు విశేషాభిమానము గల్గును. దానంజేసి తదనుగుణంబుగ కర్మలు ఘటించును. కావున నొకానొకఁడు లోకదృష్టి ననుసరించి మంచికర్మనుగాని చెడుకర్మనుగాని చేసిన నయ్యది యంతయు నెద్దియో యొక దేహాభిమానముచేఁ బ్రవర్తించెనని చెప్పితీఱవలయును. అట్టి యాశయము తోడనే దేహభృత్తు కర్మలను బుష్కలముగ విడువఁగూడదని తెలియునది. 11

టీ:—కర్మణః - కర్మయొక్క, ఫలం - ప్రయోజనము, అనిష్టం - నరకతిర్యగాది లక్షణమనియును, ఇష్టం - దేవాదిలక్షణ మనియును, మిశ్రంచ - ఇష్టానిష్టసంయుక్తమగు మనుష్యలక్షణమని, త్రివిధమ్- మూఁడువిధములు. అట్టి కర్మఫలము, అత్యాగినాం - త్యాగశూన్యులైన కర్మకారులకు, ప్రేత్య - చచ్చినవెనుక, భవతి - కలుగును, సంన్యాసినాంతు - పరమార్థమగు సంన్యాసమును గావించినవారలకన్ననో, ప్రేత్య - శరీరపాతానంతరము, క్వచిత్ - ఎంతమాత్రము, న - కలుగదు. 12

---

వివేకీ, స హి "వేదావినాశినం" (గీ. 2-21) ఇత్యాదినా కర్తృత్వాధికారా న్నివర్తితః అత స్తేన దేహభృతాఽజ్ఞేన న శక్యం త్యక్తుం సంన్యసితుం కర్మాణ్యశేషతో నిశ్శేషేణ తస్మా ద్య స్త్వజ్ఞోఽధికృతో నిత్యాని కర్మాణి కుర్వన్ కర్మఫలత్యాగీ కర్మఫలాభిసంధిమాత్రసంన్యాసీ చ త్యాగీ త్యభిధీయతే కర్మ్యపి సన్నితి స్తుత్యభిప్రాయేణ; తస్మా త్పరమార్థదర్శినైవ దేహభృతా దేహాత్మభావరహితేనాఽశేషకర్మసంన్యాస శ్శక్యతే కర్తుమ్. 11

కిం పున స్తత్ప్రయోజనం య త్సర్వకర్మసంన్యాసా త్స్యాది త్యుచ్యతే- అనిష్ట మితి. అనిష్టం నరకతిర్యగాదిలక్షణం, ఇష్టం దేవాదిలక్షణం, మిశ్ర మిష్టానిష్టసంయుక్తం మనుష్యలక్షణం చ, ఏవం త్రివిధం త్రిప్రకారం కర్మణః ధర్మాధర్మలక్షణస్య ఫలం బాహ్యానేకకారకవ్యాపారనిష్పన్నం స దవిద్యాకృత మింద్రజాలమాయోపమం మహామోహాకరం ప్రత్యగాత్మోపసర్పీవ ఫల్గుతయా లయ

పంచైతాని మహాబాహో! కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. 13

---

తా:- ఈలోకమునందుఁ గర్మల నాచరించినవారలకు వారివారి కర్మల కనుగుణముగ మరణానంతరమున ఫలము గల్గుచుండును. అయ్యది మూఁడువిధములు. సత్కర్మానుష్ఠానమువలన దేవాది శరీరప్రాప్తియు, దుష్కర్మానుష్ఠానమువలన నారక తిర్యక్ స్థావరశరీరములును, పుణ్యాపుణ్య మిశ్రితమగు కర్మవలన మనుష్యశరీర ప్రాప్తియును కర్మానుగుణముగ శరీరములు పరమేశ్వరునిచేఁ బొందింపఁబడును. అను నభిప్రాయము "చాతుర్వర్ణ్యం" (గీ.4-13) అను గీతమందు యోజింపఁబడి యున్నది. పుణ్యపాప మిశ్రకర్మకు ఫలముగాఁ జెప్పఁబడిన మనుష్యశరీరములు శ్రుతి స్మృతి విహితమగు కర్మయందు నధికారయోగ్యములగు బ్రాహ్మణాది శరీరములని చెప్పఁబడుచున్నవి. కేవల పాపకర్మకు ఫలముగాఁ జెప్పఁబడిన నారకతిర్యక్ స్థావరాది శరీరములలో వినఁబడు నారకశరీరములు కర్మానధికారశరీరములు. అట్టి శరీరములతోఁగూడిన మనుష్య సమూహములే యస్పృశ్యు లనియును దస్యు లనియును మన్వాదిస్మృతులయందుఁ జెప్పఁబడినవి. 12

టీ:- మహాబాహో! కృతాంతే - నిశ్చయింపఁబడిన, సాంఖ్యే - జ్ఞానమందు, అనఁగా వేదాంతమందు, సర్వకర్మణాం - సమస్తకర్మల యొక్కయు, సిద్ధయే - నివృత్తికొఱకు, ఏతాని - ఈముందు చెప్పఁబోవు, పంచ - ఐదగు, కారణాని - కారణములు, ప్రోక్తాని - చెప్పఁబడినవి. మే - నావలన, నిబోధ - తెలిసికొనుమా. 13

---

మదర్శనం గచ్ఛతీతి ఫలనిర్వచనం, తదేత దేవంలక్షణం ఫలం భవత్యత్యాగినా మజ్ఞానాం కర్మణా మపరమార్థసంన్యాసినాం ప్రేత్య శరీరపాతా దూర్ధ్వమ్ న తు సంన్యాసినాం పరమార్థసంన్యాసినాం పరమహంసపరివ్రాజకానాం కేవలజ్ఞాన నిష్ఠానాం క్వచిత్ న హి కేవలసమ్యగ్దర్శననిష్ఠాఽవిద్యాదిసంసారబీజం నోన్మూల యతి కదాచి దిత్యర్థః. అతః పరమార్థదర్శిన ఏవాఽశేషకర్మసంన్యాసిత్వం సంభవతి; అవిద్యాధ్యారోపితత్వా దాత్మని క్రియాకారకఫలానాం, న త్వజ్ఞ స్యాధిష్ఠానాదీని క్రియాకర్తృకారకా ణ్యాత్మత్వేనైవ పశ్యతోఽశేషకర్మసంన్యాస స్సంభవతి. 12

తదేత దుత్తరై శ్శ్లోకై ర్దర్శయతి - పంచేతి. పంచైతాని వక్ష్యమాణాని హే మహాబాహో! కారణాని నిర్వర్తకాని నిబోధ మే మమే త్యుత్తరత్ర చేత స్సమాధానార్థం వస్తువైషమ్యప్రదర్శనార్థం చ తాని చ కారణాని జ్ఞాతవ్యతయా స్తౌతి, సాంఖ్యే జ్ఞాతవ్యాః పదార్థాః సంఖ్యాయ న్తే యస్మిన్ శాస్త్రే తత్సాంఖ్యం వేదాంతః, కృతాంతే ఇతి తస్యైవ విశేషణమ్, కృత మితి కర్మోచ్యతే, తస్యాఽంతః

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్ చేష్టా దైవం చైవాఽత్ర పంచమమ్. 14

శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. 15

---

టీ:—అధిష్ఠానం - ఇచ్ఛ ద్వేషము సుఖము దుఃఖము జ్ఞానము మొదలుగాఁ గల గుణములయొక్క యభివ్యక్తికి నాధారభూతమగు శరీరమును, తథా - ఆ తీరుననే, కర్తా- ఉపాధి స్వరూపముగాఁ గల భోక్తయు, పృథగ్విధం - నానాప్రకారములనఁగా బండ్రెండు విధములగు, కరణంచ - శబ్దాదులయొక్క యుపలబ్ధి కొఱకును, ఉక్త్యాదులయొక్క నిర్వర్తనమునకును దగు సాధనములగు జ్ఞానేంద్రియ పంచకము మనోబుద్ధులు, వివిధాః - అనేక విధములగు, పృథక్ చేష్టాః చ - వాయవ్యములగు ప్రాణాపానాది వ్యాపారములును, అత్ర - ఈ నాలుగింటి యందును, పంచమం - ఐదవదియు, దైవంచ ఏవ - దేవతా సంబంధమును, 14

టీ:—నరః - మనుజుఁడు, శరీరవాఙ్మనోభిః - త్రికరణము లనఁబడు శరీరము వాక్కు మనస్సులచే, న్యాయ్యం వా - శ్రుతిస్మృతిచోదితమైనట్టిగాని, విపరీతంవా - తద్విరుద్ధములగు ప్రతిషిద్ధములఁ గాని, యత్ - ఎట్టి, కర్మ - కర్మను, ప్రారభతే - ఆరంభించుచున్నాఁడో, తస్య - ఆ కర్మయొక్క నిష్పత్తికి, ఏతే - ఈ చెప్పఁబడిన యధిష్ఠానాదులు, పంచ - అయిదును, హేతవః - కారణములే.

---

పరిసమాప్తిర్యత్ర స కృతాంతః కర్మాంత ఇత్యేతత్ 'యావా నర్థ ఉదపానే' (గీ. 2-46) "సర్వం కర్మాఽఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే" (గీ. 4-33) ఇత్యాత్మజ్ఞానే సంజాతే సర్వకర్మణాం నివృత్తిం దర్శయతి, అత స్తస్మి న్నాత్మజ్ఞానార్థే సాంఖ్యే, కృతాంతే వేదాంతే ప్రోక్తాని కథితాని సిద్ధయే నిష్పత్త్యర్థం సర్వకర్మణామ్. 13

కాని తానీ త్యుచ్యతే - అధిష్ఠాన మితి. అధిష్ఠాన మిచ్ఛాద్వేషసుఖదుఃఖజ్ఞానాదీనా మభివ్యక్తే రాశ్రయోఽధిష్ఠానం శరీరం తథా కర్తా, ఉపాధిలక్షణో భోక్తా కరణం చ శ్రోత్రాదికం శబ్దాద్యుపలబ్ధయే పృథగ్విధం నానాప్రకారం తద్ద్వాదశసంఖ్యం, వివిధా శ్చ పృథక్చేష్టా వాయవీయాః ప్రాణాపానాద్యాః, దైవం చైవ దైవమేవ చాఽత్ర ఏతేషు చతుర్షు పంచమం పంచానాం పూరణ మాదిత్యాది చక్షురాద్యనుగ్రాహకమ్. 14

శరీరేతి. శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ త్రిభి రేతైః ప్రారభతే నిర్వర్తయతి నరో, న్యాయ్యం వా ధర్మ్యం శాస్త్రీయం, విపరీతం వాఽశాస్త్రీయ మధర్మ్యమ్

తత్రైవంసతి కర్తార మాత్మానం కేవలం తు యః,
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః. 16

---

తా:—లోకములో మనుజునిచేఁ జేయఁబడు కర్మలు మానసికములనియు, వాచికములనియుఁ గాయికములనియు మూఁడు విధములు. ఈ మూఁడువిధములగు కర్మలు మరల న్యాయములనియు నన్యాయములనియు రెండు విధములు. అందు న్యాయము లనఁగా శ్రుతిస్మృతులచే నుపదేశింపఁబడి సదాచారమునందు వ్యవహారమును గనుచున్నవి. అన్యాయము లనఁగా శ్రుతిస్మృతులచే నుపదేశింపఁబడనట్టియు, శ్రుతిస్మృతులచే నిషేధింపఁబడినట్టియు సత్పురుషులచే నిందింపఁ బడునట్టియు కర్మలు. ఈ కర్మలలో నెట్టి కర్మను మనుజుఁ డాచరింపవలసి వచ్చినను బైని చెప్పఁబడిన యైదు కారణములు సమావేశమైన గాని కర్మ ప్రారంభింపబడి పరిసమాప్తి నొందింపఁ బడదు. అందు "దైవం చైవాఽత్ర పంచమమ్" అని దేవతాసంబంధమును బ్రత్యేకముగా సంఖ్యచే సంకీర్తనము చేయుటచే నితరములగు నాల్గు కారణములకంటెను దైవమను కారణము బలవత్తర మని సూచింపఁబడుచున్నది. ఇచట దైవ మనఁగా దేహేంద్రియమనోబుద్ధిప్రాణములలోఁ బ్రత్యేకప్రత్యేకముగా నొక్కొకదానికి నొక్కొక్కదేవతావిశేషముతో సంబంధము నద్దానియొక్క యనుగ్రహవిశేషము నావశ్యకమై యున్నది. అట్టి దేవతానుగ్రహము లేనిచో దేహేంద్రియమనోబుద్ధిప్రాణములు తమ తమ నియతకారణములను సక్రమముగాఁ జేయఁజాలవు. దానంజేసి దైవము బలవత్తరమగు కారణ మని ప్రత్యేకముగా నిర్ణయింపఁబడుచున్నది. 15

టీ:—తత్ర - ప్రకృతమగు కర్మనిష్పత్తియందు, ఏవంసతి - పైన జెప్పఁబడిన యైదు కారణములు నిశ్చయముగాఁ దెలియఁబడుచుండ, యః - ఏమను

---

యచ్చాపి నిమిషితచేష్టితాదిజీవనహేతు స్తదపి పూర్వకృతధర్మాధర్మయోరేవ కార్య మితి న్యాయ్యవిపరీతయోరేవ గ్రహణేన గృహీతమ్ పంచైతే యథోక్తా స్తస్య సర్వస్యైవ కర్మణో హేతవః కారణాని.

నన్వేతా న్యధిష్ఠానాదీని సర్వకర్మణాం నిర్వర్తకాని కథ ముచ్యతే శరీరవాఙ్మనోభిః కర్మ ప్రారభతే ఇతి నైష దోషః, విధిప్రతిషేధలక్షణం సర్వం కర్మ శరీరాదిత్రయప్రధానం తదంగతయా దర్శనశ్రవణాది చ జీవనలక్షణం త్రిధైవ రాశీకృత ముచ్యతే శరీరాదిభి రారభ్యత ఇతి ఫలకాలేఽపి తత్ప్రధానై స్సాధనై ర్భుజ్యతే ఇతి పంచానామేవ హేతుత్వం న విరుధ్యతే. 15

తత్రేతి. తత్రేతి ప్రకృతేన సంబధ్యతే ఏవంసతి ఏవం యథోక్తైః పంచభి ర్హేతుభి ర్నిర్వర్త్యే సతి కర్మణి తత్రైవంసతీతి దుర్మతిత్వస్య హేతుత్వేన సంబధ్య

యస్య నాఽహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాం ల్లోకా న్న హంతి న నిబధ్యతే. 17

---

జుఁడు, కేవలం ఆత్మానం - ఒక్కతననే, కర్తారం తు - కార్యనిర్వాహకుఁడగు కర్తగా, పశ్యతి - తలఁచుచున్నాడో, సః - అట్టి, దుర్మతిః - దుష్టబుద్ధి, అకృత బుద్ధిత్వాత్ - శాస్త్రాచార్యోపదేశముచే సంస్కరింపఁబడిన యంతఃకరణము లేనివాఁడగుటచే, న పశ్యతి - పరమార్థము నెంతమాత్రమును దెలిసికొననేఱఁడు. 16

ఈగీతము "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితిమన్యతే. (గీ.3-27.)
అను గీతముయొక్క యనువాదము.

టీ:—యస్య - ఎవనియొక్క, అహంకృతః - అహంకారముచేఁ గల్గు, భావః - కర్తృత్వ భోక్తృత్వములు, న - లేవో అనఁగా నుపరమించునో, యస్య - ఎవనియొక్క, బుద్ధిః - అంతఃకరణము, న లిప్యతే - విషయలిప్సచేఁ గలుషీకృతము కాదో, సః - అట్టి విద్వాంసుఁడు, ఇమాన్ - ఈ పరిదృశ్యమానములగు, లోకాన్ - ప్రాణులను, హత్వాపి - చంపియు, న హంతి - చంపడు, న నిబధ్యతే - కర్మచేఁ గూడ బంధింపఁబడఁడు. 17

---

తే తత్రైతే ష్వా త్మానన్య త్వేనావిద్యయా పరికల్పితైః, క్రియమాణస్య కర్మణోఽహమేవ కర్తేతి కర్తార మాత్మానం కేవలం శుద్ధం తు యః పశ్య త్యవిద్వాన్ కస్మాత్ ? వేదాంతాచార్యోపదేశన్యాయై రకృతబుద్ధిత్వా దసంస్కృతబుద్ధిత్వాత్; యోఽపి దేహాదివ్యతిరిక్తాత్మవాదీ ఆత్మానమేవ కేవల కర్తారం పశ్యతి, అసావ ప్యకృతబుద్ధిః, అతోఽకృతబుద్ధిత్వా న్న స పశ్య త్యాత్మన స్త త్త్వం కర్మణో వేత్యర్థః. అతః దుర్మతిః కుత్సితా విపరీతా దుష్టాఽజస్రం జననమరణప్రతిపత్తి హేతుభూతా మతి రస్యేతి దుర్మతిః స పశ్యన్నపి న పశ్యతి యథా తైమిరికోఽనేకం చంద్రం, యథా వాఽభ్రేషు ధావత్సు చంద్రం ధావంతం, యథా వా వాహనే ఉపవిష్టోఽన్యేషు ధావ త్స్వాత్మానం ధావంతమ్. 16

కః పున స్సుమతి ర్యః సమ్య క్పశ్యతీ త్యుచ్యతే - యస్యేతి. యస్య శాస్త్రాచార్యోపదేశన్యాయసంస్కృతాత్మనో న భవ త్యహంకృతోఽహంక ర్తే త్యేవం లక్షణో భావో భావనాప్రత్యయః ఏతఏవ పంచాధిష్ఠానాద యోఽవిద్యయాఽఽత్మని కల్పితా స్సర్వకర్మణాం కర్తారో నాహం, అహం తు తద్వ్యాపారాణాం సాక్షీభూతః "అప్రాణో హ్యమనాః శుభ్రోఽక్షరా త్పరతః పరః" (ముం. 2-1-2) కేవలోఽవిక్రియ ఇత్యేవం పశ్యతీ త్యేతత్, బుద్ధి రంతఃకరణం యస్యాత్మన ఉపా

తా:—ఇందలి యభిప్రాయము పారమార్థిక విషయముతో సంబంధించి వ్యవహారాతీత మగుచున్నది. ఏతద్విషయము "య ఏనం వేత్తి హంతారం"(గీ.2-19) "న జాయతే మ్రియతే వా" (గీ.2-20). "వేదావినాశినం నిత్యం" (గీ.2-21). "యదృచ్ఛాలాభసంతుష్టః" (గీ.4-22). "గతసంగస్య ముక్తస్య" (గీ.4-23). ఈమొదలుగాఁ గల గీతములచేఁ బుష్కలముగా నిరూపింపఁబడియున్నది. సజాతీయవిజాతీయస్వగతభేదరహిత మగు నాత్మను దనస్వరూపముగాఁ దెలిసికొన్న వాఁడు చేయుకృత్య మనునదియే లేకపోవుటచేఁ గృత్యములుగాఁ దోఁచు కర్మలు మిథ్యాభూతము లగుచు స్వస్వరూపభిన్నములు గాకుండుటంజేసి యగ్నియొక్క యుష్ణప్రకాశము, లగ్ని నెట్లు బాధింపనేరవో స్వస్వరూపము నెంతమాత్రమును బంధింపనేరవని తాత్పర్యము. 17

ద్ధిభూతా న లిప్యతే నాఽనుశయినీ భవతి, ఇద మహ మకార్షం తేనాఽహం నరకం గమిష్యామీ త్యేవం యస్య బుద్ధి ర్న లిప్యతే స సుమతి స్స పశ్యతి హత్వాఽపి న ఇమా న్లోకా న్సర్వా నిమా న్ప్రాణిన ఇత్యర్థః న హంతి హననక్రియాం న కరోతి, న నిబధ్యతే నాపి తత్కార్యేణాధర్మఫలేన సంబధ్యతే.

నను హత్వాఽపి న హంతీతి విప్రతిషిద్ధ ముచ్యతే, యద్యపి స్తుతిః, నైష దోషః, లౌకికపారమార్థికదృష్ట్యపేక్షయా తదుపపత్తేః దేహాద్యాత్మబుద్ధ్యా హంతాఽహ మితి లౌకికీం దృష్టి మాశ్రిత్య హత్వాపీ త్యాహ, యథాదర్శితాం పారమార్థికీం దృష్టి మాశ్రిత్య న హంతి న నిబధ్యత ఇతి ఏత దుభయ ముపపద్యతఏవ.

నన్వధిష్ఠానాదిభి స్సంభూయ కరో త్యేవాత్మా, "కర్తార మాత్మానం కేవలం తు" (గీ 18-16) కేవలశబ్దప్రయోగాత్, నైష దోషః, ఆత్మనోఽవిక్రియస్వభావత్వే ఽధిష్ఠానాదిభిః సంహతత్వానుపపత్తేః, విక్రియావతో హ్యన్యైః సంహననం సంభవతి, సంహత్య వా కర్తృత్వం స్యాత్. న త్వవిక్రియస్యాత్మనః కేనచిత్సంహనన మస్తీతి న సంభూయ కర్తృత్వ ముపపద్యతే, అతః కేవలత్వ మాత్మనస్స్వాభావిక మితి కేవలశబ్దోఽనువాదమాత్రం అవిక్రియత్వం చాత్మనః శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధం "అవికార్యోఽయ ముచ్యతే" (గీ.2-25.) "గుణైరేవ కర్మాణి క్రియన్తే" (గీ. 3-27.) "శరీరస్థోఽపి న కరోతి" (గీ. 13-31.) ఇత్యాద్యసకృ దుపపాదితం గీతాస్వేవ తావత్, శ్రుతిషు చ "ధ్యాయతీవ లేలాయతీవ" (బృ. 4-3-7) ఇత్యేవమాద్యాసు న్యాయతశ్చ నిరవయవ మపరతంత్ర మవిక్రియ మాత్మతత్త్వమితి రాజమార్గః విక్రియావత్త్వాభ్యుపగమేఽప్యాత్మనః స్వకీయైవ విక్రియా స్వస్య భవితు మర్హతి, నాధిష్ఠానాదీనాం కర్మా ణ్యాత్మకర్తృకాణి స్యుః; న హి పరస్య

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః. 18

---

టీ:—కర్మచోదనా - విధిశాస్త్రము, జ్ఞానం - సర్వవిషయములను విశేష వివక్షలేకుండ సామాన్యముగనే యంతఃకరణముచేఁ దెలిసికొనఁ బడుచున్నదో యట్టి సాధనము, జ్ఞేయం - తెలిసికొనఁబడు సర్వవిషయము, పరిజ్ఞాతా - ఉపాధి స్వరూపముగాఁ గల్గి యవిద్యచేఁ గల్పింపఁబడినభోక్తయు అని, త్రివిధా - మూఁడు విధములు, కర్మసంగ్రహః - కర్మస్వరూపమన్నదో, కరణం - బాహ్యములగు శ్రోత్రాదులును, అంతస్థములగు బుద్ధ్యాదులును, కర్మ - కర్తచే నభిలషింపఁబడు ఫలము నొందుటకుఁ గర్తయొనర్చు వ్యాపారము, కర్తా - ఉపాధిస్వరూపముగాఁ గల్గిన సాధనములచే వ్యాపారము చేయువాఁడు. ఇతి - అని, త్రివిధః - మూఁడువిధములు. 18

తా:—విధిశాస్త్రముయొక్క ప్రవృత్తికి జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత యను మూఁడిఁటియొక్క యావశ్యకత గల్గును. ఈ మూఁటిలో నేది లుప్తమైనను

---

కర్మ పరేణాకృత మాగంతు మర్హతి యత్త్వవిద్యయా గమితం, న తత్తస్య యథా రజతత్వం న శుక్తికాయాః యథా వా తలమలినత్వం బాలై ర్గమిత మవిద్యయా నాశక్యా తథాఽధిష్ఠానాదివిక్రియాఽపి తేషామేవ నాత్మనః; తస్మాద్యుక్త ముక్త మహంకృతత్వబుద్ధిలేపాభావా ద్విద్వా న్న హంతి న నిబధ్యతే ఇతి, "నాయం హంతి న హన్యతే" (2-19.) ఇతి ప్రతిజ్ఞాయ "నజాయతే". (గీ.2-20.) ఇత్యాదిహేతువచనేనావిక్రియత్వ మాత్మన ఉక్త్వా "వేదావినాశినం" (గీ. 2-21) ఇతి విదుషః కర్మాధికారనివృత్తిం శాస్త్రాదౌ సంక్షేపత ఉక్త్వా, మధ్యే ప్రసారితాం చ తత్ర తత్ర ప్రసంగం కృత్వే హోపసంహరతి శాస్త్రార్థపిండీకరణాయ విద్వా న్న హంతి న నిబధ్యతే ఇతి. ఏవంచ సతి దేహభృత్త్వాభిమానానుపపత్తా వవిద్యాకృతాశేషకర్మసంన్యాసోపపత్తేః సంన్యాసినా మనిష్టాది త్రివిధం కర్మణః ఫలం న భవతీ త్యుపపన్నం, తద్విపర్యయా చ్చేతరేషాం భవతీ త్యేతచ్చాపరిహార్య మిత్యేష గీతాశాస్త్రార్థ ఉపసంహృతః స ఏష సర్వవేదార్థసారో నిపుణమతిభిః పండితై ర్విచార్య ప్రతిపత్తవ్య ఇతి తత్ర తత్ర ప్రకరణవిభాగేన దర్శితోఽస్మాభిః శాస్త్రన్యాయానుసారేణ. 17

అథేదానీం కర్మణాం ప్రవర్తక ముచ్యతే - జ్ఞాన మితి. జ్ఞానం జ్ఞాయతేఽనేనేతి సర్వవిషయ మవిశేషేణోచ్యతే, తథా జ్ఞేయం జ్ఞాతవ్యం తదపి సామాన్యే నైవ సర్వ ముచ్యతే., తథా; పరిజ్ఞాతా ఉపాధిలక్షణోఽవిద్యాకల్పితో భోక్తా ఇత్యేత త్త్రయ మవిశేషేణ సర్వకర్మణాం ప్రవర్తికా త్రివిధా త్రిప్రకారా

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః,
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి. 19

---

హేయోపాదేయములను బోధించు విధినిషేధశాస్త్రము లుత్తమగుచున్నది. దానంజేసి యీ మూఁడును గర్మచోదనగాఁ జెప్పఁబడినవి. ఆ తీరుననే యొక కర్మను ప్రారంభించుటకుఁ గరణము కర్మ కర్త యను మూఁడింటియొక్కయావశ్యకత కల్గియుండుటచే నా మూఁడును గూడ నావశ్యకము లని చెప్పఁబడినవి. ఇచట కర్తృ పరిజ్ఞాతృ శబ్దములు సమానార్థకములు. 18

టీ:-గుణసంఖ్యానే - కాపిలతంత్రమందు, జ్ఞానం కర్మ కర్తచ- పైన చెప్పఁబడిన జ్ఞాన కర్మ కర్త లనునవి, గుణభేదతః - సాత్త్వికాది గుణభేదమువలన, త్రిధాఏవ - మూఁడువిధములుగనే, ప్రోచ్యతే- చెప్పఁబడుచున్నది. తాని అపి- ఆ జ్ఞానకర్మలను గూడ, యథావత్ - అందుఁ జెప్పఁబడిన విధముననే, శృణు - వినుము. 19

---

కర్మచోదనా జ్ఞానాదీనాం హి త్రయాణాం సన్నిపాతే హానోపాదానాదిప్రయోజనః సర్వకర్మారంభః స్యాత్ తతః పంచభి రధిష్ఠానాదిభి రారబ్ధం వాఙ్మనఃకాయాశ్రయభేదేన త్రిధా రాశీభూతం త్రిషు కరణాదిషు సంగృహ్యత ఇత్యేత దుచ్యతే. కరణం క్రియతేఽనేనేతి బాహ్యం శ్రోత్రాది, అంతఃస్థం బుద్ధ్యాది, కర్మేప్సితతమం కర్తుః క్రియయా వ్యాప్యమానం, కర్తా కరణానాం వ్యాపారయితా ఉపాధిలక్షణ ఇతి త్రివిధ స్త్రిప్రకారః కర్మసంగ్రహః, సంగృహ్యతేఽస్మి న్నితి సంగ్రహః కర్మణః సంగ్రహః కర్మసంగ్రహః కర్మైషు హి త్రిషు సమవైతి తేనాయం త్రివిధః కర్మసంగ్రహః. 18

అథేదానీం క్రియాకారకఫలానాం సర్వేషాం గుణాత్మకత్వా త్సత్త్వరజస్తమోగుణభేదత స్త్రివిధో భేదో వక్తవ్య ఇత్యారభ్యతే - జ్ఞాన మితి. జ్ఞానం కర్మ చ కర్మ క్రియా న కారకం పారిభాషిక మీప్సితతమం కర్మ, కర్తా చ నిర్వర్తకః క్రియాణాం త్రిధైవ, అవధారణం గుణవ్యతిరిక్తజాత్యంతరాభావప్రదర్శనార్థం గుణభేదత స్సత్త్వాదిభేదేనేత్యర్థః, ప్రోచ్యతే కథ్యతే గుణసంఖ్యానే కాపిలే శాస్త్రే తదపి గుణసంఖ్యానం శాస్త్రం గుణభోక్తృవిషయే. ప్రమాణమేవ పరమార్థబ్రహ్మైకత్వవిషయే యద్యపి విరుధ్యతే తథాపి తే హి కాపిలా గుణగౌణవ్యాపారనిరూపణేఽభియుక్తా ఇతి తచ్ఛాస్త్ర మపి వక్ష్యమాణార్థస్తుత్యర్థత్వేనోపాదీయత ఇతి న విరోధః యథావ ద్యథాన్యాయం యథాశాస్త్రం శృణు తాన్యపి జ్ఞానాదీని తద్భేదజాతాని గుణభేదకృతాని శృణు, వక్ష్యమాణేఽర్థే మనస్సమాధిం కుర్విత్యర్థః. 19

సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే,
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. 20

పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్. 21

---

తా:-రాఁబోవు గీతమునుండి నలుబది నాలుగవగీతమువఱకును గల యిరువది నాల్గు గీతములచేతను గుణక్రియవిభేదకథనము చేయఁబడుచున్నది. ఏతద్విషయము గుణత్రియ విభాగముయొక్క విశేష వివరణరూపము.

టీ:-విభక్తేషు - నానావిధములుగఁ దెలియఁబడు దేహభేదములతోఁగూడిన, సర్వభూతేషు - అవ్యక్తము మొదలుగాఁ గల్గి స్థావరము లంతముగాఁ గల్గిన సకల భూతములయందును, అవిభక్తం - వేఱుచేయఁబడనట్టియు నాకాశమువలె నిరంతరమైనట్టియు, అవ్యయమ్ - నాశరహితమైనట్టియు, ఏకం - ఒకటియే యగు, భావం - ఆత్మను, యేన - ఏజ్ఞానముచేత, ఈక్షతే - తెలిసికొనునో, తత్ - అట్టి జ్ఞానం - జ్ఞానమనెడిసాధనమును, సాత్త్వికమ్ - సాత్త్వికజ్ఞానమని, విద్ధి - తెలిసికొనుము. 20

టీ:-సర్వేషు - సమస్తములగు, భూతేషు - దేహభేదములందును, పృథగ్విధాన్ -భిన్నలక్షణలములతోఁగూడిన, నానాభావాన్ - భిన్నరూపములగు నాత్మలను, పృథక్త్వేనతు - భేదభావముచేతనే, యత్ - ఏ, జ్ఞానం - జ్ఞానమనెడిసాధనము, వేత్తి - తెలిసికొనుచున్నదో, తత్ - అట్టి, జ్ఞానం - జ్ఞానము, రాజసం - రాజసజ్ఞానమని, విద్ధి - తెలిసికొనుము. 21

---

జ్ఞానస్య తు తావత్ త్రివిధత్వ ముచ్యతే సర్వభూతేష్వితి. సర్వభూతే ష్వభివ్యక్తాదిస్థావరాంతేషు భూతేషు యేన జ్ఞానేనైకం భావం వస్తు భావశబ్దో వస్తువాచీ ఏవ మాత్మవస్త్విత్యర్థః, అవ్యయం న వ్యేతి స్వాత్మనా స్వధర్మేణ వా కూటస్థ మిత్యర్థః ఈక్షతే పశ్యతి యేన జ్ఞానేన, తం చ భావ మవిభక్తం ప్రతిదేహం విభక్తేషు దేహభేదేషు న విభక్తం తదాత్మవస్తు వ్యోమవ న్నిరంతర మిత్యర్థః తజ్జ్ఞానం సాక్షాత్సమ్యగ్దర్శన మద్వైతతాత్మవిషయం సాత్త్వికం విద్ధీతి. 20

యాని ద్వైతదర్శనాని తా న్యసమ్యగ్భూతాని రాజసాని తామసాని చేతి న సాక్షాత్సంసారోచ్ఛిత్తయే భవంతి పృథక్త్వేనేతి. "పృథక్త్వేన తు భేదేన ప్రతిశరీర మన్యత్వేన యత్ జ్ఞానం నానాభావా న్భిన్నా నాత్మనః పృథగ్విధాన్ పృథక్ప్రకారాన్ భిన్నలక్షణా నిత్యర్థః వేత్తి విజానాతి యత్ జ్ఞానం సర్వేషు భూతేషు జ్ఞానస్య కర్తృత్వాసంభవా ద్యేన జ్ఞానేన వేత్తీత్యర్థః తత్ జ్ఞానం విద్ధి రాజసం రజోగుణనిర్వృత్తమ్. 21

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్,
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్. 22

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్వికముచ్యతే. 23

---

టీ:—ఏకస్మిన్ - ఒకానొక, కార్యే - దేహమునందుఁగాని బాహ్యమందుఁగాని ప్రతిమాదులయందుఁగాని వ్యాపారమందుఁగాని, కృత్స్నవత్ - పరమపురుషార్థమువలె, అహైతుకమ్ - నిర్హేతుకముగా, సక్తం - నిశ్చయమగు నభినివేశము గలిగినట్టియు, అతత్త్వార్థవత్ - తత్త్వేతరమైనట్టియు, అల్పంచ - ప్రయోజనముచేఁగాని విషయముచేఁగాని కడుస్వల్పమైనట్టియు విషయములఁగూర్చి, యత్ తు - ఏజ్ఞానము కలదో, తత్ - అట్టిజ్ఞానము, తామసం- తమోగుణజన్యమగు జ్ఞానమని, ఉదాహృతం - చెప్పఁబడినది. 22

తా:—యుక్తాయుక్తవివేకము లేక యెద్దియో యొకకార్యమందుఁగాని వస్తువునందుఁగాని, విషయమునందుఁగాని మూర్ఖమగు నభినివేశముచేఁ బ్రసరించు జ్ఞానమునకుఁ దామసజ్ఞానమని పేరు.

పై మూఁడుగీతములచేతను సాత్త్వికరాజసతామసజ్ఞానములు వివరింపబడినవి.

టీ:—అఫలప్రేప్సునా - ఫలతృష్ణలేనివానిచే, సంగరహితం - అభినివేశము లేకుండ, అరాగద్వేషతః - రాగద్వేషవర్జితముగ, యత్ - ఏ, నియతం - శాస్త్రచోదితమైనట్టియు నిత్యమైనట్టియు, కర్మ - క్రియావిశేషము, కృతం - చేయబడుచున్నదో, తత్ - అట్టి కర్మ, సాత్త్వికం - సత్త్వగుణజన్యమగు కర్మ యని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. 23

---

యత్త్వితి. యత్ జ్ఞానం కృత్స్నవత్సమస్తవత్సర్వవిషయమివైకస్మిన్ కార్యే దేహే బహి ర్వా ప్రతిమాదౌ సక్తం ఏతావానే వాఽఽత్మేశ్వరో వా నాఽతః పర మస్తీతియథానగ్నక్షపణకాదీనాం శరీరాంతర్వర్తీ దేహపరిమాణో జీవ ఈశ్వరో వా పాషాణదార్వాదిమాత్ర మిత్యేవ మేకస్మిన్ కార్యే సక్తమహైతుకం హేతువర్జితం నిర్యుక్తిక మతత్త్వార్థవ దయథాభూతార్థవత్, యథాభూతోఽర్థ స్తత్త్వార్థః, సోఽస్య జ్ఞేయభూతోఽస్తీతి తత్త్వార్థవత్ న తత్త్వార్థవ దతత్త్వార్థవత్ అహేతుకత్వాదే వాఽల్పం చ, అల్పవిషయత్వా దల్పఫలత్వా ద్వా తత్తామస ముదాహృతమ్ తామసానాం హి ప్రాణినా మవివేకినా మీదృశం జ్ఞానం దృశ్యతే. 22

అథేదానీం కర్మణ స్త్రైవిధ్య ముచ్యతే- నియత మితి. నియతం నిత్యం సంగరహిత మాసక్తివర్జిత మరాగద్వేషతః కృతం రాగప్రయుక్తేన ద్వేషప్రయుక్తేన

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్. 24

అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే. 25

---

టీ:—కామేప్సునా - ఫలాభిలాష గలవానిచేఁగాని, సాహంకారేణ వా - లౌకికమగు నహంకారాభిమానిచేఁగాని, బహులాయాసం - అధికమగు శ్రమతోఁగూడికొనిన, యత్ తు పునః - ఏవిశేషమైనట్టి, కర్మ - కర్మము, క్రియతే - చేయఁబడుచున్నదో, తత్ - అట్టికర్మ, రాజసం - రజోగుణసముద్భవ మగుటచే రాజసకర్మయని, ఉదాహృతమ్ - చెప్పబడుచున్నది. 24

టీ:—అనుబంధం - వ్యాపారానంతరము గల్గువిశేషమునుగాని, క్షయం - వ్యాపారమందుఁ గల్గు స్వశక్తిక్షయమునుగాని యర్థక్షయమునుగాని, హింసాం - ప్రాణులయొక్క పీడనముగాని, పౌరుషం చ - పురుషకారమునుగాని, అనపేక్ష్య - ఇంచుకేనియు యోజింపక, మోహాత్ - అవివేకముచే, యత్ - ఏ, కర్మ - కర్మ, ఆరభ్యతే - ప్రారంభింపఁబడుచున్నదో, తత్ - ఆ కర్మ, తామసం - తామసకర్మ యని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నది. 25

---

చ కృతం రాగద్వేషతః కృతం తద్విపరీత మరాగద్వేషతః కృత మఫలప్రేప్సునా ఫలం ప్రేప్సతీతి ఫలప్రేప్సుః ఫలతృష్ణ స్తద్విపరీతేనాఽఫలప్రేప్సునా కర్త్రా కృతం కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. 23

యత్త్వితి. యత్తుకామేప్సునా కర్మ ఫలప్రేప్సునేత్యర్థః కర్మ సాహంకారేణ వా సాహంకారేణేతి న తత్త్వజ్ఞానాపేక్షయా, కిం తర్హి లౌకిక శ్రోత్రియ నిరహంకారాపేక్షయా యో హి పరమార్థనిరహంకార ఆత్మవి న్న తస్య కామేప్సుత్వ బహులాయాసకర్తృత్వప్రాప్తి రస్తి సాత్త్వికస్యాపి కర్మణోఽనాత్మవిత్సాహంకారః కర్తా కిముత రాజసతామసయోః లోకేఽనాత్మవి దపి శ్రోత్రియో నిరహంకారః ఉచ్యతే "నిరహంకారోఽయం బ్రాహ్మణః" ఇతి; తస్మా త్తదపేక్షయైవ సాహంకారేణ వేత్యుక్తమ్. పునశ్శబ్దః పాదపూరణార్థః క్రియతే బహులాయాసం కర్త్రా మహతాఽఽయాసేన నిర్వర్త్యతే తత్కర్మ రాజస ముదాహృతమ్. 24

అనుబంధ మితి. అనుబంధం పశ్చాద్భావి యద్వస్తు సోఽనుబంధ ఉచ్యతే, తం చాఽనుబంధం, క్షయం యస్మిన్ కర్మణి క్రియమాణే శక్తిక్షయోఽర్థక్షయో

ము క్తసంగో౽నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. 26

రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకో౽శుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. 27

---

తా--పై మూఁడుగీతములచేతను సాత్త్వికరాజస తామస కర్మలయొక్క విశేషము చెప్పఁబడుచున్నది. 25

టీ:--ముక్తసంగః - కర్మఫలాభినివేశమును విడచినట్టియు, అనహంవాదీ - స్వోత్కర్షను బ్రకటించుకొనుటయం దిచ్ఛ లేనట్టియు, ధృత్యుత్సాహసమన్వితః - ధారణోద్యమములతోఁ గూడికొనినట్టియు, సిద్ధ్యసిద్ధ్యోః - ఫలముయొక్క లాభాలాభములయందు, నిర్వికారః - రాగద్వేషముల నెంతమాత్రమును జెందనట్టియు, కర్తా - కేవలము శాస్త్రప్రమాణముచేఁ గర్మల నాచరించువాఁడు, సాత్త్వికః - సాత్త్వికుఁడగు కర్తయని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నాఁడు. 26

టీ:--రాగీ - అనురాగము గలిగినట్టియు, కర్మఫలప్రేప్సుః - కర్మఫలమునందు నిచ్ఛ కలిగినట్టియు, లుబ్ధః - పరులద్రవ్యముల నాశించునట్టియు తన ద్రవ్యమును విడువనట్టియు, హింసాత్మకః - పరులఁ బీడించు స్వభావము కలిగినట్టియు,

---

వా స్యా త్తం క్షయం హింసాం ప్రాణిపీడాం చ అనపేక్ష్య చ పౌరుషం పురుషకారం శక్నోమీదం కర్మ సమాపయితు మిత్యేవ మాత్మసామర్థ్యమ్ ఇత్యేతాన్యనుబంధాదీ న్యనపేక్ష్య పౌరుషాంతాని మోహా దవివేకత ఆరభ్యతే కర్మ యత్త త్తామసం తమోనిర్వృత్త ముచ్యతే. 25

ఇదానీం కర్తృభేద ఉచ్యతే ముక్తేతి. ముక్తసంగో ముక్తః పరిత్యక్తస్సంగో యేన స ముక్తసంగః, అనహంవాదీ నా౽హంవదనశీలో, ధృత్యుత్సాహసమన్వితో ధృతి ర్ధారణ ముత్సాహ ఉద్యమ స్తాభ్యాం సమన్వితః సంయుక్తో ధృత్యుత్సాహసమన్వితః, సిద్ధ్యసిద్ధ్యోః క్రియమాణస్య కర్మణః ఫలసిద్ధావసిద్ధౌ చ సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కేవలం శాస్త్రప్రమాణేన ప్రయుక్తో న ఫలరాగాదినా యస్స నిర్వికార ఉచ్యతే. ఏవంభూతః కర్తా యః స సాత్త్విక ఉచ్యతే. 26

రాగీతి. రాగీ రాగో౽స్యాస్తీతి రాగీ, కర్మఫలేప్సుః కర్మఫలార్థీ, లుబ్ధః పరద్రవ్యేషు సంజాతతృష్ణ స్తీర్థాదౌ స్వద్రవ్యాపరిత్యాగీ వా, హింసాత్మకః పరపీడాకరస్వభావః, అశుచి ర్బాహ్యాభ్యంతరశౌచవర్జితో, హర్షశోకాన్వితః ఇష్టప్రాప్తౌ హర్షో

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. 28

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ. 29

---

అశుచిః - బాహ్యాభ్యంతర శౌచములు లేనట్టియు, హర్షశోకాన్వితః - ఇష్టప్రాప్తి యందు హర్షమును అనిష్టప్రాప్తియందుఁ గాని యిష్టవియోగమునందుఁ గాని విషాదమును జెందునట్టియు, రాజసః కర్తా - రాజసకర్త యని, పరికీర్తితః - చెప్పఁ బడుచున్నాఁడు. 27

టీ:- అయుక్తః - చిత్తస్థైర్యము లేనట్టియు, ప్రాకృతః - సర్వవిధముల సంస్కారశూన్యమగు బుద్ధికలిగినట్టియు, స్తబ్ధః - మొద్దువలెఁ గదలక యెవ్వరికిని నమస్కరింపనట్టియు, శఠః - మాయావియు, నైష్కృతికః - స్వలాభమునకై యితరుల వృత్తులఁ జెరుచునట్టియు, అలసః - చేయవలసిన కార్యములందుఁగూడ ప్రమత్తుఁడైనట్టియు, విషాదీ - ఎల్లప్పుడును కుంగిన స్వభావము కలిగినట్టియు, దీర్ఘసూత్రీ చ - త్వరలోఁ జేయవలసిన కార్యములను దీర్ఘకాలమువఱకును చేయకుండునట్టి స్వభావము గలిగినట్టి, కర్తా - కర్త, తామసః - తామసుఁ డని, ఉచ్యతే - చెప్పఁబడుచున్నాఁడు.

తా:- పైమూఁడు గీతములచేతను సాత్త్విక రాజస తామసకర్తలయొక్క స్వరూపము నిరూపింపఁబడినది. 28

టీ:- అశేషేణ - పుష్కలముగాను, పృథక్త్వేన - వివేకముతోడను, ప్రోచ్యమానం - చెప్పఁబడుచున్నట్టియు, గుణతః - సాత్త్విక రాజస తామసగుణములవలనఁ

---

ఽనిష్టప్రాప్తా విష్టవియోగే చ శోకస్తాభ్యాం హర్షశోకాభ్యా మన్విత స్సంయుక్త స్తస్యైవ చ కర్మణ స్సంపత్తివిపత్తిభ్యాం హర్షశోకౌ స్యాతాం తాభ్యాం సంయుక్తో యః కర్తా స రాజసః పరికీర్తితః. 27

అయుక్త ఇతి. అయుక్తోఽసమాహితః ప్రాకృతోఽత్యంతాసంస్కృతబుద్ధి ర్బాలసమః స్తబ్ధో దండవ న్న నమతి కస్మైచిత్, శఠో మాయావీ శక్తిగూహనకారీ, నైష్కృతికః పరవృత్తిచ్ఛేదనపరః, అలసోఽప్రవృత్తిశీలః కర్తవ్యేష్వపి, విషాదీ సర్వదాఽవసన్నస్వభావో దీర్ఘసూత్రీ చ కర్తవ్యానాం దీర్ఘప్రసారణ స్సర్వదా మందస్వభావః, య దద్య శ్వో వా కర్తవ్యం తన్మాసేనాపి న కరోతి, య శ్చైవం భూతః స కర్తా తామస ఉచ్యతే. 28

బుద్ధేర్భేద మితి. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ భేదం గుణతః సత్త్వాదిగుణత స్త్రివిధం శృణ్వితి సూత్రోపన్యాసః, ప్రోచ్యమానం కథ్యమాన మశేషేణ నిరవ

పరివృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ. 30

యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవచ,
అయథావ త్పరిజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ. 31

---

గలిగిన, బుద్ధేః - బుద్ధియొక్కయు, ధృతేఃచ ఏవ - ధైర్యముయొక్కయు, భేదం - విభాగమును, ధనంజయ! శృణు - వినుము. 29

టీ:—యా - ఏ, బుద్ధిః - బుద్ధి, పరివృత్తించ - కర్మమార్గమును, నివృత్తించ - మోక్షమార్గరూపమగు సంన్యాసమును, కార్యాకార్యే - విహితప్రతిషిద్ధములును, భయాభయే - దృష్టాదృష్టవిషయములందు భయమును భయరాహిత్యమును, బంధం - బంధమును, మోక్షంచ - మోక్షమును, వేత్తి - తెలిసికొనుచున్నదో, సా - ఆ బుద్ధి, పార్థ! సాత్త్వికీ - సాత్త్వికబుద్ధి యని చెప్పఁబడుచున్నది. 30

టీ:—యయా - ఏ బుద్ధిచే, ధర్మం - శాస్త్రచోదితవిషయమును, అధర్మంచ - శాస్త్రప్రతిషిద్ధవిషయమును, కార్యంచ - విహితకర్మమును, అకార్యం ఏవచ - చేయఁగూడని కర్మమును, అయథావత్ - నిర్ణయమునకు విపరీతముగ, పరిజానాతి - తెలిసికొనుచున్నాఁడో, సా - ఆబుద్ధి, పార్థ! రాజసీ - రాజసబుద్ధి యని చెప్పఁబడుచున్నది. 31

---

శేషతో యథావ త్పృథక్త్వేన వివేకతో ధనంజయ దిగ్విజయే మానుషం దైవం చ ప్రభూతం ధనం జితవాన్ తేనాసౌ ధనంజయోఽర్జునః. 29

పరివృత్తిం చేతి. పరివృత్తిం చ పరివృత్తిః పరివర్తనం బంధహేతుః కర్మమార్గః శాస్త్రవిహితవిషయః, నివృత్తిం చ నివృత్తి ర్మోక్షహేతుః సంన్యాసమార్గః. బంధమోక్షసమానవాక్యత్వా త్పరివృత్తినివృత్తీ కర్మసంన్యాసమార్గా వித్యవగమ్యతే కార్యాకార్యే విహితప్రతిషిద్ధే లౌకికే వైదికే. వా శాస్త్రబుద్ధేః కర్తవ్యాకర్తవ్యే కరణాకరణే ఇత్యేతత్ కస్య దేశకాలాద్యపేక్షయా దృష్టాదృష్టార్థానాం కర్మణామ్ భయాభయే బిభే త్యస్మా దితి భయం, న భయ మభయం, భయం చాభయం చ భయాభయే, దృష్టాదృష్టవిషయయో ర్భయాభయయోః కారణ ఇత్యర్థః బంధం సహేతుకం మోక్షం చ సహేతుకం యా వేత్తి విజానాతి బుద్ధిః, సా పార్థ సాత్త్వికీ తత్ర జ్ఞానం బుద్ధే ర్వృత్తిః బుద్ధి స్తు వృత్తిమతీ ధృతి రపి వృత్తివిశేషఏవ బుద్ధేః. 30

యయేతి. యయా ధర్మం శాస్త్రచోదితం, అధర్మం చ తత్ప్రతిషిద్ధం, కార్యంచ చాకార్య మేవచ పూర్వోక్తఏవ కార్యాకార్యే అయథావన్నయథావ త్సర్వతో నిర్ణయేన న పరిజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ. 31

అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా,
సర్వార్థా న్విపరీతాం శ్చ బుద్ధిః సా పార్థ! తామసీ. 32

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః,
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ. 33

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ! రాజసీ. 34

---

టీ:—పార్థ ! యా బుద్ధిః - ఏ బుద్ధి, తమసా - అజ్ఞానముచే, ఆవృతా - కప్పఁబడినదై, అధర్మం - ప్రతిషిద్ధమగు ధర్మమును, ధర్మం ఇతి - విహితధర్మమనియు, సర్వార్థాన్ - ప్రయోజనముతోఁ గూడిన సకలవిషయములను, విపరీతాన్ చ - అనర్థములతోఁ గూడినవానినిగా, మన్యతే - తలఁచుచున్నదో, సా - అట్టిబుద్ధి, తామసీ - తామసబుద్ధి యని చెప్పఁబడుచున్నది. 32

తా:—పై మూఁడు గీతములచేతను బుద్ధియొక్క భేదము చెప్పఁబడినది.

టీ:—యయా - ఏ, అవ్యభిచారిణ్యా - చలింపని, ధృత్యా - ధృతిచే, యోగేన - నిగ్రహముచే, మనఃప్రాణేంద్రియక్రియాః - మనస్సుయొక్కయు, ప్రాణముయొక్కయు నింద్రియములయొక్కయు వ్యాపారములు, ధారయతే - నియతక్రమమున నిశ్చయించుచున్నాఁడో, సా ధృతిః - ఆ ధృతి, సాత్త్వికీ - సాత్త్వికమని, అర్జున ! చెప్పఁబడుచున్నది. 33

టీ:—యయా ధృత్యాతు - ఏ ధృతిచేతను, ప్రసంగేన - ధర్మాదులయొక్కయాచరణమందలి యభినివేశముచే, ఫలాకాంక్షీ - ఫలమును గోరుపురుషుఁడు, ధర్మ

---

అధర్మ మితి. అధర్మం ప్రతిషిద్ధం ధర్మం విహిత మితి యా మన్యతే జానాతి తమసాఽఽవృతా సతీ, సర్వార్థాన్ సర్వా నేవ జ్ఞేయపదార్థా న్విపరీతాంశ్చ విపరీతానేవ విజానాతి బుద్ధి స్సా పార్థ తామసీ. 32

ధృత్యేతి. ధృత్యా యయాఽవ్యభిచారిణ్యేతి వ్యవహితేన సంబంధః ధారయతే, కిమ్? మనఃప్రాణేంద్రియక్రియాః, మనశ్చ ప్రాణా శ్చేంద్రియాణి చ మనఃప్రాణేంద్రియాణి, తేషాం క్రియా శ్చేష్టాః, తా ఉచ్ఛాస్త్రమార్గప్రవృత్తే ర్ధారయతే ధారయతి, ధృత్యా హి ధార్యమాణా ఉచ్ఛాస్త్రమార్గవిషయా న భవంతి యోగేన సమాధినాఽవ్యభిచారిణ్యా నిత్యసమాధ్యనుగతయేత్యర్థః; ఏతదుక్తం భవతి అవ్యభిచారిణ్యా ధృత్యా మనఃప్రాణేంద్రియక్రియా ధార్యమాణా యోగేన ధారయతీతి యా ఏవంలక్షణా ధృతి స్సా పార్థ సాత్త్వికీ. 33

యయేతి. యయా తు ధర్మకామార్థాన్, ధర్మశ్చ కామ శ్చార్థశ్చ ధర్మకామార్థా స్తాన్ ధర్మకామార్థాన్ ధృత్యా యయా ధారయతే మనసి నిత్య

యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవచ,
న విముంచతి దుర్మేధా ధృతి స్సా తామసీ మతా. 35

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ!,
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి. 36

---

కామార్థాన్ - త్రివర్గఫలములను, ధారయతే - ధరించుచున్నాఁడో, సా ధృతిః - ఆ ధృతి, పార్థ! రాజసీ - రాజసధృతి యని చెప్పఁబడుచున్నది. 34

టీ:—దుర్మేధాః - దుష్టబుద్ధియగు పురుషుఁడు, యయా - ఏధృతిచేతను, స్వప్నం - నిద్రను, భయం - భయమును, శోకం - దుఃఖమును, విషాదం - విచారమును, మదం ఏవచ - మత్తతను, న విముంచతి - విడువఁడో, సా ధృతిః - అట్టి ధృతి, తామసీ - తామసధృతి యని, మతా - ఇష్టము. 35

తా:—పైమూఁడు గీతములచేతను తామస రాజస సాత్త్విక ధృతులు చెప్పఁబడినవి. 35

టీ:—భరతర్షభ! అభ్యాసాత్ - పౌనఃపున్యపరిచయమువలన, యత్ర - ఏ సుఖానుభవమునందు, రమతే - పురుషుఁడు ప్రీతిని బొందునో, దుఃఖాన్తం చ - దుఃఖములయొక్క నాశమును, నిగచ్ఛతి - పొందునో అట్టి, త్రివిధం - మూఁడు విధములైనట్టి, సుఖం తు - సుఖమునుగూర్చి, ఇదానీం - ఇప్పుడు, మే - నావలన, శృణు - వినుము. 36

---

కర్తవ్య రూపా నవధారయతి, హే అర్జున! ప్రసంగేన యస్యయస్య ధర్మాదే ర్ధారణ ప్రసంగ స్తేన తేన ప్రసంగేన ఫలాకాంక్షీ చ భవతి యః పురుష స్తస్య ధృతి ర్యా సా పార్థ! రాజసీ. 34

యయేతి. యయా స్వప్నం నిద్రాం భయం త్రాసం శోకం విషాదం విషణ్ణతాం మదం విషయసేవా మాత్మనో బహుమన్యమానో మత్త ఇవ మద మేవచ మనసి నిత్యమేవ కర్తవ్యరూపతయా కుర్వన్ న విముంచతి ధారయత్యేవ దుర్మేధాః కుత్సితమేధాః పురుషో యః తస్య ధృతి ర్యా సా తామసీ మతా. 35

గుణభేదేన క్రియాణాం కారకాణాం చ త్రివిధో భేద ఉక్తః; అథేదానీం ఫలస్య సుఖస్య త్రివిధో భేద ఉచ్యతే - సుఖ మితి. సుఖం త్విదానీం త్రివిధం శృణు, సమాధానం కుర్వి త్యేతత్, మే మమ భరతర్షభ! అభ్యాసా త్పరిచయా దావృత్తేః రమతే రతిం ప్రతిపద్యతే యత్ర యస్మిన్ సుఖానుభవే దుఃఖాంతం చ దుఃఖావసానం దుఃఖోపశమం చ నిగచ్ఛతి నిర్గచ్ఛతి ప్రాప్నోతి. 36

యత్తదగ్రే విష మివ పరిణామేఽమృతోపమమ్,
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. 37

విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

---

టీ:-యత్ తత్ - ఏ సుఖము, అగ్రే - ప్రారంభమున, విషం ఇవ - విషమువలెనే యుండి యనఁగాఁ గష్టసాధ్యముగా నుండి, పరిణామే - పరిపాకమునందు, అమృతోపమం - అమృతతుల్యమును, ఆత్మబుద్ధిప్రసాదజం-తన బుద్ధి నిర్మలభావముచేఁ బుట్టినట్టి, తత్ సుఖం - అట్టిసుఖము, సాత్త్వికం-సాత్త్వికమని, ప్రోక్తం - చెప్పఁబడినది. 37

తా:-జ్ఞానవైరాగ్యధ్యానసమాధులు ప్రారంభమునందుఁ గష్టతరములై దుఃఖరూపములుగాఁ గన్పట్టినను బరిపాకమున జిత్తశుద్ధిని గల్గించి నిరతిశయమగు సుఖమునకుఁ గారణము లగుచున్నవి. అట్టి సుఖము సాత్త్విక సుఖ మనఁబడుచున్నది. 37

టీ:-అగ్రే - ప్రారంభమునందు, అమృతోపమమ్ - అమృతతుల్యముగను, పరిణామే - పరిపాకమునందు, విష మివ - విషమువలె సంకటహేతువగు, విషయేంద్రియసంయోగాత్ - విషయములకు నింద్రియములకుఁ గల కూడికచే జనించునట్టి, యత్తత్ - ఏసుఖము కలదో, తత్ సుఖం - అట్టి సుఖము, రాజసం - రాజసమని, స్మృతమ్ - చెప్పఁబడినది. 38

---

యదితి. యత్తత్సుఖ మగ్రే పూర్వం ప్రథమసన్నిపాతే జ్ఞానవైరాగ్యధ్యానసమాధ్యారంభేఽత్యంతాయాసపూర్వకత్వా ద్విషమివ దుఃఖాత్మకం భవతి పరిణామే జ్ఞానవైరాగ్యాదిపరిపాకజం సుఖ మమృతోపమం భ తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం విద్వద్భిః, ఆత్మనో బుద్ధి రాత్మబుద్ధి రాత్మబుద్ధేః ప్రసాదం నైర్మల్యం సలిలస్యేవ స్వచ్ఛతా, తతో జాత మాత్మబుద్ధిప్రసాదజమ్ ఆత్మవిషయా వాఽఽత్మావలంబనా వా బుద్ధి రాత్మబుద్ధి స్తత్ప్రసాదప్రకర్షా ద్వా జాత మిత్యేతత్ తస్మా త్సాత్త్వికం తత్. 37

విషయేతి. విషయేంద్రియసంయోగా జ్జాయతే య త్సుఖం తత్సుఖ మగ్రే ప్రథమలక్షణేఽమృతోపమ మమృతసమం, పరిణామే విష మివ, బలవీర్యరూపప్రజ్ఞామేధాధనోత్సాహహాని హేతుత్వా దధర్మతజ్జనితనరకాది హేతుత్వాచ్చ, పరిణామే తదుపభోగపరిణామాన్తే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్. 38

యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్. 39

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభిః స్యా త్త్రిభి ర్గుణైః. 40

---

తా:—విషయేంద్రియసంయోగ మన స్రక్చందన వనితాది విషయముల యొక్క సంబంధముచే జనించు సుఖమని భావము. 38

టీ:—యత్ సుఖం - ఏసుఖము, అగ్రే చ - ప్రారంభమునందును, అనుబంధే చ - పరిపాకమునందును, ఆత్మనః - తనకు, మోహనం - వ్యామోహకర మగుచు, నిద్రాలస్యప్రమాదోత్థం - నిద్ర ఆలస్యము ప్రమాదము మున్నగు కారణములచేఁ బుట్టినట్టి, తత్ - ఆ సుఖము, తామసం - తామససుఖ మని, ఉదాహృతం - చెప్పఁబడినది. 39

తా:— పై మూఁడు గీతములచేతను సాత్త్వికరాజసతామససుఖములు వివరింపఁబడినవి. 93

టీ:—పునః - వేయేల, పృథివ్యాం వా - భూమియందుఁగాని, దివి - ద్యులోకమందుఁగాని, దేవేషు వా - దేవతలయందుఁగాని, ఏభిః - ఈ, త్రిభిః - మూఁడగు, ప్రకృతిజైః ప్రకృతివలనఁబుట్టిన, గుణైః - గుణములచే, ముక్తం - విడువఁబడిన, యత్ సత్త్వం - ఏసత్త్వము గలదో, తత్ - అట్టి సత్త్వము, న అస్తి - లేదు. 40

తా:—ముల్లోకములందును దెలియవచ్చెడి ప్రతి వస్తువిశేషమును బ్రకృతి యొక్క సాత్త్వికరాజస తామసగుణములతో నొప్పుచునే యుండును గాని యీ మూఁడు గుణములకు నతీతమగు వస్తు వెచ్చటను గానరాదు. 40

---

యదగ్రే చేతి. యదగ్రే చానుబంధే చావసానోత్తరకాలే సుఖం మోహనం మోహకర మాత్మనో నిద్రాలస్యప్రమాదోత్థం నిద్రా చాలస్యం చ ప్రమాదశ్చ తేభ్య స్సముత్తిష్ఠతీతి నిద్రాలస్యప్రమాదోత్థం, తత్తామస ముదాహృతమ్. 39

అథేదానీం ప్రకరణోపసంహారార్థః శ్లోక ఆరభ్యతే నేతి. న తదస్తి తన్నాస్తి పృథివ్యాం వా మనుష్యాదిషు సత్త్వం ప్రాణిజాత మన్య ద్వా ఽప్రాణి దివి దేవేషు వా పున స్సత్త్వం ప్రకృతిజైః ప్రకృతితో జాతై రేభి స్త్రిభి ర్గుణైః సత్త్వాదిభి ర్ముక్తం పరిత్యక్తం యత్ స్యాత్ న తదస్తీతి పూర్వేణ సంబంధః. 40

బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ పరంతప!,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః. 41

---

టీ:–బ్రాహ్మణ క్షత్త్రియవిశాం - బ్రాహ్మణులయొక్కయు క్షత్త్రియుల యొక్కయు వైశ్యుల యొక్కయు, శూద్రాణాంచ - శూద్రులయొక్కయు, కర్మాణి - కర్మలు అనఁగా ధర్మములు, స్వభావప్రభవైః - ప్రకృతివలనఁ బుట్టిన, గుణైః - సత్త్వరజస్తమోగుణములచే, ప్రవిభక్తాని - ఆ యాయి గుణములయొక్క కార్యముల కనువుగ శాస్త్రముచే విభాగము చేయఁబడినవి. 41

తా:–శ్రుతిస్మృతిరూపమగు శాస్త్రముచే బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యుల కును శూద్రులకును విధింపఁబడిన కర్మవిశేషము లా యాయి వర్ణములవారల యొక్క యంతఃకరణ ధర్మములగు సాత్త్వికాది స్వభావసిద్ధ గుణముల నను సరించి విధింపఁబడుచున్నవిగాని పురుషబుద్ధికల్పితము లెంతమాత్రమును గావని యాశయము. ఈ గీతము "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః" (గీ. 4-13) యను గీతముయొక్క వివృతిరూపము. ఈ గీతమున "బ్రాహ్మణక్షత్త్రియ విశాం" అని వర్ణత్రయ వాచకశబ్దములకు సమాసము చేయుటయు, "శూద్రాణాం" అని శూద్రశబ్దమును బ్రత్యేకముగా నుచ్చరించుటయు శూద్రులు ద్విజులు కాక పోవుటచే వేదమునం దధికారము లేనివారలని సూచనచేయఁబడుచున్నది. 41

---

సర్వః సంసారః క్రియాకారకఫలలక్షణః సత్త్వరజస్తమోగుణాత్మకోఽవిద్యాపరికల్పిత స్సమూలోఽనర్థ ఉక్తః వృక్షరూపకల్పనయా చ "ఊర్ధ్వమూలం" (గీ. 15-1) ఇత్యాదినా "తం చాసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా తతః పదం తత్పరిమార్గితవ్యం" (గీ. 15-34) ఇతి చోక్తమ్. తత్ర చ సర్వస్య త్రిగుణాత్మకత్వాత్సంసారకారణనివృత్త్యనుపపత్తౌ ప్రాప్తాయాం యథా తన్నివృత్తిః స్యా త్తథా వక్తవ్యం, సర్వశ్చ గీతాశాస్త్రార్థ ఉపసంహర్తవ్యః ఏతావా నేవ చ సర్వవేదస్మృత్యర్థః, పురుషార్థ మిచ్ఛద్భి రనుష్ఠేయ ఇత్యేవ మర్థం బ్రాహ్మణక్షత్త్రియ విశా మిత్యాది రారభ్యతే బ్రాహ్మణేతి. బ్రాహ్మణాశ్చ క్షత్త్రియాశ్చ విశశ్చ బ్రాహ్మణక్షత్త్రియవిశః తేషాం బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ - శూద్రాణా మసమాసకరణ మేకజాతిత్వే సతి వేదానధికారాత్ హే పరంతప! కర్మాణి ప్రవిభక్తా నీతరేతరవిభాగేన వ్యవస్థాపితాని, కేన? స్వభావ ప్రభవై ర్గుణైః, స్వభావ ఈశ్వరస్య, ప్రకృతి స్త్రిగుణాత్మికా మాయా సా ప్రభవో యేషాం గుణానాం తే స్వభావప్రభవా స్తైశ్శమాదీని కర్మాణి ప్రవిభక్తాని బ్రాహ్మణాదీనామ్; అథవా బ్రాహ్మణస్వభావస్య సత్త్వగుణః ప్రభవః కారణం, తథా

శమో దమ స్తపః శౌచం క్షాంతి రార్జవ మేవచ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. 42

---

టీ:- శమః - అంతరింద్రియ నిగ్రహము, దమః - బహిరింద్రియనిగ్రహము, తపః - తపస్సు, శౌచం - శౌచము, క్షాంతిః - క్షమ, ఆర్జవం - ఋజుస్వభావము; జ్ఞానం - శాస్త్రజన్యజ్ఞానము, విజ్ఞానం - అనుభవజన్యజ్ఞానము, ఆస్తిక్యం - శాస్త్రచోదితవిషయములందుఁ బ్రామాణ్యము, ఏవ చ - ఇంక నితరమగు సత్సంపత్తియును, స్వభావజం - స్వభావమువలనఁ గల్గిన, బ్రహ్మకర్మ - బ్రాహ్మణజాతికి నుపయుక్తమగు కర్మ. 42

తా:-బ్రాహ్మణజాతికి స్వభావసిద్ధమగు నంతఃకరణవిశేషము ననుసరించి శాస్త్రముచే నీశమదమాదులు విధింపఁబడుచున్నవని యాశయము. 42

---

క్షత్త్రియస్వభావస్య సత్త్వోపసర్జనం రజఃప్రభవః వైశ్యస్వభావస్య తమఉపసర్జనం రజఃప్రభవః శూద్రస్వభావస్య రజఉపసర్జనం తమఃప్రభవః ప్రశాన్త్యైశ్వర్యేహామూఢతాస్వభావదర్శనా చ్చతుర్ణామ్; అథవా జన్మాన్తరకృతసంస్కారః ప్రాణినాం వర్తమానజన్మని స్వకార్యాభిముఖత్వే నాభివ్యక్త స్స్వభావః స ప్రభవో యేషాం గుణానాం తే స్వభావప్రభవా గుణాః, గుణప్రాదుర్భావస్య నిష్కారణత్వానుపపత్తేః స్వభావః కారణ మితి చ కారణవిశేషోపాదానమ్; ఏవం స్వభావప్రభవైః ప్రకృతిప్రభవైః సత్త్వరజ స్తమోభి ర్గుణైః స్వకార్యానురూపేణ శమాదీని కర్మాణి ప్రవిభక్తాని.

నను శాస్త్రప్రవిభక్తాని శాస్త్రేణ విహితాని బ్రాహ్మణాదీనాం శమాదీని కర్మాణి; కథ ముచ్యతే సత్త్వాదిగుణప్రవిభక్తానీతి, నైష దోషః, శాస్త్రేణాపి బ్రాహ్మణాదీనాం సత్త్వాదిగుణవిశేషాపేక్షమేవ శమాదీని కర్మాణి ప్రవిభక్తాని న గుణానపేక్షయేతి శాస్త్రప్రవిభక్తాన్యపి కర్మాణి గుణప్రవిభక్తానీ త్యుచ్యంతే. 41

కాని పున స్తాని కర్మాణీ త్యుచ్యతే శమ ఇతి. శమో దమశ్చ యథా వ్యాఖ్యాతార్థౌ తపో యథోక్తం శారీరాది, శౌచం వ్యాఖ్యాతం, క్షాంతిః క్షమా, ఆర్జవ మృజుతైవ చ, జ్ఞానం విజ్ఞానం, ఆస్తిక్యం ఆస్తికభావః శ్రద్ధధానతా ఆగమార్థేషు, బ్రహ్మకర్మ బ్రాహ్మణజాతేః కర్మ స్వభావజమ్, యదుక్తం స్వభావప్రభవై ర్గుణైః ప్రవిభక్తానీతి తదేవోక్తం స్వభావజ మితి. 42

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్,
దాన మీశ్వరభావశ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్. 43

కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

---

టీ:- శౌర్యం - శూరస్వభావమును, తేజః - ప్రాగల్భ్యము, ధృతిః - ధైర్యము, యుద్ధేచ - యుద్ధమందుఁగూడ, అపలాయనం అపి - వెనుకకు మరలకుండుటయును, దానం - ద్రవ్యత్యాగము, ఈశ్వరభావః చ - ప్రభుమంతోత్సాహశక్తులును, స్వభావజం - స్వతస్సిద్ధమగు, క్షాత్రం - క్షత్త్రియసంబంధమగు, కర్మ-విహితమగు ధర్మము. 43

తా:- ఈగీతమునందు "యుద్ధేచాఽ ప్యపలాయనమ్" అను వాక్యము సాభిప్రాయముగా నర్జునునికొఱ కుపదేశింపఁబడినది. ఇయ్యది యర్జునునిమనంబున దృఢముగ నలముకొనిన పలాయనబుద్ధిని దొలగించు నభిప్రాయముతోఁ బలుకఁబడినట్లును, నర్జునుఁడు పలాయనమును బుద్ధియం దిడుకొని ప్రజ్ఞావాదములఁగొట్టి నట్లును శ్రీకృష్ణభగవానులు గ్రహించి రని యీ వాక్యమువలన స్పష్టమగుచున్నది. 43

టీ:-కృషిగౌరక్ష్యవాణిజ్యం - వ్యవసాయము చేయుట, గోవులను రక్షించుట, క్రియవిక్రయాది వ్యవహారముల నలుపుటయు, స్వభావజం - స్వభావసిద్ధమగు, వైశ్యకర్మ - వైశ్యుని యొక్కవృత్తి, పరిచర్యాత్మకం - సేవారూపమగు, కర్మ - కర్మము, శూద్రస్యఅపి - శూద్రునకుఁగూడ, స్వభావజం - స్వభావసిద్ధమైనది. 44

---

శౌర్య మితి. శౌర్యం శూరస్యభావః, తేజః ప్రాగల్భ్యం, ధృతి ర్ధారణం, సర్వావస్థా స్వనవసాదో భవతి యయా ధృత్యోత్తంభితస్య దాక్ష్యం దక్షస్య భావః సహసాప్రత్యుత్పన్నేషు కార్యే ష్వవ్యామోహేన ప్రవృత్తిః యుద్ధేచా ప్యపలాయన మపరాఙ్ముఖీభావః శత్రుభ్యః, దానం దేయేషు ముక్తహ స్తతా ఈశ్వరభావ శ్చేశ్వరస్య భావః ప్రభుశక్తిప్రకటీకరణ మీశితవ్యాన్ ప్రతి క్షాత్త్రం కర్మ క్షత్త్రియజాతే ర్విహితం కర్మ క్షాత్త్రం కర్మ స్వభావజమ్. 43

కృషీతి. కృషిగౌరక్ష్యవాణిజ్యం కృషిశ్చ, గౌరక్ష్యం చ వాణిజ్యం చ కృషిగౌరక్ష్యవాణిజ్యం కృషి ర్భూమే ర్విలేఖనం, గౌరక్ష్యం గా రక్షతీతి గోరక్ష స్తద్భావో గౌరక్ష్యం పాశుపాల్య మిత్యర్థః, వాణిజ్యం వణిక్కర్మ క్రియావిక్రయాదిలక్షణమ్ వైశ్యకర్మ వైశ్యజాతేః కర్మ వైశ్యకర్మ స్వభావజమ్ పరిచర్యాత్మకం శుశ్రూషాస్వభావం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్. 44

స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు. 45

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. 46

---

తా:—ఈ గీతమున అపిశబ్ద ప్రయోగముచేఁ బరిచర్యాత్మకమగు కర్మ వైశ్యులకుఁగూడ స్వభావసిద్ధ మని సూచింపఁబడుచున్నది. దానంజేసి వైశ్యులకుఁ గృషి గోరక్ష్య వాణిజ్యపరిచర్యలు స్వభావజములగు కర్మలని తెలియవచ్చెడిని. 44

టీ:—నరః - మానవుఁడు, స్వే స్వే - తనకు నియతమగు, కర్మణి - ఆయాయి కర్మయందు, నిరతః - తత్పరతగలవాఁడై, సిద్ధిం - చిత్తశుద్ధిని, లభతే-పొందును; స్వకర్మనిరతః - శాస్త్రముచేఁ దనకు నియమింపఁబడిన కర్మలయందుఁ దత్పరత్వము గలవాఁడు, యథా - ఏతీరున, సిద్ధిం - చిత్తశుద్ధిని, విందతి - పొందునో, తత్ - ఆయుపపత్తిని, శృణు - వినుము. 45

తా:—పైయయిదు గీతములచేతను చాతుర్వర్ణ్యమునకును శాస్త్రవిహితమగు కర్మవిశేషము సంక్షేపముగా నుదాహరించి యట్టి కర్మానుష్ఠానమువలనఁ జిత్తశుద్ధి పొడము నని చెప్పి యట్టి చిత్తశుద్ధి కల్గుటకు నుపపత్తినిగూడఁ జెప్పెద నని భగవానులు ప్రతిజ్ఞ చేయుచున్నారు. 45

టీ:—భూతానాం - సమస్త ప్రాణులకును, ప్రవృత్తిః-ఉత్పత్తిగాని వ్యాపారముగాని, యతః- ఏ యంతర్యామివలనఁ గల్గుచున్నదో, యేన-ఏ యంతర్యామిచే, ఇదం-

---

ఏతేషాం జాతివిహితానాం కర్మణాం సమ్యగనుష్ఠితానాం స్వర్గప్రాప్తిః ఫలం స్వభావతః, "వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తతః శేషేణ విశిష్టదేశజాతికులధర్మాయుశ్శ్రుతవృత్తవిత్తసుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే" (ఆప. 2-2-2-3) ఇత్యాదిస్మృతిభ్యః, పురాణే చ వర్ణినా మాశ్రమిణాం చ లోకఫలభేదవిశేషస్మరణాత్ కారణాంతరా త్త్విదం వక్ష్యమాణం ఫలమ్ - స్వే స్వే ఇతి. స్వే స్వే యథోక్తలక్షణభేదే కర్మణ్యభిరత స్తత్పర స్సంసిద్ధిం స్వకర్మానుష్ఠానా దశుద్ధిక్షయే సతి కాయేంద్రియాణాం జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణాం సంసిద్ధిం లభతే ప్రాప్నోతి నరోఽధికృతః పురుషః కిం స్వకర్మానుష్ఠానత ఏవ సాక్షా త్సంసిద్ధిః, న, కథం తర్హి స్వకర్మనిరతః సిద్ధిం యథా యేన ప్రకారేణ విందతి తచ్ఛృణు. 45

యత ఇతి. యతో యస్మాత్ ప్రవృత్తి రుత్పత్తి శ్చేష్టా వా యస్మా దంతర్యామిణ ఈశ్వరాత్ భూతానాం ప్రాణినాం స్యా ద్యేనేశ్వరేణ సర్వ మిదం జగ

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. 47

సహజం కర్మ కౌంతేయ! సదోష మపి న త్యజేత్,
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః. 48

---

ఈ పరిదృశ్యమానమగు, సర్వం - సమస్తమగు జగత్తును, తతం - వ్యాపింపఁబడినదో, తం - అట్టి యంతర్యామిని, స్వకర్మణా - తనకు విధింపఁబడిన కర్మచే, అభ్యర్చ్య - పూజించి, మానవః - మనుజుఁడు, సిద్ధిం - చిత్తశుద్ధిని, విందతి పొందును.

తా:— శాస్త్రముచేఁ బ్రతిమానవునకును శ్రుతిస్మృతులచే స్వవర్ణాశ్రమోచితముగ విధింపఁబడిన కర్మయే భగవదారాధనవిధానమని "స్వకర్మణా త మభ్యర్చ్య" యను వాక్యముచేఁ జెప్పబడుచున్నది. అట్టి నియతకర్మానుష్ఠానమును విడచి వేఱువేఱగు విధముల శాస్త్రవిధిని విడచి వర్తించుట భగవదారాధనముగా నేరదని తాత్పర్యము. 46

టీ:— స్వనుష్ఠితాత్ - లెస్సగా నాచరింపఁబడు, పరధర్మాత్ - తనవర్ణాశ్రమోచితధర్మముకంటె భిన్నమగు వర్ణాశ్రమధర్మానుష్ఠానముకంటె, విగుణః - దోషగ్రస్తమైనను, స్వధర్మః - స్వీయవర్ణాశ్రమధర్మము, శ్రేయాన్ - ప్రశస్యతరము. స్వభావనియతం - తనయొక్క స్వభావమున కుచితమగు, కర్మ - కర్మను, కుర్వన్ - చేయువాఁడు, కిల్బిషం - పాపమును, నాప్నోతి - పొందఁడు. 47

తా:— ఈ గీతము "శ్రేయాన్ స్వధర్మో విగుణః" (గీ.3-35) అను గీతముయొక్క యనువాదమే. 47

టీ:— కౌంతేయ! - అర్జునా! సహజం - పుట్టుకచే లభించిన, కర్మ - ధర్మము, సదోషం అపి - విగుణమైనప్పటికిని అనఁగాఁ దోషముతోఁగూడి యున్నట్లు

---

త్తతం వ్యాప్తం, స్వకర్మణా పూర్వోక్తేన ప్రతివర్ణం త మీశ్వర మభ్యర్చ్య పూజయిత్వాఽఽరాధ్య కేవలం జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణాం సిద్ధిం విందతి మానవో మనుష్యః. 46

యత ఏవ మతః శ్రేయా నితి. శ్రేయాన్ ప్రశస్యతరః స్వో ధర్మః స్వధర్మో, విగుణోఽపీ త్యపిశబ్దో ద్రష్టవ్యః, పరధర్మా త్స్వనుష్ఠితాత్ స్వభావనియతం స్వభావేన నియతం యదుక్తం స్వభావజ మితి తదేవోక్తం స్వభావనియత మితి, యథా విషజాతస్య కృమే ర్విషం న దోషకరం, తథా స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం పాపమ్. 47

స్వభావనియతం కర్మ కుర్వాణః విషజ ఇవ కృమిః కిల్బిషం నాప్నోతి త్యుక్తమ్ పరధర్మశ్చ భయావహ ఇతి అనాత్మజ్ఞశ్చ "న హి కశ్చిత్ క్షణ మ

తెలియఁబడుచున్నప్పటికి, నత్యజేత్ - విడువఁగూడదు. హి - ఏలననఁగా, అగ్నిః-పవిత్రిమగు నగ్నిహోత్రిము, ధూమేన ఇవ - పొగచేతనువలె, సర్వారంభాః-సకల ధర్మములును, దోషేణ-ఎద్దియేని విగుణముచే,ఆవృతాః-ఆవరింపబడియేయున్నవి.48

ప్యకర్మకృ త్తిష్ఠతి" (గీ. 3-5) ఇతి. అతః సహజ మితి. సహజం సహ జన్మనైవోత్పన్నం, కిం తత్? కర్మ, కౌంతేయ! సదోషమపి త్రిగుణాత్మకత్వా న్న త్యజేత్, సర్వారంభాః, ఆరభ్యన్త ఇత్యారంభాః సర్వకర్మాణీ త్యేతత్ ప్రకరణాత్ యే కేచి దారంభాః, స్వధర్మాః పరధర్మాశ్చ తే సర్వే హి యస్మాత్ త్రిగుణాత్మకత్వ మత్రి హేతుః త్రిగుణాత్మకత్వా ద్దోషేణ ధూమేన సహజేనాగ్ని రివావృతాః సహజస్య కర్మణః స్వధర్మాఖ్యస్య పరిత్యాగేన పరధర్మానుష్ఠానేఽపి దోషా న్నైవ ముచ్యతే భయావహ శ్చ పరధర్మః న చ శక్యతేఽశేష స్త్యక్తు మజ్ఞేన కర్మ యత స్తస్మా న్న త్యజే దిత్యర్థః.

కి మశేషత స్త్యక్తు మశక్యం కర్మేతి న త్యజేత్? కిం వా సహజస్య కర్మణస్త్యాగే దోషో భవతీతి? కిం చాతః? యది తావ దశేషత స్త్యక్తు మశక్య మితి న త్యాజ్యం సహజం కర్మ, ఏవం త ర్హ్యశేషత స్త్యాగే గుణఏవ స్యాదితి సిద్ధం భవతి సత్య మేవమ్; అశేషత స్త్యాగ ఏవ నోపపద్యత ఇతి చేత్ కిం నిత్య ప్రచలితాత్మకః పురుషో యథా సాంఖ్యానాం గుణాః? కిం వా క్రియైవ కారకం యథా బౌద్ధానాం స్కంధాః క్షణప్రధ్వంసినః? ఉభయథాపి కర్మణోఽశేషత స్త్యాగో న సంభవతి; అథ తృతీయోఽపి పక్షః యదా కరోతి తదా సక్రియం వస్తు యదా న కరోతి తదా నిష్క్రియం వస్తు తదేవ; తత్రైవంసతి శక్యం కర్మాఽశేషత స్త్యక్తుమ్ అయం త్వస్మిం స్తృతీయే పక్షే విశేషః న నిత్య ప్రచలితం వస్తు నాపి క్రియైవ కారకమ్ కిం తర్హి వ్యవస్థితే ద్రవ్యేఽవిద్యమానా క్రియోత్పద్యతే విద్యమానా చ వినశ్యతి శుద్ధం తద్ద్రవ్యం శక్తిమ దవతిష్ఠత ఇత్యేవ మాహుః కాణాదా స్తదేవ చ కారక మితి అస్మిన్ పక్షే కో దోష ఇతి; అయ మేవతు దోషః - యత స్త్వభాగవతం మత మిదమ్ కథం జ్ఞాయతే? యత ఆహ భగవాన్ "నాసతో విద్యతే భావో" (గీ. 2-16) ఇత్యాది కాణాదానాం హ్యసతో భావః సత శ్చాభావ ఇతీదం మత మభాగవతమ్ అభాగవత త్వేపి న్యాయవ చ్చే త్కో దోష ఇతిచే దుచ్యతే. దోషవ త్త్వేదం సర్వప్రమాణవిరోధాత్, కథం? యది తావత్ ద్వ్యణుకాది ద్రవ్యం ప్రాగుత్ప త్తే రత్యంతమేవాసత్ ఉత్పన్నంచ స్థితం కంచి త్కాలం పున రత్యంతమే వాసత్త్వ మాపద్యతే, తథా చ స త్యసదేవ స జ్జాయతే సదేవాఽసత్త్వ మాపద్యతే అభావో భావో భవతి భావ శ్చాభావో భవతి తత్రాభావో జాయమానః ప్రాగుత్పత్తేః శశవిషాణకల్పః సమవాయ్యసమ

తా:–సకలధర్మములు ననఁగా స్వధర్మములుగాని పరధర్మములు గాని ప్రకృతియొక్క గుణములగు సత్త్వరజస్తమఃకార్యములే యగుటచే దోషరహితము

వాయినిమిత్తాఖ్యం కారణ మపేక్ష్య జాయత ఇతి, న చైవ మభావ ఉత్పద్యతే కారణం చాపేక్షత ఇతి శక్యం వక్తుమ్, అసతాం శశవిషాణాదీనా మదర్శనాత్ భావాత్మకాశ్చ ఘటాదయ ఉత్పద్యమానాః కించి దభివ్యక్తిమాత్రే కారణ మపేక్ష్యోత్పద్యన్త ఇతి శక్యం ప్రతిపత్తుమ్; కిం చాసతశ్చ సద్భావే సత శ్చాసద్భావే న క్వచి త్ప్రమాణప్రమేయవ్యవహారేషు విశ్వాసః కస్యచి త్స్యాత్, స త్సదే వాసదసదేవేతి నిశ్చయానుపపత్తేః.

కిం చోత్పద్యత ఇతి. ద్వ్యణుకాదే ర్ద్రవ్యస్య స్వకారణసత్తా సంబంధ మాహుః ప్రాగుత్పత్తే శ్చాసత్, పశ్చా త్కారణవ్యాపార మపేక్ష్య స్వకారణైః పరమాణుభిః సత్తయా చ సమవాయలక్షణేన సంబంధేన సంబధ్యతే సంబద్ధం సత్ కారణసమవేతం సత్ భవతి, తత్ర వక్తవ్యం కథ మసతః స్వం కారణం భవే త్సంబంధో వా కేనచిత్ స్యాత్ న హి వంధ్యాపుత్రస్య స్వం కారణం సంబంధో వా కేనచి త్ప్రమాణతః కల్పయితుం శక్యతే.

నను నైవం వైశేషికై రభావస్య సంబంధః కల్ప్యతే ద్వ్యణుకాదీనాం హి ద్రవ్యాణాం స్వకారణేన సమవాయలక్షణః సంబంధః సతామే వోచ్యత ఇతి న, సంబంధా త్ప్రాక్ సత్త్వానభ్యుపగమాత్; న హి వైశేషికైః కులాలదండచక్రాది వ్యాపారా త్ప్రాక్ ఘటాదీనా మస్తిత్వ మిష్యతే, న చ మృద ఏవ ఘటాద్యాకారప్రాప్తి మిచ్ఛన్తి; తత శ్చాసత ఏవ సంబంధః పారిశేష్యా దిష్టో భవతి.

నన్వసతోఽపి సమవాయలక్షణ స్సంబంధో న విరుద్ధః, న, వంధ్యాపుత్రాదీనా మదర్శనాత్ ఘటాదేరేవ ప్రాగభావస్య స్వకారణసంబంధో భవతి, న వంధ్యాపుత్రాదేః; అభావస్యతుల్యత్వేఽపి విశేషోఽభావస్య వక్తవ్యః ఏకస్యాభావో ద్వయోరభావః సర్వస్యాభావః ప్రాగభావః ప్రధ్వంసాభావ ఇతరేతరాభావోఽత్యంతాభావ ఇతి లక్షణతో న కేనచి ద్విశేషో దర్శయితుం శక్యః; అసతి చ విశేషే ఘటస్య ప్రాగభావ ఏవ కులాలాదిభి ర్ఘటభావ మాపద్యతే సంబధ్యతే చ భావేన కపాలాఖ్యేన, సంబద్ధ శ్చ సర్వవ్యవహారయోగ్య శ్చ భవతి, న తు ఘటస్యైవ ప్రధ్వంసాభావోఽభావత్వే సత్యపీతి ప్రధ్వంసాద్యభావానాం న క్వచి ద్వ్యవహారయోగ్యత్వం ప్రాగభావస్యైవ ద్వ్యణుకాది ద్రవ్యాఖ్య స్యోత్పత్త్యాదివ్యవహారార్హత్వమిత్యేతత్ సమంజసం మభావత్వావిశేషా దత్యంతప్రధ్వంసాభావయోరివ.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాఽధిగచ్ఛతి.  49

---

లగుటకు నెంతమాత్ర మవకాశము లేదు. అనగాఁ బ్రతిధర్మము నెద్దియో యొక విగుణముతోఁ గూడుకొనియే యుండు నని తాత్పర్యము.  48

టీ:— సర్వత్ర - ఆసక్తికి హేతుభూతము లగు దారపుత్త్రాదిసకలవిషయము లందును, అసక్తబుద్ధిః - సంగరహితమగు నంతఃకరణము గలిగినట్టియు, జితాత్మా - అంతఃకరణమును బుష్కలముగా స్వాధీనముచేసికొన్నట్టియు, విగతస్పృహః - సక్చందన వనితాదులయందు స్పృహ నశించినట్టియు పురుషుఁడు, పరమాం -

---

నను నైవాస్మాభిః ప్రాగభావస్య భావాపత్తి రుచ్యతే భావస్యైవ హి తర్హి భావాపత్తిః యథా ఘటస్య ఘటాపత్తిః పటస్య వా పటాపత్తిః ఏతద ప్యభావస్య భావాపత్తివదేవ ప్రమాణవిరుద్ధమ్ సాంఖ్యస్యాపి యః పరిణామపక్షః సోఽప్యపూర్వధర్మోత్పత్తివినాశాంగీకరణా ద్వైశేషికపక్షా న్న విశిష్యతే, అభివ్యక్తితిరోభావాంగీకరణేఽప్యభివ్యక్తితిరోభావయో ర్విద్యమానత్వావిద్యమానత్వ నిరూపణే పూర్వవదేవ ప్రమాణవిరోధః; ఏతేన కారణస్యైవ సంస్థాన ముత్పత్త్యాదీ త్యేతదపి ప్రత్యుక్తమ్.

పారిశేష్యా త్స దేకమేనవ స్త్వవిద్యోత్పత్తివినాశాదిధర్మై ర్నటవ దనేకధా వికల్ప్యత ఇతి ఇదం భాగవతం మత ముక్తం "నాఽసతో విద్యతే భావః" (గీ. 2-16) ఇత్యస్మిన్ శ్లోకే సత్ప్రత్యయస్యా ఽవ్యభిచారాత్ వ్యభిచారా చ్చేతరేషా మితి.

కథం తర్హ్యాత్మనో ఽవిక్రియత్వేఽశేషతః కర్మణ స్త్యాగో నోపపద్యత ఇతి, యది వస్తుభూతా గుణా, యదివాఽవిద్యాకల్పితా స్తద్ధర్మః కర్మ, తదాఽఽత్మ న్యవిద్యాధ్యారోపిత మేవే త్యవిద్వాన్ నహి "కశ్చిత్ క్షణమ ప్యశేషత స్త్యక్తుం శక్నోతి" (గీ 3-5) ఇత్యుక్తమ్, విద్వాం స్తు పున ర్విద్యయాఽవిద్యాయాం నివృత్తాయాం శక్నో త్యే వాఽశేషతః కర్మ పరిత్యక్తు మవిద్యాధ్యారోపితస్య శేషానుపపత్తేః; న హి తైమిరికదృష్ట్యాఽధ్యారోపితస్య ద్విచంద్రాదే స్తిమిరాపగమే శేషోఽవతిష్ఠతే; ఏవంచస తీదం వచన ముపపన్నం "సర్వకర్మాణి మనసా" (గీ. 5-13) ఇత్యాది, "స్వే స్వే కర్మ ణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః" (గీ. 18-45) "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" (గీ. 18-46)ఇతి చ.  48

యా చ కర్మజా సిద్ధి రుక్తా జ్ఞాననిష్ఠా యోగ్యతాలక్షణా తస్యాః ఫలభూతా నైష్కర్మ్యసిద్ధి ర్జ్ఞాననిష్ఠాలక్షణా చ వక్తవ్యేతి శ్లోక ఆరభ్యతే అసక్త

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽప్నోతి నిబోధ మే,
సమాసేనైవ కౌంతేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా. 50

---

ఉత్కృష్టపురుషార్థమగు, నైష్కర్మ్యసిద్ధిం - సర్వక్రియా నివృత్తి రూపమగు మోక్షము యొక్క సిద్ధిని, సంన్యాసేన - సర్వకర్మ సంన్యాసపురస్సరం బగు నాత్మ జ్ఞానముచే, అధిగచ్ఛతి - పొందును. 49

తా:–ఈ గీతము "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురే దేహే" (గీ.5-13) అనుగీతముయొక్క వివరణరూపమే. 49

టీ:–సిద్ధిం - స్వోచిత కర్మానుష్ఠానముచే నీశ్వరునిఁ బూజించి యాతని యనుగ్రహముచేఁ గల్గుజ్ఞాన నిష్ఠాయోగ్యతా రూపమగు సిద్ధిని, ప్రాప్తః - పొందిన వాఁడు యథా - ఏమార్గముచే, బ్రహ్మ - పరమాత్మను, ఆప్నోతి - పొందునో, తథా - ఆమార్గమును జ్ఞానస్య - బ్రహ్మజ్ఞానముయొక్క, పరా - ఉత్కృష్టమగు,

---

బుద్ధి రితి. అసక్తబుద్ధి రసక్తా సంగరహితా బుద్ధి రంతఃకరణం యస్య సోఽసక్తబుద్ధిః; సర్వత్ర పుత్రదారాది ష్వాసక్తినిమిత్తేషు జితాత్మా జితో వశీకృత ఆత్మా అంతఃకరణం యస్య స జితాత్మా; విగతస్పృహో విగతా స్పృహా తృష్ణా దేహజీవితభోగేషు యస్మా త్సవిగతస్పృహః య ఏవంభూత ఆత్మజ్ఞః స నైష్కర్మ్యసిద్ధిం నిర్గతాని కర్మాణి యస్మా న్నిష్క్రియబ్రహ్మాత్మసంబోధా త్స నిష్కర్మా, తస్య భావో నైష్కర్మ్యం, నైష్కర్మ్యం చ తత్సిద్ధిశ్చ సా నైష్కర్మ్యసిద్ధిః నైష్కర్మ్యస్య వా నిష్క్రియాత్మరూపావస్థానలక్షణస్య సిద్ధిః నిష్పత్తిః, తాం నైష్కర్మ్యసిద్ధిం పరమాం ప్రకృష్టాం కర్మజసిద్ధివిలక్షణాం సద్యోముక్త్యవస్థానరూపాం సంన్యాసేన సమ్యగ్దర్శనేన తత్పూర్వకేణ వా సర్వకర్మసంన్యాసేన, అధిగచ్ఛతి ప్రాప్నోతి తథాచోక్తం "సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవ కుర్వ న్న కారయ న్నాస్తే" (గీ. 5-13) ఇతి. 49

పూర్వోక్తేన స్వకర్మానుష్ఠానేనేశ్వరాభ్యర్చన రూపేణ జనితాం ప్రాగుక్త లక్షణాం సిద్ధిం ప్రాప్త స్యోత్పన్నాత్మవివేకజ్ఞానస్య కేవలాత్మజ్ఞాననిష్ఠారూపా నైష్కర్మ్యలక్షణా సిద్ధి ర్యేన క్రమేణ భవతి తద్వక్తవ్య మిత్యాహ సిద్ధి మితి. సిద్ధిం ప్రాప్తః స్వకర్మణేశ్వరం సమభ్యర్చ్య తత్ప్రసాదజాం కాయేంద్రియాణాం జ్ఞాననిష్ఠాయోగ్యతాలక్షణాం సిద్ధింప్రాప్తః సిద్ధింప్రాప్త ఇతి తదనువాద ఉత్తరార్థః, కిం తదుత్తరం యదర్థోఽనువాద ఇత్యుచ్యతే యథా యేన ప్రకారేణ జ్ఞాననిష్ఠారూపేణ బ్రహ్మ పరమాత్మాన మాప్నోతి తథా తం ప్రకారం జ్ఞాననిష్ఠాప్రాప్తిక్రమం మే మమ వచనా న్నిబోధ త్వం నిశ్చయేనావధారయ త్యేతత్ కిం విస్తరేణ?

నిష్ఠా - పరిసమాప్తి, యా - ఏదియో, అద్దానిని, సమాసేన ఏవ - సంక్షేపముగా, మే - నావలన, నిబోధ - తెలిసికొనుమా!  50

నేత్యాహ. సమాసేనైవ సంక్షేపేణైవ హే కౌంతేయ! యథా బ్రహ్మ ప్రాప్నోతి తథా నిబోధేతి. అనేన యా ప్రతిజ్ఞాతా బ్రహ్మప్రాప్తి స్తా మిదంతయా దర్శయితు మాహ - నిష్ఠా జ్ఞానస్య యా పరేతి. నిష్ఠా పర్యవసానం పరిసమాప్తి రిత్యేతత్, కస్య? బ్రహ్మజ్ఞానస్య యా పరా, కీదృశీ సా యాదృశ మాత్మజ్ఞానం కీదృ క్తత్ యాదృశ ఆత్మా కీదృశో౽సౌ యాదృశో భగవతో క్త ఉపనిషద్వాక్యైశ్చ న్యాయతశ్చ.

ననువిషయాకారం జ్ఞానం న విషయో నాప్యాకారవా నాత్మేష్యతే క్వచిత్ న న్వాదిత్యవర్ణం భారూపః స్వయంజ్యోతి రిత్యాకారవత్త్వ మాత్మనః శ్రూయతే, న, తమోరూపత్వప్రతిషేధార్థత్వా త్తేషాం వాక్యానామ్, ద్రవ్య గుణాద్యాకార ప్రతిషేధే ఆత్మన స్తమోరూపత్వే ప్రాప్తే తత్ప్రతిషేధార్థాని "ఆదిత్యవర్ణం" (శ్వే. 3-8.) ఇత్యాదివాక్యాని "అరూపం (కఠ. 3-15.) ఇతి చ విశేషతో రూపప్రతిషేధాత్ అవిషయత్వాచ్చ "న సంధృశే తిష్ఠతి రూప మస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం" (శ్వే. 4-20.) "అశబ్ద మస్పర్శం" (కఠ. 3-15.) ఇత్యాద్యైః తస్మా దాత్మాకారం జ్ఞాన మిత్యనుపపన్నమ్.

కథం తర్హ్యాత్మనో జ్ఞానమ్ సర్వం హి యద్విషయం యత్ జ్ఞానం త త్తదాకారం భవతి నిరాకార శ్చాత్మే త్యుక్తమ్ జ్ఞానాత్మనో శ్చోభయో ర్నిరాకారత్వే కథం తద్భావనా నిష్ఠేతి, న, అత్యంతనిర్మలత్వాతిస్వచ్ఛత్వాతిసూక్ష్మత్వోపపత్తే రాత్మనః బుద్ధే శ్చాత్మసమనైర్మల్యాద్యుపపత్తే రాత్మచైతన్యాకారాభాసత్వోపపత్తిః బుద్ధ్యాభాసం మనః తదాభాసా నీంద్రియాణి, ఇంద్రియాభాసశ్చ దేహః అతో లౌకికై ర్దేహమాత్రేఽపి వాత్మదృష్టిః క్రియతే.

దేహచైతన్యవాదిన శ్చ లోకాయతికాః "చైతన్యవిశిష్టః కాయః పురుషః" ఇత్యాహుః తథా౽న్యే ఇంద్రియచైతన్యవాదినః, అన్యే మనశ్చైతన్యవాదినః, అన్యే బుద్ధిచైతన్యవాదినః తతో౽ప్యాంతర మవ్యక్త మవ్యాకృతాఖ్య మవిద్యావస్థ మాత్మత్వేన ప్రతిపన్నాః కేచిత్, సర్వత్ర హి బుద్ధ్యాదిదేహాంత ఆత్మచైతన్యాభాసతా ఆత్మభ్రాంతికారణ మిత్యత శ్చాత్మవిషయం జ్ఞానం నవిధాతవ్యమ్ కిం తర్హి నామరూపాద్యనాత్మాధ్యారోపణనివృత్తి రేవ కార్యా, నాత్మచైతన్య

తా:—స్వోచితనిత్యకర్మానుష్ఠానముచే జిత్తశుద్ధి నొందినవాఁడు సర్వకర్మసంన్యాసమును గావించిన పిదప నెట్టి జ్ఞాననిష్ఠ ననుసరింప వలయునో యద్దాని పరిపాకస్థితియు రాఁబోవు గీతములచే వివరింపఁ బడుచున్నది. 50

విజ్ఞానం కార్యం, అవిద్యాధ్యారోపితసర్వపదార్థాకారై రవిశిష్టతయా దృశ్యమానత్వా దితి, అత ఏవ హి విజ్ఞానవాదినో బౌద్ధా విజ్ఞానవ్యతిరేకేణ వస్త్వేవ నాస్తీతి ప్రతిపన్నాః, ప్రమాణాంతరనిరపేక్షతాం చ స్వసంవిదితత్వాభ్యుపగమేన తస్మా దవిద్యాధ్యారోపితనిరాకరణమాత్రం బ్రహ్మణి కర్తవ్యం, న తు బ్రహ్మవిజ్ఞానే యత్నో ఽత్యంతప్రసిద్ధత్వాత్ అవిద్యాకల్పితనామరూపవిశేషాకారాపహృతబుద్ధీనా మత్యంతప్రసిద్ధం సువిజ్ఞేయ మాసన్నతర మాత్మభూత మప్యప్రసిద్ధం దుర్విజ్ఞేయ మతిదూర మన్యదివ చ ప్రతిభా త్యవివేకినామ్, బాహ్యాకారనివృత్తబుద్ధీనాం తు లబ్ధగుర్వాత్మప్రసాదానాం నాఽతః పరం సుఖం సుప్రసిద్ధం సువిజ్ఞేయం స్వాసన్నతర మస్తి తథా చోక్తం "ప్రత్యక్షావగమం ధర్మ్యం" (గీ. 9-2) ఇత్యాది.

కేచిత్తు పండితంమన్యాః నిరాకారత్వా దాత్మవస్తు నోపైతి బుద్ధి రతో దుస్సాధ్యా సమ్యగ్ జ్ఞాననిష్ఠే త్యాహుః, సత్యం, ఏవం గురుసంప్రదాయరహితానా మశ్రుతవేదాంతానా మత్యంతబహిర్విషయాసక్తబుద్ధీనాం సమ్యక్ప్రమాణే ష్వకృతశ్రమాణాం, తద్విపరీతానాం తు లౌకికగ్రాహ్యగ్రాహకద్వైతవస్తుని సద్బుద్ధిర్నితరాం దుస్సంపాదాఽఽత్మచైతన్యవ్యతిరేకేణ వస్త్వంతరస్యానుపలబ్ధేః, యథా చ "ఏతదేవ మేవ నాన్యథా" ఇత్యవోచామ ఉక్తం చ భగవతా "యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః" (గీ. 2-69) ఇతి తస్మా ద్బాహ్యాకారభేదబుద్ధినివృత్తిరే వాత్మస్వరూపావలంబనకారణమ్, న హ్యాత్మా నామ కస్యచిత్కదాచి దప్రసిద్ధః ప్రాప్యో హేయ ఉపాదేయో వా, అప్రసిద్ధే హి తస్మి న్నాత్మని స్వార్థా స్సర్వాః ప్రవృత్తయో వ్యర్థాః ప్రసజ్యేరన్ న చ దేహాద్యచేతనార్థత్వం శక్యం కల్పయితుమ్ న చ సుఖార్థం సుఖం, దుఃఖార్థం వా దుఃఖమ్ ఆత్మావగత్యవసానార్థత్వాచ్చ సర్వవ్యవహారస్య తస్మా ద్యథా స్వదేహస్య పరిచ్ఛేదాయ న ప్రమాణా న్తరాపేక్షా, తతో ఽప్యాత్మనో ఽంతరతమత్వా త్తదవగతిం ప్రతి న ప్రమాణా న్తరాపేక్షే త్యాత్మజ్ఞాననిష్ఠా వివేకినాం సుప్రసిద్ధేతి సిద్ధమ్.

యేషామపి నిరాకారం జ్ఞాన మప్రత్యక్షం తేషామపి జ్ఞానవశైవ జ్ఞేయావగతి రితి జ్ఞాన మత్యంతం ప్రసిద్ధం సుఖాదివదే వాభ్యుపగంతవ్యమ్, జిజ్ఞాసా

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ,
శబ్దాదీన్ విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. 51
వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. 52

---

టీ:—విశుద్ధయా - మాయారహితమగు, బుద్ధ్యా - నిశ్చయ జ్ఞానముతో, యుక్తః - కూడుకొన్నట్టియు, ఆత్మానం - తన కార్యకరణ సంఘాతమును, ధృత్యా - ధైర్యముచే, నియమ్యచ - నిగ్రహించి, శబ్దాదీన్ - శబ్దము మొదలుగాఁ గల్గిన, విషయాన్ - విషయములను, త్యక్త్వా - విడిచి, రాగద్వేషౌ - హర్ష విషాదములను వ్యుదస్యచ - తోసిపుచ్చి, నిత్యం - ఎల్లప్పుడును, వైరాగ్యం - దృష్టాదృష్ట విషయములందు హేయభావమును, సముపాశ్రితః - లెస్సగాఁ బొందినట్టియు, వివిక్తసేవీ - విజనప్రదేశము నాశ్రయించినట్టియు, లఘ్వాశీ - అల్పాహారమును సేవించునట్టియు, యతవాక్కాయమానసః - వాక్కాయ మనోరూపములగు త్రికరణములను నియమించినట్టియు, ధ్యానయోగ పరః - ధ్యాననిష్ఠా తత్పరుఁడు,

---

నుపపత్తేశ్చ అప్రసిద్ధం చేత్ జ్ఞానం జ్ఞేయవ జ్జిజ్ఞాస్యేత యథా జ్ఞేయం ఘటాది లక్షణం జ్ఞానేన జ్ఞాతా వ్యాప్తు మిచ్ఛతి తథా జ్ఞాన మపి జ్ఞానాంతరేణ జ్ఞాతవ్య మాప్తు మిచ్ఛేత్, న చైత దస్తి అతోఽత్యంతప్రసిద్ధం జ్ఞానం జ్ఞాతాఽప్యత ఏవ ప్రసిద్ధ ఇతి తస్మాత్ జ్ఞానే యత్నో న కర్తవ్యః, కిం త్వనాత్మ న్యాత్మబుద్ధి నివృత్తావేవ తస్మాత్ జ్ఞాననిష్ఠా సుసంపాద్యా. 50

సేయం జ్ఞానస్య పరా నిష్ఠోచ్యతే కథం కార్యేతి - బుద్ధ్యేతి. బుద్ధ్యాఽధ్యవసాయాత్మికయా విశుద్ధయా మాయారహితయా యుక్తః సంపన్నో, ధృత్యా ధైర్యేణాఽఽత్మానం కార్యకరణసంఘాతం నియమ్య చ నియమనంకృత్వా వశీకృత్య శబ్దాదీన్ శబ్ద ఆది ర్యేషాం తే శబ్దాదయ స్తా న్విషయాం స్త్యక్త్వా సామర్థ్యా చ్ఛరీరస్థితిమాత్రహేతుభూతాన్ కేవలా న్ముక్త్వా తతోఽధికా న్సుఖార్థాం స్త్యక్త్వేత్యర్థః శరీరస్థిత్యర్థత్వేన ప్రాప్తేషు రాగద్వేషౌ వ్యుదస్య చ పరిత్యజ్యచ. 51

తతః - వివిక్తేతి. వివిక్తసేవీ అరణ్యనదీపులినగిరిగుహాదీ న్వివిక్తాన్ దేశాన్ సేవితుం శీల మస్యేతి వివిక్తసేవీ లఘ్వాశీ లఘ్వశనశీలః, వివిక్తసేవాలఘ్వశనయో ర్నిద్రాదిదోషనివర్తకత్వేన చిత్తప్రసాదహేతుత్వా ద్గ్రహణం యతవాక్కాయమానసో వాక్చ కాయశ్చ మానసం చ యతాని సంయతాని యస్య జ్ఞాననిష్ఠస్య స జ్ఞాననిష్ఠో యతి ర్యతవాక్కాయమానసః స్యాత్ ఏవ ముపరతసర్వకరణ స్సన్ ధ్యానయోగపరో, ధ్యానం ఆత్మస్వరూపచింతనం, యోగ ఆత్మవిషయ

